నవలా రచనలో అద్వితీయు లని పేరు పెంపులు గడించిన శ్రీ కోట శివరామ కారంత్‌గారి బృహద్రచన యీ నవల. ఇది ఒకే తరం కథ కాదు; మూడు తరాల కథ. 1850 ప్రాంతంలో ప్రారంభ మయ్యే యీ కథ 1940 లో పూర్తి అవుతుంది. ఆయన స్వగ్రామం బడుగు తనపు బ్రతుకే కథా వస్తువు. కనుక నవలలోని పాత్రలు సజీవంగా కనిపించడంలో వింత లేదు. మానవహృదయం ఎలా స్పందిస్తుందో ఆ విషయపరిజ్ఞానం, నిస్సంగత్వం—ఈ రెండే యీ నవల ముఖ్యలక్షణాలు.

ప్రసిద్ధరచయిత లైన శ్రీ తిరుమల రామచంద్ర గారు కన్నడం నుంచే తెలుగు చేసిన యీ నవల పాఠకలోకాన్ని అలరించగలదని ఆశిస్తున్నాము.

వెల : రూ. **15.**



మరళి సేద్యానికి





# మరళి సేద్యానికి

శివరామ కారంత్

# మరల సేద్యానికి

(కన్నడ నవల)

మూలం :

శివరామ కారంత్

అనువాదం :

తిరుమల రామచంద్ర



సాహిత్య అకాదెమి

న్యూఢిల్లీ

MARALA SEDYANIKI—Telugu translation by T. Ramachandra of Sivarama Karanth's Kannada novel entitled *MARALI MANNIGE.* Sahitya Akademi, New Delhi, 1977. Price Rs. 15.


First Edition — 1977.

*Available at :—*

SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1

*Regional Offices :*
MADRAS-6, CALCUTTA-29 & BOMBAY-14



ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
మద్రాసు-21





వెల : రూ. **15.**

# మొదటి మాట

ఈ వవల వ్రాయడంలో కొంచెం పెద్ద సాహసం చేశాను. నేను ముందు వ్రాసినవి ఇంత పెద్దవి కావు. కారణం ఇదికూడ-ఇది ఒకేతరం కథ కాదు; మూడుతరాల కథ. 1850 ప్రాంతంలో ప్రారంభమయ్యే ఈ కథ 1940 లో ముగుస్తుంది. నా ఊరి బదుగుతనపుబ్రతుకే కథావస్తువు. ఈ బ్రతుకుప్రశ్న ఈ మూడుతరాలలోను ఎలా ప్రత్యుత్తరం పొందుతుంది - అనేదే దీనిలో చిత్రితమైంది.

ప్రాంతం, పేరు, నుడికారం - ఇవన్నీ నా పుట్టినఊరు చుట్టుపట్లనుంచే ఏరుకొన్నాను. శైలికూడ వారిజీవితంలోని వాడుకరీతిని అనుసరించింది. అందువలన నూరారుపదాలకు పుస్తకంతోపాటు ఇచ్చిన పదాలపట్టికలో అర్థం చూడవలసి వస్తుంది. వాడుకమాటను తోసివేసి, కొత్తమాటను తురుకరాదనుకొనడంవల్ల ఇట్లా చేశాను.

ఈ పుస్తకాన్ని ద్వితీయముద్రణకు వచ్చేట్లు చేసిన చదువరులకు నా వందనాలు.

శివరామ కారంత్.

# పీఠిక

శ్రీ కోట శివరామ కారంత్‌గారు ప్రస్తుతం (తొలిపలుకు వ్రాసిననాడు) షష్టి పూర్తి చేసుకున్నారు. వారు లేత్రాయమునాటినుండి నిరంతరము సంఘసేవ, సాహిత్యసేవలలోనే పాటుపడుతున్నారు. ఈ శతాబ్దపు కన్నడ రచయితలందరిలోను సర్వతోముఖ ప్రజ్ఞగలవారు వీరే అనవచ్చును. 'బహుముఖప్రజ్ఞ' అంటే ఉపచార వాక్యంగా చెప్పిన అత్యుక్తి అని అంతరార్థం కాదు. వారికి విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసంచేసే అనుకూలంగాని, దానివలన లభించే లోపాలుగాని హస్తగతం కాలేదు. నాకు తెలియవచ్చినది సరియైనదే అయితే, వారే ఆ సదుపాయాన్ని బుద్ధి పూర్వకంగా తిరస్కరించారు. వారెంతో చదువుకున్నవారే. కాని వారి రచనలో ప్రాచీనసాహిత్యాన్ని చాల అరుదుగా ఉట్టంకించినట్లు తెలుస్తున్నది. వారు దృఢంగా ఆమోదించిందేమంటే పుస్తకాలు జీవితానికి ప్రత్యామ్నాయాలని. రక్తమాంసాలు లేని మారురూపాలని.

జీవితంలో వారి అనుభూతి చాల విశాలంగాను, లోతుగాను వ్యాపించింది. వారు హృదయపూర్వకంగా, ఉత్సాహంగా ప్రతి రాజకీయ సాంఘిక ఉద్యమాలలో దూకారు. కానీ వాటినన్నింటిని తమ అనుభవాన్ని పురస్కరించుకొని సాక్షి దృక్పథంతో చూడగలిగారు. వారు కర్ణాటకప్రాంతమంతా అపిబిసంచి భుజానవేసికొని, చేతిలో దుడ్డుకర్ర పుచ్చుకొని ఒక యాత్రికునిమల్లే పదయాత్ర చేశారు. పడమటి కనుమల గిరిజనులను బాగా పరిశీలించి, వారినిగురించి సానుభూతి, సదవగాహనలతో వ్రాశారు. 'యక్షగానం' బిడారులవెంట, దయచూపే ప్రేక్షకునిలాగా కాకుండా వారి బృందాలలో భాగస్వామిగా, ఒకరుగా ఉండిపోయారు. వారు భారతదేశం నలుమూలలూ ప్రయాణంచేసి స్వయంగా వాస్తుశాస్త్ర, శిల్పశాస్త్ర, పురాతత్త్వ జ్ఞానాన్ని బాగా గడించారు. కొన్ని సంవత్సరాలక్రితమే ఐరోపాఖండమంతా సంచారంచేసి తమ అనుభవాలను ఒక యాత్రాగ్రంథంలో పొందుపరిచారు. 1957 సాధారణఎన్నికలలో పోటీచేశారు; ఎవరో వారికి 'రాజకీయాలు తగనిపని' అని అంటే, వారు 'రాజకీయాలు అందరి కర్తవ్యమే; దేశంలో సుపరిపాలన ఉండేట్టు అందరూ చూడాల్సిందే' అని సమాధానం చెప్పారు. 'రాజకీయాలను ఉపేక్షిస్తే మన బాధ్యతను తప్పించుక తిరిగినట్లే' అని అన్నారు.

'కారంత్' తప్పించుకతిరిగేవారు అసలే కారు. తీవ్రమైనవిరోధాన్ని ఎదుర్కోవాల్సిన సందర్భాలలో సులభంగా ఉదాసీనంగా చూపి వూరుకుంటే సరిపొయ్యేదిగానీ, విరోధులకు సేరుకు సవాశేరు చెల్లించి నోరు మూయించారు. వారి గుణగణాలలో వ్యతిరేకశక్తు లేవీ లేవు. వారు యుద్ధవైఖరినీ అవలంబించాల్సివస్తే ఆదరాభిమానాలనుగానీ వ్యక్తిగతమైన సంబంధాలనుగానీ తాము సత్యమని విశ్వసించినవాటికి అడ్డు తగలనివ్వరు, ఇలాంటప్పుడే వారు 'వజ్రాదపి కఠోరాణి' అన్నట్లు కొరకరాని కొయ్య అనే అభిప్రాయాన్ని కలిగిస్తారు. ఆ తగాదా సాంఘికంగాగానీ, నైతికంగాగానీ ప్రయోజనకరంగా అర్థవంతంగా వుంటేనే అలా ప్రవర్తిస్తారు.

నడిప్రాయంలోనే (తొలిరోజులలోనే) వారు ఏదో దంతపుగోపురం (ఒంటిస్తంభం మేడ) కట్టుకుంటున్నట్లు తోచింది. తమ స్వగ్రామం పుత్తూరుకు దాదాపు ఒకమైలు ఆవల కొండపైన ఇల్లు కట్టుకున్నారు. ఏ కోవకూ, విధానానికి లోబడని పద్ధతిలో 'బాలభవనాన్ని' అందులో నడిపారు. దానిచుట్టూరూ ఒక ఉద్యానం; దానిలో అడవిమృగాలను పెంచారు. పిల్లలు తొలుతనే ఆ ప్రాంతం వృక్షజాలాన్ని జంతుజాలాన్ని నేరుగాచూచి తాకి జ్ఞానం సంపాదించాలని వారి అభిలాష. చిరుతపులి కథను వారు చెబుతుంటే చిరుతపులికూడ తన కథను వింటుండేది. దక్షిణ కన్నడజిల్లా భూగోళశాస్త్రాన్ని తమ బాలురకొరకు రచించారు. నా అనుభవంలో దానికంటే మంచిపుస్తకం ఏదీ చూచివుండలేదు. 'కారంత్' అంటే ఏదో సృష్టిస్తూంటారనే కానీ, సృష్టించే రచయితకీ అంతకంటే తక్కువ ప్రయోజకుడు కాని సాధారణంగా ఓపికతో పనిచేసే శ్రామికునికీ మధ్య ఏమాత్రం గొప్ప తేడానుగాని, విశేషాన్నిగాని ఆయన చూడరు. తమ చుట్టూరూ ఉన్న అవసరమైన ఏ పనినైనా వారు చేస్తారు. అదే దృష్టితోనే బొమ్మల అచ్చులు తయారుచేసేది నేర్చుకొని, ఒక నిఘంటువును. బాలవిజ్ఞానసర్వస్వాన్ని, మరొక విజ్ఞానసర్వస్వాన్ని అచ్చువేశారు; వేయించారు.

సాహిత్యంలో వచ్చే ఎన్నో పోకడలను గమనిస్తున్నా. వారు ఏమాత్రం ఒడుదొడుకులకు లోనుగాలేదంటే ఆశ్చర్యమే! వారు జీవితంపట్ల శ్రద్ధగలవారేగానీ ముతాలపట్ల అంత విశ్వాసం చూపరు. వారి పలుతెరగుల విశేషానుభూతులను అభిరుచులను వారు సృష్టించిన సారస్వతం ప్రతిబింబిస్తున్నదనవచ్చును. కవిత్వం మినహా వ్యాసాలు, చిన్న కథలు, నవలలు, వ్యంగ్యరచనలు, నాటకాలు, యాత్రా



గ్రంథాలు-మరెన్నో గద్యరచనలలో సుప్రసిద్ధులు. సాహిత్యవిమర్శలను వేరుగా అందించలేదు. వారి ప్రేరేపణ 'యక్షగానం'లో అకస్మాత్తుగా పరిశోధనగా కనిపిస్తున్నది. ఏమైనా వారు నవలారచనలో అద్వితీయులు.

ఈ నవలశీర్షిక మరళిమణ్ణిగె (మరలంది సేద్యానికి) ఒక రాజకీయనినాదంగా ధ్వనిస్తూ పెడదారి పట్టిస్తున్న దనవచ్చును—ఒకవిధంగా. ఇది గ్రామాలను పొగడే ప్రచారంకాదు కాని, నగరంగురించిన కల్లబొల్లిమాటలకు విరోధం మాత్రమే; నిజంగా ఇది మూడుతరాలను, అందులోని గొప్ప ఆడవారిని, మగవారిని, పడమటి కనుమలకు అరేబియా సముద్రానికి నడిమి గాలివానల తాకిడికి కొట్టుకొనిపోయే భూమిని వారి రంగస్థలంగాచేసి చిత్రించే గొప్ప కథ. ఇలా అనడం సరిగాదేమో! ఎందుకంటే సముద్రం, దిక్చక్రం కేవలం పశ్చాద్భూమియే కాదు. సముద్రపు ఇసుక దిబ్బలు, ఉప్పుమళ్లు, కయ్యలు, అలల ఆటుపోట్లు, ఏ కొద్దిగానో దయచూపే ప్రకృతినుండి తన పొట్టకూటిని పెనగులాడి సాధించే మానవుని వెలలేనిశ్రమ, నిరంతరకృషి అన్నీ ఆ ప్రకృతే సజీవంగా మూర్తీభవించి నిలచేదాకా మనకు ప్రత్యక్షమవుతూనే వుంటాయి, ఆ జీడిమామిడి చెట్లలోని నిట్టూర్పు 'ప్రశాంత విషాద మానవసంగీతానికి' శ్రుతిగా ఏకరువు పెడ్తూంటుంది. తాటిచెట్లు తల వూపుతూ ఆ లయవిన్యాసాన్ని ఆస్వాదిస్తాయి. ఆ సముద్రతీరంపై ఏ వివాహపు వూరేగింపుకూడ, వివాహమహోత్సవంకూడ, పెనుగాలి, జడివాన పాల్గొనకుంటే పరిపూర్ణం కావేమో!

ఈ గ్రంథం సౌందర్యానికి శైలిగానీ, రీతిగానీ, జీవనసిద్ధాంతంగానీ కారణం గావు. కారంత్‌గారి జీవితసిద్ధాంతం వుందిగా! ఏలాగు జీవించాలా అనే సిద్ధాంతం రచనకు చేరువగానే వుంటూవుంటుంది. మూడవతరంవారిలో కళాభిమానం పుష్పించుతున్నప్పుడు ఆ జీవితవిధానం నాగవేణిలో, రామ ఐతాళ-బాలరాములో తొంగిచూస్తూంటుంది. బొంబాయిలో గుమిగూడిన ఉద్యోగాలకై వేటాడేవారిలో పాదుకొన్న 'కమ్యూనిజం - సామ్యవాదం'పై ఒక విసరు విసిరారు. ఎందుకంటే వారు కమ్యూనిస్టులు చేసే పెట్టుబడిదారుల సర్వావయవహోమం (సర్పయాగం)లో ఆహుతికాకుండా అభిమాన సినిమాతారలనుమాత్రం అట్టిపెట్టుకుందామని సంకల్పించారు- ఉదాత్తులైన 'కారంత' గారు మరొక్కచోట వుంటారు. వారికళ్ళు చీకట్లు కమ్మేట్లు ఆ ముసలి రామ ఐతాళులను. (కన్నీళ్ళు ఆపుకొని) పారోతి, సరసోతి, నాగవేణి అనే గొప్ప స్త్రీపాత్రలను చిత్రిస్తూంటారు.

ఈ పాత్రలను రసవంతంగా చిత్రిస్తారు. కొందరిని కొన్ని గీతలతోనే ముగించేస్తారు. శీనమయ్యవంటి వారిచిత్రాన్ని పెద్ద తైలవర్ణచిత్రంగా చిత్రించారు. ప్రతి గీతలోను, వంపుసొంపుల్లోను ఆ ముగ్గురు మహాసాధ్వులే శక్తి, సహన, లావణ్యాలకు పెట్టని కోటల్లాగు స్ఫురిస్తూ మొత్తం దృశ్యంలో సుస్పష్టంగా గోచరిస్తుంటారు. కారంత్‌గారిదృష్టిలో జీవితంపట్ల ఊహాచిత్రాలకు, వృథా ఆదర్శీకరణకు చోటులేదు. మొదటితరం రామఐతాళులు అతి పిసినారి, మహాగర్వి; అతని రెండవభార్య (సత్య) స్వార్థపరురాలు, ఈర్ష్య గలది. శీనమయ్యకు బతుకును పూలబాటపై నడిపే అవకాశం వుంది. గ్రంథకర్త అందరినీ చల్లనిచూపుతోనే చూస్తారు. ఆ లచ్చన్ని, ఒరటన్నిమాత్రం క్షమించరు. కానీ ఆ మారజాలని, అందరూ 'ఛీ, ఫో' అనే ఆ దుర్మార్గుల్నికూడా ఏ కీచుగొంతుకతోనో ఏదో శిక్షను తామే విధించకుండా వారి పాపఫలం వారే అనుభవించనిచ్చారు.

మానవహృదయం ఎలా స్పందిస్తుందో ఆ విషయపరిజ్ఞానం, (తామరాకుపై నీటిచుక్కవలె) నిస్సంగత్వం ఇవి రెండే ఈ నవలయొక్క ముఖ్యలక్షణాలు. వారు నలభయ్యవపడిలోనే అంత శాంతిని అనుభవించారంటే అది అద్భుతమైన విషయమే. ఈ కథయొక్క రేఖాచిత్రం (మూలం) వారి అవ్వ చెప్పినదని నాకు వా రెప్పుడో చెప్పినట్లు జ్ఞాపకం. ఆమెయొక్క జీవనసంధ్య ప్రసాదించిన అనుకూలపరిస్థితి నుపయోగించి వర్ణించినసంఘటనలు ఎన్నో వున్నాయి. ఆ శరత్కాలపు పరిపూర్ణసంధ్యారాగంలో ఈ రచన పాకంపట్టబడిందేమో! ఆ పాకం ఆమె వీరి కిచ్చిన కానుక-ఆమె ఈ కానుకకు కారంత్‌గారికంటే పాత్రులెవ్వరూ లభించి వుండరేమో!

ఎ. ఎన్. మూర్తిరావు.

# అనువాదకుని మనవిమాటలు

శ్రీ శివరామ కారంత్ కన్నడంలో గొప్ప రచయిత. ఆయన చేపట్టి విజయం పొందని సాహిత్యప్రక్రియ లేదు. జంతుప్రదర్శనశాలను నడిపినవాడు; పత్రికా రచయిత; సంగ్రహవిజ్ఞాన సర్వస్వకారుడు. ఆయన మంగళూరుజిల్లాలోని విశిష్ట మాండలికవ్యవహారంతో రచించిన నవల ఇది. దీనిలోని కొన్నిపదాలు కన్నడ నిఘంటువులలోను లభించవు. కనుక తెలిసినవారివద్ద తెలుసుకొని, మూలాను సారిగా అనువదించినాను. అనువాదం కథాకథన పరాయణంకాక మూలంలోని సొబగును కొంతకు కొంతైనా తేవాలని, డాక్టర్ బి. వి. కేస్కర్ అన్నట్టు 'ట్రాన్స్‌క్రియేషన్' కావాలని యథాశక్తి శ్రమపడ్డాను. చదువరులు నా శ్రమను గుర్తిస్తారు.

'మరళి మణ్ణిగె' అనేపేరును 'మరలండి మట్టికి' అని అనువదిస్తే తెలుగులో అపార్థం కలుగుతుందని 'మరల పేద్యానికి' అని మార్చాను. ఈ నవల 1968 కే ఏడు ముద్రణలు పొందింది. నేను రచయిత ద్వితీయముద్రణకు వ్రాసిన మొదటి మాటనుమాత్రం పొందుపరచాను.

ఈ అనువాదంలో నా సోదరుడు తిరుమల బదరీనారాయణ (ఎం. ఎ., బి. ఎస్సీ., బి. టి., హిందీప్రవీణ) నాకు చాల తోడ్పడ్డాడు. అతనికి నా కృతజ్ఞతలు. పెక్కుపదాల అర్థం వివరించిన సాటి పత్రికారచయిత శ్రీ కె. ఎస్. ఉపాధ్యాయకు వందనాలు. ఇలాటి ఉత్తమ నవలను అనువదించడానికి అవకాశమిచ్చిన కేంద్ర సాహిత్య అకాడెమీకి, దాని ప్రాంతీయశాఖా నిర్వాహకులు, మిత్రులు డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మకు నా కృతజ్ఞతావందనాలు.

ప్రమాదీచ సంక్రాంతి:
69, ఆదర్శనగర్,
హైదరాబాద్-4.

భాషాసేవకుడు,
తిరుమల రామచంద్ర.

# 1

పారోతికి ఈ వృశ్చికమాసానికి (కార్తీకమాసానికి) ఇరవైనాలుగేళ్లు నిండి ఇరవయ్యయిదు పడుతుంది. హేవిళంబి సంవత్సరం జ్యేష్ఠమాసంలో ఆమెకు పెళ్లయింది. ఆ పెళ్ళి ఎలా అయిందంటారు - ఇలాటి వానలోనే. ఆమె తండ్రి నారాయణమయ్యారు మణూరుగ్రామంవారు. ఆయన ఇల్లు సముద్రతీరంలోని వంపుతిరిగిన బాడవ పక్కన. ఇంటిచుట్టూ ముంతమామిడిచెట్లు. వాటిమధ్య ఆయన ఇల్లు. పెంకులుకప్పినది కాదు - వట్టి గడ్డి కప్పిన కప్పుమాత్రమే. రివ్వుమని సముద్రపుగాలివీచే ఆ తావులో ఆయన ఇల్లు నిలబడివుండడమే ఒక ఆశ్చర్యం. అందులోను పారోతి పెళ్ళిసమయంసంబరం తలచుకుంటేనే చాలు - మయ్యారుకు పారోతి ఒక్కతే కూతురు, వేరే మగపిల్లలు లేరు. అందుకనే, కూతురుపెళ్ళి అయినంత వైభవంగా జరగనీ అని ఒక చిన్నచప్పరం (పందిరి) ఇంటిముందు ఉత్తరపు ముంగిట్లో వేయించారు. సంవత్సరంపొడుగునా ఇంటిగోడలను కప్పుతూన్న తాటాకులకు కొంచెం ఆ దినం విశ్రాంతి. ఇల్లు కొంచెం లక్షణంగా కనిపించనీ అని వాటిని తీయించి ఇంటికి కొంచెందూరంలో రాశి వేయించారు. మణూరుచుట్టూ ఉన్న నాలుగు వల్లెల్లో 'కొరగని' మేళం చాల పేరు పొందింది. కుమార్తెపెళ్ళికి కొరగనిమేళం తెప్పిస్తే చాలా - అది తాటాకుల గరగరచప్పుడులో ఎవరికైనా వినబడీనా? అందుకని ఆ తాటాకును దింపి రాశి వేయించారు. మయ్యారు వాటి వాగేనోరు కట్టివేశారేగాని, ఇంటిచుట్టూ ఇసుకదిబ్బనిండా దయ్యాల్లాగ నిలబడివున్న తాటిచెట్లను 'మీ తల ఆడించరాదు' అనడానికి ఆయనకు హక్కుందా?

ఏమైనా, మొదట్లోనే మాటచెప్పి, కొరగనిమేళం ఏర్పాటుచేయించి పిలిపించుకొన్నారు. సరే, అయితే పెళ్ళి నాలుగునాళ్లూ సన్నాయిమేళం వాయించిన కొరగనికే తన వాద్యం వినిపించిందో, లేదో! నాలుగునాళ్లూ ఎలాటి వానగాలి అది! పెళ్ళిపందిరి మట్టల తలలను ఆరారుసార్లు బిగించినా, అక్కడ మిగిలింది వెదుళ్లుమాత్రమే. ఊరి వాడికప్రకారం పుణ్యానికి రాత్రిపూట కన్యాదానం కాదు; పగటి ధార - కన్యాదానం. కన్యాదానం తర్వాత భోజనం వేరే. అయితే ఏం! అలాటి జడివానలో యిల్లువదలి, సేద్యంవదలి - పెళ్ళికి బయలుదేరే మనిషి ఎవడు?

మయ్యారు కుమార్తెకు తెచ్చినసంబంధం కోదండరామ బితాళుల యింటిది. ఆయన కుమారునికే పార్వతిని ఇచ్చి వివాహం. పార్వతీ పారోతి. పెళ్ళివర్ణన కోదండరామ బితాళులనోటినుంచే వినాలి. ఆయన ఎప్పుడూ చెప్పడం కద్దు - "మన అబ్బాయిపెళ్ళికి దేవ

లోకందే వాద్యం'' అని. వానకారునెలలో ఐతాళులు ఈ పెళ్ళికి ఎందుకు ఒప్పుకొన్నారు అంటే - గుట్టు ఇలా వుంది. ఐతాళులు వూరి పురోహితులు. ఆయన పౌరోహిత్యపు ఇళ్ళ సంఖ్య నలభై యాభైకి మించివుంది. వాళ్ళనందరినీ పెళ్ళికి పిలవాలి. వైశాఖమాసంలో పెళ్ళి పిలుపైతే ఇంటికి నలుగురుచొప్పున బయలుదేరినా పెళ్ళివారు పటాలమంత కారూ? పురోహితులమీది అభిమానంతో ఇంటిల్లిపాదీ బయలుదేరితే వియ్యంకులఅవస్థ ఇక ఏమిటి? ఇంతేకాక, పిల్లవైపువారంతజోరుగా కాకపోయినా, సమావర్తనం, ఆరతి, అక్షతల భోజనాలు తాము పెట్టించేటప్పుడు ఆ ప్రకారంగానే జనంవస్తే - తాపత్రయం కొంచెం అయ్యేనా? అందువల్లనే లగ్నం వెదికివెదికి నాట్లకాలానికే పెళ్ళి ఏర్పాటు చేశారు. "ఎందుకు అలా చేశారు?" అని అడిగితే, కారణం చెప్పడానికి కోదండరామ ఐతాళులు కదూ - నాలుక చివరే పంచాంగం, జ్యోతిషం నాట్యం చేస్తాయి.

ఆయన వేసిన పదకానికీ, అయిన పెళ్ళికి బాగా లగ్గీ కుదిరింది. వానకారు నెల ప్రారంభమయింది. వాన కురవసాగింది. నాట్లు ప్రారంభమయ్యాయి. "ఈ దరిద్రపు వాన ఒకసారి ఆగితే చాలు''—అనిపించింది ఊరికి. వాన వెలిసేటట్టులేదు. సంతతధారగా అది కురుస్తున్నప్పుడు, వారివారి యింటి తాపత్రయంవదిలి ఐతాళులపెళ్ళికి జనం బయలుదేరుతారా? ఎవరు బయలుదేరకపోయినా, పెళ్ళివారు తరలివెళ్ళవద్దూ? ఐతాళులు, ఆయన ఇంట్లోవారు, వానలో తడవడానికి నలుగురు పల్లకీమోతవారు, పాటలు పాడడానికి ఇరుగుపొరుగు నలుగురు ముత్తైదులు - ఇంతమంది చేతికి దొరికిన గొడుగు, గోనెపట్ట, గూడ, తాటాకుగొడుగు పట్టుకొని బయలుదేరారు. విజృంభణగా ఈరీతిని పెళ్ళివారు తరలివెళ్ళడమయింది. గర్నాలు, కద్నీ, బిరుసు, ఔటు — మొదలయిన బాణసంచా అంతా ఇంద్రుడే పూర్తిచేశాడు.

వర్షంలోనే పెళ్ళివారు బయలుదేరారు. వానలోనే పెళ్లికూతురింటి పెళ్లిపందిరి చేరారు. ఒకటిన్నర పరువుదూరం నడవడానికి నాలుగుగంటలు పట్టింది. కయ్యకు, సముద్రానికి మధ్యన సముద్రతీరంలో సముద్రపుగాలికి ముఖం ఒడ్డి నడవడం చిన్న ఆటకాదు. కట్టుకొన్నబట్టలు ఎక్కడినుంచి ఎక్కడికో! పట్టుకున్నగొడుగులు నాల్గునాల్గుసార్లు 'చేయి తప్పి ఎక్కడికెక్కడికో కొట్టుకొనిపోయాయి. ఐతాళులు స్వయంగా పట్టుకొన్నగొడుగు పెళ్ళియిల్లు ఎక్కేవేళకు కామమాత్రం మిగిలింది. ఏమి వర్షం! ఈ సందరంలో గూడ కప్పుకొన్నవారి ముఖం, రొమ్ము, కాళ్లు తడిసిపోయినా, వీపుమాత్రం తడవక వెచ్చగా వుండిపోయింది.

వర్షంలో ఒకరినొకరు పిలుచుకొన్నా వినబడేట్టు లేదు; నాలుగుబారలమేర ఒకరినుంచి మరొకరు దూరంగా జరిగినా, కనిపించేట్టు లేదు. చెదరిపోయిన ఆవులమందను పట్టుకొని మళ్ళీ మందగాచేర్చి యింటికి తోలుకొని వచ్చినట్టయింది—ఆనాటిపెళ్ళివారి పని. అలా ఔతుందనే-పెళ్లికొడుకువైపు సన్నాయిమేళంవారు ముందుగానే పరుగెత్తివచ్చి, పెళ్ళికూతురు ఇంటి అరుగుచేరి కూర్చున్నారు. పెళ్ళికుమారునివైపువారితో గుడ్డగొడుగుపట్టుకొనే ఊరి



పెద్దమనుష్యు లెవరూ రాలేదు. పెళ్ళికి రానివారు, ఐతాళుల ఇంట్లో ఆరతి అక్షతలనాడు పోతే సరి, అదిన్నీ వర్షం వదిలితే—అని వాయిదావేసి వుండిపోయారు.

ఐతాళులు పిలుచుకొనివచ్చిన ఈ గొప్ప పెళ్ళిగుంపుకు పెళ్ళికూతురువైపువారు ఎదురువచ్చి స్వాగతమిచ్చే 'ఎదురుకోళ్ళ' తతంగం పెళ్ళికూతురు ఇంటి ముంగిట్లోనే జరిగింది. నిజానికి ఇంటిముందున్న చేనిలో జరిగివుంటే బాగుండేది. అయితే, ఇప్పుడు నీళ్లు నిలిచిన ఆ చేనిలో ఈ జడివానకు, గాలికి ఈ సంబరం అక్కడ అయ్యేదేనా? అయితే ఒకటి—ఇంటిముంగిలే వానతో నీరుకట్టిన చేనులాగ అయింది. పందిరి ఎగిరిపోయి వట్టి ముంగిలే మిగిలింది. అక్కడే మహాసంభ్రమంతో ఎదురుకోళ్ళస్వాగతం జరిగింది; పిల్లవాడివైపువారు ఇంటి మూడంకణాల చావిట్లోకి ఎక్కివచ్చారు. ఆ చావిడికి తగినంతమందే అక్కడ చేరినా చావడి సగంభాగం పెండ్లిమంటపమే మింగివేసింది. తక్కినసగం వచ్చేపోయేవారి కాళ్ళ తడితో బురద రొచ్చయింది. అక్కడే చాప పరిచి, పీటలువేసి మగపెళ్ళివారిని కూర్చోబెట్టడమూ జరిగింది. వానలో తడిసివచ్చిన పెళ్లికొడుకుకూ ధారామంటపం - కన్యాదాన మంటపంలోని అగ్గిసెగ దొరకలేదు. ఆ పొగ, ఆ గాలి, ఆ వాన రొద - ఇవే అప్పటి మంత్రాలు, పాటలు అయ్యాయి. పెళ్ళిభోజనాలు కూర్చునే జరిగాయో. నిలబడే జరిగాయో-ఎవరికి తెలుసు!

పెళ్లి నాలుగునాళ్లూ ఇలాగే గడిచాయి. పెళ్లికూతురు ఇంటికి వచ్చిపోయే సంబరమంతా వర్షంలోనే. పెళ్ళికివచ్చిన సగంమంది చివరిదినందాక మిగలలేదు; నాలుగోనాడు నాగోలి ముగించి పెళ్ళికొడుకు పెళ్ళాన్ని పిలుచుకొని 'కోడికి' బయలుదేరితే-వాన వెలిసిపోవచ్చా? పల్లకీబోయీలు, తండ్రి, తల్లి, వీరంతాచేరి తరలివెళ్ళే మగపెళ్లివారు అయ్యారు. పెళ్లికొడుకు వాళ్ల వెళ్లి యిల్లునింపడం, వాన వీరియింటిని చుంబించడం ఏకసమంగానే జరిగాయి.

అడగవలసివస్తే,-మగపెళ్లివారియింటికీ వాన తెరిపి ఏమీలేదు. వారియింటికి కొంచెం దూరంలోనే నదీముఖం. పడమటివైపు సముద్రం, దక్షిణంవైపు నదీ - సముద్రసంగమం, తూర్పున నది. ఈపెళ్లిసంవత్సరమే కోడి కడలినీటికి వెర్రి ఆవేశం వచ్చింది. కోదండరామ ఐతాళులు కుమారునిపెళ్ళి మజారిలో జరుగుతున్నప్పుడే, ఆయన కొబ్బరితోటలోని ఏడెనిమిది టెంకాయచెట్లు కడలికి బలి అయాయి. "ఈపాటి, కడలికి పిచ్చిపట్టడం నా తాతలకాలంనుంచి చూడలేదు'' అని కోదండరామ ఐతాళులు చెప్పేవారు.

ఇంటికి కోడలువచ్చిన సంతోషం; ఆరతి అక్షతలనాడు ఇంట్లో పదిమంది వైదికులు, గృహస్థులు వచ్చి నిండిన ఉత్సాహం—ఈ రెండింటినీ సముద్రపు పిచ్చిపొంగు కుదించివేయాలా? ఏటా సుమారు వేయిటెంకాయలు ఇచ్చేటన్ని టెంకాయచెట్లు ఒకేనాడు సముద్రరాయనికి ఆహుతి అయ్యాయట.

ఈ పాతకథలు యావత్తూ జరిగి ఇప్పుడు ఎన్నో సంవత్సరాలే గడిచిపోయాయి. ఇవన్నీ ఏనాటికథో అన్నట్టయింది. ఆమె పెళ్ళిసమయం జ్ఞాపకానికీ, నేటికీ మధ్య ఎన్ని

సంగతులు జరుగలేదు! పదిహేనుసంవత్సరాల దాంపత్యజీవనాన్ని ఆమె గడిపింది ఊరికేనా ఏమిటి?

పారోతికి పెళ్ళయిన మూడుసంవత్సరాలకు ముసలిముప్పు నారాయణమయ్యారు కళ్లు మూశారు. ఆమెతల్లి పెళ్ళివేళకే ప్రాణాలతో లేదు. పెళ్ళయిన ఐదుసంవత్సరాలు గడిచే వేళకు మామగారయిన కోదండరామ ఐతాళులు చనిపోయారు. ఇప్పుడు ఆమే యింటి యజమానురాలు. "వారియింట్లో ఎవరు?" అంటే, ముగ్గురే ముగ్గురు జనం! ఒకటి చెప్పరాని పేరు—మగనిది, కోదండరామ ఐతాళుల ఏకైకపుత్రుడు. రామ ఐతాళులు; మరొకరు ఐతాళుల చెల్లెలు—చిన్నతనంలోనే భర్తపోయి గతిలేక పుట్టిల్లు పట్టిన సరసోతి; మూడో మనిషి ఆమె. ఈ ముగ్గురుతప్ప ఇంట్లో మనిషిపురుగూ లేదు.

పారోతికి ఇంట్లో కాలం ఎలా గడుస్తుందనే చింతే లేదు, ఐతాళులు ఊరి పౌరోహిత్యం కట్టుకొని తిరిగేవారు. ఆయన పగటిపూట భోజనాలన్నీ పరాయియిండ్లలో. సాధారణంగా అలాగే; పౌరోహిత్యపుభోజనం ముగించుకొని, సాయంకాలం నాలుగుగంటల సుమారుకు ఇంటికివచ్చి చేరుతారు. వచ్చేటప్పుడు వట్టి చేతులతోవచ్చే అలవాటు లేదు. ఒక్కొంచెం బియ్యం, టెంకాయ, ఏదైనా కూరనార—తీసుకొనివచ్చే నియమం. అవి తెచ్చి ఇంట్లో దింపి, కాళ్లు కడుక్కొని, మణిగాసనం చావడి (నున్నగారుద్దిన చావడి) నేలమీద ఉస్సురంటు మేనువాల్చి, ఒక గడియసేపు గుర్రుపెడుతారు. అటుతర్వాత నిద్రనుంచి మేలుకొని, ఊరి పారుపత్తెం నడపడానికి బయలుదేరారంటే, మళ్ళీ యిల్లు చేరేటప్పటికి రాత్రి జాముపొద్దు గడిచిపోయేది. మధ్యాహ్నం భోజనం బలంగావుంటే, బయలుదేరేటప్పుడే "పారోతీ! ఈ దినం ఒక పొద్దు" అని వెళ్ళిపోతారు. సరసోతి విధవ కావడంవల్ల దినమూ ఒకపొద్దు నియమమే. రాత్రి ఇంత అటుకులు నీటిలో నానవేసి తింటేసరి. అలాటిదినాలలో పారోతి కూడా "అందరికీ ఒకపొద్దయితే నాకేమి సంబరం!" అంటూ వంటగోజుపనికే పోయేది కాదు. కొన్నివేళల్లో మధ్యాహ్నం మిగిలిన అన్నానికి నీళ్లుచేర్చి 'నీళ్ళన్నం' చేసిపెట్టి, సాయంకాలం వంటలెక్కకు చేర్చడమూ కద్దు. మొత్తంమీద, సాయంకాలం పొద్దుపోయిందీ అంటే, పారోతమ్మ జపమాల పట్టుకొని 'శివశివా, రామరామా' అంటూ కూర్చున్నచోటే నిద్రపోతుంది.

ఐతాళులు రాత్రి సద్దుచేస్తూ వస్తే ఆమెకు తెలియడం కద్దు; నిద్రమత్తులో తెలియకపోవడమూ కద్దు. కాకపోతే, 'ఎంతపొద్దుకు వచ్చారు?' అని ఇంటాయనను అడిగే అలవాటూ లేదు. ఆమెకు జపానికి కూర్చున్నప్పుడే నిద్రమత్తు. చేరబడినచోటే శయనం. వారి పొరుగుయిల్లు శూద్రుల యిల్లు. దానివల్ల వారి మడిమైలలకు కొంచెం ఇబ్బందిఅయినా, వాళ్ల కోళ్లవల్ల ఒక ఉపకారం జరుగుతున్నది. తెల్లవారుజామున అవి కూసినవెంటనే ఇద్దరూ లేచి, అంట్లు వెలుపలవేసి గసగస రుద్దుతారు. అంట్లు తోమినతర్వాత చెంబు, పంచపాత్రలకు బూడిదపూసి రుద్దాలి. అటువిమ్మట ఇల్లు దులిపి ఊడ్చడం అయిందంటే, ఒకటి రెండు



క్షణాలు నిట్టూర్చడానికి అవకాశం కలుగుతుంది. అప్పటికి పొద్దు పొడుస్తుంది. కొట్టంలో కట్టిన బక్కపశువులు తమకు 'అక్కచ్చు' రానీ అని రాగాలు తీస్తాయి. ముందుదినం మధ్యాహ్నం గడ్డి, తౌడు, కలిపి సిద్దపరచిన అక్కచ్చు, నీళ్లు వాటిముందున్న తొట్టెలోకి కుమ్మరించి, వాటికి సేవచేస్తే, దానికి ప్రతిఫలంగా పిండడానికిపోయిన పారోతి చెంబులోకి అరసిద్ది (పావు) పాలు ఒక ఆవైనా కురిపించనే కురిపిస్తుంది. అంత పాలయినా యిస్తుంది కదా అనే మర్యాద ఆ పశువుకు ఉంది. అదీ లేకపోతే ఇంటిదేవునికి నైవేద్యానికి పాలు వజా. పాలు పిండగానే, ఆ ఆవును, మిగిలిన ఒకటి రెండు పొట్టముదిగొడ్లను, దూడను ఇసుకదిబ్బలకు మేతకు తోలనే తోలడం. అవి కొట్టం వదలిపోయినవెంటనే. కొట్టంలోని పేడఎత్తి ఎరువుగుంతకు విసిరితే, ఇంటి తెల్లవారిరగడ ముగిసినట్టు.

అనంతరం ఎవరు రానీ రాకపోనీ-పారోతి పొలంపనికి బయలుదేరుతుంది. వెలుపలి పని, పొలంపని - అంతా ఒకటే. వానకాలంలో దానిరీతి ఒకటి; తక్కినకాలాలలో పద్ధతి మరొకటి. ఐతాళుల ఇంట్లో వంటచెరుకుకోసం ప్రాణసంకటం. ఇంటిచుట్టూవున్న వారి స్థలం లోనే రాలిన పొన్న ఆకులు, ముంతమామిడి ఆకులు తెల్లవారకముందే ఊడ్చుకొని తేవాలి. లేకపోతే కనిపించినవారు ఊడ్చుకొనిపోతారు. ఆ ఎండుటాకులతోనే వంట, అక్కచ్చు ఆకులు ఉడికించడం జరగాలి. మిగులూ బొగులూ కొట్టం నేలమీద పరచాలి. ఎండుటాకులు లేకపోతే ఎరువు ఎలా అవుతుంది?

ఏటా వెలుపలిపనులలో ఈ వంటచెరుకుపని ముఖ్యం. వానకాలపుగోడు చెబితే తీరదు. పచ్చికొమ్మలు, తడిసిన ఎండుటాకులు కాలిస్తే ఇంటినిండా పొగ; కళ్ళనిండా మంటలు. ఈ పొగ బెడదతో పారోతమ్మ కళ్లు ఎప్పుడూ మంకెనపూవులే. వాటికి మల్లెపూవులరంగు వచ్చినదే లేదు. అయితే, ఒక్కొకసంవత్సరం వానకాలంలో వరుణభగవానుడు అనుగ్రహిస్తే, ఆరునెలల వంటచెరుకు ఒకేనెలలో జమ కావచ్చు. అయితే అది చాల ప్రయాసపని. ఎందుకంటే, ఊళ్ళో వీరొక్కరే ఇల్లుకట్టుకొని వుండలేదు కదా!

రామఐతాళుల ఇల్లు వున్నది నదీముఖానికి ఉత్తరదిక్కున. అక్కడ సముద్రం నీటిలో అడుగుపెట్టడమూ సరే, యమధర్మరాజుకు సుంకమివ్వడమూ సరే. చాలదూరంలోని అడవులనుంచి పారివస్తున్న నదినీటిలో వానకాలంలో కట్టెలు, దుంగలు, చెట్లు కొట్టుకొని వస్తాయి. నదిలో దిగి వాటిని పట్టుకుని గట్టుకు చేర్చేపని, ఇంటికి చేరవేసేపని సులభం కాదు. అలా చేయడానికి నదీముఖంవదలి ఇంకా ఉత్తరానికి రెండుమైళ్ళదూరంలోవున్న సముద్రతీరానికి వెళ్ళాలి. ఎలాటి వానకురిసినా లక్ష్యపెట్టక తెల్లవారుజాముననే యింటినుంచి బయల్దేరి సముద్రతీరంలో కాచుకొని నిలబడతే, వరుణభగవానుడు ఏమి తెస్తాడో కనిపిస్తుంది. చెట్లకొమ్మలు, మండలు రావడం కద్దు; పెద్దపెద్దమొద్దులు, చెట్లే తేలిరావడమూ కద్దు. చెట్లకొమ్మలు కంటికి కనిపించగానే నీటిలోదూకి, అలలు తోసుకుంటు ఎగువకుపోయి నీటిలోదిగి, వాటిని స్వాధీనం చేసుకోవాలి. కొంచెం కూర్చుంటే, వాటంతట అవే గట్టు

చేరుతాయి. కాని, అలా కూచుంటే, గట్టుమీద వేచివున్న ఎన్నో నరబకాలు వాటికి చేతులు, ఒగ్గి "నాది-కనది" అనవూ? అందువల్ల ముందుగా నీటిలో ఈదుకొని ఎగరగలిగినవారికి మాత్రమే కట్టెల లాభం. ఈపనికి పారోతికన్నా సరసోతమ్మ దిట్టలలో దిట్ట. ఇలా కట్టెల సంపాదనకార్యానికి ఐతాళులూ వెళ్లతారు. ఆ ముగ్గురుభటులూ నిలబడితే నెలపని పది హేనునాళ్ళలో కాదూ మరి?

ఒకదినం చాల స్వారస్యమయిన కథ జరిగింది. ముగ్గురూ తెల్లవారుజామునే లేచి సముద్రతీరానికి వెళ్ళారు. వీళ్ళలాగే తెల్లవారగానే పది పదిహేనుమంది అక్కడ కాచుకొని వున్నారు. అప్పటికే నదులకు ప్రవాహం నిండుగా వచ్చినసమయం. ప్రవాహకాలంలో చెట్లు కొట్టుకొనిరావడం ఎక్కువ. కాని, గాలివిసురు, వానజోరుకూడా ఎక్కువే. వాటిలోనే నదిలోకి దిగారు; మోకాలులోతునీటిలో నిలబడి దేగచూపుతో ఎదురుచూస్తున్నారు. నూరు గజాల ఎగువన కర్రలాగ నల్లగా ఏదో తుండు తేలివస్తున్నది. ఐతాళులు అలలు దూకి, ఈదు కొనివెళ్లి అక్కడికి చేరి, చేతితో పట్టుకొని వెనక్కు తిరిగారు. చివరి అల ఒకటి ఆయన లాక్కొనివచ్చిన చెట్టును ఇసుకతిన్నెకు దొర్లించింది. దానిబరువునుబట్టి—ఏమైనా యాభై మోపుల కట్టెలు ఒకేదెబ్బకు కావచ్చునని అనుకున్నారు. ఇప్పుడు చూచారు. లాగి తెచ్చింది చెట్టుకాదు, చచ్చి తేలుతున్న ఒక దున్నపోతుపీనుగును. ఈయన చేయివేసింది చెట్టుకొమ్మకు కాదు; దానికొమ్ముకు. చుట్టూ వున్నవారు విరగబడి నవ్వారు. వారితోపాటు పారోతికి పట్టరాని నవ్వు వచ్చింది. ఐతాళులు నోరు కదపలేదు. ఇంటికి వచ్చినతర్వాత తమ విశ్వరూపావ తారమే చూపించారు. మూడునెలలవరకు పారోతి అది తలుచుకొని తలుచుకొని కన్నీటితో అరుగును తడిపింది.

వారి కట్టెల సంపాదననాటకం ఇలాటిది. ఒకటి రెండుసార్లు సరసోతి, పారోతి ఒట్టుగా కొట్టుకొనిపోవడమూ జరిగింది. అప్పుడు ఐతాళులు పోయి వారిని సముద్రంనుంచి లాక్కురావలసి వచ్చించి. అయినా చావుకు భయపడి పని మానడం అవుతుందా? ఇలా సంపాదించిన కంపలు, కొమ్మలు, చెట్లు ఇంటికి అప్పటప్పటికి మోసుకొనివచ్చి ఎండలో వేయాలి. ఎండవస్తే అన్నిటినీ పరచడం, మబ్బులు కలిసివచ్చేలోపుగా మళ్ళీ గుంపుచేర్చడం. అది ఎలావున్నా ఎండకాలానికి ఇబ్బందిలేదు. కాని వానకాలంలో నయితే, మంట చేయడం లోని ఇబ్బంది చెప్పలేము. కొమ్మలను పొయ్యి ఒడ్డుమీద పరిచి ఎండబెట్టాలి. జ్యేష్ఠ, ఆషాఢమాసాలలో ఎంత ఎండకాచీని! కట్టెలు ఏమి ఎండీని? అయినా, ఆ పచ్చికట్టెలు నమ్మే వాళ్లు బతకాలి.

మణూరువాళ్లు కానీండి, కోడివాళ్లు కానీండి - స్వంతఅడవి లేకపోతే ఇలా పచ్చికట్టె లతో వర్షాకాలంలో నిప్పు రాజవేయడం అలవాటు. ఊరి ఆడవాళ్ళ కళ్లుచూచే - ఎవరింట్లో కట్టెలున్నాయి, ఎవరింట్లో లేవు అని జ్యోతిషం చెప్పవచ్చు. ఈ ఒక్కవిషయం తలచుకొనే పారోతి పసిపిల్లగా వున్నప్పుడు, ఆమెతండ్రి నారాయణమయ్యరు 'నాబిడ్డకు ఈ కష్టం వద్దు,



దాన్ని తూర్పుకే యిస్తే, కట్టెలకైనా సుఖం' అని తెలుసుకొన్నారు. అందువల్లనే 'పద్దెన్మి బేహూరులలో నా బిడ్డకు ఎక్కడైనా మొగుడు పుట్టివుండవచ్చు' అని ఆలోచిస్తూనే వుండే వారు. అయితే కొసకు ఉప్పునీళ్ళఋణం తప్పలేదు - అన్నట్టు మణూరునుంచి కోడికే వచ్చింది ఆమె.

కట్టెలు సేకరించగానే ఇంటిపనులు ముగిసినట్లా ఏమిటి? భోజనం అయినట్లా ఏమిటి? శూద్రులయితే నత్తగుల్లలు, చేపలు-గీపలు పట్టుకొని రావచ్చు. బ్రాహ్మణజన్మ వచ్చినమీదట కూరనార తినే చావాలి-అని బ్రహ్మ నుదుటిమీద వ్రాసినప్పుడు, కూరనార పెంచవద్దూ? ఐతాళుల పౌరోహిత్యంవల్ల బియ్యానికీ, టెంకాయలకు కొరతలేదు. కూర గాయలూ అప్పుడప్పుడు వస్తాయి. అయితే ఎలాటి కూరగాయలని! పందుదోసకాయ. ఉగాది నుంచి వర్షాకాలం ముగిసేవరకు ఒకే రాగం- దోస, దోస. ఇంటి స్తంభాలకూ అవే వేలాడు తున్నాయి. నేలమీద అవే, దంతెలకూ అవే సాలుసాలుగా వేలాడుతున్నాయి. దోసకాయలు తినితిని డోకు వస్తుంది. అందువల్ల వాళ్ళయింటి తూర్పునవున్న ఐదు హానె దొడ్డిభూమిలో, ఉలవ పీకివేసిన మరుదినం, కలుపుతీసి, నాలుగువైపుల గట్లు వేయవలసినపని సరసోతికి పారోతికి. ఆ గట్లమీద మంటిముద్దలుపెట్టి, వాటిమీద ముళ్ళదడి కుచ్చకపోతే లోపల కూర గాయలు మిగులవు. ఇలాటిపనులలో సరసోతి, పారోతి ఒకరికన్న మరొకరు గట్టివారు. సరసోతి అయితే 'గునపం' పట్టుకొనడానికి జంకదు.

మొదట దొడ్డికి కల్లకొట్టడం అయితే, తర్వాత మడిచేసి, పెంచిన మొక్కలే దొరికితే, పని సులభమే అవుతుంది. భూమిని నాగలితో దున్ని వాటిని నాటడం, కాలినమన్ను, బూడిదతెచ్చి వాటి మొదట్లో వేయడం. అక్కడే దొడ్డివక్కన ఒక నీటిగుంట ఉంది. దాని నుంచి నీళ్లు మోసుకొనివచ్చి, చెట్లకుపోయడం. ఈపని ఎక్కువగా సాయంకాలం జరుగు తుంది. ఐతాళులు అపూర్వంగా ఎప్పుడో ఒకప్పుడు ఈపనిలో పారోతి సరసోతులకు సహా యంగా నిలబడుతారు.

ఉదయం ఐతాళులకు తీరిక ఉండదు. తెల్లవారి లేచి పళ్లు తోముకొనడానికి ప్రారంభిస్తే పదహారు మామిడాకులు కావాలి. వాటినంతా రుద్దిరుద్ది అరగదీసి పారవేస్తే-తర్వాత ముఖం కడుక్కొని, ఇంటిముందు చెరువులో స్నానానికి దిగుతారు. మొదట ముక్కుపట్టుకొని పూర్వాభిముఖంగా మునిగిలేస్తే, తర్వాత ఒళ్లు తోముకొనేరభసం, మంత్రాల ఆర్భాటం ఒకే వరసన కొనసాగుతాయి. 'శుక్లాంబరధరం విష్ణుం'తో ఆరంభమయి, 'ఆకాశా త్పతితం తోయం' వరకు, మరచిపోయినప్పుడెల్లా మళ్ళీ మొదటికివచ్చే జపం ముగియాలి. నూట యెనిమిది గాయత్రి, నూటయెనిమిది అష్టాక్షరి, నూటయెనిమిది పంచాక్షరీ జపాలు ముగించే గట్టు ఎక్కాలి. తడిబట్ట చుట్టుకొని దేవునిగదికి వెళ్లతారు. ఇంతకే జాముపొద్దవుతుంది. ఇంటావిడ నేల అలికి దొడ్డిలోపని ముగించి తొందరతొందరగా స్నానంచేసి నైవేద్యానికి బియ్యం నానబెట్టి యివ్వాలి. ఐతాళుల ఇలువేల్పు దొళ మంచిగుణం; బియ్యం నానబెట్టి చూపితే చాలు, అన్నం నైవేద్యం అతనికి అక్కరలేదు.

దేవతార్చన ముగియడమే తడవు. ఐతాళులు పౌరోహిత్యపువేషం ధరించారు. బయటికి వెళ్ళనే వెళ్ళారు. నడుము కొక షష్ఠిపంచ బిగించి, తలకొక ఆకుపచ్చ ధావళి రుమాల పెట్టుకొంటారు; మెడలో సన్నని రుద్రాక్షదండ, చేతిలో పొడుగాటికామ గొడుగు. పౌరోహిత్యం ఉన్ననాడు పారోతికి కొంచెం సుఖం. వంట తొందరలేదు. అన్నం ఉడికినప్పుడు ఉడుకుతుంది; భోజనం అయినప్పుడు అవుతుంది. పౌరోహిత్యం లేనినాడు-దేవతార్చన ముగిసి, నైవేద్యపు బియ్యానికి ఎసరుపోయడానికి ముందే ఐతాళుల ఉదరపాత్ర మండిపోతూ వుంటుంది. ఈ తొందరవంట చేయడమంటే, పారోతి చేతులు కాళ్ల ఊడిపోతాయి. రుబ్బుడుపత్రం బడబడలాడగానే, "ఏమి మహావంట అప్పా ఇది!" అంటారు. తిరుగవాత చుయ్యిం అనేలోగానే ఆకు, పీట వేసుకొంటారు. ఇంకా వంట ఆలస్యమయితే, 'ఏమిటి నిన్న మధ్యాన్నం భోజనంచేస్తే ముందువారానికి ఆకలి కాదనుకున్నావా?' అంటారు. అందువల్ల పౌరోహిత్యానికి సెలవున్ననాడు సరసోతికూడా వదినెకు సహాయపడుతుంది. ఆమె వుంటే అన్నగొంతు అంత గట్టిగా వినబడదు. 'వంట అయిందా?' అని ఆయన తొందర పెడితే, 'అన్నయ్యా, పెరట్లోకి పోయిరా, పశువులు వచ్చాయో ఏమో!' అని పని తగిలిస్తుంది.

మధ్యాహ్నం భోజనం ఎలాగో ముగిసింది అంటే, మళ్ళీ యింటిపని, వెలుపలి పని ఉన్నాయి. సంసారం అన్నమీదట ఏమి ఉంది, ఏమిలేదు? ఎండ దిగింది చూచి, పశువులను మేపవచ్చు. నది ఒంద్రుమట్టి గడ్డలు మోసుకొనివచ్చి, తమ సొంతసేద్యపు మూడుమళ్ళకు, చేలకు వేయవచ్చు. ఆపనీ ముగిసిపోతే—స్వంతనారుమడి లేదూ? ఆ నారుకు గూడతో నీరు పోయవచ్చు.

ఇంతా అయ్యేవేళకు సాయంకాలం అవుతుంది. మేయడానికి వదలినపశువులు కొట్టం చేరుతాయి. దూడ తాగేముందే నాల్గుబొట్ల పాలు పితకాలి. వాటికి మైలలో వున్నప్పుడే అక్కచ్చు, నీళ్ల పోసి, తర్వాత నీళ్ల పోసుకొని మడి కట్టుకొని దేవునిగదిలో కంచుసెమ్మె వెలిగించాలి. ఇక రాత్రి 'ఏమి ఉడికించాలి?' అనేయోచన ఆరంభమవుతుంది.

ఇదంతా పారోతి జీవనంలో ఒక సాధారణదినం: సరసోతిదీ ఇంతే. పారోతి పెళ్ళయి, సమర్తాడి మొగుడియిల్లు చేరినతర్వాత ఇదంతా ఆమెకు నిత్యనిశ్వాసం. ఆమె పెళ్ళయినతర్వాత పుట్టింటికి పోయినసందర్భా లున్నాయి. అప్పుడూ యింతేవని. అయితే ఒక వ్యత్యాసం—అక్కడ తండ్రి-కూతురు ఈ పనులనే చేస్తే, ఇక్కడ మరదలు-వదిన చేయాలి. ఐతాళులు ఈపనికి వస్తారు, రానే పస్తారు అనే నిశ్చయం లేదు, నిరీక్షణా లేదు. 'ఆయన అంతమాత్రం చేయడమే గొప్ప' అని పారోతికి తెలుసు.

ఇదంతా పాతజ్ఞాపకం. ఈదినం పారోతమ్మ నది సమీపానికి వచ్చి, వాననీరు ఎక్కివచ్చినందున అల్లంతదూరంలోనే నిలబడి చూస్తున్నది. ఆమె జతలో సీదవంటి మరదలు. వాన ఒకేరీతిగా కొడుతూంది. ఒంటికి గుడ్డలు అంటుకొనిపోయాయి. ఆ చలిలో వాళ్ళిద్దరూ



చేతులు కట్టుకొని, ఒకరిముఖం మరొకరు చూస్తారు, అడపా దడపా నిండిన నదిని చూస్తారు. చాలసేపటివరకు మాటలే లేవు. చివరకు సరసోతి విసుగుపడి ఇంటివైపు బయలుదేరింది. 'రా, పారోతీ' అన్నది. పారోతి దానికి సమాధానమన్నట్లు 'ఇదేమి విపరీతం! ఉన్న నారు మడి కుళ్లి మన్నయిపోయినతర్వాతే ఈ వరద దిగుతుందని అనిపిస్తుంది' అన్నది.

ఈ సంవత్సరమంత వాన, గడచిన పరీధావి సంవత్సరం ఇవతల కొట్టలేదట. ప్రతి సంవత్సరమూ వారి పొలానికి వరదనీరు రావడం కద్దు. వచ్చినట్టే దిగిపోవడమూ కద్దు. నదీముఖానికి సమీపం కావడంవల్ల ఎంత వరదవచ్చినా, వచ్చిననీరు దిగిపోవడమూ అంతే త్వరగా. అయితే జ్యేష్ఠమాసంలోనే ఈపాటివరద వచ్చిందిలేదు. ఒకొకప్పుడు నాట్లు ముగిసినతర్వాత వరదవచ్చి దిగిపోవడమూ ఉంది. ఇప్పుడు నాట్లకు వదలనట్టు వరద నిలిచిందీ అన్నమీదట ఏమి చేయాలి? మడి, చేను, నది అన్నీ ఒకే జలమయం. నది వరదనీరు సముద్రతీరానికి ఒకపాయ వ్యాపించిందంటే, మరొకపాయ పడమటిరస్తాకు వ్యాపించింది అంటున్నారు. నదిని పట్టికాళ్ళతో దాటేమాట అలావుండనీ- దోనెకూడా సాగేట్టు లేదు. ఏమిటా నది వరదఆర్భాటం! ఆ ఉదయం రామఐతాళులు నదిదాటి అవతలిగ్రామానికి పౌరోహిత్యానికి పోవలసివుంది. మూడు నాలుగుసార్లు నదిపక్కకు వచ్చి నిలబడి "నేను వెళ్ళను. నేనేమి ఈ వరదలో ప్రాణాలు వదలడమా ఏమిటి?" అన్నారు. ఆదినం నాగప్పహొళ్ళగారి వర్షాంతికం-వర్షాబ్దికం. దానిని చేయించవలసిన తాము ఆగిపోతే, వర్షాబ్దికాన్నే ముందుకు తోస్తామా? "అలాకాదు, శ్రాద్ధంనాడు నాగప్పహొళ్ళగారి ప్రేతాత్మ వచ్చి ఉపవాసం ఉండాలా?" అని పారోతి భర్తకు జ్ఞానమార్గం బోధించవలసి వచ్చింది.

ఐతాళులు ఎక్కడలేని ధైర్యం చేసుకొని—'నదిలో దిగుతాను' అన్నారు. తమ ధావళి, పంచపాత్ర తలమీద ఎక్కించారు; షష్ఠిపంచతో రుమాలు బిగించారు. దేవుని ఉత్సవ విగ్రహాలమీద వెండిగొడుగు పట్టినట్టు తమ పొడుగుపిడిగొడుగు తలమీద పట్టుకొని, నిత్యమూ నదిదాటే రేవునుంచే దిగారు. భర్త నదిదాటే దృశ్యంచూచి పారోతమ్మ మెడలోని తాళిబొట్టు వణుకుతూ వుండివుంటుంది భయంతో. ఆయన నూరుబారలు దాటేవరకు నీళ్ల మోకాళ్ళవరకు వుంది. దానిముందు పల్లేరుగాయల పొద. 'ఆ ముళ్ళపొదలో దారి తెలీకుండాపోయినా?' అని పారోతికి భయం. ఐతాళులు పల్లేరుపొదను కళ్ల పెద్దవిచేసుకొవిచూస్తూ దారిలో నడిచారు. వాటిమధ్య వదలినస్థలమే నదిదాటే దారి. ఆచోట మొదటి అడుగు వేసేటప్పుడే ఆరేడుసార్లు యోచనచేసి చూచారు. చివరకు 'సాలిగ్రామం నరసింహుడు చేసిందికాపీ' అని ముందుకు సాగిపోయారు. నదినీళ్ల నడుము, ఎద, గొంతువరకు క్రమంగా వచ్చింది. నది నీటిచాలులో నీళ్ల నోటివరకు, ముక్కువరకు ఎక్కింది. ఊరికే, అందాజుగా నిలబడి ఈదేవారిలాగ నాల్గుక్షణాలు నీళ్ల తోశారు. ఆయనగొడుగే తెరచాపలాగ ఆయనను నదీముఖానికి తీసుకొనిపోవడానికి మారుగా నది ఎగువకు తీసుకొనిపోయివుంటుంది. కాళ్ల కిందికి తీసుకొనిపోయివుంటే, హంగారకట్టె ఓడరేవుకో, నదీముఖం

దాటి త్రోవ్వేకో చేరవలసింది. 'వరుణదేవునిముందు మానవుని ఆటలా?' అనిపించింది ఆయనకు.

ఐతాళులు అలాటి మడ్డిమనిషి కారు. ఈదడం తెలిసినవారు. ఈదితె, మూడురూపాయలుపెట్టి ఆ సంవత్సరమే కొన్న ధావళి ఉప్పునీటిలోపడి చెడిపోతే, దాన్ని నాగప్పహొళ్ళ కుటుంబంవాళ్లు ఇస్తారా? ఏమైనా, నిలబడి, ఈది, కాళ్లు నేలకు తగిలాయి, ఆగాయి. నది నీటిచాలుతప్పి ఇవతలిఒడ్డుకు వచ్చారు. కాని, దాటే దారి సందు కనపడదు. ఎదురుగా ఎక్కడచూచినా పల్లేరుముళ్ల పొదలు. ఆ ముళ్ళకు ఒళ్లు సవురుకొని, తాము నాలుగుబార లయినా నదిలో దిగువకు వచ్చివుండవలెననే అందాజుమీద, ఉత్తరానికి నడిచి, నిత్యం నడిచే దారి కనుక్కొన్నారు. అంతయిందా—'ధుత్, ఇలాటి ఏళ్లు వెయ్యి దాటేను' అని సంతోషంతో ముందుకు నడిచారు. అయితే 'సందెకూ ఇలాగే నీళ్లుంటే, ఇంటికి ఆరాత్రి వచ్చేది లేదు' అనీ నిశ్చయం చేసుకొన్నారు.

నదిదాటి ఆయన ఎదురుగావున్న మడిగట్టు ఎక్కేవరకు—ఇటువైపు ఒడ్డుమీద కాచుకొనివున్న వదినా మరదండ్లు కనురెప్ప వేయకుండా చూస్తున్నారు. అటుతర్వాత 'నీళ్లు ఇలాగేవుంటే అక్కడే వుండండి' అని కేకవేసి చెప్పారు. అయితె ఆ గాలి, వానలకు వీరికేక ఎవరికి వినిపించాలి? ఐతాళులు ఏమైనా వెనక్కి తిరిగిచూచారా?

## 2

రామ ఐతాళులు నదిదాటి కనుమరుగయ్యేవరకు ఆయన చెల్లెలు సరసోతమ్మ చూస్తూ నిలబడింది. తర్వాత విసుగుపుట్టి ఇంటివైపు బయలుదేరింది. కాని, పారోతి ఆమె పిలిచినా వెళ్ళలేదు. ఇంకా అక్కడే నిలబడివుంది. ఇప్పుడు ఆమెను భర్త తిరిగివచ్చేచింత వెంటాడడం లేదు; వ్యవసాయపుచింత వెంటాడుతున్నది. 'వరదనీరు ఇంకా నాలుగునాళ్లు ఇదే రీతిగా నిలిస్తే, వచ్చేఏడు ఏమి తినాలి?' అనే చింత. అలా చెప్పవలసివస్తే, రామ ఐతాళుల సంసారంలో - చింతాభారం ఈ ఇద్దరు మోసేట్టు యజమానులయిన ఐతాళులే మోయడం లేదు. ఆయనదగ్గఉన్నదానిలోనే మట్టసమయిన జీవితం. పౌరోహిత్యంవల్ల ఆయన సేద్యం వైపు సమంగా మనస్సు పోనివ్వడమూ తక్కువ.

ఆయనభార్య పార్వతి, మొదటినుంచీ పారోతి అనిపించుకొంటూ వచ్చింది. ఇంటి బరువంతా తనదేనని అనుకోడం సహజం, అందులోను - వర్షాకాలంవస్తే, ఎక్కడ చూసినా



వ్యాపించివున్న నీటివిస్తారమంతా ఆమెకంటికి తన జీవితపు ఇతిహాసాన్నే భాసింపజేస్తుంది. తన వివాహసమయంనుంచి వాన. వానకాలాలు ఆమె మనస్సులో అచ్చు పడిపోయాయి. పెళ్లిగడియలు మొదలు సంసారంలోని ప్రతిగడియ తలపులూ ఆమెకు దానినుంచే కలుగుతాయి. తన జీవితంలోని పతనాలన్నీ ఆమెకు ఈ వానకాలపు పొంగుతో పెనవేసుకొని కనిపిస్తాయి. చివరకు ఒక్కొక్కసంగతే స్మరించి, 'మనుష్యులైపుట్టి ఫలమేమి' అనిపిస్తుంది. ఇప్పుడూ ఆమెకు కళ్ళఎదుట కనిపించిన ప్రశ్న అదే. పగలూ రాత్రీ పనిచేయడమయింది; విత్తడమయింది; పెంచడమయింది; యోచనచేసిచేసి అలసిపోవడమయింది; ఈపని, ఈ లెక్కపెట్టుకోడం—వీటిలో 'రామరామ' అనుకోడానికి సమయం చాలదు. 'రామరామ' అనుకొన్నా, మనస్సెక్కడో, ఆ రాముడెక్కడో, దీనితోనే ఏమిటి సుఖం?-అని అనిపిస్తుంది. ఈ విరక్తి ఆమె మనస్సులోని నిరాశ ఫలం; అందరు ఇల్లాండ్లలాగ తానొక పాపను కని సుఖపడాలనుకొన్న కోరికలు-విఫలం కావడంవల్ల. 'కాపురానికివచ్చి గొడ్రాలయి చావాలా' అనే మెరుపు మనసులో మెరిసినప్పుడు ఈ జీవం ఎందుకూ వద్దనిపిస్తుంది. తాను పెద్దమనిషి అయిన ఆ గడియనుంచి ఇంతవరకు తల్లిని కావాలనే తహతహ. మొదట్లో ఆ కోరిక ఆమెను స్వప్నస్వర్గాలలో తేల్చింది. ఐదారు సంవత్సరాలు ఇలాగే గడచిపోగా, కాలమంతా వేడుకోవడాలు, మొక్కుకోవడాలు, ఆశలతో ముగిసింది: పది సంవత్సరాలైనా అలాగే వుండడంచూచి 'తాను పాపిష్ఠురాలు, తన పూర్వకర్మఫలం అనుభవిస్తున్నాను' అని అనిపించింది. ఆమె ఇరుగుపొరుగు చెల్లెళ్లు, తనకన్న చిన్నవారై దిసమొలతో తిరిగిన వారు, నేడు తమతమ పాపలను ఎత్తుకొని ముద్దాడుతున్నారు. సంసారమనేది నరకమన్నది నిజం. అయితే తన పొట్టనుంచి పుట్టిన పాప నవ్వుచూచి ఆ నరకయాతన సగానికి సగం కాదూ?-అనే ఆశ ఎన్నటికీ ఆమెనుంచి దూరంకాలేదు. ఇంచుమించు తన వయస్సుదే అయిన కిట్టప్పమయ్యరు కుమార్తె జానకి, పదమూడోఏట గర్భిణిఅయి పధ్నాలుగోఏటే తల్లి అయింది. ఇప్పుడు అది కూతురుసంతానాన్ని చూచే సంతోషంలో వుంది. అయితే పారోతికి ఆ పేరు పిలుపే రాదు; తన పసికూనకు 'మణ్ణి'[1] తినిపించేయోగమే కూడిరాలేదు.

తనపొట్టలో నిండిన తనప్రీతిని, ఆదరాన్ని ఎవరిమీద చూపాలి? ఐతాళులా?—పగలు యింట్లోవుండడం తక్కువ. ఉన్నా పెళ్ళాంతో గప్పాలుకొట్టే, స్త్రీలోలురా? మగవాడు ఎలా బిగువుతో వుండాలనేది తెలిసినవారు. పగటిపూట దాంపత్యం ఈవిధమయితే, రాత్రి, పగలెల్లా పనిచేసిన ఆ ప్రాణికి పిలువడానికిముందే నిద్ర ముంచుకొనివస్తుంది. అప్పుడుకూడ నయం, భయం లేకుండా భర్తతో మాట్లాడేటట్టు లేదు. ఏమయినా, వారి సాంప్రదాయికసంసారంలో ఆచారం, కట్టడి, రివాజులమేరలోనే మమతకూడ కొనసాగాలి.

ఇటు తనలాగే ఇంటికష్టాలలో కొరతలలో భాగస్వామినిఅయిన సరసోతి అంటే, ఆమెకు చాల ఆదరం, సహనం, మర్యాద. ఆమెమీద ముద్దు, ప్రీతి - అనేవి ఎలా వస్తాయి?

---

1. రాగులు రుబ్బి ఆ పాలతో చేసేహల్వా. పశ్చిమాంధ్రంలో నాంపలక.

అయితే, ఎవరిపీ ప్రీతితో చూడదా?-అంటే, ఆ నైవేద్యానికి తగిన పాలుఇచ్చే కపిలవర్ణపు ఆవు గోపిని ఎంత ఆదరించినా, ఎంత మాట్లాడించినా, పారోతికి చాలదు. దానితువ్వాయిలను ముద్దాడి పెంచినదీ చాలదు. ఆమె ఒక్కతే కూర్చుని గోపితో మాట్లాడుతున్నప్పుడు కొన్నిసమయాలలో ఐతాళులు రావడం సంభవించేది. 'ఇది ఇంత గట్టిగా ఎవరితో మాటలాడడం?' అని చకితులై వచ్చి, చివరకు భార్యపద్ధతిమాచి, 'దీనికి మాట్లాడడానికి మనుష్యులు అక్కరలేదు. దూడా చాలు; గోడా చాలు' అనడమూ కద్దు? అదొక పరిహాసం కాదు; ఆమె బుద్ధిలేనితనానికి అనుతాపం.

గోపెమ్మ ఇంతవరకు ఐదుదూడలను ఈనింది. వాటిని చేతులారా సాకి, చివరకు కొట్టం నిండిపోతుందనేభయంతో ఎవరెవరికో ఇవ్వడమూ అయింది. ఇప్పుడు గోపెమ్మ ఆరవదూడను ఈనింది. అది పెయ్యకాదు; కోడె. దానిని ఇప్పటికి ఏడాదిన్నర సాకడమయింది. గోపెమ్మ ఇప్పుడేమో వట్టిపోయింది కాని, దేవునిదయవుంటే, ఇంకా ఒకటి రెండుదూడలు వేయవచ్చు. అయితే ఈ కోడెదూడను ఏమిచేయాలి? ఐతాళులు దానికోనమని బందికొనాలా? గోపెమ్మ దురదృష్టం! అది పెయ్యలనువేసే అలవాటు పెట్టుకోలేదు. ఐతాళులు కోడెదూడలను ఏడాదికిమించి యింట్లో పెట్టుకొనే అలవాటు వున్నవారూ కాదు. ఇప్పటి కోడెదూడను ఏడున్నర్ధం పెట్టుకోడం కొంచెం రాయితీతోనే. భార్యకు వేసట వచ్చినప్పుడు మాట్లాడడానికి ఒకప్రాణి ఉండనీ అని. ఇంకా ఎంతకాలం అలా పెట్టుకోవచ్చు; మొన్ననగా, ఆయన కాపుటింటి సూరప్ప ఒక వరహాకయితె దూడ తనకు కావీ అన్నాడు. అందువల్లనే ఐతాళులు 'పారోతి, కోడెదూడను సూరనికి యిచ్చివేద్దాము. పీ గోపి పెయ్యదూడను ఈనడమనేదే లేదు. ఊరికే కోడెదూడలను సాకిసాకి బందికట్టడం సాధ్యమా? వాడికే యిద్దాము. మూరణ్ణి వదలిపెట్టడం అవుతుందా? తెల్లవారితే, దుక్కికి వాడినుంచే మనకు దున్నపోతులు రావాలి'. ఈ మాటలు జరిగినసందెకే సూరప్ప రావడమూ, కోడెదూడను అమ్మడమూ అయిపోయాయి.

గోపి ఆరవదూడ అమ్మకమూ అయిపోయింది. సూరప్పకేమో తను కొన్న దూడకు ఒక జోడీని వెదికి సాకి, చేసి, చెందడానికిముందే దానిని కాడికి బిగించితేనే ఒక సంతోషం: ముందు మూడుసంవత్సరాలలోను, ఆ జత ఆరుసార్లు చేతులుమారి కనుమరుగవుతుంది. కనుమరుగవుతుంది అంటే, సహజంగానే 'జబ్బులకు' గురి అవుతుంది. ఇలా అయి, ఆరవదూడను అమ్మేదినమంతా పారోతికి వెనుకటి ఐదుజీవాలచరిత్ర జ్ఞాపకం వస్తుంది. చివరకు ఆమె, 'అది, వాటి నుదుటివ్రాత. బ్రహ్మవ్రాతను ఎవరు తప్పించగలరు?' అని దూడను ముద్దుపెట్టుకొని ఇంటిగుమ్మం దాటించి 'వెళ్ళిరా నాయనా' అని పిల్లలను పంపినంతప్రేమతో ఆశీర్వదించి పంపింది. ఒకటి రెండు బొట్లయినా కన్నీళ్లు రాలకపోలేదు.

ఈదినం ఐతాళులను పౌరోహిత్యానికి నదీయాత్రచేయించి పంపడం జరిగింది, పారోతి మనస్సుకు చాల వేసట కలిగింది. ఇంటికివస్తే, మాట్లాడడానికి గోపెమ్మ దూడయినా లేదు.



దానిని ఆ వేసవిలోనే సూరప్ప కొని తీసుకువెళ్లాడు. అందుకని, నోటికి మౌనపుతాళం బిగించి, వదినా మరదళ్లు ఇద్దరూ, ఇంటిపనుల్లో మునిగిపోయారు. తడికట్టెలను పొయిలో తురికి పారోతి వంటచేయడానికి పూనుకుంటే, సరసోతి పనిలేనందుకు, మధ్యాహ్నం వుడికించవలసిన అక్కచ్చును ఇప్పుడే ఉడికించసాగింది. వంటింట్లో తడి వంటచెరుకులవల్ల పొగ. ఇక్కడ ఎండుటాకులనుంచి సరసోతికి నోటినిండ దగ్గు. పొయ్యిలు రెండూ మండడానికి వదలి, పొయ్యిలమీద పదార్థాలు వాటంతట అవే వుడుకుతాయనే ధైర్యంతో అరుగు మీదికి వచ్చారు యిద్దరూ. ఆయాసమయింది. ఊదిఊది దగ్గిదగ్గి ఇద్దరి దమ్మూ వట్టిదయింది. అలాగే అరుగుపొడుగునా ఒళ్లు చాచుకొని పడుకొన్నారు. పడుకొనే, వైరాగ్యరాగంతో మాట్లాడసాగినారు.

సరసోతి అన్నది:....'ప్రథమైకాదశి ఎప్పుడో! అదైనా త్వరగా వస్తే ఇంత భాగవతం కథలనైనా వినవచ్చు. నిరుడు ఎక్కడివరకు ముగించారు? అక్రూరుడు విల్లు-పండుగకు కృష్ణభగవానుని పిలుచుకొనిపోయేవరకు కదూ? ఈ ఏడు అక్కడినుంచే కథ ప్రారంభిస్తే సరి. చూడు—పారోతి, ఆ కంసాసురునికి ఏమి పాడుబుద్ధి పుట్టింది? తన చెల్లెలి పిల్లలను చంపడానికి ఎలా మనసువచ్చిందో?'

పారోతి:—అంతా ఆయన మాయ. దేవునిమాయ. కాకపోతే, ఆయన కావాలమకొనేవారికి పిల్లలను యివ్వడానికిమారు, వద్దనుకొనేవారిచుట్టూ సంసారం నింపుతారా?'

ఇది పారోతి నోటినుంచి దానంతట అదే బయలువెడలినమాట, మాట్లాడినతర్వాత అర్థం తెలిసింది. అర్థంవెనుక తన నిష్ఫలదాంపత్య జీవితపుతెర మెరిసినట్లయింది. ఆ తెర ఒక్కొక్క మడతలోను గోపెమ్మ ఆరుదూడలచరిత్ర కనపడకుండా పోలేదు. భర్త అన్నమాట 'ఈ గోపెమ్మకు పెయ్యదూడలనువేసే అలవాటే లేదు' అనేమాట జ్ఞాపకం వచ్చింది. దానిని తనకు అన్వయించుకొన్నది. 'నాకు మగపిల్లలూ లేదు, ఆడపిల్లలూ లేదు. నాకే ఇంతగా అనిపిస్తే, భర్తకు ఎంతగా అనిపిస్తుందో? రేపు చస్తే నోట్లో నీళ్లు పోయడానికి ఒక మగపురుగయినా వద్దా?' అనిపించింది.

అది తీరా తీవ్రమయినచింత. 'వాళ్లకేమిటి కొరత? భోజనానికి వుంది, ఆస్తి వుంది. తోట వుంది. పశువులున్నాయి. బీదరికమైనా ఒకరిని అడుక్కుని తిన నక్కరలేదు. అయితే, ఈ సంపత్తంతా చచ్చేగడియవరకే. ఆ గడియవస్తే పిల్లలచేతితో ఒక ఉద్ధరిణి తీర్థం నోటిలో వేయించుకొనేయోగ్యత లేకపోవాలా?' అని తోచినక్షణమే, నాలుగు ఉద్ధరిణుల నీళ్లు కళ్లనుంచి కురిశాయి. 'దానిని సరసోతి చూడనిదా? ఇలా ఆమె దుఃఖపడేటప్పుడంతా, ఇలాటిదానికోసం దుఃఖపడుతూంది అన్నతెలివీ ఆమెకు వుంది. దానిని చూచిచూచి సమాధానం చెప్పి చాలయింది ఆమెకు. ఆమె అన్నది: 'వదినా, నీవు ఆరమదేవునికి నెలకు ఆరుసార్లు ప్రదక్షిణం చేసివస్తావు; ప్రతి సంక్రాంతికి ఆణెగుడ్డెకుపోయి గణపతిని దర్శనం చేసుకొని వస్తావు, ఏ వ్రతం చేశావు? ఏ వ్రతం చేయలేదు?-అనేట్టు లేదు. అశ్వత్థనారాయణు

వికి ప్రదక్షిణం చేసినది లెక్కచేస్తే, మొత్తం కాశీయాత్రే అయ్యాని. ఇదంతా వ్యర్థం కావాలంటే, వాడికి మనస్సు పుట్టలేదు అని తోస్తుంది. దానికి ఏమిచేద్దాం? ఇప్పుడు నీకదుపే వండాలనేదేమిటి? పోనీ, దత్తు తీసుకుంటే ఏమిటి తప్పు!' అని సమాధానం చెప్పబోయింది.

'తన పార్వతి నేడుకాదు, రేపు గర్భిణీ అయ్యాని' అని కోరికోరి నిరాశురాలయిన ఆమె చివరకు ఈదారి తొక్కింది. పార్వతి చెవిలో ఆమాటపడగానే ఔను అనిపించింది. తన మంకుబుద్ధికి మొదట్లోనే ఆ ఆలోచన ఎందుకు తోచివుండకూడదు అనిపించింది. మరి దత్తుకొడుకైనా ఇంటికివస్తే, చచ్చినతర్వాత సద్గతి పొందించవచ్చు గదా! 'మా నాన్న మా నాన్న' అనే శ్రాద్ధం, తర్పణం చేస్తాడుకదా!' అని భ్రమ.

ఈ కొత్త ఆలోచనలో ఆమె మనస్సులోని దుఃఖం తగ్గింది. దానితోపాటు వెలుపల ఆకాశంలో కప్పిన మొయిళ్ళూ చెదరిపోయాయి. పదిహేనునాళ్ళనుంచి ముఖం చూపని సూర్యునిఎండ ఇంటిముంగిట్లో పడింది. అప్పుడు వడుకున్న ఇద్దరూ తటాలున లేచారు. 'లేదాం, రెమ్మలు కర్రముక్కలూ అయినా ఎండలో వడేద్దాము. సూర్యభగవానుడు ఇంత దయచూపడమే గొప్ప; ఎండినంత ఎండనీ. రాలినఆకులు కొంచెం తడి ఆరి నిప్పు పూదినంత మండుతుంది' అని పనికి బయలుదేరారు. ఇద్దరూ తొందరతొందరగా లేచి, పశువుల కొట్టం చావడిలో రాశివేసిన కొమ్మలు, రెమ్మలు ఆకులు, గడ్డి - అంతాతెచ్చి, ముంగిట్లో విడదీసి పరిచారు. ఆ పదిహేనునాళ్ళ 'సంతతధార' వర్షంవల్ల అన్ని వస్తువులూ తడిసిపోయి, నిప్పు అంటుకోడం ఒక్కటే, యజ్ఞంచేయడం ఒక్కటే - అనిపించింది. ఇప్పుడు వచ్చిన ఎండను ఎవరన్నా వదిలేరా?

ఆ పని పూర్తయినతర్వాత, సరస్వతి ముంగిట్లోనే నిలబడి, ఇంకా ఏదో మరచిపోయినట్లు ఆలోచిస్తున్నది. పార్వతి 'వదినా, స్నానానికి వెళ్ళు, నీవెంట నేనూ వచ్చాను'' అన్నది. సరస్వతికి స్నానానికి వెళ్లడానికి మనస్సురాదు. 'ఎండవస్తే ఏదో చేయాలి' అని ఎన్నోనాళ్లుగా ఆమె యోచనచేసిన పనివుంది. అదేమిటని జ్ఞాపకంరాక, ఆమె కాళ్లు కదలవు. పార్వతి 'ఎలాంటిదే అది? ఏమిటే అదీ?' అని అడిగిఅడిగి విసుగుపడి, చెరువుకు వెళ్ళింది. అక్కడ నీట్లో మూడుమునకలువేసి, స్నానం అయిందనిపించి, తొందర తొందరగా తిరిగివచ్చింది. 'పని స్నానాల గడబిడలో, పొయ్యిమీదపెట్టిన అన్నం గంజి అయితే ఏమిటి గతి?' అని గాభరాపడివస్తే, ముంగిట్లో ఏమీతోచక యోచనచేస్తూ నిలబడిన సరస్వతి ఇంకా నిలబడేవుంది. ఆమెను చూచిన పార్వతిమనస్సుకు 'పార్వతి, నా కిప్పుడు జ్ఞాపకం వచ్చింది; అటకమీద పెట్టె అప్పళాలు, వడియాలు ఈపాటిచెమ్మకు బూజుపట్టకుండా వుంటాయా? తీసి, ఎండకు వేయాలికదా!' అనిపించింది. అప్పుడు సరస్వతి 'హూఁ.... చూచావా....ఏమిటో మరచిపోయాను అన్నాను....దీన్నే, నీకు అటక ఎక్కడానికి కాదు,



నేను స్నానంచేయక మడి అప్పళాలు తాకేట్టులేదు. వేగిరంపోయి ఒక్క మునకవేసి వస్తాను' అని స్నానానికి వెళ్ళింది.

ఆమె స్నానం ముగించి వచ్చేటప్పటికి, వంటింటినుంచి పార్వతి వెలుపలికివచ్చి, 'వదినా, ఒక్కపని పసందయింది' అన్నది. 'ఏమిటి?' అని సరస్వతి అడుగగా, 'మరేమిటి? అన్నం వుడకడం ఎక్కువై, బోనమైంది. వారిస్తే గంజే పడలేదు. ఆ ముద్ద నీవు ఎలా తింటావు? నీకు అన్నం బిరుసుగావుంటే, ఒక్క పిడచ సయిస్తుంది' అన్నది. 'ఒక్కదినం ముద్దఅన్నం తింటే, నేనేమీ చావను' అని సరస్వతి అటకఎక్కి, పార్వతి సహాయంతో అప్పళాలు వడియాలబానను కిందికి దింపింది. దానిమూత తీయగానే గుప్పుమని కంపురాకుండా వుండీనా? పదిహేనునాళ్ళ వర్షంచెమ్మకు అప్పళాలకు గడ్డాలూ, మీసాలు వచ్చాయి. బానను దొర్లించుకుంటూ, వెలుపలిఅరుగుకు తెస్తే, ఆకాశంలో మళ్ళీ కారుమబ్బులు కమ్ముకొనివున్నాయి. 'అయ్యో, దేవుడా, ఈ వర్షానికి మనతో చెరలాటలని అనిపిస్తుంది, అప్పళాలు ఎండబెడదామని కిందికి దింపితే, ఈ మొయిళ్ళకు పొగరెక్కింది, వదినా- ఇప్పుడు కొమ్మలు రెమ్మలూ ఒక్కవైపుకు చేర్చాలి. ఎండించిందంతా వ్యర్థం' అన్నది పార్వతి.

సరస్వతి:— 'నీవు వూరికేవుండు. అది ఎండినదీ అంతలోనే వుంది; ఇంకా తడిసినా అంతే. సాయంకాలం తీద్దాం. ఈ అప్పళాలదే యోచన నాకు, త్వరగా భోజనంచేసి, పొయ్యిగట్టుపూడ్చి బాగుచేస్తే, దానిమీదనయినా ఒక నూరు అప్పళాలు ఆరబెట్టవచ్చు'. సరే, ఇద్దరూ భోజనం చేద్దామనేనిర్ణయంతో లోపలికి వెళ్ళేటప్పుడు గోపెమ్మ 'అంబా' అనే పిలుపు వినబడింది, వర్షంవల్ల గోపెమ్మ ఇల్లుకదిలి వారం అయింది. ఇప్పుడు పైపైననే మేఘాలు, ఎండ రావడం చూచి యెవరైనా తనను వెలుపలికి వదలిపెడతారు అని అనుకుంది. అయితే ఇంటివాళ్లు తమతమపనులలో మునిగిపోయి, తనను మరచిపోయినందుకు ఇలా అరిచింది. గోపెమ్మ ఎంత నెమ్మదిగా అరిచినా, పార్వతికి వినిపిస్తుంది. ఆమె ఆ అరుపువిని, 'వదినా, దూడకోసం గోపి అరుస్తున్నదో ఏమో!' అన్నది. అలాగే పల్లెవరకు పోయేటప్పుడూ, గోపెమ్మ తన మెడతలుగును లాగిలాగి అరిచింది. 'కానీ' అని పార్వతి మెడతలుగు తప్పించింది. గోపి కొట్టంనుంచి చిన్నదూడలా చెంగనాలుకొడుతూ ముంగిట్లోకి వచ్చింది. వాన వెలిసినప్పుడు కాళ్లు సడలించడం దానికి అంత యిష్టం. ఇటు మూసుకున్న మబ్బులు ఒక్క గాలివిసురుకు చెదిరి, తిరిగి తీక్ష్ణమయిన ఎండ కొట్టింది.

'భోజనం అయినతర్వాత మెట్టకు పోవచ్చు గోపీ' అని పార్వతి దానిని ఒక చెట్టు నీడలో కట్టివేసి, తాగడానికి కడుగునీళ్లు ముందుపెట్టి భోజనానికి వెళ్లింది. 'గోపీని బయట వదలాలి, నేను భోజనంచేసి వెళ్ళివస్తాను. ఎండ ఇలావుంటే, నీవు అప్పళాలు ఎండలో వరుచు' అన్నది. ఈ మాటా మంతిలో సరస్వతికి భోజనం చేసేటప్పుడు, 'అన్నం ముద్దయింది' అనే అనిపించలేదు; భోజనం అయింది. పార్వతి గోపెమ్మవద్దకు వచ్చింది. ఇటు గోపినిమాత్రమే బయటికివదిలితే చాలా? కొట్టంలో ఇక రెండు పాలివ్వని వట్టిపోయిన

పశువులున్నాయి. అవి పాలు యిచ్చేట్టులేదు. వాటి ప్రాయమైంది. 'మీరు గోపెమ్మతోపాటు కాళ్లు ఆడించుకొని రాండి' అంటూ, వాటినికూడా తోలుకొని ఇంటినుంచి బాడవకు అడుగు వేసింది. ఇంటివెనుక ఇసుకదిబ్బ దాటితే, విశాలమైన మెట్టవస్తుంది. వాననీరు తాగి ఆ బయలంతా పచ్చగడ్డి చిగిర్చి రత్నకంబళి (తివాచి)లాగ అయింది. ఎండ ఆ పచ్చిక బయలు మీద నాట్యం చేస్తూంది. అక్కడే ఎదురుగా వానకాలపు మురికినీటి కడలి గర్జిస్తూంది. ఇదంతా చూస్తూ పార్వోతి అక్కడే నిలబడిపోయింది. ప్రకృతిసౌందర్యంతో అందామా? పాపం! ఆమెకు ప్రకృతిసౌందర్యవ్యామోహం ఎక్కడినుంచి వస్తుంది? ఆ సముద్రం, ఆ నదీముఖం, ఆ నది, ఆ ఇసుకదిబ్బ—ఇవన్నీ ఆమె జీవితపు ప్రతినిమిషపు తొడవులు. వాటి కొక చెలువం వుంది - అనేది ఆమె ఎరిగినదికాదు. అయినా ఆ సమయానికి, ఆ క్షణానికి ఆమెమనస్సు పొంగివచ్చినట్టు కనిపించింది- కారణం గోపెమ్మ తనకు దొరికిన స్వాతంత్ర్యంతో ఆ మైదానంలో లేడూడవలె సంతోషంతో దూకులాడుతూంది! తోకఎత్తి పచ్చిక మేయడంకూడా మాని, ఇక్కడినుంచి అక్కడికి తిరుగాడుతూంది. దానిపొంగుకు ఉత్సాహం పొంది తక్కిన రెండు ముదిగొడ్లూ మనసార పరుగులెత్తుతున్నాయి. పార్వోతి నవ్వింది—'పీటికి వెర్రి! గోపీ, ఎండ విడిచినప్పుడు, వంతెన విరిగినచోటే స్నానం అన్నట్టు పచ్చి గడ్డి నోటపెట్టడానికి మారు ఎగుర్లాడుతారా? వర్షం వస్తే!' అన్నది. ఆ మాటల అర్థం గోపెమ్మ మనస్సుకు తట్టిందో ఏమో! ఆటలాడడం మాని, పచ్చిక కొరకడం ప్రారంభించింది. ఏమి ఆత్రం! ఆ కళ్ళ ఆనందం, పొలుపు ఏమిటి? ఆరునెలలపాటు ఎండుగడ్డి కొరికికొరికి వుండిన ఆ గోపెమ్మకు ఆ పచ్చికమేత, విందుభోజనం అనిపించివుంటుంది. గోపెమ్మ ముదిచెలులు పచ్చికను కరవజాలనివి, పళ్లు రాలిపోయి ప్రతికబళమూ తినడమంటే అంత ప్రయాస. అయినా, అవీ ఎంతో సంతోషంతో మేయసాగినాయి.

ఎండ చురుకుగానే వుంది. పార్వోతి మొదటో మునుపటిలాగే తలమీద చేయి పెట్టుకొని నిలబడితే చాలుననుకుంది; కాని, కొంతసేపటికి పక్కకుజరిగి, పొన్నచెట్లనీడకు వచ్చింది. 'అబ్బ మబ్బువిడిచిన ఎండే' అనిపించింది. చెట్లనీడలో మేసే పశువులనుచూస్తూ కూర్చుంది. ఊరికే కూచునివుండడం అంటే, కిట్టని ప్రాణం; అందువల్ల అటూ ఇటూ బయలుదేరింది. తనచీర ఒడిలో ఒక్కొక్కకాయినే ఏరివేస్తూ పోగా ఒడి నిండిపోయింది. 'అయ్యో. ఈపాటికాయలను ఏరకుండా వదలేవారుంటారా?' అని తన మరుపును తానే కపించుకొంది. ఒడి వగిలిపోయేంత కాయలునిండగా, అక్కడే ఒకచోట రాశి పోసింది. ఈ పెద్దరాశినిచూడగా, తెలకలవాని జ్ఞాపకం వచ్చింది. ఆ సంవత్సరం జమచేసినకాయలను నూనెకోసం గోవిందమేనియనుకు ఇవ్వలేదు. ప్రతి ఏడు ఆమె, సరసోతీ చేరి అరహాడ పొన్ననూనెకు అయ్యేంత పొన్నకాయలు జమ చేసేవారు, ఇప్పుడు దొరికినకాయ జమ చేస్తే, అంతనూనె ఈ సంవత్సరమూ ధారాళంగా కావచ్చు. వానకాలానికి ముందుగానే ఆ కాయను పగులగొట్టి ఎండకు వేసివుంటే, మేనియనుకు తక్షణమే ఇవ్వవచ్చునయివుండేది.



'ఆహా, మంచిమరపే నాది! గబాలున లోపలినూనె ఖర్చయిపోతే, దేవునిదీపం ముట్టించేటప్పుడు జ్ఞాపకంవచ్చి, ఎవరెవరినో వేడుకొనేప్రసంగం వచ్చేది కదా' అనిపించింది.

వాళ్ళయింట్లో - దేవునిదీపం మాత్రం ఒక్కటే కాదు. ఇంటి స్తంభందీపం, సెమ్మె, చేదీపం - ఇవన్నీ పొన్ననూనెతోనే వెలగాలి. తన మరపుతో ఇంటిదీపాలు వెలుగకుండా అయ్యేదికదా అని తోచి, తానొక్కతే అపరాధిని అనేటంత వ్యధ కలిగింది. తన్ను తిట్టుకొని 'ఎందుకో ఏమో - నా మరుపే; దినదినానికి హెచ్చిపోతున్నది' అనుకొన్నది. మరుసటిదినమే దానిని తానే గానుగమేనియనికి అందజేయాలని నిర్ధరించుకొంది. 'అయితే, ఎండకు వేయని పొన్నకాయలనుంచి నూనె సరిగా వచ్చీనా? ఎండ ఇంకా వచ్చేదెప్పుడు? ఈదినం వచ్చినట్టువస్తే అయ్యేని' అని ఏమేమో ఆలోచించింది.

పొన్ననూనె తపస్సులో పొద్దు తిరిగింది. ఆమె ఈ యోచనలో ఒక జాముపొద్దయినా గడపివుంటుంది, ఒక్కసారిగా కలనుంచి మేల్కొన్నట్టు 'గోపి, చాలు మేసింది....ఏ, ఏ, కెంపి, చెంపి, ఇంటికి రాండి' అని కేకవేసింది. అవీ వచ్చాయి. వాటిని తోలుకుంటూ పార్వోతి ఇంటికి బయలుదేరింది. వసులకొట్టం చేరి, దాంట్లో వాటిని కట్టివేసిన తర్వాత, 'వదినా, నా అగ్గిపెట్టిన జ్ఞావకం చూచావా? పొన్నకాయలు గోవిందునికి ఇయ్యనేలేదు. ఈ సంవత్సరం నూనె అక్కరలేదని అనుకొన్నానో ఏమో?' అన్నది. ముంగిట్లో అప్పళాలబానను దులిపివేస్తున్న సరసోతి 'నీకు జ్ఞాపకం లేకపోతే ఏమి? నాకు జ్ఞాపకం వచ్చి, వాడిని పిలిపించి యిచ్చాను. బాడవకుపోతె మరొక కళసెకాయ దొరకవచ్చు. ఈ దరిద్రం వానవల్ల నేను ఆ వైపే వెళ్ళలేదు' అన్నది.

ఇద్దరూ ఇంటిముంగిట్లో కలుసుకొన్నారు. 'వదినా, ఒక కళసెకాయ కావచ్చు. జమచేసి అక్కడ రాశివేసివచ్చాను. ఇప్పుడు పెద్దబుట్ట తీసుకొనివెళ్ళి తెస్తాను' అన్నది.

'నా అప్పడాలపని ముగుస్తూవచ్చింది. నేను ఆవైపు వెళ్ళనేలేదు. ఈనాడైనా వెళ్ళి వస్తాను. వచ్చేటప్పుడు పొన్నకాయ తెస్తాను. భగవంతునిదయవల్ల ఒక్క ఎండయినా బాగా కాచిందికదా! రెమ్మలు ఎండకపోయినా, ఆకులు గరగర అయ్యాయి. రెమ్మలు కొమ్మలకు ఇంకా ఒక ఎండ కాయాలి. రేపుకూడా ఎండవస్తే బాగుండును' అన్నది సరసోతి. 'రేపు రానీ రాకపోనీ, ఇప్పుడు వచ్చినందుకు నాలుగునాళ్లు కన్నీళ్లు తప్పాయికదా. అంతే ఉవకారం' అనిపించింది పార్వోతికి.

సరే—పార్వోతి ఎండబెట్టిన రాలినఆకులను, గడ్డిగాదంను ఒకవైపు రాశి చేయసాగింది. సరసోతి పెద్దబుట్ట పట్టుకొని బాడవలోని పొన్నచెట్లగుంపువైపు వెళ్ళింది.

పార్వోతి వంటచెరుకును రాశిచేసి వసులకొట్టం చావడిమీదికి తీసుకొనివెళ్ళి పోవేంతలో సందె అయింది. పశువులకోసం కుడితినీళ్లు, అక్కచ్చు ఉదయమే ఉడికించడం అయింది. వాటినే కొంచెం దబరాముంచి పశువులముందున్న తొట్టెలో పోసివచ్చింది.

ఇక్కడ-బాదవకు వెళ్లిన సరసోతికి మైదానంమీది పచ్చికబయలుచూచి మనస్సుకు ఉల్లాసమైంది. 'కాయలు వదిన రాశిచేసి పెట్టింది. నాకు పనేముంది? నేను రాలిన ఆకులనన్నా ఊడ్చి జమచేస్తాను. అవీ ఎండకు పసందుగా ఎండాయి' అని ఆలోచించింది. చెట్ల వచ్చి కొమ్మలతో ఒక చీపురులాగకట్టి రాలిన ఆకులు ఊడ్చింది. 'కూర్చున్నచోటే, మూడు పెద్ద బుట్టల రాలుటాకు లయాయి' అని సంతోషపడింది. బుట్టలో పొన్నకాయలు నింపుకొని, ఇంటి చావడిమూలలో పోసి, వట్టిబుట్ట తీసుకొనివచ్చి, రాలుటాకులు నింపింది. ఒత్తి ఒత్తి, కాళ్ళతో మెట్టిమెట్టి నింపి ఇంటికి సాగించితే, ఆమె అమ్మతపు నాలుకలాగే, మూడుబుట్టల రాలుటాకులు సమంగా అయాయి.

ఇంటికి వచ్చి, 'పారోతీ, చూడు. ఇంత రాలుటాకులూ కుళ్ళి మన్నయిపోయేవి కదా!' అన్నది సరసోతి.

సాయంకాలం చావిట్లో దీపం తెచ్చిపెట్టేటప్పుడు, పారోతికి మళ్ళీ పొన్ననూనెదే జ్ఞాపకం. మరదలిని పిలిచి, 'వదినా, పొన్నకాయను మేనియనుకు ఇచ్చానన్నావు కదూ?' అని అడిగింది.

'ఔను.'

'వాడు నూనె తెచ్చియిచ్చిన జ్ఞాపకం రావడంలేదే?'

'నూనె నెమ్మదిగా తెస్తాడు. వాడిపని వాడు చేశాడు. ఇక మనకు నూనె కావలసి వచ్చినప్పుడు వాడికి జ్ఞాపకంచేస్తే సరి. గోవిందునివద్ద నూనె ఉంటే ఏమి? మనవద్ద ఉంటే ఏమి? రెండూ ఒకటే కదా?'

'నేనన్నది అదికాదు. ఇంట్లో వాడకానికి తగినంత ఉందా అని?'

'అర్ధ 'బెళె'కూ ఎక్కువగానే వుంది. పదిహేనునాళ్ళన్నా రావచ్చు. కాకపోతే, ఈ గాలికి మూడు మూడుదీపాలు వెలిగించి చేసేదన్నా ఏమిటి? ముత్యాలుపోసి ఏరవలసి వుందా?'

పారోతిమనస్సు చులకనయింది. పొన్ననూనె మహాసమస్య తీరింది. ఆమె గోపెమ్మ పాలుపితికి వచ్చింది. దేవునిదీపం వెలిగించడం అయింది. పగటి మురికిమైల కడుగుకొనడానికి మరొకస్నానం చేయాలి, ఇద్దరూ చెరువుకు స్నానంకోసం వెళ్లారు. ఇంకా మబ్బులు చేరినట్లు లేదు. గాలి వేడిగానే వీస్తున్నది. చన్నీటిలో మునగడం ఆనందమే ననిపించింది. ఇద్దరూ ఒళ్ళు రుద్దుకుంటూ గొంతుబంటినీటిలో నిలబడి మాట్లాడడం మొదలుపెట్టారు. రాత్రి వంట కావాలా, వద్దా?-అనేది ముందువిషయం. పారోతి, 'నీకేమో ఎలాగూ భోజనం లేదు. నాకూ అంత ఆకలి వున్నట్టు కనిపించదు. మధ్యాహ్నం అన్నం ముద్ద అయినందుకో ఏమో!' అన్నది. ఆమె మాట ముగించకముందే, మధ్యనే సరసోతి అడ్డువచ్చి, 'ఔను-నీవు అలా వుపవాసం వుండే, ఇలా ఎండి పుల్లకావడం!' అని వంగించింది. 'నీ మొగుడు



అక్కడ ఊరికే వుండలేదు. పాయసం పరమాన్నం పోయించుకొంటున్నప్పుడు నీవు ఒక్క గంజైనా ఉడికించి తినరాదూ? వండడానికి వేసట అయితే, మధ్యాహ్నం ఒక పిడికెడు బియ్యం ఎక్కువగా వేసివుంటే, నీళ్ళన్నమైనా తినవచ్చునై వుండెకదా? ఎండిన ఉప్పుగాయ వుంది. నూనె ఉప్పు వేసుకొని తింటే, రుచికి రుచీ కాదూ?' అన్నది.

పారోతి సాధారణంగా భర్త సమారాధన భోజనానికి వెళ్ళినదినాలంతా ఆపనే చేసేది. అయితే, ఇప్పుడు వానకాలం. 'వదినా, ఈ దరిద్రపువాన గాలి వీచేటప్పుడు నీళ్లన్నం నోట్లో పెట్టుకుంటే, పేగులు కత్తిరించుకొనిపడ్డట్టు అవుతుంది. ఎండకాలమైతే అది చలవ. నిజం.'

నిజమే. సరసోతికి తన చిన్నప్పటిదినాల జ్ఞాపకం వచ్చింది. తన కుంకుమ చెరగిపోయినప్పటినుంచే ఆమె రాత్రిపూట భోజనం మానివేసింది. ఆనాటినుంచి నీళ్ళలో వేసిన అన్నం గుర్తు మాసిపోయింది. పారోతి కష్టంచూచి, 'నీబుద్ధికి చిచ్చుపెట్టిరి. నీకు అలసట అయినట్టు తోస్తుంది. వీవు నెమ్మదిగా స్నానంచేసి, శివా శివా అనుకో. నేనువచ్చి వంట చేస్తాను. మధ్యాహ్నపు పులుసు మిగిలిందా?' అని అడిగి తొందరగా స్నానం ముగించి చెరువుగట్టు ఎక్కింది.

'వద్దు వదినా. నీకెందుకు ఉపద్రం....పులుసూ మిగల్లేదు. నాకు పుల్లమామిడి పండ్లు అంటే ఇష్టం కదూ. అవీ, దోసకాయలూ వేసి పులుసు చేశాను. నోటికి రుచి అయింది. ఒకపిడచ జాస్తిగానే తిన్నాను. అప్పుడు పొట్ట నొచ్చింది. ఏమిటికి ఇలా అవుతున్నది అని ఆలోచిస్తూవున్నాను. ఇది మామిడిపళ్ళ పేచీ' అని మాట ముగించేలోపుగా, సరసోతి ఎక్కడున్నది? ఆమె ఇంట్లో పొయ్యి రాజవేసి, ఎసరుపెట్టింది. పారోతి ఒళ్ళు తోముకొని స్నానం ముగించి, అటూ ఇటూ రెండడుగులువేసి, ఎండినబట్ట వెదికేటప్పుడు, సరసోతి 'వ్యంజనం ఏమిచేయను?' అని ఆలోచిస్తున్నది. పారోతి ముంగిట్లోనుంచే మరదలిని పిలుస్తూ, 'గొజ్జు-గిజ్జు ఏమీ వద్దు. ఎండు ఊరగాయ వుంది, నేనున్నాను' అన్నది. 'అంతేమి దరిద్రం వచ్చింది నీకు? ముడి మామిడికాయ వూరగాయ వుంది కదా! జాడీమూతకూడ ఇంకా తీయలేదు' అన్నది సరస్వోతి. ముడి ఊరగాయ ఆ వేసవికి కొత్తగా వేసినది. జాడీ నోరు విప్పలేదనడమూ నిజమే. అందువల్లనే అది తనకు వద్దూ అనిపించింది. 'వదినా, వారికంటేముందు దానిని నేను రుచి చూడాలా?' అన్నది. 'నీ శాస్త్రం పాడుగాను. వాడు ఎన్ని ఇండ్లలో కొత్త ఊరగాయ రుచిచూచాడో? పోనీ. వుడికించిన మామిడికాయల గొజ్జు చేయనా?' అన్నది సరస్వతి.

'హా!' అన్నది పార్వతి. మరుక్షణమే మధ్యాహ్నం తిన్న మామిడిపళ్ళ పేచీ జ్ఞాపకంవచ్చి, 'వద్దు వదినా, ఏమీ వద్దు. మధ్యాహ్నపు మామిడిపండ్లే పడలేదు. ఇప్పుడు తిరిగీ మామిడికాయల గొజ్జు తింటే, వేడి అయ్యాని!' అన్నది.

సరసోతికి దిగ్భ్రాంతి కలిగింది, ఏమీ తోచలేదు. 'ఏమీ చేయడంవద్దని చివరకు వట్టి అన్నం, ఎండు ఉప్పుగాయ తినడమే దీనితలరాత. అన్నకు వేయిసార్లు చెప్పాను-నీ గోపి

పట్టిపోయింది, ముసలిదికూడా అయింది. పైరినుంచి ఒక నాల్గు సిద్దెలయినా పిండే గేదె తీసుకురా మహారాజా. ఒకింత మజ్జిగనీళ్ళయినా కనవచ్చు అన్నాను. వాడికేమి, పోయిన యింట్లో పెరుగుదొరికితే చాలు. పాలు, పెరుగు లేక పార్వతి ఎండి పుల్లయింది అంటే నమ్మడమే లేదు' అని అనుకొంది. ఈ యావత్తు ఆత్మగతాలు పార్వతిచెవిని పడ్డాయి. 'వదినా, నీవు వూరికే వారిని తిట్టడం ఎందుకూ? నాకిక మజ్జిగనీళ్ళుతాగి స్వర్గం చిక్కాలా?' అన్నది. ఆమె మనస్సు మజ్జిగనుంచి, సంతానాభావానికి ప్రవహించి, కన్నీళ్ళలో పర్యవసించింది. సరస్వతి, ఇలాటివిషయాలలో అభిప్రాయం అడిగి ప్రయోజనంలేదని, ఒకిన్ని వడియాలు గరిటెలోనే వేయించింది; రెండు కారపు మినప అప్పళాలు కాల్చింది. జపంచేస్తూ కూచున్నప్పుడు, ఎసరుపెట్టిననీళ్ళు ఉడుకెత్తింది. ఇద్దరూ, 'శివశివా, ఓం నమశ్శివాయ' లను ముగించి చేతుల్లోని జపమాలలను తిప్పేవేళకు వంట ముగిసింది. సరస్వతి పార్వతిని పిలిచి 'గిన్నెలు పెట్టు. ఈ వంట ఒకపనా? కర్రలు పయినంగావుంటే క్షణంలో వంట అవుతుంది. ఇప్పుడుచూడు. ఒక్క గడియన్నా పట్టలేదు' అన్నది. పార్వతి మరదలిదయను తలుచుకొంటూ భోజనానికి కూర్చుంది. మరదలు అప్పళాలు, వడియాలు వేయించి పెట్టడం వల్ల భోజనం చేద్దామనే ఆత్రం పుట్టింది. గిన్నె పెట్టుకొని, అన్నం వడ్డించుకొని, చూస్తుంది కదా-మరదలు మూడు మూడు అప్పడాలు కాల్చిపెట్టింది. వాటిలో ఒకటి, మరొకటి సగం విరిచిపట్టుకొని, వాటితలమీద నాల్గు వడియాలుపెట్టి, ఎడమచేత్తో ఒకగిన్నె నీళ్ళు పట్టుకొని వెలుపలికి వచ్చింది.

సరస్వతి జపానికి కూర్చున్న చావడిలో దీపంలేదు. ఆ చీకట్లోనే ఈమె అడుగుల చప్పుడు విని ఆమె 'పార్వతీ, ఇంకా భోజనానికి ముహూర్తం రావాలా?' అన్నది. సమాధానంగా ఈమె 'వదినా, నాకేమిటి మూడు మూడు అప్పళాలు తినడానికి దయ్యం పట్టిందా? ....ఇదిగో, ఒక అప్పళమైనా తిను' అని దానిని ఆమెముందుపెట్టి వెళ్ళిపోయింది. ఆ అప్పళం ఈమె జపం ముగిసేవరకు అక్కడే వుండవలసివచ్చింది. సరస్వతి ప్రతిరాత్రీ అష్టోత్తరసహస్రం, పంచాక్షరీజపం చేయకుండా పడుకోదు. ఇప్పుడు అప్పడంకోసం వ్రతభంగం చేయడం అయ్యేనా? ఆ జపం ముగిసేటప్పటికి పార్వతి భోజనంఅయి, నేల ఊడ్వడమూ ముగిసింది. వంటింటిదీపం వెలుపలికి వచ్చింది. 'ఇంకా అప్పడం తిననే లేదా?' అని అడిగింది ఆమె. 'జపం ముగించి తిందాము అని కూర్చున్నాను', అన్నది సరస్వతి. జపమూ పూర్తయింది. సరస్వతి మళ్ళీ అప్పడం సగంచేసి, ఆ నగం అప్పడం పార్వతితో తినిపించనే తినిపించింది.

రాత్రి చల్లగాలి వీచుతూంది. వానమబ్బులు విసురుగా తిరుగాడుతున్నాయి. వాటిలోనే శేతచంద్రుడు ఆటలాడుతున్నాడు. ముంగిట్లో వెలుగు గంతులువేయడంచూచి సరస్వతి— 'వదినా, దీపం ఎందుకు మన్నుకొట్టుకోను? వెలుపల వెన్నెలవెలుతురు ఉంది' అంటూ దీపం శాంతంచేసి, కంబాలకు ఎదురుబదురుగా జేరబడి ఆ సంవత్సరం కూరగాయల పంటను గురించి యోచనచేశారు. 'వదినా, ఈ సంవత్సరం నాటినకూరగాయల విత్తనాలు ఏవీ బతక



లేదు. ఈ దరిద్రపువాన ఏకసమంగా కొట్టి, ఎదిగివచ్చినమొక్కలూ కుళ్ళిపోయాయి. ఇంకోసారి విత్తనాలమడి చేద్దామంటే విత్తనాలు ఇచ్చేవాళ్ళెవరు? బెండవిత్తనాలు ఎంత బాగా మోసులెత్తాయి?' అన్నది పార్వతి.

'ఔను అంటాను. దోసకాయ ఇంకా ఎన్నాళ్లు వచ్చిని? మహావస్తే ఇంకొకనెల. ఇంకా కొత్తవిత్తనాలు విత్తి, మొక్కవచ్చి, కూరగాయలు కాచడానికి చవితిపండుగ దాటుతుంది. అంతవరకు ఏమిటి ఉడికించాలి?'

'కూరగాయలులేవని నిత్యమూ అప్పడాలు, వడియాలు, ముడి మామిడికాయ ఊరగాయ తీసినా కోపగించుకుంటారు. అలా అని కొబ్బరికాయ తురిమివేసి, ఏదైనా ఆవవేసిన పచ్చడి, పెరుగుపచ్చడి చేస్తే - కొబ్బరికాయలు పూర్తిగా దించేసేయి. తోటలోనిచెట్లు విరిగిపోయి,-దిగేకాయలూ అంతకంతే. దానిలోనే భోజనానికి కావాలి. నూనెకూ కావాలి. పెద్ద పనులకూ కావాలి—అంటారు.'

'ఔను. మా అన్న పనులన్నీ అలాగే. నోటికి రుచి కావాలి. ఇవాళ చేసినపదార్థం రేపు చేయగూడదు. తెచ్చివేయడం వుండనీ, లేకపోనీ, నడిచేక్రమంమాత్రం ఒకే సమంగా నడవాలి.'

'నిరుడు మనకు అతీ బుద్ధి అయింది చూడు వదినా. మన దిగువమడిని బీడు పెట్టడానికిబదులు నువ్వులైనా విత్తివుంటే, ఒకటి రెండు 'బేశెల' నూనెఅయినా వచ్చేది. దానికి వాడు వద్దు అన్నాడు. ఇప్పుడు టెంకాయనూనె ఖర్చయితే, బొబ్బలుపెడితే ఏమిటి అయ్యేది?'

అలాగే మాట్లాడుతూ మాట్లాడుతూ, పగటి అలుపుతోవస్తున్న నిద్రమత్తుతో గొంతు తగ్గుతూ వచ్చి ఆమెమాట ఈమెకు వినబడదు; ఈమెమాట ఆమెకు వినబడక, అలాగే కూర్చున్నచోటే పక్కకుఒరిగి పడుకొన్నారు. నిద్రా పట్టింది. అంతలోనే ఐతాళుల నోటినుంచి ఎప్పటి పద్ధతిప్రకారం ఆవరణవాకిలి దాటేటప్పటి 'సాంబశివా' అని వినబడింది. ముంగిట్లో కాళ్ళు దబదబాకొట్టి ధూళి జాడించుకొన్నారు. గొడుగు, ధావళి చావిట్లో పెట్టి, చెరువుకుపోయి కాళ్లు కడుగుకొనివచ్చి, 'ఏమిటి నిద్రపట్టిందా? ఒక్కదీపం వెలిగించకూడదూ?' అన్నారు.

పార్వతికి దడాలున హెచ్చరిక అయింది. 'వదినా, వచ్చారని అనిపిస్తుంది' అని దీవం వెలిగించుకొనిరావడానికి వంటయింట్లోకి పోయింది. సరస్వతి 'ఈ చీకట్లో ఏరుదాటి ఎందుకు రావాలి? వరదనీటితో ఆటలా?' అని అన్నతో అన్నది.

'ఎక్కడి చీకటే! వెన్నెల సొంపుగా వుంది. అంతేకాక, కన్యాణపు సుబ్రాయగారు తోడున్నారు. ఆయన ఈదినం వంతకదా. కుందాపురం వెళ్లారు. కోటపేటలో తగిలారు; ఇద్దరమూ విసవిస చేతులు విసురుకుంటూ నడిచాము. వీళ్ళు అంతేమీ తగ్గలేదు. పగటిలాగే

వుంది. వచ్చేనీళ్ళు చేరివుంటాయి. ఇంకేమిటి? తెల్లవారికి దిగీని! వాన ఆగి రెండుజాములు కాలేదూ? నీళ్ళు దిగిపోయాని—'

'నీళ్ళు చాలావున్నాయి అంటావా?'

'నీళ్ల నీళ్లే! ఉండవచ్చు. దాన్నంతా ఎవరు మూరవేసి కొలిచినవారు? నా ధ్యానమంతా సుబ్రాయగారి మాటలపై వుండినది. సరసోతీ, మన సుబ్రాయగారి చెల్లెలు లేదూ? ఐరోడుకు ఇచ్చింది, ఇప్పుడు అశనార్థంమీద (భరణంమీద) అన్నయింట్లో వుందికదా, దాని బిడ్డ పేరేమిటి? అదెక్కడుంది? ఇక్కడుందో, అక్కడ ఐరోడులోనో—అది చిన్న వేలెడంత బొటికగావున్నప్పుడు చూచినజ్ఞాపకం, దానికి పెళ్ళంట?'

'అది వేలెడంత బొటికా ఏమిటి? ఆ సాయిత్రిపడుచుకు పదేళ్ళు విండాయి. వచ్చేవంటకు పది పూర్తయి పదకొండవుతుంది. ఇంకా పెళ్ళి అంటే, సమర్తాదినతర్వాత చేయడమా? అయితే, ఆ పడుచూ అంటే పసిడిబంగారం! దానిముక్కు ఎంతసొగసు! కళ్ళు ఏమిలక్షణం! పాపం! చిన్నప్పుడే, తండ్రిపోయి కంగారైంది. అయినా, ఈ అమ్మ, తాత కలిసి ఎట్లాగో పెంచి పెద్దచేశారు. దానికిప్పుడు పెండ్లా? కానీనప్పా, దేవుడు మంచిచేయనీ, ఎక్కడి పిల్లవాడు?'

'పిల్లవాడు ఎక్కడివాడో అన్నారు: మరచేపోయాను.'

'హాఁ! మీ జ్ఞాపకమూ చాలు, మీరూ చాలు' అన్నది దీపంపట్టుకొనివచ్చిన పారోతి. ఐతాళులు కుచేష్టకు 'మీ ఆడవాళ్ళకు బెండకాయనుంచి బెండుకమ్మలవరకు. జ్ఞాపకమే.... మాకు మగవారికంతా అలాగా ఏమిటి?' అన్నారు. అంతలో ఆయనకు పిల్లవాడియిల్లు జ్ఞాపకం వచ్చింది....'చూచావూ: పారంపళ్ళి లచ్చుమయ్యరు కుమారునికట. వారికి వుండేది ఒకే ఒక పిల్లవాడు, వీళ్ళకు ఒకే ఒక పిల్ల. పిల్లవాడు సాధారణమైనవాడేమీ కాదు. పది 'ముడి' మడి వుంది. లచ్చుమయ్యరు పదిముడిమడి స్వంతసేద్యం చేస్తారు. అందువల్ల భోజనానికి కరువులేదు. అంతేకాదు, చూడూ—పారంపళ్ళికి పిల్లని స్తే-భోజనానికి మోసంలేదు. అక్కడిమన్ను అలాటిదే; ఎలాటి కరకుఎండకాలమైనా, ఉలవలపప్పు ఆవడె (చేదు బీరాకు) కూరలకు కరువుకాలం లేదు' అన్నారు. కందిపప్పు సంవత్సరానికి రెండుసార్లుచూచే ఐతాళులగ్రామంలో—పప్పుచేస్తే పెసరపప్పుతో చేయాలి, పెసరపప్పేమో దేహానికి చలవ. నిజం. కాని, నోటికి అంత రుచికాదు. అందువల్ల మన్నన ఉలవపప్పుకు చిక్కడంలో చోద్యమేమీ లేదు.

పెళ్ళిప్రసంగంలో ఐతాళులజ్ఞాపకం రేవటికి పాకింది. 'ఔనే, సరసోతీ, నీవూ పారోతి పడుకోండి; నేను తత్‌క్షణం మన సూరణ్ని చూచివస్తాను. రేపుఉదయానికి మడిలోనినీరు దిగేటట్టయితే, అదొక మడి దున్నివేయి అంటాను. వాపిమడి ఇంకా కిందిది కదా! దానినుంచి ఒకేమారు నీరు దిగిపోదు. మన మడి వాడు దున్నిపెడితే, నాట్లు ఎట్లయినా ఐరి



పించవచ్చు. ఆ మీదట ఊరివారి దుక్కి, నాట్లు ఒకేమారు ప్రారంభమయాయి అంటె, మనను ఎవరు అడుగుతారు? ఒక్కమనిషయినా పనికి దొరకడు' అన్నారు. సూరప్పయిల్లు వుండేది అక్కడికి అరమైలుదూరంలో, వాడికి ఆ రాత్రికిరాత్రే తాఖీదుయిచ్చి రావడానికి ఐతాళులు బయలుదేరడానికి సిద్ధమయ్యారు. ఆయన బయలుదేరగానే, సరసోతి-'అన్నయ్యా, నీకేమిటి వెర్రా, చాదస్తమా? అర్ధరాత్రి నీవు పోయి సూరణ్ని పిలవడం ఏమి పాడుపనికి? అదిన్నీ సూరప్పనా? పొద్దు మునిగేటప్పుడు కల్లుతాగి పడుకున్నాడంటే, పొద్దు పొడిచేటప్పుడే లేచేవాడు వాడు. ఇప్పుడుపోయి చెబితే, తెల్లవారేవరకు జ్ఞాపకం వుండవదూ? నేను తెల్లవారుజామున వెళ్ళివస్తాను. సూరని పెళ్ళానికి చెబితే, అది మొగుడిపొట్టకు కొంచెం సద్ది వద్దిచూపి, వాడిని దుక్కికి పంపుతుంది' అని సమాధానపరచింది.

'సరి, అలాగే కానీ' అని అందరూ చాపపట్టారు. నిద్రమధ్యలో ఏదో బొద్దింక తనమీద పారాడినట్టయి పారోతికి మెలకువ వచ్చింది. ఆ మెలకువతోపాటు తనపక్కన పడుకొనివున్న భర్త జ్ఞాపకమూ వచ్చింది. ఆ జ్ఞాపకంతో పగలు తానూ, సరసోతీ మాట్లాడిన దత్తు తీసుకొనేసంగతీ స్ఫురించింది. దానిని ఇప్పుడే, భర్తతో ప్రస్తావిద్దామ అనుకొని, ఆయనవైపు ముఖం తిప్పితే, ఐతాళులు అక్కడవుంటే కదా! 'అయ్యో! ఈయన ఎక్కడికి పోయారు!' అని యోచనచేసేలోగానే, ఆయన అడుగుల దడదడసద్దు ముంగిలినుంచి వినిపించింది. పారోతి పక్కమీదే కళ్ళు నులుముకొంటూ కూర్చుంది. ఐతాళులు వచ్చారు. ఈమెను చూచి, 'నీకు నిద్దర రాలేదా?' అన్నారు. 'ఉదయానికి ఒకపనీ బాకీవద్దు అని సూరనికి చెప్పేవచ్చాను. ఉదయానికి నీరు దిగీని. వచ్చి, దుక్కి దున్నుతాను అని ఒప్పుకొన్నాడు' అని తెలిపారు. 'రేపటెల్లుండి ఎవరెవరి వెట్టిచాకిరీ వుందో, అంతలోపలే తన సాగు ఎన్నడయ్యాని అని ఆలోచన సూరనికి.'

ముఖ్యంగా, ఆ రాత్రి ఐతాళులు చాపపట్టి పడుకొంటే, ఆయనకు ఒకే కలలు. ఊరివారి మళ్లు దున్ని నాట్లయినా, ఆయన పొలాలు అలాగే మిగిలిపోయాయని: ఆయనకు పనివాళ్ళే దొరకలేదు అని. ఆ యోచనలోనే మెలకువ అయింది. మెలకువకాగానే, 'సంశయం వద్దేవద్దు' అని నిశ్చయించుకొని, సూరప్పయింటికి వెళ్ళారు. ఆయనను ముంగిట్లోనే చూచిన సూరని మొరిగేకుక్క మొరగసాగింది. ఆ సద్దుకు ఇంటిల్లిపాదికీ మెలకువ వచ్చింది. ఐతాళులు ఒకవైపు 'ఛూ కుక్కా, వూరికే వుండు' అనడమూ, మరొకవైపు 'ఏయ్, సూరప్పా, పిలవడం వినపడదా?' అనడమూ సాగించారు. చివరకు నిరాశపడి, 'ఈ కుక్కకున్న మెలకువ సూరనికి లేదు' అని తీర్మానించుకొనేటప్పుడు జవాబు వచ్చింది.

అలాగే తమ సందేశం సూరనికి తెలిపి, నిద్రకళ్ళతో తూగుతూ ఇంటికి తిరిగివచ్చి, చాపమీద 'హా-సాంబశివా' అంటూ ఒరిగిపోయారు. ఐతాళులకు విసుగు, వేసట, శ్రమ అయితే, ఇలా 'సాంబశివా' అనడం ఆయన అలవాటు. అప్పుడు భార్య నెమ్మదిగా, 'ఏమిటి విసుగా?' అని అడిగింది. ఐతాళులు మొగం చిట్లించి, 'అబ్బ, నీకు పగలు ప్రారంభ

మైంది. వేసటకు వచ్చిందేమిటి గ్రహచారం! నిద్రకళ్ళకు ఆవలింత వచ్చింది. అంతే కాక, భోజనమూ పొద్దుపోయి అయింది. ఆవలింత వచ్చింది....హూ! పోయి పడుకొని నిద్రపో' అని గదిరించారు. దత్తు తీసుకొనేసంగతి చెబుదామని ఆమె నాలుక చాచింది, అది ఈ బద్ధ స్తీలో అడగిపోయి, 'ఇప్పుడు వద్దు' అని పారోతి నిర్ధరించవలసివచ్చింది. 'అలాగే పడుకుంటాను' అని పడుకొంది. పారోతికి పిలవగానే నిద్ర.

ఇటు ఐతాళులు ఇంటిగోడలపై తూగాడే కొబ్బరిమట్టల ఆర్భాటాన్ని మీరే గొరక ప్రారంభించారు. ఈయనను మించిపోదామనే ప్రయత్నంతో సముద్రపు వానకాలపుమోత ఒకేసమంగా వినబడింది. ఐతాళుల గొరక, టెంకాయమట్టల బరబరసద్దు కడలిమోత మూడూ మేళవించి ఒక జోలపాట అయింది.

# 3

రామఐతాళులు అనుకొన్నట్టే జరిగింది. మరుసటిదినం ఉదయంలోపల ఆయనబయలు
లోని మడిలో హెచ్చుభాగంనుంచి నీరు దిగిపోయింది. వరదా సగానికి సగం దిగి
పోయింది. తెల్లవారుజామున లేచిన సరసోతి ఏటివైపు మొదటవెళ్ళి, వరదనీరు తగ్గి
పోవడం కళ్లారచూచి, అక్కడినుంచి సూరని ఇంటికి యాత్రచేసింది. ఆమె గొంతుకు
సూరనిభార్యకు మెలకువ అయి, ఇంటివెలుపలికి వచ్చి, 'ఎవరు?' అని అడిగింది. 'సరసో
తమ్మ!' 'ఎందుకు వచ్చారు?' అనగానే, సరసోతి తను చెప్పవలసింది చెప్పడమూ అయింది.
సూరని పెళ్ళాం 'అబ్బ, ఈ బ్యామ్మలు ఏదైనా పట్టుకొంటే, పన్ను వసూలుచేసేవాడు పట్టు
కొన్నట్టే!' అన్నది. 'ఎందుకు ఇలా అంటూంది?' అని సరసోతికి ఆశ్చర్యం! అంతలోనే
ఆమె ముందుకు వచ్చి 'మీ అన్నగారు వచ్చి చెప్పిపోయి ఒక నిద్రకూడా పూర్తికాలేదు.
రాత్రికిరాత్రి ఏమి తురతురా? దుక్కిచేయడం తెల్లవారికే కదా!' అన్నది. అన్న రాత్రి
దిగ్విజయం చెల్లెలికి తెలియదు. ఆమె నవ్వి. 'నీవు తిట్టేటంత తిట్టు మహారాణి, ఏమైనా
దుక్కి ఈ ఒక్క ఏడాదికి ముగిస్తే, వచ్చేసంవత్సరం దనక నీ ప్రాణాలు తినము' అన్నది.
ఏమైనా, సూరప్ప మాటప్రకారం పొద్దు పుట్టేటప్పటికి మడి దున్నుతున్నాడు. చలి
గాలి, వానచినుకుల తాళానికి వాడిపని సాగిపోయింది. అయితే, తర్వాత వారి నారుమడి
మంచి వరినారు పీకి తెచ్చేపనిమాత్రం నెమ్మదిగా జరిగింది. సూరని భార్యతప్ప మరే పని
వారూ వారికి దొరకలేదు. అలా అని ఐతాళులు భయపడుతారా? భార్య, చెల్లెలు వెంటరాగా



నారుమడిలో దిగారు. ముగ్గురు ఆడవారూ వానలో తడుస్తూ, నారు తీసి, కట్టలుకట్టి విసిరారు. 'ఇదొక ములాజా' అనుకొని ఐతాళులు దొడ్డికాళ్ళతో నారుమోపును నాటే మడివద్దకు చేరవేశారు. మనసుపుడితే, రామఐతాళునుంచి కానిపనే లేదు. సరే, ఆ సాయంకాలంలోపల పీకినంతనారూ పై మడిలో నాటడమూ అయిపోయింది. ఆ సంవత్సరం వ్యవసాయం చాల గడబిడలో జరిగింది: కారణం ఏమిటంటే, మొదటి పదిహేనుదినాలు వరదనీరు తోసుకొని వచ్చి అందరిపనులూ వెనుకబడ్డాయి. మొదట నారుకు దెబ్బ తగులుతుందేమోనని అందరూ తొందరపడ్డారు. అందరిసాగూ ఒకేకాలంలో జరుగడానికి తగినంతమంది పనివారు లేకపోయారు. ఇలా అయి, నారు పీకడం, నాటడం పనులబరువు సగానికి సగం ఐతాళుల యింటివారిమీదే పడింది. వెలుపలివారంటే—దుక్కికి సూరప్ప, నాట్లకు సూరని భార్య. సూరని భార్య ఋణాన్ని సరసోతి తానేపోయి 'మనిషికి మనిషి' సహాయంచేసి తీర్చనే తీర్చింది. లేకపోతే, సూరనిభార్య, 'అందరి వెట్టిచాకిరిచేసి, ఇంటిమడి పాడుపడింది' అనరాదు కదా, -అందుకోసమని అలా చేసింది.

జ్యేష్ఠమాసం మొదట్లో పెద్ద చెరువులాగ కనిపిస్తున్న పడమటిమైదానం నాట్లు ముగిసినతర్వాత పచ్చవనిమే అయింది. సముద్రపు గాలి, దక్షిణపు గాలి, ఆ విశాలమయిన బయలులో మైళ్ళవరకు పొలాల పసిమిని తెరలలాగ చూపేదృశ్యం; సముద్రాన్నే సిగ్గుపడజేసే దృశ్యమయింది. ఐతాళుల ఇంటిబాడవలో నిలబడిచూస్తే తూర్పుపడమరలు రెండు కనిపిస్తాయి. పడమటివైపు తిరిగితే నిత్యపరిచితమైన కడలి నీలం, నీలపుపచ్చ అయి, గర్జిస్తుంది. దానిఅంచులో నురగలు కక్కుతూ దొర్లాడే తరగలు, తూర్పువైపు తిరిగితే, అంత విశాలమైనట్టు కనిపించే విశాలమైన బయలు, సుయ్యిమని పచ్చని ఆకు తరగలను దొర్లిస్తున్నట్టున్న దృశ్యం.

ఈ సంవత్సరం వానకాలం మొదట్లో కొంచెం ఇబ్బంది కలిగించినా, తర్వాత ప్రతి నక్షత్రానికి-కార్తెకు రైతులు కోరేవిధంగానే కురిసింది. అంతమాత్రమే కాదు. వరదనీరూ చాలా అనుకూలంగానే ఒదిగింది. ఇన్ని సంవత్సరాలకన్నా. ఈ సంవత్సరం మూడింతలు హెచ్చుగా కట్టెలను జమ చేసుకొన్నవారున్నారు. అయితే, ఐతాళుల ఇంటివారు నదీముఖానికి చాల దగ్గరలో వున్నవారైనందున చాల సాహసంతో, సముద్రంలో ముందుకు పోయేట్టు లేదు. నదీముఖానికి తగినదూరంలో వసించేవారి అదృష్టం చెప్పతీరదు. తమకు కట్టెలు మిగులై అమ్మినవారూ ఉన్నారు. తేలివచ్చిన భారీ మోపులను సముద్రంతీరంలోనే దాచి గుట్టుగా అమ్మినవారూ ఉన్నారు. సరసోతికి, పారోతికి అలాటి వ్యాపారపు ఆశ లేదు. యథేష్టంగా కట్టెలు దొరికితే చాలు. అదేమో దొరకనే దొరికింది. వారిప్పుడు కాచుకొన్నది ప్రథమైకాదశికోసం. ఆ ఏకాదశి వచ్చింది. ఊరిలో భాగవతరామాయణ కాలక్షేపాలు ప్రారంభమయ్యాయి. ఆమె యిష్టప్రకారం కథ ప్రారంభించేవారు అక్రూరుడు కృష్ణ బలరాములను కంసుని నగరుకు పిలుచుకొనిపోవడంనుంచే ప్రారంభించారు. ఆసాడి, సోణె (అషాఢం, శ్రావణం) నెలలు ఎలా గడిచాయి అనేది వారికి తెలియనేలేదు.

భాద్రపదం గడవగానే మళ్ళలోని వరికంకులు బంగారురంగై, పైర్లు శరతల్పంపట్టిన భీష్మాచార్యునిలాగ ఒరిగిపోయాయి. కమ్మరియిండ్లో కత్తులకు పళ్లు వచ్చేకాలం. ఆకాశంలో మొయిళ్లు మూగి, ఉరుములు ఆర్భాటం చేయసాగినాయి. రైతులు పొలాలకు పోయేవరకు ఎండ; కత్తివేసి, గడ్డికట్టలు కట్టేలోపునే, నిమిషార్ధంలో కారుమబ్బులు కమ్మి జడివాన, మెరుపులు ప్రారంభం! పగలే చీకటైంది. సముద్రంనుంచి తూర్పుకనుమలవరకు మెరుపు తీగలు వ్యాపించి విరుచుకొనిపడ్డాయి. కళ్లఎదుటే, ఎక్కడ విరుచుకుపడ్డాయి, ఎక్కడి తాటి చెట్లను కాల్చాయి అనే గడబిడ. ఒక్కదినం సరసోతి, పారోతి పొలంలో కోతలకు కత్తి వేశారంతే—వారికి నూరుగజాలదూరంలో ఒక పిడుగు పడింది. వీళ్లు ఒక్కసారి ఒళ్లు జలదరించి మానై పోయారు. చేతిలోనికత్తి చేయిజారి పడిపోయింది. కొంచెం చైతన్యం వచ్చినప్పుడు సరసోతి భయంతో 'ధనంజయ ధనంజయ' అంటున్నది. 'వదినా, ధనంజయ, ధనంజయ అను. వాడే కాపాడాలి' అన్నది. పారోతి దానిని అనుకరించింది. ఆమె తిరిగిచూడగా, బాదవలో ఆరేడు తాటిచెట్లు మండిపోతున్నాయి. మరుక్షణమే యిద్దరూ మడి వదలిపెట్టి ఇంటికి పరుగెత్తారు. ఆదినం మడిలో నిలబడడానికి ఎవ్వరికీ ధైర్యం చాలదు. ఇంటికిపోతేమాత్రం ఒక రక్షణా! ఏమైనా, పోయి గడ్డపార, గొడ్డలి ముంగిట్లోకి విసిరివేసి 'ధనంజయ' జపం ప్రారంభించారు.

సరే. ఆనాటి మొయిళ్ళ ఆట చివరి ఆట అయింది. తర్వాత ఎర్రటి ఎండే. పసుపు పచ్చరంగు పూసుకొన్న పూరిబయలు ఆరేడునాళ్లలో మళ్ళీ నల్లరంగైంది. దిగువమళ్ళలో ఓ ఓ ఓ-రాగం వినిపిస్తున్నది. సూరప్ప ఎడ్లు కాడి లాగుతున్నాయి. ఐతాళుల ఇంటిముంగిట్లో సూరని పెళ్ళాం, సరసోతి, పారోతి తలకు గుడ్డలు కట్టుకొని, ధాన్యం కట్టలు నూర్పిడికట్టకు కొడుతున్నారు. అప్పుడప్పుడు ఉత్సాహంతో 'హొలి ఓడిబా' (పొలి పరిగెత్తి రా) అని కేకలు వేస్తున్నారు. నిజానికి నారంతా కుళ్ళిపోయి, ఈఏడు పంటపోయింది అని ఏడ్చిన ఐతాళుల ఇంటివారు ధాన్యంరాశిచూచి పొంగిపోయారు. 'ఈ సంవత్సరం పది ముడులన్నా (బస్తాలన్నా) ధాన్యం ఎక్కువ రాలాలి' అన్నది సరసోతి. పారోతి 'ఉండీని' అన్నది. ఐతాళులు రేగిపోయి 'ఏమి పాడునోరు మీది? వట్టి పదిముడులు చాలునా! ఒక కోర్జియే! ఎక్కువ కాదూ?' అన్నారు. ఆయనకూ ఆ విషయం తెలుసు. కాని, బహిరంగంగా దానిని ఒప్పుకోరు. అందువల్ల, ఆనాడు ధాన్యం కొలవడానికి తెచ్చిన కళసను, కోలును అలాగే లోపల పెట్టించారు. దీపావళి గడచినతర్వాత ఆయన ఒక్కడే వున్నప్పుడు, ధాన్యం కొలిచి చూచారు. ఇంటి ఆడవారు వెలుపలికి వెళ్లడంచూచి కొలిచారు, చాల పసైంది. అయితే ఏమి? పది కాదు; పదిహేను కళసల ధాన్యం ఎక్కువ రాలింది- ఇంటికి సరసోతి, పారోతి తిరిగివచ్చేవేళకు ఈయన కొలవడం పూర్తయింది; 'ఏమిటి? నిరుడు వచ్చినంతైనా వచ్చిందా?' అని సరసోతి అడిగింది. మీ ముక్క (ఓటి) నోటిమూలాన రెండు కుండలు తక్కువ దిగింది' అన్నారు ఐతాళులు, 'ఒక కళన 14 సేర్లు. మూడుకళసలు ఒక ముడి. 42 ముడులు ఒక కోర్జి.



సరసోతిమాత్రం తక్కువ తిన్నదా? ఐతాళులు ఎక్కడో వెళ్ళినరోజు, తానే ధాన్యాన్ని కొలిచింది. పారోతి సహాయం వచ్చింది. తన ఊహ నిజమని రుజువు చేసుకొంది. 'అబ్బా! అన్న చూడు; ఇంటివారితోకూడ అబద్ధమాడుతాడు. వస్తే వదుల్తానా? నిలబెట్టి అడుగుతాను. మేమేమో చాకిరీ చెయ్యాలి? ధాన్యం ఎంత అయింది అనికూడ చెబితే తప్పా? పారోతి గడ్డిమోపులు ఎంచుకొనేప్పుడే మూడువందలమోపు లెక్కువ వచ్చాయి అని తెలుసుకుంది. కానీ ఈ అన్న చెప్పలా?' అనుకొంది సరసోతి.

'మనకు ఆ ఎక్కువధాన్యం వచ్చిందని తెలిస్తే, ఎవరివద్దనైనా గుట్టు బయట పెడతామేమో అని భయంలే!'

'సరే ఎలాగూ ఇప్పుడు తెలిసిందిగా!'

'ఈసారి గింజలున్నాయి-కావలసినగడ్డి పడిందికూడా. ఆ కొండపొలంకూడ పండాక తప్పకుండా ఒక గేదెను కొనాలి.'

'నువ్వేమో నా కోసమని, గేదె కొనాలని ప్రోత్సహించకు, నే నింక పాలు, వెన్న, మజ్జిగలు తిని పెద్దగ కానక్కరలేదు.'

'పోనీలే. వాడైనా మజ్జిగ వేసుకుంటే ఏమైనా చిక్కిపోతాడంటావా? మనం తినటానికికూడ లేకుంటే ఎందుకీ సిరిసంపదలు?' అన్నది సరసోతి.

ఐతాళులఇంట్లోనే గాదు; కోతలసమయాన మైదానం, పొలం, ఎక్కడ చూచినా ఉత్సాహం, ఉల్లాసమే! అందరికీ చాలమట్టుకు మంచిపంట చేతికొచ్చింది. వానలు ఆగినప్పటినుండి పదిహేనుదినాలదాక ఏ కళ్లంలో చూచినా 'పొలియో, పొలి రారా, పరుగెత్తి రారా!' అనేకేకలే వినబడ్డాయి. ప్రతిఇంటి ముంగిట్లో గడ్డికట్టలు కొట్టేచప్పుడు, మోపులు వేసే చప్పుడు, ధాన్యం నెరిపి, కుప్పలువేసే సందడి, మంచెలుకట్టే సందడి, వాములువేసే సందడి అంతాచూస్తే, ఆ సంవత్సరం దీపావళి కొత్తపుంతలు పుచ్చుకొంటుందని, కొత్తకళ లీనుతుందని స్పష్టమైంది. ఎటువంటి మొండిబాకీల కొలుదారైనా ఈసారిమాత్రం ఏమాత్రం బాకీ పెట్టడని ప్రతి స్వంతదారుడు సంతోషించాడు. కాని ఐతాళులు, సూరడు, సుబ్రాయ ఉపాధ్యాయులు ఈ ముగ్గురిని ఎవ్వరడిగినా 'ఏముంది రూపాయకి మూడు పావులాలు మాత్రం వచ్చింది. కాని నష్టంలేదు. మొదట్లో ఆ జడివాన రాకుండవుంటే రూపాయకుపైన ఒక పన్నెండుపైసల పంటకూడ అయ్యేది అని అంటాడు. ఇప్పుడు ఆ వరదతెచ్చినమురికి ఒండుమూలన పంట బాగా పండిందని ఎవరి మనసుకూ తోచదు.

రెండవపంటకు వానకూడ వచ్చింది. సముద్ర గర్జనకూడ శాంతించింది. దానివలన ఇక త్వరగా వర్షం రాదనిమాత్రం సూచన దొరికింది. ఐతాళులు రోజూ ఆ బురదతో నిండిన కొబ్బరతోట తనిఖీకి వెడతారు. చెట్లేమీ పడిపోలేదు. దానికిమారుగ కోసుకుపోయిన భాగమంతా మట్టి పూడింది. దానికి ఎదురుగుండా మూడుఎకరాలవరకు ఒండ్రుమట్టి మేట

పెట్టింది. అది ఒక గుట్టగ తయారైంది. దానికిమారుగ ఆ చిన్ననది తనకోపాన్ని దక్షిణం తీరాన చూపింది. కొన్నితోటలు అమాంతం బీడుపడ్డాయి. కొన్నిఇళ్లకూడ మునిగిపొయ్యాయి అని తెలిసింది. ఆ వార్తవిన్న ఐతాళులు 'ఈ వాగుకూడ పిచ్చిదే; ఆ ఒకసారి అయినా తెమలనియ్యదే! ఊరకే పడివుండరాదా?' అన్నారు. తోటలు గమనిస్తూ సగమో, పూర్తిగానో కోతలు, బీటలుపడిన వాటినిగురించి 'అది ఎవరిధి, ఇది ఎవరిది?' అని విచారిస్తారు. అది ఏటప్ప నాయకులది, ఇది సుందరకరణంగారిది అని అందాజు వేసుకున్నారు. తృప్తితో ఇల్లు చేరారు. 'సరసోతీ—నిజమేనే—నిన్న చెప్పానా, మూడుఎక్రాలతోట కోసుకుపోయిందవి-అదేమో నాయకులది, కరణాలది.'

'పాపం! ఎంత పెట్టుబడి ఏటి పాలయ్యిందో ఏమో!' అన్నది సరసోతి కనికరంతో.

'సరసోతీ, వీదంతా పిచ్చిలే! అది వాళ్ల ఎన్నికొంపలు ముంచి సంపాదించారో ఏమో: చూడు ఆకరణం సుందరయ్యగారు చూడు, తూముకు 42 శేర్ల మూటలు అమీన్ దీవులకు ఎన్నడూ పంపలేదు. తూముకు ఏ ముప్పైతొమ్మిదో నలభైయో వేస్తే గొప్ప! 'రంకున పుట్టె జగడాన చచ్చె' అన్నట్లు దండుగ అయిందిలే' అన్నారు.

సరసోతి కోపంతో 'అన్నా నీకుమాత్రం-పుణ్యానికి రాలేదా? పదిహేనుకుండల ధాన్యం ఎక్కువయ్యిందని గర్వం నీలో లేదంటావా? వాళ్ళ తోటపోతే పుణ్యానికి వచ్చెనంటావు? నీకుమాత్రం అన్నీ దక్షిణలు కూడబెట్టిందేగా....' అని అతనిమాటలకు అడ్డుగా చెప్పింది.

ఐతాళులకు చెల్లెలినుండి ఈలాంటి ఎదురుదెబ్బ తగిలి మనస్సు నొచ్చుకుంది. సమాధానం చెప్పాలంటే నోరాడలేదు. మళ్ళీ ఆమాటలే జ్ఞప్తికివచ్చి బాధపడ్డారు. అతనికి ఒళ్లు ఎందుకు మండిందంటే తన చెల్లెలే తనమాటలను నమ్మలేదు. మళ్ళీ ధాన్యంకుప్ప కొలిచిందేమో! లేకుంటే పదిహేనుకుండలైనా ఎక్కువ అని ఎల్లా చెబుతుంది. కాని చక్కగా, సూటిగా ఉత్తరం ఇచ్చేశక్తి లేకుండా 'పడని ముసలమ్మకు ఊరి పెత్తనాలు' అనిమాత్రం అంటూ స్నానానికి వెళ్ళారు. ఆ దినం మితిమీరి జపం, ధ్యానసమాధిలోనే మునిగి కూర్చున్నారు. జపం ఒకసారి తప్పిపోతే మళ్ళీ స్నానం, మళ్ళీ జపం, పదిహేనుసార్లు అలా చేసినా ఎన్నోమార్లు 'గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః' అని పునశ్చరణ చేసినా మనశ్శాంతి కుదరలేదు. అన్నీ నోటెంబడి తడబడే మంత్రాలే. దేవునిపూజలోకూడ ఘంటానాదం ఎప్పుడో, తగినమంత్రం నైవేద్యం ఎప్పుడో! తరువాత బయటికివస్తే వడ్డైన సిద్ధంగా వున్నది అవి చూచికూడ 'పారోతీ! నేనేమో ఇప్పుడే జరూరుపనిమీద మణూరు వెళ్ళాలి! మీరిద్దరూ భోంచేసేయండి' అన్నారు. 'ఇదిగో! ఇప్పుడు వడ్డించాంగూద, భోంచేసేవెడితే' అని అంటే 'ఆ పదిహేనుకుండల గింజలు ఖర్చయ్యాకనే వస్తాలే' అన్నారు. తరువాత బిరుసుగా గబగబా వెళ్ళిపొయ్యారు.

సరసోతి పసులకొట్టంలో వుంది. ఆ అవతారాన్ని ఆమె చూడలేదు. వాళ్ళ ముసలి గొడ్డొకటి అవసానదశలో వున్నది. సరసోతి ఆ పశువుఎదుట కూర్చొని కన్నీరు కార్చుతున్నది. పారోతి త్వరగావచ్చి, 'వదినే వారికేమైందట?' అనిన సమయాన అప్పటిదృశ్యమే మారిపోయింది. ఆమె పరుగెత్తి అన్నదగ్గరకే వెళ్ళింది. పారోతిచూస్తే కెంపి చనిపొయ్యే స్థితిలో వుంది. పారోతి కన్నీరు పెట్టుకుంది. ఆమె గోపీని, మరొక్క జంతువునుచూచి 'మీరెందుకున్నారు, వెళ్ళి సాయంకాలం రండి' అని అంటూ వాటిని ఆ కొట్టంనుండి బయటికి తోలేసింది. అవి వెడితేనా? అందుకే లోనికి రానియ్యకుండ తలుపుమూసి వచ్చింది.



సరసోతి చూచి 'అన్నయ్య ఏడీ?' అన్నది.

'కోపంతో వెళ్ళిపొయ్యారు. ఎవరిమీద కోపమో ఏమో, వడ్డించిన విస్తరినిచూచి కూడ వెళ్ళారు. అదేమో పదిహేను కుండలధాన్యం అంటూ చెప్పారు.'

'కోపంరానీ పేదలకోపం పెదవిచేటు-వానికడుపే మాడుతుందిలే! నేనా అవతారాన్ని చూచి భయపడతానంటావా? నే నెక్కడికైనావెళ్ళి జీవించగలను!' అన్నది.

సరసోతి పారోతితో 'పోనీలేవే! నువ్వు లోపల కూర్చో! చచ్చినజీవాన్ని లేపలేము, దానికి మన ఇంటి నీటిఋణంకూడ తీరిపోయింది. ఆ గొరగ (మాదిగ)లను పిలుస్తాను' అని త్వరగా వెళ్లిపోయింది. ముగ్గురు కొరగవారు, ఒక కొరగది ఆమెవెంట వచ్చారు. కొట్టం తలుపు తెరిచి, ఆ కెంపి శవాన్ని లేపుకొని వెళ్లారు. ఆ శవయాత్రను సరసోతి, పారోతీలు ఏడుస్తూ చూశారు, ఆ గోపీ, చంపి తమ చెలికత్తె వెడుతుందే అని మెడలెత్తి చూశాయి, కన్నీరు కురిపించాయి.

పారోతి కన్నీరుకార్చుతూ వాటితో 'మీరు రండి! మీకు అక్కచ్చు తయారుచేసేదాక వుండండి. ఇప్పుడు తేట తెచ్చివేస్తాను' అన్నది.

లోనికెళ్లి కుడితి, గంజిలకుబదులు తమకు చేసుకున్న అన్నాన్నే తెచ్చివదేసింది పార్వతి. పసులుకూడ ఆశ్చర్యంతో అన్నాన్ని వాసనకూడ చూడకుండా నుంచున్నాయి. వారు మళ్ళీ శివమెత్తినవారిలాగా వెళ్ళి ఆ చెరువులో మునిగివచ్చారు. తరువాత వసారాలో కూర్చుని ఏమో ధ్యానించారు. సరసోతి 'వానికి ఇల్లక్కర్లేదు: నాకుకూడ అక్కర్లేదు' అని చెప్పింది. పారోతి అలాగేమీ చెప్పలేదు.

సుమారు పొద్దు మునిగేవేళకు సరిగా రామఐతాళులు మణూరినుండో, మరెక్కడినుండో వాపసు వచ్చారు. ఎవరితోకూడ మాట్లాడలేదు. అలాగే అంగుళంలో నాల్గేసిమార్లు పచార్లుచేసి, ఆ పసులకొట్టంవద్దకే వచ్చారు. ఆ కొట్టంలో 'కెంపి' కనబడలేదు. తరువాత గట్టిగా 'ఈ ఇంట్లో ఎవరూ పట్టించుకొనేవారే లేరు. పొద్దు గూకుతున్నది. పశువులు ఇంటికొచ్చాయా లేవా అని చూసేవారుకూడ లేరు. తమపనులలో ఏమరుపాటు వుంచుకొన్నా, నాలుకకు అధికప్రసంగం మరుపురాదులే! ఒకరినిమించి మరొక్కరు' అని మళ్ళీ ఆ పసుల కొట్టంలోనికి బయటికి చుట్టూరు నాల్గుసార్లు తిరుగులాడారు. తరువాత 'కెంపీ రావే, కెంపీ

రావే!' అని కేకలు పెట్టారు. లోపల పారోతి ఏమో పనిచేసుకుంటున్నది-మగని కేకలను విని వచ్చారుగా అని బయటికి వచ్చింది. మళ్ళి 'కెంపీ రావే' అనేకేకకు ప్రత్యుత్తరంగా సరసోతి 'కెంపికూడ వస్తుంది, మరొక్కటి వస్తుంది!' అని చెప్పింది. అందరూ లోన విప్పులు కక్కుతున్నారు. తానైనా చల్లబడాలని తెలివితెచ్చుకుని, 'ఎందుకు పిలుస్తారు? కెంపి లేదు' అన్నది పార్వతి.

ఐతాళులు: 'కెంపి లేదు, ఎందుకు పిలుస్తారు!' అని పారోతిమాటలనే పలుకుతూ తోచకుండా నిలబడ్డారు.

'లేదండీ! మధ్యాహ్నానికే చచ్చిపోయింది. నేను రాత్రే చెప్పాగా! నిన్నటినుండి అది గడ్డి, నీళ్ల మానుకుందని.'

'ఏమన్నావు, కెంపి చచ్చిందనా! ఒక్కొక్కదాన్ని చంపండి, చంపేశారుగా! అల్లాగే ఒక్కొక్కరు పోతే మంచిదే! ఇక్కడ మర్యాదగా బదికేదే కష్టం అయినప్పుడు.......' అన్నారు.

పారోతికి వారి ఏమాటలూ బోధపడలేదు. ప్రొద్దుననుండి అందరిబుర్రలు వేడెక్కాయి అని తెలుసు. కాని ఆ ఆరాటం, పోరాటం ఎందుకనిమాత్రం తెలిసిరాలేదు.

అయితే 'ఏమి, ఎందుకు?' అని అడుగడానికి ధైర్యం లేదే! అడిగితే ఒకటికి రెండు రెట్లు కోపంరేగితే కష్టమని మౌనంగా వుంది. సరసోతికూడ మౌనంగానే వుంది. ఒక్కర్తే తనపనులు చూచుకొని పసులకొట్టానికి వెళ్లింది. గోవమ్మ పాలు చేపలేదు. 'ఎల్లా చేపుతుంది. చావు అందరికీ ఒకటేవిధమే గదా!' అని వెనుకకు తగ్గింది.

భర్తముఖం వాడిపోయింది చూచి పారోతి, అతను మధ్యాహ్న మెక్కడా భోం చెయ్యలేదని తేల్చివేసింది. తానుగూడ వారిలాగా వుపవాసం చేసింది. ఉన్నంతలో ఓపికతో వారివద్దకువెళ్ళి 'వంట తయారైంది, భోంచేయరాదా?' అని అడిగింది. 'భోజనమా! ఈ వల్లకాడులోనా?' అన్నారు.

పారోతి తన కర్తవ్యమనుకొని విస్తరిలో వడ్డించి నిరీక్షించుతూవుంది. ఐతాళులు గబగబా మంత్రాలు వల్లెవేసి విస్తరముందు కూర్చొన్నారు. పారోతి వండింది వరుసగా వడ్డిస్తూ వెళ్లింది. ఐతాళులు మనస్సులో మనస్సులేక పరధ్యానంగా భోంచేశారు. ఎంతోసేపు భోంచేశారు. దానికి ఫలమేమంటే రెండవసారి అన్నీ వండాల్సి వచ్చింది. ఆ దినం పారోతికి చాల ఆకలి కరకరవేసింది. లేకుంటే ఆమె అల్లాగే వుండిపోయ్యేడిదే. మళ్ళీ వండి, వదినె దగ్గరికెళ్ళి 'సరసోతీ, మధ్యాహ్నంకూడ భోంచేయలేదే, ఇప్పుడైనా రా, ఒక ముద్ద తిందువుగానీ!' అని పిలిచింది. ఆ విన్నపంకూడ రుద్ధకంఠంతోనే, కన్నీటిధారతోనే చేసింది. సరసోతి తన వదినెయొక్క ప్రీతి, అక్కరలకుగాను వద్దనకుండ, 'ఈ ఇంట్లో భోజనాలు వద్దు, పెత్తనాలు వద్దమ్మా!' అని చెప్పింది.



సరి! తరువాత ఏమైందీ తెలుసుకోరా! చావడిలో ఐతాళులు గుర్రుమని నిద్రపోయేది వినవచ్చింది. ఐతాళుల అవతారమే ఆరోజు విపరీతంగా వుంది. అర్ధరాత్రిలో లేచిచూస్తే చావట్లో దీపం మిలమిల మెరుస్తూనే వుంది. అదేమి? అని యోచింపసాగారు. పగలు జరిగిన విచిత్రానుభవాలు వారిని తల్లడింపజేసినా, గాఢనిద్ర ఒడిలో పసిబాలునిలాగా పడుకున్నారు. అరే! ఇంతరాత్రిఅయినా దీపాలెందుకు వెలుగాలి? ఏమీ బోధపడకుంటే 'పారోతి' అని పిలిచారు. పారోతి నిద్రావస్థలోనే వారిదగ్గర కొచ్చింది:

'ఏమి' ఇంకా దీపాలు మండుతున్నవి?' అని అడిగారు.

పారోతి మౌనంగా వుంది.

'అయితే భోజనాలింకా కాలేదా? ఎంతరాత్రి గడచిందో తెలుసా?'

'ఎంతరాత్రి గడచిందో?'

'ఏమింకా భోజనాలు కాలేదా! ఇంకా ఎంతపొద్దు చేస్తారు?'

'నేనొక్కతినేనా చెయ్యాల్సింది? ఆ వదినెను మీరేమన్నారు? ఆమెకూడ మధ్యాహ్నంకూడ వస్తు పడింది. ఈ ఇంటిపెత్తనం వద్దట. నీటిఋణం తీరిందంటుంది. మీరు భోంచెయ్యకుండా వెళ్ళారు-మీ కోపంతో-ఆ పశువు అల్లాగయిందీ........అన్నీ అలాగే!'

అప్పుడు ఐతాళులకు అన్నీ ఒక్కొక్కటిగా జ్ఞాపకం వచ్చాయి. అప్పుడు ఆకలిలేదు. నిద్రమూలాన కొంత కోపం మాయమైంది. తన చెల్లెలి సమాధానం, తన కోపం, తాను లేనప్పుడు ఆవు చచ్చిందీ, ఇంటిల్లిపాదీ ఇంకా ఉపవాసం పడినసంగతీ అన్ని మనస్సులోనికి వచ్చాయి.

'నువ్వుకూడ భోంచెయ్యలేదా?'

'మీరు విస్తరినిచూచికూడ లేచి వెళ్లిపోతే నేనుమాత్రం మెతుకు లెందుకుముట్టాలి? నాకేం తిండికి లేనిదాన్నా?'

ఐతాళులు ఎంత చెలరేగారో, అంత తగ్గారు.

'పారోతీ, ఒకరు ఒక ఘడియలో తలచెడి ఏమైనా అంటే, చేస్తే, అందరూ అలాగే చెయ్యాలా చెప్పు! ఆ సరసి ఎక్కడ, అది ఈపెత్తనం వహించకుంటే ఈ వూళ్లెంబడి పడి తిరిగే పురోహితున్ని నేను చెయ్యాలా?' అని సరసోతివద్దకు వెళ్ళారు. ఈ మాటలన్నీ సరసోతిచెవిలోకూడ పడ్డవి. దానిఫలితం ఆమెలో కలిగిందికూడ.

ఐతాళులు, 'సరసోతీ, వెళ్లు, భోంచెయ్యి - ఈ రామునిబుద్ధి భ్రష్టమైతే, ఒక్క

మాటకే నువ్వు కోపపడాలా? అంతా నా దురదృష్టంలే!' అన్నారు. మళ్ళీ 'మీరు భోం చెయ్యరా!' అన్నారు.

'పో, వెళ్ళి పడుకో, మేం భోంచేస్తాము పద! ఇక ఏమాటలూ ఆడవద్దు' అన్నది.

ఐతాళులు వెళ్ళి పడుకున్నారు. సంవత్సరాలకొద్ది రాత్రిభోజనం మానివేసిన సరసోతి వదినెవెంట అన్నకు మనశ్శాంతికొరకే భోంచేసింది. భోంచేసి ఎవరిస్థలానికి వారు వెళ్ళారు.

రాత్రి తరువాత తెల్లవారింది. పడమటి ఆకాశంలో చక్కని కారుమబ్బులు క్రమ్ముకున్నవి. ఉదయించిన సూర్యుడేమో మంచి కాముని విల్లును-ఇంద్రధనుస్సును విసిరాడు. తెల్లవారిఎండ కొబ్బెర, తాటిచెట్లలోని మంచుబిందువులతో శుభ్రమైన మట్టలను ముద్దు పెట్టుకుంటున్నట్లున్నది. ఆదినం ప్రకృతిసౌందర్యమేమో! ప్రకృతి శుభ్రంగా జలకమాడి మడిబట్ట కట్టుకున్నట్లున్నది. కడిగినముత్యంలాగు నిర్మలంగావుంది. నిన్నటిజ్ఞాపకాలు ఆనాడు రానే లేదు. ఎవరికీ ఏబాధ లేదు.

ఐతాళులు, ఉల్లాసంగా తోట చూచుకురావాలని వెళ్లారు. నదీముఖంలోని తోటను చూచి ఎదుటి అలుగుపైనున్న కోసుకునిపోయిన తోటను గమనించేబదులు హంగార కట్టిలోని తెరచాప పడవలను లెక్కపెట్టసాగారు. 'అవి అమీన్ దీవులనుండే వచ్చాయి. తప్పని సరిగా అక్కడి వ్యాపారంకొరకే వెళ్ళివచ్చాయి. మరిన్ని పడవలు వస్తే తమ బియ్యానికి మంచి గిరాకే తగుల్తుంది' అనుకొన్నారు. తోట సరిగ్గా తనిఖీ చేసుకున్నాక, ఆ మేటగాపడిన ఒండ్రుమట్టిలో కృష్ణాష్టమివేళకైనా వంద కొబ్బెరమొక్కలను ఎందుకు నాటకూడదు?-అవి ప్రశ్నించుకున్నారు.

వారికేమో మొదటినుండి హంగారకట్టిరేవు భవిష్యాన్ని, వచ్చిపోయే మొద్దులు, నగల పడవలు, చేపలపడవలు, తెరచాపపడవలు, తెప్పలు, చేపలపడవలను లెక్కించుకునే అలవాటుంది. 'ఇది కోడివారిది, ఇది పడమటిదీవులది, ఇవేమో చేపలఓడలు, ఇవి పరకులవి' అని ఎంతదూరానవున్నా కనిపెట్టేశక్తి వున్నది వారివద్ద. వెంటనే ఇవి అమీన్ దీవులవారివి, ఇవి మలయాళీలవి, ఇవి ఆఫ్రికావారివనీ చెప్పేస్తారు. ఈసారి ఆ సిద్దీలు (ఆఫ్రికావారు) బెండఖర్జూరం దింపలేదు. కోటీశ్వరుని జాత్రకు - మాత్రం ఇక ఎన్నిమాసా లున్నవి? అప్పటికైనా ఖర్జూరంచాపలు వచ్చినా? ఆ సిద్దీలు తేకుంటే మరెవ్వరు తెస్తారు? ఇంటికెళ్ళి నిన్నటిసంగతి పూర్తిగా మరచినవారికి మళ్లే 'సరసోతి, చూడు. ఈవేళ ఆ దీవులపడవలు ఎన్నివచ్చాయి అనుకున్నావో, పదిహేనుపడవలైనా ఉండాలి. అన్నిటినిండ కొబ్బెరకాయలే! కొబ్బెరత్రాళ్ళనుకూడ తెచ్చిపడవేశారు. మొత్తంమీద కొబ్బెరకాయల ధర తగ్గేలాగానే వుంది' అన్నారు.

సరసోతి 'పోనీలే, ఆ కొబ్బెరకాయలధర పడిపోతే మనకేం నష్టం! మన మేమైన కొబ్బెరకాయ లమ్ముతామా? ఆ పడవలవారు వచ్చారన్నావే! మన బియ్యం, వడ్లు వాటికేమైనా గిరాకీ బాగుంటుందంటావా? తప్పక మంచిగిరాకీ రావాలి!' అన్నది.



'ఏమి ధరలో ఏమో! నిన్నటిదాకా రూపాయ అన్నారు. ఈవేళ కనీసం రూపాయిన్నరచొప్పున తూముడు వెళ్ళినా పరవాలేదు' అన్నారు. అలాగన్నీ మాట్లాడి చెరువుకు స్నానం చెయ్యటానికి వెళ్ళారు.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి. అందరూ తీరికగానే వున్నట్లగుపించారు. రేపో ఎల్లుండో ఆ ఋతువుకు సరిగా విత్తే మడిలో విత్తనం వెయ్యాలి. ఉలవైనా, నువ్వైనా విత్తవచ్చు. సూరడు చెప్పకుండానే స్వయంగా తానే మొదటిసారి దున్ని నేల సమంచేశాడు. అందుకే అన్నతో తృప్తిగా తన అభిప్రాయాన్ని, ఆలోచనను వ్యక్తం చెయ్యాలనుకుంది సరసోతి. ఆమె ఎదుట రెండేప్రశ్నలున్నాయి. ఒకటి కొడుకును దత్తత చేసుకోవాలి? మరొక్కటి పాలకొరకు మంచిగేదెను తెచ్చేవిషయం. రెండువిషయాలు అన్నతో చెప్ప జాలకపోయింది. ఆ రెండింటిలో దేన్ని మొదట ప్రస్తావించాలి? వరికి మంచిధరవస్తే, గేదెను కొనేసంగతి అన్నకు నచ్చుతుంది. లేకుంటే చెప్పినా లాభంలేదు. ఆ సంగతి నోరెత్తితే 'ఎనిమిది వరహాలైనా ఎవరైనా అప్పిస్తారా చెప్పు?' అని చెబుతాదేమో! అందుకే ఆ దత్తత సంగతే చెప్పాలని తీర్మానించింది.

ఆదినం ఐతాళులు చావట్లో కాళ్లు ముడుచుకుని కూర్చున్నదృశ్యంచూచి సరసోతి అతనిదగ్గరికెళ్ళి 'అన్నా, ఏమి ఆలోచిస్తున్నావు?' అని అడిగింది.

'ఏవిషయం అంటావు?'

'నా కంత అవసరంలేనిసంగతి అడుగుతున్నా? వింటే విను, లేకుంటే మానేయి!'

'అదేమిటో చెప్పరాదూ!'

'చూడు, ఈ జీవాలు శాశ్వతమంటావా? కళ్లు మూసుకుంటే పిండంవేసేవారైనా వద్దా? నీకున్న శిస్తుభూమి చాలు. ఈ పంటలనుచూచి నీకు ఎవ్వరైనా దత్తతకు ఒక కుమారుణ్ని ఇయ్యరంటావా?'

ఈమాటలు సరసోతి నోట్లోనుండి వస్తాయని వారు ఊహించివుండలేదు. ఆసంగతి ఎన్నడో ఆలోచన చేసేవుంచారు. ఈమాటలు వినగానే లోపలినుండి పారోతి బయటికి వచ్చి గోడకు ఒరిగి నిలబడింది. మగడు ఏమిసమాధానం చెబుతాడో అని నిరీక్షించింది.

ఐతాళులు మెల్లిగా 'సరసోతి నీకిదొక పిచ్చి! ఏ ఇంటి కాకిపిల్లను తెచ్చి ఎంతసాకినా కోకిల గున్నగా మారుతుందా? అది అయ్యి, పొయ్యేవ్యాపారం కాదులే! ఆ పిల్లవాళ్ళ గుణాలు సరిపడకుంటే మన మనస్సు విరుగదా! మనఇండ్ల పిల్లవాళ్లంటే అది వేరేసంగతి!' అన్నారు.

'ఐతే ఏ యోచన అవసరంలేకుండా ఊరకుండమంటారా?'

'దేవుడు తలవ్రాత వ్రాసింటే నా కడుపుననే పుడతారులే!' అన్నారు ఐతాళులు.

చాలసేపయ్యాక పారోతి 'నా జాతకంలో సంతానప్రాప్తి లేదని మీరే అన్నట్లుండెనే: ఒకసారి మీరే చెప్పినట్లు జ్ఞాపకం' అన్నది.

'నీ జాతకంలో లేదు. లేకుంటే : నాకు బ్రహ్మ ముగ్గురుబిడ్డలు వ్రాశాడే. అది అబద్ధమంటావా ?'

తరువాత ఏమిచెప్పాలో వారికి తోచలేదు. ఊరకే వున్నారు. 'ఈసారి నిరుటి పొలంలోనే రెండవపంట విత్తనం వేద్దామా' అని సరసోతిని చూచి ప్రసంగం మార్చారు.

'అక్కణ్నే రెండవపంటవేస్తే ఒక గింజకూడ రాలదన్నా : నిరుదెంతయ్యింది? నాటిన గింజల్లో మూడువంతులు అందరి కోళ్ళవాత బడ్డది. ఈ శూద్రులగుంపులో మన రెండవపంట మిగలదు.'

'అయితే గతసంవత్సరం దోసచేనులో, ఈసారి ధాన్యం వేద్దాము : ఒకప్రక్క దోసతోట. రెంటికీకలిసి మంచి కంచెవేయిద్దాం : ఆ రెండవపంటపొలంలో ఉలవ, నువ్వు నాటితే బాగు. గింజలులేకున్నా కొంప్ర (పొట్టు) దొరుకుతుందిగా :'

సరే మరునాడే ఆ దోస, ధాన్యంపంటలకు కంచెపని మొదలుపెట్టారు. ఐతాళులు సకుటుంబ సపరివారసమేతంగా మట్టి ఉండలుతవ్వి సరిహద్దులో వుంచారు. వాటిలో కొయ్యలు కొర్తులు నాటడానికి మూడుదినాలు పట్టాయి. వాటికి మళ్ళీ మట్టి యెత్తించి దాని కిరువైపుల ముళ్ళకంపలంటించితే, ఆ దడి గట్టిగా తయారైంది. వరిగింజలు నాటారు-మరి రెండు పొలాలలో మినుము ఉలవ నాటారు, 'నువ్వు అక్కర్లేదులే' అని ఐతాళులు నిశ్చయించారు. 'నాకు నువ్వులనూనెకూడ ఇష్టంలేదు. ఆ చిత్రాన్నంచేసిన రోజు అర్ధశేరునూనె బదులు తేవచ్చులే, దీపానికి పొన్ననూనె వుంది. పసులపొట్టుకు మినుము, ఉలవకట్టె పనికిరాదా ఏమిటి ? నువ్వు ఏమి గొప్ప ?' అన్నారు. తాలింపు (గుగ్గిళ్ళు)లోకి వస్తుందని ఐదుముంతల విత్తనం అనుములు సరసోతి వేయించింది.

ఆ మినుము, ఉలవ, అనుములు మొక్కలు పెద్దగయ్యేలోగా వాటికి కంచెవెయ్యాలి. పొరుగూరువారు కడుపుమంటకైనా మన పొలాలపై పశువులను తోలేస్తారు. పైరు చేతికివచ్చేవేళకే పొరుగూళ్ళ గేదెలు, దూడలు, ఆబోతులు తప్పకుండా ఏరు దాటుకొని మన పొలంపై పడకుండా చూడాలి.

రెండవపంట వచ్చేలోగా గంటకొకసారి పొలానికి కావలిగా వెళ్ళివచ్చేపనిలోనే అందరికి కాలక్షేపం అయింది. సరసోతికి నెత్తిమీది ముసుగుతీసివేసి, చేతిలో కర్రపట్టుకుని పొలంలో తిరుగులాడకుంటే సంతృప్తిలేదు. ఎవరిపొలంలో ఏ పశువు పడినా ఒక సరువు (కోసు) నేలకు తరుమగొట్టేదాకా వదలదు సరసోతి. అల్లాంటిస్వభావం ఆమెది.



ఈసారి ఐతాళుల అదృష్టం ఒకవిషయంలోమాత్రం తక్కువైంది. ధాన్యంధర పెరిగింది కాని, రెండవపంట చేతికొచ్చేసరికి ఇంట్లో వుండేవాళ్లందరూ రక్తాన్ని చెమటలుగా మార్చి పని చేయాల్సివచ్చింది. వాళ్ళబ్రతుకంతా ఆ చాకిరిలోనే నీరసమైపోయింది. శూద్రుల ఇంటి కోళ్ళదాడిని తప్పించుకోవాలని ఆ దోసకాయలతోటకు నీళ్లెత్తి బక్కచిక్కిపోయారు. వాళ్ళ నీటికుండ ఎక్కడుందంటే మొదటిపంట పొలంవద్ద—దూరంనుండి నీళ్ల తోడితోడి చేతులు పడిపోయాయి—చాలురా అనుకున్నారు. కుండనీరు దోసచెట్ల కందాలంటే మూడు వందల మోటబానల నీరైనా వ్యర్థమవ్వాలి. దారిలో ఇంకెవ్వరిపొలంకూడ లేదు. ఈలాగు అంతదూరం కాలువలోకి నీళ్ల తోడాలంటే సంతులప్రకారం నీళ్ల పారించేలోపుగా మొదట తోడిననీరు ఎండిపోతుండేది. ఇదివరలో తోడినన్నీ తోడాల్సిందే.

ఇన్నాళ్ల ఏతాంతో తోడేవారు. ఈసారిపంటలకు ఆ కపిలబాననీరే అవసరం. ఒక చిన్న కిరోసిన్‌డ్రమ్‌నుతెచ్చి దానికి మూతకొట్టేసి వెదురుబద్దను మూతివద్ద బిగించి మోట బానగా మార్చేశారు. పారోతి బయటచేరినప్పుడు చక్కనితాడు పేనిచ్చింది. అన్న, చెల్లెళ్ల శుభ్రంగా నీటిని తోడేపని మొదలుపెట్టారు.

మరునాడు పారోతి గోపిని, చంపిని గుట్టకు తోలుకొనివెడితే అన్న, చెల్లెళ్ల జట్టీలులాగ చెరువుగట్టుమీద బాన పట్టుకొని నిలబడ్డారు. మోటను తోలేది, ఎత్తేది, ఆ కార్యక్రమాన్ని జరిపారు ఒకచేవరుసగా తీరికలేకుండా. మధ్యాహ్నం ఝాము పొద్దుకు పనికి ఎక్కినవ్వారు రాత్రి ఒకఝాము (9 గం॥ల) దాకా పనిచేశారు. ఐతాళుల భుజాలు, దండయెముకలు నొప్పికి పట్టుకొనిపోయినాయి. మధ్యమధ్య నీళ్ల పొలంలోకి ప్రవహించిందా లేదా అని పరీక్షించడానికి, చూడడానికి మూడుమూడుసార్లు మడివద్దకు వెళ్ళి వచ్చారు. ఎలా చేరుతాయి ? మొదటిసారి పోయినప్పుడు - కొత్తనేల నీరంతా తాగి, కాలువ చివరకయినా నీరు పారలేదు.

ఆరాత్రి సరసోతి, ఐతాళులు 'ఎంతయినా, ఏతాంకన్నా కపిలబానే సులభం' అని నిర్ధరించినా, తెల్లవారేటప్పుడు, 'చెయ్యి దేనికీ పనికిరాదు' అని ఐతాళులు నూనె పూసుకొని నీముకొంటున్నారు. దినంవిడిచి దినం నీళ్ల పెట్టాలనే వారినిశ్చయం కరిగిపోయి, మూడు దినాల కొకమారు పెడితే యథేష్టమని నిర్ణయించుకొన్నది. అన్ననుంచి ఈపని కాదని చెల్లెలికి తెలిసింది. ఆయన క్రమంగా ఏదో నెపంచెప్పి - ఈదినం పారంపల్లి, రేపు మణూరు, ఎల్లుండి సాలిగ్రామ అంటూ తప్పించుకోసాగారు. ఆయన తప్పించుకొన్న స్థానానికి పారోతి వచ్చింది. సూరప్పచిన్నపిల్లవాడితో 'అబ్బాయి, నీవు మా గోపెమ్మను, చెంపిని ఇక్కడే మేపుకొనివచ్చావంటే, నీకు అప్పడాలు గిప్పడాలు ఇస్తాను' అన్నది పారోతి. ఆ పిల్లవాడు బ్రాహ్మణులయింటి అప్పడాలుతినే ఆత్రంపుట్టి పశువులు మేపేపనికి ఒప్పుకొన్నాడు.

వదినా మరదళ్లు తాము ఎంత అలసిపోయినా, కపిలబానసేవను ఇతరులకు అప్పగించలేదు. అలా ఇతరులకు కూలియిచ్చి పనిచేయిస్తే మిగిలేదేమిటి ?

ఏమైనా మకరసంక్రాంతి సమయానికి రెండవపంటచేను పండింది. ఇటు ఉలవలు పీకారు. అనుములకూర సంతర్పణ ఇంట్లో తప్పనిదయింది. దినంమార్చి దినం దానికూరే. ఒకటి రెండునాళ్లు ఐతాళులు 'రుచిగా వుంది' అని అన్నారు. తర్వాత దానిమీది ఆదరం తక్కువయింది. సరే, ఆయనకు విసుగువచ్చిందని కూరతెచ్చి జాజువేసిన ఇంటినేలకు రుద్ది దానిని నున్నగా చేసేపనికి పూనుకోవలసి వచ్చింది.

ఈ సంవత్సరం కొంచెం ఎక్కువ గెలివే (సంతోషమే) యింట్లో. వడ్లకు ఐతాళులు కోరినధరే వచ్చింది. సుందరశ్యామభాగగారు ఐదుపావలాలకు ముడిధాన్యం ఇమ్మని ఎంత అడిగినా అమ్మనిధాన్యం మకరసంక్రాంతివేళకు ఆరుపావలాలప్రకారం విక్రయించారు ఐతాళులు. ఆ సంవత్సరం గోవాకు చాలబియ్యం ఎగుమతి అయిందట. అమీన్‌దీవులవారు చెప్పినధరయిచ్చి బియ్యం కొనుక్కొనివెళ్ళారట. ఉలవలధరా బాగుంది. చాల కొంచెం ఇంటివాడకానికి, కొంచెం విత్తనానికి—మిగిలినదంతా అమ్మకానికి. మినుములు అంత విశేషంగా పండలేదు. అనుములకొమ్మలు చేతికి వస్తున్నాయి. అవి రెండూ ఇంటివాడకానికి కావాలి!

మొత్తంమీద ఐతాళులు ఒక్క వ్యవసాయంతోనే 25 వరహాలనయినా నగదుగా చూచివుండాలి—అన్న అంచనా సూరప్పది. అలా అని, ఒక్కముడి గుత్తకూడా బకాయిపెట్టలేదు. ఏమైనా ఐతాళులజీవితంలో ఈ సంవత్సరం ఉత్సాహం చాలా కనిపించింది. ఈ సమయంలో 'గేదెను ఖరీదుచేసే' విషయం ప్రస్తావించడానికి సరసోతి నిర్ధరించింది. ఐతే, ఐతాళులు 'మజ్జిగ పోసుకోక యిన్నినాళ్లు గడిచాయికదా; ఇక గేదె పెరుగుతిని కావలసిందేమీలేదు. గోమయానికి పశువులున్నాయి, చాలు. కొట్టంలో ఆవులున్న అందం గేదెతో వచ్చేనా ?' అని వేదాంతం వెలువరించారు. సరసోతి 'నాకేమీ మజ్జిగ వద్దు' అని నిరాశతో ఉండిపోయింది.

## 4

మకరసంక్రాంతి కాలం గడిచింది. ఆ సమయంలోనే జరిగే సాలిగ్రామ జాతరకు సరసోతి, పారోతి అందరూ వెళ్ళారు. సరసోతి దేవాలయంలో టెంకాయ పండ్లు సమర్పించేటప్పుడు, ఈ సంవత్సరం కలిగిన హెచ్చుసంపదను స్మరించకుండా వుండలేదు. వచ్చే



సంవత్సరమూ ఇలాగే నడిపించు అని ముఖ్యప్రాణదేవుణ్ణి (హనుమంతుణ్ణి) ప్రార్థించింది. ఈ జాతర ముగిసిన నెలలోపల ఐతాళుల సేద్యప్పనులన్నీ ముగిశాయి. ఉలవ, మినుము పీకివేయడంవల్ల నేల తెరపిగా వుంది. అప్పటికి అనుములకొమ్మలు నాల్గయిదుసార్లు కోసి, మొక్కలను పీకివేయడమూ అయింది. మిగిలిందేమిటంటే, దోసపెరడు పనిమాత్రం. అయితే, ఎండ తీవ్రం దినాలు గడిచినకొద్దీ బలమయింది. నేలమీద కాలుమోపేట్టే లేదు. సాయంకాలం దోసచేనుకు నీళ్లు ఎత్తి, మరుసటిఉదయం వచ్చిచూస్తే, మొక్కలు వాడిపోయి వుండేవి. అంతటి నీటిదప్పి ఊరిమంటికి. ఆ వేడి, ఆ మట్టిరంగుచూచి సరసోతి మనస్సులో ఇదేరీతి అయితే, చెరువులో నీళ్లు మిగిలీనా ?—అని ఆలోచన కలిగింది. ఆమె యోచన చూచిన పారోతి 'నీకు వెర్రి, సరసోతీ. ఫాల్గుణమాసానికే నీవు కేకలు వేసుకోడం ఎందుకు? నారుమళ్లు విత్తడానికే ఇంకొక నెలవుంది. అంతలోగా దేవుడు నడిపిస్తే, ఒకటి రెండు వానలు పడవా ? ఉగాదిసమయానికి వానలు వచ్చేరివాజే వుంది' అని సమాధానపెట్టింది.

వదినా మరదళ్లు దోసకాయలను ఇంటికి సాగించారు. పెరట్లో ఒకటీ అరా బూడిదగుమ్మడికాయలూ కాచాయి. వాటికి తాటాకులు బిగించి, వరుసగా ఇంటిస్తంభాలకు, దంతెలకూ వ్రేలాడదీయడమూ అయింది. అయినా నూరు దోసకాయలు మిగిలాయి. ఈ కాయలను నేలమీద దొర్లించి కుళ్ళబెట్టడం సరసోతికి యిష్టంలేదు. వాటిని ఎవరికయినా సాగిస్తే పోదూ?—అని ఆలోచన కలిగింది. వాటిని కుందాపురం సంతకు తీసుకుపోతే మంచిధర వచ్చేని. అయితే నాలుగువరువులదూరం మోసుకొనిపోయి సాగించేవారు కావద్దూ ?

సరి. ఆమె ఈవిషయం సూరప్పతో ప్రస్తావించింది. సూరప్ప ఆవిషయం ఎందుకో ఏమో గోవిందమేనియనుకు తెలిపాడు. అతడు వచ్చే శనివారం కుందాపురానికి వెళ్లతాడట. అతనిద్వారా ఆ దోసకాయలు అమ్మించే ఏర్పాట్లు చేసింది సరసోతి. 'దానికి బదులు డబ్బు ఇవ్వనక్కరలేదు. నాలుగుమణుగుల గెనుసుగడ్డ (చిలగడదుంప) తీసుకొనివచ్చి ఇస్తే చాలు' అని కరారు చేసింది. వచ్చే ఆదివారంనాటికి గోవిందమేనియను వాటిని అమ్మివచ్చి, 'నాలుగు మణుగుల గెనుసుగడ్డ దొరకలేదు, మూడుమణుగులే దొరికింది' అని గెనుసుగడ్డ తెచ్చియిచ్చాడు.

గెనుసుగడ్డ వచ్చినమీదట అప్పడాలు చేయాలి. మినుములు, అనుములు విసిరి అప్పడాలు ఒత్తాలి. పెరటిలో పెరిగిన బూడిదగుమ్మడికాయలకు ఒక గతి చూపించాలి. వాటిని మినపప్పులో కలిపి వడియాలు చేయాలి. నారుమళ్ళపని ప్రారంభమయ్యేంతలోపుగానే, ఊరుగాయలూ ఒకదారినఅయితే అనుకూలం. ఈ వ్యాపారమంతా ఆడవాళ్ళసామ్రాజ్యం లెక్కలలోది. రామఐతాళులు మకరసంక్రాంతి సమయంనుంచి ఒకేసమంగా పెళ్ళి, మరొకటి, శాంతి, సమారాధన అంటూ ఇల్లిల్లూ తిరుగుతున్నారు. పొద్దు నెత్తిమీదికి వచ్చినా, ఆయనకాళ్ళకు ఎండ తాకడమనేదిలేదు. పౌరోహిత్యంవున్న ఇళ్ళకు తెల్లవారి జాముపొద్దుకు చేరేవారు. తక్కినయిళ్ళకు భోజనానికి తగినట్లు మిట్టమధ్యాహ్నానికి చేరేవారు. రాత్రిళ్లు

ఎలాగూ భోజనంవేళ ఆయనకు ఉండేదికాదు. ఇలా అయి జాముర్రాత్రి గడచినతర్వాతే ఇంటికి ఆగమనం.

ఫాల్గుణమాసమంతా సరసోతి, పారోతి అప్పడాలు, వడియాలపని నడిపారు. ఇద్దరే గింజలు కడిగి, ఎండబెట్టి, పిండివిసిరి - చేస్తే పనిసాగినా? పక్కన దినం జరిగేపనులు కావాలి. పాలుకు దరిద్రమైనా పశువులను సాకేపని జరుగనే జరుగాలి. ఈగలభాలో ఊర గాయలు పెట్టడానికి అనుకూలం కలుగనేలేదు. ఐతాఖలకు స్వంతం మామిడిచెట్లు లేవు. ఎక్కడనుంచైనా మామిడికాయలు రావాలి. ఈ సంవత్సరం అకాలంలో మబ్బులుకప్పి ఆయన ఇసుకదిబ్బవరుసలో ఒక్కరియింట్లోనూ మామిడిపిందైనా కనిపించలేదు. అయితే- ఊరుగాయలు పెట్టకపోతే, వర్షాకాలంలో కొరుక్కొనితినడం ఏమిటి? తత్కాలానికి దోస ఊరుగాయ చేయడం అయింది, అదీ ముగిసింది. పెద్ద పనస ఊరుగాయ పెట్టడం, అది తినడమూ ముగుస్తూవస్తూంది. దానా దీనా ఎండకాలం గడపడమే కష్టం.

సరసోతికి దీర్ఘాలోచన కలిగింది. ఒకసారి మాటలసందర్భంలో సూరప్ప ఇంటికి వచ్చాడు. ఆమె అతనితో 'సూర, ఈ సంవత్సరం ఊరుగాయ ఒకటి దాటిపోయింది' అన్నది.

సూరప్ప నవ్వుతూ, 'ఈ బ్రామ్మలకు నోటిరుచి గట్టి! మేమంతా ఊరుగాయలు తినే బతుకుతున్నామా?' అన్నాడు.

పారోతి ముందుకువచ్చి, 'ఔను, సూరా, ఇంటికి వచ్చి, దాహానికి యివ్వండి అన్నప్పుడు వట్టి నీళ్ళిస్తే సూరనిముఖం చప్పగా అవుతుంది' అన్నది.

'అది నిజమేనప్ప. ఒక ముక్క ఊరుగాయ వుంటే, రెండుపావుల బియ్యపన్నం కొట్టేయవచ్చు. అయితే, ఈ సంవత్సరం మామిడిపిందెలముఖం చూచినవారెవరు? శివ రాత్రివరకు ఈ సంవత్సరం చలి అనేమాట వుందా? నేను ఈ సంవత్సరం మకరసంక్రాంతి సమయానికి తూర్పువైపు వెళ్ళాను. అక్కడమాత్రం రాత్రిళ్లు పడుకొనేటప్పుడు కంబడి అవసరమయ్యేది. మన ఊళ్లోమాత్రం ఈ సంవత్సరం సెగలు, పొగలు. ఆకాశమంతా పగలూ రాత్రీ మబ్బులు, మబ్బులు. మబ్బులు జాస్తిఅయితేనే, ఇక్కడి మామిడిచెట్ల పూతంతా కరిగిపోయింది.'

'అయితే, సూరప్పా, తూర్పువైపున ఎక్కడైనా దొరకవా? తూర్పుఊళ్ళలో మామిడికాయలకు కరువేమిటి? ఒకచోట కాకపోతే ఒకచోట వుండనే వుంటుంది. అక్కడ మూచూచేవారెవరు వాటిని? ఎక్కడచూచినా అడవిమాను లున్నాయి. అయితే, తూర్పుఊళ్ళ మామిడికాయ ఇంటికి రావాలికదా? మూడు పరువులయినా నడవ్వద్దూ?'

సరసోతికి తన భర్తయింటికి కొంచెం పూర్వాన ఒకటి రెండు గుట్టలలో దిక్కులేవన్ని మామిడిచెటు ఏదో ఒకకాలంలో చూచినజ్ఞాపకం, అక్కడికిపోతే కావలసినన్ని



తీసుకురావచ్చు - అని తోచింది. చివరకు ఆమె సూరప్పను, సూరప్ప భార్యనూ పుసలాయించి, వారికి రెండునాళ్ళకూలి ఇచ్చేమాటమీద అక్కడికి వెళ్ళేనిర్ణయం చేసింది. నిశ్చయించిన తెల్లవారుజామునే లేచి, వాళ్ళను పిలుచుకొని బయలుదేరింది. తెల్లవారేటప్పటికి వాళ్ళు బారకూరులో ఉన్నారు. అక్కడినుంచిన్నీ ఈశాన్యంగా రెండు పరువులు ముందుకుపోయి గుట్టలలో తిరిగారు. వారిలెక్క వ్యర్థంకాలేదు. ముగ్గురుమోనేము అనేటంత మామిడికాయలు దోటీతోకోసి కిందికి దింపారు. అవి స్వంతదార్లెవరూ లేని చెట్లు! వండ్లయితే, కోతులకుకూడా వద్దు అనేటంత కాయలున్నాయి.

ఇంతపనీ ముగిసేవేళకు పొద్దు నెత్తిమీదికి ఎక్కింది. మూట నెత్తిమీదపెట్టుకొని, ఎండవేడికి చెమట ఓడుస్తూ, ఉస్సురుస్సురంటూ, 'ఇక్కడ బ్రాహ్మణులఇల్లు ఎక్కడైనా వుందా?' అని అడుగుతూ బయలుదేరారు. ఎండదెబ్బకు చూచినదారికూడా తప్పి, తిరిగితిరిగి మామిడికాయలు కోసుకొన్నతావుకే మళ్ళీ వచ్చిచేరారు. ఆ తావును తిట్టుకుంటూ, శపిస్తూ, కొంచెం దూరం పడమటగా నడిచి, దగ్గరలో ఒకయిల్లు వుండడం చూచారు. అది ఎవరి యిల్లో! కాని ముంగిట్లో తమ మూటలుదింపి, ఇంట్లోవాళ్ళను అడిగి ఒక చెంబు పుచ్చుకున్నారు. బావినుంచి నీళ్లతోడుకొని, ముఖం కడుక్కొని తాగడానికి నీళ్లు తీసుకొని వచ్చారు. ఇంటివాళ్లు వీళ్ల ఎర్రబారిన ముఖాలుచూచి దయదలచి, రెండు బెల్లంముక్కలు తెచ్చియిచ్చారు.

సరసోతి, 'సూరప్పా, మొదట గుక్కెడు మంచినీళ్లు తాగు. కొంచెం అటుకులు తీసుకొనివచ్చాను, నీళ్ళలో తడుపుకొని తింటే, భోజనం చేసినట్లే పొట్ట భొమ్మని అవుతుంది' అని ఉపదేశించింది. మంచినీళ్లు తాగారు; అరగడియసేపు నీటటుకులసేవా అయింది. అలాగే వంచలోని పాకలో ఒదిగి పడుకొని, ఒక నిద్రకూడా చేశారు. వాళ్ళకు మెలకువ వచ్చినప్పుడు సరసోతికి గాభరా! 'పొద్దు దిగింది. రాత్రి వెన్నెలవెలుతురూ లేదు. లే, సూరప్పా!' అని సూరప్పను, అతనిభార్యను లేపి, మూట తలపై మోసుకొని బయలుదేరితే కాళ్లు నేలమీదమోపేట్టు వుండలేదు. తలమీదబరువు, నేలమీది తాపం; ఈ రెండింటివల్ల మైలు పరువుకన్నా పొడువయింది. దేహమంతా అలసి పట్టు తప్పిపోయింది. నడిచినడిచి, అలసిఅలసి, నీడ కనిపించినచోటెల్లా మంచినీళ్లు తాగి, పొద్దు మునిగేటప్పుడు ఎలాగో పాస్తావు చేరారు. ఊరు చేరడానికి ఇంకా పరువుదూరం; సూరప్పఅయితే, ఆ పగలంతా పడినశ్రమ తట్టుకోలేక 'అమ్మా, ఇప్పుడు మనమే ఊరుగాయ' అని నవ్వాడు. ముగ్గురికీ నవ్వు వచ్చింది. సరసోతి సూరప్పను సమాధానపెట్టడానికి 'సూరా, ఒక చిన్నజాడి ఊరుగాయ నీకూ యిస్తాను. తినిచూస్తే, వచ్చేసంవత్సరం నాకన్న ముందు నీవే తూర్పువూరికి మామిడికాయలు కోయడానికి వెళ్లుతావు' అన్నది.

సూరప్పకు నవ్వు వచ్చింది. 'వచ్చేసంవత్సరం బదికి వుంటేకదా?' అన్నాడు బదులుగా.

'అలా ఎందుకంటావు?' అని సరసోతి అడిగింది. దానికి సూరప్పభార్య 'అవును, దొరసాని, ఊరగాయవుంటే అయిందా? భోజనానికి బియ్యం వద్దా? వానకాలం వస్తే, పనస గింజలూ, గెనుసుగడ్డ ఉడికించితినేవారికి ఊరుగాయ యావమట్టికి?' అన్నది.

'ఈ సంవత్సరమూ అలాగే అంటున్నావా? నీవు రెండుముడిమడి సాగు చేస్తున్నావు. ఈ సంవత్సరం నిరుడికన్నా మూడు ముడిబియ్యమయినా హెచ్చుగా రాలదూ?' అన్నది సరసోతి. సూరప్ప సాగు లెక్కలన్నీ చెప్పి, 'గుత్త చెల్లించినమీదట ఓదవారికి మిగిలేది గడ్డే' అని రుజువుచేశాడు. సరసోతి 'అయినా, ఈ పడమటితీరంలో గుత్త చాల హెచ్చే' అని ఒప్పుకొంది.

మాటలలోనే తెల్లవారీనని తిరిగి అందరూ బయలుదేరారు.

రాత్రి జాముపొద్దు దాటింది వారు యిల్లు చేరేటప్పటికి. మూటలు దింపి ఒకమారు నిలబడగానే తమకు కఠినశిక్ష తప్పినట్టు కనిపించింది. సరసోతికూడా మెడ అటూ ఇటూ సవరించుకొని, 'పారోతీ మొదట సూరనికీ, దానికీ బెల్లంపీళ్లు ఇవ్వు. పాపం! మామిడి కాయలూ చాలు, ఊరుగాయలూ చాలు అని అనిపించింది వాళ్లకు. వాళ్ళకే ఏమిటి? నాకూ అలాగే....' అన్నది.

శైత్యోపచారం అయింది. సూరప్ప తన భార్యతోపాటు తనయింటికి బయలుదేరాడు. సరసోతి 'అన్నయ్య, ఇంకా రాలేదా?' అని అడిగింది. 'ఎంతపొద్దుకు వస్తారో, ఎవరికి తెలుసు? వెళ్ళేటప్పుడు ఏమీ చెప్పలేదు. రెట్టలు ఆడించుకుంటూ సరాసరి వెళ్ళిపోయారు' అని పారోతి అన్నది. ఆమె 'అన్నయ్యకు ఇంటి ఆడవాళ్ళంటే గడ్డిపోచతో సమానం. కాకపోతే, వెళ్ళిపోయేటప్పుడు, ఇలాటిచోటికి వెళ్లతాను, ఇంతపొద్దుకు వస్తాను అని చెబితే వీనిసొమ్ము ఏమి ఖర్చవుతుంది?' అన్నది.

'సరసోతీ, నీవు స్నానానికి వెళ్లు. మామిడికాయలుమోసి, పీనుగు అయివుంటుంది ఒళ్లు. ఇన్ని వేన్నీళ్లు కాచనా? చేతులు కాళ్లనొప్పికి వేన్నీళ్లు పోసుకుంటే, మంచిదికాదూ? స్నానంచేసి ఒకటి రెండు అట్లు తిను. నీవు భోజనం చేస్తావో లేదో అని మినుములు రుబ్బి, చేమకూర తరిగివేసి అట్లు పోశాను. రుచిగావుంటుందో, ఏమిపాడో!'

'రుచిగా వుండకుండా ఏమిటి? బాణలికి సమంగా నూనెరాచి అటుపోస్తే, దానంతట అదే నోటికి రుచిగా వుంటుంది. నీ భోజనం అయిందా, లేదా?'

'నాకు విసుగెత్తి వంట చేయలేదు. నీకు రెండు, నాకు రెండు నాలుగు అట్లు పోశాను. నీవు వచ్చినతరువాత తిందామని దారికాస్తూ కూచున్నాను. నూరు వంచాక్షరీ అయింది. ఒక నిద్రా అయింది....నీవు కాళ్లు కడుక్కొని రా. హండాలో నీళ్లు నింపేవున్నాయి. ఒక నిప్పురవ్వ తగిలించి వస్తాను. క్షణంలో నీళ్లు కాగుతాయి.'



'వేడినీళ్లు వద్దు మహారాణీ, చన్నీళ్ళలో స్నానంచేస్తే, ఈ వేడికి, వెగటు అయ్యాబ్బ అనిపించీని.'

'చెమట పడుతూంటే గత్యంతరంలేదు. చన్నీళ్ళస్నానం సరే. ఇప్పుడు చన్నీళ్ళలో మునిగితే, శీతమయ్యీని. వేడినీళ్లు అక్కరలేకపోతే, గోరువెచ్చచేసి స్నానం చేయవచ్చు గదా! ఇప్పుడు అంతటి ఉబ్బకూడా లేదు.'

ఇలా అని పార్వతి స్నానాలగది దగ్గరకు వచ్చి, దీపం పట్టుకొనివెళ్లింది. ఆమె వెంటే సరసోతి వచ్చింది. పారోతి ఎండుటాకులు మంటవేస్తూ పొయిముందు కూర్చుంటే, అక్కడే దగ్గరగా సరసోతి నిలబడి, మామిడికాయలు తెచ్చిన సాహసగాథ వర్ణించింది. 'ఇవాళ మేము ఎనిమదివరువులయినా నడిచివుంటాము. అదీ, ఎలాటిఎండలో నంటావు? ....మనం పడమటివూళ్ళలో మామిడికాయలు లేవని కొట్టుకుంటే, తూరుపువూళ్ళలో కోతులుకూడా దాన్ని మూచూసేట్టు లేదు; గుత్తులుగుత్తులుగా మామిడికాయలు చెట్లకొమ్మలు కుంగిపడేట్టు!'

'తూర్పువూళ్ళే అలాగ. అక్కడి మంచిగుణమే అలాంటిది అని అనిపిస్తుంది. మామిడి, పనస, అరటి....అక్కడ ఏవినాటినా, అంత లాయకుగా పెరుగుతాయి. కోతుల ఉపద్రవం ఒకటి లేకపోతే తూరుపువూళ్లంటే స్వర్గం.'

'కోతుల ఉపద్రవమైనా తట్టుకోవచ్చు. ఆ జ్వరం ఉపద్రవం ఎవరు సహించేరు? సంవత్సరానికి ఆరునెలలు చలిజ్వరంతో పడుకొనేవుండాలికదా....జ్వరం జ్ఞాపకంవస్తే, నేను ఎందుకు ఈ మామిడికాయల వెర్రిపట్టి అక్కడికి వెళ్లాను—అని భయమౌతున్నది.'

'నీకు పిచ్చి సరసోతీ! జ్వరము, జాడ్యము అంటే తూర్పని, పడమట అని తేడానా? అన్నీ ఒక్కటే. బ్రహ్మ జ్వరంతో నలగాలని వ్రాసివుంటే ఎక్కడికెళ్లినా తప్పదు.'

ఈవిధమైన మాటామంతీలో నీరు గోరువెచ్చగేమి సలసల కాగింది. దాన్ని ముట్టి చూచి 'అయ్యాబ్బ! మాటల్లో నీరుకాగింది తెలియలే. దీనికితోడు చన్నీళ్లు ఎవరు మోస్తారు?' అన్నది పారోతి. 'వద్దు, వేడైనా చర్మమేమి కాలిపోదు' అని చక్కగా స్నానానికి దిగింది. మొదటిచెంబెడినీటికే 'అబ్బోయి!' అనేకేక వినవచ్చింది. పారోతి త్వరత్వరగా రెండు కడవలనీరు చల్లనివి తెచ్చిపోసింది. స్నానమైంది.

స్నానం చేసేటప్పుడూ వాళ్ళమాటలకు నిలుకడలేదు. అట్లే ఇద్దరూ వంటగదిలోకి వెళ్లారు. అవసరవసరంగా సరసోతి నూటయెనిమిది 'ఓం నమశ్శివాయలు' ముగించి, ఉద్దులు (మినుములు) వేసిన చామకూర అట్లను స్వాహాచేసింది. 'రెండు తిన్నా పొట్ట అంచులుకూడా నిండలేదు' అన్నది. అప్పుడు పారోతి తిని త్రేన్చి నీళ్లు గుటుకలుమింగి సర్దుకుంటున్నది. 'నీకు మధ్యాహ్నం తిండిలేదుకదా! నేను పిచ్చిదాన్ని! లెక్కపెట్టి నాల్గేచేశాను, మళ్ళీ అట్లే చేయనా!' అని పారోతి నవ్వుతూ, కుండలు వెదికి కొంచెం అటుకులు తీసుకువచ్చి నానవేసి 'మిరియాలపొడితోనా! వచ్చిమిరపకాయలా? ఊరగాయరసంతోనా?' అని ప్రశ్నించింది,

'అయ్యో పుణ్యాత్మురాలా! నేను బండి భీముణ్ణా!' అని సరసోతికూడ దాక్షిణ్యానికి మాట్లాడిందేకాని అటుకులుమాత్రం ఊరగాయరసంతో కడుపార ఆరగించింది. ఊరగాయ కారంతో ఎక్కిళ్లు తప్పలేదు.

ఉపాహారం శాస్త్రం అయింది. పడుకుందామంటే మామిడికాయలగంపలు కండ్ల ముందరనే వున్నవి. వాటిని చెరువుకుచేర్చి కడిగి, చావిట్లో పరచడం జరిగింది. గంపలలో వుంటే ముగ్గిపోతాయి. అలాగని మరి కొంచెం హుమ్మసు కలిగివుంటే ఆక్షణమే ఊరగాయ పెట్టడం జరిగేదేమో! పుణ్యానికి అలసట విశేషంగా అయినందుకు చాప లాగుకుని వెంటనే వాళ్ళిద్దరూ పడుకున్నారు. సరసోతికి ఈవేళ పక్క ఒంటికి తగలగనే నిద్రపట్టింది. పారోతి మనస్సు ఒకప్రశ్నకు సమాధానాన్ని ఎదురుచూసింది. ఊరగాయకు అంగడివుప్పే వేద్దామా! లేక నీటినికాచి వుప్పు తయారుచేసివేద్దామా? అనే ప్రశ్న. సరసోతికి నిద్రపట్టిందిచూచి 'పాపం! ఎంత శ్రమపడ్డదో!....' అని కసికరంతో తానూ ఒరిగి నిద్రపోయింది పార్వతి.

మరునాడే ఊరగాయ వ్యవహారం. ఊరకే అంగడివుప్పుకోసం దండగపెట్టడం ఎందుకు, ఏటినీళ్లు కాచి ఉప్పు తయారుచేయాలని అనుకున్నారుకాని, మామిడికాయలే సిద్ధంగా వున్నప్పుడు ఇతర యోచన తగదని నిశ్చయించి దుకాణంవారికే డబ్బిచ్చి వుప్పు తెచ్చారు.

మామిడికాయలపని తీరిందంటే వానకాలం చింతలలో సగం తీరినట్లయింది సరసోతికి. దానికి మిరపపొడి, ఇతరద్రవ్యాలువేస్తే మిగత సగంయోచన తీరడం.

* * *

ఎండకాలం ఎండ ఎక్కుతోంది. ఉగాది రాకముందే మధ్యాహ్నం నేల కాలుతోంది. చైత్రందాటి వైశాఖంవస్తే వేరే చెప్పాలా! ఆకాశం ఎండ, ఉబ్బరాలనుండి బూడిదరంగుతో నిండింది. తెల్లమొయిళ్లు ఎక్కువై ఇంట్లోనైనా, బయటైనా ఒకటే సమంగా చెమటలదే వర్షం. రాత్రయితే ఇంటివెనుక బాడవలో గుడ్డపరచి ఆ ఇసుకదిన్నెమీద పడుకుంటే, చల్లగా హాయిగా కునుకుపట్టేది. ఇంటిచుట్టు ఇసుకదిన్నెలేవున్న ఐతాళుల ఇంటిలో పగటిఉక్క చెప్ప నలవికాదు.

పారోతి, సరసోతులకు ఈ మండుటెండలతో ఇతరచింతలుకూడ తప్పలేదు. తమ అగ్రత్త పొలంగతి ఏమి-వేసిన నాట్లన్నీ ఎండిపోవలసిందేనా! ఎన్నినీళ్లు ఎత్తిపోసినా మడికి చాలనేచాలదు. చెరువెండిపోతే గూడలతో ఎత్తిపోసి చేపలుపట్టే బెస్తలకే సుఖం. వానను ఎదురుచూస్తుంటేనే మొక్కలతలలు వాడి నల్లబారుతున్నవి. ఆ ఎండలోనే అగ్రత్తకు నాల్గు పార్లు వెళ్ళినవారు 'ఊరికివూరే వల్లకాడయింది. వానలలోనే తిరిగీ విత్తాల్సివస్తుంది. దానికైనా విత్తనాలు మిగలాలా?' అన్నారు.

ఇలాంటి గడ్డురోజుల్లో రామఐతాళులకు ఇంటిమరమ్మతు యోచన తలకెక్కాలా? వారు ఆరోజు శాంతి, సంతర్పణలు లేనందున ఇంట్లోనే భోంచేసి చల్లని చావట్లో పడుకుని 'ఏమి దరిద్రం వుక్కరా ఇది?' అని శాపనార్థాలుపెడుతూ భుక్తాయాసంతో ఒకటి రెండు



గడియలనిద్ర ముగించారు. నిద్రముగించి ఒళ్లు విరుచుకొని పారోతీ సరసోతులనుచూచి 'సరసోతీ! ఈ జానెడు పందిరి మనకు చాలదు. ఏమైనా సరే! ఇంట్లో టెంకాయమట్టలకు కరువేలేదు. చాలకుంటే బదులు తెస్తాము. ఈ అంగణమంతా పందిరివేసి నేలను తళతళ మెరిసేట్లు చేయాలిసుమా! ఇంటిలో వసంతోత్సవం కావాలి, అందరికీ నచ్చాలి' అని అన్నారు.

సరసోతికి అప్పుడు సగం కునుకుపాటు. ఆమెకూడ ఆవులిస్తూనే, 'అన్నయ్యా! నీకు పనిలేదు, పాటులేదు! ఇంట్లో ఏమైనా పెండ్లా, వడుగా! కళ్లమంతా పందిర్లు వేయాలట! అన్నయ్యకు ఏవేవో ఆలోచనలు' అన్నది. ఐతాళులు ఆవలించి చిటికెలువేసి, లేచి నిలబడ్డారు. నడుముకు సన్నపంచె బిగించి, తలకొక పాగావలె చుట్టుకుని ఇంటికి ముందూ, వెనుక అక్కడ, ఇక్కడ అంతటా తిరుగులాడారు. ఆ వూరివేడికి వారిఒంట్లో రోమకూపాలనిండా చెమటచుక్కలు ఒకేరీతిగా కారినాయి. అంతలోనే ఎక్కడెక్కడ తిరిగారో ఏమో, స్తంభాలు, వెదుర్లు, వాసాలు అన్నీ రాసులుపడ్డాయి. అన్నయ్య దర్బారు మాటల్లో కాదు, చేతల్లోకూడ అని సరసోతికి బోధపడింది. 'ఏమి, ఎందుకు' అని అడిగేలోగానే వారు 'సరసోతి! వూరకే రాకాసిమట్టలు కొట్టుకొని రా. అన్నింటికి అడ్డు చెప్పవద్దు' అన్నారు. వదినా మరదలు ఇద్దరూ ఆజ్ఞోల్లంఘనచెయ్యకుండా బయటపడ్డారు. తిరిగి వారు వచ్చిచూసేసరికి సామానే కాదు, ఐతాళులే గునపంపట్టి గుంతలు తోడారు పందిరి స్తంభాలు నిలవడానికి. సాయంత్రం కడలిగాలి వీచింది. పొద్దు గూకింది. సరసోతికూడ 'నీళ్లు ఊరింటే ఆ పొలానికి పోసి వస్తాము. నీవేమో ఎసరుపెట్టి బియ్యం ఎక్కించు, నేను పారోతినికూడ వెంట తీసుకెళ్తాను' అన్నది. ఆమెవెంట పార్వతి వెళ్ళింది. ఐతాళులు మనస్సులోనే గొణుగుతూ తమపనిలో పడ్డారు. పైనుంచి వెన్నెలవెలుగు. దాంట్లోనే పందిరి స్తంభాలను నాటడం, అడ్డతీరులను బిగించడం, వెదుర్లు నారతో కట్టడం అన్నీ వరుసగా జరిగినవి. ఒకసారి వంటఇంటిదర్శనం కూడ చేశారు. నీళ్లతోడే వదినె మరదళ్లు ఒకటిన్నరఝాములకే వచ్చారు. వారు పనిచేసి చెరువులో తవ్విన ఒక గుంటనీళ్లలోనే మునిగి బయటపడి ఇల్లుచేరితే వంటఇంటినుండి మాడుకంపు కొట్టింది. లోనికి దూరిచూస్తే అన్నం సగం మాడు, మిగత పాడు అయింది. సరసోతికి కన్నెర్రయింది. 'వీనికి దయ్యంపట్టింద, ఏమి ఈ పందిరిపని! అన్నం తినాలా వద్దా!' అన్నది.

ఐతాళులుకూడ పని ముగించుకొని చెరువులో మునిగారు. స్నానం అయింది. ఆయాసం బాపుకుందామని 'ఓం నమఃశివాయ' అంటూ సన్ననిగొంతుతో మంత్రం పఠిస్తూ అప్పుడప్పుడు ధ్వని హెచ్చిస్తూ అక్కడే నిలబడ్డారు. ఇంటికిరాగానే ఆ మాడుకంపు ముక్కుకు కొట్టింది. వంటఇంట్లోదూరి 'ఏమి దయ్యాల కూడా! మనుష్యుల కూడా! తినాలా వద్దా?' అని హుంకరించారు. ఎదుటనున్న పారోతి ఊరకే నోరు మూసుకుంది. సరసోతి చెవికి ఈ అర్భాటం వినబడింది, ఆమె బయటికి వచ్చి 'ఎసరు చూసుకోఅంటే వినిపించుకున్నావా? అన్నం మాడిందంటే ఎవరేమిచేస్తారు? మేము వచ్చేవరికే అన్నం భస్మం అయిందే. ఇంక తినేదే బాకీ' అన్నది.

అంతతో ఆమె వూరకుండలేదు. 'అవునులే! ఈ పందిరిపై శ్రద్ధలో మా మాట వింటేగా! అన్నం మాడినా సరే, కుండ పడిపోయినా సరే, గంటలు గడచినాసరే, నీకేమో పందిరికావాలి—సరకారీ వాళ్ల జమాబందికి వస్తారా? ఆమె మూన్నాళ్ళనుంచి కాళ్ల నొప్పులు లాగుతున్నా వచ్చి నీళ్ళుకట్టాలి. నీకేమో పందిరికావాలి!' అన్నది. రామఐతాళులకు చెల్లెలి ప్రతి హుంకారాన్ని విని కొంత మెలకువ కల్గింది. మాటలు రాలేదు. ఊరికే స్తంభానికి ఆనుకుని 'రామరామ! హరిహరీ' అని జపం చేశారు.

సరసోతి రెండవదఫా అన్నం వుడికించి నాల్గు వడియాలు వేయించిపెడ్తే, ఐతాళులు ఊరకే తినివెళ్లారు, వారి నరసింహస్వరూపం పోయి, ఒక్కసారి పక్కమీదవాలితే చాలు అనిపించింది. ఒక దిండులాగుకొని వెంటనే పడుకున్నారు. నిద్ర, గొరకలు 'నేను ముందు, నేను ముందని' వచ్చాయి.

అక్కడే అంగళంలో కొబ్బెరమట్టలు రాశిగా పడ్డవి. ఆడవాళ్ళు వంట ఇంటిపని చాలించి ఒక్కొక్క మట్టనేసర్ది తడికెలు అల్లారు. 'రాముడు బహుశా దత్తత చేసుకుంటాడేమో! అందుకే ఈ హడావిడి' అనుకుంది సరసోతి. మరేకారణాన్ని వెదకలేని, ఊహించలేని పారోతికూడ 'అదే నిజము, అంతేవుంటుంది' అన్నది.

తెల్లవారఝామునే ఐతాళులు దగ్గుతూ నిద్రలేచారు. తమ అరచేతులను ఆ వెలుగులో చూచుకుని గజేంద్రమోక్షం పఠిస్తూ, ఉదయరాగాలతీస్తూ బయటపడ్డారు. ఆ టెంకాయగరలు చాపలుగా నెయ్యాలి అనుకునేగానే అవి పందిరికూడా ఎక్కినవి అని చూచి, ఈ చాపలు, తడికలు చాలవు అని ప్రక్కన ఇరుగుపొరుగునవున్న కాపువాళ్ళను వెదుక్కుంటూ వెళ్లారు. 'ఓ సూరా! ఓ హొవుళీ! ఓ కాళా! మీకు మంచి తాంబూలాలిప్పిస్తాను, ఒక మోపుమట్టలు బదులిస్తే తిరిగిచ్చేస్తా. లేకుంటే ధాన్యం పంచుతాను, ఒక ఘనమైన పందిరివేయించండర్రా!' అని కేకలుపెడ్తూ వెళ్లారు.

వారిలో ఒకరిద్దరు అధికప్రసంగులు 'మట్టలెందుకు పందిరికా? పందిరెందుకు? సమారాధనా? అవును బ్రాహ్మలఇంటి పాయసం మా బీదలనొసట బ్రహ్మ వ్రాశాడా ఏమిటి?' అని ప్రశ్నించారు. ఐతాళులు నవ్వుతూ 'అవును! మీ శూద్రులతలవ్రాత అంతే! పందిరిఅంటే పాయసానికి నాలుక పీక్కుంటారుగ' అన్నారు - అని తెల్లవారేలోగా మళ్ళీ ఇల్లుచేరారు. ఎండపడి ఝాములోగా నాల్గో ఆరో పెద్ద మోపులమట్టలు అంగళంలో పడ్డాయి. చాపలు తెచ్చినవాళ్ళలో ఒకణ్నిపట్టి పందిరికూడ కప్పించారు. అది పెండ్లి పందిరిలాగా సిద్ధమయింది. ఆ ఆనందంలో వారు తమకు చాల నేస్తమైన కాళన్ని ఉపశాంతిగా 'పిల్లా! ఈ కాళనికి చెంబెడునీళ్లు, రెండు ఊరుగాయముక్కలు పట్రా!' అన్నారు. 'ఒరే! బెల్లం తింటావా, ఊరగాయ తింటావా! చెప్పు' అని కాళన్ని అడిగారు.

వాడు 'బెల్లానికేమండి, ఎక్కడైనా దొరుకుతుంది. బ్రామ్మల ఊరుగాయ దొరికి చాల



నాళ్ల అయింది. అందులో దొరసానిగారి చేతిరాశికూడ చెప్పాలా? ఈ కోటచుట్టు పదునాల్గు గ్రామాలలో ఇల్లాంటి ఊరుకాయ దొరికేనా?' అని పొగడేశాడు.

పారోతి కొత్తగా కారంనింపిన మామిడిపిందెలను ఒక అరిటాకు తునకలోపెట్టి తెచ్చింది. ఒక చెంబునిండ నీళ్లకూడ ఇచ్చింది కాళనికి. కాళడు దయ్యంపట్టినవానిలాగు చెంబెడూ తాగేశాడు. 'అమ్మ! నీళ్ళకేమి బంగారమా! మరొక్కటి పట్టుకురాండి - ఈ ఎండలకు తిండిలేకుంటే పరవాలేదు. నీరులేకుంటే తాళలేను' అంటూ మాటిమాటికి నీళ్లడిగి ఊరగాయ నమిలేశాడు కాళడు. 'అమ్మ! బీదపిల్లవానికి ఒక టెంకాయచిప్పనిండ ఊరగాయ ఇవ్వరాదా! మీపేరుచెప్పి ఇలేగా మధ్యాన్నం భోంచేస్తాము' అని వేడుకునే కాళనికి, వానిసేవలు తీసికొన్నందున కాదనడానికి పారోతమ్మకుకూడ మనసు రాలేదు. కాని అట్లని కొత్తఊరగాయను వానికే బోణీచేస్తే తప్పని, పాత ఊరుగాయను ఒక ఎండిన అరిటాకులో చుట్టి తెచ్చింది. కాళడు దానిని అక్కడే విప్పి 'అమ్మా! ఇది ముందిచ్చిన కాయ కాదమ్మా' అని అనలేదు.

కాళనికి పీకిమ్మన్న ఐతాళులు స్నానానికి వెళ్లారు. ఒక్క మునకవేసివచ్చి, వాని వెట్టి ఋణంలో పడరాదని 'ఉండ్రా! పడి (ధాన్యం) ఇస్తాను' అన్నారు. వాడు చిన్నసహాయానికి పడి తీసికోరాదని 'ఎందుకండీ' అన్నాడు. వారేమో 'అల్లాకాదు చాపలఖర్చుకైనా ధాన్యం తీసుకువెళ్లు' అన్నారు. కాళడుకూడ తెలివిగలవాడే, 'అమ్మ, గింజగిట్రా నాకువద్దు. చాపలకు చాపలు వాపసు ఇవ్వండి. పాయసంమాత్రం మరువవద్దు' అంటూ గబగబా వెళ్లాడు. కాళనినోట్లో 'పాయసం' అని వినగానే పారోతికి దత్తు ఉపనయనం కాబోలు అనిపించింది. కాని ఆమె 'ఏమి? ఎందుకు?' అని మగన్ని అడుగలేదు. ఆమాటలు సరసోతిచెవిలో వేసింది.

సరసోతికూడ ఒక్కొక్కసారి చాల ఘాటుగా, చురుకుగా అనేసేది. 'ఈ యింట్లో పెండ్లి, ప్రస్తం, సమారాధన శాంతి ఊళ్ళో శూద్రమనుషులకు తెలిసింది, మనం రాత్రి పగలు చాకిరీ చేసేవాళ్లం. ఎందుకు చెప్తారు' అనిపించింది. అలాగని అన్నను పూర్తిగా అడిగితే 'ఈ ఆడవాళ్లంతా ఇంతే, పొల్లుమాటలంటే చాల ఇష్టం' అని అన్న అనేస్తాడని నమ్మింది. అతనితో మాట లెందుకుపడాలని ఇద్దరూ దృఢనిశ్చయంతో వూరుకున్నారు.

ఆ మధ్యాహ్నం పందిరిపని ముగించి, ఐతాళులు స్నానంచేసి భోంచేసి ఎండ నష్టం కారాదని కాబోలు, తలకు పసుపుధావళి (శాలువ) చుట్టుకొని, నడుమున నళ్యంబుర్రను ఇరికించుకొని, చేత తాటికమ్మల గొడుగుపట్టుకొని ముంగిట్లోకి దిగారు. ముక్కులోకి ఒక చిటికె నస్యం జోరుగావేసుకొని 'ఇల్లు జాగ్రత్త! మూడునాళ్ల నేను రాకున్నా ఇంటిముంగిలి మాత్రం అద్దంలాగు శుభ్రంగా వుంచండి. సరసోతి అద్దం - అద్దం - ఇంటి ఇల్లాలికేమో కాళ్ల లాగుతున్నాయి అన్నావు. అది ఊరికే పడివుండనీ. సూరనిభార్యనో, కాళనిబిడ్డనో

పిలు, ఆకు అలమైనా తెచ్చివెయ్యని - ఆవిడకు అనుముల ఆకువేసి తోమితేసరి నయమవుతుంది. 'సరే అది ఇప్పు డెక్కడ! మంచి మందాకువేసి రసం రుద్దండి. నయమయ్యాని' అన్నారు.

సరసోతికూడ 'సరే నీవువెళ్లు. ముంగిటిపని అంతా నడుస్తుంది. కానీ ఈ మందు ఎండకే వెళ్లాలనా' అన్నది. అప్పటికే ఐతాళలకు కోపం రెచ్చిందేమో! కానీ, కిమ్మనలేదు. పోతూ 'ఈ ఎండ ఒకలెక్కా, ఈ బాడవ దాటేవరకేకద నేల కాలేది. సముద్రముఒడ్డు చలవేగా' అంటూ ఇంటి తూర్పుకంపదాటి, ఉత్తరానపడి సముద్రంవైపు నడిచారు. ముహూర్తం అంతాచూచుకొని ఈ కంపను దాటువేసిన శాస్త్రంచేసి ప్రయాణం వారశూలను సర్దుబాటు చేశారు.

సరసోతికూడ పారోతిని పిలిచి, 'మనకు తెలియకుండాపోతుందా, అందుకేనే ఈ చప్పరం! మనము చెబితే దత్తు వద్దన్నవాడు, ఇప్పుడు తనంతట తానే దత్తు తీసుకొనే ప్రయత్నంలో దిబ్బలుదాటి, అలుగుదాటి తీరాన పాడుతోనసే గీనసేకి వెళ్లాడు కాబోలు - ఎవరి పిల్లవాణ్ని తెస్తాడో!' అన్నది.

'మూన్నాళ్లు రానన్నారుగా' అన్నది పారోతి. 'ఈ ఇంటివారికి, మా అన్నయ్యకు ఇంటిస్త్రీలంటే గడ్డిపోచలు. ఈ కళ్లాన్ని అలికి అద్దంచేయాలి. ఏమని, ఎందుకని అని అడగటానికి ఎవరూ అక్కర్లే' అన్నది సరసోతి విసుగుకుంటూ.

'వానికి ఎప్పుడూ పనులే. సమయంచాలదు. తీరికలేదు. మూన్నాళ్ళలో పని కావాలన్నాడు. దానికి ఎర్రమన్ను, మొరము, జాజు ఇవన్ని ఎల్లా సంపాదించాలి? ఎవర్ని పిలువాలి పనికి?' అంటూ ఇద్దరూ పనిలోనే గుక్కతిప్పకుండా నిరతులైనారు.

## 5

సరసోతి తలపై లోగిలి, ముంగిలి సిద్ధపరచేబాధ్యత పడింది. కానీ పారోతి వూరకే ఎలా కూర్చుంటుంది. ఆమె వూరకే వుండాలని పతిదేవుని ఆజ్ఞకదా! కాని వూరకుంటుందా? ఇంత శుభ్రం చేయాలంటే పెండ్లో, వుపనయనమో అయివుంటుంది. శుభకార్యమంటే అప్పడాలు వడియాలు అక్కర్లేదా? ఇంటిపూర్తి చేసినవి. సంతర్పణలకు చాలవే?—అని ఆలోచించింది పారోతి. ఐతాళలు ఇల్లు విడిచినక్షణమే. ఆమె ఆత్రంగా 'సరసోతీ, ఎన్ని మినుములు ఎండకేస్తాము? గింజ లెన్ని బయటకు తీయాలి?' అని అడిగితే, ఆమె



'ఎన్నని చెప్పాలి, ఎన్నివిస్తళ్ళు వెయ్యాలో! ఏమి శుభకార్యమో! వాడు చెప్పాక చేస్తువులే. ఎందుకు ఆ చింత? చెప్పిందిమాత్రం చేస్తే సరి' అన్నది సరసోతి. 'మనకు కాబట్టకున్నా ఇంటిపనేగా, తప్పినా?' అన్నది పారోతి, దారితోచకుండా. 'సరే! ఈ అంగళంలో ఎందరు భోంచేయగలరు?' అని చర్చించి సుమారు మూడువందల విస్తళ్ళు పట్టవచ్చు అని తీర్మానించారు. అయితే ఒక వెయ్యిమంది మొత్తం వస్తారని అనుకొని అప్పడాలు, వడియాలు పై ఫలహారాలు సిద్ధం చేయాలని నిశ్చయించారు.

అంతపని వాళ్ళిద్దరికీ సాధ్యంకాదని పొరుగింటి ఉపాధ్యాయులభార్యని అక్కమ్మను కూడ సహాయంతేవాలని అనుకున్నారు. 'ఔను, ఆమె రావాలి - నిమిషంలో దంచేస్తుంది, విసరుతుంది, అప్పళాలు చేసేస్తుంది - కాని ఎందుకంటే ఏమని చెప్పాలి' అనే సంశయం వెలిబుచ్చింది సరసోతి. పారోతి ముఖం చిన్నబోయింది.

పొరుగింటివారిని పిలిపించి, వాళ్ళ ఎదురుగా మనమానం ఎంతలోతు అని చూపుకోవడానికి ఒకదారి అయిందే అనుకున్నది.

సరసోతి శాంతి హద్దుమీరింది. 'మనకర్మ మనం పడదాం' అనుకుంటూ అన్నను మనసార దూషించింది.

'పారోతీ, నీకు పనిలేదా? వాడే నిన్ను కష్టపెట్టరాదని చెప్పాడే. నీవు వూరకే పడుకో. నేను ఒప్పుకొన్నందుకు ముంగిటిపని ముగిస్తాను. మనకెందుకు అధికప్రసంగం. కావాల్సినవి నోరువిడిచి చెప్పింటే చెయ్యమా! ముహూర్తం చాలానాళ్లుందేమో! ఎప్పుడో ఎందుకో! ఎందుకైనామంచిదని వాడిప్పుడే నాందిలాగు తయారవుతున్నాడేమో! ఎల్లాగు మూన్నాళ్ళలో వస్తాడుగదా! వచ్చాక, చెప్పని' అన్నది సరసోతి. మనస్సుమాత్రం సమాధానంగాలేదు ఆమెకు. 'ఆడపుట్టుకకు ఈ జన్మంలో మర్యాద దక్కితేగా!' అనే చింత చుట్టుకుంది.

మరునాడు సరసోతి సూరనిభార్యను, సూరన్ని పనికి పిలిచి, అంగళంనిండా మట్టి నింపిస్తున్నది. పనిమధ్య ఒక అర్ధప్రశ్న బయలుదేరింది. లోనున్న పారోతిని పిలిచి 'పారోతీ, ఏమో నాకు మావాళ్ళను చూడాలనివుంది. మొన్న సాలిగ్రామం రథోత్సవానికి వెళ్లాల్సింది. అక్కడికి వెళ్లకుండా మూడుసంవత్సరాలైనవి. వాళ్ళేమో తిండిగింజలు పంపుతున్నారులే అని నేను ముఖం చూడకుంటే న్యాయమేనా? ఒకనాడైనా వుండివస్తా. లేకుంటే కుదిరితే నాల్గునాళ్లు - అన్న వెళ్లాక వాళ్ళయోచన తగిలింది' అన్నది.

మూన్నాళ్లలో అదీ, ఇదీ చేసి అంగళంపని ముగించారు. సూరని ఇంటివాళ్లు నేల సమం చేశారు. కాళని పెళ్లాము, పిల్లలు అలికి చక్కగా అద్దంలాగే తయారుచేశారు. ఐతాళల అంగళంపనిచేసేసి తాను బయటపడాలని సరసోతి అనుకొన్నది.

సాయంకాలం ఝాముపొద్దువుండగానే, అందరూ పనిమానేశారు. పరసోతి వీపు నొప్పికి ఒళ్లువిరుస్తూ ఆవులించి చిటికెలు వేసుకుంది. చెరువుకు స్నానానికి వెళ్ళింది. మునిగి వచ్చి నారపట్టు కట్టుకొని 'పారోతీ! ఏమి, ఎందుకని అడుగకు—అన్న చెప్పిందంతా చేశాము. వాడు రాత్రికే రాగలడు. నేనిప్పుడే వెడతా. త్వరలో వస్తాను. వాడు వస్తే నన్ను వెళ్ళనియ్యడు. వానిపురాణాలు వింటే నాకు సమాధానం కుదురదు. నాతో వనుంటే చెప్పం వండి' అని ముంగిట్లోకి దిగింది. పారోతి పెదవులు వణికినవి. గుండె ఝల్లుమంది. కానీ సాహసించి 'సరసోతి! ఎందుకు కోపమవుతావు. ఆడదానికి ఏ ఇంట్లో ఏమయ్యాని? నీవు ఆ ఇంటికి వెళ్ళినా సుఖముంటుందా? వారు వస్తారుగా, తరువాత వెడుదువుగాని' అన్నది.

ప్రత్యుత్తరం బింకంగానే వచ్చింది. సరసోతి బొడుగరచి దుఃఖం, ఉద్వేగం పట్టజాలక 'పారోతీ! నీవు వూరుకో! నీకైతే వానిభయం. నా కెవ్వరిహద్దు అక్కర్లేదు. మా అప్ప (నాన్న) నన్ను ధారపోశాడు. నాకు ఋణం తీరింది. నేనేమో అన్నగదా అని నమ్మి వస్తిని. వానికూటికి ఎదురుచూడలేదు. నాకు వచ్చేభరణం నాకు తిండికి చాలు. నా పతిదేవుడు గతించినమీదట, మామ పాపం ఇందాక నీవు పుట్నింట్లో వుండవద్దన్నాడా! నాకు బియ్యం వంపేది ఆలస్యం చేశాడా? నేనేమీ అడగకుండానే అన్నీ పంపుతున్నారే! బిడ్డలు లేరని అన్న ఇంట్లోనే వుందామనుకున్నాను. వీనికి అన్న అని నమ్మితే ఉదాసీనంగా వుంది. ఒక పేగు పంచుకున్నామనివుంటే తాత్పారమైంది. ఇంటికుక్కవలె చావాలి మనం. ఎందుకురా పందిరి అంటే పొరుగింటివారా చెప్పాల్సింది?' అని సెలఏటి నీటిధారగా అనేసింది. ఆమెను ఆపి మాట్లాడేధైర్యం పారోతికి లేదు. సరసోతి బిరబిర విసురుగా చేతులు వూగులాడిస్తూ బయలుదేరింది. పారోతికూడ వెంటబడింది. చూచేవాళ్ళకు దోసపాదులకు నీళ్లు తోడటానికి వెడుతున్నారేమో అని తోచింది.

మైదానం వచ్చింది. దోసమళ్లూ వచ్చాయి. పారోతికి మూన్నాళ్ళనుంచి దోసకు సిరెత్తలేదని జ్ఞాపకంవచ్చి, 'సరసోతి చూడు, అన్నీ ఎల్లా వాడిపోయినాయో! మొన్ననే నీరు కట్టాల్సింది. నిన్నకూడ లేదు' అన్నది.

సరసోతి వెనుదిరుగకుండా 'నా కులగోత్రాలు వేరు; ఆ దొడ్డి యజమానుని కులగోత్రాలు వేరు. వానివద్ద నీటిఋణం వున్నన్నాళ్లున్నాను. చాలు. వెడతా' అంటూ ముందుకు నడచింది. వెంట నీడలాగు పారోతి వెళ్ళింది. చెరువుదాటింది. నదిలోని తగ్గునీరు సంద్రంలోకి పరుగెత్తుతున్నది. పారోతి చూచేలోగా నీళ్లుదాటి 'పారోతీ! అంతా ఋణానుబంధం సుమా! పో ఇంటికి పో' అన్నది. సంసారబంధాలను తెంచుకుని వెళ్ళేవారిలాగా ఆమె ప్రయాణం సాగించింది.

పారోతి నిలబడినమనిషి శిలలాగయ్యింది. కండ్లవెంబడి నీటిధారవలన ఆమెను మనిషే, విగ్రహంకాదు అనవచ్చు. ఎంతకాలం నుంచుందో అలాగు! సరసోతి చిన్నగా చుక్కలాగై అదృశ్యమయింది. 'వెళ్ళిందే!' అని కేకపెట్టి. పారోతి చేతికితగిలిన గచ్చు



ముళ్ళను తప్పించి కుచ్చుకొన్నముళ్ళతోనే బిగ్గరగా అరచిబది. ఆమెమనస్సు శూన్యాకాశం అయింది. ఆ మునిగినసూర్యుడు, పొడిచిన కొన్నేచుక్కలు—ఆ మునిమాపు చీకట్లలో ఆమెమనస్సు బట్టబయలయింది.

పడమటి సంధ్యారాగం దిగబడి మనుష్యులేమో నీడల్లాగే కనబడుతున్నారు. తప్పిపోయిన దూడను తోలుకుని కాళనిపెళ్లాం పొమ్మి ఆ దారిని నడచింది. ఆ శిలామూర్తి పారోతినిచూచి 'దొరసాని' అన్నది. ఆ మూర్తి చెక్కులు నీటిధారతో మెరసిపోతున్నవి. 'ఏవమ్మా దొరసానీ! సరసోతమ్మను ఎదురుచూస్తున్నారేం. ఆమె గడ్డికి వెళ్లారా? ఎందుకమ్మా అసురసంధ్యలో అశ్రుధారలు' అని అన్నది.

పారోతికి తపోభంగం అయింది. నిద్రనుండి లేచిందానివలె 'అవును' అన్నది. ఆమెకు జరిగినకథ స్మరణకువచ్చి, 'పొద్దయింది, వెళ్తున్నాను' అనుకుంటూ పొమ్మిని చూచి 'ఏం! కాళని పెళ్లామా!' అని అన్నది.

'ఔనమ్మా! ఒకలేగ తప్పిపోతే పట్టుకొచ్చాను. ఏం ధ్యానమమ్మా ఇక్కడ? నేను గుర్తుకు రాలేదా!' అన్నది.

'మాట్లాడించావేమే!'

'ఔను దొరసానీ! అమ్మగారు ధ్యానంలోనే వున్నారు' ముందు చెప్పడానికి తోచక తన లేగనుగురించే మరచి 'అమ్మ, పదండి, చీకటిపడింది. ఈవేళ వెన్నెల త్వరగా రాదు. దారిలో పారాదేవి వుంటే కష్టం.'

'పోవే, నీపని చూసుకో, నేను మాఇంటికి వెడతా చీకటేకదా! నిజమే' అన్నది పారోతి.

'సరే రాత్రో, పగలో వెడదాం పదండి' అని పొమ్మి తొందరపెడితే పారోతి బయలుదేరింది. ఆమె వెంటనే పొమ్మి నడిచింది. ఎవరూ మాట్లాడలేదు. అమ్మగారిని ఇల్లుచేర్చి పొమ్మి వెళ్లింది.

తనవెంట పొమ్మి వచ్చింది పారోతికి జ్ఞప్తిలేదు. ఎప్పుడు వచ్చిందో, వెళ్లిందోకాని ఆ మొద్దుతనంతోనే వచ్చి నడిమింటిదీపం వెలిగించి, జపమాల పట్టుకుంది. 'నమః శివాయ' అనేశబ్దాలు నోట్లో, వేళ్లల్లో పూసలు కదిలినాయి. పెదవులకు తీరికలేదు. జపం మాటలు అన్నీ ఆగినాయి. ఒకేవిధంగా కాలేద్వీపజ్వాలను చూస్తూ కళ్లనుండికూడ జపం వెంట ముత్యాలు రాలాయి.

బితాళుల ఇంటిపైన వెన్నెల మసకగా పడింది. గంజితాగిన గేదెలేగలాగు చందమామ సాగుదామా, వద్దా అని యోచిస్తూ మందగతితో వున్నాడు. ఇంక ఒకభాగం ఆకాశం గడిస్తే వాడు మునుగుతాడేమో. ఎందుకు వానికి ప్రయాణం? అక్కడే గేదె లేగలాగు

నెమరువేస్తూ నిలబడితే తప్పా! అతడు లేనిదే జగం ఆగిపోదే! అతడు కేవలం సూర్యుని. భార్యవంటివాడే గదా! పెళ్లాం లేకుంటే ఏమి తొందర అని అనుకున్నాడా చంద్రుడు. పారోతి దుఃఖాన్నిచూచి వాడుకూడ అట్లే వూహించి ఏడ్చి వెళ్లతున్నాడేమో! ఎవరికేం తెలుసు?

రథచక్రాలకు కట్టిన జీవంలాగు చంద్రునియాత్ర సాగింది. తెల్లమబ్బుల తెరలలో ఈదుకుంటూ పడమటిసంద్రంలో పడ్డాదేమో - అతడొకపెట్లో కొట్టుకుపోయే మాని మొద్దు లాగే, జడుడిలాగ సాగి చివరకు మినుక్కుమన్నాడు. చివరకు మామ్మగారినూనె అయిపోయిందేమో ఆ దీపం ఆరిపోయింది.

ఆకాశదీపం ఆరింది. నిజమే. పారోతి ఇంటిదీపంకూడ ఆరింది. నూనెలేదు. వత్తి శరుడుకట్టి కాలి వాసన లేచినా పారోతి ముక్కుకు ఏమీ తెలియలేదు. అది నిప్పులాగు కన బడినతరువాత ఆమెకు మెలకువ వచ్చి, 'హూం దీపం ఆరేపోయిందా' అన్నది. దీపం వెలిగించాలి, నూనె వెయ్యాలి, అన్నం వండాలి అనే ఏ ఆలోచన లేదు. 'పోనీలే! బయట వెన్నెల వుందిగా' అని కూర్చున్నది. బయటిదీపం, లోని దీపాలకంటే ముందే ఆరిందని తెలిస్తేగా. ఆ కాలేదీపం వెలుగులోనే పడుకుంది. చెయ్యి దీపస్తంభానికి తగిలినా, వెనుకకు లాగుకోలేదు.

అదేవేళకే బయట ఐతాళులగొంతుక పిలుస్తున్నది. 'ఓ శీనా! అయితే తెల్లవారే వస్తావుకదా! నా ఇంట్లో నన్నువిడిస్తే మగపురుగులేదు. ఆమె ఒక్కర్తే - ఇంకొకరు చెల్లెలు—ఎంతపని చేయగలరు. అందుకే శీన! ఈ ఎనిమిదిరోజులు నీదే ఇల్లు. నీవే అన్నీ తెలుసుకుని పని నెరవేర్చు' అని తన పక్కింటి శీనమయ్యను మాటల్లో దింపారు. వాళ్ళిద్దరూ ఇందాక జతలో వచ్చారు, శీన తన ఇంటివైపే వెళ్లాడు. ఐతాళులు చెరువులో కాళ్లు కడుగుకొని, తిరిగి ఆ శీనన్నే పిలుస్తున్నారు. శీనకూడ తన ఇంటిదారిలోనే నిలబడి 'కానీ నప్పా! నాకేమీ ఘనతలేదు. కష్టం లేదు. ఒక లగ్నాన్ని గట్టెక్కించగలను. ఎవరైనా 'వైదికుల ఇంటిపెళ్ళి, ఆ సుగివుండల (కొబ్బెర పూర్ణం పెట్టి వుండ్రాళ్లలాగు వేయించిన తీపివుండ) శన్న మిన్నయిన కజ్జాయాలున్నాయా అంటే, ఉన్నాయి అనే వారినోళ్లు కట్టివేయాలి' అన్నాడు.

'అంతా నీ పెత్తనమేనయ్యా! అన్నాగా. కర్ణునికి పట్టంగట్టినట్లే—రణరంగం వడిపే యోధుడే నీవు. సుగివుండలు, వడలు శ్రాద్ధానికే! పెండ్లికి కొబ్బెరతో భక్ష్యాలైనా చాలు. తొక్కుడు లడ్డయినా చాలు. వడుమున్నూరివాళ్లఎదుట సామాన్యమానవుడనిపించకు. సరేనా!'

చావడిలో నిద్రలోపడిన పారోతికి ఐతాళులగొంతుక రణభేరివలె వినబడింది. 'దీపం లేదా! ఆరిందా!' అని హుంకారం వింటూనే నిద్రలేచి, మళ్ళీ నిద్రమబ్బులో తూలిపడింది. అంతలోనే వంటఇంటిలో అగ్గిపెట్టె వెదకుకుని, పుల్ల నేలపైగీచి వెలిగించింది. దీపంపత్తికి



దగ్గరగా పట్టుకుంది. నూనెవుంటేనా వెలిగేది అనుకుంటూ నూనెకుగాను చీకట్లో వెదుక్కుంటూ దీపంలో సగం, బయట సగం నూనె గుమ్మరించి 'ఏమో ఈ దరిద్రంనిద్ర' అని శపించుకుంటూ వెలిగించింది.

ఈ నిద్రమత్తులోనే శీనమయ్యతో మగని సంభాషణ వినింది. పోళీ (హోళిగె)లు, కజ్జాయాలు, లడ్లూ అని వింటూ ఆవలిస్తూ, ముంగిటికి దిగి కాంపౌండు తలుపువద్దకు వచ్చింది. ఆ శీనమయ్యరుతో ఐతాళుల సంభాషణ తంతివార్తలాగు సాగుతునేవుంది. చెరువు గట్టునుంచే ఐతాళులు 'సరే! పనిచూచుకో-పడుకో, నాకూ నడిచి చాలయింది.' అన్నారు.

ప్రత్యుత్తరంగా శీనడు తన ఇంటిమెట్లనుండే 'అయినా, ఐతాళులు ఘటికులండీ! నిశ్చయం అయ్యేవరకూ ఒకరిచెవిలోకూడ వెయ్యలేదు గదా? ఇంటిముందు పందిరి తయ్యారు. అంతా సరే! అప్పడాలు, వడియాలూ ఇంతదగ్గరగావుండే లగ్నానికి ఏదుగు తాయా చెప్పండి!' అన్నాడు.

'అదెంతమాట! సరసోతి నిమిషాలమీద చేసేస్తుంది. రాత్రింబగళ్లు కష్టపడి అంతా చేసేస్తుంది. ఎండకు కరువంటావా?' అన్నారు ఐతాళులు.

మళ్ళీ తంతిమూలంగా ప్రశ్న—'పిల్ల చూడండీ! ఎవరైనా శివళ్ళిపిల్ల అని చెప్పలేరు. అంతా కోటవారిలాగే, ఆ నిలువగీత కుంకుమమాని అడ్డకుంకుమపెడ్తే, అంతా మనలాగే కోటపిల్ల కాదంటారా!' అని వచ్చింది.

'అరే! శీన, పడుమున్నూరు మాదప్పఅడిగగారు శివళ్ళి వారంటావా? వారి ముత్తాత శానాడివారు. శివళ్ళిపిల్లను చేసుకున్నారు. ఏదో సిరిచెడి పడుమున్నూరు చేరుకున్నారు. అక్కడున్నవారందరూ శివళ్ళివారే. కుంకుమ నిలువుగాపెడ్తారు. వీరూ అంతే. అక్కడివారు వారిని కోటశివళ్ళి అని కలిపే పిలుస్తారు. అందుకే సంబంధం సరేకదా!' అన్నారు.

'సంబంధం అపరంజివంటిది. ఏమాత్రమూ మిశ్రమంలేదు. ఎలాగైనా మీవల్ల నాకు ఘనమైన సన్మానం ఏర్పడుతుంది. మీరు అల్లుడు, నేను గిల్లుడని-మీ మిత్రుడంటే మాటలా. నేను ఇంతవరకు అలాంటి ఉపచారం, మర్యాద, సత్కారం ఎక్కడా చూడలేదు. మీరు కూడ సరిగా లెక్కచూచి గాలంవేసి పట్టారండీ. మీకు వయసు ముదిరినందుకూ-పండైనపిల్ల దొరికినందుకూ సరిపోయింది. నగలెన్ని వేస్తారండీ!'

'నేనేమో బంగారు, ఆదీ అని విచారణ చెయ్యలేదు. అన్నీ కెలకి అడిగేది నాకు పట్టదు. పిల్లనే నాకు బంగారం. దేవునిదయతో వారే గజ్జెలడ్డిగ వేయవచ్చు. ఎట్లయినా చెవులు, చేతులు బోడిగా వుండవులే.'

'సరే, ఐతాళిలూ! ఇన్నాళ్ళకా మీకు ఆలోచన? ఈ మళ్ళీపెళ్లి ప్రమేయం? మొదట్లో మొదటిభార్యకు కాయలు కాయకుంటేనే చేసేసుకోవాల్సింది.'

'ఇప్పు డేమైందిలే! గడ్డం పండిందా ఏమిటి ? నోరుబోసిఅయిందా: నాకేమో, ఇప్పటికీ అంత ఇష్టంలేదు. నా సరసోతి నాల్గేళ్ళనుండి దత్తూ, దత్తూ అంటూ మారాం చేసింది. అది నాకు నచ్చలేదు. ముండ్లకంప పొదను మొగలిపువ్వుగా మార్చగలమా! కాకి కాకే! కోకిల కోకిలే! చచ్చేరోజు గంగతీర్థం నోట్లోవిడిచేది కడుపున పుట్టినవాడే కావాలి; దత్తుకొడుకు స్వర్గానికి ఎక్కించేది అంతంతనే. నాకు నలభై రెండేగా! అందుకే ఈ ఆలోచన. అంతే!'

'ఐతాశలూ! మీదీ పిచ్చేనండీ! హిందట్టి హనుమైతాశలు మూడవపెళ్లి యాభైపడిలో చేసుకున్నాడు. మొన్ననేగా ముందరిపళ్లూడింది ముగ్గురు పిల్లలయ్యాక - లేకుంటే వళ్ళతోనే బియ్యంమూట లేబెట్టాడు.'

'హనుమైతాశలూ మా వంశంవాడే! వారికి సమం కాగలనా ? వారు తిన్నదాన్లో సగం తినగలనా ?'

'ఐతాశలూ ! మీ పారోతి అంగీకరించిందంటే చాలు.'

'మా ఇంటిపంచాయితీ నీకు తెలియదులే! మా ఇంట్లో ఒక్కడే యజమానుడు. మగవాడు ఒకటంటే ఆడది మరొక్కటెన్నడూ లేదు. మన పడుకెరె పరమనింటిలాగు పగలంతా కొట్లాడి దండోరావేసే అలవాటు లేదు. దాంట్లో మా పారోతి సీతాదేవితో సమానం. దేవుడు దానికడుపున కాయల నియ్యలేదే అని చింతేగాని ఇంకేమీ లేదు. ఆ కొత్తపిల్ల వచ్చాక తన కూతురిలాగా చూస్తుందో లేదో చూడు.'

'పొండీ! మాటల్లోనే తెల్లవారేలాగుంది. పొలానికి నీరు కట్టాల్సింది. ఈవేళ మీ తోకపట్టుకొని అన్నీ మరచేకూర్చున్నాను. తెల్లవారుఝామైన పనిచేయకుంటే కష్టం.'

'శీన! పొలం గిలం అంబూ తెల్లవారినా రాకుండ వుండవద్దు. పని కుప్పలుగా వుంది. ఎంతోపని-నిన్నే నమ్మినాను.'

'అదంతా మీకెందుకు! ఎండపడగానే మీ ఇంట్లో పడుతా, సరేనా! మీరు రాత్రే యోచన చేయండి. ఎవరెవరిని పిలువాలి, జవళీ ఏమి ? అంగడిసామాను ఎంత ? అన్నీ పట్టీ వ్రాయండి. అన్నీ నెరవేర్చుతా-నమ్మండి, భయం వద్దు' అని అతడు ఇల్లు చేరుతూనే ఐతాశలు చెరువులో మునిగి వచ్చారు. సంధ్య వార్చారు.

పారోతి అంగళంలోనే అన్నీ వింటూవచ్చింది. వీరి సంభాషణలవలన ఆమె కండ్ల ముందు ఒక క్రొత్తప్రపంచమే వెలిగింది. మొదట్లో ఎవరిపెళ్ళో అనుకుంది. చివరకు తనకే సవతి రానున్నదని తెలిసింది.

మనసులో సమాధానం, చింతలతోబాటు పిల్లది, కోటనా, శివళ్లా అనే ధర్మసంకటం ఎందుకు? వీరికి కోటలో పిల్ల దొరకదా ? ఈ వైదీకంవృత్తిగలవారే పొగరెక్కి ఎక్కణ్నో



పిల్లను తెస్తే ఎట్లాగు ? అనే చిక్కు—'సరసోతి పగలూ రాత్రీ పోరాడి అప్పడాలవవి ముగిస్తుంది' అన్నప్పుడు —ఆమె వెళ్ళిపోయిందని జ్ఞాపకం వచ్చింది. ఆమెను నమ్మి అప్పడాలకు తయారు చెయ్యలేదే అని చింతించింది. ఇంటిలోని కొత్తమార్పును భర్తకు ఎల్లా చెప్పాలి ? అని తికమక పడ్డది. శరీరం స్తంభంలాగున్నది. కాని మనస్సు ఆషాఢంలోని ఉప్పెనలాగు పొంగి పొరలింది. నిజానికి ఆమెచెవికి ఆషాఢం అమావాస్య. సముద్రం చెలియలికట్టను తెంచేస్తుందనిపించింది. ఐతాశలు జపంముగించి దగ్గర నిలబడినా ఒంటిపై స్మారకం లేదు.

వారుకూడ తికమకపడ్డారు. గట్టిచేసుకుని 'ఏమి నీవేనా! అన్నీ వింటున్నట్లుందే! ఈ ఆడవారి చేష్టలే ఇవి; మగవారి మాటలసంగతికి చెవులు కోసుకుంటుంటారు. ఈ కిరస్తానీ బుద్ధి ఎప్పుడు పోతుందో! అంటూ ఒక్కసారి అడుగు పెట్టూనే ఏమోఅయింది-చల్లగా వుంది. రెండవఅడుగువేస్తేకూడ అంతే! 'ఓహో! అంగళం అలికినారా! ఏదీ ఆకుతో రాచినారేమో! అందుకే చల్లగావుంది. చివరకు అంగళంపని చేశారుగదా!' అనుకున్నారు ఆ అశాంతిలోను సమాధానపడుతూ.

అల్లాగే అరుగుపై చేరేలోగా మనస్సేమో సంతోషపడింది 'సరసోతీ: నీవు దేవతవే! నేల చక్కగా అయింది' అంటూ చాప విప్పుకున్నారు. 'ఎంతమందిని పెట్టావు? అన్నీ నీవే చేశావా ? ఒళ్లు హూనమయిందేమో! పాపం! పడుకో, ఎక్కడపడి నిద్రపోతున్నావో ? ఏమంత మట్టిపాలయిందని నిద్రలేపాలి' అని ఉపచారవాక్యాలు పలికారు.

సరసోతి ప్రసంగం సరేకాని, ఆమె వూళ్లోలేదని వారికేం తెలుసు. ఇప్పుడైనా ఆమె సంగతి చెప్పాలని తోచింది. మగనివద్దకు వచ్చింది-ఆమె చప్పుడువిని, 'నీవా! చావిట్లో దీపంపెట్టేదికూడ నేర్పాలా! చేతగాదా!' అని గద్దించారు. పడసాలలోని దీపాన్ని చావిట్లో తేవాలని వెళ్ళింది. వారే మళ్ళీ 'ఎందుకీ దీపం - నేను పడుకున్నాక ? అన్నం తిన్నాక తొక్కేందుకే!' అన్నారు.

పారోతి విసుగుకుంటూ వెనుకకువెళ్ళి, దీపాన్ని పెట్టి నిట్టూర్చింది. 'నీమర్యాదకు నేను గదిరించడం ఎక్కువైంది. కాని చాటుగా వినేది తప్పుగాదా! అబ్బా ఈ ఇంట్లో ఒకసారిచెప్పితే వినరు-రెండుసార్లంటే కోపాలు' అన్నారు. 'నేను అందుకు కాదండీ, అనేది,' అన్నది పార్వతి.

'నువ్వు దేనికంటావో మహారాణీ! నాకళ్లనిండా నిద్ర నిండుకుంది. కాళ్ళు నొస్తున్నాయి, తెల్లవారుఝామున వేరే తెవ్వాలి. ఎన్నోపనులున్నాయి. నీకేమో తమాషా అయింది' అన్నారు.

పారోతికూడ ఆ తలాతోకలేని మాటలధోరణిని విని నోరు బిగించుకొంది. అయనేమో తప్పులేనిదే కోపపడినారనే నిశ్చయించుకొని కొద్దిగా బిరుసుగానే 'నాకేమీ వుప

కారం జరగాలనికాదు-మీ చెల్లెలిసంగతి చెప్పాల్సివుంది. అప్పడాలు వడియాలకథకే— చెబుదామని వచ్చాను' అన్నది.

'అయితే మీకు చేతగాదా? ఎవరితోనైనా చేయించు, సరేనా, పడుకో.'

'మీకు మేమెట్లా కనబడుతామో! ఏమో! అందుకే అంతా అవకతవక అంటారు. మీచెల్లెలు అంగళంపవి పూర్తిచేసి, ఈ సంధ్యవేళకే మందర్తికి వెళ్ళిపోయింది.' ఈవార్త చెప్పి—మరింత రామాయణం కారాదని పూరికే వంటవసారాలోకి వెళ్లింది.

ఐతాలలకు గాబరా అయింది, ఇంట్లో ఏమో విప్లవం చెలరేగింది. చెల్లెలు కోపించి వెళ్ళిందని దెలుసుకొన్నాడు. ఆమె లేకుంటే పనే వెళ్లదే, తెల్లవారదే అనుకుంటూ పడకలో లేచికూర్చుని, 'పిలా!' అని పిలిచారు, పెళ్లాం వస్తేగా! 'మిమ్ముల వెంటపెట్టుకొని సంసారం ఎల్లా చెయ్యాలి' అని పక్కమీదనుంచి లేచి, 'ఊరకే సగంసగం ఎందుకు చెప్తావు? సూ-అంటే సుగివుంట అని నాకు అర్థం కాదు. దానికేమైంది? మీరిద్దరూ కలహించారా?- నేను ఒకగడియ బయటికెళ్ళితే కుస్తీలు—'

'నేనేమీ జగడం పెట్టలే! అన్నిపాపాలకు నేనేనా! మీరు సంభావితులు—నేను పాపిష్టివాణ్ని-అయిందంతా చెప్పవే మహారాణి!'

'అయిందేమీ లేదు-పందిరిపని, అలుకుడు నేలపనిపెట్టారే-వెట్టిచాకిరీ చేయిస్తాదు. ఎందుకు ఏమీ అని చెప్పడు? అని కోపించివెళ్లింది. వెళ్లిన వాలకంచూస్తే ఇప్పట్లో రాదేమో! మూడురాత్రులూ రెప్పవేయకుండా పనిచేసింది. 'ఈ ఇంట్లో నేనొక గడ్డిపరక-పరక' అంటూ ఏడుస్తూ వెళ్లింది.

సరే! ఆడపడుచు దుఃఖంతోబాటు తానుకూడ ఏడ్పు మొదలుపెట్టింది. ఆమె ఏడ్పును గమనించి ఓదార్చేతాలిమి, ఓరిమివుందా ఐతాలలకు? చెల్లెలు లేకుంటే తన ఆట కట్టినట్లే. చెల్లెలు నిర్గమనం, ఊళ్లో ఎన్నో వదంతులకు కారణం అవుతుంది. ఇంతకు ముందే 'తన ఇంటిలో అంతా నెమ్మది. తనమాట కెదురులేదని చెప్పుకొన్నారే! మగవారి పెత్తనం అని' బడాయికి ఇదేనా ఫలం?

ఈ మనఃక్లేశంతోబాటు, పారోతి మొర, కన్నీరుకూడ కనబడింది. వారు మూఢు లాగు 'మహారాణి, నీవు తూర్యనాదంచేస్తే, నేను ఏంచేసేది. చెల్లెలులేదనే కరకరతోబాటు నీ శోకం ఎందుకు?' అంటూ 'ఛూ, ఛీ ఛీ—ఈ సంసారానికి చిచ్చు పెట్టా!' అంటూ ఇంటి వెనుకకు వెళ్లారు. చీకట్లోనే కొన్నిపుల్లలు, కొబ్బెరమట్టతెచ్చి కాగడావలె చుట్టచేసి దీపానికి వెలిగించి 'నేను మందర్తికి వెళ్ళివస్తాను. అంతవరకైనా నీ వాద్యం ఆపు. అందరూచేరి నా మానం తియ్యకండి' అని భార్యను మందలించి బయటపడ్డారు.

ఐతాలలు పొడుగాటికాళ్లతో పెద్ద అంగలువేస్తూ, కాగడా పట్టుకొన్నచేతులను వూపుకుంటూ నడిచారు.



మగడు అర్ధరాత్రి ఇల్లువదలాక, పారోతి తన దుఃఖాన్ని బిగబట్టుకుంది - ఊరకే కూర్చుంది. వీరేమంటారో, ఆమె ఏమంటుందో ఎంత వాగ్వాదమో—అనేచింతతో వుంది. కూర్చుని విసుగువచ్చి 'అంతా నాదేమీ లేదు—పైవాని ఏర్పాటుప్రకారమే' అని వైరాగ్యంతో పడుకున్నా నిద్ర పట్టలేదు. పొర్లాడినా నిద్రరాదు.

ఐతాలలు మళ్లమీద మళ్ల, చేలమీద చేలు తొక్కుతూ నడచారు. మూడుపరువులనేల ఆరుగంటలకు నడచారు. దారివెంట కుక్కలు మొరుగుతుంటే బారకూరు పొలం చేరుకున్నారు. మొదట్లో కొండదిగి అడవిదారి పట్టారు, కాని అటు ఇటు తిరిగి చెల్లెలివూరు చేరుకున్నారు. వీరి అడుగులచప్పుడుకే ఆ ఇంటికుక్కలు లేచి మొరగినాయి. 'కుక్కలకేమో గ్రహచారం' అని శాపంఇస్తూ ఇల్లుచేరారు. పెద్దతలుపులు తెరచిచూచి ఐతాలలని తెలుసుకొని ఇంటివారంతా సభలాగచేరి ఆహ్వానించారు. ఐతాలలు అందరిని సంబోధించి తన లగ్నానికి తానే పిలుపు చెప్పడానికే వచ్చానని నోటినిండ తామే అన్నీ అనేసి తాను అర్ధరాత్రి బయలుదేరాల్సిన అగత్యాన్ని వివరించారు. చెల్లెలిని ఆప్యాయతతో మాట్లాడి ఒప్పించి వెంట తెచ్చారు. ఇంటిదారిలో ఆమె పల్లెత్తి మాటలాడలేదు. ఐతాలలు ఇన్నాళ్లూ ఏమీ చెప్పనందుకు తామే అనేకంగా అన్నీ వున్నవి లేనివికలిపి మహాభారతంలాగు పెంచి చెల్లెలికి చెప్పారు. సరసోతికి తన అన్నయొక్క శుష్కగర్వం ఒకసారి అయినా తపవల్ల విరిగింది గదా అని మనస్సు కుదుటబడింది.

ఇద్దరూ ఇంటి లోగిట్లోకి వచ్చేసరికే సూరనికోడి కూసింది. సరసోతి వెనుకచూస్తే తెల్లవారింది. ఇద్దరూ చెరువులో కాళ్ల కడుగుకున్నాక 'నడిచి చాలయింది, గడియసేపైనా నిద్రలేదే' అని ఐతాలలన్నారు.

'నీవు పడుకోన్నా........'

'నీవుమాత్రం ఏమి చేస్తావు ఈ చీకటికి?' అన్నారు.

'చీకటెక్కడ-కోడికూత వినలేదా? తెల్లవారింది. తెల్లవారి ఏమిచేయాలో చూస్తున్నా' అన్నది సరసోతి.

పారోతి నిద్రమేల్కొనింది: సరసోతి గొంతువిని. ఆమెకు నూరింతలధైర్యం వచ్చింది. దేవుడు దయదలచాడు అని అనుకుంటూ, సరసోతికి స్వాగతం చెప్పాలని వెళ్ళింది. మగవారిమాటలు వినరాదు అనుకుంటూ వెనుదిరిగి పడుకుంది. సరసోతివెళ్లి 'పార్వతికి నిద్రపట్టిందా?' అన్నప్పుడే లేచింది.

# 6

ఈ పదిహేనుదినాలైతే రామఐతాళుల ఇల్లు సంతలాగు, ధర్మసత్రంలాగు, సంత 'కంబళ' జాత్రలోని ప్రసాదాలపండుగవలె వుండింది. వచ్చి, పొయ్యేవారి కోలాహలం, తిని త్రేన్చేవారి చప్పుళ్లు చెవులను మూసేస్తున్నాయి; ఇంటిపెత్తనం, సమారాధనవరకైనా శీనమయ్య చేతబడ్డది. ఆరాత్రి చెప్పినట్లే తెల్లవారుఝాముననే తన పొలానికి నీళ్ళుకట్టి ఐతాళులఇంట్లో హాజరు అయ్యాడు. శీననిగొంతు 'గర్భనిర్భేదకం' అంటారుగదా, అంత మహాగట్టిది. అతని భార్యకూడ యజమానునివెంట పనికెక్కింది. ఆమె రహస్యంగాచెబితే మూడువందల గజాలైన వినవస్తుందని ప్రతీతి. వీళ్లంతా సముద్రం హోరును అణగద్రొక్కేంత మాటలు గలవారు. వంటశాలలో ఇటువంటివారు ఎనిమిది పదిమందివున్నా వేలజనం వున్నంతసందడిగా వుంది.

ఐతాళులు పెండ్లికొడుకైతేమాత్రం - అందరికీ పిలుపునిచ్చే వా రెవరు? దూరబంధువులను పిలవడానికి శీనడైన మరెవరైనాసరే, కాని, తీరాసమీపం బంధువులకు, తన పౌరోహిత్యం గృహస్థులకంతా తానే సిగ్గువదలి వెళ్ళి చెప్పవలసిన సందర్భం. ఇంట్లో మగవారెవరూ లేరు. శీనమయ్య పెండ్లి పెద్ద. కాని తమ బాధ్యతలను తామే నెరవేర్చవలసి వచ్చింది. ఈ పందిరి ఆర్బాటం చూచిన వూరివారు ఇది ఎందుకు? అని మొదట్లో సందేహపడినా, రాత్రి ఐతాళులు, శీనయ్యకుపంపే తంతివంటి వార్తలువిని అందరికీ అతడు పునర్వివాహం చేసుకుంటున్నాడని ఖాతరు అయింది. ఆ సంగతి పడమటి చెరువు, తూర్పు చెరువులలోకి గాలివార్తగా వెళ్ళింది, ఐతాళులు అక్షతలగిన్నె చేతబట్టుకొని ఎవరింటికి వెళ్ళినా, వారే అన్నీ చెప్పేసేవారు. 'వస్తాము-సరేనా!' అనేవారు. లగ్నముహూర్త వివరాలుమాత్రం ఐతాళులు చెప్పాల్సి వచ్చేది.

ఎలాగైనా ఐతాళులు తమ కర్తవ్యాన్ని నెరవేర్చాలి. వెళ్ళినచోటంతా అందరూ సుస్వాగతమే చెప్పారు. అక్కడ మరింత అధికప్రసంగం జరగకుండా 'మా చెల్లెలి బలవంతం—పారోతి హఠం అన్నింటివల్లనేనండి నాకు ఈసంకల్పం' అని తామే వుప్పు, కారం, మసాలాచేర్చి మాట్లాడేవారు. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నందుకు సంతానవాంఛతోనే పెండ్లాడుతున్నట్లు, పడుమున్నూరివారి సంబంధబాంధవ్యాలవివరాలు అందరికీ వర్ణిస్తూ తిరిగారు. వాళ్లు శివళ్ళిలో కొంతకాలంవున్నా, నియమం, నిష్ఠ, విద్వత్తు అన్నింటిలోను అంతా కోటవారే. వాళ్ళకు కొబ్బెర, పనస, పొన్న, ఇప్ప సకలసౌభాగ్యాలు వున్నవి. పేరుకు పడమట, తూర్పువారి సౌకర్యాలన్నీ వున్నవి, అనే సిఫారసు అయింది.

వారు పెండ్లిపిలుపుకు వెళ్ళినవూళ్ళలో కొందరు పెద్దమనుషులుకూడ వుండేవారు. వారికి ఐతాళుల మొదటివివాహం జ్ఞాపకం బాగావుంది. వారు 'ఓ రామా! మీనాన్న



కోదండం—నీ మొదటిపెండ్లి వానిహోరులో చేసేశాడు—చేతకాని ముసలివారు రాలేకపోయినాము—నీవేమో అన్నీ దూరస్థళాలే వడపాందేశ్వరం, పడుమున్నూరంటున్నావు' అన్నారు. ఐతాళులు 'అదేంమాట! దోనెలో కూర్చుంటే ఒక్కతోపుకు తొణసిలో పడతారు. తొణసినుండి నాల్గుచేలుదాటితే వాళ్ళఇల్లు. మీరు దూరంగీరం అని రాకుండా వుండవద్దు' అడువత్తిడిచేసి వచ్చారు.

ఆదినం ఉదయం ఇల్లువదలి ఐతాళులు రాత్రిలోగా భూప్రదక్షిణం చేసేవచ్చారు. రెండు పెద్దసంచులను నెత్తినపెట్టుకొని కుందాపురంసంతకు వెళ్లాడు సీనమయ్యరు. అక్కడ గణుసు, మిరపకాయలు, కూరగాయలు కిరాణాసామాన్లు అన్నీ బండికెక్కించి అర్ధరాత్రికి హంగారకట్టి చేరాడు. దోనెలోనే ఐతాళులఇంటి వెనుకభాగంచేరి 'ఓ సూర, కాళ, రండిరా' అని తమతమ ఇండ్లలో నిద్రపోయినవారిని లేపడానికి కేకలు పెట్టాడు. సామాన్లు దింపేసరికి తెల్లవారుఝాము అయినా, ఒక గంటయినా నిద్రపోవాలని అనుకుంటూనే తన సంతవర్ణన ఇతరగప్పాలు ప్రారంభించాడు; ఎంతెంత ప్రియమైనసరుకును తను ఎంత చౌకగా కొన్న సంగతి.

'ఆ దరిద్రపుబండి ఎన్నిసార్లు కుంటికాలు వేసింది, హంగారకట్టిలోకూడ ఎంత అరచినా ఎవరూ రాకపోవడం, ఎన్నోచాడీలు తన బడాయిలు చెప్పేశాడు శీనమయ్య. తానే మణూరు, పడుకెరె, కోడి, కన్యాన మొదలైన సముద్రతీరపు అన్నిగ్రామాలకువెళ్ళి మధ్యాహ్నం భోజనాలకు హాజరు అవుతాను అని అభయమిచ్చాడు శీనమయ్య.

తననిద్ర చెడినందుకు తృప్తిలేని శీనమయ్య 'సరసోతమ్మ, ఒక వెయ్యి అప్పడాలైన చాలుతాయనుకొన్నావా? మగపెళ్లివారు అంతఖర్చు చెయ్యాల్సినపనిలేదులే. కాని సమావర్తనం, ఆరతి.అక్షత (ఆశీర్వాదం) అంటే ఆరువందలమందైనా తినరా: పెండ్లి నాలు రోజులున్నాయిలే అనుకున్నా మనవాళ్ళు రాకుండా వుండరు. రెండు గొప్ప భోజనాలు, నిత్యకట్ల భోజనాలు, ఐతాళులంటే చీమలు మూగినట్టు మూగుతారు' అన్నాడు.

సరసోతికూడ వెంటనే 'అటుకులూ, మినపపిండీ సిద్ధంగా వున్నాయి, అప్పడాలు, వడియాలు సాయంకాలానికి సిద్ధం. అదేమంతపని' అన్నది. శీనమయ్య 'మీ చెల్లెలండీ....' అనేలోపుగా ఆమె 'శీనమయ్యరూ! నగలసంగతి చూచుకొమ్మనండి. వాళ్లు ఎంత బంగారు పెట్టినా మనం నల్లపూసలు, బంగారుగాజులు, తాళిబొట్టు, ఒక గుండ్లసరం తప్పక వెయ్యాలి. మూన్నాళ్లలో నిశ్చయం అంటే చేయించాలనా వద్దా!' అనింది.

'ఔను, సరసోతమ్మ! మగవారికి ఇవి తెలిసేసరికి తెల్లవారినట్లే; ఐతాళులూ మనం ఖాళీచేతుల్తో వెళ్ళరాదు. సరసోతమ్మ చెప్పినవన్నీ తప్పవు. నిజం.'

'ఔను, శీన, మా సరసోతి అనినంత మొద్దుకాను నేను; నిన్న పిలుపుకు వెళ్ళినప్పుడే

అగసాలి గుండయ్యను పిలిచి బంగారం ఇప్పించి ఎల్లుండికే అన్నీ సిద్ధం చెయ్యాలని చెప్పి నాను' అన్నారు ఐతాళులు.

'శీనమయ్యగారూ. ఈ అన్నకు మాకు ఒక్కమాట చెప్పాలనికూడ లేదు.'

'నువ్వు, ఏమీ అనవద్దు సరసోతి. చెబ్తా కూర్చుంటే సమయం ఏదీ? నిన్న మంద్ధరినించి పిల్చుకొనివచ్చి, వెంటనే స్నానం, భోజనం, పెండ్లిపిలుపులు; మాటల కెక్కడి తీరిక? మీకేమో ఏది సూక్ష్మం, స్థూలం అనే విచక్షణ లేదు. నేనేమి చేసేది.'

'సరేలే, దీనికేమంటావు? పారోతి పెళ్ళికి రావాలా? వద్దా!'

'ఇవేమిమాటలు సరసోతీ! నేనేమైనా పారోతి అంటే ఇష్టంలేకుండా పై పెళ్ళి చేసుకుంటున్నానా చెప్పు. దానికికూడ నా వెంట పిండం లభించాలనికదా ఇంత ప్రయాస....'

'నేను ఆ సంగతికి కాదు. అమె పెండ్లింటికి రావాల్సింటే బోసిమెడగావే రావాలా? నువ్వు ఆమెకు ఎంతబంగారం చేయించావు చెప్పు. ఈ పెండ్లిలెక్కలోవేసి ఇంటికి వచ్చే దానికి చేయించేనగలలో సగమైనా ఇంట్లోవాళ్ళకు ఛేయిస్తే తప్పా! పెండ్లిలో ముత్తైదువలు ఈమెనుచూసి వెక్కిరించరా మరి!'

'సరసోతీ! బంగారు చేయించరాదు అని కలలోకూడ అనుకుంటానా! దానికి వేళా పాళా వద్దా! పెళ్ళి రెండేనాళ్లుంటే ఎన్ని చేయించగలను చెప్పు!'

'సరేలే—ముఖ్యమైన నగలు చేయించు. తరువాత తక్కినవి చూడవచ్చు. తరువాత చేయించినా సరే, మానేసినా సరే! పారోతి ఇంతవరకు బంగారాన్ని కోరింది కాదు. ఇప్పుడూ కోరడంలేదు. అయినా మనకైనా తెలియవద్దా?'

'మహారాణీ! పెండ్లిదినాలలో పంచేరు బంగారు హొళ్లగారి ఇంటినుంచి తెచ్చివేస్తా! సరేనా!' అన్నారు.

'ఔను. అక్కడ పెళ్ళికి వచ్చినవారికి పాతది, కొత్తది అనే గమనం ఎందుకుంటుందిలే,'

సరసోతి వాదాన్ని ఎదిరించేశక్తి ఐతాళులకు లేదు. బంధువులవరకు ఖర్చుపెట్టగలరే కాని, అంతకుమించిన దొంబిచేసే శక్తిలేదు. మనస్సు ఒప్పదు. పారోతికి బంగారం మోపినా ఒకటే లేకున్నా ఒకటే అనే కచ్చితమైన అభిప్రాయం ఏర్పడింది. కాని పైకి చెప్పేస్తే, సరసోతి ఇల్లు వదత్తే ఇంటివ్యవహారం పడుకుంటుంది. అందుకే శీనమయ్యకేసి చూశారు. అతడు ఏ ఎండకా గొడుగు పట్టగల నేర్పరి. బస్రూరు పంచాయితీ చెప్పాడు. 'అయితే, హొళ్ళరుగారినుంచి మీకు కావలసిన బంగారునగలు తెచ్చి గుండవితో మెరుగుపెట్టించి వాడుకోండి' అన్నాడు.

'అయితే! ఎరువుసొమ్ము తిరిగి ఇవ్వరా! శీనయ్యా!' అన్నది సరసోతి.



'పెళ్ళిళ్ళ తరువాత వానకాలం—అప్పుడు వ్యవసాయమూ లేదు; గుండనికి పనీలేదు. నాల్గు.వరహాల బంగారు ఇస్తే గుద్దుతూవుంటాడు. పెండ్లి రెండురోజులసంగతి నేను చెప్పాను' అన్నాడు శీనమయ్య.

ఈ నక్కమాటలతో ముగింపు వుండదని సరసోతి మౌనం వహించింది. తనపనికి వెళ్ళిపోయింది. శీనడు 'ఐతాళులూ! తెల్లవారింది, మామిడిఆకులసేవ జరగాలి. ముఖం కడుగుకొని పెసరపాయసం తాగండి. తరువాత ఎంతో పనివుంటుంది' అన్నాడు.

ఐతాళులు నవ్వుతూ 'సరే లేరా! ఏమైన్నాసరే, నీవుమాత్రం ఈపెళ్ళి నాల్గునాళ్లూ నన్ను వదలకు. సరేనా? ఏమున్నా ఫరవాలేదు. ఆఖరుకు పెరుగు అటకులైనా సరే!' అన్నారు. సరసోతికి తగిన సమాధానాలతో నోరు మూయించిన శీనన్నిప్రజ్ఞను మెచ్చి శీనదే ఆపద్బాంధవుడని నిశ్చయించారు.

శీనడు 'పెరుగులో అటుకులే సరి. రాత్రి భోంచేసినా ననుకున్నారా? పిన్నంతా ఎండలోతిరిగి, నీళ్లు తాగే పొట్ట నింపినామే! ఈవేళ కొంతవరకు కడుపునిండితే తరువాత ఒకఝాములో పెసరగంజి లభిస్తే అమృతప్రాయం' అన్నాడు.

ఐతాళులుకూడ దంతధావనానికి వెళ్లారు.

మూన్నాళ్లు తయారై నాల్గవరోజే వివాహానికి వెళ్లాలి. సమావర్తనంనుండి పెళ్లి కొడుకు ఆపాదమస్తకం ఆభరణాలతో అలంకరించుకుని, తలపాగా చుట్టుకొని, చేతిలో తాటి విసనకర్రపట్టుకొని నుంచునివుంటే, వంటఇంటి కిటికీలోనుంచి తొంగితొంగిచూచిన పార్వతిహృదయంలోని మర్మమేమిటో చెప్పలేము.

ఆమెకు తనపెండ్లి, నాంది జ్ఞప్తికి వచ్చాయి. అల్లాంటి అలంకారంతో, చాల యౌవనంలోవున్నవా డొక్కడు (పదిహేను, ఇరవైఏళ్ళక్రితమే) తనను పెళ్ళియాడాలని జడివానలో తమ ఇంటిమిట్టపైనుండి బయలుదేరినసంగతి గుర్తుకొచ్చింది. అక్కడ నుంచో టానికే స్థలం లేదు. అప్పుడు తానేమో మగన్ని చాటుగా చూచుకుంది. తరువాత తొలిసారి తన పతి గృహప్రవేశం, ఏటేటా సంతానం కావాలని మొక్కుబళ్లు అన్నీ కెరటాల్లా తోచినవి. చివరకు తాను వంధ్య ఎందుకు కావాలి అనే శేషప్రశ్న మిగిలింది. ఇప్పుడు ఎక్కడి మనశ్శాంతి? సవతి వస్తే సుఖం ఎక్కడ? మనస్తాపాలు బయలుదేరవా? మగడు పూర్తిగా ఆమెనే వలచిన తనగతి యేమి?....తాను ఆమె నాశ్రయించాలా'.......?

దీనికంతా ఏమిటి సమాధానం? తదుపరి తిలతర్పణం, ఉత్తరక్రియలకు బాధ్యుడు వుదయిస్తాడనేదేనా? ఐతాళులపట్ల సరియైనపని జరిగింది, ఆ పిల్లవాడు అతనికొడుకు, తనకు సవతి కొడుకు. తనకేమి, రక్తబంధువా?..అని ఎన్నోవ్యూహాలు చెలరేగి కన్నీరు వరదలైనాయి. తరువాత పెళ్ళికొడుకైన పతిని చూడ బుద్ధికాలేదు. అప్పటికే ఇంటి కెందరో

ఆప్తులు, మిత్రులు వచ్చారు. అంతా గందరగోళం, వారికి వుపచారాలు జరగాలి. అందుకే ఆమెకు యోచన తగిలింది.

ఇక సరసోతిసంగతి. ఆమెకు అన్న పెండ్లి చూడాలని లేదా? దానికంటె ముఖ్యమైన పనులే ఎక్కువ. అప్పడాల బాణలి కావాలి, పిండివంటలు కావాలి. ఎవరు చేస్తారు? శీనుని తియ్యని వుపచారాలతో అందరూ పెళ్ళికొడుకును చేసినప్పటినుండి గృహప్రవేశందాకా వదిలేట్లు లేరు. అప్పడాలు ఒకేనాడు భక్షించకుండా చూడాలి.

పారోతికి దుఃఖం ఒరపిచ్చినతరువాత, తాను ఇంటిదాన్నని, తాను మరుగుననే ఉంటే అందరూ తన కిష్టంలేకుండగనే అన్నీ జరుగుతున్నాయని అనుకోరా? అనిపించింది. ఉప్పొంగే దుఃఖాన్ని కట్టవేసి, వంటశాల చేరింది. పొగకు దగ్గుతూ, చీదుతూ బయటికి రావలసివచ్చింది. తరువాత మందహాసంతో అటు ఇటు తిరుగుతూ మాట్లాడపూనుకొంది. ఒక పురంధ్రీమణి సౌభాగ్యవతి 'చూడు, పారోతీ, నీమగడు నగనట్ర, వేసుకుంటే నవయౌవనునిలాగానే, ఇరవయ్యేండ్లు దాటనివాడిలాగానే కనబడుతాడే!' అన్నది. దానికి అందరితో బాటు తానూ నవ్వింది.

సమావర్తనం తరువాత భోజనాలకు ఆకులు వేశారు. పందిట్లో రెండువందల ఆకులు పడ్డాయి. ఇతరత్ర బయటినుంచి జనం వస్తూనేవున్నారు. శీనన్ని పిలిచి ఐతాపలు 'అన్నీ సవ్యంగా అందుతున్నాయా?' అని అడిగినారు. శీనడు వాగ్విలాసానికి పెట్టినది పేరు. చక్కగా అన్ని వడ్డింపజేశాడు. మొదటిరెండు పంక్తుల భోజనాలు తరువాత మరొక వంద మంది మిగిలారు. శీనడు వంటవారితో 'తొందరగా వేడివేడి వడ్డించితే ఈమందిఏమి మరి రెండువందలే భోంచేసెడివారే' అన్నాడు. ఐతాపలు కంగారయ్యారు. సరసోతి వెంటనే మిగిలిన చారు, పులుసుల్లోకి తగినంత నీరు, వుప్పు, పులుసు కారం అంతాచేర్చి గబగబా సర్దింది. ఈసారి శీనడు గర్జించాడు 'మూడవబంతివారు కూర్చొండి' అని. గబగబ వడ్డెనలు జరిగినై, చారు రెండవసారి ఒకవైపు కావాలని కోరినప్పుడు, కొన్నివరుసలు పులుసు రెండవసారి తిని, పులుసు రెండవసారి తినాలనే అభిలాష పుట్టినవారికి భక్ష్యం, చిత్రాన్నాలు ఎదురై లేకుంటే మజ్జిగపులుసే వచ్చి, కొందరికి బెల్లం, సెనగపప్పు పాయసం వడ్డన జరిగి తొందరగా అందరూ తిని లేచేలాగు చేశాడు.

శీనడు వంటశాలలోకి వెళ్ళి 'అప్పుడే ఇంత తొందరచేపింటే, వీళ్ళంతా కాచుకొనేపని తప్పెడిది కదా! ఆశీర్వాదాలనాడుమాత్రం నామాటప్రకారమే వడ్డించండి' అని కచ్చితంగా అజ్ఞ నిచ్చాడు. ఎవరూ ఏమనలేదు. కానీ సరసోతి శీనమయ్యగారూ, 'ఈపళంగా భోజనాలకు పిలిచిం దెందుకని? పొట్ట బిగించుకొని తినేదానికంటే అదే మేలుగదా!' అన్నది.

శీనడు 'అవునమ్మా! పొట్టపగులతిని త్రేన్చాలనే వచ్చేవారు మధ్వనవమి సంతర్పణకో రాజాంగం (రామపట్టాభిషేకం) సంతర్పణలకో ఉడిపికి వెళ్లాలి' అన్నాడు.



శీనడికి తరువాత పెండ్లిగుంపును వియ్యాలవారింటికి తరలించే బెంగ, ఆత్రం. ఎలా బయలుదేరాలి? పందిట్లో వందమంది తిష్ఠ వేసుకున్నారు. అందరూ రెండుపరువులనేల ఎందుకు నడుస్తారు? అందరికి తొనసెవరకు నౌకాయాత్ర చెయ్యాలనే వుత్సాహమే: అది వీల్లేదు. ఇంటివారు—ముఖ్యులు, భజంత్రీలు, పెండ్లిసామాన్లు తెచ్చేవారు. తాను మాత్రం నౌకలలో విహరించాలి. వీలైతే బండసాలెనుండి జోరుగా మెరవణి (వూరేగింపు)లాగు నౌకలు వెళ్లాలి. కాని నాల్గే నావలు ఏర్పాటు అయినై, బియ్యం బస్తాలను నింపినట్లు నింపితే 60 మంది పడతారు. ఒక నౌకనిండ సామాను. ఇది పెద్ద సమస్యయే. పెండ్లికొడుకు బాధ్యతకు నిలబడినవారంతా పందిట్లోనే మిగిలిపోతారే; ఏం చెయ్యాలి? శీనడు, బయటికివచ్చి పడమటకు చూచాడు. వెనుకకువచ్చి లోనవచ్చి 'ఐతాపలు! నడచేవారు ఇప్పుడే బయలుదేరాలి. లేకుంటే చీకటిపడుతుంది. రేవువద్ద దాటించేందుకు చాల సమయం పడుతుంది. నేను తలక్రింద తపస్సుచేసినా నాల్గింటికంటె ఎక్కువ నావలు దొరకలేదు. ఈ హంగారకట్టె షావుకారులు కొక్కరేణికి బియ్యం సరఫరా చేయ దానికి నావలను గుత్తకు తీసేసుకుని మీ పెళ్ళికి మోసం చేశారు' అన్నాడు.

'నేనేమంటానంటే—ఇంటివారు-ముఖ్యంగా గురికారులు (గ్రామపెద్దలు) నౌకలో; మిగిలినవారు పదయాత్ర' అనే శీనని సింహగర్జన గ్రామమంతా వినవచ్చింది. ఇంక లాభం లేదని కొందరు తీరంవెంట నడచారు. కొందరు చిన్నబుచ్చుకుని తమ ఇండ్లదారి పట్టారు. శీనడు కొందరికి రహస్యంగా 'మీరేమో నౌకలోనే రండి—' అని వర్తమానం అందజేశాడు. మరికొందరు 'చూద్దాం....నౌకలో స్థలంవుంటే సరి; లేకుంటే ఇల్లు గతి' అని నిరీక్షణలో వున్నారు.

పొద్దు మునిగేవేళ అవుతున్నది. ఊరేగింపు బాణసంచా, మేళతాళం, చిచ్చుబుడ్లు, టపాకాయలతోబాటు ఏటిమొదట్లోకి వచ్చారు. ఇంతలో నావను ఆక్రమించుకొంటే వెళ్ళగొట్టరులే అనే ధైర్యంగలవారంతా నావల నెక్కేశారు. పెండ్లికొడుకుగుంపుకే స్థలం లేదు. అందరూ ఇష్టులే, మిత్రులే. ఎవరిని లేపాలి? అని ఉపాయం తోచకుండా ఐతాపలు 'నావలను పంపురా: శీను, మనంఅంతా నిదానంగా నడుస్తాము లేరా!' అనాల్సి వచ్చింది. అప్పుడు నావలలోనివారు విని నిరుత్సాహులై చిన్నబొయ్యారు. అందరూ నావలనుండి బయట పడ్డారు. అప్పుడు శీనమయ్య—పెద్ద గొంతులో 'ఒకదాంట్లో మేళతాళాలవారు, మరొకదాంట్లో పెండ్లిసామాను, గురికారులు, మరొకదాంట్లో ఆడవాళ్లు, మరొక్కదానిలో సర్వే జనులు' అని ఏర్పాటుచేశాడు.

సరే ఎల్లాగో అందరూ నావలలో సర్దుకున్నారు. అందులో ఒకడు ఈ భర్తీతో పాతాళం పెళ్ళి అయితే ఎల్లాగు అనగానే శీనడు 'ఛీ! మీకు అమంగళం మాటలు విడిచి. మరేమీ రావు' అని గర్జించాడు. భయభ్రాంతితో కొందరు దిగి చల్లగా నడచారు.

మేళతాళాలు మ్రోగినవి. ఊరేగింపుకూడ ఇవతలినుండి నడచింది. నావలు నిండినై

తరలిరై. కర్ణధారులు, దండనాయకుడు - శీనడు తమ కార్యభారాన్ని నిర్వహించారు; ఐతాశుల ఊరేగింపు చూడాలని ఏటిఒడ్డున అక్కడక్కడా జనం మూగారు. ఆ మునిమాపు చీకటివెలుగుల సందట్లో పెళ్ళికొడుకు యువకుడుగా కనబడ్డాడంటే ఆశ్చర్యమేమీ లేదు.

హంగారకట్టిరేవుకు నావలు వచ్చినప్పుడు శీనమయ్యరు 'ఐతాశులూ, ఒక మానిక నూనె ఖర్చయినా చింతలేదు. దివిటీలు వెలిగించనివ్వండి. హంగారకట్టి షావుకార్లు మీ వైభవం చూడని' అన్నాడు. అప్పుడే తుపాకీలు ప్రేల్చారు, ఔట్లు, ఆకాశబాణాలు వదిలారు. మేళతాళాలవారిని 'ఏమయ్యా, రేవుదగ్గర ఎందుకయ్యా గొంతులు కట్టేశారు?' అని శీనమయ్య గద్దించాడు. వాద్యాలు మోగినాయి. కాని నావలు చాలదూరంగా వున్నందున తీరం మీదివారుఈ వాద్యాలు కననూలేదు; విననూలేదు. కానీ శీనడు తన పెత్తనం నడిచినందుకే చాల వుబ్బిపొయ్యాడు.

తొన్నేదగ్గర వచ్చినప్పుడు ఒక్కొక్కనావకు నాల్గయిదుకాగడాలు వెలిగించారు. వాటిప్రతిబింబాలు నీళ్లల్లో చాల అందంగా వద్దాయి మిగుల ఉప్పునీటిసమయం. దారిఅంతా జిగేలుమన్నది. ఆడవాళ్లు శోభనే-గౌరికల్యాణం పాడారు. మగవారు తాంబూలాలు మడతలుపెట్టి వేసుకొని మూతులు బిగించారు. తెడ్డువేసే సరంగులకుమాత్రం కళ్లన్నీ కాగడాల నావలమీదే. ఈ బ్రాహ్మలే లేకుంటే హాయిగా ఈరాత్రి ఇప్పుడే ఇదేపడవలనిండా చేపలను నింపుకునేవాళ్లమే! అని చింతించినారు. 'అటు చూడండి, ఎన్ని మంచి బేగిచేపలో చెయ్యి జారిపోయినవే' అని వేటఅవకాశం లేనందుకు బాధపడ్డారు.

మంచిరస పాకంలో పడవలు తొన్నే చేరాయి. శీనడు 'ఐతాశులూ! ఇల్లాంటి ఉత్సవం మరి నాల్గుపడవలనిండావుంటే ఎంతో చక్కగా వుండేది' అని అన్నాడు. ఎక్కడివారు అక్కడ దిగసాగారు. చీకట్లోనే తొనసి చేరినవారంతా పెండ్లివాళ్లనువిడచి వెళ్ళరాదని బాగా దున్నిన మడిగట్లమీద వరుసగా నిలబడ్డారు. అందరూ ఒకచోట చేరారు.

నాల్గు కాగడాలు నూరారు కాగడాలు అయినవి. ఆ చీకట్లోనే మకరతోరణం, ఛత్రం, ధ్వజం, పతాకలు ముందుంచుకొని వూరేగింపు సాగింది. పెళ్ళికొడుకు పల్లకీ నెక్కినాడు. తీరంపైన ముందుగా శీనమయ్యగారి పరివారం, అతనిముందు నగలపెట్టెలు-ఇతర చదివింపు బహుమతుల సామాను-శీనని నడుముకు వేలెడులావు వెండి మొలత్రాడు, బంగారుపట్టీ శోభిల్లుతున్నాయి.

వైభవంగా తరలించుతున్నప్పుడు ఒకానొకప్పుడు దరిద్రంవాన తన పెండ్లిమెరవణి కాకుండా చేసిందే, దాని భర్తీ ఆరాత్రి అయిందని ఆ వైభవాన్నే మళ్ళీ పొందుతున్నట్లు ఐతాశులు భావించారు. ఈ రాజయోగం రెండవసారి ఐనా ప్రాప్తించినందుకు చాల సంతోషపడ్డారు.

రాత్రి తొమ్మిది, పది కొట్టేటప్పుడు పడుమున్నూరిలో అడుగుపెట్టారు. ఆడపిల్లవైపువారు పందిరిముందు అరుగుపైన నిలబడినప్పుడు 'రెండు వ్యూహాలవారు యుద్ధసన్నద్ధులైనారా ఏమిటి' అనిపించింది. కొమ్ము, బాదు, బాకా, నగారా, తప్పెట అన్నీ ఒకేసారి వాయించారు. ఇవిచాలక ఇజ్జోడువాద్యాలు, వాద్యాలవెంట స్త్రీలపాటలు, బాణసంచా సందడి, తుపాకీమోతలు. వియ్యాలవారు పెళ్లికొడుకును స్వాగతమిచ్చి పిలుచుకొని వెళ్లుతున్నప్పుడు రామఐతాశులు తామింకా యువకుణ్నే అనే నమ్మకం ఆ వుత్సవంలో గట్టి అయింది. శీనమయ్యచేతిలో వెండిబెత్తం ఠీవిగా కదులుతున్నది.



పెండ్లివాళ్లను, పందిరిని అంతాచూస్తే ఎవరికీ రెండవపెండ్లి అని తోచలేదు. పందిరి, మేలుకట్టు, బంగారు కాగితాలతో కప్పిన స్తంభాలు, సభాసీనులైనవారు బ్రహ్మసభ, గృహస్థసభ, స్త్రీ సభ లోపలనున్న వాళ్ళందరినీ తడికలసందుల్లోంచి తొంగితొంగిచూచే-శూద్రసభ చాల హాయినిచ్చినాయి.

పెండ్లికొడుకు చాలసంతోషించాడు. యజమానుడు శీననికికూడ తృప్తికల్గింది. అసంతుష్టి గలగవలసిన ఐతాశుల అత్తగారికికూడ వరవాలేదనిపించింది. అతనికేమి — బాగా కూర్చొని తింటే కరగనిఆస్తి. సవతిపైన పిల్లను, వయస్సైనవానికి ఇచ్చేందుకు మనస్సు ఒప్పదు. కాని, కన్యాదానంసమయంలో ఐతాశులు నిలబడ్డ ఠీవి, చురుకుదనం అంతా ప్రాయంగలవానిలాగే భావించడానికి ఆస్కారం కలిగింది. అన్నింటికంటె పారోతి మర్యాద, అక్కరలు అందర్నీ ఆకర్షించాయి, వారి ఇల్లుకూడ తన సత్యభామకు సరియైనదే అనిపించింది. పారోతి స్వయంగా తనభర్తవైపునుండి వెండిబంగారం పెళ్ళింట్లోనే అన్నీ వుంచివచ్చింది. ఆమె సవతిని శృంగారించడంకూడ అందరి అనుమానాలను పోనాడింది.

ఒక సంగతిమాత్రం సరసోతికి చింతగా మారింది. పారోతికికూడ కొత్త బంగారు నగలు లేవే అని, హొళ్లరు ఇంటినుండికూడ ఆరోజు తగినన్ని నగలు దొరకలేదు. అప్పుడు సరసోతి 'నీవు చిన్నపిల్లవేం కాదు-సంబరం వద్దులే' అన్నది.

ఐతాశులు సామాన్యంగా పిడికిలి బిగించేవారైనా పెళ్ళిసమయంలో ధారాళంగానే ఖర్చు చేశారు. దర్బారులో శీనడుంటే ఎల్లాంటి బిగువుకూడ తప్పాల్సిందే. తమ పురోహితుల పెళ్లి అనుకుంటూ ఎందరో ఆప్తులు మిత్రులు అక్కడికి వచ్చారు. ఎందరో పెద్ద అంచు శాలువలు, చీరలు, రైకలను నవదంపతులకు చదివించారు. మగఇంటివారు దక్షిణలు బాగానే కురిపించారు.

మొదట్లో నాల్గురోజులపాటు సీనమయ్య ఎంతోశ్రమపడి మగపెళ్ళివారిని దండయాత్రలాగు పడుమున్నూరికి అందర్నీ తరలించాడేగాని ఖర్చు మిగిలిద్దామనికాని, శ్రమ తగ్గుతుందనికాని, పెళ్లికూతురివారి బలవంతానగాని పెళ్ళికూతురువారు ఏర్పాటుచేసిన విడిదిలో వుందామనుకోలేదు. నావలను ఏర్పాటుచేసి రెండురోజులలోనే పెళ్ళివారిని 'కోడిగ్రామం' తరలించాడు. వియ్యంకుల ఊరేగింపు ప్రమేయంలేకుండ అందర్నీ నావలెక్కించినాడు. మూడవనాటి పాలు, నెయ్యి, పండుగ వూరేగింపు చాల ముచ్చటగా నుండినా, రాత్రయినా పగటి

వూరేగింపులాగు నడిపించి విజృంభణగా అన్నీ నెరవేర్చినాడు. రాత్రికి ఊరులో ఒక్కర్నీ వదలకుండా కాగడాల నిప్పించి 50 మంది వూరేగింపును 500 మంది వూరేగింపుగా జరిపించాడు. నాల్గవనాడు పగటి సమారాధనలో మాదప్పగారు లడ్డు, భక్ష్యాలు (పూర్ణం పోళీలు) వడ్డింపజేశారు. పెండ్లిపెద్దయిన సీనమయ్యరును గొప్పగా సన్మానించారు. మాదవ్వ, సీనయ్యరు దప్పి అంచేవాలు; రెండు రెండు కెందాళి, సీయాళి టెంకాయలుచెక్కి ఇవ్వాలని నౌకర్లకు ఆనతిచ్చారు.

ఈ పెళ్ళిలో ఒకేఒక కొరత, చవితినాటి మంత్రాక్షత (ఆశీర్వాదం) ముగించినాక సాయంత్రం శీనప్పకు మూర్ఛరావడం. అతడు బాగా మాట్లాడుతూ-తాంబూలంవక్క చెక్కవలనో లేక ఎందుకో తల తిరిగి పడిపొయ్యాడు. పెళ్లికొడుకుమొదలు అందరూ అతనికి అన్ని వుపచారాలు చేయవలసివచ్చింది.

బహుశః తాంబూలండెక్కే కావచ్చు. అంతలో సరసోతి గాబరాపడి 'ఏమైంది శీనణ్ణ' అంటూ వుపచారం చేసింది. 'అయ్యో! ఆకులే తాచుపాములు అయినాయె, వక్కలు నానవేసి ఆ నీరు తాపండి. తినింది కక్కించండి' అనింది. రామబతాసలుకూడ 'దేవుడా అంత చేయించావే, నాపనికి వచ్చినవాణ్ని ఎందుకు బాధిస్తావు? ఎట్లయినా మర్యాద దక్కించయ్యా !....' అని ప్రార్థించుకున్నారు. పార్వతి ఆరాలు హనుమంతదేవునికి పళ్లు, టెంకాయ నైవేద్యం పెడ్తాను అనికూడ మొక్కుకున్నది.

ఏమైనా, శీనడు అంతలోనే లేచికూచున్నాడు. ఏ పక్క నాన్చిన నీరు తాగేయోగం కలుగలేదు. వాడు కండ్లుతెరుస్తూనే అందరూ సంతోషించారు. ఇద్దరు పనివారు వట్టివేళ్ల విసనకర్రలను పన్నీటిలో ముంచి విదలించి శీననికి గాలివిసిరారు. తనకు అందరు ఉపచరించినందుకు చాల సంతృప్తి చెందాడు. దేవుడే ఈ ఆపదనుండి తప్పించాడు అని అందరూ చాల సంతోషించారు.

నాల్గవరోజు రాత్రికి అన్నిసంబరాలు ముగించుకొని మగపెళ్ళివారు పెళ్ళికివెళ్ళిన తీవితోనే స్వగ్రామం బయలుదేరారు. పారోతి సాహసించి పెండ్లికూతురిని పలుకరిస్తూ ఇంటికి వచ్చింది. బతాసలు, శీనప్పమయ్యరు ఆడవాళ్లవైపువారి సక్రమవ్యవస్థను, మర్యాదను ప్రశంసిస్తూ వచ్చారు. అది దేవలోకంవారితో సంబంధం కలిపినట్లే అని నిశ్చయించినారు ఒకచే సరిపడనిసంగతి ఆ శివళ్ళివారికి చేతినిండ బెల్లమే-వంటలో గుమ్మరిస్తారు—అని అక్కడి వంటలతీపిని అభివర్ణించారు. ఆ సంగతులు వింటూవచ్చిన ఒక గురికారులు (గ్రామపెద్ద) 'రేపు మీ ఇంట్లో సమారాధన కదవయ్యా! చేయించండి తీపిలేకుండా మిరపపొడి పిడికెడు వేయించండి' అన్నాడు.

బతాసలు తమాషాకోసం నవ్వినారు. శీనడు ఏమీ మాట్లాడలేదు. ఎందుకని ఎవరికీ అప్పటికి తెలియకపోయిన, క్రమంగా వూరివారికంతా తెలిసింది. ఆ పెండ్లిపెద్దఅయిన సీనప్ప వడుమున్నూరు వందిట్లో శీనమయ్యరు అయినాడని అందరికీ తెలియవచ్చింది. అతని నేస్తాలు



శీన, శీన అని అంటుండేవారు. ఆ పెండ్లిపెద్దగా వున్నందుకు బహుమానం, బహువచనాన్ని సంపాదించుకున్నాడు. ఈ గ్రామస్తులు 'నువ్వు! ఒరే' అంటే కొంత కష్టం కలిగింది. అది వాని కిష్టంలేనిపని. ఇదివరలో సామాన్యులు శీనమయ్య అంటే వినిపించుకోకుండా వుండేవాడు.

సత్యభామ బతాసల ఇల్లు చేరింది. ఆమె గోత్రం మారింది. తమయింటిపద్ధతిని నొసట నిలువుబొట్టు లేదు. పారోతిలాగే గీత కుంకుమ పెట్టుకుంది. ఆమెను చూచినవారంతా ఈమెకు శివళ్ళివారి స్పర్శకూడ లేదని రూఢి అయింది.

ఎంతైనా, వీపుచాటున మొరిగేవారు 'బతాసలు పెద్దపిల్ల అన్నఆశతో అరె శివళ్ళివారి సంబంధమే ఏరుకున్నారే - వైదికులు శాఖదాటులు చేయడం తగనిపనికాదా!' అనే నిందలు విన:డకుండా ఎలా వుంటాయి?

# 7

సత్యభామ బతాసలఇంటికి వచ్చింది. ఇంటిలోని ఇద్దరు ఆడవారిలో సరసోతికి మడి మైలలబాధ ఎక్కువ కాబట్టి—పిల్ల శివళ్లి కులంనుంచో అరె శివళ్లినుంచో వచ్చిందిగదా అని చిరాకు పుట్టింది. ఈ సంస్కారవివాహం నచ్చలేదు.

పెండ్లి అయినాక ఆరునెలల్లో మూడుమాసాలపాటు సత్యభామ సరసోతిదగ్గరనే వుండి ప్రవర్తనలో ఆమెను సంతృప్తురాలుగా చేసింది. శివళ్లి అనే పరసీమలో పెరిగినా కోటవారి వలెనే ఆమెకూడ మనుష్యప్రాణి అనిమాత్రం నమ్మకం కల్గింది.

మొదట్లో ఇంటిపని చానా పారోతి చేస్తున్నా తరువాత సత్యభామ తనకుతానే పనిలో దిగి అవీ ఇదీ అందిస్తూ చేదోడుగా వుండేది. పారోతి 'వద్దు' అన్నా ఆమె స్వయంగా పని చేస్తున్నది. ఒకటి రెండు నెలలలో అంట్లు తోమేది, కూరగాయలు తరిగిచ్చేది, చిల్లరపనులు చేస్తుండేది. ఆలస్యమయితే ఆవులను మందకుతోలి వస్తూండేది. చాలనాళ్ల వంటచెయ్యలేదు. వంటపని రాదనికాదు. తన పెండ్లి నాల్గవరోజు వంటగురించి వచ్చిన విమర్శ-తీపు ఎక్కువని విని తన మగని అభిరుచికి తగినట్లుండదేమో అనే భయంమాత్రం వుంది. చిన్న పనులు, తురుమడం, రుబ్బడం, నూరడం ఇతరపనులు అన్నీ చేసేనేది.

ఒకనాడు శీనప్పమయ్యరు దయచేశాడు. తరువాత 'సత్యభామవంట చేతివరుస ఎల్లాంటిది? ఇంకా వడుమున్నూరునుండి కోడిదాకా వచ్చిందా? లేదా?' అని ప్రశ్నించాడు. ఆమె వచ్చి ఆరునెలలు తరువాత తన కొకసారైనా వండితే తిందామని తన అభిలాషను ప్రక

టించాడు. అప్పుడు ఐతాళులు సత్యతో 'పారోతి చేతిపులుసు, మజ్జిగపులుసులు తిని చాలయ్యింది-నీవైనా చేసిపెట్టరాదా!' అన్నారు. 'నేను చెయ్యను' అని నిలుచున్నచోటినుంచి ఒయ్యారంగా వెళ్ళిపోయింది సత్యం.

మధ్యాహ్నం భోజనానికి ఐతాళులు, మిత్రుడు శీనమయ్యారు కూర్చున్నారు. శీనప్పకు అంతట అనుమానాలే, అందుకే భోజనానికి వెళ్ళేముందు పెరట్లోకివెళ్ళి పచ్చిమిరవకాయ లను షష్టిపంచకొంగున కట్టుకొని వచ్చినాడు. ఆ దాపరికం సత్యభామ చూచింది. 'అబ్బ శీనప్పమయ్యారా!' అనుకుంటూ బెల్లం మోతాదులేకుండా చేసింది. 'వదినే! అతని అప నమ్మకం చూడండి. బొడ్లో పచ్చి మిరవకాయలు చెక్కుకొని భోంచేస్తాడేమో!' అన్నది. సరసోతి సరే 'దానికి తగినట్లే చేద్దాం' అన్నది. సరసోతి వడ్డించేముందు నాలుగు మిరప కాయలు నూరి కలిపింది. శీనప్ప మొదటిముద్దలు తిన్నాడు. తీరా కారమైనా పైకి తెలుపలేదు. ఐతాళులకు కారం ఎక్కువై ఎక్కిళ్లు వచ్చినవి. నవ్వుతూ, 'ఐతే సత్య, కోడిగ్రామంలో దంటావా శీనణ్ణ!' అన్నారు.

శీనప్ప బెట్టుసరికి 'ఔను' అనడానికి దౌలు అడ్డంవచ్చింది. 'కారమని అంటున్నారా, నాకేమో ఒకచుక్క బెల్లం ఎక్కువనే అనిపిస్తుంది' అంటూ - నడుములోని మిరపకాయ లనుతీసి కొరికి తిన్నాడు. ఐతాళులదృష్టిలో శీనమయ్య గెలిచాడు. కాని ఆడవారిదృష్టిలో వాడు పచ్చిదొంగ అనిపించుకొన్నాడు.

ఆనాడు అంతా చక్కగా కుదిరిందని వంట వైనంగా వున్నదని కారం తగ్గిస్తే సత్య చాల మంచివంట చెయ్యగలదని ఐతాళులు వర్ణించారు. ఆవిధంగా ఒక్కొక్కనాడు వంట పని సత్యభామపాలికే పడేది.

సత్యభామ పెండ్లి అయినాక సంవత్సరం ఎట్లా గడిచిందో! పుట్టింటినుండి తల తగ్గించు కొనివచ్చిన సత్యభామ పారోతి భుజాలకుకూడ అందేదికాదు-ఇప్పుడు ఆరునెలలో తలవాకిలి ద్వారబంధనానికి తల తగిలేంతమనిషైంది. మూడునెలలకు కార్యం, తరువాత సంవత్సరం లోగా సీమంతం ముచ్చట తీరింది. సత్యభామ ప్రసూతికి పడుమున్నూరు వెళ్లింది. ఇంట్లో పారోతికి అన్నీ చింతలే- సత్యభామగురించి బెంగ. మగబిడ్డో ఆడదో, కాన్పు సాధారణమో, కష్టసాధ్యమో!' అని. సరసోతికి కాని, పారోతికి కాని ఇంట్లో కొత్తదీపం వెలగాలి, వంశం నిలవాలి అని చాల వుత్సాహం వుంది. 'మగవాడే పుట్టాలి' అని హనుమంతునికి మొక్కు కొన్నారు. గుగ్గిళ్లు, పంచకజ్జాయం (బెండు, బత్తాసు, పప్పులు, మొరమొరాలు, కాజాలు) చేయించుతానని, ఆజెగుడ్డ గణపతికికూడ భోగం పెట్టిస్తామని మొక్కుకున్నారు.

సత్యభామసంగతి చెప్పడానికి పడుమున్నూరికి రెణ్నాళ్ళ కొకన్ని పంపేవారు ఐతా ళులు. ఎండకాలంలో పుడ్తే పిల్లవానికి వుక్కపోస్తుందని, ఎల్లాంటి నక్షత్రంలో పుడ్తాడో అని అన్నీ బెంగలే. ఆ ఆత్రంలో మామగారింట్లో మకాం పెట్టాలంటే సంకోచం బొత్తిగా లేకపోయేది ఐతాళులకు. కాని పౌరోహిత్యం, ఇండ్లనుండి పిలుపు వీటివల్ల పనికి తీరికేలేదు.



వారు మడిగట్లలో తిరుగనీ, శిష్యులను కూర్చొనబెట్టి గణహోమం చేస్తుండనీ. సర్వావస్థలలోను కుమారసంభవమే ధ్యానించేవారు. పగలంతా పంచాంగం లెక్కించు కుంటూ ఒకసారి ధనలాభం, ఒకసారి తండ్రిమాట వినడు, మరొకసారి మరొక్కటి అని లెక్కపెడుతూ శిశువు జననానికి నక్షత్రాలను లంకెపెడ్తూ వుండేవారు.

వారిగణితం తొందరగా ఫలించలేదు. తుదకు 'పారోతి! నీ పాడులెక్కలవల్ల నామతి పోతున్నది. నన్నడిగితే దానికి ఎనిమిదేనెలలు' అన్నారు. 'అరే! అన్నకు లెక్కలు మృగ్యం —శోభనకార్యం లెక్కించకుండా మాట్లాడుతాడే!' అన్నది సరసోతి. ఇక పదిరోజుల్లో కాన్పు అని తేల్చేసింది. ఈ తర్కవితర్కాలు చేస్తూ ఒకమధ్యాహ్నం ఏటిగట్టుకు ముగ్గురు చేరారు. మడికి ఒండ్రుమట్టిని చేర్చాలి. నదిలోదిగి బురదను ఒడ్డుకువేసి, ఆరినతరువాత పొలానికి మొయ్యాలి. ఈపనిని గుత్తకిచ్చి పనివారితో చేయిస్తే లాభంలేదని వారే బయలు దేరారు.

నదినడుమ ఒక నావను నిలిపారు. ఒక గండ్లగంపను కట్టారు. ముగ్గురు బురద నొర్చి గీకిగీకి జల్లనింపి నావలో పడవేయాలి. ఆపని సంతోషప్రదం కాదు-సులభంగాదు. ముఖం వళ్లు అంతా బురదే. పైపైన బురదదొరికితే పరవాలేదు. లేకుంటే నీటిలో మునిగి మట్టిని తీయాలంటే గుక్కపట్టుకొని, ఊపిరిబిగించి పనిచెయ్యాలి. అక్కడక్కడ ఉప్పు నీళ్ళు, అందులో కండ్లు పాడవుతాయి.

ఒకరఝాము సాహసానికి, పరిశ్రమకు ఒకనావలో సగమే నింపగలిగారు. దూరపు కట్ట నించే 'ఐతాళులూ! ఐతాళులూ!' అంటూ ఎవరో పిలిచారు. నీళ్ళపైకి వచ్చి 'ఎవరిదా కేక!' అనిమాత్రం అనగలిగారు. వారినే రమ్మన్నారు. తాము నావ చివరను పట్టుకొన్నారని బురద పనిలో వున్నారని గచ్చపొదలవల్ల ఎంతగా కేకపెట్టినా వినబడవని మరింత కేకలుపెట్టి చెప్పారు.

వీరి ధ్వనిమాత్రం దూరంవరకు వెళ్ళింది. వెదకుకుంటూవస్తున్న ఆమనిషి ఈ ధ్వని వైపే వెళ్లాడు. ఐతాళులు 'కౌపీనాలంకృతులు'గామాత్రం బురదదంటించుకొని వున్నారు. నావ యొక్క వెనుకభాగంలోనే నిలబడ్డారు. సరసోతి, పారోతి వనికి తోడ్పడుతున్నారు. అప్పుడు ఇరవైఏళ్ళ యువకుడు అగుపించాడు. 'ఓ ఐతాళులూ, రామైతాళులూ' అని బిగ్గరగా పిలచి నాడు. వారే 'ఓ' అన్నారు. అతడు అటు ఇటు, నోరుతెరచి చూచాడు. కాని ఐతాళుల అతన్ని గుర్తుపట్టేది ఏమంత కష్టం? వెంటనే 'అరే! మా బావగారు వేంచేశారే - మావేషం చూచి పోల్చుకోలేదు కాబోలు. వస్తా.... ఆగండి' అని నీళ్లల్లో పడి, శరీరం రుద్ది కడుగుకొని నావపైకి వచ్చారు. అక్కడినుంచి 'సత్య.... ఏమంట....?' అని ప్రశ్నించారు.

కాని వచ్చినవాడు ఐతాళులను పోల్చుకొనేబదులు అతనివేషాన్ని పోల్చుకుంటూ నిలబడ్డాడు. అతడుకూడ వ్యవసాయంతో నలిగినవాడే. ఉన్నపొలాలు కట్టుగుత్తకిచ్చి సుఖంగా పెరిగిన కుటుంబం. అందుకే తన బావమరది వ్యవసాయంఅంతా చిత్రంగానే

తోచింది. అందులో ఈ బురదపనికూడ వారే చేసేది సవ్యమనిపించలేదు. అంత గట్టి, గొప్ప ఆసామికేమి ఈ ఖర్మ. అందులో భార్య, చెల్లెలుకూడ నిర్దాక్షిణ్యంగా నడుం వంచు తున్నారు పనికి. తన చెల్లెలికి ఇంతేనేమోననే బెంగ తగిలింది.

అతనితలలో అల్లాంటియోచన బయలుదేరేటప్పుడే ఐతాళులు, ఆడవాళ్లు నావనెక్కి నదిఒడ్డు చేరారు. 'బావ! ఇంటికే వెడదామా?' అని ఆగంతుకుణ్ని ప్రశ్నించారు ఐతాళులు, అప్పుడు మళ్ళీ సత్యసంగతి ప్రశ్నిస్తే 'బావ సత్యకు మగ పిల్లవాడు!' అని సంతోషంగా వార్త నందించాడు. నక్షత్రం, యోగం అన్నీ దారిలోనే లెక్కవేశారు ఐతాళులు. సరసోతి 'అన్నీ తరువాత లే అన్నా! వచ్చినవాళ్లకు గంగోదకం పట్టరాదా! అ నావ వుంటే వుండనీ. రాత్రివెన్నెల్లో చూద్దాము లే' అన్నది.

తమకుముందు బావ నడుస్తుంటే ఐతాళులు చక్కగా ఇంటిదారే పట్టారు. భార్య, చెల్లెలుకూడ తమవెంటనే వెళ్లారు. ఇల్లు చేరగానే చుట్టంఎదుట తమ వేషంపట్ల తామే కొంత సిగ్గుపడ్డారు ఐతాళులు. 'బావా! నీవు అక్కడ మీదను మెచ్చిగకు (ఊయాలపీటవంటి పలక) తగిలించిన రంగుచాపను విప్పి కూర్చో. నేను అంతలో శుభ్రంగా ఒకమునక వేసి వస్తాను. ఇక వేషం మార్చాలి' అన్నారు ఐతాళులు. బావగారు అరుగుమీద ఒక స్తంభం చేరువగా కూర్చొన్నారు. అతనికనుచూపుమేరతో రంగూ కనబడలేదు. రంగుచాపా కనబడ లేదు. అందుకే నేలపై కూర్చొన్నారు.

సరసోతి అందరికంటె ముందె చెరువుకువెళ్ళి స్నానంచేసి వచ్చింది. 'చాప దొరక లేదా?' అని గదిలోని రంగుచాపను చావడిలోపెట్టి అతన్ని 'త్వరగా భోంచెయ్యాలి' అని చెప్పి సిద్ధపరచింది. ఐతాళులు స్నానంచేసి ఆరినపంచ, ఉత్తరీయం తీసుకొని నళ్యంబుర్రను బయట పెట్టారు. ఒకచిటికె పీల్చి 'బావగారికి అభ్యాసం లేదేమో!' అని అన్నారు. తాను మళ్ళీపీల్చి ఆ పింగాణీ నస్యండబ్బీని వర్ణించారు. పింగాణీది. పూళ్ళకు వెళ్ళడానికి పనికి వచ్చేది. అందంగా వుంది. దానిమెడకు వెండిపొన్ను బిరడాకు కిరీటం, డబ్బీ పెద్దది గనుక చాపకు అలంకారంగా వుంది.

'ఏమి, కాన్పు కష్టంగా అయిందా? మావి అంతా వెళ్ళిందా? శిశువు ఎట్లున్నది?' అని ఐతాళులు ఎన్నోవిధాలుగా అడిగేలోపుగా, సరసోతి కాళ్ళకు నీళ్లుతెచ్చి, ఒకపాత్రలో కలిపిన మజ్జిగ, పళ్ళెంలో సీమంతానికి చేయగా మిగిలిన అప్పడాలు, వడియాలు తెచ్చి పెట్టింది. ఆమెవెంట ఆత్రంగా పారోతీకూడ వచ్చింది. 'శిశువు నాన్నలాగా? అమ్మలాగా?' అని అడిగింది. 'ఇప్పుడేం తెలుస్తుంది? ఎర్రగా చిన్న పిసరులాగ వుండీని' అన్నాడు ఐతాళులు.

'ఎన్పటికీ వుండటానికి వీల్లేదు దానిని చూచినప్పుడే భారీగా వున్నది. తొలిచూలు. బలహీనంగా వుండటానికి వీల్లేదు' అన్నది సరసోతి.



'శిశువు ఎర్రగా బుర్రగా దొడ్డుగా వుంది. తలనిండ వెంద్రుకలు, రూపం ఎవరిదో గుర్తుకు రాదు. మా చెల్లెదేనేమో!' అన్నాడు బావ. సరే అప్పళాలు, వడియాలు నములుతూ పరస్పర పరాచికాలకు మొదలుపెట్టాడు. ఒకనిమిషానికే పారోతికి మనస్సునొచ్చి లోనికి వెళ్లింది. 'అయ్యో! నా కడుపున ఒకకాయ వ్రాయలేదే!' అని చీకట్లో కూర్చుని ఏడ్చింది. 'సరే ఏమైనా సరే, రేపు హనుమంతునికి పండ్లు, కొబ్బెరకాయ నైవేద్యం పెట్టేది మరువ రాదు' అనుకొని తిరిగి వెలుపలికి వచ్చింది. పాపం సత్యభామకాన్పు కష్టమైందో ఏమో! నేను అడుగనేలేదు అనుకొని మరొకమారువచ్చి 'సత్యభామ కాన్పు బాగా జరిగిందా?' అని అడిగింది, 'అయ్యేఉంటుంది' అన్నాడు ఆబావ. ఆడవాళ్ళ ప్రశ్నలవర్షానికి జవాబు ఇయ్య గలడా? ఊహతో ఏమో అనేసినాడు.

సాయంత్రంకాగానే 'నాన్న రాత్రికే వాపసు రమ్మన్నారు. అక్కడ రాత్రి తోడు ఎవరూలేరు. నేను వెళ్తాను' అన్నాడు బావమరది. ఐతాళులు వదిల్తేగా? 'బావగారిది మంచి వ్యవహారమే! శుభసమాచారం తెచ్చినవారి నోరు తీపి తినిపించకుండ పంపుతామా? ఖాళీగా వెళ్తారా? నేనూ రేపు వుదయం బయలుదేరుతాను. ఇప్పుడెందుకు గడబిడ?' అన్నారు ఐతాళులు.

'లేదు, తప్పకుండా వెళ్ళాలి, లేకుంటే నిర్వాకమేలేదు' అన్నాడు బావమరది.

'ప్రసూతిసమయంలో మగవారికేమి దిబ్బపనీ' లేదు అన్నారు ఐతాళులు.

అంతకుమించి బావ మాట్లాడటానికి సాహసించలేదు. ఏమీతోచక రాత్రి వుండాల్సి వచ్చింది; పారోతి శీనమయ్యరు ఇంటికి పరుగునపోయి ఒకముంత కందిపప్పు బదులు తెచ్చింది. రాత్రి భోజనానికి పప్పుచారుతోబాటు చేమకూర ఆవిరిభక్ష్యం తయారుచేసింది, అటుకులపాయసం సులభమని దానినే వండింది. అప్పడాలు వడియాలు వేయించడం మరవలేదు. అన్నీ ఘుమఘుమ తయారుచేసింది. ఐతాళులు తిండి ఎన్నికలో నిపుణులు. వారుకూడ అటుకులపాయసం ఏలక్కాలు గీలక్కాలుపడి సొగసుగావుందని మెచ్చుకున్నారు. బావ దాక్షిణ్యమూర్తి, వూరకే తప్పులెందుకు పడతాడు. అతడూ 'బాగుంది' అన్నాడు. 'ఇది శరీరానికి చాలా మంచిది, పుష్టి' అంటూ పారోతి బాగా వడ్డించింది. ఆ పిండివంట. పాయసం అన్నం నింపుకొని బావకూడ సాయంకాలం బురదనింపిన నావలాగు చలనంలేక కూర్చున్నాడు. భోంచేసి చాపమీద కూర్చున్నాడు. ఎదురుగా పళ్ళెంలో ముంతమామిడిపప్పు కాల్చిపెట్టినారు. మంచి బెల్లంముద్ద వున్నది తోడుగా. తలగడకు చేరబడితే చాలునని చుట్టం అనుకుంటున్నవేళకు కందిపప్పు అప్పుతెచ్చారని భార్యవల్ల తెలుసుకొని శీనమయ్యకూడ అక్కడికే వచ్చాడు. 'ఓహో! పడుమున్నారు బంధువులా! బాగయింది' అని అన్నాడు.

ఐతాళులు 'శీన! మన సత్య మగపిల్లవాణ్ని కనింది. నాకు పిల్లవాడో, పిల్లనో అనే సందేహం వుండె. నరసింహస్వామి కటాక్షంవలన మగవాడే పుట్టాడు' అన్నారు.

'అల్లాగని మీరే అన్నారే! ఆరోజు....? ఆమె జాతకంలో ముగ్గురు మగపిల్లల
యోగం వుందని చెప్తుంటిరిగా. జాతకంలో వ్రాసివుంటే మగవాడు ఆడపిల్ల అవుతుందా?'
అన్నాడు శీనమయ్య. శీనమయ్యదగ్గరకు తాంబూలంతట్ట వచ్చింది. అతడు మొదట ముంత
మామిడి విత్తనాలను అంతా ధ్వంసంచేసి 'పడుమున్నూరువారు ముంతమామిడిగింజలు
ముట్టరేమో' అనుకుంటూ 'ఔనులేండి! అది చాల వేడిచేస్తుంది' అంటూ తాంబూలం వేసు
కున్నాడు. నోటిలోకి పొగాకుముక్కలు వేసుకొని అస్పష్టంగా 'ఎలాగైనా ఐతాళులకు
సంతానం కలిగింది' అన్నాడు చురుకుగా. చుట్టం సగం నిద్రపట్టినా బెల్లంముక్క నోట్లో
వేసుకొని నవ్వినాడు. ఐతాళులు తోచకుండా వూరుకున్నారు. 'పిల్లలు ఇంట్లో తిరుగులాడ
కుండావుంటే ఏమీ అందంగా వుండదు కదండీ. పిండం అవీకూడా కుమాళ్ళే కదంటి నెర
వేర్చాలి' అని అన్నాడు సీనయ్య.

ఐతాళులు 'బావకు నిద్రవట్టిందేమో. ఈ వసారాలో చల్లగాలిలో వడుకోండి. కొత్త
గట్టితాటాకులదిండు. తలకింద పెట్టుకొంటూనే బాగా మొద్దునిద్ర వస్తుంది' అని ఉవచారం
చెప్పి తామే అల్లినచావ, తలగడ అతనికి ఇచ్చి దానిమీద ఒక జముఖానా పరిచారు. బావ
గారికి పడుకొన్నదే గుర్తు. నిద్రపట్టింది.

ఐతాళులు సీనప్పమయ్యరు ఎదురుబదురుగాకూచొని గప్పాలు ప్రారంభించారు. పొన్న
నూనె గుడ్డిదీపం మినుకుమినుకుమంటూంది. 'ఈ దీపానికి నూనెకూడ లేదా?' అని ఐతా
ళులు అన్నారు.

'పాలు పారినట్లు వెన్నెలవుంది. దీపం ఆర్పండి. ఏ దిబ్బకు అది?' అన్నాడు సీన
మయ్య. ఆపని ముగించుకొని ఐతాళులు తమ వియ్యంకులను పొగడడం ప్రారంభించారు.

శీనప్ప మాటలలో ఎంతో పొద్దుగడిపి 'పొద్దుపోయింది-కళ్లు మూసుకొస్తున్నవి.
వెడతాను' అన్నాడు. అప్పటికే నదిగట్టునుండి పారోతి, సరసోతి వచ్చి చెరువులో ఐదారు
స్నానాలు చేసివచ్చారు.

శీనప్ప 'ఎవరు? సరసోతమ్మ! ఈ చీకట్లోనా మీరు నీళ్లతోడడం' అని అడిగినాడు.
'లేదు, శీనప్ప. బంధువు వచ్చినగడబిడలో బురదతోడిన నావను అట్లే వదలాముగదా!
ఆ చేపల గోవిందుడు నావ వెంటనే కావాలన్నాడు. దాన్ని కడిగించివచ్చాము-అంతే. స్నానం
లేకుంటే తప్పుతుందా?' అన్నది సరసోతి.

శీనప్ప తన ఇంటికష్టాలను చెప్పుకొనివచ్చాడు. వెళ్ళేప్పుడు కొంత నస్యం సేవించి,
'ఏమండీ! నిద్రపట్టలేదా?' అంటూ మరొక్క చిటికెడు ఇప్పించుకొన్నాడు. ఐతాళులు
నడుములోంచి తమ వెండిబుర్రను తీశారు. 'మంచికారం అండి; మీలాగు పేటలో దుకాణం
నస్యంవాండ్లు చెయ్యరండి? ఎందుకో?' అన్నాడు.

'పేటవాళ్లు పొడి చేస్తారు. కాని పస, జిగి వుండాలని సున్నం వెన్న చేర్చి పొడు
చేస్తారు. ఎనిమిదినాళ్లు పీల్చితే పాడవుతుంది' అన్నారు ఐతాళులు.



శీనప్ప తన ఇంటివద్ద మరొకసారి నస్యం వేసుకుంటూ 'ఈ బ్రాహ్మణుడు బిల్వపు
బుర్రవదిలి వెండి నశ్యంబుర్ర వాడడం ఎప్పుడో' అంటూ పడుకొని తనకలలో ఎవరో
తన నస్యంబుర్ర, వెండిది దొంగిలించినట్లు చూచాడు.

బావగారు పడుకొని లేచినప్పుడు తెల్లవారింది. ఇంటికివచ్చి వెళ్లేవారికి ఫలహారం
లేకుంటే ఎల్లాగు? ఆ రోజుల్లో కాఫీ పట్టింపులు లేవు. పారోతి అటుకులు వేయించి, పెసర
గంజిచేసి చుట్టందగ్గర వుంచింది.

ఐతాళులు తొందరగ స్నానం, పూజ ముగించుకొని కొన్నిపనులు శీనప్పకు అప్ప
జెప్పి, తానుకూడ బావప్రక్కన ఉపాహారానికి కూర్చున్నారు. తరువాత 'బావ, పొట్ట
నిండింది. భయంలేదు, వెడదాము. సత్యనుచూచి నెలయింది. పొలం కాపులు చాలమంది
వున్నారు. పనులు వాళ్లే చూసుకుంటారు. కాని కావలి తప్పదు. కన్నుమరుగైతే పనిచేటు
అవుతుంది. పొద్దు పుచ్చుతారు. పని ముగియదు. అందుకే మేమూ వారివెంట పనికి దిగు
తాము. మాపని మేమే చక్కగా చేసుకుంటాము. కష్టాన్ని లెక్కచెయ్యము' అని తమ
వెనుకటిదినం అడుసునావ ప్రయాసగురించి ఐతాళులు వర్ణించారు.

'బావగారికి ఎన్నికాళ్లు సేద్యం?' అన్నారు ఐతాళులు.

'మా నాన్నకు అంతా చూచుకొనే తీరిక, ఓపిక లేదు. వాతంబాధ. వచ్చినంత రానీ
అని అంతా కట్టుగుత్తకే ఇచ్చేశారు. పాలికాపులే చూసుకుంటారు' అన్నాడు బావ.

'అయితే ఇంట్లోనే కాలక్షేపం ఎల్లా చేస్తారు? నువ్వేమీ నాన్నకు సాయంగా
దున్నడం, విత్తనం పనులు చేయించరాదా—భూమి పదును ఎక్కువచేస్తే మంచిదే.'

'నాకేమో కరణీకం చాల ఇష్టం.'

'ఐతే మీకు కరణీకం మిసలు మిరాశీ వుందా?'

'లేదండీ. కానీ మా చుట్టాలలో ఒకరు మాకు 500 గుత్తకు ఇస్తామన్నారు.
అది మాదే. మరేమి?'

'ఐతే కరణీకం అంటే మంచిపనే. మర్యాదకు మర్యాద. ఫాయిదాకు ఫాయిదా!
ఈరోజుకాకపోతే
పరే, ఒక కరణీకం చేసుకొని మీవూరి పడమటిస్థలం లోపలవేసుకో.
యాభైఏళ్లకయినా మంచి వెల సంపాదించవచ్చు.'

ఈలాగు ఎంతో సంసారం జాగ్రత్తలు, చురుకుదనం చమత్కారంకథలు, ఉపదేశాలు
చేస్తూ పడుమున్నూరు చేరుకున్నారు. ఐతాళులు మామగారిగడప తొక్కేరో లేదో కుమార
కంఠీరవుడు వెక్కివెక్కి ఏడ్చాడు. 'ఏమయ్యా! బిడ్డ, ఎందుకేడుస్తున్నాడు? ఒంట్లో
కులాసాయే గదా!' అనడిగారు ఐతాళులు. వీరిలాగే బయటినుండి వచ్చేబావకు ఏమి
తెలుసు?

ఐతాళులకు మామ మాదప్పగారు ఘనంగా స్వాగతం చెప్పారు. చాల వుత్సాహంతో తమ మనుమని జన్మవార్తను చెప్పారు. అప్పుడే స్నానంచేయించి చాకలిది పిల్లవాణ్ని చేతుల పైన ఎత్తుకొని వస్తుండినది. ఏమి మొహమాటంలేకుండ సలసల కాగేనీళ్ళల్లోకి కషాయం కలిపి శిశువుకు స్నానంచేయించి మరింత ఏడ్పించిందేమో ! 'స్నానమేనా? దానికా ఇంత' అని సమాధానపడ్డారు ఐతాళులు. 'ఐతాళలూ ! శిశువు మీలాగా? మా సత్యలాగా? చెప్పండి' అన్నారు మాదప్పగారు,

'చూస్తే సత్యలాగే వున్నట్లుంది' అన్నారు.

'కళ్ల సరిగ్గా మీ వేనండి' అన్నది అత్తగారు.

* * *

ఐతాళులు పిల్లవాని ముఖంచూచి ఆనందంతో హసన్ముఖులయారు. పిల్లవానికి నామకరణ మహోత్సవం అయింది. నక్షత్రం, యోగం లెక్కించి పిల్లవానికి 'లక్ష్మీనారా యణ' అని పేరుపెట్టారు. ఆ నామకరణంతోబాటు ఆ పేరు 'లచ్చ' అని మారినా లక్ష్మీ నారాయణ అని జాతకంలోమాత్రం వ్రాసేశారు.

కన్నెనెలకే ఆమెను పిల్లవాణ్ని తెద్దామని ఐతాళుల ఆశ. పిలిపిద్దామనుకున్నారు. పుత్ర వాత్సల్యం ఐతాళులగుండెలో ఆషాఢం సముద్రం పోటులాగా వచ్చింది. 'సరసోతి కలుగ జేసుకుని 'అన్నా, ఊరంతా ఒకదారిపడితే, గుడ్డి ఊడుతోక ఒకదారి పట్టిందట !' అన్నట్లు ....మొదటి మూడుమాసాలు బయటికి రావద్దు—తొలిచూలు జాగ్రత్తలుంటాయి, మంచి ముహూర్తాలే వెదికావు. వానకారులోనా శిశువురాక, జడివానల్లో ఊరిమార్పు వద్దు' అన్నది.

'సరే ! తరువాత ఆషాఢంలో తేవచ్చునా ?'

'ఆషాఢం, శ్రావణం రెండూ ఒకటే సమం-గడువనీ. వానబెడద పోనీ, కోతలు కానీ. నన్నడిగితే నవరాత్రి పాడ్యమికి పిలిపించు. తప్పదు' అన్నది. ఆమె తీర్మానానికి ఒడంబడక తప్పలేదు ఐతాళులకు.

ఐతాళులు 'సత్యావిరహం'లో వానకారు మూడుమాసాలు ఎలా గడిపేరో భగవంతు నికే తెలుసు. నవరాత్రి పాడ్యమికి పక్షంముందుగానే 'ఉయ్యాల ఎక్కడ వెయ్యాలి ? పనసచెక్కలతొట్టి చేయించి పడసాలలోనే మంచిదొకటి వుండవద్దా?' అనే చింతతో స్తంభాలకు తడికలుబిగించి దానిలో ఎనిమిదిదినాలు ఒక వడ్లవానిపనితనం వున్న అందాల బిచ్చెన వుయ్యాల తయారుచేయించి పెట్టారు. సరసోతికూడ 'అన్నా ! మంచి బరువైనదే ! దీన్ని గొప్పరథంలోపెట్టి లాగితేనేగాని లేవదు' అని పొగడింది. కోటీశ్వరులు చేసినంత పనితనపు వుయ్యాల చేయించాడని మెచ్చుకుంది. కాని సరసోతి వడ్లవానికి మళ్ళీ



వలకలపైన సూర్యుడు, చంద్రుడు మొదలైనచిత్రాలు చెక్కుమని పురమాయించింది. వాడు మరొక రెండురోజులలో ఆ చిన్నపని ముగించాడు.

ఇంటికివచ్చిన వడ్ల హనుమాచారి ముసలివాడు-పనిలో బొబ్రాయి వంటివాడే కాని వాలుకమాత్రం వులికంటే పదునే. ఎనిమిది పదినాళ్ళ వుయ్యాలపని ముగిసాక' ఐతాళులూ ! మీ ఇంటిధాన్యం దాచుకోవడానికి తగిన పిటారీ వుండాలండీ మీకు. పిటారీలేకపోతే పద సాలకు అందమే లేదు. చూడండి-మీ ఇంటివెనుక మంచి పనసచెట్టున్నది - దానికి గంట్లు న్నవి. అవి ఇంటికలపలకు పనికిరాదు. శుభ్రంగా పిటారి చేసిస్తాను' అన్నాడు. ఐతాళులు వల్లె యన్నారు.

రాత్రి భోజనాలప్పుడు, సరసోతి అన్నను గద్దించింది; 'హనుమనిమాట విని పనస చెట్టుకు గొడ్డలి పెట్టించబోకు. ఏమిలేకున్న యాభై కాయలు దిగేచెట్టునా పోగొట్టుకొనడం? తియ్యని పనసకాయలు చాల శ్రేష్ఠమైనవి. వానికేమి, పెద్దెల నెపంతో రెండునెలల తిండి, కూలిగింజలమార్గం వెదుకుకొన్నాడు. జాగ్రత్త !' అన్నది.

ఆమెమాటప్రకారమే ఐతాళులు నడవవలసివచ్చింది. కాని 'నేను వాణ్ని రేపు ప్రొద్దున్నే రమ్మన్నానే, అందాజు చేద్దాం అన్నానే' అని గొణిగారు.

'అందాజువద్దు-గిందాజువద్దు. వాడిమాటకు హూఁ అనడమూ వద్దు. నీవు దినం సత్యను ఎప్పుడు పంపాలో వాళ్ళవూరికి వెళ్ళి చెప్పిరా, నేను హనుమాచారివస్తే చూచి, వెనుకకు పంపుతాను' అన్నది సరసోతి.

సరసోతి వుపదేశం ఫలించింది. ఐతాళులు హనుమాచారి నోటినుండి తప్పించుకొనే మార్గంలో, తెల్లవారుఝామువనే అత్తగారింటికి తరలివెళ్ళారు. హనుమాచారి దగ్గుతూ వచ్చాడు. 'ఏటేటా యాభై పనసపళ్లు, కాయలు లభించే చెట్టుకు సున్నచుట్టాలని ఎత్తు వేశావా? పిటారీ, గిటారీ వద్దు. ఇంటికి తలవాకిలి వేయించినాక పిటారీలు, భోషాణాలూను తలవాకిలి లేనివారికి పిటారీ లెందుకు?' అని వాణ్ని అక్కణ్నించి వెళ్లగొట్టింది.

* * * *

నవరాత్రి మొదట్లో సత్య. లక్ష్మీనారాయణలు వచ్చారు. అందరూ లక్ష్మీనారాయణను చిన్నగా 'లచ్చ'ఏని పిలువసాగారు. పిల్లవాడు ఇంటికివచ్చిన ఏడాదివరకు 'నాన్నలాగా? అమ్మలాగా?' అనే వివాదం తీర్మానం కాలేదు. ఒక రొకటంటే మరొక్కరు మరొకటి— కొందరు అంతా కోదండ ఐతాళులేనండి అని పలికి అందరిమనస్సును శిశువుయొక్క తాత వైపు లాగారు.

సత్యభామ ఇంటికి వచ్చినవేళ మంచిదే. కాకుంటే సరసోతి తల బాదుకుంటూ తిరిగి పిలిచినా ఇంటికిరాని కొత్త ఆవు ఎందుకు వస్తుంది ఇంటికి? దేవునిదయవలన తన కొడుకుకు పాలకొరత తీరుతుందని ఐతాళులకు విశ్వాసం కలిగింది. చాల సంతోషించారు.

లచ్చువికి పెద్దవాడయ్యేకొలంది వుపచారాలకు లోటేలేదు. పారోతి, సరసోతి, తల్లి దండ్రి ఎవరికికూడ శిశువును క్రిందదించే ఇష్టం లేదు. మార్చిమార్చి ఎత్తుకోని తిరగాలనే వుంది. అతన్ని నిమిషమైన దింపాలని లేదు. ఐతాళులప్రీతికూడ పెల్లుబికింది. లచ్చుని ఒంటికి గాలి, ఎండ, చలి తగులరాదు. అన్నింటికీ వైద్యశాస్త్రంచెప్పి నచ్చచెప్పేవారు ఐతాళులు.

పౌరోహిత్యం లేనిరోజుల్లో వారు భార్యతోనే దివారుఖానాలో కూర్చునేవారు. తాము ఒక స్తంభంవద్ద, సత్యభామ కొంచెం దూరంగా బాతాఖానీలో పడేవారు. మధ్యన లచ్చున్ని చాపమీదవేసి ఆడించుకునేవారు. సత్యభామ లచ్చుని పుణ్యమా అని రంగంలోకి వచ్చిందన్నా తప్పేమీ లేదు.లచ్చువికి బంగారు మొలత్రాడున్నది. దాన్నిచూచి 'మన మతని మొలతాడు చూచి ఎవరికైనా కన్ను గుట్టవచ్చు' అని ధీమాతో అనేవారు ఐతాళులు. శీనప్ప దృష్టి కూడ దానిపై పడకపోలేదు. ఆలుమగలు కూర్చున్నప్పుడు శీనయ్యవచ్చి వారిని బాగా పొగడేసేవారు, కాని వీపుమరుగున వానిమనస్సుకు ఏమీ సమాధానం లేదు. 'చూడు— ఊరి గురికారుల (ప్రముఖుల) ఇంట్లో వెండిదారమే గతిలేదే. ఈ వైదీకం గొడ్డుకు పుట్టిన బండరాతికెందుకు ఈ బంగారుతాడు' అని చాటున పితూరీ పలికేవారు.

ఐతాళులే ఒక్కసారి 'మా అర్భకుని మొలత్రాడు ఎలా వుందయ్యా'అంటే 'దాని కేమండీ—యోగ్యతకుతగ్గట్టే వుంది' అనేవాడు. వెంటనే 'బంగారందారం వుంచేనేమి, ప్రయోజనం ఏమిటి? ఎల్లప్పుడు వారిపైపే కన్నుంచి వుండాలి కదండీ?' బిడ్డలపైన బంగారం పెట్టి విడచేది మంచిది కాదు' అని జాగ్రత్త చెప్పేవాడు.

'ఏమిటి కాబాలీ, కందారీలు వస్తారా' అనేవారు ఐతాళులు హాస్యంగా.

# 8

ఈ నడుమ శీనప్పగారి రాక ఐతాళులఇంటికి ఎక్కువైంది. రాగానే లచ్చుని క్షేమాదులు, తరువాత సత్యభామను పొగడడం. తరువాత తనకున్న వందలకొలది కష్టాల వివరాలు. ఇవి వచ్చినప్పుడెల్లా జరిగేవనులు. అతనికష్టాలు ఒకసారిగా రావు. వడ్డీకానులతోబాటు కష్టాలకథలు తెల్పుతాడు. ఈరోజు ఒక కుండెడుబియ్యం దండుగ. సాయంకాలానికి రెండు పేర్ల వులవలు లేకుంటే నిర్వాహము లేదు. మరొకరోజు యాభై తాటిమట్టలు, లేకుంటే తూమెడు తౌడు అంటూ ఎన్నో అడిగి తీసుకునేవాడు. అన్నింటికి నెపముచెప్పే తీసుకొనే వాడు. సాయంత్రం ఐతాళులు వంకాయలు తెచ్చిందిచూసి, సత్యభామవద్దకువెళ్ళి ఈ వనస గింజలు, ఉలువపప్పు, దోసకాయలు చాలయిందమ్మా—తినింది వాంతికొస్తుంది' అని వెంట ఇది వంకాయ, పెద్దది తీసుకొనివెళ్ళేవాడు. ఎన్నో కథలల్లి కార్యం సాధించుకొనేవాడు.



ఒక సంగతిమాత్రం మెచ్చుకోవలసిందే. ఈ చేతిబదులు, వగైరా సరసోతి, పారోతి ఇంటలేని సమయం సరిగా చూచుకొనివచ్చి సత్యను పొగడితే తప్పకుండా అరిగింది దొరకుతుందని వానికి తెలుసు.

కాని సీనప్ప ఐతాళులవద్ద లావాదేవీలుమాత్రం చక్కగా తెలుసుకోలేకున్నాడు. ఏమైనా దమ్మిడి, ఏగాని దొరకుతుందేమో కాని అంతకుమించి దొరకేప్రాప్తి లేదు. మూడింటికి తక్కువలేదు— నాల్గింటికి ఎక్కువలేదు అన్నట్లు ముప్పూట భోంచేస్తున్నారనిమాత్రం బోధ పడింది. పెండ్లినాడు బాగా డబ్బు గంధూళి (బుక్కా)లాగు వుడాయించింది చూచి ఒక చిల్లి గవ్వకూడ అప్పుచేయకుండా పోవడంచూచి అతనికి ఆశ్చర్యంకాదా మరి. ఈ బ్రాహ్మడు ఎక్కడైనా పాతరచేసి వుంచినాడేమో అని యోచనకూడ బయలుదేరింది. కాని ఆ దావరికం అంతా పెండ్లిఅయిన సంవత్సరంలోగా ఎగిరిపోయిందిలే అనికూడ అనుకున్నాడు. సంవ త్సరం అయినాకకూడ వెండిడబ్బి చూశాక 'అవును-మహారాజు అతనికి చింత చీకులేదు' అని అనుకున్నాడు. పిల్లవాని బంగారుమొలత్రాడు చూచినతరువాత వాని అనుమానం గట్టిపడింది. ఈ బడబావనయ్య ఘటికుడేనయ్యా. పొల్లు దంచేవాడు ఐతాళులపట్ల గౌరవం ఎక్కువైంది. ఈ బడబావనయ్య ఘటికుడేనయ్యా. 'కోదండ ఐతాళులు చచ్చి, రామ ఐతా ళుడు. ఒకనాడు తనలోతానే అన్నీ లెక్కించాడు. ఎంత నగదు? ఎంత పౌరోహిత్యం చేయబట్టి ఎన్నాళ్లయింది? ఎన్ని వర్తన ఇండ్లు? ఎంత నగదు? ఎంత బియ్యం?' అన్నీ లెక్కించాడు. 'ఐతే! వీడు వెయ్యిని మించినవాడే - అయితే రెండు వందలు బాకీ ఇస్తాడేమో అడుగుదామా? వానికేమీ గొడవరాదు' అనే తీర్మానానికి వచ్చారు- అప్పటినుండి ఉప్పు, చింతపండు చిల్లర అడిగేది మానేసినాడు,

ప్రతి మధ్యాహ్నం సరదాగా శీనమయ్య ఐతాళుల ఇంటికివచ్చి మాట్లాడే అలవాటు పెట్టుకున్నాడు. సత్య, ఐతాళులు విశ్రాంతిగా కూర్చున్నప్పుడే అతడూ వచ్చేవాడు. వచ్చి వూరకుంటాడా? 'మీ భార్యవంట నలపాకమని విన్నాను. మొన్న ఆమె పంపిన ముద్ద కాకర కాయి నా జన్మలో తినివుండలేదు. ఉడుపి సంతర్పణలో చేస్తారటగాని పులుసంటే మీ ఇంటిదే-మీ ఇల్లాలు నీళ్ళకు తిరుగుబోత పెట్టినా చక్కగా వుంటుంది.' అని చాల పొగడినాడు.

ఒక్కొక్కసారి ఐతాళులు చాల సంతోషంగా తన అంతరంగం బయటపెట్టేవారు. 'శీన, పారోతికూడ పని బాగా చేస్తున్నది. సరసోతి అందెవేసిన చెయ్యి. వంటేమో చేస్తారు, వంటా వార్పులు అయితే చాలుసరసోతికి. హడావిడిగా పనిచేసి వెళ్లుతుంది. పయనం లేదు. సత్య అలాకాదు. ఎక్కువ వండి పారవెయ్యదు. చేసినవంటంతా తినేద్దామని వుంటుంది. ఆమె వచ్చిననాటినుండి నేను ఇంట్లో తీరికగా తింటున్నాను. నాది వైదీకం నాలుక, పది ఇండ్లల్లో మృష్టాన్నం తినమరగి పనికిరాని గడ్డితింది తినబుద్ధి కాదు. కాని సత్య పాకం మాత్రం వేసరిక రానేరాదు' అని తామూ పొగిడారు.

'అది నిజం. ఆరోజే అనుకున్నాను. ఏదినం ఇది? మీరు పెసరపప్పు పాయసం చేయించారే? ఆ రుచి చచ్చేదాకా మరువలేను' అని శీనప్పమాటలకు మెరుగు దిద్దినాడు.

ఈవిధంగా సత్యమ్మ స్తోత్రం ఐతాళుల మనఃఫలకంపై ఎట్టిప్రభావం కలిగిస్తుందో సీనవికి బోధపడింది. అచ్చన్ననుచూచి తన స్వంతకొడుకులకంటె అల్లారుముద్దుమాటలతో లాలించేవాడు. సత్యభామ వంటఇంటికి వెళ్ళినప్పుడు ఆమె వినాలనే బిగ్గరగా ఎంతో గుట్టుగా అయినట్టు 'ఐతాళులూ! పడుమున్నూరులో మీ మామ, దావ ఎవరుగూడ మళ్లకు బురద, మట్టి మొయ్యరు. మీరుమాత్రం ఆమెకు పార, గంప ఇవ్వకండి' అని ఉపచారం చెప్పాడు. ఐతాళులు గంభీరంగా 'శీన, నేను బొబ్బరుగుండు అనుకోవద్దు-పెద్దఇంటి పిల్ల నేమో తేగలను. ఆమెను సంబాళించి చూచుచునేది నాకు రాదనుకున్నావా?' అన్నారు.

సత్యభామ వచ్చిననాటినుండి వారిమనస్సు కొంత చింతలోనే వుంది. సత్యను పారోతికిమల్లె పనికి పంపాలా వద్దా? అని. పెద్దభార్య ఎండకు వరుగు అవుతుంటే చిన్నభార్యను దావట్లో పీటవేసి మర్యాదగాచూస్తే ఎల్లాగ? సత్య స్వయంగా సవతి కష్టంచూచి ఊరికే వుండజాలక ఒక్కొక్కసారి పొలానికి వెళ్ళేది. ఐతాళులు 'నీళ్ళకు వెళ్ళేవారు వెళ్ళనీ, పిల్లవాణ్నిమాత్రం సరిగా ఒకరు చూచుకోండి' అనేవారు. సరసోతి పారోతి విని 'సత్య, నీవే పిల్లవాణ్ని చూచుకో-మేము పనిచూచి వస్తాము' అని ఆమెను వెనుకకు పంపేవారు.

ఐతాళులు సత్యతో సల్లాపం చేస్తున్నారు. ఆమెను చూడగానే తానూ యువకుడనే భావన పొంగి పొరలుతుంది. ఒక్కొక్కసారి నీళ్ళు తోడటానికి వెళ్ళకుండా, ఇంటివద్దనే ఆమెతో సరసాలాడడానికి వుండిపోవడంకూడ అలవడింది. ఈ పక్షపాతబుద్ధి సరసోతికి గోచరించింది. గుడ్డలు తెచ్చేటప్పుడు పెద్దదానికి రెండురూపాయల వస్తువైతే, చిన్నదానికి ఒక్కరూపాయి ఎక్కువచేసి తెచ్చేవారు. సరసోతి అన్నీ అడిగి అన్నను రెండుచీవాట్లు పెట్టినసందర్భాలు లేకపోలేదు. సత్యభామ తల్లిదండ్రుల ఎదుట తానూ ధనవంతుడని నిరూపించుకోవాలనే పట్టుదల వున్నందున ఈ భేదం ఎక్కువయింది.

ఏమైనాసరే, ఐతాళుల కొత్తపద్ధతులను ఒప్పుకొనేవాడు శీనమయ్య ఒక్కడే. అతనికి లాభమేమి? పెండ్లయి రెండేండ్లు కాలేదు. శీనప్పమయ్యరు అప్పుకుగాను మొండితనం చేసిందీ నిజమే—వారు ఇచ్చిందీ నిజమే. మొదట్లో 'శీన అప్పు అనగా ముప్పురా' అన్నారు గాని, అతడు ఐదువందల కారణాలుచెప్పి తనను ఏలాగైనా రక్షించాలని ప్రాధేయపడి 'మహారాజా, మీకు నమ్మకం చాలకపోతే ఇద్దరిసాక్ష్యం వేయించి, నోటు వ్రాసిస్తే చాలుగదా' అన్నమీదట, ఐతాళులు మూడుశాతం వడ్డీ చొప్పున అప్పు ఇవ్వనే ఇచ్చారు.

అప్పు ఇచ్చిన ఆరుమాసాలకు ఒక సంగతి బయటపడింది. ఆకాలంలో కోడిగ్రామంలో మిద్దెకు పెంకుపరచినవారు ఎవరూ లేరు. అందరివి కొండగడ్డి ఇళ్లే. సముద్రం గాలులకు పెంకు పగులుతుంది అని భయం. కొడుకుకు బంగారుమొలత్రాడు ఇవ్వగల రామఐతాళులకు ఇంటికి పెంకు కప్పాలనేయోచన లేదు. అలాంటప్పుడు శీనప్ప తానొక్కడే పెంకు



వేయించి గొప్పదనం చూపించాలని ప్రయత్నించాడు. ఐతాళులే రెండవపెళ్లి చేసుకున్నాడే, తానెందుకు అల్లా చేయరాదనే చావల్యంకూడ కల్గింది. అతనిభార్య వాగ్దేవి—పారోతి లాంటిమొప్పెకాదు; సీనప్ప చెవులు పిండగలదు. గనుక తన ఆశ మరొక తీవ్రరూపం దాల్చింది. ఇంటిముందు ఉత్తరంగా పెద్దగోడ, తలవాకిలి, మంచివరండా చల్లగా వేయించా లని ప్రబలంగా వాంఛ ఏర్పడింది. గోడలు మట్టివే అయిన, కంబాలు, తలుపులు పనస చెక్కవి హనుమాచారితో చెక్కించి పైన పెంకులు వేయించాలి. కాని కుమ్మరిపెంకు వద్దు. మంగళూరిపెంకు ఎల్లాంటిదైనా పడవలపై హంగార కట్టెవారు తెచ్చినవే కొనాలి. పెంకుటిళ్ళు ఒక్కరేవు షావుకార్లవే కావు. చుట్టూ అడ్డదిడ్డమైన తాటిచెట్లను కోయిస్తే కావలసినన్ని దంతెలు ఏర్పడుతాయి.

ఐతాళులవద్ద ఋణం వస్తుందనే నమ్మకం కల్గిననాడే సీనయ్య కార్యభారం మొదలయింది. తాను, భార్య, కొడుకులు అందరూ ఇంటికి మట్టిమోసినారు. తమ పాతఇంటిముందే పునాది త్రవ్వినారు. మట్టినిసర్ది నేల సమంగా గోడ కట్టిందీ వారే. గోడలులేపే పరిస్థితిలో బేలుదారు ఒకణ్నే ఏర్పాటుచేసి చిన్నపనులన్నీ ఇంటివారే చూచుకొన్నారు. పెద్దవాకిలి అంటే మాటలా? పనసద్వారబంధం, తలుపులు దంతెలు కావాలి. తాను ఆ పంటలు పండించలేదే! ఎవరివద్ద పనస చెట్లున్నాయి అనే అన్వేషణకూడ చేశాడు. ఒకరోజు బారకూరుకు వెళ్ళాడు. అక్కడినుండి మూడుమైళ్ళదూరంలో ఎవరివద్దనో ఎన్నో పనసలు దొరకుతాయి అని నమ్మకం కల్గింది. అదేసాయంత్రం ఆవూరు చేరాడు. అన్నీ తెలుసుకొన్నాడు. నగదు ఇచ్చేది వానికి ఇష్టంలేదు. కనుక తన ఇంటి పది తాటిచెట్లను బదులు ఇస్తానని కరారు చేసి, తనకు తెలిసినవారి పడవలలోకట్టి తాటి మొద్దులను అక్కడికి సాగించాడు. మరుదినమే పనసమొద్దులు దొరికాయి. వాటిని అదేవిధంగా ఇల్లు చేర్చాడు.

అన్నీ వైనంగా కుదిరినవి. వడ్లపనికి ఎవరు రావాలి. ఊళ్లో పేరుమోసినవారు నాగప్ప, హనుమాచారి ఇద్దరే. హనుమాచారికి బర్రెపని. పాలుపితకడం పని, తీరికలేదు. అందుకే యువకుడైన నాగప్పఇంటికే అప్పులవాళ్లలాగా తిరిగి సగం కూలి వెంటనే, మిగిలింది జ్యేష్ఠ ఆషాఢాలక్కు ఇస్తానని ఒప్పుకొని పెద్దవాకిలి తలుపు ద్వారబంధం, పై దూలాలు, అడ్డకట్టెలు, దంతెలు, కిటికీలు తయారుచేయించాడు. ఐతాళుల రెండువందలు దొరకగానే, హంగారకట్టె రేవుకువెళ్ళి షావుకార్లదర్శనం చేశాడు. రెండువేల మంచి పెంకే' ఖరీదు చేశాడు. బందరుకు వచ్చివెళ్ళే బెస్తలనుమాట్లాడి ధరలను విచారించి 'ఈ షావుకార్లందరూ దోపిడీగాళ్లే' అని తెలుసుకొని ఎల్లాగో కుదిరించుకొన్నాడు; సగం నగదు, సగం ఆరుమాసాల వాయిదాపద్ధతిలో కొన్నాడేమో. రేవు బెస్తవారిని పీడించి పెంకులను ఇల్లు చేర్పించాడు. అతని తలవాకిలిపని ముగించేవరకు వూళ్లో పనివారందరూ నిద్రాహారాలు లేకుండా పని చేశారు.

తలుపుకు నగిషీపని చేసేసరికే నాగప్ప ఆచారికి చాలు చాలనిపించింది. 'సీనప్పయ్యా, ఒక్క దయ్యం పట్టినా ఫరవాలేదు. మీపని తగిలితే వదలడం కష్టం' అన్నాడు నాగప్ప.

ఊరకే దూలాలు చాలు అంటే వింటాడా? మొసలిముఖం, చిలుకలు, కమలాలు అన్నీ చెక్కించాలి. ఏకాంతం వుండాలి. కూలి, ఆవి ఎక్కువ అంటే, కాపీ, భయపడవద్దని మంచి సాఫీచెట్లు తెచ్చావని అది వెన్నలాగు మెత్తగ దిగుతుంది, అన్నీ చెక్కవచ్చునని రంగులుచేర్చి చెప్పాడు.

ఒకరాత్రి, మిద్దె పెంకులు తండ్రి, కొడుకులు చేరి జాగ్రత్తగా చేర్చి, పరచి తిరగవేసి ఎన్నో సర్దుబాట్లుచేసి ఊరి బయటివరకు నడచి ఎల్లా వుంటుందోచూచి 'రాత్రిరా. ఇది గడ్డి మిద్దెగాని, పెంకుమిద్దెగాని ఎల్లా తెలుస్తుందిరా ఛీ, ఛీ' అనుకుంటూ తెల్లవారే చూడాలని నిశ్చయించుకున్నారు. పడుకొంటే నిద్రపడుతుందా? పళ్లు తోముకొనడానికి ముందే ఒకసారి ఏటిగట్టుకువెళ్ళి ఎండపడేవేళవరకు తన ఇంటిని తిలకిస్తూ, తన తలవాకిలితీరని తృప్తితో వచ్చారు.

'ఇహ గోడపూత మెత్తు అన్నీ అయినాక ఎంత చక్కగా వుంటుందో! పారంపల్లి వాసేవ (వాసుదేవ) గురికారులబంగ్లా పట్టి అద్దం—ఇదే నిజమనిపించిని' అనుకుంటూ మురిసిపోయ్యారు.

గచ్చువని అంతా అయ్యాక 'కోట' సంతకు వెళ్లివచ్చిన తనకొడుకు నరసింహాండు ఒక కొత్తసంగతి చెప్పారు. 'అప్పా! మన పెంకుటిల్లు ఉత్తరం తెక్కటినుంచి, దక్షిణం హంగారకట్టె, బందపాలెనుంచి, తూర్పున సాస్త్రానినుంచి బాగా కనబడ్డదట' అని తెలియ జేశారు. శీనప్ప విని తానొక అశ్వమేధయాగం చేసినవాడిలాగా ఉబ్బిపొయ్యారు.

ఒకనాడు ఐతాళులు నదికి తూర్పున పల్లెకు వైదీకం నడిపించాలని వెళ్ళారు. సత్య భామపై మమతతో పొద్దు గూకకముందే వచ్చారు. నది దాటడానికి కాలుపెట్టగానే తమ సముద్రం ఒడ్డులోకూడ కొత్త పెంకులమిద్దె కనబడింది. 'ఎవరబ్బా మంచిమేడ ఈ సముద్రంఒడ్డున కట్టారని' తెలుసుకోవాలనే ఆత్రంతో ఇంటికి నడిచారు. అగత్తవద్ద నాల్గు పశువులు మేపిందిచూచి వాటినితోలి వెళ్ళగొట్టారు. అన్నీ మరచి వూరికే ఇల్లు చేరు కున్నారు.

దీనితరువాత ఒకనాడు ఎందుకో శీనప్ప గుర్తుకొచ్చాడు. 'సత్య. మన శీనమయ్య రూపాయలు ఇప్పించుకొని వెళ్ళిననాటినుండి మనఇంటికే రాలేదు. డబ్బు ముంచుతాడా ఏమిటి?' అని సంభాషణ చేస్తున్నారు. అదే క్షణానికే శీనమయ్య ప్రత్యక్షం అయ్యారు. 'ఐతాళులూ శీనడు వున్నాడో, లేదో అని అనుమానం రాలేదూ మీకు?' అన్నాడు. సత్య కూడ చాతుర్యంతో 'మిమ్ములనుచూస్తూనే అలా అన్నారు లెండి' అన్నది. ఇద్దరూ నవ్వు కొని వుపచారంమాటలు చెప్పుకున్నారు. తనభార్య సమయస్ఫూర్తికి చాతుర్యానికి చాల సంతోషించారు ఐతాళులు. 'ఇల్లాంటిభార్య వుంటే, డబ్బుపెద్దె తాళాలు అప్పగించవచ్చు' అని విశ్వాసం కుదిరింది. అలాగేమీ చెయ్యలేదు లెండి.



ఇచ్చట శీనవితో 'దినం నాల్గుసార్లు ఇంటిచుట్టు తిరిగేవాడివి. మహారాజువు నీవు, ఎని మిదినాళ్లకూ దర్శనంలేదంటే, ఏమనాలి?' అన్నారు ఐతాళులు.

శీనడు తన పురాణం విప్పాడు. 'అలాగంటే చూడండి. మా గృహచ్ఛిద్రం ఒకటా, రెండా— ఇంటిముంగిట్లోవున్న పాతకొట్టం పెరికించి, ఒక తలవాకిలి వుంచాలని శాస్త్రంగా మొదలుపెట్టాను. దానికి కారణం ఈ గడ్డివామిలో ఎందుకయ్యా కాపురం. నలుగురు కొడు కులు గలవాడివి. వానకాలంలో ఏమిచేస్తావు అంటూ పీడిస్తున్నారే. అని ఏదో చేశాను.'

'అవునురా! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. మొన్న సంతనుండి వచ్చేరోజు మన సముద్రం ఒడ్డున మంచి పెంకుటిల్లు చూశాను. ఎవరయ్యా డబ్బు ఎక్కువై బలిసిన వ్యక్తిది అనుకున్నాను. సముద్రం ఒడ్డునుండి దక్షిణంగాలివీస్తే పెంకు పగుల్తుందేమోరా!' అన్నారు.

శీనడు సమాధానం చెప్పకుంటే తప్పదు, అప్పుతీసుకొన్నచోట చిక్కు విడదీసు కోవాలి. తగినవుత్తరం తోచలేదు. మాటలప్రస్తావం మార్చి 'ఎక్కడండీ, మీ లచ్చరు? వాణ్ని చూడకుండా వుండలేను. మిగిలిన కథలు పులివాతపడని, సరవాలేదు' అన్నాడు. మరొక్క సారి 'ఐతాళులూ! ఏమన్నారు. మా పిల్లవాడు నరసింహాణ్ని బెంగుళూరికి పంపాలని వుంది. అక్కడ హెర్నెగారు హోటేలు తెరచారటగదా, ఒక వరహా నెలకు చేత బెదుతానన్నారు. అప్పుకూడ తీర్చవచ్చు. నలుగురూ వూళ్లోనేవుండి ఏమి చెయ్యాలి చెప్పండి' అన్నాడు.

'నీకు పిచ్చిరా శీన! నానాజాతుల ఎంగిళ్లుఎత్తి శుభ్రంచేసే పనికా, దేవుడు బ్రాహ్మణ జన్మ ఇవ్వడం? హెర్నెగారు అన్న విక్రయంచేసినా సరే-ఇంటికి మేడలు కడితే చాలనే వారు........'

'ఐతాళులూ, హెర్నెవాళ్ళహోటేలు బెంగుళూరిలోనే పేరుగాంచింది. తిరుపతికి వెళ్లిన వాళ్ళంతా అక్కడికివెళ్ళి తిరిగివచ్చి చెప్పారు. బెంగుళూరుసిటీకే గొప్ప హోటేలట. చాల మర్యాదటవారికి. బ్రాహ్మణులే భోంచేస్తారట. అంతే. మీరేచెప్పండి. నాకున్న నాల్గుతూముల పేద్యంతో ఏమి జరుగుతుంది. నేను కళ్లమూశాక, నాల్గుపాళ్ళకు ఒక్కొక్కరికి పుట్టెడు వడ్లు రావే! ఇంట్లోవుంటే పొట్టగడిచేదెట్లా? అన్నీ ఆపద్ధర్మాలే. విశ్వామిత్రుడు కరువు కాలంలో కుక్కమాంసం తిన్నాడట. వానికి కాలం ఖర్మం పట్టిందేమో! మీరు అన్నం అమ్మితే పాపం అంటారే! అన్నం ఒకటి! బియ్యం మరొక్కటా? వుప్పుడుబియ్యం అమ్మేవారి నేమంటారు? అన్నీ అంట్లేగదా!'

'శీన, నీ నాలుక ఒక మంగలికత్తిరా. నేను ఏవో మాటల్లో అన్నాను. నీవు బెంగు ళూరికో, మైసూరికో ఎక్కడికైనా పంపు. మొత్తంమీద వాళ్ళు చక్కగా బతికితే చాలు. అదేమీ కాదు. దూరభారంలో రోగం, రొచ్చు వస్తే ఎల్లాగని? పసివాళ్ళను ఎవరు చూస్తారు? గట్టి వ్యాధేవస్తే, శిమొగ్గవరకే నాల్గునాళ్లు అవుతుందే. ఇంటికి ఎల్లావస్తాడు. అని అన్నాను.

'అన్నీ ఋణానుబంధాలే. అక్కడి నీళ్లు సరిగ్గా వ్రాసిఉంటే వెళ్ళి తాగుతాడు, ఇంటి గుంటనీళ్ళే వ్రాసివుంటే ఇవే తాగుతాడు, అక్కడ ఇప్పట్లో రోగాలు బాధలు లేవు. మా వాగ్దేవి అన్నకొడుకుకూడ అక్కడే వున్నాడు. అన్నీ చూచుకుంటాడు. అతన్ని అక్కడికి పంపేలోగా ఒక జందెప్పోగు వేసి పంపుతాను'.

'అయితే మీ నరసింహానికి వుపనయనమన్నమాట, కానప్ప, కానీ, నిరుడే కావాల్సింది. గురుబలం చాలక మానేసినావుగదా!'

'అదీకాక, గురుబలంకంటె ధనబలంకూడ తక్కువే. తూముకు మూడురూపాయలంటే, బియ్యంనించి ఏమి వస్తుంది చెప్పండి. సరకారిపన్నుకట్టి మిగిలేదేముంది? ఈసారి అయితే మీరు కొంత అనుకూలం కలిగించారు. దానివలన తల దాచుకోవడానికి ఇల్లుకూడ అయిందండి. దాంట్లోనే ఒక గణహోమంచేసి, ఉపనయనం చేసేస్తే, మీ పెట్టుబడి అనుకొని వాడింత సంపాదించి ఋణం తీరుస్తాడు. పోనీ... చాలసేపయింది. మిమ్ములను ఆహ్వానించాలనే వచ్చాను. ఊరకే మాట్లాడేశాను. రేపు సోమవారమే ఉపనయనం. పన్నెండు గంటలకే భోజనాలన్నీ అయిపోతాయి, నేను తియ్యనిమాటలు ఆడేవాణ్ని కాను. అన్నీ మనస్సులోనే వుంటాయి.'

'అయ్యో, శీన, నీవు మరిస్తే, మేళం వాద్యం మరపిస్తుందా, పాటలువిని వస్తానులే.'

'మీకు నాపైన అంత రాయితీవుంటే చాలండి. అందుకే ఏమో అనుకొని అక్షంతలు మరిచిపొయ్యాను. వూరకే పిలచాననుకోకండి- మీరంతావచ్చి కార్యం నెరవేరిస్తే పిల్లవాడికి బ్రాహ్మణీకం అనుగ్రహించినట్టు.'

ఈలా పీఠికనుండి మంగళందాకా మాట్లాడినవాడు తొందరగావెళ్ళి మళ్ళీ వంటింట్లోదూరి 'ఓహో వదుమున్నారివారా!. అంటూ తన వాగ్విలాసాలు చూపించాడు; కొంచెమే చెప్పాననుకుని అంతా పల్లించాడు.

అక్కడనుంచి ఇంటికి వెళ్ళేటప్పుడు మైదానం మొదట్లో సరసోతి, పారోతి కనిపించారు. 'రేపు సోమవారం అంతా వచ్చేయండి. ఉపనయన లాంఛనం' అని అడుగు వేశాడు. సరసోతి 'ఉపనయనమా, గృహప్రవేశమా?' అని అడిగింది.

'అన్నీ కలిసేనండి. మా గడ్డిగుడిసెకు బొబ్బర్యునిగుడికి (మనీదుకు)- పెంకుపడ్డది' అని కదలారు. అందరూ నవ్వారు. సరసోతి, పారోతులకు అతడు వాళ్ళింట్లో అప్పు తీసుకొన్నసంగతి తెలియలేదు.

ఉపనయనం సోమవారం వచ్చింది. 'అందరూ త్వరగా లెయ్యండి. శీనుని ఇల్లు చేరండి, వియ్యాలవారిలాగు మధ్యాహ్నం భోజనాలు చేసివస్తే బాగుకాదు' అని ఇంటివారికి ఐతాళులు ఉత్తర్వు చేశారు. సరసోతి 'అందరూ, తొందరగా ఎందుకు వెళ్ళాలి? నువ్వూ, సత్య, పిల్లవాడు పదిగంటలకు రావచ్చు. నేను. పారోతి త్వరగావెళ్లి తరిగేది, రుబ్బేది, తుది



మేది పైపనులు చూస్తాము. ఎలాగైనా ఏ పెండ్లికి నాలుగునాళ్ళూ వాడూ, వాగ్దేవి కావాల్సిన సహాయం చేశారుగా!' అన్నది.

'అలాగే కానీ' అన్నారు ఐతాళులు. రెండవభార్య, బాబు, నేను రాజశీలితో వచ్చే స్తాము అనుకున్నారు. సరసోతి లేచినమనిషి స్నానంముగించి వెళ్ళింది. పారోతి ఆమె వెంట వెళ్లింది. పారోతి మగనితో 'వటువుచేతిలో ఏమైనా పెట్టండి' అన్నది. 'నేను మొద్దనుకున్నావా' అనే వుత్తరం వచ్చింది.

పదిగడియలతరువాత లచ్చడు, భామ, ఐతాళులు వెళ్ళారు. అక్కణ్నించి ఫర్లాంగే వారిల్లు. కానీ వియ్యాలఇంటికి వెళ్ళినంతసందరంగా వెళ్ళారు. పొన్నచెట్లతోపువాటగానే వారి తలవాకిలి, పెంకుటిల్లు కనబడ్డాయి. ఎదురు మళ్ళనుంచి ఆ మామిడితోరణం చాల అందంగా కనబడింది. 'ఇంతదగ్గరవున్న ఇంటినే నేను ఇన్నాళ్లుగా చూడలేదే' అని ఐతాళులు తికమక పడ్డారు. అలాగే నోరుతెరచి నిలబడ్డారు. 'అవును-శీనమయ్యరు మంచి తలవాకిలినే పెట్టారండీ. కనబడలేదంటే ఈ చెట్లు కట్టలు అడ్డంకావా?' అన్నది సత్యభామ. ఐతాళులు 'ఎవరైనా అప్పు ఇస్తే ఏమైనా చెయ్యవచ్చు' అన్నారు, లచ్చణ్ణి 'పే, పే దగ్గర పోతాను' అని అన్నాడు. అందరూ గంభీరంగా నడిచినారు. తోరణం అలంకరించిన తలవాకిలిగుండా ఐతాళులు లోపికివెళ్ళారు. 'చాల పైసలు చల్లాడులా వుంది' అనుకున్నారు.

ఉపనయనం ముందేవచ్చిన సరసోతి పారోతి ఇంటివారితోచేరి పని చేస్తున్నారు. పూర్వస్త్రీబృందం సత్యభామను చూచింది. అందరూ 'పిల్లవాడు ఎంతబాగున్నాడు' అన్నారు. కొందరు ఆమెబంగారం పరీక్షించి 'సత్య-ఒకపాట పాడమ్మా' అన్నారు. కాలం ముత్తైదువలు 'అక్కడిదెంత? ఇక్కడిదెంత?' అని భాష్యం చేశారు.

ఐతాళులు మాటవరుసకు 'శీన, ఏమైనా పనివుంటే చెప్పరా, సిద్ధం' అన్నారు. 'ఏమీ వద్దు! మీరు అక్కడ కొత్తవసారాలో కూర్చొనివుండండి. ఇక్కడున్న యాభైమందికి లోపలవాళ్లు చాలదా?' అని శీనడు ప్రత్యుపచారం చేశాడు. ఐతాళులు తలవాకిటి లోపలి చావటిలోకివెళ్ళి మోకాళ్ళకు వీపుకు ఒక ధావళి బిగించుకుని కూర్చున్నారు. శీనమయ్య చిన్నకొడుకు తాటాకులతో అల్లిన విసనకర్రలను అందించాడు. ఇంకెవరో ఎండలో వచ్చినవారికి మిరియాలు, యాలక్కుల పొడివేసిన బెల్లం పానకం తెచ్చిఇచ్చినాడు. ఒకరు చాల సంతోషించి 'ఈ వుక్కకు బెల్లంపానకంవంటి సుఖం దేనినుండి లేదు. గురికారుల ఇంట్లో గాంభీర్యంగా మంచి చక్కెర, నిమ్మరసం పానకం ఇస్తారుగాని దానినుంచి తృప్తి వుండదు. చక్కెర ఏమి చలువా మన్నా? బెల్లం సరిగ్గా చలువనిస్తుంది' అన్నారు.

వచ్చినవారు 'శీనమయ్యరు బుద్ధిమంతుడు'. కుమ్మరిపనివచ్చింటే పెంకులుకూడ చేసేవారే. ఇవన్నీచేసి ఉపనయనం లెక్కలో తలవాకిలిపనికూడ చేయించేశారు. గృహప్రవేశంకూడ అందులోనే ఇమిడ్చారు. ఎల్లాగయినా గొప్ప సాహసపరులే' అని పొగిడారు.

ఇంకొక్కరు 'శీనమయ్య సాహసకృత్యాలు ఏకేమి తెలుసు? ఐతాళుల పెళ్ళిలో ఆతని యాజమాన్యం చూశారో లేదో. వారి శీవినిచూచి పదుమున్నూరివారు మూడువందల ఎడపీరే దాహానికి ఖర్చుచేశారు. బ్రహ్మసభ సుఖంగా దాహం తీర్చుకుంది. ఇంకెవరైన. సాధారణవ్యక్తిఅయితే పూరకే బెల్లంనీళ్ళతో ముగించేసేవారు. నేనప్పుడే అనుకున్నాను. వెయ్యి సర్కారురూకలు తీరున చెల్లించేవారికికూడ ఆకవిదర్పం రాదు అనుకున్నాను' అన్నారు.

'ఒకకాసు అప్పులేకుండా తలవాకిలి ఎత్తించారంటే నమ్మండి' అని మరొకరన్నారు.

అప్పుడు ఎల్లాగైన ఐతాళులు మౌనం వహించారు. శీనమయ్య ప్రస్తావంమార్చి మరి వేరేవూళ్ళ ప్రవక్తి తెచ్చేవారు. వారిదృష్టి ఆతని తలవాకిలి వసారాల భద్రతను గమనిస్తూ వుండింది, ఇంటి తలుపు, ద్వారబంధం, దూలాలన్నీ లెక్కించింది.

భోజనం అయింది. మంచి వెనగవప్పుతోనే భక్ష్యాలు చేయించిపెట్టారు. కావలసినంత, మరింత వడ్డించారు. ఐతాళులు సగంభక్ష్యమే తిని వూరకున్నారు. తినటానికి నోరాడలేదు. శీనప్పమయ్యరు వచ్చి 'చూడండి, నాల్గుభక్ష్యాలు ఐతాళులుగారి ఆకులో వడ్డించండి, ఆయన మా యజమాని' అని శ్రద్ధగా చెప్పాడు. నాలుగు భక్ష్యాలు వడ్డించి పాలు, నెయ్యి గుమ్మరించాడు. ఎంతవేసినా మరొక్క పావు భక్ష్యంమాత్రం తిన్నారు ఐతాళులు.

కోటలోని మహాప్రపంచమే వంటలను, వడ్డనను పొగడిందిగాని ఆశీర్వాదాల సమయం వచ్చింది - శీనప్పకొడుకును తెచ్చి 'మా పిల్లవాణ్ణి బాగా దీవించండి. జపం, హోమం అన్నీ నేర్పించి బెంగుళూరికే పంపాలనుకున్నాను' అన్నాడు. వటువు అందరికీ వంగివంగి అభివాదనం చేశాడు. ఇరవై ముప్పైమంది బ్రాహ్మణోత్తములు వుల్లాసంగా వున్నారు ఇంతసంబరంలోను ఐతాళులు చప్పగా కూర్చోడం శీనమయ్యదృష్టిలో పడకపోలేదు.

ఉపనయనంనుంచి వచ్చాక ఐతాళులకు శీనమయ్య తలవాకిలి చాల సమస్యగ బయలుదేరింది. ఆ పెంకులు, చావడి అన్నీ కళ్ళలో మెదులుతున్నవి. శీనమయ్య వులును విరగాలి. వానిని మించినఇల్లు కట్టాలి. అని చాలవాంఛ బయలుదేరింది. శీనయ్య ఇదివరలో లాగు కాకున్న కొన్నిమార్లయిన వచ్చిపొయ్యేవాడు. అప్పిచ్చి ఆరువెలలుమాత్రమే అయింది. ఎల్లాగయినా ఆతనివద్దనుండి అప్పు సొమ్ము రాబట్టవలెనని ఐతాళులకు దృఢనిశ్చయం కల్గింది.

అతడు ఏవిధంగా ఎన్నోకారణాలు చెప్పి అప్పుతీసుకొన్నాడో, అదేరీతిగా ఎన్నోనెపములు చెబుతూ తొందరపెట్టి అప్పువసూలుచేయాలని పట్టుపట్టారు. ఎక్కడోవున్న కాటిచెట్టు-కళ్ళనగారు-ఈవిషయం శీనమయ్యకు చేరవేసింది. అదివిన్న శీనమయ్య మరొకరితో 'ఈ దరిద్రబ్రాహ్మణుడు నేను తలవాకిలిపెడితే మండిపడి ఏడుస్తాడు. వైదీకులంతా అంతే' అన్నాడు. ఈసంగతిలి మరొక కాటిచెట్టు ఐతాళులకు చేరవేసింది. ఒకనాడు ఐతాళులు అతికోపంతో 'సత్యః చూచావా? పాముకు పాలుపోయించావు. అత దన్నాడట నాకు కడుపుమంట అని. వానిఅబ్బగ మేడ కట్టుబాలి ననుకున్నాడేమో?' అని తాండవం చేశారు.



ఈ చెలరేగడం రగడరాద్ధాంతాలు విని సరసోతికి, పారోతికి అంతా బోధపడింది. సరసోతి సాయంకాలం సత్యభామతో చక్కనిమాటలమధ్య అప్పువివరాలు తెలుసుకుంది. అన్న వినేలాగే 'పారోతి, తోబుట్టు ఏమో తక్కువ అయింది. నిన్నమొన్న వచ్చినభార్య గొప్పదయిందే. రోజూ వంటలను మెచ్చుకుని ఉట్టికి, స్వర్గానికి ఎక్కించాడు శీనయ్య. అప్పు దొరికిందిగా. తరువాత అల్లానే దింపుతున్నాడు' అని అన్నది.

ఐతాళులు సరసోతితో వాగ్యుద్ధంలో గెలువజాలరు. 'సరే, నా సొమ్ము ముంచుతా ననుకోకు. బ్రహ్మదగ్గరకు వెళ్ళినా పట్టుకొని నిలబెట్టి వసూలుచేస్తా అన్నారు.'

# 9

శీనప్పమయ్యకు, ఐతాళులకు కలహం బలమైనది, పరుషగా ఎన్నో వినికిళ్ళవలన మాటలు మానేశారు. 'ఎవరెవర్ని ముంచాడో తలవాకిలి అయింది' అని ఐతాళులంటే, 'కడుపుకు తినకుండా దాచుకుంటున్నాడు ఏమిలాభం' అని శీనయ్య ఎక్కిరిస్తాడు. మూజువాణీ అప్పు ఇచ్చింది ఐతాళులను బాధిస్తే 'ఎలాగైన పూటిగా కోడితిరుణాల వున్నానికైనా ఋణం తీర్చు. కొడుకు పిడికెళ్ళతో సంపాదిస్తున్నాడు గదా అందుకే అంతగా నాట్యాలు చేస్తున్నావుగా' అని అందానుని నిశ్చయించుకున్నారు.

'కోడి'కి పదిమైళ్ళదూరాన కోటీశ్వరం అనే పట్టణం వుంది. అక్కడ పంచపాండవులు స్వయంగా వచ్చి కట్టించిన లింగేశ్వరాలయం వుంది. అది పెద్ద దేవళం. పెద్ద చెరువు, పెద్ద వుత్సవం జరుగుతుంది. దాన్నే కోడిపున్నమ అంటారు. ఆదినం ఐతాళులజీవితంలో గొప్పమార్పు తెచ్చేదినం- శీనమయ్య గడువు ఆనాడే- ఇంట్లో మరొక్కక్లేశం సంభవించింది.

ఐతాళుల ఇంట్లో కలతలేర్పడినవి. పారోతికి కడుపున పుట్టిన బాబులేకున్నా లచ్చన్నే చాల ప్రీతితో చూస్తుండింది. కాని తానుమాత్రం సునీతి, సత్య సురుచి అనే మనోవేదన ఎక్కువైంది. ఐతాళులు ఆమెపట్ల దుష్ప్రవర్తనగాని దుర్భాషలుగాని ప్రదర్శించలేదు. కాని సత్యభామపై ప్రేమను కురిపించి, తనపై అనాదరం చూపుతున్నారనే చింత వదలలేదు. పారోతికి బ్రతుకంతా కష్టాలే. ఈ చిల్లరకష్టాలు ఆమెకు లెక్క లేనేలేదు.

లచ్చడు పెరుగుతున్నాడు-వానికిప్పుడు రెండేండ్లు నిండినవి. ఆ పిల్లవాని నవ్వుతో బాటు తనకుకూడ వాడు సద్గతులు తెప్పిస్తాడనే విశ్వాసం, ఆశలుకూడ ఆమెలో ఎక్కువైనవి. ఆ పిల్లవాడు పూరక వంటిల్లు, నడిమిల్లు వసారాలతో తృప్తిపడకుండా బయలు, సముద్రప్రాయకట్ట బాడవఅన్నీ పెద్దమ్మవెంట తిరగాలని హఠం పట్టేవాడు. వంటవేళకు పెద్దమ్మ వాణ్ణిఎత్తుకొని వెళ్ళితే పిల్లవానితొందర తప్పితే చాలని తల్లికూడ అనుకునేది.

వాడు దారివెంట అంబాలు, కొక్కొ-రొకోలు, కాకాలు అన్ని పిట్టల్లాగు మాట్లాడుతూ, అన్నింటినీ పలుకరిస్తూ ఆమెను క్షణం విడవకుండా వెన్నంటేవాడు. తరువాత ఆమెపై ఇంత మమకారం కల్గిందిగదా, ఆమెను స్నానానికి, తినడానికి, పండుకోవడానికికూడ వద లడు. వానికి అన్నంకూడ పెద్దమ్మ తినిపించాలి. వానికి తనపై ప్రేమ తగ్గిస్తున్నదే అని సత్యభామకు పార్వోతిపై అసూయ పుట్టింది.

పెద్దమ్మకు మంచినీళ్ళకు తోడుగా ఒకముక్క- బెల్లం ఇస్తే లచ్చనికికూడ భాగం పెట్టిన పార్వోతితో సత్యభామ 'బిడ్డకు పొట్టలో పురుగులు పడితే....పళ్లు చెడిపోతే', అంటూ తన అసంతృప్తి తెలిపేది. పిల్లవాణ్ని బయట షికారుకు తీసికెళ్ళితే 'పిల్లవాణ్ని చలిగాలిలో తిప్పి జరం గిరం తెప్పిస్తున్నారు' అని గొణిగేది. ఒకసారి మధ్యాహ్నం ఐతాళులే 'పార్వోతీ, పిల్లవాణ్ని ఎండలో తిప్పకు, వడదెబ్బ కొట్టవచ్చు' అన్నారు. పార్వోతి పిల్లవాన్ని బయటికి తీసికెళ్ళడం మానేసింది.

అయితే లచ్చనికి ఇల్లువాకిలి ఆటలకు అనువుగా లేదు. తల్లి పనితో వంటింట్లో వున్న ప్పుడు పిల్లవాడు కళ్లుకప్పి కుంటుతూ బయటపడి 'పెద్దమ్మా!' అంటూ వెంటబడేవాడు.

చలికాలంలో ఒకనాడు తెల్లవారుఝామున సరస్వోతి, పార్వోతి లేచి వులవచేనుకు వులవమొక్క-లు పీకడానికి వెళ్ళారు. హిమంతో నానినచెట్లను పెరికి కూర్చున్నారు. తెల్లవార గానే లచ్చడు తన చాపనుండి లేచాడు. పెద్దమ్మ కనబడకుంటే 'పెద్దమ్మా!', అని కేకలు పెడుతూ తిరిగినాడు. అప్పుడు సత్యభామకు చాల కోపంవచ్చి 'వీనికి పెద్దమ్మసివం పట్టింది' అని గద్దించింది, లచ్చడు మరింత ఏడ్చాడు. 'ఊరికే పడివుంటావా? నోరు మూసేయ మంటావా?' అన్నది. లచ్చడు భయానికి నోరుమూశాడు. కాని మెల్లగా బయటికి వెళ్ళాడు. అప్పుడే ఒకతడవ ఉలువమోపులను పార్వోతి, సరస్వోతి ముంగిట్లోవేసి వెళుతున్నారు. పెద్దమ్మ అంగళంనుండి బయటికెళ్ళింది; లచ్చడు కనిపెట్టాడు. మౌనంగా తానుకూడ ఆమె అడుగుజాడల్లో నడచాడు. రెండవమోపు తెచ్చేలోగా లచ్చడు చేనిలో కనపడ్డాడు. 'పెద్దమ్మా, నన్నువిడిచి ఎందుకు వచ్చావు?' అని అడిగాడు.

'బాబూ! ఎందుకురా ఈ చలికి షికారి నీకు? ఇంటికి వెళదాం పద' అని వాణ్ని ఎత్తు కొని ఇంటిదారిపడితే వాడేమో గొంతుచించుకొని ఏడ్చినాడు. చేసేదిలేక వాడిని చేనిలో ఆడించుకుంటూ పార్వోతి వుండిపోయింది. సరస్వోతిమాత్రం మోపులుఎత్తి పడవేసింది. 'పెద్దమ్మా! నువ్వేం చేశావు చెప్పు' అని అడిగినాడు. 'ఉలవచేను కోశాను' అంటే, లచ్చడు కూడ 'నేనూ మొక్క-లు పీకుతాను' అని చక్క-గా మొక్క-లు తెంపేశాడు, అన్నిటికీ మారామే.

ప్రొద్దుటిపని అయింది, సరస్వోతి మొత్తంచేనును శుభ్రపరచి మోపులు ఇల్లు చేర్చింది. దురదృష్టంమూలాన అన్నటు లచ్చనికి ఒళ్లు వెచ్చగ అయింది, సాయంత్రం తగిలిన



జ్వరం మూన్నాళ్లు బాధించింది. పార్వోతి అనుకున్నది, తానెందుకు వాణ్ని తెల్లవారిఝామున చలిగాలికి తీసికెళ్లాలి?-అని. చాల పశ్చాత్తాపపడింది. గాలికి-దృష్టికి తగినవుపచారం చేసింది.

తల్లికూడ సవతిని మనసారతిట్టిపోసి గట్టిగా అనేధైర్యం చాలక ఆమె వినేట్టు కొంత సణిగిందికూడ. పిల్లవాడు జ్వరంతాపం భరించకుండా 'పెద్దమ్మా' అని కలవరిస్తున్నాడు. తల్లిపేరు రవంతయినా పలుకలేదు.

ఐతాళులు ఆ మూన్నాళ్లు తూర్పుగ్రామానికి పెద్ద పౌరోహిత్యంపనికి వెళ్ళారు. పని ముగించుకొని ఇంటిగడప తొక్కా-రో లేదో 'లచ్చన్నా!' అని కేకవేశారు. 'అప్పా' అని ప్రతిధ్వని రాలేదే? చావట్లో సత్యభామ కన్నీరు కురిపిస్తున్నది. అశ్రుధారచూచి 'ఏమి సంగతి?' అని అడిగితే 'బిడ్డ పడుకున్నాడు' అన్నది. 'జ్వరం కతకత వుడుకుతోంది, మూన్నాళ్ళయింది. ఎవరిబాబుపోతే ఎవరికేమి?' అని విచిత్రసమాధానంకూడ సాగదీసింది.

ఐతాళులు త్వరగా లోపలి పడసాలలోకి వెళ్ళారు. లచ్చడు నిద్రపోతున్నాడు. ఒంటి నిండా చెమటలు. అటు ఇటు పార్వోతీ, సరస్వోతీ వుపచారం చేస్తున్నారు. అన్ననుచూచి సరస్వోతి 'ఇప్పుడు జ్వరం విడిచిందేమో! చెమట పట్టింది', అంటూ వానిఒంటిని తడిమి చూచింది. పిల్లవాడు మేల్కొ-ని తండ్రినిచూచి 'నాన్నా!' అని పిలిచాడు. అందరికీ ధైర్యం కలిగింది. బిడ్డఒంటిని జాగ్రత్తగా ఐతాళులే తుడిచారు. 'చూడు, సరస్వోతీ వీనిని పొడిగుడ్డతో తుడిచి పడుకోబెట్టు' అన్నారు. 'బిడ్డ నాల్గింట మూడువంతులు చిక్కి-పొయ్యాడు' అన్నారు. చెల్లెలు మూడురోజులు జ్వరగాథ చెప్పింది. ఆమె పలుకులను పెడచెవిన విన్నారు. 'ఏమైతే నేం! నూటఎనిమిది గాయత్రీ జపించి మంత్రిద్దాం' అని సంధ్యవార్చి దేవునిగదిముందు కూర్చుని 'పిల్లవాణ్ని తెండి' అని సత్యకు చెప్పారు. ఆమె పిల్లవాణ్ని తేగానే, 'హ్రాం, హ్రీం, హ్రూం' అంటూ పఠించి వానిముఖాన భస్మంతో నామంపెట్టారు. నోట్లో కొంత భస్మం తురికి 'సత్య, పిల్లవాన్ని ఉయ్యాలలో పడుకోబెట్టు' అన్నారు. సత్యభామ అన్నం వార్చుతున్నది, సగంలో రాలేక 'అన్నం వార్చుతున్నాను' అన్నది. అక్క-డే నిలుచున్న పార్వోతీ త్వరగావచ్చి 'నేను పడుకోబెడ్తాను' అన్నది. 'సత్యను పిలిస్తే నువ్వేమిటి?' అన్నారు ఐతాళులు. పార్వోతికి పిడుగు పడినట్లయింది.

పార్వోతి అక్క-డ నిలబడజాలకపోయింది. పశువులకొట్టంలోకి వెళ్ళింది. వాటికి అక్క-చ్చు చెక్క-) పెట్టి పాలు పితుకడానికి మొదలుపెడితే చెయ్యి వణికి పాలుధార చెంబులో పడేది కష్టమే అయింది. ఆమె గజగజ వణుకుతు, గద్గదకంఠంతో పశువుల దొడ్డినుండి లోనికి, లోన దేవుని గదిలోనికి ఊరకే తిరుగులాడుతుంటే సరస్వోతిచూచి తనే ఆమె పనులన్నీ అందుకొని ముగించింది. ఆమెను భోజనానికి రమ్మనింది. 'నాకెందుకు! మట్టి కొట్టుకోడానికా కూడు' అన్నది పార్వతి.

సరసోతి బలవంతంచేసి పారోతికి రెండుమెతుకులు తినిపించింది. పారోతి భోంచేసి పాత్రలు తోమి తెస్తామని చెరువుకు తీసికెడుతుంటే చేతులావణికి గిన్నెలు ముంగిట్లోనే ధడిల్‌మంటూ పడ్డాయి. ఆమె వెంటనే సరసోతి వుంది. అన్నీ ఎత్తి తానే కడిగి 'ఏం పారోతీ! ఎందుకు ఇలా చేస్తావు?' అని అడిగింది. పారోతి గొల్లుమని ఏడ్చి 'నేనేకదా పూతన రక్కసి, ఎవరిపిల్లల కష్టం నాకెందుకుంటుంది?' అన్నది.

'ఎవరన్నారు? ఆవిడా? చెప్పేవారి పిల్లలు చెడితే, వినేవారిపిల్లలు వినవద్దా?'

'ఆమే అన్నది. ; వారు, సత్యనీవా ఏమిటి-అన్నారు నేను బిడ్డను పడుకోబెట్టడానికి వెళ్ళితే' అన్నది.

ఆమాటలు ముగించేప్పుడే సత్య భోజనంచేసి బయటికి వచ్చింది. ఇది తన్నుగురించి చర్చయే కదా! వినాల్సింది విని లోనికెళ్ళింది. దగ్గుతూ చెరువుకు వెళ్ళింది. తనవల్లాం కడుక్కొని వెళ్ళింది. అప్పటికి సరసోతి పారోతి మిన్నకున్నారు.

రాత్రి మిగిలినపనులన్నీ ముగించుకొని సత్యభామ తొందరగా బావలవద్దకువెళ్ళి కన్నీరు కురిపిస్తూ 'నేను కొంచెం అంటేనే విపరీతం ఆర్భాటాలు చేశారు. బాబును తెల్లవారుఝామున చేనికి పిల్చుకొనిపోయినందుకు జ్వరం వచ్చిందని కడుపుమంటకు 'ఎవరిబిడ్డ చస్తే ఎవరికేమి' అని నేను గొణుగుకుంటే చెప్పేవారిపిల్లలు చెప్పాలి, వినేవారిపిల్లలు వినాలి' అని పెద్ద యుద్ధానికి పీఠిక వేసింది. అంతలో లచ్చుడు 'పెద్దమ్మా!' అని కేకపెట్టినాడు. వానికేక అందరూ విన్నారు. పారోతికూడ 'నన్నెందుకు వీడు పిలవాలి' అన్నా, ఆమెకాలు ఆగలేదు. ఆమె పిల్లవానివగ్గరకు పరుగెత్తి వచ్చింది. అంతకంటె ముందుగా సత్యకూడ వుండినది, పారోతి వెనుకకు తగ్గింది. తల్లి పిల్లవాణ్ని 'ఏమికావాలి?' అని అడిగింది. లచ్చుడు 'నేను పెద్దమ్మకాళ్ళపై నిద్రపోతాను' అన్నాడు.

'నేను వుయ్యాలలోవేసి వూచిచే చాలదా?' అన్నది. లచ్చుడు ఏడ్వసాగాడు. తల్లి ఏమీ వుపాయంతెలియక 'అక్కా, పిల్లవాణ్ని పడుకోబెట్టుకొండి' అని అడిగింది. పారోతి ముఖం కాల్చిన వంకాయలాగున్నది; దుఃఖంతో హద్దుమీరింది. పిల్లవాడుకూడ పెద్దమ్మ వద్దకు రావడానికి యత్నించాడు. చివరకు పారోతి వాణ్ని కాళ్లమీద వేసుకొని గోడకు అనుకొని కూర్చుంది. ఆనాడు ఆమె ఏడ్చినంత ఎవరూ ఏడ్వలేదు. సత్యభామకు కూర్చొనే సహనం లేకుండ బావలవద్దకు పోయింది. వారివద్ద మాట్లాడుతూ 'కనేది నేను, మోసేది వారు, పెంచేది వారు' అని తనగోల చెప్పుకుంది, నిజంగాచూస్తే పరిస్థితి అలాగే వుంది. బావలు 'సత్య, పిల్లలకన్నీ ఎల్లా తెలుస్తవి చెప్పు. అన్నింటికి ఏడిస్తే నేనేమి చెయ్యాలి? మీ ఇద్దరి కలహాన నేను ఇల్లు వదలిపెట్టాల్సిందే?' అన్నారు. చెల్లెలు ప్రసంగంలోకి దిగకుంటే సత్యభామకు అనుకూలంగానే తీర్పు దొరికేదేమో - చెల్లెలంటే భయాన్ని పారద్రోలలేకపోయ్యారు బావలు.



దేవునిదయవల్ల ఆరాత్రికే జ్వరం పూర్తిగా తగ్గింది. మూన్నాళ్లతరువాత లచ్చుడు ఇల్లంతా తిరుగులాడదొడగినాడు. వాని నోరేమో ఎప్పుడు పెద్దమ్మ జపం చేస్తుండింది.

ఈ కథ జరిగినాక సత్యభామ, పారోతులనడుమ వైరంలేకున్నా, ఉదాసీనభావం మాత్రం బాగా కనబడింది. రోజుకు ఆరుకు ఎక్కువగాదు, మూడుకు తక్కువకాదు అన్నట్లు అతిమితంగా మాటలాడుతారు. తప్పనిసరి పనివుంటేనే బాగా తగినంత మాట్లాడుతారు. చలికాలం, ఎండకాలం, వానకాలం వరుసగా గడచినవి. లచ్చునిప్రేమ పారోతివట్ల ఎక్కువైంది. అల్లాగే సవతుల నడుమ తాత్సారభావంకూడ అన్నేరెట్లు ఎక్కువైంది. లచ్చునికి మూడేండ్లపైన మూడునెల్లయినవి. కోటీశ్వరస్వామి జాత్ర దగ్గరకొస్తున్నది. బావలఇంట్లో ఆ జాత్రకు సరిగా కొత్తబట్టలు కొంటారు- సంవత్సరానికి కావలసిన కిరాణా, అవీ ఇవీ అన్నీ ఆరోజుకే పట్టీవ్రాసి తెస్తారు. క్రొత్తబట్టలు కట్టుకొని తర్వాత పోరిజాత్రలలో పాల్గొనేది మంచిదని కాబోలు అలా చేసేవారేమో!

ఆ ఊళ్ళల్లో ప్రసిద్ధికెక్కిన ఆ జాత్రను సత్యభామ ఇదివరలో చూచివుండలేదు. ఈ ఏడాదైనా చూడాలని అభిలాష కల్గింది. పిల్లవాణ్ని మోసుకుని ఎనిమిది పదిమైళ్ళు ఎల్లాగు వెళ్ళాలి? అంతసాహసం చెయ్యాలా? జాత్రకు పదిహేనుదినాలుంది అనగా 'ఈ సారైనా కోడివందుగకు పిలుచుకొనిపోతే బాగుండదా?' అని ప్రస్తావించింది. బావలు ఎందుకు నిరాశ కలిగించాలని తొందరగా బవుళి కొనాలని నిశ్చయించారు.

జాత్రకు మూడురోజులముందే పేటనుండి కొత్తబట్టలు కొనితెచ్చారు. తమకొరకు రెండు పచ్చరాలు, సన్నపంచలు, షష్ఠిపంచలు, సరసోతికి ఒకజత మట్టిఅంచు ఎర్రచీరలు, పారోతికి తెల్లఅంచుని జత పాల్ఘాటుచీరలు, లచ్చునికి మామిడిపిందల నగిషీశాలువ కొన్నారు. తరువాత 'సత్యభామకొరకు ఏం తేవాలి?' అని ఆలోచించి, మళిగలోనివన్నీ పది పన్నెండుసార్లు తెప్పించారు. ఇల్కాలుచీరలు ఖరీదెక్కువ, ఇంటికి పాల్ఘాటుచీర, పండుగపర్వాలకు బయట వెళ్ళాల్సినప్పటికి కొర్నాడుచీర కొనాలనుకొన్నారు. దాని ఖరీదు కూడ ఎక్కువే. అందుకే చివరకు కుమారపాళెం రుద్రాక్ష అంచుచీర ఒకటైనా వుండాలని తెచ్చారు,

జాత్రదినం రానే వచ్చింది. ఒకరినివదలి మరొక్కరు వెళ్లటానికి వీల్లేదు. తెల్లవారుఝామున సరసోతిలేచి పశువులకొరకు అక్కచ్చుకాచి, సూరని భార్యతో పశువులను చూచుకొమ్మనిచెప్పి మళ్ళీ అనుకొంది. 'ఛీ ఛీ- నిండ సామానుతో ఇల్లు వదిలేస్తే ఎల్లాగు!' అనుకొని తానే ఇంటికావలిగా వుంటానని చెప్పింది. మిగిలినవారేమో కొద్దిగ చీకటుండగానే బయలుదేరారు. సముద్రతీరాననే ప్రయాణం నిశ్చయించారు. లచ్చుడు చలిగాలిలో వంతులుగా సత్యనుండి తండ్రివద్దకు, తండ్రినుండి పారోతివద్దకు వచ్చి ఘటంఎక్కి సవారీ చేసేవాడు. ఒక ఝామువొద్దుకు ఈ పిల్లవానిసేవలు ముగించుకుంటూ ఎలాగో కోటీశ్వరం

చేరారు. పెద్ద చెరువునుచూస్తే లచ్చనికి చాల ఆనందం అయింది. చెరువులోని మొసళ్ళను చూచి వినోదంతో 'ఇక్కడే చూస్తూ నుంచుందాము' అని పట్టుపట్టాడు.

సరే, చెరువున అందరూ మునుకలుచేసి వచ్చారు, గుడిలో దేవతాదర్శనం, పండ్లు కాయల నైవేద్యం జరిగాయి. దేవుని రథోత్సవం తిలకించారు ఆ జనం గజిబిజిలో తోసుకొనిపోయి జాత్రకు వచ్చిన పశువులను, గుంపునుచూపించి, పూసలంగడినుండి బొమ్మలు లచ్చనికి కొనిచ్చినారు. చాలమంది పండ్రెండుగంటలవేళకు భోజనాల ఆశతో గుడివారి సమారాధనలో స్థానం సంపాదించాలని వెళ్లారు. కాని ఐతాళులు చెరువుకట్టపైన తెలిసిన వారింటికే భోజనానికి వెళ్ళారు. జాత్ర అంటే చుట్టాలకు పండగ. ప్రతివాళ్లు తమతమ చుట్టాలను చక్కగా సత్కరించాలనే ఉత్కంఠతో వుంటారు. అప్పుడు చుట్టాలయింటి భోజనమూ సంతర్పణగా మారిపోతుంది.

అందరూ భోజనానికి కూర్చున్నప్పుడు, పారోతికి తెలిసిన ఒకామె పక్కన కూర్చున్న సత్యవిషయం ప్రస్తావించగా పారోతి 'ఆమె మా ఆయన భార్య' అని పరిచయం చేయించింది. ఆమె కళ్ళంతా సత్యభామ చీరపైపే. ఆమె మెల్లగా పారోతిచెవిలో ఊదింది 'ఆమెకేమో రుద్రాక్షఅంచు, నీకు పాల్ఘాటుచీరనా?' అన్నది. పారోతి 'ఏదికడితే ఏమిటే' అన్నది. పారోతి విరక్తితోమాత్రమే అలాగనింది. తనకు తనలో భేదభావంలేకున్నా వేరే వాళ్లు వేలుపెట్టిచూపితే తనస్థానంపట్ల చాలా నొప్పి కల్గింది. చిన్నదానికంటె తాను సామాన్యవ్యక్తి అని తెలుసుకుంది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక మళ్ళీ జాత్రలో తిరిగి వినోదాలు చూశారు. సత్యభామ చెప్పినట్లే ఐతాళులు పిల్లవానికి బత్తీసు, బెండు, బొరుగులు, పప్పులు, పుట్లాలు కొన్నారు. కొత్తకుండకొని వాటిని దానిలో నింపవమయింది. పారోతి తన మగడిచ్చిన అర్ధణాతో ఎన్నో కొందామని ఆలోచించి చివరకు లచ్చనికే ఖర్జూరంపండు కొనింది. తన ఒడిలోనే పండ్లుంచుకుంది.

సాయంకాలం పొద్దుండగానే ఐతాళ జాత్రఊరేగింపు మళ్ళీ బయలుదాటి పడమటి సముద్రతీరం చేరింది. అందరు ఇసుకతొక్కుతూ దక్షిణదిక్కుగా ప్రయాణం చేశారు. లచ్చనికి అలసటతో నిద్రపట్టింది. నిద్రలో పిల్లవాడు రెట్టింపుబరువు ఎక్కాడు. వాణ్ణి మొయ్యలేక సత్యభామ, 'ఈ ఇసుకలో దిగబడుతూ ఎండలో నడచేబదులు, చక్కని పెద్ద బాటలో వెళ్ళింటే బాగుండేది' అన్నది. 'పెద్దదారిలో మాలమైల వుంటుంది. శూద్రజన సమ్మర్దం గుంపులువస్తే వాళ్ల కండ్లు తెలియకుండా మీదపడుతారు. ఈ దారిలో మడిగా, శుచిగా వెళ్ళవచ్చుకదా' అన్నారు ఐతాళులు. పిల్లవానిభారం కష్టమని సత్య చెప్పిందవి ఐతాళులకు తోచనేలేదు.

పారోతి సత్య బాధలను గుర్తించింది. 'పిల్లవాణ్నిటుతే. ఎంతని మోస్తావు. నాకివ్వు' అన్నది. ఇప్పుడు మోత మార్చితే చాలనుకున్న సత్య వెంటనే వానిని ఆమెకు అప్ప



చెప్పింది. పారోతి అతి సాహసంచేస్తూ వాన్ని మోస్తూ నడిచింది. నాల్గో ఐదో మైళ్ళు నడువగానే వాడు నిద్ర మేల్కొన్నాడు. అప్పుడు సముద్రం చూపుతూ మెల్లిగా వాణ్నికూడ నడిపిస్తూ పరుగెత్తిస్తూ 'ఇదిగో మామ్మ పరుగు, బొమ్మ పరుగు' అనిచెప్పి వాణ్ని నడిపించి పున్నమరాత్రి చలువకు ఆనందిస్తూ కొబ్బరిచెట్లపై చంద్రుడెక్కినాక ఇల్లు చేరుకున్నారు.

రాత్రివంటలు వారికై వేడిగా ఎదురుచూస్తున్నవి. జాత్రమైలబట్టలు విప్పి స్నానాలు చేసి అందరూ భోజనాలకు కూర్చున్నారు. సరసోతి అమితోత్సాహంగా మినుములులేకున్నా ఉలవతోనే నూకకుడుములు కారంవి, తీపివి చేసివుంచింది. అందరూ త్వరగ భోంచేశారు. పారోతి జాత్రలోని విశేషాలు సరసోతికి వర్ణించి చెప్పింది. మధ్యలో ప్రసంగవశాత్తు రుద్రాక్షఅంచు చీరపై వ్యాఖ్యానాన్నికూడ చెప్పివేసి కన్నీళ్లు కురుపించక వుండజాలక పోయింది.

ఐతాళులేమో కోటీశ్వరుల జాత్రనుండి వచ్చారు. జాత్ర బాగాచేశారు. నిజమే, కాని వారి అంతరంగం శీనమయ్యను మరువజాలదు. వాని అప్పు వాయిదాదినముకూడ అదే రోజు. తాము బయటికివెళ్ళినందుకు నానికి కొంత అనుకూలం కల్గింది. అందుచేత తామే రాత్రివెళ్ళి వాణ్ణిలేపి మాట్లాడుదామని కాంపౌండుగోడవరకు వెళ్లారు. సరసోతి అతనితో బాతాఖానీ మొదలుపెట్టింది. జాత్రసంగతులు వివరంగా అడుగసాగింది. మాటలమరుగులో రుద్రాక్షఅంచు చీరమాటలను ఇమిడ్చింది. ఐతాళులమనస్సుకూడ కలవరంగా మారింది. 'ఒకపనీ కానివ్వరు-ఎప్పుడూ ఇంటిగొడవలోనే ముంచేస్తున్నారు' అంటూ అరుగుపైననే కూర్చున్నారు. తరువాత చాపవేసికొని పడుకొని పొర్లాడినారేకాని నిద్ర సరిగా పట్టలేదు. కలలో శీనమయ్య తన ముల్లె ముంచేసినట్లె చూచారు.

సరే, తెల్లవారగానే వదలే ఆసామియేనా? తొందరగా నీళ్లలోమునిగి, ఆ పొగ కమ్మిన బాడవమీదుగ వానింటికి వెళ్ళారు. వరుగులతో వానిల్లు చేరారు. అక్కడ శీనడు ఊరి బయలుమార్గాన వీళ్ళింటికే బయలుదేరాడేమోనని తెలిసింది. అతడు లేడనగానే వారు అతనిభార్యను 'శీనడు ఎక్కడమ్మా'అని అడిగారు. ఆమె ప్రత్యుత్తరంగా ఒక రామాయణమే వుపన్యసించింది. వీరి వాయిదాబాధకే శీనడు వూరంతాతిరిగి తన్నుకలాడిన కథ, చివరకు భర్తీకి బెంగుళూరినుండి నరసింహుడే యాభైరూపాయలు పంపివేసి మానం దక్కించాడని, పైసలు సరిచేసి సరిగ్గా జాత్రనాడే చెల్లించడానికి వెడితే వారే ఇంటలేరని వర్ణించింది. ఐతాళులకు అన్నీ వినేసావకాశం, నెమ్మది, తీరిక ఉంటేగా? వారు భయంకొద్దీ ఇంటికి పరుగెత్తారు. మధ్య మైదానంలోనే ఇద్దరు చూచుకున్నారు. శీనడు వారిచేతుల్లోకి ధనంపోస్తూ 'చూడండి, అంతా సరేగాని మీకు శీనవిషయంలో ధైర్యం చచ్చిందట. నేను ముల్లె ముంచేస్తున్నానని అనుకుంటున్నారేమో, మీడబ్బు వద్దు—దూర్లు, తాకట్లు, కొండేలు వద్దు' అని పురాణం చెప్పేడు. కాని ఐతాళులు ఒక్కొక్క చిల్లిగవ్వవైపే ధ్యానంతో చూస్తూ ఎంచుకున్నారు. కరారుపత్రాన్ని చూచుకొని, పరిశీలించి డబ్బును నడుముకే బిగించుకున్నాక

పైకి తల ఎత్తిచూస్తే శీనప్ప కొంతదూరం వెళ్ళినట్లు తోచింది. డబ్బేమో వచ్చింది, సీనప్ప యొక్క సత్యసంధతకూడ చాల మెచ్చుకోదగిందే. తాను అల్పమైన ధనంకొరకే వాణ్ని పీడించి, అనుమానించాననే భావనకూడ ఏర్పడింది. పూర్తి సంకోచంతోనే, 'కోపపడకు మహారాజా! ఏమో తావత్రయంతో వున్నదీ లేనిదీ ఆడింటానేమో! అవన్నీ గోరంతలు కొండతలు చేయకు' అని ఉపచారాలు చెబుదామంటే అతడు అదృశ్యమయ్యే వున్నాడు. అందుకే ఐతాళులు నేరుగా తమ ఇంటికే వెళ్ళి ఎవరూ లేనిదిచూచుకొని తనడబ్బును గోడ లోని ఒక తొర్రలోనుండి ఒకపాత్రలో వేశారు. వారి ఖజానా ఎక్కడ? ఎంత? అని ఎవరికీ తెలియదు. పారోతికికూడ తెలియలేదు. ఎప్పుడైనా అనుకునేవారు. 'సత్యభామకు చూపుదాము లే' అని. కానీ 'స్త్రీబుద్ధిః ప్రలయాంతక' అనే సిద్ధాంతం శరణుజొచ్చి వూర కున్నారు. నవ్వుతూ బయటపడేవేళకు సరసోతి ఎదురైంది.

'ఏమి సీననిఇంటికే వెళ్ళివచ్చావా? పైసలిచ్చాడా' అని అడిగితే 'ఇయ్యకుండా ఎలా తప్పుతుంది? తినిపారేస్తే విడుస్తానా?' అని కోతలు కోశారు. 'చూడు అందరివద్ద వాణ్ని డబ్బు దగా చేశాడన్నావా? వూరకే నిష్ఠూరం కట్టుకున్నావే' అని అన్నది సరసోతి.

సరసోతిమాట నతడు లెక్కచెయ్యకున్నా లోపలినుండి తన మనస్సుమాత్రం తరుగుకు పోతున్నది. అందుకొరకు మళ్ళీ బాడవ ఇసుక తొక్కుతూ సీనమయ్య ఇంటికే వెళ్ళారు. అతడు అంగళంలో కొబ్బెరమట్టలచాప అల్లుతున్నాడు. వారిదర్శనం కాగానే అతడు వులిక్కిపడి 'ఏమి లెక్కతప్పిందా? లేక చెల్లనిరూపాయ వచ్చిందా?' అని ప్రశ్నించాడు భయంతోనే. ఐతాళులు 'ఎందుకు మహారాజ అంతకోపం! ఏమో నాలుకతప్పి నాలుగుమాట లన్నాననుకో, మవ్వూ అన్నావనుకో. నేనూ అన్నాననుకో....అంతకే చాలు. ఇకముందు అవి వద్దు. నేను అలాగే నచ్చచెబుదామనుకునేలోపుగా నీవు వొచ్చేశావు. అది చెప్పేవరకు నా మనస్సు నిలుకలేదు' అని అన్నీ చెప్పేసరికి సీనమయ్యకూడ చాల ప్రసన్న వదనుడయ్యాడు. 'పోనీ ఐతాళులూ, పోయిందిపోనీ!' అని ఇతరసుద్దులు మొదలుపెట్టాడు. కోటీశ్వరజాత్ర, ఆ బత్తాసులతయారీ, జ్వాతకు వచ్చిన జనం, అన్నింటినిగురించి ఎవరో మహారాజు ఊరినుంచి అనెలలో మామిడికాయలు నైవేద్యం పెట్టించి అందరికీ పంచిన విచిత్రం చర్చించుకొన్నారు.

* * *

ఆరోజుమాత్రం ఇద్దరికీ సమాధానం కుదిరింది. చాలరోజులవరకు ఇద్దరూ పరస్పరం సన్నిహితంగా వుండకున్నా అనాదరం చూపలేదు. ఒకరిపై మరొకరు పగలు తీర్చుకోలేదు. కాంపౌండు తలవాకిలి పుణ్యమా అని చాలమంది అతణ్ని పెద్ద మనిషిగా లెక్కిస్తే ఐతాళులు సహించలేదు. తానేమో దృష్టి కాగనివాడనైతినే అని ఐతా



ళుల చింత. ఐతాళులకు గుప్తంగా ఈర్ష్య పెరిగింది. 'చూడండి-గట్టిగా భోంచేస్తే ఆరునెలలు కూడ సరిగా జరగని సీనమయ్య గొప్పఆసామీ అయినాడే! తాను కోదండ ఐతాళులకొడుకు పిడికిలి బిగించి పిసినారిగా వున్నందుకే వైదికబ్రాహ్మణుడైతినే!' అనిపించింది. 'ఆదే సముద్రంఒడ్డున గొప్పమేడనే కట్టిస్తే?' కానీ ధైర్యం చాలలేదు. గోడసందులో చెయ్యి దూర్చితీస్తే అంతా సుసాధ్యమే. కానీ ఇంటిలో ఈ క్రొత్తయోచనను సూచించేదెల్లాగు. పారోతి పెద్దఇంటిపిల్లగనుక సత్యభామ చెప్పినవెంటనే సంతోషంతో గంతులువేస్తుంది. పారోతి మాత్రం పిచ్చిది, 'నాకు ఏమీ బోధపడదు' అంటుందేమో. చెల్లెలుమాత్రం చెప్పినా కష్టమే, లేకున్నా కష్టమే. 'ఇప్పుడున్న ఇల్లు చాలదా? నీకు డబ్బు చాలవుంటే అగడ్తవాకిట్లో వేసిరా' అని మొహంమీద అనేస్తుంది. చెప్పకుండా మొదలుపెడితే అమె వెళ్ళిపోతుంది. ఆమె భరణం బియ్యం వెనుకకు వేసుకోజాలము. ఇంటి వ్యవసాయం పడుకుంటుంది,

నెలలతరబడి ఈ చింత అతనిమనస్సును తినివేసింది. ధైర్యంతో ఏదో నిశ్చయానికి రాజాలకున్నారు. ఇంట్లో మరొక ముఖ్యమైన ఘటన సంభవించింది. సత్యభామ మరొక్క సారి చూలాలైంది. కాన్పు ఎక్కడ జరగాలి? అనేవిచారం పట్టుకుంది. 'ఇంకా పదు మున్నూరుకు ఎందుకు పంపాలి!' అని చన్నీళ్ళు చల్లింది సరస్వతి. 'మేము శ్రద్ధగా ఇద్దరం చూసుకోమా?' అని సమాధానం వచ్చింది. కాని పారోతిమాత్రం 'ఆమెనే అడిగి నిశ్చయించండి. రేపు అది బాగా జరుగలేదు. ఇది బాగలేదు. అని చెప్పితే కష్టం' అన్నది. నడుమ మూడుసార్లు పదుమున్నూరు మాదప్పయ్యగారు తమ కొమారుణ్ణిపంపి 'మా సత్యను మలు చూలుకుకూడ ఇక్కడే పంపండి. కాన్పుతరువాత పంపుతాము' అని సందేశం పంపారు. ఒకసారి ఐతాళులే ఎందుకో మామగారింటికివెడితే ప్రస్తావించారుకూడ. 'ఎందుకండీ మామ గారిపై భారం' అన్నారు. కాని మాదప్పయ్యగారు 'మీకు భ్రమనండీ! నాకు ఎనిమిదిమంది చెల్లెళ్లు. వాళ్ళల్లో ఎందరు ఇప్పుడు బదికి ఉన్నారు అని అడిగితే స్వారస్యం లేదు. వారున్నప్పుడు నారు? వారి కాన్పులన్నీ మా ఇంట్లోనే. మా అమ్మ తన బిడ్డలకాన్పులను ఎన్నటికీ అల్లుండ్ల ఇంటికి బాధ్యతగా పెట్టలేదు. ఇక్కడున్న సౌకర్యం అక్కడ రాదు' అన్నారు. ఐతాళులు అక్కడ 'సరే చూద్దాము' అని చెప్పివచ్చి సత్యభామనడిగితే ఆమె తన పుట్టింటి వైపే మొగ్గింది.

ఐతాళులు పంచాంగం దినంఅంతాచూచి సమతారకు మంచి ముహూర్తంలో భార్యను పదుమున్నూరులో వదలివచ్చారు. లచ్చనికి నాల్గేళ్ళు. ముద్దుముద్దుగా మాట్లాడుతున్నాడు. వానిని ఏంచెయ్యాలి? తల్లికి కాన్పువేళలో ఇద్దరితో వేగేది కష్టమే అని ఐతాళులు; సరసోతికి వాడు తనవద్ద వుండాలని; 'మనకెందుకు లేనిబాధ్యత' అని పారోతి. ఇన్ని విరుద్ధభావనలనడుమ సత్య వక్రంగా 'నాకొడుకు నాకెల్లా బరువండీ' అన్నది. పదుమున్నూరు బయలు వెళ్ళేనాడు లచ్చణ్ణకూడ నిలబడి 'నేను తాతగారింటికే వెడతాను' అని ప్రకటించాడు. బయలుదేరాడు.





అందరూ పదుమున్నూరు చేరారు. అందరికీ తగిన వుపచారాలు, సత్కారం లభించింది. ఐతాళులు మధ్యాహ్నం భోజనమయ్యాక బయలుదేరారు. 'లచ్చణ్ణ, అమ్మవద్దనే వుండు. తాతగారు ముంతమామిడిగింజలు పెడతారు, బెల్లమిస్తారు' అని అన్నీ మాట్లాడి బయలుదేరారు. 'నాకు బెల్లమూ వద్దు, ముంతమామిడి గింజలు వద్దు' అంటూ లచ్చన్న ఐతాళులవెంబడే బయలుదేరాడు.

'ఐతే ఏమికావాలి?' 'నాకు పెద్దమ్మే కావాలి' ఐతాళులు ఓడిపోయారు. ఆ హఠం చాల గట్టిది కాబట్టి లచ్చన్నను కొంతదూరం నడిపించి, కొంతసేపు ఎత్తుకొని బాధపడుతూ వీపెక్కించుకొని మూటలాగు నిద్రపొయ్యేవాణ్ని మోసుకొని ఇల్లు చేరారు. ఆరాత్రినుండి పెద్దమ్మ పార్వతికి సత్యభామ తిరిగివచ్చేవరకు ఒక కావలి కొప్పెర దొరకినట్లు అయింది. లచ్చణ్ణ కొప్పెర కావడం నిజం. ఎందుకంటే లచ్చనికి పెద్దమ్మ అంటే ప్రాణాలు. పార్వతికిమాత్రం సవతి ఏమంటుందో అనేభయం విడువలేదు. తమ ఇద్దరిమధ్య పెరిగే స్నేహం, ప్రీతివలన సత్యకు ఎంతకోపము వస్తుందో, దానివలన ఎన్ని దుష్పరిణామాలో అని వూహిస్తూ భయపడుతుంది పార్వతి.

మకరసంక్రాంతి తరువాత పదిహేనుదినాలకి పదుమున్నూరినుండి శుభవార్త వచ్చింది. మంచి నిండుపున్నమనాడే, సత్యభామ ఆడబిడ్డకుకూడ తల్లి అయిందని వార్త. తాము విన్నవార్తను ఇంట్లోకివెళ్లి చెబితే అందరూ లచ్చన్నను పిలిచి 'లచ్చన్నా! నీకు ఒక చిన్న బుల్లిచెల్లెలు పుట్టిందటరా' అని ఏమేమో సంతోషంగా మాట్లాడారు.

లచ్చుడు 'నాకు చెల్లెవద్దు, గిల్లెవద్దు–పెద్దమ్మమాత్రమే కావాలి. అంతే చాలు' అని కేకలు పెట్టాడు. పెద్దమ్మ వానిని మంచిమాటలతో 'అల్లాకాదు, బుల్లిపాప నీతో ఆడుతుంది, అన్నీ తెస్తుంది, అంగళంలో కూర్చొని వామనగుంటలు ఆడవచ్చును' అని నచ్చచెప్పింది పోరాడి. లచ్చనికి వెంటనే వామనగుండల పీట జ్ఞాపకంరాగా 'అయితే సరి, ఇప్పుడే ఆడుకుంటాం వామనగుండలపీట తే, గింజలు తే. నువ్వూరా' అని వెళ్లాడు. అతని పట్టుదల మాన్పించాలని పెద్దమ్మ వెంటనే కొంతసేపు ఆడింది. ఆమెకు వంటవేళ అయింది. 'నేను వంట చెయ్యొద్దా! భోంచేసి ఆడుదామా.' అన్నది.

'అయితే నేనొక్కడే ఆడతాను.'

'అందుకేగా, నేను లేకుంటే నీ చెల్లెలు నీతో ఆడుకుంటుందని. ఇద్దరూ జతగూడి ఆడుకోవచ్చని చెప్పలేదా?'

'పెద్దమ్మా, చెల్లెలంటే ఏమిటి పెద్దమ్మా' అన్నాడు.

పెద్దమ్మ నవ్వింది.



# 10

ఇక్కడ ఐతాళులకు పెంకుటింటిపై మమత ఇంకా పోలేదు. ఆవని నెరవేర్చుకొనే ధైర్యం ఏమీ లేకుండా వూరకున్నారు. ఒకవేళ తామూ ఏలాగో పెంకులమిద్దె వేస్తే 'చూడండీ ఐతాళు బిడ్డడు, ఎంతో కడుపుమంటతో పోటీకి మేడ కట్టించినాడు' అని సీనమయ్య దుష్ప్రచారం చేయక మానడని వారు గ్రహించారు. అందుకే సీనినికళ్లు పొడిచేలాగ మరొక్కపనిచేసి చూపాలి. ఈ ఆలోచనతో మునిగివుంటే ఒకనాడు తమ తోట పక్కనున్న కొబ్బెరతోటను చూశారు. అది ఒక ఈడిగ పూజార్లది. తమ నూరు కొబ్బెర చెట్లముందు అది ఒక బ్రహ్మాండమైన నందనవనంలాగ కనిపించేది. చెయ్యి చాచితేనే చేతికి అందేగెలలు, లేత చెట్లుండినవి. ఇదివరలో ఒకసారి దానిమీద వారినజరు పడింది. ఐతు (ఈడిగ) పూజారి తమవద్దకేవచ్చి 'ఈ తోటను డబ్బుకైనా తీసికొండి, లేకుంటే కుదువ ఉంచుకొండి' అని అడిగి వెళ్ళినాడు. ఐదువందల రూపాయలకే అది తమ స్వాధీనంలోకి వచ్చేది. వారికి అప్పట్లో ధైర్యం చాలలేదు. తమతోట ప్రవాహంలో కోసుకొని మురిగిపోతే పక్కతోటపై శ్రద్ధకూడ తగ్గింది. పైపెచ్చు తమ పెండ్లిఖర్చుకూడ తగిలింది.

ఇప్పుడు ఆ స్థితిగాదు. ఈ పదిహేనుసంవత్సరాలనుండి తోటకు నూరుగజాలలో ఒక మట్టిదిన్నె ఏర్పడింది. నీరంతా దిన్నెకు అవలవైపే నిలుస్తున్నది. తోటలకు భయంలేదు. పూజారికూడ నది ఒరిపిడికాకుండ రాళ్ళకట్టనుకూడ కట్టించాడు. అంతా బాగుంది. అందుకు త్వరగా ఆ పూజారితో మాట్లాడాలని యోచన కలిగింది.

రోజూ అప్పులోమునిగి కొట్టుకుంటూవుండే ఆ పూజారి ఒకనాడు, ఐతాళులను దర్శించుకున్నాడు. పొద్దు తెల్లవారి పూజారి ఐతు దీర్ఘశరీరంనీడ మరింత పొడవై బాడవమీద పడింది. ఆ నీడను తప్పించుకొని అతనికి సాధ్యమైనంతదూరంగా ఐతాళులు నిలబడి 'ఏమయ్యా పూజారీ! నీ తోట చివరికి ఎవరికమ్మావు?' అని అడిగారు.

'అయ్యా! సరియైన గిరాకీ వస్తేగా మనం అమ్మేది? సీనమయ్యరుగారుమాత్రమే చూద్దాం అన్నారు' అని అన్నాడు.

'సీనమయ్యరు ఏమిరా? వట్టి డాంబికం. ఎల్లా వస్తాయి అన్నిరూపాయలు?'

'అయ్యా! ఇప్పుడు ఇద్దరు కొడుకులు బెంగుళూరిలో వున్నారట. వారిబావకూడ చేరి స్వంతహోటేలు పెట్టారట. మంచిసంపాదన వస్తున్నదట.'

ఐతాళులమనస్సు కొంచెం గలిబిలి అయింది. బాడవ ఇసుకలోని రాళ్లను కాలి దువ్వుతూ ఎంచుకుంటూ నిలబడ్డారు. ఏమేమో లెక్కలు వేసుకుంటున్నారు. ఎందుకంటే మయ్యరుకొడుకులు స్వంత హోటలు పెట్టింది వారికి కొత్తసంగతి. వారు ఏదో హోటలు నౌకరీలో వున్నారనిమాత్రమే తెలుసు.

సరే! ఎల్లాగైనా నాల్గువందలకంటె ఎక్కువైతే తనకు వద్దు అన్నారు.

'చెట్టుకు నాల్గురూపాయలైనా పడలేదు. రెండేండ్ల కాతను అమ్మితే అంతా గిట్టుబాటు కాదా!' అన్నాడు పూజారి.

'సరే నువ్వు దాన్ని అంతకు అమ్మేయదలచావా?'

'ఇయ్యమంటే ఎల్లాగుదొరా! రెండువందలకు మించి చెట్లున్నవి. కరువుకాలాన కూడ 150-200 కాయలవుతాయి. కల్లు గీతకిచ్చినా నాకు గిడుతుంది. దానికోసం పదిచెట్లకు నంబర్లు వేశాను. నలభైరూపాయలు ఎక్కడా పోవు' అన్నాడు.

'ఔనురా! నీవు కొబ్బరిచెట్లెక్కి కూర్చున్నావు?'

'అల్లాగంటే ఎల్లాగు దొరా, వాజిమీలేనిమాట నేనసను. ఒకవాగు భయంతప్పితే ఇంకేమి? నిర్దాక్షిణ్యంగా వెయ్యిరూపాయలు వుడుతాయి. ఆరు నూర్లవరకైనా గిట్టకపోతే ఎలా?' అన్నాడు.

ఐతాళులు అటునిటుచూచి తాము చెయ్యి పెట్టకుంటే చెయ్యిదాటి సీనమయ్యవాత పడుతుందని సందేహంతోనే ఇదివరతో అడిగినంతకే - ఐదువందలకే అడిగారు. 'సొమ్ము సర్దుబాటు చేసినతోడనే రిజిష్టరు చేసిద్దువుగాని; కాని రిజిష్టరు పూర్తిఅయ్యేదాక సంగతులు, వార్తలు నరపురుగుకుకూడ తెలియరాదు-జాగ్రత్త' అని హెచ్చరిక చెప్పి ఐతాళులు వెళ్లారు. పూజారికి మిన్ను అందుకున్నంత తృప్తి కలిగింది.

ఈ మాటలవ్యవహారం సంప్రతింపులు జరిగిన రెండునెలలలోపుగా వారే తోటకు యజమాని అయ్యారు. కాని కొన్నసంగతి ఎవరిచెవుల్లోకూడ పడలేదు. సీనమయ్య ఒక నాడు రెండువందలరూపాయలు నగదుతెచ్చి పూజారిచేతిలోవేసి, మిగిలిన 200 రూపాయలకు కొంతగడువు కోరాడు. ఆ ఇసుకదిబ్బలలో ఎవరైన నాల్గువందలు పెట్టుబడి పెడతారా! అని అనుకొన్నాడు. ధైర్యంతో వున్నాడు. వెంటనే పూజారి 'వీల్లేదండి! నేను తోటను ఐతాళులకు ఇచ్చేశాను' అన్నాడు.

సీనప్పమయ్యగుండె గతుక్కుమన్నది.

'ఎంతకు? ఎవరికి?' అని మళ్ళీ అడిగారు.



'ఐతాళులకు ఐదువందలకు ఇచ్చానండీ-అదీ కొంతనష్టమే అనుకుందాము. రొక్కం తగాదాకొరకే అన్నీ. అక్కడ కొత్తమొలకలు కాతకు వచ్చాయి. ఇయ్యడానికి మనస్సు కాలేదు.'

'అయితే తోటవదలిపెట్టి ఎక్కడ కెడతావు?'

'ప్రస్తుతం వారి పాలికాపుగానే పడివుంటాను. దైవం మేలుచేస్తే కల్లు అమ్మి మరొక్కతోట నాటుతాను, దొరా! ఆ వ్యాపారానికి సమానం ఎన్నితోటలవుతాయి?'

సరే సీనమయ్య 'నీకు వట్టిపిచ్చిరా. నేను తొమ్మిదివందలదాకా ఎక్కుదామని వుండి డబ్బు వెదకుతుంటేనే ఇచ్చేశావు. ఆరువందలు తప్పక చేతపెట్టేవాణ్నిగా' అనిచెప్పి పూజారికి ఆశలు చెలరేపి వెళ్లాడు.

ఇప్పుడు సీనమయ్యవంతు. ఈ తోట చేయిదాటడం వానికి సరిపడలేదు. 'ఏమిటి! దక్షిణలపోదుపుతో ఇతడు ఆస్తికొనేహూందా కలిగినవాడైతే, నేను నా పిల్లలసంపాదనతో తప్పక వూరంతా కొనేస్తా, చూద్దాం' అని కడుపుమంటతో యోచించాడు. దానికి అను కూలంగానే బెంగుళూరు బళేపేటలోని 'శ్రీ లక్ష్మీనరసింహ ప్రసన్న' హోటేలు చాల విజృంభణతో నడిచింది. 'ఈ నడుమ కెంగేరి విడిది (లాడ్జి) వారంతా మా హోటేలు స్పెషల్‌దోసెకు ముఖం వాచారు అంటే నమ్మండి' అని కుమారుడు నరసింహ వ్రాశాడు అంటే వ్యాపారం రెండుచేతులా ధనవర్షం కురిపిస్తున్నది. నెలకు యాభై మనియార్డరు హాజరు. మయ్యకూడ ఉత్సాహంతో మూడవకొడుకుకుకూడ వుపనయనం చేసిపంపాడు. 'వచ్చే సాలిగ్రామం జాతరతరువాత నాల్గవవాణ్నికూడ పంపవచ్చు' అని నిర్ణయించాడు. ఇంటివారే హొటేలువనిచూస్తే నమ్మకంగా పనీ జరుగుతుంది. పిడికిళ్ళతో రూపాయలు, లాభాలు దోచవచ్చు అని సీనయ్య దృఢవిశ్వాసం.

ఇక్కడ చేతుల్లో లక్ష్మి నాట్యమాడినమీదట సీనమయ్యకు పెద్ద ఆస్తులనుమింగాలని యోచన ఎందుకురాదు? అందుకే వూళ్ళో ఎవరువచ్చి ఆస్తి అయకంపెడితే వాళ్ళకంతా అప్పు వెంటనే ఇచ్చేవాడు. ఒకొక్కక్కసారి క్రయంకూడ చేసుకునేవాడు. ఇంకెవరైనా గిరాకి వున్నారనితోచితే వెంటనే నాల్గారువరహాలు ఎక్కువకూడ ఇచ్చేవాడు. ఐతాళులు ఒకవేళ కొంటారని తెలిసివస్తే వంద రెండువందలు ఎక్కువపెట్టినా చింతలేదని డబ్బు కురిపించేవాడు. ఈపై పోటీలలో ఎక్కడైన పదిసెంట్లు పొలమున్నా సీనమయ్యకు బదిలీ అవుతుండేది. ఐతాళులభూమి కిరువైపుల చేరినపొలాలు సీనమయ్య కొనేశాడు.

ఐతాళులు ఈసంగతివిని చెలరేగి తబ్బిబ్బైనారు. 'ఆస్తి చేసుకొనడానికి క్రమం లేదా? నేను పూజారితోటను ఎందుకుకొన్నాను. మనతోటకు లగ్గీ అవికదా. వాడైతే లెక్క

లేకుండా చిన్నముక్కలు, వసతిలేనివన్నీ కొనేస్తున్నాడే? ఏమైనా లాభముందీనా? మంజూరులో నాల్గయిదు చిన్నచిన్నపొలాలు వెంటవే కొన్నాడు. ఏమైన సాగా, బాగా? నాగలి తిరుగని పొలంకొంటే సేద్యం కాదు. పన్నుమాత్రం తప్పదు' అని అన్నారు.

సీనమయ్య ఏమీ పిచ్చివాడుకాడు. వానిమనస్సు ఒకమార్గంలో పనిచేస్తున్నది. ఆస్తి అమ్మేవారంతా పీలిక, చీలిక భూస్వాములే. మంచి అనుకూలం గలవారెందుకు అమ్ముతారు? అన్నీ కొన్నాడు అంటే వాళ్లందరూ అతనిప్రభావంలో, అదుపులో వుంటారు అని ఒక సంతృప్తి. అవిమాత్రమేనా? మరిన్ని కారణాలున్నాయి. ఐతాళుల పొలంసంగతి తీసుకుంటె పదిహానెలగింజలు చల్లేంతపొలం మూడు పరిహద్దులలో సీనమయ్యపొలం; మధ్యవున్న ఒక్క ఐతాళులది వేరే. అది ద్వీపంలాగ తన పొలాలమధ్యన. దాన్నికూడ ఎప్పుడో కొనిపారవేసి కంచెవేసేస్తే, ఐతాళులకు పొలంలోనికి దారిలేక దిగ్బంధన అవుతారు. తనకే అమ్మి వూరకుంటారు. అప్పుడు అన్నిపొలాలుచేర్చి మూడుతూముల విత్తనం దాకా వంట పెట్టగలతాహతు వస్తుందిలే అని వూహతో ఉన్నాడు. ఎల్లాగైనా ఐతాళులను బాధించాలి: 'సీనమయ్య,హంగులో, భయంతో వున్నవారే వూళ్ళో వుండాలి అంతే' అనే తాత్పర్యంతో ముందుకు వెళ్ళాడు. ఆస్తులు చేసేది, చదురంగమాడేది ఒక్కటేనని సీనమయ్య సిద్ధాంతము.

సీనమయ్య పెద్దకొడుకు బెంగుళూరుచేరిన ఆరేడేళ్ళలో తక్కిన ముగ్గురూ బెంగుళూరు చేరారు. వారి బళేపేట హొటలు బలిసి, చిక్కపేటె, తరగుపేటెలకో పిల్లలు పెట్టింది. దేవునిదయవల్ల ఇక్కడ ప్రతి రెండేండ్లకు ఒకసారి ఒకకొడుకు పుడుతున్నాడు. ఇప్పుడు సీనమయ్య ఎనిమిదిమంది కొడుకుల తండ్రి. దేవుడు మేలుచేస్తే నరసింహాని పెళ్ళి ఐతాళులపెండ్లికంటె వైభవంగా నడిపించాలని అభిలాష. పెళ్ళినాడు లంకాపట్టణం, బేడికంబ, బురుజులు అనేకమైన దిక్కులు పిక్కటిల్లే బాణసంచా విడిచి మంజూరినుండి కోడిగ్రామం, సముద్రమండి బారకూరువరకు గొప్ప వూరేగింపు జపురుదామని సీనమయ్య ధైర్యంతో సంకల్పించాడు.

సీనమయ్య నోటిమాటలకు మొదట్లో ఎవరూ భ్రమ పడేవారుకారు. కాని డబ్బు వానివద్ద వున్నది అని వినగానే అనేకులు పదిరూపాయలనుండి వెయ్యిదాకా అప్పు అడగడానికి అతనివద్దకు వచ్చేవారు. అతడూ ఒకేచోట డబ్బు కుమ్మరించలేదు, ఒకసారి ఏదో సర్కారుపన్నుకు తగాదా పద్దరోజా పారంపల్లి వాసుదేవ గురికారులుకూడ వానివద్ద వెయ్యి బదులు అడిగారు. 'గురికారులకు ఐదువందలిచ్చాను నోటిమాటపై చూడు. కాగితం లేదు, ఏమీ లేదు' అనే ధీమా వానికి. అప్పు గడువు దూరమైందని గాభరాపడి నాల్గురోజుల కొకసారి తిరిగి తిరిగి ఆ అప్పును అడమానంగా మార్చుకోడమూ జరిగింది. పెద్ద గురికారులకే షావుకారు, మరి కోడిగ్రామం వల్లెటూరివాళ్ళకు గౌరవనీయుడు ఎల్లా కాజాలడు? పెళ్ళి




పడుగుకాలాలలో వైదికులగుంపులోనే తిరుగులాడే సీనడు ఇప్పుడు గురికారుల వంక్తిలోను అగ్రస్థానానికి పాత్రుడైనాడు. లెక్కలుతెలియనివారికి అప్పుడప్పుడు చక్రవర్తిలకుకూడ ఇచ్చే వాడు. పెద్దవలలుండే బెస్తవాళ్ళంతా మోకాళ్లపై నిలబడి వంగి సలామకూడ చేసేవారు.

ఒక్కసారి సీనమయ్య గురికారులఇంటి పెళ్ళికి వెళ్లాడు. గురికారులకూతురు లగ్నం. పక్కవూరి గురికారుల కొడుకుతో సంబంధం. అక్కడ సీనమయ్యకు సామాన్యమైన వుపచారం జరిగిందా? ఇక్కడ వైదికులసభలో రామఐతాళులుకూడ అలంకరించి ఆసీను లయ్యారు. గురికారుల ఇంటి అలవాటుప్రకారం అందరికీ చెక్కెరపానకమే. సీనమయ్యకు వెండిగిన్నెలో రెండుతడవలు ఇచ్చారు. ఐతాళులకు కంచుగిండీపాత్రలో దొరికింది; ఒకే సారిమాత్రం.

గురికారుల లగ్నాలకు బస్రూరు నాగమ్మ రాకతప్పదు. నాగమ్మ ముసలిదయింది. అది నాట్యం చెయ్యదు. పిడేలు వాయిస్తుంది. దాని ఇద్దరుబిడ్డలు- యువతులైన చెందు, రాజీవి భరతనాట్యం చేసేవారు. నాట్యం ముగించాక ఊరి గురికారుల మర్యాదలు మొదలైనవి. ఒకరు రాజీవితో సలాముచేయిస్తే, మరొకరు చెందుతో వేయించేవారు. 'సీనమయ్య మహారాజుకో దౌలత్‌జాదా' అని పద్దెనిమిదిసార్లు అనిపించుకున్నాడు సీనయ్య. పద్దెనిమిదిరెళ్ళ ముప్పైయారు-అంటే తొమ్మిదిచక్రాలు(ఒక నాణెం) వారిపై కురిపించాడు. ఒక్క సలాముకుకూడ భాగస్వామిగాని ఐతాళులకు ముఖం కళాహీనమైంది. వైదికులు అల్లాంటి సలాములసంపాదనకు వుపక్రమించే పద్ధతిగూడ లేదు. సీనమయ్య ఎదురుగా పెద్దదర్జావాడై నందుకు, అంత మన్ననకు పాత్రుడైనందుకు వారిమనస్సుకు సరిపడలేదు. సీనమయ్యరైనాడంటే ఆశ్చర్యమేమి లేదు.

ఇంటికివెళ్ళి ఐతాళులు సత్యభామతో 'చూడు, సీనమయ్యకళ్ళకు మనం కానరాము. చౌకబారువెశ్యల సలాముకు పాత్రుడిప్పుడు. తొమ్మిది చక్రాలిచ్చి పద్దెనిమిది సలాములు తీసుకున్నాడు. బెంగుళూరిలో కాఫీకి నీళ్లుచేర్చి సంపాదనలు చేశాడు. ఇక్కడ గజ్జెపూజలు వీడు చేస్తాడు' అన్నారు. సత్యకూడ పతియొక్క అభిప్రాయాలతో ఏకీభవించి బాధపడింది. సానుభూతి చూపింది. 'ఎవరిపైసలు ఎలాపోతే మనకెందుకు? ఈ నష్టంమార్గం మనకు వద్దండీ' అని బుద్ధివాదం చెప్పింది.

ఐతాళులు వూరక వదుల్తారా? ఎవరో స్నేహితులనుపట్టి, బెంగుళూరిలో నరసింహానికి వుత్తరం వ్రాయించారు. 'మీతండ్రి, మీ సంపాదనను లంజలపాలు చేశాడు' అని. వుత్తరం చాడీలుచూచి పిల్లవాడు గాబరావడ్డాడు. మేనమామ చెప్పినాక సమాధానవడ్డాడు. 'ఎవరో కానివాళ్లే అల్లా వ్రాయించివుంటారులే' అని అతడు వూరుకున్నాడు.

ఉగాదిసమయం వచ్చింది. మూడేండ్లనుండి వూరికిరాని నరసింహుడువచ్చి ఒకవారం వున్నాడు. సీనమయ్యరు కొడుకునోటివెంబడే బెంగుళూరు హొటళ్ళపై భవాన్ని విన్నాడు

చాల సంతోషించాడు. నరసింహదేవుడే ఇంటిభాగ్యాన్ని పెంచాడని తీర్మానించాడు. నరసింహానికి పదునెనిమిదేండ్లవయస్సు. హోటలుపనులలో ఆరితేరినాడు. ఇప్పుడు హోటలుకు వాడే యజమాని. మామ రాయబారంపై ఇంటికి వచ్చాడు. అక్కడి ధారాళమైన సంపాదనకు ప్రతిఫలంగా తగినవ్యవస్థ చేయాలని తండ్రిని అడగడానికి వచ్చాడు. 'మామ చెప్పాడు, ఏదైనా మంచిఆస్తి కొనాలని' అన్నాడు కొమారుడు. సీనమయ్య నవ్వుతూ 'వాడేనా బుద్ధిమంతుడు; మిగిలినవారు వెర్రికుంకలా? నీ రూపాయలు ఏమైందనుకున్నావని' చెబుతూ అన్నీ సవివరంగా తన ఆస్తివిశేషాలు చెప్పాడు. ఇవి వాడికి తెలుసు. 'మామ ఏమన్నాడంటే ఏకఖండం పొలంబదులు ఇన్ని చీలికలువద్దు. వాటివల్ల గుత్త రాకపోతే ఫలమేమి?' అని నరసింహుడు తన అభిప్రాయాన్ని, మామసందేశాన్ని తెలియబరచాడు. మామకు నాలుగు వేలరూపాయలు ఆస్తి కొనాలని తెలిపాడు.

సీనమయ్యగారికి నిజమైనయోచన తగిలింది. తమ ఆస్తులనుండి ఇతరులకు ఉపద్రవం మాత్రం అయింది. తమకు అంతలాభం లేదు, లేనిబెంగ, బెడదలే, గుత్తకిచ్చి గుత్త వసూలుకు బాధపడడం అనుభవమయింది. అప్పులపైన వడ్డీలేమో వస్తున్నాయి. గురికారుల కిచ్చిన అప్పు, వడ్డీలుకూడ రానేలేదు. తన బావమాటలుకూడ నిజమే, అతని ఆధారం లేకుంటే నరసింహుడు మూడు హోటళ్ళ యజమాని ఏలాగవుతాడు అనేసంగతి మరువలేదు. అందుకు మన్నిస్తూ 'సరేరా అల్లానే కాని' అనిచెప్పి వాని లగ్నప్రయత్నం చేశాడు. అప్పుడే నరసింహుడు బెంగుళూరుకు వెళ్లాల్సింది. వచ్చేఏడు చూద్దామనుకున్నాడు.

నరసింహుడు వెళ్లుతూ నాల్గవకొడుకును వెంటబెట్టుకు వెళ్లాడు. కొడుకు 'అప్పా, విత్తనాలనాట్ల తరువాత, రెండు నెలలైనా మావద్దవుండు హాయిగా అని అన్నారు మామ' అని వెళ్ళుతూ అన్నాడు. ఈ మాటలు సీనమయ్యకు అవొక కల అయింది మనసులో. కానీ యాత్రకు వెళ్ళినంత కోలాహలం. బెంగుళూరు వెళ్లేయోచన చేశాడు.

ఎండలు పోయినవి. వానలు పడ్డాయి. పొల్లపని తొందర తొందరగా ముగించారు. వానలు ఆలస్యమయివుంటే శివమొగ్గకువెళ్ళి బెంగుళూరుకు రైలెక్కుదామనుకున్నాడు. కాని శివమొగ్గ చేరడమెట్లా? ఆయనకాలుకులైతే నాల్గు మజిలీలతో శివమొగ్గకు నడచేవారు. తన గౌరవానికి లోటులేకుండా బండిపై వెళ్లాలి. బండిమాత్రం దాక్షిణ్యానికి గురికారులవద్ద నుండి వస్తుంది. బండిదారిలో వుండేనదులను ఎల్లా దాటాలి? వానకాలం. వానకొడితే ఆగుంబెఘట్టం ఎల్లా ఎక్కాలి? పోనీ బండిదిగి జాగ్రత్తగా ఘట్టందాకా వెడదామంటే ఆ వట్టి కాళ్ళను ఆ జలగలు, పురుగులు పీల్చివేస్తాయి-అని ఎన్నో ఆలోచనలు దొరలినాయి. తానేమో బాగా నడువగలడు. అన్నీ అతనికి తెలుసు. కాని, గురికారుల హోదాగలవాడు శివమొగ్గ దాకానడిస్తే మానం దక్కుతుందా? 'కొడుకులేమో నెలకు వందరూపాయలు పంపుతారే? వీనికేమి చేటు? నడుస్తాడు పిసినిగొట్టు' అని తప్పక నవ్వుతారు- అని వూహించుకుంటాడు.



ఊరివారికి నడక ఒక గొప్ప సంగతేమికాదు. నవరాత్రిఉత్సవాలకు శృంగేరికి ఎనిమిదేళ్ళ బాలురుకూడ నడుస్తారుగదా! కొన్నేళ్ళముందు ఆడవారికి చీరలు దానమిస్తారు అని తెలిసినప్పుడు ఊరి మహిళాబృందంతో మయ్యరు భార్యకూడ నడువలేదా? ఐనా మయ్యరు మనస్సు వెనుదీస్తుండేది. ఒకనాడు బందరు షావుకారుదగ్గరకు వెళ్లాడు. దీర్ఘయోచనచేసి 'కోతలయ్యేదాక ఊరు విడువలేను. ఒంట్లో అంత బాగాలేదు' అని కొడుకులకు వర్తమానం పంపాడు. వూళ్లో చట్టం, బడాయిమాటలు ప్రసంగాలు చేస్తుంటే అతన్ని ఆపేవారు లేరు. తండ్రి వస్తాడని ఎదురుచూచిన పిల్లలుమాత్రం చాల నిరాశచెందారు. 'దీపావళి తరువాతనైనా బెంగుళూరుకు తప్పకుండ రండీ' అని కార్డు వేశారు.

బెంగుళూరు ప్రయాణం ఆగిందని కొంత నిరాశచెందినా ప్రతిమాసం యాభయి-వందరూపాయల మనియార్డరు చూడగానే హృదయం వుప్పొంగిపోయేది. మూడువేల రూపాయలభూమిని తప్పక బావకు కొనిపెట్టాలనే పొంచిచూస్తూ వున్నాడు. అందరినీ దర్బారుగాచేర్చి తన అభిప్రాయాలను తెలియజేశాడు. 'మంచిఆస్తి ఎక్కడ దొరుకుతుందో చెప్పండి' అని నోటిమాటలోమాత్రం పదివేల ఆస్తిపరునిలాగు ప్రవర్తించాడు.

కోతలలోగానే సీనమయ్యజీవితంలో మరొక్క ముఖ్యసంఘటన జరిగింది. గురికారులఇంట్లో మరొకవివాహం జరుగనున్నది. వాసుదేవగురికారులు అవిభక్తకుటుంబానికి, ఆస్తికి యజమానులు. వెనుకనడచినలగ్నం-సీనమయ్యరు అందరిలో 'దౌలత్‌జాదాలు' నినాదాలు పొందిన లగ్నం - బిడ్డది. ఇప్పుడు అన్నకొడుకులగ్నం. తన గతించిన అన్న కొమారుని లగ్నానికి తనబిడ్డకు చేసినంత వైభవంగా చేయరాదని వుంది, అనుకూలం కూడ లేదు. అందుకే తూర్పున కొక్కరణె ఇలాఖాలో ఒక పల్లెపడుచును తేవాలని వుంది. పిల్లవైపువారేమో శ్రీమంతులు, వారికి ముగ్గురూ ఆడపిల్లలే. మూడింట ఒకభాగం ఆస్తి తన అన్నకొడుకుకు లభిస్తుంది. ఈ ఆశతో ఆ సంబంధం నిశ్చయమైంది. వేళ్ళమీద లెక్కపెట్టడానికి వీలైనంతమందే బయలుదేరారు. సీనమయ్యరు ఆ లెక్కలో వున్నాడనడానికి సందేహం లేదు.

సమావర్తనందినమే మధ్యాహ్నంగా పెళ్ళిగుంపు బయలుదేరుతుంది; రాత్రి వెన్నెలుంటుంది. వానలేకుంటే అర్ధరాత్రి పడవలోకూర్చుంటే పండ్రెండుమైళ్ళేమో నదిలోనే వెళ్ళవచ్చు-అని నిశ్చయించారు. అప్పట్లో సరియైన బండిజాడకూడ లేదు. కనుక పడవ ప్రయాణమే మేలనిపించింది అందరికీ. కాని వాన దయదలిస్తే గాలి రంయిమనివీస్తే జీవంతో కొక్కరణె చేరడం కాశీయాత్ర ముగించడం సమానం. అయినా ఆణెగుడ్డ సిద్ధివినాయకునికి నూరు కొబ్బరికాయలు మొక్కుని ధైర్యంగా అందరూ బయలుదేరారు.

గురికారుల ఇంటివారు, పురోహితులు, పెళ్ళికొడుకు, సీనమయ్యరులాంటి ముఖ్య అతిథులు పెళ్ళిగుంపులో చేరినారు. వాద్యం, తప్పెటల వారు కాలుదారిలో నడచి మరునా

రుదయమే చేరవచ్చు. ముఖ్యమైన మేళంవారిని పడవలో ఎక్కించుకోక తప్పదు. అందు కని ఇంటి ఆడవారు, పురోహితులు ఒక పెద్దపడవ ఎక్కారు. గురికారులు, మయ్యారు, మరొకరు, ఫిదేలు నాగమ్మ, చందూ, రాజీవి వెనుకపాటల సుబ్బడుచేరి మరొకనావ నెక్కారు. పొద్దు మునుగడానికి ఝాముపొద్దుముందే వదలినారు. పడవ నిరాటంకంగా వెళ్ళింది.

పొద్దు గుంకేవేళకు నావలు అందమైన కొబ్బరతోటలకుదుళ్ళద్వారా హాయిగా తేలుతూ వెళ్ళినవి. బారకూరు దాటింది. ఇక ఆరేడుమైళ్ళ ప్రయాణం వుంది. గాలి అనుకూలంగా ఇల్లాగే వుంటే, మేఘాలు తెరపిస్తే, మరొక ఝామురాత్రికే కొక్కరణె చేరవచ్చు. అక్కడ ఏర్పాటైన విడిదింట్లో ఆగవచ్చు. గురికారులు 'అన్నింటికీ ఆణెగుడ్డ గణపతి జరుపుతాడు' అన్నారు. ఫిదేలు నాగమ్మ 'దేవుడు చెయ్యివిడువడు' అన్నది.

పడవ సాగుతున్నదికానీ చీకటిపడింది. ఆకాశంలో చంద్రుడు కనబడ్డాడు. ఈ నదీ యానంకూడ కలలోని నౌకాయానంలాగే హాయిగా వుంది. గురికారులు మేళంవాళ్ళనుపిలిచి నెమ్మదిగా 'వాద్యంలేదు. వానలేదు. కొద్దిగ ఫిదేలువాయిస్తే రాజీవి పాడితే బాగు. పనికి రానిమాటలతో లాభంలేదు' అన్నారు. రసికులు అలా సెలవిస్తే, శీనమయ్యారు తాను తెలి సినవాడిలాగా 'గురికారులూ! మీ ఇంట్లోకూడ రాజీవి పాడింది, ఆడింది కదండీ, ఎంతో బాగుండింది. రాజీవి చెల్లెలుమాత్రం తక్కువా!' అని ప్రశంసించాడు. ఈ వీళ్ళమధ్య అందరూ సంగీతంపై ఆపేక్షపడ్డారు. గురికారులు కొంత అభిరుచి చూపించి, 'ఆ పాట చూడు, ఈపాట చూడు న చ ఘుం ఘుం' అని అందించారు. మయ్యారు 'వాళ్లు ఏంపాడినా మంచిదే. చక్కగా వుంటుంది' అన్నాడు. అందరి మధురస్వప్నం వీపుపై చిటపట చినుకులు పడే సరికి పటాపంచలైంది. వీళ్ళపడవ వెనుకనే వుంది. ముందున్నపడవ చాలదూరంలో వుంది. వీళ్ల కేకలు ఆ పడవవారు వినలేకపోయారు.

'ఇదీ సన్నచినుకులు లెండి. ఇప్పుడే ఆగుతుంది. వూరికే ఫిటీలు గిటీలు నాన్పు కుంటే బాగలేదు' అన్నాడు మయ్యారు. 'ఏమి, ఆకులసంచి మరచానే........' అనింది ఆ మేళం యజమానిని. వక్కాకుసంచి తెరచేలోగా గాలికొట్టింది. వాన గబగబా పడింది. పడవ వానికి నాల్గుగజాలదూరంకూడ కనబడలేదు. వాడు సాధ్యమైనంత త్వరలో ఏదో ఒడ్డువైపు వెడదామని చూచాడు. నచేట వుండరాదన్నాడు. ఆ వానకు ఒక్కొక్కరు బాగా స్నానం చేసినట్లయింది. ముందున్నపడవగతి ఏమైందో అని గురికారులు గాబరాపడ్డారు. వాన కొడు తుంటే దగ్గరున్నవారే కనబడరు, వినబడదు, దూరంవాళ్లందుతారా, వింటారా?

పడవ ఏలాగో ఒడ్డుచేరింది. అక్కడ ఎవరూ ఎక్కిపోలేరు. ప్రక్కలలో మనిషి ప్రమాణం గడ్డిగాదం, బురదలు. పడవ వెనుకకు పోజాలదు. ముందుకుకూడ పోజాలదు. గొడుగులున్నా లాభంలేదు. బట్టలు తడిసినవి, ఒళ్ళంతా నానింది, చలితో అందరూ వణక



సాగారు. ఏమిచెయ్యాలి? వాన వెలిస్తే మళ్ళీ సరియైన ఒడ్డయినా చేరవచ్చు. ఎవరినైనా కేకలతో తామున్నచోటు తెలుసుకునే వీలుకూడ లేదు. 'అసే తానేమో బెంగుళూను ప్రయాణంమానేసి ఎందుకు ఈ పెండ్లిగుంపులో ఇరుక్కున్నాడు' అనేచింత సీనమయ్యారు చుట్టుకుంది.

రెండుఘడియలు నరకంలాగ సాగినవి. ఎంత కఠినంగా వేగంగా గాలివాన కమ్మిందో అంతేవేగంగా బిరుసుగా తేలిపోయింది: వెన్నెల పాలపొంగుమాదిరి విరిసింది. సరంగు 'నావను నడుపనా?' అని ఆజ్ఞ కోరినాడు. గురికారులు 'ఇక్కడ ఇరికిస్తే లాభమా? ఏదైనా వూళ్ళోకి తీసికెళ్లు' అన్నారు. తరువాత ఎవరి ఇంటికి చేరుదామన్నా పరువుదారైనా వెళ్లాలి. సగందూరంవెళ్ళితే కొక్కరణె వస్తుంది అని అందరూ అంచనా వేసుకున్నారు. 'సరి, ఆణెగుడ్డ గణపతిపై భారంవేసి నడుపు. ముందున్నవారెట్లా వున్నారో? కేకలుపెట్టు' అన్నారు గురికారులు. వాడెంత అరచినా మారుపలుకు వినపడలేదు. 'వాళ్లు చాలముందే వెళ్లినారండీ' అన్నాడు నావ మనిషి.

నావ మళ్ళీ నట్టేట పడింది, ముందు జరిగింది. వానలో నానినవారు బట్టలు వున్న వళంగా పిండుకొని కూర్చున్నారు. అందరికీ బట్టలు మంచివి, పొడివి ముందున్ననావలో వున్నవి. వృథాగా ఈ వానకు చలికివడి నలిగిపొయ్యామే అని బాధపడ్డాడు సీనమయ్య. అతనికి మొత్తంమీద ఈ ఘటన లాభాన్నే చేకూర్చింది. వెన్నెలలో గురికారులు వానిచెవిలో ఏమేమో గుసగుసలు చెప్పారు. మయ్యారు నవ్వుతూ ఎడమకంటితో చందు, రాజీవి అంద చందాలను దొంగచూపులతో చూడసాగాడు. ఆ వానగాలి బాధలు మరిచిపోయి అర్ధరాత్రికి కొక్కరణె చేరేసరికి ఏదో అపూర్వమైనస్వప్నం కనబడ్డట్లు అయింది.

వీళ్ళనావ ఒడ్డును చేరిందో లేదో అక్కడ కాగడాలతో ఆడపెళ్ళివారు పంపిన మను ష్యులు సిద్ధంగా వున్నారు. ముందువెళ్లిన నావవారుకూడ ముందే చేరుకున్నారు. వాళ్లు చిను కులు పడేసరికి చేరినారు. తొందరగా హాయిగా విడిదికి వెళ్లారు.

సీనమయ్య దిగగానే 'ఎవరికీలేని గ్రహచారం మనకు అంటుకోవాలా?' అన్నారు. 'మనలో ఎవరికో ఒకరి గ్రహచారం బాగలేనట్టుంది. అది మనందరికీ అంటుకుంది అందుకే మనమంతా వణకి నలిగిపొయ్యాం' అన్నది నాగమ్మ. 'వా దెవ్వడు?' అని అందరూ ఒకరినొకరు చూచుకుంటూ నవ్వుకున్నారు. మాటలలో అందరూ ఆ విడిది చేరారు. అక్కడ అందరికీ చక్కని మర్యాద, ఉపచారాలు సిద్ధంగా నిరీక్షించాయి. 'వేడి వేడిగా భోంచేసి పడితేచాలు' అన్నాడు సీనమయ్యారు. 'సీనమయ్యగారు! ఈ తడిగుడ్డలతో పడుకోడానికి ఏమిటి చావా. కర్మల భోజనమా!' అని ఎక్కిరించింది నాగమ్మ. 'నీ నోరు ఆగదు, బచాయితీ లేదు మహారాణి' అన్నాడు సీనమయ్య. 'అమెనోట్లోనే మీరు విడిది చేసి నట్లుందె' అన్నది రాజీవి. రాజీవి సూటిగా కళ్లుకొడుతూ కోరచూపులతో సీనమయ్యను

చూచి పలుకరించడం ఇదే తొలిసారి. ఆ చిరునవ్వునుచూచి కొంత వాలుక ఆగిపోయినా, 'తల్లికంటె బిడ్డ జోరేనయ్యా!' అన్నాడు. అప్పుడు తల్లి 'అవును- ఈ కాలం పిల్లలండీ చూడండి' అన్నది నాగమ్మ పరిహాసం చేస్తూ.

ఆ విడిదిలో అనుపమమైన దివ్యమైన భోజనం ఏర్పాటైంది. రాత్రి చాల ప్రొద్దు పోయినదని తమతమకు చూపిప స్థలాలలో అందరూ పడుకున్నారు. గురికారులు 'ఎందుకో నిద్ర రాదండీ' అన్నారు సీనమయ్యతో. ఇద్దరూ ఒకేగదిలో విడిది చేశారు. వెంటనే తాంబూలంపళ్లెం వచ్చింది. 'పొగాకు' అని అడిగితే తబలా సుబ్బుడు వచ్చాడు. గురికారులు సుబ్బునితో 'ఒరే ఆకులు మడచి ఇచ్చేవారు లేకుంటే తాంబూలం చప్పవరా' అన్నారు.

సరే ఆహ్వానమే ఆలస్యం. నాగమ్మ, కూతుళ్లూ అక్కడే మకాంచేశారు. నాగమ్మ చమత్కారంగా మాట్లాడిండ మయ్యరుకు రాజీవి, గురికారులకు చందూ తాంబూలం కిల్లీలు కట్టిచ్చారు. నాగమ్మ 'నిద్రవస్తున్నాది. పొద్దుపోయింది' అంటూ వెళ్ళిపోయింది.

ఆరాత్రి గడచింది. ఈ గురికారులిద్దరూ లేచేసరికి జాముపొద్దయినా అయివుండవచ్చు. వారికోసం ఉపాహారం కాచుకొని వుంది. తొందరగా ముఖం కడుగుకొన్నతరువాత, స్నానంతరువాత ఉపాహారం ముగించారు. గురికారులు సీనమయ్యతోకలిసి వియ్యాలవారింటికి వెళ్లారు. అక్కడ పందిరి ఏర్పాట్లు, ఉపచారాలమర్యాదల ఏర్పాట్లు చూడవచ్చారు. 'నాల్గునాళ్లు ఇక్కడే బసచేయాలి' అన్నారు వియ్యంకులు. 'పెళ్ళివారంతా ఒకేచోట విడిస్తే రద్దీ. విడిదే బాగుంది. నడవగలిగినవారు విడిదిలో వుండవీ. మన కోడినుంచి పారంపళ్ళికి పోయినంత లేదు. నడవలేనివారు ఇక్కడే వుండనీ' అన్నాడు సీనయ్య. గురికారులు సరేనన్నారు.

ఆ సాయంకాలం గోధూళి లగ్నానికి ఆజెగుడ్డ గణపతిగాని, వరుణదేవుడుగాని అనుగ్రహించాలి అని వారికి మొక్కన్నారు. గడచిననాడు సగంమందిని వానదేవుడు ముంచేసినాడు. కాని ఇంకెవరిని వేడుకొంటే వాన ఆగుతుంది చెప్పండి. ఎల్లాగో వారి ప్రార్థనలను మన్నించాడేమో పెళ్ళి అగమాలు పాంత్తంగా జరిగేదాక ఒకబొట్టు వానకూడ పడలేదు. తరువాత గంటసేపు దడబడలుగా వానకొట్టింది. ఎవరికీ ఇబ్బందిలేదు. మేళంవారి సలాం వేడుకలు నిలిచిపోయాయి. గురికారులు, మయ్యగారు ఇరువురివుత్సాహాన్ని సగంలో పీక నొక్కేసిందేమో అనిపించింది.

భోజనాలయ్యాక సీనమయ్య, గురికారులు ఉభయులు విడిదింటికే వెళ్లారు. 'పెడ్లింటి సందడిలో నిద్ర పట్టనేపట్టదు అన్నారు మేళంవారు. మొదట్లో మగవాళ్లలో ఉత్సాహవంతులు మాత్రం విడిదికి వెళ్లాలని నిశ్చయించారు. కాని చివరకు రాజీవి, నాగమ్మ, చందూలు ఆ వంక్తికే వచ్చారు.

పెండ్లి నాల్గునాళ్ల విడిదికూడ పెండ్లింటికంటే కలకలగా వుండినది. రాత్రంతా నాట్యం, గానం, తాంబూలం పంచడం చూచినవారు ఇదే పెండ్లిల్లేమో అనుకున్నారు. నాల్గా



దినాలపెళ్ళి చక్కగా హాయిగా జరిగింది. వియ్యంకుల వుపచారాలు కావాలన్నవారికి అవి. రాజీవి, చందూలతో సరససల్లాపాలు కావాలన్నవారికి అవి. అందరూ తృప్తితో నాలుగు రోజులు గడపారు. రాత్రి ప్రయాణంవద్దని ఆడవారు పట్టుపట్టారు. మరునాడువుదయం వడవలు బయలుదేరినవి. మధ్యాహ్నం వూరుచేరారు. వానకుబదులు ఎండలో మాడారు.

ఇంటికి వచ్చాకమాత్రం దుఃఖం అనిపించింది. సుఖము అనిపించింది, సీనయ్యకు. రాజీవిని బస్రూరికి ఎలా పంపాలి? తనలో రసికతనం ఏకోణానవుందో దాన్ని సంస్కరించి తనను ఒక సంఘజీవిలాగు చేసిన రాజీవిని అతిప్రేమతో గౌరవంతో చూశాడు సీనయ్య. ఆమె వెళ్ళేరోజు 'మయ్యరూ! ఈ బీదలబిడ్డను మరచిపోతారేమో! కుందాపురం వచ్చినప్పుడల్లా నన్ను చూడండి' అన్నది. అప్పట్నుంచి కుందాపురం ఎప్పుడువెళ్ళాలి అని జ్యోతిష్యం చూసుకుంటాడు సీనమయ్య.

గురికారులఇంటి పెళ్లివార్తలు వూరంతా అలుముకున్నాయి. రామఐతాళులకు వేను కటి పెళ్లిసందడి జ్ఞాపకం వార్తలు గుర్తే. ఈసారి తనకెందుకో ఆహ్వానం రాలేదు. ఆవి యోచించేసమయాన లగ్నం అయింది, గుంపు తిరిగివచ్చింది అనికూడ వార్త వచ్చింది. నాల్గుదినాలతరువాత సీనమయ్యగారి కొత్త వింతసాహసాలుకూడ కథలుగా చెవుల పడ్డాయి. 'అయితే సరే! ఈ కోడీ గురికారులు పారంపల్లి గురికారులకు, ఈడుజోడై, షడ్డకులుగా మారారయ్యా' అంటూ విషంనవ్వులు నవ్వారు.

# 11

రామఐతాళులకు కూతురు కల్గేనాటికి లచ్చడు మూడేండ్లవాడు. సత్యభామ తన చంటి పాపను వెంట చంకనెత్తుకొని ఐతాళులయింటికి వచ్చింది. వచ్చినందుకు లచ్చనిలో ఏమీ విశేషంగా మార్పు కనబడలేదు. సత్యభామ తన ఎడబిడ్డను ప్రేమతోచూచినా, ముద్దుతో కాలం గడిపినా, లచ్చనికి ఏ నిరాశా కలగలేదు. కారణం వాడు అమ్మను అంటుకొన్న పిల్లవాడుకాదు-పెద్దమ్మకే ముద్దుబిడ్డడు. అమ్మ, చెల్లెలు ఇంటికివచ్చాక తల్లివద్దకు నాల్గుమార్లు వెడితే పెద్దతల్లివద్దకే పదునాల్గుసార్లు వెళ్ళేవాడు. సత్యభామకు వాడంటే ఇష్టమేనా!- అంటే ఆ సంగతి వేరు. ఆమెకూడ కుమారుని దగ్గరికి పిలుస్తుంది. 'లచ్చా చెల్లెలితో ఆడుకోవా?' అని పిలిస్తే, 'నాకు చెల్లివద్దు, గిల్లివద్దు' అని జవాబు వస్తుంది, 'నాతో ఆడుకోవా' అంటే, 'అమ్మా! నువ్వు చెల్లెల్ని దింపేసి, నన్నే ఎత్తి ముద్దాడమ్మా, చెల్లెల్ని నేలమీద వడుకోబెట్టమ్మా' అని మారాము చేస్తాడు. అలా చెయ్యగలదా తల్లి? ఏమో ఒకవిరాళ

ఆమెలో వినిండింది. 'అవును లేరా! నువ్వేమో ఎవరు బడితే వాళ్లచేతుల్లో పెరగడానికే, నా కడుపున పూరికే పుట్టావు అంతే' అని అనుకుంటూ తనకష్టానికి తనలో తానే కుమిలి పోయి, మనస్సు నొచ్చుకుంటుంది.

ఇక్కడ లచ్చుడు పారోతిని ఎంత పిలిచినా సత్యభామఎదుట ఆమె తనప్రీతిని ప్రదర్శించడానికి సాహసించదు. ఇంటిగోడలు దాటితే సరి, లచ్చ-పారోతీలమధ్య ఎంతో వాత్సల్యానురాగాలు. తన కడుపులోకూడ ఒక కొడుకుపుడితే ఎంత బాగుండేది. అవే విచిత్ర అభిలాషయే ఈ బాలునిపై ఇంత ఆశగామారి చుట్టుకున్నది. అందుకే సత్యభామ నెపానికే తల్లి. రామఐతాళులకు తన కొడుకును ఆడిస్తూవుండటానికి విశ్రాంతి లేనేలేదు. సత్యభామకు తన మనోవేదన దినదినానికి పెరుగుతున్నది. సాయంత్రం ఇంటికి వచ్చినప్పుడు తండ్రి కొడుకును పలుకరిస్తారు. లచ్చడు పొద్దస్తమానం పారోతివద్దనే వుంటాడని వారూ చూస్తున్నారు. బెదిరిస్తే లాభంలేదనికూడ తెలిసివచ్చింది. ఇక్కడ సత్యమాత్రం తన మనోవ్యథను ప్రకటించకుండా వుండగలదా? 'సరే రేపు సుబ్బికూడ పెద్దదవుతుంది. పెద్దమ్మ కొంగుపట్టుకొని తిరిగితే, నేనుమాత్రం పిల్లలను కనేవరకే అని స్పష్టం కాదుటండీ' అని మగణ్ణి ప్రశ్నిస్తుంది. ఆమె సంకటం ఎంత లోతువరకు వెళ్లిందో ఐతాళులవూహకు అందనిదికాదు. కాని ఆ దుఃఖనివారణకు మార్గం కానరాదు.

లచ్చనికి నాల్గేండ్లు నిండి అయిదోది పడింది. ఒకవిధంగా పాతచిక్కు సమస్య విడుదల అయ్యేరోజు వస్తున్నది. వానికి విద్యాభ్యాసం అక్కరలేదా? మల్పె సమీపంలోని కారీసర పాఠశాలకే పంపవచ్చు. 'పిల్లవాడు తాతగారింట్లోనే పెరిగితే సంభావితుడై మనగల డండీ' అని సత్య సలహా చెప్పింది. ఐతాళులు కొడుకును ఒకరోజుకూడ చూడకుండ వుండలేరు. అందుకే, 'ఏమీ తొందరలేదు' అని నచ్చజెప్పారు. పిల్లవానికి ఐదేళ్లు నిండేలోపుగా ఒకరోజు సరసోతి, 'అన్నా, ఈ నవరాత్రిపాడ్యానికి మనవాణ్ణి మఠంశంకర ఉపాధ్యాయుల వద్దకు పంపుదాము. శ్రీకారం లేకుంటే ఎల్లాగు? పారంపల్లి వాసుదేవగురికారులేమో పిల్లల్ని కుందాపురమో, ఉడిపో పంపుతారట, ఇంగ్లీషు నేర్పుతారట. లచ్చనికి ఇంగ్లీషు వంగ్లీషు వద్దన్నా. ఒకవిధంగా భాగవతం, రామాయణం పురాణం చెప్పేశక్తి చాలదా?' అనింది. ఐతాళులేమో 'ఏమి తొందరలేవే? లచ్చడు మఠంలో కోదండం, చింతబరిగె పూజలకు గురిఅయితే అక్కడ నాల్గునాళ్లు వుండడం కష్టం? అన్నారు.

'అయితే శంకరఉపాధ్యాయులు మన ఇంటిపిల్లవాణ్ణి కొడతాడటనా?'

'వానికి మన, తన, గిన లేదు. లక్ష్యంలేదు. మొన్న సీనమయ్య కొడుకు ఒరటనికి 'కోదండం' వేయగా వాడు వైనుండి కింద ముళ్లపైకి దుమికి అయిన అనర్థం కథ విన్నాముగా. సీనమయ్య చట్టంలో పక్కామనిషి, మఠానికి వెంటనే వెళ్లి 'సీకాళ్ల విరగగొడ్తాను' అని ఉపాధ్యాయుణ్ణి తిట్టాడట. 'సరే, నీకొడుకుకు చదువు నీవే చెప్పుకోవయ్యా' అంటూ



మఠంనుంచి ఒరటణ్ణి వెంటనే వెళ్ళగొట్టాడట. ఇక మిణారు మఠానికో లేక ఏటి ఆవల సరకారి పాఠశాలలోనో జేరాలి. ఏరుదాటి రోజూ రెండుసార్లు ప్రయాణం సాధ్యంకానిదని.'

'ఈ పసివాళ్ళకు. చదివి, రాసి కావలసిందేముంది? అవన్నీ గురికారుల పిల్లలకు, వీడికి నీలాగ ఎనిమిది అష్టకాలు వేదాధ్యయనం అయితే చాలు. దానికింత కొరివిపెట్టా' ఆరాత లేకపోతే పోనీ. నీ అనంతరం పౌరోహిత్యం విలబడవద్దా?' అనింది సరసోతి.

ఎల్లాగైనా మాటలు ముందుకు సాగలేదు. 'సరే మూడునెలల తదుపరి నవరాత్రి- అప్పుడు చూస్తే సరి' అన్నారు. కాని మనస్సు మథనపడింది. తనకు ఒక్కగా నొక్కడే కొడుకు సర్కారికొలలో పడవేసి తుదకేమి ప్రయోజనం? తన అనంతరం వైదీకం జరిపించే వారుండరే? ప్రక్కఇంట్లో అధ్యయనంచేయించి అష్టోత్తరాలు, ఆశీర్వాదాలు నేర్పించితే, వుపనయనమయ్యాక చక్కగా ఘనపాఠిగా తయారు అవుతాడు. తనవెంట షోడశకర్మలకు తిప్పితే ఉగ్ర, ప్రచండపండితుడే కావచ్చు. అనే ఒకదారి, మరొక్క ఆలోచనకూడ లేకపోలేదు. గురికారుల పెద్దకొడుకు కుందాపురంలో వకీలుదల్లి కట్టాడట; తనవూరి కక్షీదారులందరూ చీమలలాగు అతనిచుట్టూరా మూగుతారట. కుప్పలు కుప్పల డబ్బుపోసి వస్తారట. తనకొడుకు వకీలయితే తప్పా?- అని తనకు తగని, మించిన ఆలోచనలుకూడ చేశారు. వైదికంపట్ల వారికి విరక్తి ఎందుకంటే; శీనని పిల్లలు చదువుసంధ్యలు లేకనే సిరిసంపదలతో తులతూగుతున్నారు. తండ్రి రాజవైభవం నడుపుతున్నాడే, వాడే గురికారుడై మెరుస్తుంటే, కొడుకు పుణ్యమున తానెందుకు కీర్తి ఆర్జించకూడదు? అనే పెద్దసమస్య ఎదురైంది. వానికొడుకులు కాఫీ చిప్పలు గడిగి బాగుపడితే తనకు తనకొడుకు వకాలతుచేసి సంపాదిస్తాడు! వకీలై లచ్చుడు రెండుచేతులతో డబ్బు దోచి సంపాదించిపెట్టినట్లే తియ్యని పగటి కలలు గన్నారు ఐతాళులు.

చాలనాళ్ళవరకు ఈ తియ్యనికల వారిని మైమరపించింది. నవరాత్రి దగ్గరకే వస్తున్నది. వుపాధ్యాయుల శంకరుడు వచ్చాడు. ఐతాళులు ఇంట్లో లేరు. 'ఎవరమ్మా ఇంట్లో' అని చప్పుడు వినగానే సరసోతి 'వారు సాయంకాలం వస్తారు? ఎవరక్కడ-అయ్యవారా? కూర్చోండి. గంగాపానం చేస్తారా? చల్ల తీసికొంటారా?' అని మర్యాద చేసింది. ఉపాధ్యాయులు 'నాకు పురసత్తు లేదమ్మా! మఠంవేళకే వచ్చాను. విజయదశమి వస్తున్నది. పిల్లవాడు ఐదేండ్లు నిండిందని, మఠం వస్తాడేమో అని కుతూహలంతోనే వచ్చాను', 'నేనుకూడ అల్లాగే అన్నకు చెప్పానండి. చూడండి నిజమో, దుష్ప్రచారమో, మఠం దెబ్బలంటే భయపడ్తారండీ. ఆ పప్పుడచెట్టు ఎక్కించేది. కోదండం వేయించేది, ముళ్ళమంటలు అన్నీ భయమే. మేము ఎవరైనాగాని మావానిమీద ఒక దెబ్బవేసింటే ఒట్టు.'

'అమ్మ! ఎవ రెంతచెబితే ఏం? సరి. వరవాలేదు. ఆ మణూరి వుపాధ్యాయుడన్నా డేమో. అతనికి తన మఠానికి కోడి తరువాత ఎన్నో పూళ్లవాళ్ళు వచ్చినా ఆశతీరదు. అందుకే ఈ మాటలు పుట్టించాడేమో, ఎవరికెరుక?'

'మేము ఏమన్నా చూడబొయ్యామా? ఎవరు చెప్పారో, విన్నారో, మీరు పిల్లవాన్ని కొట్టకుంటే సరి.'

'కాని అల్లా అని వానిఒంటిని తాకకుండ వుంటానా? అది నావల్లగాదు. నేను విద్య నేర్చేసమయంలో ఆ బెత్తాంతో ఒక చింతబరుగులతడిక అల్లవచ్చు. కాని నేను కొద్దిగానే బెత్తం వాడుతాను. అంతే. ఏమీ కొట్టడనితెలిస్తే మఠంలో భయం వుండదే: పాఠం ఎల్లా నేరుస్తారు చెప్పండి? వేడిలేకుంటే వెన్నకూడ కరుగదమ్మా!'

ఇల్లా ఎన్నో మాట్లాడి ఎదురుగుండా హాజరైన బెల్లంముక్కలు నంజుకొని నీళ్ళు తాగాడు. 'ఐతే అన్నగారికి చెప్పండమ్మా పిల్లవాన్ని పంపాలని? విజయదశమినాడు అక్షరాభ్యాసం అయినవాళ్ళందరికీ జయమేనమ్మా!' అన్నాడు.

'అయితే, ఈ సర్కారివాళ్ల కెందుకుండదు దినం, వారం, దశమి అని. కుందాపురం సంతకుకూడ అంతేగదా? ఎప్పుడు పడితే అప్పుడేనట.'

'అవునమ్మా! అంతే. వాళ్ళకు ఏమట్టీ లెక్కాలేదు. కార్కాడలో తిథి, నక్షత్రం లేదు. ఆదివారం ఒక్కటే లెక్క. అయితే మీవాడు సర్కారుబడికే వెళ్తున్నట్లు తోస్తుందే? అక్కడ అందరూ సగటే- గానుగవాడు, తెలికలవాడు, సోమయాజీ అంతా ఒకటే బల్లపైన కూర్చుంటారు.'

'నిజమా? అల్లా ఎక్కడైనా వుంటుందా? ఐతే వైదికులూ, తెలికలూ ఒకటేనా? అక్కడ?'

'ఔనమ్మా ఔను! నేను చూడు-మా మఠానికి బ్రాహ్మణపిల్లల్నే చేర్పిస్తాను. మరొక్క పురుగుకూడ వాలదు. మా మైదానంలోవుండే నాగప్పశెట్టిగారు అన్నారు 'అయ్యగారు! మా మగ చిన్నవాళ్ళకుకూడ ఇంతవిద్య నేర్పండి అని. ప్రాధేయపడ్డారు. నేనేమో, నా సిద్ధాంతం వరుసకే వీలులేదన్నాను.'

'అయితే సర్కారుకు ఈ రివాజు లేనేలేదా?'

'సరకారువారు ఈలాగే చేస్తుంటే పదేళ్లతరువాత నాగలి మోసేవారే వుండరు దేశంలో. అప్పుడు బ్రాహ్మలే కాపులు, బండివారు కావాలి!'



శంకరవుపాధ్యాయులు మళ్ళీ వేళయిందంటూ వెడుతూ 'అన్నకు చెప్పండి' అని జ్ఞాపకం చేశారు. ఇల్లాగే పదిమందిండ్లల్లో కోతలుకోసి నచ్చజెప్పి మఠం చేరాలి. తమ ఇంట్లో స్థలం తగినంతలేదు. అందువలన ఒక గృహస్థుని బియ్యందంచేచోట అరుగులపైన మఠం (జడి) ఏర్పాటు చేశారు. ముగ్గురికి తక్కువ విద్యార్థులు లేరు. ఆరు దాటలేదు. కోడి, కన్యాణ, పడుకేరె మూడుగ్రామాలలో వారే గొప్పఆచార్యులు-ద్రోణాచార్యులు. ఈతరం పిల్లలందరికీ వారు విద్య నేర్పుతున్నారు. ఇప్పటి పెద్దలకంతా వారితండ్రి నారాయణ వుపాధ్యాయులే నేర్పేవారట. నారాయణ వుపాధ్యాయులనాలుకపై నలభైఆరు ప్రసంగాలు ధారగా అవధానంలాగు తాండవమాడేవట. అన్నీ నేర్పేవారట. దానిపైన ఎక్కాలు. దస్తావేజులు, ప్రోనోట్లు, పక్కాణలు, తాళపత్రాలపై వ్రాత, అన్నీ నేర్పేవారు. అతనికాలలో వదేం డ్లయిన పాటుపడినవారికి పది పన్నెండు యక్షగానాలు వచ్చితీరతాయి. ఈకాలంవారిలాగు కాగితంపైగాని, స్లేటుపైగాని వ్రాసి సరస్వతిని భ్రష్టు పట్టించే అలవాటు వారికెన్నడూ లేదు.

శంకరవుపాధ్యాయులకు అంత విద్య రాదనుకోండి. కానీ ప్రచారంలోవుండే మీనాక్షీ కల్యాణం, కర్ణార్జునయుద్ధం, బభ్రువాహనుని కథ, ఇంద్రకీల - వాటికి లోటులేదు. వారికి మద్దెలవాద్యం చక్కగా వచ్చు. భారతం, భాగవతం, రామాయణం అర్థం చక్కగా చెప్పి రక్తి కట్టిస్తారు. నారి గొంతుకూడ మంచిదే. అన్నీ కార్యక్రమాలకుకూడ వారిగానా, బజానా వుండక తీరదు. వారు లేకుంటే నాటకాలకు ప్రకాశంలేదు. తెల్లవారదు. ఒకటే ఒక దోషం వుంది వారివద్ద- అందరూ ఆమాటను అంగీకరించాలి. అది ఏమంటే 'వారి చెయ్యి చూశారూ! మద్దెల మోతకంటె జోరుగా కొడుతుంది.' ఎవరైనా సంజాయిషీ అడిగితే 'ఘా నాన్న నన్ను కొట్టింది మీరెరుగుదురో లేదో; ఊరికే పూజకు పెడితే విద్య వస్తుందటండీ! వీపు వంగి మోగితేగాక సరస్వతి వలుస్తుందా?' అని అంటుండేవారు. ఆ దెబ్బలబాధకు పొన్న చెట్టెక్కి దాచుకున్నవారు లేకపోలేదు. మఠానికి తర్వాత వెళ్ళకుండ మానరుగదా! నేను మాత్రం పొన్నతోటలోనికి పోనివ్వను. పిల్లలకు చనువు ఇయ్యరాదు' అనెడివారు. అందుకేనేమో అరుమంది అరుతూముల బియ్యం ఇస్తే దానితోనే కాలక్షేపం తృప్తిగా చేసుకోవాలి. దానివెంట కాయగూరలు, పెసలు వస్తాయిగాని ఇంటిలో వ్యవసాయం జరిగితేగాని పొట్ట వెళ్ళదు.

వుపాధ్యాయుల వుపన్యాసం విన్నాక సరసోతికిమాత్రం సరకారి పాఠశాలలపట్ల జుగుప్స చుట్టుకుంది. బ్రాహ్మణుల కులానపుట్టి ఆ వెధవ సర్కారుబడిలోనా విద్యకు వెళ్ళడం అవి చింత ఎక్కిపోయింది.

రాత్రి బతాకులు ఇంట్లో భోంచేసికూర్చున్నాక సరసోతి వారివద్దకెళ్ళి 'అన్నా ఆ శంకరవప్పులు వచ్చారు' అని తెలిసింది. తరువాత లచ్చన్న భవిష్యత్తుగురించి తప్పనిసరిగా చర్చసాగింది. బతాకులు లోతుగా దీర్ఘాలోచనచేసి నిశ్చయం తేల్చినవారిలాగా

గంభీరంగా 'మన అచ్చన్న అయితే, ఆ భయానికి మూన్నాళ్ళకే పరుగెత్తిపోతాడు. ఇక ముందురోజులలో పిల్లల ఆయుష్యప్రమాణం యక్షగానం అపీ ఇవీలో సాగేలాగు లేదు. నేను వైదీకం గొడ్డును, నాకు ఎంత మానమర్యాదలు మిగిల్చారో చూశావుగా! ఆ ఎంగిలి కూటి సొమ్ము గడించే కొడుకులనుండి శీనమయ్యకు ఎంత గౌరవమో చూస్తున్నావుగా!' అన్నారు.

'ఐతే మన అచ్చన్నకూడ ఇక హొటేలు చాకరీకేనా?'

'ఛీ, థూ!! అన్నవిక్రయం చిల్లిగవ్వకూడ వద్దే నాకు. దానికంటె నా అరవైనాల్గు తూములపంట చాలు. పౌరోహిత్యంవల్ల అన్నవస్త్రాలు సాఫీగా సాగుతాయి. ఏమీ తొందర లేదు.'

ఆ మాటలువింటూ కూర్చున్న పార్వతికికూడ చాల ఆశ్చర్యం కలిగింది. అయితే అరవైనాల్గుతూముల ధాన్యం నిజంగా వస్తుందా? అనేయోచన ఆమెకు. ఆమెకు ఇది ఒక వింతవార్తయే. ఆ బీదరాలికి తాముగూడ పల్లెలో చాల మోతుబరీవారేనని తృప్తిగలిగింది. తన పతిదేవులు గ్రామంలో కుబేరుల లెక్కలోనివారేనని ఆమె ఎన్నడో విన్నది. ఆవిషయం అడుగగానే 'ఊరకే ఆడవారికెందుకీ పారుపత్తెం, పెత్తనం? పడుకో' అన్నారు.

సరసోతి 'సరే అన్నా! ఆ శీనమయ్య డౌలు, దస్కం మనకేంపని? ఆ పెత్తనాలు వద్దులే, బాలున్ని ఇంట్లోనే అధ్యయనం చేయించు' అన్నది. అప్పుడు సత్యభామకూడ వచ్చింది. ఆమె మనస్సు తేటతెల్లంగా లేదు. ఆమె మెదటినిండా యోచనలు. ఆమె పదు మున్నూరిది. పార్వతికంటె ఒక మాసమెత్తు తన ఆస్తిగురించిన సమాచారం తెలిసింది. తన తండ్రిగారి గొప్పదనం, ఆస్తివివరాలు మరింత తెలిసినమనిషి సత్య. ఐతాళులు దక్షిణల కొరకే పరుగెత్తేదానికంటే కాలుమీద కాలువేసికొని కూర్చొనే తింటుంటే ,గురికారులకు ఈడయ్యేవారేమో! అని తమ తండ్రి మాదప్పయ్యకూడ ఒకసారి చెప్పినట్లు జ్ఞాపకం. నవ రాత్రి పాడ్యమి వచ్చేస్తున్నదే. దశమినాటికే తన అచ్చన్నను శంకరుల మతానికే బలి చెయ్యాల్సిందేనా -ఈ చింతలో మునిగింది సత్యభామ.

తనకొడుకును ఇంట్లోనే వుంచుకుంటే తన సవతితల్లిలాగే కోతలతరవాత మిగిలిన కొయ్యను మేపడానికి దూడలు తోలుకొనిపోవడంతప్ప ఇంకేమీ రాదు. కాని తన కొడుకు మళ్ళీ తనయెదుట లేకుండ పోతాడేమో అనే బెంగమాత్రం తప్పదేమో. అందుకే వాళ్ళ సంవాదంలో తాను భాగస్వామిని అయింది. అంతా వాళ్లకువాళ్ళే తీర్మానిస్తే ఎల్లాగు, కన్న తల్లి అంటూ వుంది. ఆమెమాటకూడ తీసికోవద్దా? అనేగర్వం మనస్సుకు గుచ్చుకుంటూ వుంది. 'అచ్చని తాతనైనా ఒకమాట అడిగిచూడరాదా? మన హితమునుగురించి వారే చక్కగా సలహా నివ్వగలరు' అన్నది.



పిల్లవాని తాతగారి అభిప్రాయం తెలుసుకోవాలంటే, ఇంటనున్నవారిపై అవిశ్వాసమే వన్నమాట- అందుకే సరస్వతి 'కానీండి, వారినే అడుగన్నా, అతడే అన్నిటికి దారి చూపుతా దేమో!'అని చెప్పి వెళ్ళిపోయింది.

సభ ముగిసింది. పడుకొనేవేళలో భార్యాభర్తలే ఆ విషయాన్ని చర్చించుకున్నారు. సత్యభామతో ఐతాళులు ఏమో తమకుమారుడు వకీలువట్టా పుచ్చుకుంటాడో, లేక రివెన్యూ ఇన్స్పెక్టరో, తహశీల్దారో కాకపోనునా! అంతైనా కావాలని అతని అభిలాష. అందుకే అయ్యగారి మతంవద్దు, అధ్యయనమూ వద్దు. సరే, సర్కారిస్కూలు సరే. అదే చివరి తీర్మానం- పదుమున్నూరిలో ఐతేఇంటికి దగ్గరనే బడి వున్నది. తాత అందుకే తమవద్దనే వాన్ని వుంచుకుంటారు. సత్యభామఏమో పిల్లవాడు తండ్రివద్దవుంటే బొత్తిగ ఏదీ కుదుర దనుకున్నది.

సరే వానకాలం జోరు తగ్గింది. చేపలపడవలు సముద్రం చొచ్చుకున్నాయి మహా లయ అమావాస్యనాడు ఐతాళులఇంట్లో అందరూ సముద్రస్నానం చేశారు. దినాలు గడచే కొలది శంకరవుపాధ్యాయులకైతే కనీసం తూమెడుబియ్యం గిట్టుతుందనే ఆశ ఎక్కు వైంది. అందుకే ఎన్నోతడవలు వారింటికివెళ్ళి 'ఏమైనా విజయదశమికి పిల్లవాన్ని పంపేది మరువకండి.' అని పలుమారు చెప్పివస్తుంటే సరసోతి అతనితో మాటలే మానింది. ఉపేక్ష చేసింది- 'ఏమి-ఐతాళులుకూడ పిల్లవాన్ని కార్కడలోనే వేస్తారా? ఈనాటివరకు గురికారులే ఆ తగని పని చేస్తుండిరి. ఇప్పుడు వైదీకులూ దిగినారు. వారితోక పట్టుకున్నారు' అంటూ వారింట కూర్చొనే ఆక్షేపించారు.

'అయ్యగారు! ఊరకే ఎందుకున్నారు- మాకు అన్నీ అర్థంకాదు. కన్నవారికే తెలును ఎలా చెయ్యాలో' అని అతనిమాటలను ఖండించివెళ్ళింది సరసోతి.

ఐతాళులు నవరాత్రిలో ఒకనాడు మామగారింటికి వెళ్ళారు. మాదప్పయ్యగారు ఎంతో ఆదరంగా 'ఐతాళులు, మామఇల్లు ప్రకాశింపజేశారా? సుబ్బి పుట్టినాక ఇంతవరకూ ఎవరూ రా రెందుకు?' అని ఎగతాళి చేశారు. ఐతాళులు 'మా అబ్బాయి తాతగారిదర్శనానికే వచ్చాడు. వాణ్ణి బడిలో చేర్చితే మంచిదని సత్య అన్నదండి' అన్నారు. మామగారు నవ్వి 'ఐతాళులకు కళ్లు తెరచుకొన్నవే. వాణ్ని ఎక్కడ అధ్యయనానికే పంపేస్తారో అని, కానీ అన్నీ వారివారి అపేక్ష అనుకున్నాను. పిల్లనిచ్చేశాక వారివారినిర్ణయాలే వారికి మంచిదనుకున్నాను' అని మళ్ళీ నవ్వుతూ పలికారు. అదే హాస్యభంగిమలోనే 'మరేమి! ఈకాలంలో ఇంగ్లీషు నాల్గు ముక్కలు వచ్చినవారికున్న వరువుప్రతిష్ఠ ఈ అష్టోత్తరం అధ్యయనం వారి కెక్కడండీ? అధ్యయనం వారికేమీ రాదు' అన్నట్లు చెప్పేశారు.

సరే. మాటలు ముందుకు కొనసాగినవి. నిశ్చయం అయింది. 'అచ్చుడు తాతగారిం ట్లోనే వుండవి' అన్నారు. 'మా పెద్దపిల్లవాడు ఎడపాదనపా కరణీకం చేస్తూవుంటాడు.

మాకు చిన్నపిల్లలు లేరు. అందుకే మీ అచ్చుడుంటే పిల్లలు ఆడుకోని కొరత తీరుతుంది' అని అచ్చనిమామ్మ అన్నది. 'వాడు ఐదవతరగతివాడు ఇక్కడనే వుండి చదువని' ఇక్కడ మైలుదూరమైనా లేదు. కోడినుండి అయితే బడికొరకే ఏరు దాటుకుంటూ అపాయంలో పడాలి. చిన్నపిల్లలను ఏటిలో దాటించే అభ్యాసం తప్పు'. ఐతాళుల సంతోషానికి పట్టపగ్గాలే లేవు. 'అచ్చుడువచ్చి చక్కగా విద్యనేరిస్తే-ఈ వగలు రాత్రి మోట, ఏట, బురద, ఎరువు తొక్కేపని వదడు. అది ముమ్మాటికీ వద్దు అచ్చునికి' అని సంకల్పించారు.

మాదప్పయ్య-'అందుకే నేనన్నాను. మావాడైతే తొందరగా ప్రబుద్ధుడయి సగంలో చదువు మానివేశాడు. లేకుంటే ఈపాటికి మంచి వకీలయ్యేవాడు.' ఇప్పుడైనా వాని ఇంగ్లీషు చాలు. మొన్న తహశీల్దారుగారిని వాడు ఇంగ్లీషులో సత్కరించాడు. వారి సిఫారసులో కరణీకం స్థిరపడవచ్చు' అన్నారు.

ఐతాళులు సగర్వంగా 'అరే బావనా, ఇంతవాడైనాడా!' అని మెచ్చుకున్నారు ఆశ్చర్యంతో.

'కానీ అలాగే చేద్దాము. అయితే అచ్చుని ఇష్టం తెలుసుకోవద్దా- వానికి పెద్దమ్మ తోక పట్టుకొని తిరిగే అలవాటు. ఇక్కడ తాతఇంటికివచ్చి ఏమి చేస్తాడో ఏమో! సత్యభామ కాన్పుకు వచ్చినప్పుడు చూశారుగా!' అన్నారు.

'పిల్లలవ్యవహారం, నాల్గునాళ్ల ఏడ్చి అన్నీ మరుస్తారు. ఇక్కడ వాళ్ళ అమ్మమ్మ చూసుకుంటుందిలే' అన్నారు ఐతాళులు.

ఆ రాత్రి ఐతాళులు ఇల్లు చేరినప్పుడు వారు అనుభవించిన ఆనందం ఇంతింతన లేము. వారే కొడుకు ఐనట్లు, తహశీల్దారు అయినట్లు, దేశసంచారం చేసినట్లు భావిస్తూ ఉల్లాసం అనుభవించారు. వారు ఆవాగు దాటేటప్పుడు పడమటి ఆకాశం రంగులతో నిండి వున్నది. నీళ్ళఅలలు నవ్వుతూ ఆ రంగులను పలుకరిస్తున్నట్లున్నవి. సూర్యకిరణం అలకు తగిలితే కత్తిమొనబాగు మెరుస్తున్నది. నది నీళ్ల నిండి తృప్తిగా సముద్రం చేరుకుంటున్నది. ఆ దృశ్యంతో ఆకాశంలో తాముకూడ సౌధాలు నిర్మించారు ఐతాళులు. నావవాడుమాత్రం ఈవలిఒడ్డుకు చేరినవెంటనే 'కోడి వచ్చింది-దిగండి' అనేదాక వారికి ప్రపంచం గుర్తుకు రాలేదు. 'అరే ఎంత త్వరగా దాటిందయ్యా!' అంటూ దిగి తమ ఇంటిదారి పట్టారు. వారు చిరునవ్వు నవ్వినలాగే తరగలుకూడ నవ్వుతున్నాయి. అమితోత్సాహంతో తమ ఇంటిదారి పట్టారు.

ఇల్లు సమీపించగానే వారిముఖంలో ఏకో శుభవార్త సత్యభామకు తెచ్చిన సంతోషం తాండవించింది. సరే చెల్లెలితో వాకోపవాదాలు చెయ్యాలే అని చింత. అన్నిచింతలు ఎల్లా వున్నా అచ్చణ్ణి వద్దంటే ఏమి చెయ్యాలి! అచ్చునికి పెద్దమ్మను విడిచివుండేది కష్టమని, కన్నీ,



అదివారాలు తప్పక ఇంటికి రప్పించాలని ఆలోచన కలిగింది. ఆ ఆలోచనలలో ఇంటిగడప తొక్కారు. నీరునిండిన గుంటకూడ నాల్గుగజాలదూరంలోనే వుంది. కప్పలు బర్రు, బెక, బెక మంటున్నవి. అదియే సంగీతం. ఐతాళులువచ్చి 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః' అంటూ సంధ్యా జపం ముగిస్తున్నారు కప్పల బెకబెకతో రాగం కలుపుతూ. వారిమంత్రం ఇంటికంతా వినబడింది. ఇంటిలోంచి అచ్చుడు 'అప్పా' అని కేకపెట్టాడు. అప్పుడు సత్య ఆ వేళవెన్నెల్లో కొడుకును బయటికి తీసుకొనివచ్చింది. తన పుట్టింటివారు ఏమని తీర్మానించారో తెలుసుకుందామనే ఆదుర్దా ఆమెకు. ఐతాళులు 'ఓం తత్ సవితుః వరేణ్యం'ల నడుమ నడుమ ఒక్కొక్కశబ్దం పలుకుతూ సమాధానం చెప్పారు. తనమాట గెలిచిందనే ఆనందంతో పొంగిపోయింది సత్యభామ. అచ్చణ్ణి ఎత్తుకొని 'అచ్చన్న నువ్వు స్కూలుకువెళ్ళి చదివి బుద్ధిమంతుడు కామ్మా!' అన్నది.

ఇంట్లో అందరిభోజనా లయినాయి. అచ్చన్న పెద్దమ్మవద్దకెళ్ళి పరుపు విప్పుమన్నాడు. ఆమె వానికి పడుకొనేఏర్పాటుచేసి, తానేమో ఇంటిపని ముగించుకున్నది. సరసోతి, పారోతి మాత్రం విశ్రాంతివేళ అయిందని లచ్చుని పరిసరాలలో పడుకున్నారు. సరసోతి మెల్లిగా 'పారోతి, ఏమైనా చెప్పారా!' అని అడిగింది. 'నాకేమి తెలుస్తుంది! పిల్లవాణ్ని ఎక్కడ పంపినా నా కొక్కటే. మఠంబైనా పరవాలేదు. స్కూలు అయినా పరవాలేదు. బడికి వెళ్ళివస్తే రోజూ మనం రెండుపూట్ల స్నానమాడాలి అంతే' అన్నది పారోతి.

అప్పుడే అచ్చన్నలేచి 'పెద్దమ్మా, అమ్మ చెప్పింది. నేను బళ్లోకివెళ్ళి బుద్ధిమంతుణ్ని కావాలట. బౌనా పెద్దమ్మా? బడి ఎక్కడుంది!' అని అడిగాడు. 'ఒరే దొంగ! ఇంకా నిద్ర పోలేదేమిటి!' అన్నది పెద్దమ్మ.

పిల్లవానిఎదుట ఆ చర్చ సాగనియ్యరాదని వారు వూరకున్నారు. ఎల్లాగూ సంగతి తెలిసిందిగా! వాడు నిద్రపోయినతరువాత చూద్దాములే అంటే! వాళ్ళకూ నిద్రపట్టింది.

నవరాత్రి నాల్గురోజులై ఐదవరోజు వచ్చింది. శంకర వుపాధ్యాయులు మళ్ళీ ఐతాళులను వెదకుకొనే వచ్చారు. ఐతాళులు స్నానంచేసి వైదికాలకు వెళ్ళేలోగా పట్టుకుందా మనుకున్నారు. ఎల్లాగయినా ఆపనిలలన, ఒక తూమెడుబియ్యం గిట్టినా అని అతని అంచనా, పట్టుదల. అంతే. ఇక ఐతాళులు స్పష్టంగా చెప్పకుండా వాయిదా ఎందుకు వెయ్యాలి అని 'చూడండి అయ్యగారు, మీరు వచ్చింది నాకు సంతోషమే కాని నేను పిల్లవాని తాతగారి అభిప్రాయంలేనిది ముందుబడేమార్గం లేదు. అందుకే మీకు ఏదీ తేల్చి చెబుదామని వూరెళ్ళి వచ్చాను. అక్కడికే పంపాలన్నారు పిల్లవాణ్ని. మా ఇంటివాళ్ళకుకూడ అదే ఇష్టం' అన్నారు.

'అక్కడ మంచిమఠం వుందాండి?'

‘అక్కడ దగ్గరలో మంచి నరకారీబడి వుంది. పోనీ వానికింత ఇంగ్లీషు అంటని అన్నారు.’

‘హూం, అవును ఇంగ్లీషుభ్రాంతి, ఐతే అది వైదీకులైన మీలాంటి మనులనుకూడ పట్టుకుందా? మీరు ఇంట్లోనే వానికి అధ్యయనం చేయిస్తే చాలు. నాకేమీ చింతలేదు. ఆ తగలెట్టిన సరకారిశాలలో నానాజాతివాళ్లనడుమ కూర్చుంచే బాగానండి. ఇప్పుడు ఈ కార్కడ స్కూలు చూడండీ, ఒక సాలెవాడో, గానుగోడో టీచరట - బ్రాహ్మణపిల్లలు వానితో దెబ్బలు తినాలా? కాలం ఎల్లా ఆడ్డం తిరిగింవో తెలిసిందా?’

దూరంనుంచి నరసోతికూడ ఈవాదం వింటున్నది. కాని చాల దగ్గరకు వెళ్లలేదు. వెళ్లాలని ఇష్టముకూడ వుండలేదు.

ఐతాళులు ‘ఏమో! అన్నీ తెలియకుండానే వాళ్లతాత ఏర్పాటు చేస్తారని అనుకోటానికి వీలులేదు. అక్కడవున్న మేష్టారుకూడ బ్రాహ్మలే కావచ్చు- ఇక్కడైతే వేరేజాతివారు మాష్టరు అయ్యారని వదలేశాము. అక్కడ బ్రాహ్మలపిల్లలు వేరే బెంచిపైన కూర్చుంటారట. మీ మతంలాగు నేలపైన కూర్చోరండి అక్కడ.’

‘అవును. ఐతాళులూ, దానిలాగు నేనుకూడ ఒక విరిగినమంచం వెయ్యలేనా? కాని మంచాలపైన కూర్చోనివించే, దశావతారానికి వెళ్ళేవారిలాగా చదువు ప్రాప్తి వుంటుందా వండీ? నాకేమో లాభంచూసి చెబుతా ననకండి. మీకైతే స్వంతవిషయం. ముందుయోచవ కూడ లేదండీ.’

‘శంకరవర్ధులూ - మా నత్యభామకు ఇంకా ఇరవైరెండేండ్లే. నరసింహస్వామి దయవుంటే మరొక్క అబ్బాయి పుడతాడు. వాడే నా తరవాత వైదీకంపనులు చూస్తాడు.’

‘చాలులెండి గట్టిగా వల్లె వేస్తే తప్పకుండా మూడేళ్ళలో నావిద్య వస్తుందండీ!’

‘అయితే లక్ష్మీనారాయణ వకీలు కౌతాడు అంటారు!’

‘భగవంతుడు ఎల్లావుంచితే అల్లాగు. గురికారుల ఇంటికివెళ్ళి ఇత దొక శ్రాద్ధాలకు బ్రాహ్మణుడు అని లెక్కలో పడకుంటె చాలు’ అని తమకు పనివుందని చెబుతూ ఐతాళులు లేచివెళ్ళారు.

శంకర పుపాధ్యాయులు నిరాశతో ఇంటికి వెన్నిచ్చారు. నరసోతి ఎదురువస్తే ‘చూవారా మీ అన్నగారి ఏర్పాట్లు? వైదీకులే ఇంగ్లీషు అనుకుంటూ జాతి, నీతులకు తిలోద కాలు వదిలితే....’ అన్నారు. ఆమె ‘నాకేమి తెలుసు? వారివారి బుద్ధికొద్ది చేశేస్తారు’ అని వుదాసీనంగా పలికి వెళ్ళింది. శంకరవర్ధులు నిరాశకు పరమావధియై ఇంటికి వెళ్ళారు.



వెడుతూ ‘అయితే నేను నాల్గు కుంటిమంచాలు తెప్పించి, నాల్గుజాతులవారిని కూర్చుండ బెట్టాలి- వర్ణసంకరం నేర్పాలి- సెట్టియో, భట్టో. సర్క్యూట్‌హౌజ్‌గామార్చి పిల్లలను మేపించాల్సిందే. నేను అరుమందే చాలంటూ ఈ బ్రాహ్మల్ని నమ్ముకుని చెడిపోతిని. లేకుంటే నంగమంలోని పెద్ద బెస్తలకు చెప్పివున్నా ఇరవైతూముల వియ్యానికి కరువుండేదికాదు-’అని గొణుగుతూ వెళ్ళారు.

నవరాత్రి అయిపోయింది. ఐతాళులకు నవరాత్రిపూజలు చేయించేపని లేదు. మూలా నక్షత్రం సరస్వతీపూజ కాగానే విశ్రాంతే- మూలానక్షత్రానికిముందే సత్యభామ మొండిచేస్తే అమెను, పిల్లవాణ్ని తాతగారింటికి పంపారు. ఆమె అచ్చనికి అక్కడి తిండితీర్థాలను వర్ణిస్తే వాడు వెంట వెడతానని అన్నాడు. వెళ్ళేరోజు పెద్దమ్మవద్ద వెళ్ళి ‘పెద్దమ్మా! వెళ్ళివస్తాను’ అని చెప్పినాడు. ఆమెకు కన్నీరు కారింది. ‘ఎందుకు పెద్దమ్మా, అంతగా ఏడుస్తావు’ అన్నాడు. ‘ఏమీలేదు, ఏమీలేదు’ అన్నది.

‘పెద్దమ్మా! త్వరగా వస్తాలే. వచ్చేప్పుడు నీకు లడ్డు, మిఠాయివుండలు తెస్తాలే’ అన్నాడు. ‘కానీ, అలాగే’ అంటూ ఆమె వెక్కివెక్కిఏడ్చి వాణ్ని ఎత్తుకొని ముద్దులాడింది.

విద్యా దశమి దినం వచ్చింది. ఐతాళులు వడుమున్నూరుకు యాత్ర చేశారు. అచ్చనికి అభ్యంజనం తరువాత శాస్త్రోక్తంగా విద్యాభ్యాసం తామే చేయించారు. వెంటనే వలక బలపంపై బడి మాష్టరుగారే విద్య నేర్పారు. అచ్చుడు చాలసేపు గీతలుగీస్తే చాల సంతోషించారు.

మరునాడు దాసప్పయ్య మేష్టారే అచ్చన్ని స్కూలుకు వెంటబెట్టుకొని వెళ్ళారు. ‘అచ్చన్న, నావెంట షికారు రా. అక్కడ నీలాంటి పిల్లలెందరో వుంటారు’ అని నచ్చచెప్పి తీసికెళ్ళారు. ఆ బోర్డు, కుర్చీ, టేబిలు, బెంచీలు చూశాక ‘ఇక్కడ చదువకుంటే మున్సిఫ్ ఎలాగూ అవుతాడు మనవాడ’ని దృఢనమ్మకం ఏర్పడింది ఐతాళులకు.

ఐతాళులు అరగంట కూర్చున్నారు. ‘అ ఆ’ వ్రాసిన అచ్చన్న ‘అప్పా! బడి చాలు, పెద్దమ్మవద్ద కెళతా’ అన్నాడు. ఐతాళులు మరి కొంచెంసేపు వుండుమని ప్రేరేపించారు. సాధ్యంకాకుంటే వాణ్ని తాతగారింటికి తీసికెళ్ళారు. ఎలాగో పిల్లవానికి తెలియకుండానే; ఐతాళులు తమ వూరెల్లాల్సి వచ్చింది. ఆరాత్రి అచ్చన్న చాలా గొడవపెట్టాడు. తండ్రికూడ వెళ్ళిపొయ్యాడు. తల్లేమో ‘నేనున్నారా’ అని సమాధానపరిచింది. మరునాడు దాసప్పమాష్టరు గారివెంట పెద్ద ప్రయాణసన్నాహంతో వెళ్ళాడు. ఒక వారంతరువాత నత్యభామకూడ మగనింటికి వెళ్ళింది. అమ్మా, నాన్న తనను వదలేసి వెళ్ళారనే సత్యం వానికి గోచరించింది. బడికి వెళ్ళేది, అ ఆ లు వ్రాసేది, నడుమ నడుమ పెద్దమ్మనుగురించి ఏడ్పు - అన్నీ వానికి తాతగారిల్లు ఒక చెరసాలగా మారింది. అప్పుడప్పుడు వూరకే ఏడుస్తుండేవాడు.

ఒకనాడు అచ్చన్న బడినుంచి తప్పిపోయి, తండ్రిని వెదుకుతానంటూ ఎక్కడికో

వెళ్లాడు. తాతగారు వెదకి కష్టంమీద ఇంటికి తేవాల్సి వచ్చింది. అందరూ చాల చింతలో మునిగినారు. వాని బడిప్రయత్నం చాల కష్టసాధ్యమయింది. తరువాత తాత, లవ్వ ఒక వుపాయం వెదికారు.

దాసప్పగారు 'మూల్కి' గ్రామస్థులు. ఊరు దూరంగా వున్నందువ వారు ఎక్కడో కాలక్షేపం చేశేవారు. రాత్రి భోజనం వుడిపిలో, మధ్యాహ్నభోజనం వారాన్నాలతో శిష్య లింట గడపేవారు మాదప్పయ్యగారు 'సరేనేండి, మా లచ్చప్పని శ్రద్ధగా చూడండి, , ఇరు పూటలు ఇక్కడే భోంచెయ్యండి' అని చెప్పారు.

పంతులుగారికికూడ ఒక అత్తవారింటిలాగు వుపచారం జరుగుతుందేది. అరోజునుండి వారు లచ్చన్ని గమనించి 'మాదప్పయ్యగారూ ! మీవాడు చాల తెలివైనవాడండీ, చురుకైన వాడండీ' అని ప్రశంసావృష్టి కురిపించేవాడు. 'ఈవేళ 100 దాకా కూడిక నేర్చాడు. ఎవరూ చెయ్యలేని లెక్కలు చేశేశాడండీ' అన్నారు. రోజూ వానివర్ణనలు చేస్తూ, వేరేవారికైతే బెత్తాలు ముక్కలైతే, లచ్చన్ని లాలించి విద్య నేర్పేవారు. దయతో చూసేవారు.

లచ్చుడు ఇంటికింగానే వాని అవ్వగారి ఆదరణ అలవిగానిది. లచ్చని పాతకలలన్నీ మాయమయ్యేట్లు మామ్మగారి చలువలోనే మూడునెలలు హాయిగా గడచాయి. లచ్చుడు మామ్మగారి మనుమడైపోయాడు. ఐతాళలే ఎప్పుడైనా వచ్చి 'రారా మూన్నాళ్ల వూర్లో వుండివత్తువు గాని' అంటే, నేస్తాలు, అమ్మమ్మ ఆశతో 'నేను రాను' అనేవాడు.

# 12

లచ్చుడు 'కోడి'వదలి పడుమున్నారికో విద్యాభ్యాసం చేస్తుంటే గ్రామంలో నగుబాట్లయింది. శంకరవుపాధ్యాయులు తమ మనస్సులోవుండే విషాన్ని వూళ్లో అందరిఎదుట కక్కేశారు. 'శీనమయ్యరును ఆచారం చేసుకొని ఐతాళుల గృహ వైదీకం వదలేదొక్కడే తరువాయి. శిష్ళిపిల్లను తెచ్చారు. జాతిని రూపుమాపేబళ్ళలో పిల్లవాణ్ని వేశారు' అని దుష్ప్రచారం చేస్తున్నారు. సరసోతి మనస్సుకుకూడ అలాంటిచదువులు నచ్చలేదు. కాని 'ఎవరెవరి బిడ్డల బాగోగులు వారిష్టం' అని వదిలేసింది.

లచ్చని ప్రాథమికవిద్య ముందుకు సాగింది. తొలిమాసాలలోమాత్రం పీటని విడిచి పెట్టిన చేపలాగు ప్రవర్తించాడు. కాని క్రమేపి తాత-అవ్వల వాత్సల్యం, దాసప్ప మాష్టరు



గారి ప్రశంసలు. బడిలో అందరికంటె అతనికే లాలన లభిస్తుంటే వడుమున్నారే తన ఇల్లు అని భావించాడు. సెలవులలోమాత్రం వూరు వెళ్లి వచ్చేవాడు. ఈ కొత్తదారితొక్కిన కుమారునికి ఇంట్లోకూడ రాజోపచారాలు జరుగుతుండేవి.

పెద్దమ్మచూపే అక్కరనుచూస్తే వెంటనే తాతగారిల్లువదలి అమెవద్దనే వుందామని ఆశకూడ పుట్టేది. పుత్ర వాత్సల్యంతోబాటు బడి చదువుకూడ , అబ్బుతున్నది. నాల్గయిదు సంవత్సరాలలో వాడు వడుమున్నారు పాఠశాలలో 'హైచెయ్యి' అనిపించుకున్నాడు. 'ఇదంతాచేసి కొడుకుముం దేమిచెయ్యాలి' అనేవిషయం ఇంకా బోధపడలేదు. అప్పు డప్పుడు తాతగారు 'పిల్లవాణ్ని దొక్కెన తోడటానికి, ఏతానికి, ఎరువువనికి పెట్టకండి' అన్నారు. వారికి అనుకూలం లేకుంటే తామే వాణ్ని హైస్కూలులో చేర్పించుతామని హామీ నిచ్చారు. కుందాపురం, ఉడిపి, మంగుళూరులలో ఇంగ్లీషుబళ్లు ఏర్పడి పెద్దకుటుంబాలవారిని ఆ ప్రవాహంలోకి లాగేకాలం అది. అందరూ వకీలు అవాలనో, తహశీల్దారు అవాలనో ఆశతోనే పట్నాలచదువులకు దిగుతుండేవారు. తమపిల్లల గొప్ప ఉద్యోగాలభవిష్యత్తు ఆశింప బడే రోజులు.

ఐతాళలో: ఉభయసంకటం ధర్మసందేహంలో పడ్డారు. వాడు వది దాటాడు. ఉప వయనం చెయ్యాలి. చెల్లెలు సుబ్బికి ఏడేళ్లు నిండినాయి. జాతకంమాటప్రకారం సత్యభామకు ఇంకా మూడవగర్భం నిలువలేదు. ఇల్లావుంటే సరసోతి 'అన్నా! లచ్చుడు చదివింది చాలులే. ఇంగ్లీషు పింగ్లీషు అక్కరలేదు. రేపు నీవంశం - మర్యాద నిలబడిపోతుంది జాగ్రత్త - మీ కులంవారిని ఇతరగృహస్థులు నమ్మి కూర్చున్నారే వారిగతి యేమి! ఎక్కడైనా పెండ్లి, వర్వం అయితే చూచుకొనేవారే లేరే!' అని గద్దించింది. ఈ విషయానికి ఏమని చెప్ప గలరు! రామఐతాళుల పౌరోహిత్యవృత్తి వారితోనే అడుగంటరాదు. అయితే ఏం చెయ్యాలి! ఆ సంవత్సరమే కదా గురికారులే శీనమయ్యకు ఆహ్వానం ఇచ్చింది. రామఐతాళులకు చెప్పుకోదగిన అవమానంకూడ జరిగిందే. అందుకే ఐతాళులగుండెలో 'ఈ పౌరోహిత్యం దండుగే-మర్యాదలేనిపని. ఎదుట ఐతాళులు అని తలవంచుతారు. వెనుక దక్షిణల బ్రాహ్మడు అని వెక్కిరిస్తారు. అందరినీమించి శీనమయ్య ఉపహాస్యం వేరే చెప్పాలా? శంకరుల దుష్ప్రచారం మసాలా కూరింది. అందరిముందు తనకొడుకు పెద్దవాడై కిరీటం పెట్టాలి. తన ప్రతిష్ఠ పెరగాలి-అనేచింత చెలరేగింది.

చెల్లెలు సందేహాలకు సమాధానాలు ఆయనవద్ద లేవు. 'ఇప్పుడే గొడవవద్దు. వుప నయనం చేస్తాము. తరువాత అన్నీకాని' అన్నారు. 'ఈసారి గురుబలం వుంది. ఎండకాలం సెలవుల్లో దైవం మేలుచేస్తే-వుపనయనం' అన్నారు. దీనికి అందరిసహాయం వుండితీరుతుంది. 'ఐతాళుల ఒకడే కొడుకు. దివ్యంగా వుపనయనం. వైశాఖమాసంలో లగ్నం ఏర్పాటయింది. 'ఐతాళుల పెళ్ళికి వేసినట్లే పెద్దపందిరి వేయించారు. ఈసారి శీనమయ్య సహాయార్థం రాలేదు. శీన మయ్యనుచూస్తే మండిపడేవారిలో ఒకరు సుబ్రాయ వుపాధ్యాయ - వారినే పిలుచుకున్నారు.

ఉపనయనంనాడు వడుమున్నూరు మాదప్పయ్యగారేవచ్చి సకుటుంబంగా సహాయం చేస్తామన్నారు. ఆహ్వానాలకు ఐతాళులే అన్నిండ్లకు వెళ్ళారు. శీనమయ్యఇంటికికూడ వెళ్ళి చాల చక్కగా వియ్యాలవారిలాగు 'మాయింటికి తప్పక రావాలి—రాకుంటే ఒట్టు' అని వాగ్దానం చేయించివచ్చారు. ఈ పిల్లవాడు వాళ్ళింట్లో చిన్నవాడు. మాదప్పయ్యగారింట్లో చిన్నవారే లేరు. తమ ముద్దులన్నీ లచ్చనిపైనే కురిపించేవారు. అందుకే నాల్గురోజులు 'కోడి'లోనే వుండి వుపనయనం నెరవేర్చాలని నిశ్చయం చేశారు. ఈ వుపనయనం కుమారుని వుత్సాహం అంతింతనరాదు. పెద్దమ్మ, అమ్మ, నాన్న, తాత, అవ్వ, అత్త అందరికీ అతడంటె గోము ఎక్కువే. అందరికీ వాడు కంటిపాపయే. ఉడిపి మణెగారులే వచ్చారు. కోర్టుకు సెలవులు. అందుమూలాన వకీలు నాగప్పయ్యగారుకూడ వచ్చారు. ఉపనయనంనాడు అంవడ, పూర్ణపు పోళీలు మరిన్ని పిండివంటలు చేశారు. ఒక్కొక్కరికి రెండేసిసార్లు అడిగి, ఇష్టపూర్తి వడ్డించారు. సరసోతికి శీనమయ్యరు పెత్తనంలో జరిగిన సమారాధన మరచిపోలేదు. ఆమె అంతకంటే శ్రద్ధచూపి వడ్డెనలు జరిపించింది.

నోటితీపిమాటలలో సుబ్రాయ ఉపాధ్యాయులు శీనమయ్యకు తక్కువేమీకాదు. శీనమయ్య గురికారులప్రక్కనే మూడు మంచి వుంగరాలుధరించి కూర్చున్నాడు సుబ్రాయరు. అతడు ఏమీ విచారించకున్నా ఐతాళులే వచ్చి 'శీనమయ్యా! అన్నీ సరిగా అందుతున్నాయా?' అని విచారించేవారు. మాదప్పగారుకూడా జ్ఞాపకంతో ఆదిరించారు. శీనమయ్యకుమాత్రం వాసుదేవగురికారులు ఆస్థలంలో లేకపోవడంతో తమ సరిపాటివారు లేరే అని చింతగా మారింది. వారెందుకు రాలేదనికూడ విచారించాడు. గురికారులను అడిగితే 'బహుశా మన కొత్కూరణె పెళ్ళికి వారిని ఆహ్వానించలేదని పగ తీర్చుకున్నారులే' అన్నారు. మళ్ళీ 'ఒకవేళ పిలిచినా కూడ ఈ పిసినారి భోజనం ఎవరు చేస్తారులే' అన్నారు.

ఉపనయనము అయింది. ఇంటికివచ్చిన మణెగారులు, రెవెన్యూ అధికారులు వెళ్లారు. కుందాపురం వకీలుగారూ వెళ్ళిపొయ్యారు. మరి రెన్నాళ్ళకు మాదప్పయ్యగారు వెళ్ళిపోతారు. అంతలో 'లచ్చని ముందుగతి యేమో కొంతచెప్పి వెళ్ళండి'. అన్నది తండ్రితో సత్యభామ. 'మళ్ళీ నేనెందుకు చెప్పాలమ్మా! అన్నీ ఇదివరలోనే చెప్పేశాను. దాసప్పయ్యచూస్తారు అన్నీ. వారైతే అంత తెలివిగల కుర్రవాడు ఆ బడిగడపకు వచ్చివుండలేదని అన్నారు. ఆ బుద్ధికంతా శాంతి హోమంచేసేసి కూర్చుంటారా? ఈ కాలం వకీలో, తహశీల్దారో ఐతే గంభీరం. గౌరవం! పదిఏండ్లు వుద్యోగంచేస్తే నాలుగుపుట్ల విత్తనం వేయవచ్చు. కానీ ఈ పౌరోహిత్యంలో ఏమి గిట్టుతుంది?' అన్నారు.

సరసోతి ఇహ వూరకుంటుందా? 'మీరేమో గౌరవం, ఘనత అంటారు సరే. రామని అనంతరం పౌరోహిత్యం ఎవరు చెయ్యాలి?' అన్నది, వారు 'చెయ్యకుంటే ఏమి మునిగిపోతుంది? ఊళ్లో ఆ వృత్తిచేసేవారు వుండనే వుండరా?' అన్నారు. ఇంతలో ఐతాళులు 'నా జాతకంలో ముగ్గురు మగపిల్లలయోగం వుంది, ఇక ఈ ఇంట్లో పిల్లలే కారా?' అన్నారు.



'జానాను! మూడెందుకు, ముప్పైమూడో. మూడువందలో కావచ్చు. నీకు యాభై ఐదు ఏండ్లయింది. నీదంతా మతిమరపే. నాకేమి? ఇంగ్లీషు, గింగ్లీషు అంటే వూరకేనా? కుప్పలకుప్పల రూకలు కురిపించాలన్నా?'

'సరే లేమ్మా! ఇప్పుడు ఒకరాశి ఖర్చుపెడితే మళ్ళీ పది వెనక్కువస్తాయి. ఎందుకు తొందర? గాలం వేయకుంటే చేపలెల్లావస్తాయి?' అన్నారు ఐతాళులు.

'సంతోషమ్మా. మీరు రూపాయీలు గీపాయీలు అనికూర్చుంటే ఎలాగు? నా మనమడే కదా. కావలసినంత ఖర్చు నేను భరిస్తా. మా కొడుకు నగంలో ఇంగ్లీషు వదిలేశాడంటే నాకు విరక్తి. వీడైనా ఇంగ్లీషు తుదముట్టముగిస్తే మన ఇద్దరివంశాలకు మంచిప్రతిష్ఠే. ఈ మణేగారులు వచ్చారు చూడండి- వారెక్కడికెళ్ళినా ఎంతమర్యాదో తెలుసునా!' అన్నారు మాదప్పయ్య.

'చూడండి, కుందాపురం వకీలుగారు ఈ వేసవిలో కోటకు వచ్చారు, ఇంక ఇక్కడ రాలేదులెండి. వారికైతే ఎక్కడికెళ్ళినా ఆహ్వానం, భోజనం అన్నిసదుపాయాలు ఎంతో గౌరవంగా నడుస్తాయి.'

'మగవాళ్లందరూ లచ్చని భవిష్యత్తుగురించి ఆశ పెట్టుకుంటే నాకెందుకు ఆడదానికి' అనుకున్నది సరసోతి. ఆమెకేమో 'ఇంగ్లీషుచదువు దారి తప్పిస్తుందని' భావన, వారిష్టం- అని వదిలేసి వెళ్ళింది. ఉపనయనంచూచి మాదప్పయ్యగారు వూరు వెళ్ళారు.

సరసోతి అన్నను మరొకసారి పిలిపించుకున్నది-'అన్నా, వాడు బడిచదువే చదువనీ, ఏమైనాకాని. వాణ్ని తాతగారిబుణానికి విడిచిపెట్టవద్దు. నీకొడుకు చదువుకు నీవే వారిపై ఆధారపడరాదు, మనము ఒంటిపూట భోంచేసినా పరవాలేదు. రేపు సీనమయ్యలాంటివారు వెక్కిరిస్తారు జాగ్రత్త? బిచ్చమెత్తి చదివించావనే అపవాదు వద్దు' అని సరసోతి చెబితే ఐతాళులు చాల మెచ్చుకున్నారు.

'వారు చెప్పారనే నేను వారిపై భారం వేస్తానా? అందుకే వాణ్ని కుందాపురమే పంపుదామనుకున్నాను.'

'రూపాయిలు?'

కీవితో ఐతాళులు 'ఐదారువేలు లేవా?' అన్నారు. సరసోతి తృప్తితో వూరకున్నది. అన్ననోటిలోంచి అలాంటి ధారాళంమాటలు వినింది ఆమె తొలిసారి. 'సరే ఎల్లాగైన నగం రొక్కం లేకుంటే మాట్లాడుతాడా?' అని విశ్వసించింది. వాస్తవంగా అన్నీ వివరాలు అతన్ని అడుగకున్నా, ఇంకెవరికీ వూళ్లో తెలియకున్నా దానికి రెట్టింపుమాత్రం వుంది.

లచ్చన్న వేసవిశెలవులు అతి త్వరగా గడచినాయి- ముమ్మందు వాడు ఇంగ్లీషు విద్యకే తయారుకావాలి. వాడు చాలా గర్వంతో ఏటిదిబ్బలు తొక్కుతూ, అందరి ఇండ్లూ తిరుగుతూ తన భవిష్యత్తు విద్యగురించే చాటుకుంటూ ఆనందించాడు. ఒకసారి శీనమయ్య ఐదవకొడుకు కనబడ్డాడు. వానికికూడ అదే సంవత్సరం వడుగు అయింది. వానివెంట పొన్న చెట్లుఎక్కి ఆడుకుంటూవుండేవాడు. మధ్యమధ్య సంధ్యావందనం వల్లె వేశేవారు.

వాడు (శీనమయ్యకొడుకు) వరటడు, వాడు మోటుస్వభావం. శంకరయ్యగారి మఠానికే వెళ్తాడు. ఇద్దరూ సమవయస్కులే. వాడు ఎంత ముద్దుబిడ్డడో, ఈ అవ్వగారి ముద్దుల బాలుడు లచ్చన్నకూడ అంతే. తనకు మంత్రాలు సరిగారాకున్నా, ఎక్కాలు చక్కగా వల్లిస్తనని గర్వం. కాని ఈ పోటీలలో లచ్చన్న నెగ్గజాలకున్నాడు.

రోజులాగే ఒకనాడు ఇద్దరూ ఆటలు, పరుగుపందేలు వేసుకున్నారు. మాటల్లో కథల్లో పోటీలు పందేలు అయ్యాక 'చూడరా! నేను ఇంగ్లీషు విద్యకొరకు కుందాపురం లేక ఉడిపి వెడుతున్నాను' అన్నాడు లచ్చడు. 'ఒరే నేను వచ్చేనెల మా అన్నయ్యవచ్చాడంటే బెంగుళూరు వెడుతానురా!' అన్నాడు ఒరటుడు. వాడే మళ్ళీ 'వైదీకులనోటిలో ఇంగ్లీషు పలుకదంటారురా?' అన్నాడు. 'ఎవరల్లా చెప్పారు నీకు' అన్నాడు లచ్చడు.

ఒరటడు 'మానాన్న అన్నారురా : మంత్రాలు పటపట అనేలాగు ఇంగ్లీషు రాదట. ఎవడో ఒకడే వకీలు అవుతాడట. తక్కినవారంతా పరీక్షలుతప్పి తిరిగివస్తారట. ఎందరో అలా తిరిగివచ్చి నాగలి, గుంటక, గొర్రుపట్టి ఎడ్లను మేపుతారట.'

లచ్చడు 'సరేలేరా, అలాగు నీ గురువుగారు మఠంలో నేర్పారేమో! అందుకేరా మొదట్లోనే సరకారిబడికే వెళ్ళాలంటాడు.'

ఒరటడు, 'సరకారిబడిలో జాతి కులం చెడుతాయటరా, అక్కడికి ఎన్నో తగలేసిన జాతివాళ్లు వస్తారని శంకరయ్యగారు చెప్పారురా.

'అవునులే! మీ అన్నలకు బెంగుళూరిలో మంచిజాతే వుందికదూ! ఎంగిలిపాత్రలు కడుక్కుంటారు కదరా!' అన్నాడు లచ్చడు.

ఇలాగే వాదం జరిగి చివరకు చేతులు కలబడ్డాయి. ఇక ఇద్దరూ మైత్రి తెంచివేసుకుందామని ఒట్టుకూడ తిన్నారు, జత దుక్కుమన్నారు. కాని సాయంకాలం ఇద్దరూ పొన్నచెట్లెక్కారు. ఒక్కొక్కరు ఒంటరిగా విడిగా ఆడుకున్నారు. అప్పుడే సముద్రంలో ఒక పొగవోడ కనబడింది.

అప్పుడు లచ్చడు 'చూడరా! చూడూ ఒరటా దాన్ని 'అగ్‌బోటు' అంటారు. అది పరదేశాలనుండి వస్తుందట' అన్నాడు.



ఒరటడు కొద్దిగా వానివైపు మనసులాగి ఇద్దరూ సముద్రంనీటికి దగ్గరగా వెళ్ళారు. 'అది బొంబాయినుండే వస్తుందటరా! నెలకొకసారి వెడుతుందట. నేనుకూడ ఎన్నాళ్లో చీకట్లో దాని ఎలక్ట్రిక్ దీపాలను చూశానురా' అన్నాడు ఒరటడు. ఇద్దరూ ఇల్లు చేరేసరికి మళ్ళీ గాఢస్నేహం పెంచుకున్నారు. లచ్చడు 'రేపు పడుమున్నూరుకు వెడతానురా' అన్నాడు.

'నన్నుకూడ అన్నయ్యవచ్చి త్వరగా బెంగుళూరికి తీసికెళ్ళుతాడురా' అన్నాడు ఒరటడు.

లచ్చడు తరువాత మూడు నాల్గు రోజులకే తాతగారివూరు వెళ్ళాడు. అక్కడేమో 'దానప్ప మాస్టరుగారికిచెప్పి నేను నీ చదువుసంగతి నిర్ణయిస్తారా' అని తాతగారన్నారు. ఒక నాడు ఐతాళులు మామగారివద్దకే వచ్చారు. ఆరోజు పెద్దలుకూడిన మహాసభ జరిగింది. దానప్పగారు 'ఉడుపియే చక్కనిస్థలం అండీ. రోజూ ఇంటికే తిరిగిరావచ్చు. మధ్యాహ్నం మఠంలో భోంచేసి రావచ్చు. ఖర్చులు తక్కువవుతాయి. ఎక్కడైనా హోటేలులో పడి యాతనతో అఘోరించేపని లేదు' అన్నారు. మామగారు 'దానప్పగారు సరిగానే చెప్పారు' అంటూ తమ అంగీకారముద్రను ఒత్తినారు. రామఐతాళులుకూడ ఆ ఒడంబడికకు అంగీకరించారు.

వారిమనస్సులో ఒకటే భయం. ఏమంటే 'సరసోతి ఇదివరలో అన్నట్లే మామగారింట్లో మళ్ళీ పిల్లవాణ్ని విడిస్తే ఏమంటుందో' అని. మామగారిమూలాన ఖర్చులు తగ్గుతాయిలే అనే సంతృప్తి వారిలో లేకపోలేదు. రాత్రి ఇంట్లో 'పడుమున్నూరిలో పెద్దవాళ్ళను ఎవరిని అడిగినా అంతే. ఉడిపిలోనే విద్య బాగుంటుంది, వసతికూడ' అని అన్నారు. కుంధాపురంలో చాల ఖర్చట' 'మనకు ఎక్కడైతే ఏమి? చదువు సాగాలి' అని సత్యభామ అన్నది. సరసోతి ముఖం వ్రేలాడవేసి 'అన్నా! పరాయివాళ్లింట్లో పిల్లవాణ్ని విడచేసేది ఏమాత్రం మంచిదికాదు. నీకేమో ఒక్కగానొక కొడుకున్నాడు. తరువాత లచ్చనికి ఏమీద అక్కర తగ్గితే కష్టం. నిన్ను బొత్తిగా మంచికూడ పోవచ్చు' అని అన్నది.

ఐతాళులహృదయం కంపించింది. చెల్లెలు మాట్లాడితే దండుగఅని అనుకోరు. తన కొడుకు ఎక్కడ దూరమవుతాడనే సంశయం పుట్టకపోలేదు. పడుమున్నూరు మామగారి మాటకూడ తీసివేసేసాహసం లేదు. సత్యభామపై ప్రేమ తనమనస్సును చాలవరకు పడుమున్నూరివైపే లాగిందంటే తప్పులేదు. ఆమెలోనే సంప్రతిస్తే, ఆమె ఇలాగన్నది, 'నాకు కుందాపురం అంటే కోపమేమీలేదు. అక్కడ ఏమైనా జబ్బుచేస్తే ఎవరు చూస్తారు? ఉడుపిలో పిల్లవాడు మధ్యాహ్నమే వుంటాడు. సంధ్యవేళ పెద్దలదిక్కుతో పెరుగుతుంటాడు. కష్టమే వుండదు.' ఈపద్ధతిలోనే తగినసమాధానం సరసోతికి ఐతాళులు చెప్పి సరసోతిని ఒప్పించారు. 'కుందాపురంలో ఎవరెవరి హోటలుతిండి తినాల్సివస్తుందో; పిల్లవానికి ఒళ్లు వెచ్చగయితే ఎవరు చూస్తారు? అప్పుడప్పుడు ఇక్కడికిమాత్రం రావద్దా? వారానికి ఒకసారి

తలంటి స్నానం వద్దా? ఇవన్నీ హోటేలులో ఎవరు చూసుకుంటారు?' అంటూ బిత్తాళులు ఎన్నో కారణాలు చెబుతూవచ్చారు. 'పిల్లవానికి పదేళ్లే, కాని, అక్కడే వుండనీ' అని సర సోతి ఆమోదించింది. కానీ ఆమెమనసులో పిల్లవాణ్ని సరకారీపాఠశాలలో వేసిందే ఘోర ప్రమాదం అనే అభిప్రాయంమాత్రం తుడిచిపెట్టేది కష్టమయింది. ఆమాట ఆమెను అప్పు డప్పుడు కలవరపెడుతూనే వుంటుంది.

లచ్చన్నవిషయమై తర్కవితర్కాలు ఇంటిలో మరింక సాగలేదు. పిల్లవాడు పదు మున్నూరిలోనే వుండాలి. ఉడిపికి వెడుతూ, వస్తూ చదువుకోవాలి అనేదే నిశ్చయమైంది. ఇంగ్లీషు రావాలనే అక్కడ హైస్కూలులో లచ్చన్ని చేర్చారు. ఆవేళ దాసప్పయ్యగారు కూడ లచ్చని వెంటనే హైస్కూలుకు వెళ్ళారు. చిన్న పాఠశాలకాలంలోకూడ లక్ష దీపోత్సవాలకు ఉడిపికివెళ్ళే అలవాటున్నది లచ్చనికి. ఉడిపితో దేవాలయం, 'పేటలు' ఉత్స వాలు చూచినప్పుడల్లా తాను అక్కడే వుండాలని కుతూహలపడేవాడు. ఇక తనకోరిక రోజూ తీరుతుంటే వాని వుత్సాహంపొంగు వేరే వర్ణించాలా? తెల్లవారి స్నానం ముగించు కొని, ఇష్టమొస్తే పుస్తకాలు చేతబట్టుకుంటాడు. తరువాత త్వరగా ఇంత భోంచేసి, సంచి వీపున పెట్టుకొని బడికి వెడతాడు.

ఇంటినుండి ఉడిపికి, మళ్ళీ ఇంటికి మూడు నాల్గు మైళ్ళనడక వేసరిక కలిగించకున్నా దేహానికి శ్రమమాత్రం కల్గించింది లచ్చనికి. కాని దారిలో ఎవరో ఒకరు స్నేహమవుతారు. తరగతిపిల్లలుకూడ చేరుతారు. బడిలో చదువు, ఆటలు. మధ్యాహ్నం విరామకాలంలో పెద్దలుచూపిన హోటేలులో రెండవసారి భోజనం, ఐదుఘంటలకే తిరుగుప్రయాణం. దారి వెంబడి ఆటలు, పాటలు అన్నీ ముచ్చటగానే వుండేవి. మనుమడు శ్రమపడివస్తాడే అని, మామ్మకూడ ఎదురుచూచి తలుపుదగ్గరనే స్వాగతం చెప్పేది. వంటగదిలో చిరుతిండి హాజరు.

ఈవిధమైన క్రొత్తజీవితసరళి వానికి చాల గర్వకారణం కాజొచ్చింది. వానికి పట్టణ వాసుల చురుకుదనం, మాటచాతుర్యం చాల అబ్బినవి. వానిమాటలలో ఇంగ్లీషు చదివేవారి ధోరణి బాగా కనబడేది. మూడునెలలకైనా ఒకసారి 'కోడి' గ్రామంవస్తే అత్త, అమ్మ, పెద్దమ్మలతో ఇంగ్లీషు కలిపిమాట్లాడి సంతోషింప జేస్తుండేవాడు లచ్చడు. రామబిత్తాళుల వుల్లాసమంతా మిన్నుముట్టింది. కుమారునికి తప్పకుండా నాల్గేళ్ళలో వకాలతుచేసే యోగ్యత వస్తుంది అనేనమ్మకం దృఢపడింది వారిలో, లచ్చడు ఎలాగైనా శీనమయ్యగారి చిన్నకొడుకు ఒరటనితోచేరి కొన్ని ఇంగ్లీషులోనే దబాయిస్తామని అభిలాష కల్గింది. కాని ఒరటడు బెంగుళూరు చేరుకున్నాడు.

ఏండ్లు గడిచేకొద్దీ లచ్చనికి తనవూరు వెళ్ళాలనేఅపేక్షకూడ సన్నగిల్లింది. బడికి ఆటవిడుపున్నా తనవూరు వెళ్ళాలనిలేదు. ఉడిపిలోనే తిరుగులాడి కాలక్షేపం చెయ్యాలనే



ఆశ ఎక్కువైంది. ఎవరైనా అడిగితే గొప్పగ్రంథాలను, ఎన్నో లావుపాటిపుస్తకాలను చూపెడుతాడు. 'చదువు చాల వుందండీ' అని సమాధానం చెబుతాడు. సరసోతికిమాత్రం సెలవురోజులలోకూడ వాడు ఇంటికిరాకుంటే సరిపడేదికాదు. రామబిత్తాళులతో ఆమె, 'చూడన్నా, వానికి ఇంటినీడకూడ అక్కరలేదు. లేకుంటే ఇంటిపైన అపేక్ష అక్కరలేదా? చెప్పు' అంటూండేది. 'అవునే, చదువు ఎక్కువగావుందో యేమో!' అన్నారు. 'అన్నా! ఏమైనా చెప్పు. వానికి మనతిండికూడ గిట్టదు. వాటికి రుచి లేనేలేదట. వాళ్ళింటిరుచి మన కెక్కడ చేతనవును? కాని నాకేమి?' అనింది సరసోతి. 'చూడు, ఈవేళ కొయ్యగూర పులుసు ఏమైంది చెప్పు, వానికొరకే గారెలు తయారుచేశానే, నీవు తిన్నావేగాని వాడు ముట్టింటేసరి. ఎందుకు? వాళ్ళ అమ్మమ్మలాగు నాకెల్లా వస్తుందిలే' అని సణిగింది సర సోతి. సత్యభామకుకూడ కొడుకును అక్కరగా తినబెట్టాలని బియ్యం, కుమ్పెర రుబ్బి చేతులు పడిపోయింది. తినటానికి కాజాలు చక్రాలు (చక్కిలాలు) కరణకాయలుకూడ చేసింది. కాని లచ్చడు ఒకటికూడ తాకలేదే! ఆమెకుకూడ విసుగే వచ్చింది. అందుకే ఆమెకూడ కొడు కును నిందించేవారిలో భాగస్వామిని అయింది. తండ్రిఎదుట అన్నీ అంటుంటే వాడు వూరుకోగలడా? అక్కడే వాడు కన్నెర్రచేశాడు. కన్నీరు ఉప్పెనలాగ పొంగింది. సగంలో తినటం మానేసి లేచి బయటికి వెళ్ళిపొయ్యాడు. రామబిత్తాళులు చెలరేగి 'ఒరే బొట్టికిన వేలుడుకూడ లేవే, ఇంట్లో అంటే ఎందుకురా ఈ ఆగడం నీకు' అని కోపించారు. లచ్చడు మళ్ళీ భోంచెయ్యలేదు. మరేమీ వాసనకూడ చూడలేదు.

అల్లాగే, ఎల్లాగో మూన్నాళ్లు గడిచాయి. చివరకు 'అమ్మా నాకు చదువు చాల వుంది. నేను తాతయ్యఇంటికే వెడతాను' అని వెళ్ళిపొయ్యాడు. ఆనాటినుండి వాడు సెలవులలో తండ్రిగారింటికి రావాలంటే పట్టుదల చూపడు.

ఇల్లాగే ఐదేళ్లు గడచాయి. లచ్చడు థర్డుఫార్మ్ (ఎనిమిదవ తరగతి) చదువుతున్నాడు. బిత్తాళులు ఒకసారి ఉడిపికి ఎందుకో వెళ్ళారు. బడిగుర్తు తెలిసికొని అక్కడికే వెళ్ళారు. ఎల్లాగయినా కుమారుణ్ని కళ్ళారచూచి సంతోషిద్దామనే వెళ్ళారు, చూచి వెళ్లేటప్పుడు 'అయ్యో! లచ్చన్నా అమ్మావాళ్లను చూడాలని అనుకోవారా? మొన్నటిదాకా ఏడురోజులు సెలవుల్లో ఎందుకురా రాలేదు?' అని ప్రశ్నించారు. 'అవును, సెలవులవెంటనే పరీక్షలువస్తే ఏం చెయ్యాలి' అన్నాడు. 'పోనీలేరా వేసంగిసెలవులు ఎప్పుడురా వస్తాయి?' అన్నారు. 'రెండేవారాలు'. 'సరే అప్పుడైనా వూరికి తప్పక రావాలి'. 'హూం' అని లచ్చడు వూర కున్నాడు. 'ఒరే! దైవం మేలుచేస్తే త్వరగా వివాహంకూడ జరిపిస్తారా?' అంటూ బిత్తాళులు చెల్లెలి పెండ్లిసంగతి గుర్తుకు తెచ్చారు.

ఎండకాలం సెలవులు వచ్చినవి. లచ్చడు తండ్రి ఇంటికిపోక తప్పలేదు. చాల నందుకు రామబిత్తాళులు మామగారితో కొడుకుపై అపేక్షతోనే కానీండి, కొంత దురుసు గానే 'పిల్లవాణ్ని సెలవులు రావడంతోటే వూరికి పంపండి' అని అన్నారు. వారివయస్సు

యాభై ఐదు. పెండ్రుకలు తెల్లబడ్డాయి. ఇన్నాళ్ళూ సుబ్బి అందరిమమతకు పాత్రురాలుగా వున్నది. అందుకే లచ్చుడు లెకున్నా అందరికీ ఎల్లాగో పొద్దు గడిచేది. ఎల్లాగూ సుబ్బికి పన్నెండవఏడు రానేవచ్చింది. తండ్రికి శక్తిలేదు. ఇంతవరకు అయిన ఆలస్యమే గొప్పది. ఇక ఆగరాదు. సుబ్బి అత్తగారింటికివెడితే ఇంట్లో ఎవరూ పిల్లవాళ్ళుండరే అనేబెంగ, యావత్తు ఐతాళులను చుట్టుకుంది. ఐతాళులకు మూడవసంతానం తప్పక వుందని జాతకం చెపితే నిరీక్షిస్తూ కూర్చుంటే వృథాఅయింది. వారి పౌరోహిత్యం పరంపరను కొనసాగించేవారు కూడ ఇంకెవ్వరూ లేరు. లచ్చుడు దూరముంటే మంచిదని అనుకోలేదు వారు.

లచ్చుడుమాత్రం సెలవులోవచ్చి ఒకవారం గడవాకకూడ ఇంటిముఖం చూడాలనుకోలేదు. తాత మూడుసార్లు చెప్పినా వినిపించుకోకుండా దినము వుడిపికేవెళ్లి అక్కడిక్కడ తిరిగి అలసివచ్చేవారు. కోడిగ్రామంఅంటే అడవిలో వడ్డట్టే, వానికి రావాలనే మనస్సులో లేదు.

ఐతాళులు కొడుకు వస్తాడేమోనని దినమూ ఎదురు చూస్తుండేవారు. చాల విసుగెత్తింది. ఇక తీరికకూడ లేదు. వసుణ్ని వెనకేకార్యక్రమం చేబట్టాలి. ఊరివాళ్లేమో 'సుబ్బి గేదెలాగు పెరిగింది. సమర్తాడినానే ఆ ఇంగ్లీషు ఐతాళులు పెళ్ళి చేస్తారేమోలే' అని వెక్కిరించారు. వారిలో శీనమయ్యరు అగ్రగణ్యులు. వారేమో తమ ఇద్దరు కొడుకులకు పెళ్ళిళ్లుచేసి కీర్తి బడశారు. పెళ్ళికి నాగవేణి పిల్లలనుకూడ తేవలసివుండేది. వాస్దేవ గరికారుల అజ్ఞకూడ అదే. కాని పెద్దకొడుకుకు తనపై కోపం వస్తుందేమో అనే భీతికూడ లేక పోలేదు. తనను ఊళ్ళో గొప్ప శ్రీమంతునిగా చేసిన కొడుకంటే భయం వద్దా?

అదీకాకుండా వారు ఒకమారు బెంగుళూరు వెళ్ళివచ్చారు. తన కొడుకు వైభవం, వ్యాపారంచూచి 'వారు నేలపై నిలబడటంలేదని' చెప్పవచ్చు. అల్లాంటి శీనమయ్య ఐతాళులను వెక్కిరించకుండ వుంటాడా? వారిమనసు ఎల్లాగుంటుంది? ఎవరో అన్నారు, 'ఏమండీ, మీ సుబ్బిని శీనమయ్యరు రెండవకొడుకుకు ఇయ్యరాదా' అని. సరసోతి వెంటనే 'బాగుంటుంది' అన్నది. 'వారిగొడవకు మనం వెళ్ళరాదు, వద్దు' అన్నారు ఐతాళులు. ఎవరెవరో మయ్యరుచెవిలో ఈసంగతి వేశారు. 'ఇంగ్లీషు ఐతాళులబిడ్డ మాకు వద్దు. మాకేం పిచ్చి పట్టలేదు' అన్నారు. ఐతాళులకుమారుణ్ని ఇంగ్లీషువిద్యకు పంపిందే అపహాస్యంగా తోచింది శీనమయ్యకు. సుబ్బి ఎదిగేకొద్ది దినదినం యుగంలాగే తోచేది. సత్యభామకూడ వూళ్లో అక్కడిక్కడి ఛలోక్తులను, చేష్టలను సహించి నొచ్చుకున్నది. 'మీరు నాన్నతో సంప్రతించండి- మంచిసంబంధం చూచిపెడతారు' అన్నది. సరసోతి 'అన్నా, చేసుకున్న ఒక సంబంధాన్నే ఊరివాళ్లు సగం శివల్లి అని ఏమో ఎక్కిరిస్తే మరొకసారి పదుమున్నీరువైపు వద్దులే'అని భయంపుట్టించింది. ఇదికూడ సత్యదూరమేమీ కాదు. ఐతాళులు తల గోక్కుంటూ 'ఏమో సరసోతి! నూటఎనిమిది జాతకం గుర్తులను పోల్చుతున్నాను. మన గోత్రానికి యోగ్యులైనవారు దొరకడంలేదు. ఈ శివల్లి అనేమాట వేరు. సుబ్బి నక్షత్రంచూచి తల్లిదండ్రులకు



గండం అని బెదురుతున్నారు' అన్నారు. అప్పు, అమ్మ గతించినవరుడు దొరకాలి. రూపం గుణంకూడ కలవాలి. సరసోతి, 'అన్నా - నీను యాభై వరహాలబంగారం పెడతానని చాటించు, చక్కనిజాతకం వరుగెత్తుకుంటూ వస్తుంది. నీవు గట్టి ముష్టివాడని అందరికీ భయం. మా మందర్తి ఇంట్లో ముగ్గురికి పెండ్లికాలేదు. ఒకరికైనా సుబ్బి జాతకం కుదరదా?' అన్నది.

సరసోతి చెప్పిందికూడ నిజమే. సత్యభామకు ఇష్టమైతే ముందువిషయం. ఆరాత్రి సత్యభామతో ప్రస్తావించారు. రెండువరువుల నేల నడువాలి. కాని ఆ మందర్తి వెంకప్ప గారికి ముగ్గురు కొడుకులు. అందరూ చక్కగా వున్నారు. మొత్తం రెండువందల సర్కారు పన్ను కట్టే కుటుంబం. తినడానికంతా కష్టంలేదు. మనం కొత్తవారు కాము. వెడితే కుదరవచ్చు. వాళ్ళపిల్లలకు తల్లి లేదుగదా! వారు దేనికీ భయపడరు. నేనువెడితే కాదనరు. సత్య 'నాకేమీ తెలిసినవారు కారు. మీరు అంగీకరిస్తే సరి, సుబ్బికికూడ వూరిమాటలు విని వేసరికతో మనస్సులో రోగం మెదపైకివస్తే తెలుస్తుంది' అన్నది.

మరునాడుకూడ ఇంట్లో పెళ్ళిసంగతి చర్చ సాగింది. సరసోతికూడ 'మందర్తి ఊరు మంచిదే. తూర్పున ఉంది. దైవం మేలుజేస్తే, వాళ్లు ఒప్పుకుంటే మంచిది-వెళ్లు. గడియ మంచిదే. తూర్పున ఉంది. ఈ వెక్కిరింతలుండే వూళ్లోమాత్రం వద్దు' అన్నది. పారోతి, సత్యలుకూడ ఆలాగేకాని అన్నారు.

ఐతాళులు మరునాడు వెడదామనుకున్నారు. తెల్లవారి స్నానం, దైవప్రార్థన, పిదప ప్రక్కన స్నానంచేసిన సత్యకూడ నిలబడింది. సుబ్బికూడ వచ్చింది. ఐతాళులు మంగళారతి చేసి 'భగవంతుడా, మర్యాద దక్కించు' అన్నారు- ఏమో అనుకొని 'లాభం-మిగులు' అనుకుంటూ సంతోషంతో కేకలుపెడుతూ బయటికి వచ్చారు. సరసోతికికూడ అంతా గర్వకారణమే-అందరూ వుత్సాహంతో వున్నారు.

'వెళ్లి జాతకం తెస్తాను' అంటూ వేగంగా వంట చేయించారు. భోజనం అయింది. పంచాంగంచూచి విషఘటియలను తప్పించి పురాతనం పచ్చళాలువను కప్పుకొని వరాన్వేషణకై బయలుదేరారు. మండే ఎండ, మాడే ఇసుక ఎలాగైనా వరవాలేదు. తదేకదీక్షతో బారకూరుమార్గం వెళ్లారు. సాయంకాలం ఝాముపొద్దు మిగిలినప్పుడే మందర్తి బంధు దర్శనం చేసుకున్నారు. ఇంటి తలవాకిలివద్ద వెంకప్పయ్యగారే కనిపించారు. దారివెంట శుభ శకునాలే- వారు చక్కగా వుపచారం చేశారు. 'సరసోతి బాగున్నదా' అని అడిగారు- వారి తమ్మునిభార్యయే సరసోతి, పెళ్లితరువాత రెండేండ్లకే సరసోతికి వైధవ్యం రావడంతో మందర్తివారు ఏకో ముభావంగా వుండిరి. సరసోతిమాత్రం వెళ్ళివస్తూ బంధుత్వాన్ని నిలబెట్టింది. వారికి సరసోతి అంటే చాల అక్కరే.

వెంకప్పయ్యకు 60 యేండ్లు. వారికి మూడు వివాహాలైనవి. రెండవభార్యకు ఇద్దరు ఆడపిల్లలు, మూడవఆమెకు ముగ్గురు కుమారులు. పెద్దవానికి ఇరవై ఏళ్ళు.

ఐతాళులు తాము వచ్చినవుద్దేశ్యాన్ని తెలిపారు. 'ఐతాళులూ, నేను వయస్సుమూలాన ఎక్కడికీ వెళ్ళను, జాతకం అడగను. పెద్దవానికి మొదట పెళ్ళి కావాలి. ఋణంవుంటే పెళ్లి కాని' అన్నారు వెంకప్పయ్య.

సరే, ముగ్గురిలో ఇద్దరి జాతకాల నిచ్చారు. ఐతాళులు చాలసేపు లెక్కలువేసి 'మొదటిది మధ్యమం- రెండవది ఉత్తమం. మీరెల్లాచెబితే అలాగు' అన్నారు. 'కానీ పెద్ద వానికికానిదే మరొక ఆలోచన వద్దు' అన్నారు వెంకప్పయ్య.

ఐతాళులకు ఏదైనా అనుకూలమే. 'ముఖ్యంగా, ఏదో ఒకయోగమే మళ్ళీ మన ఇండ్లను కలుపుతున్నదండీ' అన్నారు. అదేశాస్త్రి తీర్మానమైంది ఆ ఎండకాలంలోవే వివాహం జరిపించాలని. నాటకాలలో చెప్పినట్లే ఐతాళులు వాయువేగంతో ఇల్లు చేరారు. ఇంట్లో అందరికీ ఆనందమే- సరసోతి మేనగోడలితో 'బంగారంలాంటి ఇల్లు- నీకు ఇక్కడున్నంతసుఖమే అక్కడ- లేదావుండదు' అన్నది. సత్యభామకూడ తృప్తిగానే వుంది.

ఐతాళులు లగ్నం నిశ్చయించుకుని 'ఎవరికీ చెప్పవద్దండి, శీనమయ్యకానీ, శంకర వర్మలుగానీ విఘ్నం కల్గించరాదు' అన్నారు.

ఈ ఉత్సాహం వుడికినట్లే ఐతాళుల వళ్లుకూడ కతకత వుడికింది. ఐతాళులు బాగా తిరుగుతారు, మాట్లాడుతారు గాని జ్వరం కొద్దిగా వచ్చినా ఓర్వలేరు. అందుకే ఆనాడు అతి గొడవ చేశారు. అంతలో లచ్చని జ్ఞాపకం వానికి సెలవులు మొదలైనవి, మనలను చూడాలని ఆశ లక్కరలేదా? అబ్బా! ఈకాలం పిల్లలట' అని కేకలు పెట్టారు. వారి మనోవేదన కూడ మరిగింది. అందుకే సరసోతి సూరణ్ని పడుమున్నూరికి పంపింది. మరునాడు సాయంత్రం నిస్తేజంగా లచ్చుడు ఇల్లు చేరినాడు. 'ఒరే, సెలవులువచ్చి ఒకవారం అయిందంటావు? ఎందుకురా? ఇంటికి రాలేదు' అని గద్దించారు. 'నేను చచ్చాక వద్దామనుకున్నావో' అని వెటకారాలు పెట్టారు. అతడు తండ్రితో చీవాట్లు ఎన్నడూ తినలేదు. దర్పం తగ్గింది. పసివానిలాగా ఏడ్పుతో మూలబడ్డాడు. రాత్రి భోంచేయలేదు. పారోతి, సరసోతి చెప్పిందంతా వ్యర్థమే- వాడు మాట వినలేదు.

ఐతాళులు పడకనుంచి లేచారు. 'తూర్పునీళ్ల పడలేదో, ఎండనుండో' అని అనుమానం విడువలేదు. జ్వరం విడిచింది, కొద్దిగా అశక్తిమాత్రం వుంది. మళ్ళీ వారు పనిలో తిరగసాగారు. 'పిల్లవాడెక్కడ?' అన్నారు, లచ్చుడు ముఖం దించి ఎదుటికి వచ్చాడు.

'కన్నవారిని మరువరాదురా' అని తమ వుపదేశం రెండవఅధ్యాయం ముగించారు. సరసోతి 'పోనిద్దూ! పిల్లలు ఆడుకుంటారు, నాల్గునాళ్లేగదా! రాత్రి నీ తిట్లకే వాడు వుపవాసం చేశాడు, చాలు' అన్నది.



'మీరు వాణ్ని కొండకోతిని చేశారు. నేను ముసలివాణ్ణవుతున్నాను. నాతో కూర్చొని ఘంటఅయినా మాట్లాడాలని లేకుంటే వాడుంటే లాభమేమి?' అన్నారు.

లచ్చునికంట్లో కన్నీటివరదలు, సరసోతి మళ్ళీ అన్నకే బుద్ధి చెప్పవలసివచ్చింది.

ఒకప్రకరణం ఆఖరు. ఐతాళులు జ్వరం నయమయింది. తమ సచివులైన సుబ్రాయ ఉపాధ్యాయులను పిలిచి పెళ్ళి ఏర్పాట్లు చేయించారు. పందిరి, సంతసామాను, బంగారు దుకాణం అంటూ అంతట సంచారంచేశారు. సత్యభామకూడ తల్లిగారింటికివెళ్ళి వచ్చింది- మాదప్పయ్యగారుకూడ 'జ్వరాల కొంపనమ్మా!' అన్నారు. అదివిని, 'తలవ్రాతకొద్దీ జరుగని పరవాలేదు' అన్నారు ఐతాళులు.

తండ్రి అనేకంగా వివాహకార్యకలాపంలోనే తిరుగులాడుతున్నారు. లచ్చుడు వారు ఇంటికి వచ్చినప్పుడుమాత్రం తలవంచి కూర్చుంటాడు-మిగతకాలంలో అక్కడిక్కడ తిరుగు ళాడుతుంటాడు- 'పడుమున్నూరికే వెళ్లాలి'అనుకున్నా చెల్లెలిపెళ్లికి ముందు వద్దనుకున్నాడు.

ఐతాళులే ఒకసారి 'లచ్చన్నా, నావెంట కుందాపురం సంతకు వెడదాము పద' అన్నారు. ఇంట్లో ముక్కుపట్టుకుని కూర్చుంటే ఏం బాగు-'వద్దు, రాను' అనేధైర్యం చాల లేదు. పగలంతా ఎండలో చెప్పులు లేకుండా నడచి, సంతలోతిరిగి ఇంటికి రానడం జరిగింది. ఆ కాలునొప్పికే మూన్నాళ్లు మూలబడ్డాడు. వానికే వుపచారాలు, పెళ్ళిరోజులలో బంధువులాగే వుండిపొయ్యాడు.

'ఈ ఇంగ్లీషునేర్చిన పిల్లలంటే ఇంత మొద్దులని నాకు తెలిసియుండలేదు' అని ఐతాళులే చెప్పాల్సింటే మరేమి? అందుకే లచ్చుడు ఇంటిపనులలో చొరవతీసికొని వుండి వుంటే ఈపాటికి 'ఇది అవును, కాదు' అనేజ్ఞానం వచ్చివుండేది. తల్లికూడ 'లచ్చ-అప్పడా లైనా చేసివ్వరాదారా, మూడు నాల్గువేల అప్పడాలు కావాలిరా- ఊరకే ఎందుకురా కూర్చుంటావు' అన్నది. ఆమాటలు వినలేక వాడూ పనికి దిగినాడు. అప్పడం పిండిని పీటలకు, కర్రకు అంటించితే మిగిలినవారు దాన్ని విడిపించాల్సి వచ్చింది.

లచ్చునికేమో ఎంత తొందరగాఅయితే అంత తొందరగా పడుమున్నూరికే వెళ్లాలని వుంది- వానికి ఇంట్లో పొద్దుపోదు. తాను, ఒరటనితో పొన్నచెట్లపై చిన్నతనాన ఆడుకున్నాడు. కాని ఇప్పుడు తోటలో వూరకేతిరిగి, వేసారితే సముద్రం ఒడ్డుకేవెళ్ళి రంగు రంగుల గవ్వచిప్పలను ఏరుకొని ఆడుకునేవాడు- అప్పటికి ఇంకా వేళకాకుంటే తడిమట్టిలో కాలువలు, సురంగాలు త్రవ్వి నీళ్లు పడతాడు- లేకుంటే సముద్రపుకెరటాలను ఎంచుకొనేవాని లాగు పడమటి ముఖంపెట్టి చూస్తుంటాడు. 'ఈ జన్మలో తనకు గొప్పపరీక్షే వచ్చిందే, తండ్రి డబ్బున్నా కూలీలాగా కష్టపడుతున్నాడు-ఇంట్లో అందరూ అంతే' అని ఆలోచించాడు.

రామఐతాళులు కుమారునినుండి గౌరవం. ఉత్సాహం అక్కరలను పొందాలనుకుంటే లచ్చునికిమాత్రం వారందరిపట్ల తాత్సారం, జుగుప్సలు హద్దు మీరినవి.

సంతనుండి మోయలేనన్ని మిరపకాయలు తండ్రి నెత్తినపెట్టుకొని మోస్తుంటే లచ్చ డనుకున్నాడు, 'తండ్రికి రెండణాలు గతిలేదా, కూలి కివ్వడానికి' అని. తడి ఇసుకలో ఒకగీత గీస్తాడు. తండ్రిపై ఎన్నికారణాలవల్ల తిరస్కారం కలిగిందో అన్నింటినీ గీతల్లో ఎంచుతాడు. కెరటాలు అన్నింటినీ ముంచేస్తే, మళ్ళీ గీస్తాడు. అల్లాగే చీకటిపడి తన వేసరికతో గీచినవన్నీ కనబడకుంటే, సరే పొద్దు పోయిందని వెళ్ళిపోతాడు.

# 13

సుబ్బి వివాహం సమీపించింది. దానికిముందే వారంరోజులముందుగానే పడమున్నూరు మాదప్పయ్యగారు, వారిభార్య వచ్చారు. ఇదివరలో నాల్గయిదుజాతకాలు చూశారు. ఈ మంత్రిజాతకం వారికికూడ సంతోషంగానే వుంది. తమ పూర్వీకులకు మంత్రివారికికూడ ఏదో బాదరాయణసంబంధం వున్నట్టే తెలిసివచ్చింది. ఎల్లాగో తామే అల్లుని ఇంట్లో కొంత ముందుపడి చిల్లరపనులన్నీ చేయించారు. ఐతాళుబాధ్యతలు కొంత తేలికయినవి. కాని సుబ్బాయ ఉపాధ్యాయులకు అంత తృప్తికాలేరు. కానీ పెళ్ళి నాల్గునాళ్లు సంతుష్టిగా హాయిగా జరిపించారు. సరసోతికిమాత్రం తన మగనింటికే మేవకోడలు పడిందంటే చాల ఆనంద మనిపించింది.

ఈ పెళ్ళిరోజుల్లో లచ్చదు ఎమైనాదో పరిశోధన చేసేదికూడ కష్టమయింది. తాత, తండ్రిమాత్రం పిల్లవాడు ఇంగ్లీషుచదివి బి. ఎ. పూర్తిచేసి వకీలు అయితే, తాసీల్దారు అయితే చాల బాగుంటుందని కలలు వదల్లేదు. లచ్చన్ని ఎవరుపిలిచినా దగ్గరకు రాడు. వస్తేకూడ మూగనోములో కూర్చుంటాడు. ఐతాళులు చాల జుగుప్సతో 'ఒరే కనీసం యస్సు, నుస్సు అని అయినా ఇంగ్లీషులో వాగరా' అన్నారు.

లచ్చదు పెళ్ళిపందిరిలో దొరకడు. పొన్నచెట్లపైననే వాని ఠికానా. తప్పితే సముద్రం ఇసుక, చిన్నచిన్నపనులకుకూడ శ్రద్ధతో ఐతాళులే వెళ్లాలి. 'వచ్చినవాళ్ళకు నీళ్లకూడ ఇయ్య బుద్ధికాదేమో? ఇంగ్లీషుచదివితే ఇంతేనేమో! ఇంటివారే పరాయివారులాగు తిరుగాలి కాబోలు' అన్నారు ఐతాళులు. ఎవరైనా లచ్చనికి 'తాంబూలం తేరా, గంగోదకమైనా అందియ్యరా' అని పనిచెబితే తాంబూలం అంటే ఆకులు, నీళ్ళంటే చెంబుమాత్రం తెచ్చి పెడతాడు. ఐతాళులు విసుగుకొని 'ఈ ఇంగ్లీషు నేర్చినవారికి ఇంటిపనులు చెప్పరాదని' మౌనంగా వుండేవారు.

లగ్నం ముగిసింది. చుట్టాలు ఊళ్ళకు తిరిగివెళ్లారు. తండ్రి బాధిస్తే సుబ్బివెంట



మంత్రికి లచ్చదుకూడ వెళ్లాడు. అక్కడ పిల్లలతోగాని పెద్దలతోగాని కలిసిమెలిసి వుండ లేదు, సరిగా మాట్లాడడు, పెండ్లిపందిరిదింపి అన్నీ అందరిండ్లూచేరినాక ఐతాళులు, 'మామ గారూ! ఈ లచ్చనిదే నాకు బెంగ' అన్నారు.

'ఏమండీ, వానికి ఒంట్లో బాగాలేదా' అన్నారు ఆదుర్దాగా మామగారు.

'వాడికేమీ రోగంలేదు. మంచివంటలు, అనుపానాలు బాగా కాజేస్తాడు. కాని ఇల్లాంటి మూర్ఖుడు అని నేను కలలోకూడ అనుకొనివుండలేదండీ. ఏపనీ చేతగాదు, వినిపించుకోడు, ఇల్లాంటివాని కెందుకు? ఇంగ్లీషు పై చదువు?'

'మీరు చెప్పింది, విన్నదే నమ్మకండి. మా అనిదను అడిగితే వానిలాంటి తియ్యని కలియుగబాపుమాటలు ఎవరికీ రావని చెబుతుంది. చాలా చురుకైనవాడట. ఇక్కడేమో రాక పోకలు తక్కువ గనుక. ముక్కుదాడు వేసినట్లయింది.'

అంతలో సుబ్రాయవుపాధ్యాయులు వచ్చారు. చేతిలో ఏవో పాతకాగితాలు పట్టు కున్నారు. వస్తూ 'ఐతాళుబ పెండ్లిమాత్రం దర్జాగా అయిందికదా! ఆరోజే ఆ దరిద్రుడు శీనని ఇంటి పెళ్ళివారి ఊరేగింపేలేకుంటే ఇక్కడికి వచ్చిన రెట్టింపుమంది వచ్చేవారు' అన్నారు.

'వారికథ తగలెయ్య. మా సుబ్బి లగ్నానికే తన ఇంట్లోకూడ కుమారునిలగ్నం ఏర్పా టెందుకు చెయ్యాలి? ఎన్నో మంచిలగ్నా లున్నాయిగా. అందులో వాసుదేవగురికాపుల ఇంటి పెళ్ళి పిల్లమూలాన మన ఇంటికివచ్చే మరింతమంది అతిథులూ ఆగిపొయ్యారు. ప్రతిదినం నూరార్లవిస్తళ్లు అన్నంతోమండికి పెట్టాల్సివచ్చింది. పోనీలేండి, ఆ నెపంతో పాలికాపులు బెస్తలు, బిదలు కడుపునిండా తిన్నారులే. వాళ్లఅదృష్టం మంచిది. నాల్గునాళ్ల వాళ్ళందరికి పండుగ అయిందిలే' అన్నారు ఐతాళులు.

'సరే మీ లచ్చ డెక్కడ?'

'వాడా! పొన్నచెట్లు వెదుకండి. వానికథలే, చరిత్రలే వర్ణిస్తున్నా మామగారితో. పిల్ల వాడు ఇలాంటి అప్రయోజకుడయ్యాడనే మంటనండీ.'

'లచ్చడు అప్రయోజకుడంటారా! ఎవరండీ అన్నారు?'

మాదప్పగారు నోటిలోని తాంబూలం వుమ్మివేసి, 'రామఐతాళులవారికి లచ్చడు ఇక్కడ ముభావంగావుంటే విసుగుతో అన్నారంటి' అన్నారు.

'ఏమండీ, లచ్చణ్ని నిష్ప్రయోజకుడంటారు! మంచిగానే చెబుతారండి.'

మాదప్పయ్యగారు కొంచెం తెలివితో తమ తాంబూలాన్ని పూర్తిగా వుమ్మివేసి 'వాడు ఊరకుంటే ఎవరికైనా కోపమేనండి' అన్నారు.

సుబ్రాయగారు 'అవునులేండి మిన్నకున్నవారంటే ఎవరికైనా అలాగే లెండి. నేను లచ్చణ్ని వెదుకుకొని ఎందుకువచ్చాను తెలుసా? ఇందుకే అని చంకలోని పాత కాగితాల

శత్తిను ముందుజరిపి, దానికి చుట్టుకొన్న బల్లిపొరలు, ధూళిని దులిపి 'ఈ రికార్డు చదివిదామని వచ్చానండి' అన్నారు.

'సరే అదొక్కసంబరమే బాకీ. రికార్డులు చదివించేది, రికార్డు ఏ రాజుల ఇంగ్లీషో- ఈ సిగ్గరి అవికూడ చదువగలడా?' అని తండ్రి అన్నారు.

. మాదప్పయ్య 'ఏమి రికార్డండీ అది?'

'సరే, చూడండి—వెనుకటికి మా ఇంటితూర్పునవున్న భరిపొలాలు దేవునిసేవలకై వుంచారే, దానికి సరియైనలెక్కలు దొరకలేదు. ఈ శీనమయ్య వాటిని అక్రమించేశాడు. నావద్దనున్న కొంచెం రికార్డును మీ మనుమనివద్ద చూబెట్టానండీ- అంతా శుభ్రంగా చదివి అర్థంకూడ చెప్పాడండి- ఈ పాతకట్టలుకూడ చదివిస్తే మరికొంచెం ఆధారం దొరకవచ్చు అనుకుంటా?' అని సుబ్రాయవుపాధ్యాయు లన్నారు.

'వాడు చదివి చెబుతాడా? చూడండి- మూడవఫారము చదివినాడంతే. అల్లాంటే, మా దాసప్పయ్యగారుకూడ బాగా ఇంగ్లీషు మాట్లాడుతారు. కానీ రికార్డు గికార్డు వెళ్ళదు' అన్నారు మాదప్ప.

. ఐతాళులు వారిమాటలను నమ్మకుండానే, 'వెళ్ళండి, మీ వకీలుగారి సత్తా సూరదే చెబుతాడు. ఆ చెట్లల్లో ఎక్కడుంటాడో వెళ్ళండి. లేకుంటే ఆ సముద్రందగ్గర- వానికి ఎండకాలంఎండ అంటేకూడ చలువ అనిపిస్తుంది కాబోలు, అక్కడే కూలబడివుంటాడు. ఇంట్లో చోటుందా?' అన్నారు.

సుబ్రాయవుపాధ్యాయులు 'ఐతే, వెళ్ళి చూస్తానండీ. మీవాడు వకీలుపనికి చాల యోగ్యుడండి. చిన్ననాడే ఇంత హుషారుగా వున్నాడు- నేనుకూడ కడుపు తిప్పలకుగాను వంటలకు పంపినాను మావాణ్ని, ఇంగ్లీషులో వేసింటే కొంత బాగుండేదేమో. అన్నిటికీ దబ్బువసతులు చూడాలిగా' అన్నారు. తమ ఉద్దేశ్యం సాధనకు సముద్రంవైపు వెళ్ళాడు.

చాలసేపటివరకు కొడుకువిషయం విచారమేవున్న ఐతాళులకు 'శీనమయ్యకొడుకులు హోటేలుపని చేసికూడ తండ్రికి ఖ్యాతి గడించారు. వీడేమి చేస్తాడో' అని తోచి పలవరించారు.

మామగారేమో 'వానికేమంత ప్రాయమొచ్చిందండి? చిటికిమాటికి ఎందుకండీ గద్దిస్తారు? వాని కందుకే భయం' అన్నారు.

సుబ్రాయగారు మళ్ళీ గంటలోనే వాపసువచ్చి 'చూడండి- మీపిల్లవాడు సామాన్యుడు కాదండీ. కుందాపురం వకీలుగారికంటె పై చెయ్యి' అంటూ లోనికే వచ్చారు. అచ్చునికి చదువువచ్చింది ఎలాగైనా వుండనీ, తనభూమి తనకు దక్కుతుందనే ఆనందానుభవం అయింది. 'చూడండి ఈ రికార్డు పాతదైనా, అది మాకు పరంగానే వున్నదట. మా తండ్రిగారికి, వాసుదేవగురికారులకు ఒక నంబరుతో మంగుళూరు కోర్టువారు ఇచ్చినతీర్పులో మాకు



అనిన పొలం దేవుని 'ఫీల్డ్' అని వ్రాశారట. 'ఫీల్డ్' అంటే పొలం అనుకుంటూ మీ అచ్చుడు అంతా చదివేశాడు. రేపే కుందాపురం వకీలుగారివద్దకువెళ్ళి శీననికి రిజిష్టరునోటీసు ఇప్పిస్తా' అన్నారు.

మాదప్పయ్యగారు ఆ తీర్పును చూచుకున్నారు. రామఐతాళులుకూడ వచ్చారు సుబ్రాయగారేమో 'మీవానితల గొప్పదండీ' అనుకుంటూ తమ ఇంటిదారి పట్టారు.

రామఐతాళులకు ఇవన్నీ నమ్మేది కష్టం అయింది. సరే తమ పిల్లవాని తూకం పూర్తిగా చూడాలని అనుకున్నారు.

అచ్చుడు భోంచేసి పడుకున్నాడు. ఐతాళులు 'అచ్చ రారా!' అన్నారు. అచ్చ నిద్ర నటించాడు. చివరకు మాదప్పయ్యగారేవెళ్ళి, అచ్చున్ని వెంటబెట్టుకొని వచ్చారు. రెండు కోర్టు నకలా నకళ్లనుచూసి 'దీనిలో ఏముందిరా? నాగయ్యసెట్టిగారి కేసులో దొరికిన రికార్డు సారాంశం చూడు' అన్నారు. అచ్చుడు గుసగుసలతోనే ఇంగ్లీషులో చదివేసి అందాజుమీదనే సారాంశం చదివి చెప్పాడు. ఐతాళులకు చాల తృప్తి అయింది. 'కాని భగవంతుడా: ఏదో ఒకటి గట్టిగా వస్తే చాలు. పోనీలే నీవు ఇంటివ్యవసాయం చేయకు. ఇంగ్లీషు సార్థకం చేసుకో' అన్నారు. కొడుకును బుజ్జగించి వీపు తట్టారు. తాతగారు 'పిల్లలంటె నీలా గుండాలిరా, పదిహేనేండ్లకే చురుకుగా పని చెయ్యాలి' అన్నారు, వాణ్ని నిద్రకు పంపారు.

తరువాతకూడ వానిసంగతే కొనసాగింది. అచ్చునిచెవి పెద్దల అభిప్రాయాలు బాగా గ్రహిస్తూనేవుంది. ఐతాళులు 'వాని హైస్కూలుచదువు కుందాపురంలోనే జరుగనీ, ఊరు, గాలి అన్నీ మంచివే. ఉడిపినుండి గుర్రంబండి అంచెలకు కుందాపురానికి వెడుతుందట. నాకుకూడ పనివున్నప్పుడు చూచి రావచ్చును' అన్నారు.

మాదప్పగారు 'ఇలాంటి చిన్నవారిని ఒంటరిగా వదలరాదండీ' అన్నారు. సరే 'శ్రావణమాసంవేళకు మళ్ళీ ఆలోచిద్దాం' అని అనుకున్నారు.

మాదప్పయ్యగారు మరునటిరోజే వెళ్ళిపొయ్యారు. సత్యభామ 'అప్ప చెప్పినారు, అక్కడకూడ అచ్చుడు నాన్నాళ్లుండనీ' అన్నది.

సుబ్రాయ ఉపాధ్యాయులు మంగళూరు కోర్టుతీర్పును ప్రచారంచేస్తూ అచ్చుని ఇంగ్లీషు పాండిత్యాన్ని అందరికీ చెప్పారు. అందుకే కోర్టువక్షులన్నీ ఐతాళుల ఇంటిమీద వాలినాయి. ఒక్కొక్కరు ఒక రికార్డు చదివించుకున్నారు. శీనమయ్యరుకూడ ఇంకెవరిద్వారానో తమ పత్రాలు చదివించారు. మరొక్కనాడు వారే స్వయంగా రికార్డు అచ్చునికిచూపి తెలుసుకోవాలని ఆదుర్దా చూపారు. పొన్నతోటలో వాణ్నిచూచి, 'పదుమున్నారు వెళ్ళావు? వన్ను మరచిపొయ్యావురా? మా ఇంటికి రారా' అన్నారు. వాని ప్రాయంవాళ్లు బెంగుళూరు చేరారు. ఒరటడుకూడ బెంగుళూరికే వెళ్ళాడని, వాని చెల్లెలిపెళ్ళికి రావడానికి తీరిక దొరకలేదని అన్నీ మాట్లాడి తమ ఇంటికి తీసికెళ్ళారు. బెంగుళూరు ఫలహారాలు తీసి రుచి చూపారు.

శీనమయ్య రికార్డుకూడ లచ్చుడు చదివాడు తరువాత లచ్చుడే రెండుమూడుసార్లు వాళ్ళింటికి వెళ్లివచ్చాడు. రామపితాళులకు ఆసంగతి తెలిసింది. 'లచ్చ ఊరకే అందరిఇళ్లూ తిరగవద్దు- ఆ శీనమయ్యకు నన్నుచూస్తే గిట్టదు' అన్నారు. లచ్చునికేమో తనకు అక్కడ లభించిన గౌరవం మరపురాలేదు.

బడి తెరచేముందు ఒక వారంముందే లచ్చుణ్ని మాదప్పయ్య పిలిపించారు. 'లచ్చ రాపీ' అనగానే వాడు సిద్ధమయ్యాడు.

ఇంటిలో సభ చేరింది. పితాళులకు మళ్ళీ చింతపుట్టింది. తాతగారింట్లోనే వుంచితే వాడు తమకు దక్కడని బోధపడింది. కాని తరువాత ఇంగ్లీషంటే బాగా ఖర్చు తగులుతుంది. ఉడిపిలోవుంటే వారు కొంత భరిస్తారేమో అని ఇంట్లో సంప్రతించారు.

'సత్యా ఏం చెయ్యమంటావు? మీ నాన్నఏమో వుడిపిలోనే వుంచమన్నారు'.

'నాకేమి తెలుసండీ- నాకుకూడ వానికి ఈ ఇల్లంటే సరిపడనిసంగతి తెలిసి.... అన్నది సత్య సరసోతేమో 'నేను చెప్పింది చెబుతుంటాను. మీ ఇష్టం. ఉడిపిలో వాడు వద్దు. వాని ఆలోచనలను బట్టిచూస్తే అ ఊరు వద్దనిపిస్తుంది. తాతగారిపై ఎన్నాళ్ళయినా భారం వేయరాదు' అన్నది. 'సరే వాణ్నే అడుగుదాము' అన్నారు. కుందాపురం కథ లచ్చ నికికూడా తెలుసు. ఒక సంవత్సరమైనా అక్కడ నివాసం మంచిదని భావించాడు. తరువాత కావాలనుంటే ఉడిపి కానీ అన్నాడు.

పితాళులమొగ్గు కుందాపురానికే. 'నడిచేది చేతకాకుంటే ఇక్కడికి బట్కా బండివస్తే నెలబాడుగ మాట్లాడివచ్చు' అన్నారు. 'సాలిగ్రామానికి నడిస్తే అక్కడనుండి గుర్రంబండి సరాసరి వెళుతూనేఉంటుంది' అన్నారు. ఉడిపిలోవుంటే పిల్లవాడు తమచేతిలో వుండడని అనుకున్నారు. కాని 'భోజనం ఎక్కడ చెయ్యాలి? అక్కడ కోటీశ్వరంవారి హోటేలే ఉంది, కోటవారిది లేదు' అని మరొక బెంగ. మరునాడే సుబ్రాయ ఉపాధ్యాయులు వచ్చారు. 'మరే మయ్యా నందరాజుల రికార్డు పట్టుకొచ్చావా?' అన్నారు. 'కాలువకు ఎక్కే వుప్పునీళ్ళన్నీ ఏవే తోడుకుందుపుగాపి' అని నవ్వారు.

ఉపాధ్యాయులు 'ఎప్పుడూ రికార్డే' అనుకున్నారో, ఎల్లాగూ రిజిష్టరునోటీసు శీనమయ్యకు పంపించాను. అది లచ్చుని అనుగ్రహమే. మరొక్కపాయింటువుందేమోచూద్దాము. మా పిల్లవాడు కుందాపురం తాసీల్దారుగారివద్ద వంట చేస్తాడు, వారికి కార్కళ బదిలీ అయింది. నాకు వాణ్ని ఆవూరు పంపేఇష్టం లేదు. ఎవరో అన్నారు- 'వంటవస్తే హోటేలు నడుపుకోరాదా? అని- కోటవారు దిగడానికి ఒక హోటేలుకూడ లేదు. అన్నం, మజ్జిగపులుసు అందరూ కోటీశ్వరంవారివే తినాలా? వానికి ఈ వంటలకంటే అది చేస్తే బాగేమో?' అన్నారు.

రామపితాళులు 'ఎందుకు కాదు? మనవూరువారు కుందాపురంవెళ్ళి సాయంకాలం



వరకు వుపవాసం పడాలి. వాడుంటే ఇంత తిని రాపి, భోజనానికి బేరనుమించితే ఎవరూ రారు? జాగ్రత్త అని చెప్పినారు.

'ఎవరూ రాకుంటే నల్గురు స్కూలుపిల్లలను పట్టుకుంటే సరి. ఒక తూమెడు బియ్యం, అర్ధరూపాయ పెట్టారనుం' అని అంటూ పితాళులూ, లచ్చుడూ పడుమున్నూరి వైపే వెళ్ళారు.

లచ్చుడు ఆసారి 'ఫైలు' అయినాడనే దుర్వార్తకూడ వచ్చింది. లచ్చుడు చాల నిరాశ చెందాడు, తాతగారు 'పితాళులు.. ఏం పరవాలేదు. ఇంగ్లీషు అరటిపండు గాదు దబ్బున మింగ దానికి. అందుకే ఫైలంటే వదలకండి- మెట్రిక్కు దాటని' అని బుద్ధివాదం చెప్పారు. రామపితాళులు ఒదిండిదినారు. 'కాని, ఉడిపి పెద్దక్షేత్రం. వీనికి తిరుగుదెక్కువ, కుందాపురం చిన్నపేట పరవాలేదు, అక్కడ చదువుతప్ప వేరే వ్యాసంగం లేదు' అన్నారు.

లచ్చుడుకూడ 'ఫెయిలుఅయి ఆబడిలో చదువను తాత' అన్నాడు.

'కుందాపురం కానీండి, శ్రద్ధగా చదువాలి. విద్య అవకండి' అన్నాడు మామగారు.

తండ్రికొడుకులు క్రొత్తవూరు చేరారు. తాటిఆకు గొడుగులలో వానలో కొత్తబడికి వెళ్ళారు. అక్కడ వారంక్రితం స్కూలు తెరచారు. లచ్చుణ్ని చేర్పించారు. సుబ్రాయ ఉపాధ్యాయుల 'కోటబ్రాహ్మణ హోటేలు' ఇంకా ప్రారంభం కాలేదు. కోటేశ్వరం నారాయణ గోటుగారి హోటేలులోనే లచ్చుని బస. 'కోటపోతే గోట' దొరికిందని లచ్చుడు వెక్కిరించాడు.

చదువు మొదట్లో లచ్చుడు నిరుత్సాహంతోవున్నా తరువాత అపజయం పోగొట్టుకోవాలని నిశ్చయించి చదివాడు.

వానికి క్రొత్తఊరు, క్రొత్తమిత్రులు, భోజనం కొత్త. చోటు అన్నీ కొత్తవే. స్నేహితులు మంచి అనుకూలురే. హోటేలులో నలుగురు సహచరులు. వాడే వదహారేళ్ళ చిన్నవాడు. మిగిలినవారికి ఇరవైఅయిదు మించింది. ఒక్కొక్కరికి పిల్లలు పుట్టారు. అందులో ఆజానుబాహు సహపాఠికూడ వున్నాడు. వాళ్లలో పరీక్షలు ఏడాదికి ఒకక్లాసు దాటాలని మనస్సున్నవారు లేరు. అందరూ రసికులే.

బడిలో ఇంతపరిశ్రమ పూర్తికాగానే ఇంటి పేడపైకూర్చొని వగడకాయలు, పాచికలు, ఇస్పేట్లు ఆడుతారు. లచ్చుడు 'చదువాలయ్యా' అంటే 'ఒరే జూన్ జూలైలలోనే ఎందుకురా చదువు-పుస్తకాలు, ఏకేం ఇక్కరా?' అని హాస్యం చేశారు. వాళ్ళతోచేరి ఇస్పేటు నేర్చినాడు. అన్ని నేర్వాలని ఉత్సాహమే.

హోటేలంటే- ఒకేవిధమైన వంటలు, దానిలో మిరపపొడి, చింతపండుల ప్రాధాన్యమే వుంటుంది. అందుకే ఆ గోటరువారు చేసివేసే నలపాకాన్నే వర్ణిస్తూ పొద్దు పుచ్చుతారు. గప్పాలతరువాత నిద్ర. లచ్చుడు పడుకున్నా మిగిలినవారి పేకాట ఆగదు.

అచ్చుడుగాని వాని స్నేహితులు జనార్దన, రామన్న, నరసింహ అందరూ మాటల మల్లన్నలే (వాగుడు కాయలే). తరువాత బడి, ఉపాధ్యాయులమాటలు వెక్కిరించేది. వారి దర్పం అన్నీ ఎక్కిరిస్తారు. వానికి అన్నీ నచ్చినాయికాని భోజనం సరిగాలేదు. తాతగారింట్లో బహు రుచిగా తిన్ననాలుకకు హోటేలు సహించదు.

శనివారం ఆదివారం ఇంకేదో కలుపుకొని పదుమున్నూరికి అప్పుడప్పుడు వెళ్ళేవాడు. అక్కడ తనగోల, కష్టాలను చెప్పుకొని వచ్చేటప్పుడు మంచి నెయ్యి, అప్పడాలు, తిండ్లు తెచ్చుకొనేవాడు. మరేమి లాభం? అందరూ లాగి తినేస్తారు. నెయ్యిమాత్రం ఎల్లాగో దాచుకొని వాడేవాడు. నరసింహ కొద్దిగా మిరపకాయలాంటివాడు, అచ్చునికి సమవయస్కుడే. అచ్చునివిస్తరిలో నెయ్యివాసన రాగానే, 'ఎవరప్పా ఈ కంపుకొవ్వు తినేవారు' అంటూ ముక్కులు ఎగరవేసేవాడు. అచ్చుడు 'తినురా-రుచిచూసి చెప్పు' అని మందలించి వానికింత పెట్టేవాడు. ఏదోవిధంగా పొగిడి, తెగిడి, వెక్కిరించి వీని ఫలాహారాలు కాచేసేవాడు.

ప్రతి పదిహేను దివసాలకొకసారి కోడినుండో, పదుమున్నూరినుండో వచ్చే తిండి, తీర్థాలు దొంగతనం దోపిడీ అవుతుంటే వానికి సరిపోలేదు. తిండిఆశ పోదు. ఏమి చెయ్యాలి?

ఇంటినుండి అష్టమినాడు చక్కిలాలు, లడ్డులు తన పెట్టెలో దాచివుంచేది కష్టమే. ఎవరూ లేనివేళల్లో తినాలి. వాని నోటిచాపల్యంకూడ ఎక్కువే. రాత్రి దుప్పటి కప్పుకొనియైనా ఏదో నెమరు వేశేవాడు. ఆ హోటేలు భోజనం మూడు నాల్గునెలలుకూడ తినేది సాధ్యం కాలేదు. పెట్టెలో దాచిన ఫలాహారాలుకూడ దొంగిలింపబడేది. తరువాత యాష్టతో ఆ గోటరు హోటలు వదలాల్సివచ్చింది.

ఇంతలో పుణ్యవశాత్తు సుబ్రాయవుపాధ్యాయుల కుమారుడే హోటేలు తెరచాడు. కిట్టదే దానికి యజమానుడు, హోటేలంటే ఏమి, ఒక గది, వంటఇల్లు ముందుగా పెద్ద గుడిసె వసారా? ఈ కొంచెం స్థలంలోనే అచ్చునికికూడ గది. తన ఊరివాళ్లనే అభిమానంతో కిట్టడు దోసకాయ పప్పుచారు, పనసగింజల కూర, చామగడ్డల పులుసుమాత్రం ఎక్కువగా వడ్డించేవాడు, మరే వ్యంజనాలు అతనికి రావు. ఒకటిరెండునెలలు వాడొక్కడే విద్యార్థి. సుఖంగానే అమ్మపంపిన తిండ్లు తింటుండేవాడు. తరువాత పాతస్నేహితులు వాని స్నేహానికి అక్కడికి వచ్చారు. తిండికి కష్టంకాని ఇస్పేటు ఆకుల ఆటమాత్రం సాగుతుందిలే అనుకున్నాడు. పనితీరితే గోటరుకూడ అక్కడికే చీట్లు ఆడటానికి వచ్చేవాడు. ఈ కిట్ట ఉపాధ్యాయునికి ఆ ఆట తెలియదు. అందుకే రామఐతాళులతో, 'ఏమండీ మీదు పేకాటకొరకే కుందాపురం పంపారా?' అని చాడీలు చెప్పాడు. ఐతాళులు నోటికివచ్చినట్లు కొడుకును తిట్టి ఇకముందు పేకాటకు వెళ్ళను అని ప్రమాణం చేయించుకున్నారు.

అచ్చునికి పేటలో తిరుగులాట ఎక్కువైంది. పేకాటమాని తిరుగుడువెళ్ళి వచ్చేదారిలో కామత్ హోటేలుకు పెద్దపిల్లలు వెళ్ళేవారు. అక్కడికి ఖరీవారే వెడతారు. ఒక పెద్ద



స్నేహితుడు వీణ్ని అక్కడికి తీసికెళ్ళి ఉపాహారదీక్ష నిప్పించాడు. కిట్టు ఉపాధ్యాయుడు వంటవాడైనా ఇంట్లో వుండేవారిని గద్దించేవాడు. కామత్ హోటలువారు బాగా ఉపచారం చేశారు. అచ్చునివిషయం మళ్ళీ ఐతాళులకు తెలిసింది. ఇంటికి అచ్చుడు వెడితే సరసోతికూడ ఏడ్చింది. 'అచ్చ నువ్వెందుకురా! ఆ కొంకణస్తులహోటల్లో తింటావు. నీకు జాతి నీతి వద్దారా?' అనింది. 'లేదులే అత్తా' అంటూ అచ్చడే ఆమెను ఓదార్చాల్సి వచ్చింది. ఐతాళులు ఉగ్రనరసింహావతారం దాల్చారు.

అచ్చునికి ఈ సందిగ్ధజీవనంలో వేసరిక వచ్చింది. కిట్టని హోటేలు మానేద్దామనుకున్నాడు. అదిమానితే స్నేహితులు దూరమవునారే.

కిట్టనికి తన హోటేలు ఖాళీ అవుతుందనేభయం లేకపోలేదు. అందుకే చాడీలు చెప్పాడు. 'నేనుంటే వాణ్నీ అన్నీ మాన్పిస్తానని హోటేలే మానేస్తాడటండీ' అని. ఒకరైనా వానిపై నిఘాలేకుంటే కష్టం అని 'ఇష్టముంటే కిట్టని హోటేలులోనే వుండు. మేమంతా చిన్నతనంలో ఇన్నితిండ్లు తినే పెరిగామా. చదువుకోరా' అని బెదిరించారు ఐతాళులు.

తనదంతా తలవ్రాతే అని అనుకున్నాడు అచ్చుడు. నోటిచాపల్యమూ తీరదు. తాను వెళ్ళకుండానే దొంగతనంగా కామత్ హోటేలువారి ఆంబడలు ఇతరతిండ్లు తెప్పించి తినేవాడు. ఇంటివాళ్ళకేమో 'దేవునిపై ఒట్టు—హోటేలుకే పోను' అని చెప్పవచ్చు.

హోటేలుఖర్చులు ఎల్లాను- తనతోబాటు నలుగురికి దండుగ. ఏమి చెయ్యాలి? ఐతాళులు భోజనం ఖర్చులు కిట్టనికే తెచ్చిఇస్తారు. పుస్తకాలఖర్చు, నూనెకు అని కొంచెం గింజిగింజి అడిగితే కొన్నిపైసలు ఇచ్చేవారు. ఈ నీచజీవితంకంటే ఆ ఉడిపిలో చదువే మెరుగు అనుకున్నాడు.

రామఐతాళులకు ఈ హైస్కూలుచదువుకే ఇంతడబ్బు అవుతుందని చాల దిగులు పుట్టింది. వారికి దమ్మిడీలే రూపాయిలలాగు తోచేది. సత్యభామ ఎంతో సిఫారిసుచేస్తే అచ్చునికి కొంత దొరకేది. పుస్తకాలకని, ఫీజులకనిచెప్పి తెచ్చినదంతా చిరుదిండి బాకీలు తీర్చడానికి అయిపొయ్యేది, ఇది ఎల్లాగైన చికాకు. తండ్రిగొడవ లేకుండా తాతగారివద్దకే వెళ్ళి వారికి సుంకం చెల్లింపవలెనని చెప్పాడు. ముద్దుల మనువడు గాబట్టి ఎల్లాగో రెండు రూపాయలు జేబులో పెట్టేవారు. తన తండ్రికి పైసలే ప్రాణాలు అని శీనమయ్యరు చెప్పిన వాక్యాలు సత్యం అని తోచింది. ఇదివరలో తండ్రిపై ఇంతో.అంతో ప్రేమవుంటే ఈ దబు చిక్కులమూలాన అదీ పోయింది. ఈ కిట్టు ఉపాధ్యాయుని బారినుండి తప్పించుకోవాలని వుపాయం వెదికాడు.

కుందాపురంలో ఎనిమిదినెలలు గడపాక ఇంటికి వెడితే, 'నేను ఈసంవత్సరం 'ఫెయిల్' అయితే మీదే తప్పు. ఆ హోటేలులో ఊరకే అల్లరి. పుస్తకాలు పోతాయి. రామఐతాళులు మళ్ళీ పిల్లవానిచింత చేశారు. వారే స్వయంగా కిట్టనివద్దకు వచ్చారు. 'భోజనా

లకు ఎందరో చేరారు. కష్టం. అందుకే 'నీవు మంచిస్నేహితులను వుంచుకొని పెద్దగది చేసుకోరా. నెలకు రూపాయదాకా కిరాయిఇట్టు - తిరుగ ఫెయిలు కావద్దు' అన్నారు.

కిట్టుకి కొంత పరాజయం కల్గినమాట వాస్తవమే. హోటేలునుంచి ఆ పిల్లవాడు వెళ్ళిందికూడ మంచిదే. లచ్చునికి అన్నం హోటేలంటే అంతా దరిద్రమే కాని ఎవరూ ఆక్షేపించని స్వేచ్ఛాజీవితం రూములోనే వుంటుంది. కాఫీహోటేలు తిండి అగదు. పేకాటకు చోటుంది. పాత అపరాధులనే మంచి స్నేహితులుగా వర్ణించి గది చేర్చించుకున్నాడు.

చివరిరోజులదాకా పేకాట, తరువాత నిద్రమానేసి పగలూ రాత్రి పుస్తకాలపురుగు ల్లాగు చదివి కుందేశ్వరస్వామివారికి కొబ్బెరకాయ పళ్లు—లంచం-కూడ చెప్పుకొని పరీక్ష వ్రాశారు.

ఏమైనాసరే, తిరిగి జూన్‌కు తనకొడుకు నాల్గవఫారములో వద్దందుకు ఐతాళులు చాలా సంతోషించారు.

# 14

లచ్చన్నజీవితం మెట్రిక్‌పైపే వెళ్లాలి. మూడేండ్లు గొప్పపని చేసినట్లే. స్నేహితులమూలాన కామత్ హోటేలుతిండి, ఆటలు, పాటలు ఎల్లాగో నడుపుతూ కాలం గడుపుతున్నాడు. ఈసారి సెలవులంతా తండ్రి భయంతో తనఊళ్లోనే గడిపాడు. అప్పుడప్పుడు తాతగారింటి యాత్ర, ఇదివరలోలాగు అజ్ఞాతయాత్రగాదు. సరసోతిమాత్రం 'పిల్లవానికి కుందాపురం వొంటబట్టలేదు. పిల్లవాడు పొడుగ్గా పెరిగాడుకాని ఏమీ లాభంలేదు' అన్నది. పారోతి 'హోటేలు తిండి ఏమి బలాన్నిస్తుందని!' అన్నది.

పారోతి చాల ముసలిదానిలాగా కనిపిస్తుంది. ఎన్నో ఆలోచనలతో వెంద్రుకలు పండి నవి. లచ్చుడు ఇంటికివస్తే ఇదివరకోలాగే ఆప్యాయతతో మాట్లాడుతుంది. కాని లచ్చునికి ఎవరిమీద ఆప్యాయత లేదు. అందరిపైనా వుదాసీనంగా ప్రవర్తిస్తాడు. సత్యభామ ఇద్దరు బిడ్డల తల్లిగా వారిద్దరిమీద అంతశ్రద్ధగా లేదు. ఊరకే ఇంటిపని చేసుకుంటుంది. సతమత మవుతున్నది. ఐతాళులుకూడ ముసలివా రయ్యారు. సరసోతి ముసలిదైనా చురుకుగానే పని చేసుకుంటుంది. అందరూ పనులు చేస్తునేవుంటారు. 'అప్పా! ఈ సంసారం ఎప్పుడు తుద ముడుతుందేమో అని జీవితానికి చురుకునిచ్చే బిడ్డలు దగ్గరలేరు. పిల్లలు పెద్దవారు అయ్యారు. సుబ్బి తన మగనింటినుండి వచ్చినప్పుడే ఉత్సాహంగా ఉంటుంది-సత్య.

లచ్చుడు మేనెల లీవుల్లో వచ్చాక, సరసోతి 'అన్నా, లచ్చునికి పదహారేళ్లు పూర్తి



అయినాయి. పెళ్లెందుకు చెయ్యవు. సుబ్బి యోచన తీరింది. ఈ ఒక బాధ్యత తీర్చుకో' అన్నది.

లచ్చునికికూడ పెండ్లిసంగతి చెప్పింది. పైకి వూరకున్నా లోపల లచ్చునికి స్నేహి తులలాగు తానుకూడ షరుదనిపించుకోవాలని ఆశ లేకపోలేదు. ఐతాళులు పెండ్లిపై పెళ్ళి చేసి వున్న రొక్కం ఖాళీ చేయదలచుకోలేదు. విద్యకూడ ఒక బరువే వారిదృష్టిలో.

అందుకే లచ్చన్న రెండుసంవత్సరాలుకూడ పెళ్ళి లేకనే గడపాడు. కుందాపురం చదువు మెట్టు పై మెట్టు దాటాలి అని తండ్రి అభిలాష. ఎల్లాగో కొడుకు గమ్మతులతో పొద్దు గడువాలని ప్రతినెల పుస్తకాలలెక్క, ఫీజు లెక్కలు వ్రాసి పంపుతాడు. సరసోతితో అన్నీ చెప్పి తండ్రిని ఒప్పిస్తాడు: తండ్రిని దోచుతున్నాడు. తాతగారింట్లోకూడ డబ్బులు దానం తెస్తాడు.

ఈ నడుమ రామఐతాళు లెందుకో పదుమున్నూరు వెళ్ళారు. అప్పుడు తాత 'పిల్ల వాడు మొన్న వచ్చిపోయినాడు. ఆ హోటలుతిండి చాలదు. ఒకబేడకు నెయ్యి తెప్పించాను' అన్నారు.

రామఐతాళులు 'ఏమి ఇంగ్లీషోనప్ప- నేను నెలకు పదిహేనురూపాయలు మళ్ళీ పై ఖర్చు లిస్తూనేవున్నాను పుస్తకాలనెపంతో మరొక పదిరూపాయ లిచ్చాను. ఇది పూర్తి అవాలంటే ఎంత ఘనమో ఏమో!' అన్నారు.

మామగారు 'ఐతే మీరు తప్పకుండా ఇచ్చారా! నేనుకూడ పుస్తకాలకు ఫీజులకు కూడ పంపానే. అన్నినెలలు నేనే పంపాను' అన్నారు. ఐతాళులగుండె పగిలింది. 'మీ రెండు కండీ ఇయ్యడం- నేను అన్నీ లెక్కపెట్టి ఇస్తూనే వున్నానే' అన్నారు.

'అరే, అప్ప ఇయ్యరు- గద్దిస్తారని నేను ఇచ్చానండీ అంతా ఆశ్చర్యంగానే వుంది' అని మాదప్పయ్యగారుకూడ గాబరాపడ్డారు. 'ఓహో! ఎక్కడో కాఫీహోటే లుండితీరాలి. అక్కడ వీడే అందరికి ఇప్పించి దర్బారు నడుపుతున్నాడేమో. అంతా పోకిరీ, తుంటరి సావాసం వుండొచ్చు' అని వూహించారు.

'ఇదేమి దుర్బుద్ధి వీనికి. దరిద్రం స్నేహితులు చిక్కారే'- అని తాతకూడ బాధ పడ్డారు. మీరు నగదు ఏమీ పంపకండి. నేను దాసప్ప మాస్టరుద్వారా లెక్కచేసి ఎంత అవసరమో అంతే ఇప్పించుతాను. భోజనానికిమాత్రం జరిపించండి' అన్నారు మాదప్ప.

'సరే ఆ సుబ్రాయ ఉపాధ్యాయునికి ఊళ్ళో ఇస్తే సరి' అన్నారు.

పిల్లవానిబెంగ ఐతాళులకు మళ్ళీ చుట్టుకుంది. ఇంటికి వెళ్లారు. సుబ్రాయగారికో 'లచ్చన్ని తప్పక ఈ శనివారం పంపండి' అన్నారు. లచ్చునికి కొంత భయమేసింది. శని వారం ఎల్లా వెళ్ళేది. నెలపరీక్ష వుంటుంది అని ఊరకున్నాడు. ఆ నెలలో కాఫీహోటేలు బాకీలు ఎక్కినాయి. పైసలు చాల అవసరం. అందుకే పదుమున్నూరికే వెళ్లాడు.

అవ్వగారితో పరీక్షలఖర్చువస్తు చెప్పాడు. మాదప్పయ్యగారు మనుమణ్ని మొదటి సారిగా బెదిరించారు. 'ఏమిరా, మీ నాన్ననుండి, నానుండి చాలపైసలు లాగుతున్నావు. అన్నీ అబద్దాలు ఎందుకురా', వారిఎదుట లచ్చడు మారు పలుకలేదు. ఎంతో పశ్చాత్తప్తుని లాగు ఏడ్చాడు. మాదప్పయ్యగారేమో చెప్పారు. ఛాదేమో 'నమ్మకంలేకుంటే బడి మాన్పించండి' అన్నాడు. మామ్మకూడ వానిఏడ్పును చూడలేక 'లచ్చడు మంచివాడండీ, దుర్వ్యయం చెయ్యడు, పాలు పెరుగు తాగేవుంటాడు. తండ్రితోనే అంతా అడగటానికి భయపడి ఇక్కడ అడిగాడండీ' అన్నది. దొంగదారి ఆమె చూపించినట్లయింది. తానేమో మంచివానివలె లచ్చడు నటించి కుందాపురం ఖర్చులను కొండంతచేసి వర్ణించాడు. కన్నీళ్లుకార్చి తాతనుకూడ ఓడించాడు.

నాల్గవఫారం పరీక్ష ముగిసింది. లచ్చని విశేషకార్యక్రమాలు తగ్గలేదు. తండ్రినించి వచ్చేడబ్బు ఆగిపోయింది. మాదప్పయ్యగారుకూడ చెయ్యిబిగించి డబ్బిచ్చారు. అందుకే వచ్చేటప్పుడు హోటల్లో, దుకాణాలలో 25 రూపాయలదాకా అప్పుపెట్టి వచ్చారు.

ఈ వేసవికాలంలోకూడ ఐతాళులు బ్రతుకులో పోటుపాట్లు వచ్చినవి. ఒకచోట ఆశించని లాభాలు, మరొకసారి తలవనినష్టాలు వచ్చాయి. సరసోతిమాత్రం 'ఈ ఎండకాలంతో పిల్లవాని లగ్నం చెయ్యాలి'అని పట్టుపట్టింది. సరసోతితో, సత్య 'మీరు బలవంతం చేస్తుంటే పిల్లవాడు అడ్డదారి తొక్కేడనిపిస్తుంది' అన్నదీ. ఐతాళులకు 'జాతకాలు కుదరాలి, ఏదీ కుదరటంలేదు' అనేబెంగతో మళ్ళీ లగ్నం ముందుకు నెట్టేశారు. ఒక మంచి ఆస్తిపై కన్ను పెట్టారు. నదికితూర్పున మంచిపొలం విక్రయానికి సిద్ధమయిందట. 'రెండువేలకు రెండుపుట్లధాన్యం విత్తనం చేతికి వస్తుంది వదులుకోరాదు' అనుకున్నారు. అప్పున్నవారిని పీడించి అంతా వెనుకకులాగుకొని, ఆస్తిని అయకంగానైనాసరే తీసికోవాలని సిద్ధమయ్యారు, అన్నా, చెల్లెలు ఆ స్థళం చూచివచ్చారు. తోడుగా లచ్చన్ని వెంటపెట్టుకుంది సరసోతి.

ఆరాత్రి సరసోతి వదినెలతో 'అలాంటిపొలం మళ్ళీ దొరకదు. మూల్యం మూడు వేలు. అప్పిస్తే రెండువేలకు అదుపులో వుంటుంది, ఏది మంచి'దని తర్కించారు. తక్కువ రొక్కంతో అయ్యేపని అంటే ఐతాళులకు మంచి ఆసక్తి. ఈ ఆయకం ఎట్లయినా తీర్చుకుంటారు. ఒకవేళ శీనమయ్యనే లాగేసుకుంటే ఎల్లాగు అనే యోచనకూడ కల్గింది. 'సరే. కొందాములే' అనుకున్నారు. శీనమయ్యముందు తనకు నష్టంలేకుంటే వారు ఏపని అయినా చేస్తారు, ఒకవారంలో రిజిష్టరుకూడ చేయించుకున్నారు. శీనమయ్యమాత్రం నోరు తెరచుకొని 'ఆ పిచ్చి ఐతాళులకే దక్కిపోయేట్లు చేశాడుగదా, నేను నాల్గువేలకుకూడ సిద్ధంగా వుంటిని' అని బాధపడ్డారు.

కొనాలని నిశ్చయించుకున్నరాత్రి, లచ్చడుకూడ అదేచావట్లో పడుకున్నాడు. ఇదివరలో తండ్రి పిసినారి అని విన్నాడేకాని తండ్రికి వేలబేరం చేసేతాహతు వున్నదని వూహరాలేదు, 'అంతడబ్బు ఎక్కడ పెడతారు?' మూడువేలకు మించి ముప్పైవరకు ఖర్చులు



కూడ చేశారుగదా అని అనుకునేమధ్యాహ్నమే 'సరసోతీ ఆస్తి ఈవేళకే రిజిష్టి చేయించుకున్నాను' అన్నారు. లచ్చడు నమ్మరానిసంగతే తెలిసింది. తండ్రి అంటే గర్వం, రోశ ఒకేసారి కల్గినవి. 'ఇంతడబ్బుంటే కడుపుకులేక ఎందుకు చావాలి?' అనుకున్నాడు. ఆ సంపదలో కొంతైనా తనకు దక్కాలి - అని చూచుకున్నాడు. తండ్రి వెళ్ళేచోట్లన్నీ కనిపెడుతూవుండేవాడు. వారి ఖజానా ఎక్కడుందో తెలుసుకోలేదు. ఇంటిలో ఒక గట్టి పెట్టె కూడ లేదే. తండ్రికి లెక్కలుకూడ రావే.

గర్భిణి సుబ్బికూడ మరి ఎనిమిదిరోజులకు వచ్చింది. ఐతాళులు, లచ్చని అమ్మ, అందరూ అక్కకు చూపినమర్యాద-చెప్పలేము. ఆమె వేవిళ్లు తీర్చడానికి ఎన్నో కజ్జాయలు తయారుచేశారు. ఆమెపైకూడ మాత్సర్యం ఏర్పడింది లచ్చనికి. 'మగవాళ్ళకు తిండితీర్థాలు అక్కర్లేదు కాబోలు' అనుకుంటూ ఆడజాతిపై కొంత ఏహ్యభావం ఏర్పడింది. ఏమైనా భక్ష్యం వానికి వడ్డించడానికివస్తే 'నాకు దోసకాయపులుసుతప్ప ఏమీ వద్దు' అని భీష్మించుకునేవాడు. వాని విషబుద్ధిచూచి సత్యకూడ 'ఏమిరా అయ్యా! ఎందుకురా ఈ అల్పబుద్ధి? ఎవరు నేర్పారురా?' అనాల్సి వచ్చింది. లచ్చడు ఊరకుంటాడా? రెచ్చిపొయ్యాడు.

ఐతాళులకేమో మనుమనిముఖం చూడాలనే ఆసక్తి. సుబ్బి బాలెంత మగవాణ్ని ప్రసవించినరోజు వారి ఆనందం లెక్కకురాదు; ఇంట్లో అందరూ ఆణెగుడ్డ గణపతినిపూజించి ఆరుసార్లు టెంకాయలు కొట్టివచ్చారు. 'లచ్చా! నీవు పుట్టినరోజు ఆసంగతి మీ మామ నాకు చెప్పాడు. నీవూ ఆలాగే మంత్రివెళ్లి చెప్పిరారా?' అన్నారు ఐతాళులు.

'మంత్రికి నాకు దారితెలియదు' అన్నాడు లచ్చన్న.

'సరే సూరనివెంట పోరా! వాని కన్నీ తెలుసు.'

'నడువలేను.'

'కుందాపురంనుండి పదుమున్నూరికి నడుస్తావుకదరా, ఈ కొంచెం కష్టమా?'

'అక్కడైతే చక్కనిబాట- ఇది కొండదారి.'

తండ్రి కొడుకులమధ్య మొదటి రణరంగం. సత్యభామకూడ కోపగించి 'ఎందుకండీ వూరకే పని చెబుతారు వానికి? సుబ్బికి వేవిళ్లు అని తిండిచేస్తే జగడమాడేవాడు. అటువంటివాడట బావను ఆహ్వానిస్తాడట' అన్నదీ.

సరసోతి 'వద్దులే అన్నా. మంచిసంగతి పెద్దలే చెప్పాలి. నీవు ఇక్కడే వుండు. పిల్లకు నంజు గింజు అయితే మందు, వుపచారం చేయించు. నేను తొందరగా వస్తా' అని ఆమె చటుక్కున వెళ్ళిపోయింది.

ఐతాళులకు పట్టుదల ఎక్కువైంది. 'మంత్రికి వద్దులేరా? తాతగారింటికైనా వెళ్ళి చెప్పివస్తావా? మనుమరాలిముఖం అవ్వ చూడాలని ఆశ పడుతుంటుంది' అన్నారు. సత్య

భామ వెంటనే 'అక్కడికైతే 'సూరడే వెళ్లవి. వీడు ఇంట్లో పడివుండవి. ఇంటివాడు' అన్నది.

ఐతాళులు 'వాడు వెళ్ళిరాకుంటే మధ్యాహ్నం అన్నం చూపవద్దు' అన్నారు. లచ్చడు కళాహీనుడైనాడు. కళ్లు పెద్దవిగాచేసి 'నాకు భోంచేయకుంటే చావేమీ రాదు' అని దురుసుగా తప్పుకున్నాడు. వాడేమి చేస్తాడు చూద్దాం అని ఐతాళులు హఠం పడితే, వాడు మధ్యాహ్నం భోజనానికే రాలేదు. పారోతి అనుకుంది తాతఇంటికే వెళ్లాడేమోనని. ఐతాళులు 'వానికి చిల్లిగవ్వకూడ ఇయ్యకండి. నమ్మవద్దు. వాడు మనకులానికే తప్పిపుట్టాడు. సూరణ్నే పడుమున్నూరు పంపుతాను' అన్నారు. సూరడు మునిమనుమని జన్మవార్త తాతగారికి చెప్పడానికి వెళ్లాడు.

వాడు అదే సాయంకాలానికే వాపసు వచ్చాడు. 'మన చిన్నరాజాగాడు అక్కడ చావడిలో వున్నారండీ, నేనువెళ్ళి అక్కడ దొరగారికి చెప్పాను. అప్పుడు వారు 'ఎప్పుడు ఏమి కథ అన్నీ అడిగారండీ' అన్నారండీ. అక్కడ దొరసానికి వంట్లో బాగుండలేదట. నాల్గునాళ్లు అయ్యాక వస్తామన్నారండీ అయ్యగారు.'

'లచ్చడు వెళ్ళికూడ సుబ్బి ప్రసూతివార్త వారికి చెప్పనేలేదు చూశావా' అని కొడుకుపై వారు చాల ఉద్వేగం చూపారు. తమ అత్తకు వంట్లో బాగలేదంటే తామే చూచిరావాలని నిశ్చయించుకున్నారు. చివరకు అల్లుడువచ్చాక వెడదామనుకున్నారు. సగంరాత్రికే అల్లుణ్ని వెంటబెట్టుకొని సరసోతి వచ్చింది.

మరుసటిదినం ఐతాళులు సరసోతిని పిలిచి 'సత్యవాళ్ల అమ్మకు సుస్తీ చేసిందట. ఒకసారిఏమో చూచిరావాలని వుంది. సూరడు ఆసంగతి చెప్పాడు. నేనేమో సత్యకుకూడ చెప్పలేదు. నీవేమో ఇల్లు చూచుకో' అన్నారు తమకర్తవ్యం నెరవేర్చడానికి వెళ్లారు.

ఆస్తి సులభంగా చేతబడ్డది. మనుమడు పుట్టాడు. ఈ రెండుపుత్సాహాలు వారి ముఖంలో చూపుల్లో తొంగిచూస్తుండినవి. అత్తవారు అరవై దాటినవారే. మృత్యుశయ్యపై పొర్లాడుతున్నారేమో! అంతలో వాపులు, నొప్పులు, జ్వరాలతో చావును కోరుతూ వున్నారు. శరీరం చావువైపుంటే మనస్సు తప్పక బ్రతుకాలని వుంది. అల్లుణ్నిచూచి 'రామా! వచ్చావా!' అన్నది 'రామ, ఇది నయంకాదా! సుబ్బికొడుకును చూడాలిగదా, తరువాత చచ్చి బూడిదలో కలిసినా తప్పులేదు' అని అభిలషించింది.

రామఐతాళులు ధైర్యం నూరిపోసి 'అత్తా, మీకెందుకు అన్నిచింతలు! మీకేమీ కాదు. పిల్లవాణ్ని చూద్దువుగానీ, సుబ్బికూడ చూద్దామని సిద్ధమయింది' అన్నారు.

'ఆ పిల్లవాని ముఖాన్ని చూడటానికే భగవంతుడు నన్ను మిగిల్చినాడు కాబోలు ఇందాక. లేకుంటే గతసంవత్సరమే నేనెందుకు చావరాదయిందేది' అని సమాధానం చెప్పింది.



ముసలిదానికి మునిమనుమని జపమే తగిలింది. అందుకే ఐతాళులు ఇక్కడినుండి అక్కడికి అక్కడినుండి ఇక్కడికివెళ్లి చూచివచ్చేవారు. అక్కడ ఐతాళులఎదుట లచ్చడు ఏమీ ప్రసంగించలేదు. అందుకే వారు వానిసంగతి నెత్తికి అంటించుకోలేదు. ఒక్కొక్కసారి సత్యభామకూడ తల్లినిచూచి వస్తుండేది. చివరకు మంచంపట్టిన అవ్వ ఆశ ఎక్కువైంది. 'ఏమండీ నన్ను ఇలాగే చావమంటారా? మునిమనుమణ్ని ఎత్తుకోవద్దా? నేను ఈనాడో రేపో అని వున్నాను' అనిచెప్పి ఏడ్చింది. ఎదురుగుండా కూర్చున్న మాదప్పయ్యగారు, ఐతాళులు ఏమీ చెప్పజాలరైరి. ఆమె చావుఘడియలు సమీపించినవనేమాట వాస్తవమే. ఒకళ్ళ నొకళ్లు చూచుకోవాలి? చావనున్న ముది అవ్వ - నాల్గురోజుల పసికందు. మాదప్పయ్య ధైర్యం గొప్పది. 'సరే-పల్లకిలో పంపండి. ఆ ఆశవుంటే ఆమె చావనే చావదు' అన్నారు.

సాయంకాలం ఎండవడ తగ్గింతరువాత మాదప్పయ్యగారు ఒక పెళ్ళిగుంపును పంపారు. పల్లకిలో ముసలిదాన్ని 'కోడిగ్రామం' చేర్చే అతి సాహసం చేయించారు. వెంట అల్లుడు, దారిలో ఏమవుతుందో అనే భీతి. ముసలిది మునిమనుమని చూచి నవ్విన ఆ నవ్వు అప్పుడు ఆమె కళ్లల్లోని కళ, చావడానికిముందు వచ్చేసొగసు అనవచ్చు.

మునిమాపువెలుగు పొయ్యేలోగానే సుబ్బిపక్కకు అవ్వ పాలకి దిగింది. దగ్గర సుబ్బియొక్క మగశిశువు. ముసలిది తన మసకకళ్ళను విప్పారతెరచి 'ఇస్తారా నాకు' అన్నది. సత్యభామ ఆ చిన్న పసికందును తన తల్లిచేతిలో పెట్టింది. అక్కడికే ముసలామె కళ్లు మూతలుపడ్డాయి. చుట్టూరూవున్న వారికళ్ళల్లోనుండి ముత్యాలసరాలు పడ్డాయి. ముసలిది 'నేను ఇంక వెడతా-ఆశవద్దు' అన్నది. ఒక నిమిషం కండ్లు మూసుకుంది. తిరుగ తెరచి మగనితో 'ఇక్కడ వద్దు, అక్కడికే వెడదాము' అన్నది. పతికి సరిగా సైగ చేసింది.

మళ్ళీ ఒక ఊరేగింపే వెళ్ళిపోయింది. ముసలిదాన్ని వడుమున్నూరి మంచంపై పరుండబెట్టారు. ముసలిదానికి దీర్ఘశ్వాస పట్టుకుంది. ఆమెబ్రతుకు వేడితగ్గింది. మాదప్పయ్యగారు నూరింతలు ముసలివాళ్ళయిపోయారు. ఐతాళులు ఆవూరూ, ఈవూరూ తిరిగి గుజ్జుగుజ్జు అయ్యారు. అక్కడ లచ్చని ముఖంమాత్రం కనబడలేదు.

సుబ్బికేమో అవ్వ చచ్చిందని విని చాల దుఃఖం అయింది. 'నా దుర్దైవమా!' అని ఏడ్చింది. సరసోతి చూడు 'నీ పిల్లవాణ్నిచూచి ఆమె తుదికోరిక అయినా తీరిందికదవే' అని సమాధానపరచింది.

రామఐతాళులు పిల్లవాని నామకరణంకూడ ముగించి అక్కడి ఉత్తరక్రియల పిత్రుశేషం, వైకుంఠసమారాధనలకూ వెళ్లారు. ఒకదానిలోని పొంగు, రెండవవార్తలోని క్రుంగువల్ల మాయమయింది. నవ్వుతూ గొప్పగా మీదపడిన తరంగం, నాల్గురెట్లు వేగంతో వెనుకకు లాగుకొని మట్టినికూడ తనవెంట సముద్రం అట్టడుగుకు తీసికొనిపోతుంటుంది. ఐతా

ఉలకై తే ఇక మామగారు ఏమి తింటారో, ఎల్లా వుంటారో, ఒంటరిబ్రతుకు ఎల్లా గడువ గలరో అనేచింత చుట్టుకుంది. తమకుకూడ అరవై దాటింది. ఈ భ్రమలలోపడి ఎన్నాళ్లో 'నేను ఎప్పుడో' అనే యోచనతో లచ్చన్ని తలుచుకున్నారు. 'ఎక్కడున్నాడు' అని అడిగితే, పారోతి 'అక్కడే వుంటాడు' అన్నది. 'వాడు ఇప్పుడు తాతగారికి విసుగు, ఏకాంతం లేకుండావుంటే వుండని' అన్నది. 'వాడా అవ్వకు ఏమైనా సుఖము నిచ్చాడా? ఇక తాతను పాపం సుఖపెడతాడు—వాడు ఉపకారస్మృతిలేని ఛుక్క' అన్నారు. వారి విరిగినమనస్సును ఓదార్చడానికి పారోతి ఎంతో ప్రయత్నించింది.

ఇంతలో సరసోతి 'అన్నా-లచ్చనిపెళ్ళి చాల త్వరలో చేసిపెట్టు. ఎవరికెరుక ఇక్కడి పెత్తనాలు' అన్నది.

'నీకు మళ్ళీ అదేపిచ్చ సరసోతి! మనముండే ప్రపంచం అనుకోవద్దు' అన్నారు. 'ఈ ఎండకాలంలోమాత్రం పెళ్ళిగొడవ వద్దు. ఆమాట ప్రస్తావించవద్దు' అన్నారు మళ్ళీ. చాలనాళ్లు తాతఇంట్లోనేవుండి లచ్చడు ఇంటికివచ్చాడు. ఇక బడి ముగియడానికి వారం ముందు తండ్రితో డబ్బులకొరకైనా మాట్లాడాలిగదా-తప్పదు. రామఐతాళులు వాణ్నిమాత్రం లెక్కించలేదు. ఎల్లాగయినా తనను గుర్తింపజేసుకోవాలని వాడేమో శీనమయ్యారింటికి రోజుకు పదిమార్లయినా వెళ్ళి వస్తుండేవాడు. శీనమయ్యకూడ ముసలివాడే అయినాడు. కాని ఊపిరి, బిగువు, ఉక్రోశం రాపిడి అన్నీ గట్టిగానే వుండినవి. ఏటిఅవతలిఆస్తి ఐతాళులు మూడువేలకు లాగేశారు అనేవిషయం అతనికి పిచ్చిపట్టించింది. రామఐతాళులు తమకు పరమశత్రువని అనుకున్నారు. వారి పొలంచుట్టు అన్నీ తమవిగానే చేసుకొన్నారు. ఈ ప్రయత్నాలు చాలనాళ్ళనుండి జరుగుతూనేవున్నాయి. చివరిపొలంకూడ దొరకాలనే ఆశతో తమ పొలానికి ఒంద్రుమట్టి వేస్తున్నాననే చెబుతూ తమస్థలాన్ని మూరెడుఎత్తు చేయించాడు. నాల్గవసంవత్సరం కొబ్బరిమొక్కలనునాటి ఒకగదిని వేయించి కాపలాపెట్టారు. నాల్గవ వానకాలం ఈ చుట్టూరూవున్న ఎత్తువల్ల ఐతాళులభూమికి వెళ్ళడానికి దారి సరిగా దొరకలేదు. వాన నీళ్లు తమ పొలంనిండాచేరి చెరువయినది. 'సరే, ఆ రామున్ని కోర్టుకులాగి నాకాళ్లపట్టుకునేలాగు చేస్తాను' అని పంతాలు చెప్పుకున్నారు సీనయ్య. ఐతాళులు తమ పొలంకు పట్టినగతిని నివరిస్తూ కోర్టుకే ఎక్కాల్సివచ్చింది. వారి అభిమానంమాత్రం చిన్నదా? 'హైకోర్టు కూడ చూసి తీరతాను' అని పట్టుపట్టారు. సరే అదేమీ గొప్పసంగతి గాదు. కానీ ఆ పగవారింటికి తనకుమారుడు వెళ్ళివచ్చేది మంచిదికాదని ఐతాళులు చెప్పినా వాడు మళ్ళీ వెళ్లాడంటే సరిపడనిసంగతి అయింది.

ఎండకాలం అయింది. జూన్ నెలలో బడి మొదలైంది. లచ్చడు బడి చేరాడు. దేవుని దయతో లచ్చడు పరీక్షలో నెగ్గాడు.

'వానికి చదువువద్దు—ఇక్కడనే తింటూ పడివుండని' అన్నారు ఐతాళులు.

'ఇక్కడ వాడుంటే మేమంతా ఏమి సుఖపడాలి వాని దిక్కునుంచి' అన్నది సత్య.



సరసోతి 'అన్నా తలవ్రాత ఎల్లాగుంటే అల్లాగే కానీ పంపు. ఏ జుల్మానా చెల్లించుకో. దేవుడు పెట్టినట్లు కానీ' అన్నది. అందుకే లచ్చనికి విద్యాభ్యాసం సాగింది.

నిరాటంకంగా లచ్చడు బడికి వెళ్లాడు, వానివెంట ఐతాళులకుకూడ కుందాపురం యాత్రలు తగిలినాయి. శీనడు కొత్త జట్కాసర్వీసులో ఎక్కితే, ఐతాళులు నడిచే వెళ్ళేవారు.

ఇప్పుడు లచ్చడు ఐదవఫారమ్‌లో వున్నాడు. వచ్చేయేడాది మెట్రిక్ అవుతాడు. ఈసారికూడ కిట్టు ఉపాధ్యాయుల హోటేలుతప్ప వేరే గతిలేదు. హోటేలు వృద్ధిలోకివచ్చి నట్లుంది. పెద్దఇల్లు బాడుగకు తీసుకున్నాడు. మేడ గదులున్నందుకు 'ఐతాళులూ, మీ పిల్ల వానికి వేరేగది వద్దండి. మా మేడపైన అద్దెకుండని' అన్నాడు. రామఐతాళులు అంగీకరించారు. కిట్టని మిద్దెపైననే మన ఆఫీసు అంటూ లచ్చడు ప్రకటించాడు. కిట్టనివెంట పాత స్నేహితులూ తప్పలేదు.

కిట్టని భార్యకూడ వంటగది చేరింది. ఆ దోసకాయ పచ్చడి, అదేచారు, ఏదైనా రుచిగా, శుభ్రంగా తయారుచేస్తుంది. ఒకరూపాయి ఎక్కువ తీసికొని నెయ్యి, పెరుగుల ఏర్పాట్లుకూడ చేశాడు. 'మీరు ఏజాతి హోటేలుకో వెళ్ళవద్దు. కాఫీ, టిఫినుకూడ ఇస్తాను' అన్నాడు కిట్టడు. భోజనం, పక్కన హోటేలుకూడ బెంగుళూరినుంచివచ్చిన స్నేహితుణ్ని తోడుచేసుకుని ఏర్పాటు చేశాడు. 'కొంకణస్థుల సాంకర్యంనుండి కోటబ్రాహ్మణులను రక్షించిన పుణ్యం, ధర్మం కిట్టనికి దక్కింది.

ఒక సంవత్సరంపాటు హోటేలు జోరుగా జరిగింది. లచ్చడుకూడ కిట్టనికి ఒక ఆశ్రయదాత, పోషకు డయ్యాడు. అక్కడే తన కార్యకలాపాలను జరిపితే తండ్రికి తెలుస్తుందని తన స్నేహితులను ఇతరత్ర చేర్చేవాడు. ఆ సంవత్సరంమాత్రం కిట్టు ఉపాధ్యాయునికి ముళ్ళకంపమీద గుడ్డలాగా అయింది. ధర్మసంకటం, మింగజాలడు, కక్కజాలడు.

కిట్టుని హోటేలుమేడలో లచ్చని దర్బారు. అల్లరి, గప్పాలు, హాస్యాలు, జూదాలు ముఖ్యమైన కార్యాలు; చదువుమాత్రం అంత ముఖ్యంకాదు. నరసింహ, జనార్దనలుకూడ వానిలాగే ఒకేక్లాసు, ఒకేచదువు. తాను చాల చురుకైనవాడే. వానిమనస్సు ఇప్పుడు పిల్లల వేటకు పడింది. వయస్సు ఎక్కువైంది. పిల్లచేష్టలుమాని తరగతిలోని, దారిలోని ఆడపిల్లల విమర్శవర్ణనలలో పడ్డారు, లచ్చనిస్నేహితులలో వయస్సు పెద్ద అయిన జన్నడు ఈపనిలో నిపుణుడు. వాళ్లు అన్నీ బూతులతోనే కాలక్షేపం చెయ్యసాగారు. జన్నడు ఒకటో రెండో పారులు 'రారా అక్కడికి' అని ప్రేరేపించాడు. లచ్చనికి అంత సాహసంలేదు. మొదట్లో జన్నని ధైర్యం, కవ్వింపులు వ్యర్థమైనాయి. జన్నన్నిచూచి లచ్చడే అపహాస్యం చేసేవాడు. అంతరంగంలోమాత్రం జన్ననిధైర్యం తనకు లేదే అనిమాత్రం చింతపడకపోలేదు.

నరసింహుడు వానికి ఆత్మీయుడు. వాళ్ళిద్దరిమధ్యలో ఏమీ దాపరికం లేదు. ఏవైన

ఆశలు తీరాలంటే వానిమూలాననే తీర్చుకోవాలి. నరసింహునికి కాఫీ బాగా తాపితే ఏమి పనిఅయినా చేసిపెడతాడు. అందుకే వాడు టప్పాపనిచేయడం మొదలుపెట్టాడు.

లచ్చునిదృష్టి స్కూలుపిల్ల 'సంజీవి'పై పడింది. ఆపిల్ల వచ్చేదారిలో ఇద్దరూ నిల బడేది, అంతాచూచి ఆమెకూడ కొంత అవకాశం ఇచ్చిందని అనవచ్చును. నరసింహుడు రాయబారాలు జరిపాడు. సంజీవి ఇంటివారు చూసడానికిమాత్రం సంసారులు: దారిద్ర్యంలో వేడినీళ్ళకు చన్నీళ్ళు కలిసినటు ఒక వుపవృత్తిబలాన్ని చేకూర్చుకున్నవారు, ఒక సాయం కాలం లచ్చుడు వాళ్ళఇల్లు చేరాడు. నరసింహుడు ఎంత నిరీక్షించినా రోడ్డుపై రాడు. నర సింహుడు నిరాశతో హోటేలు చేరాడు. లచ్చుడు తరువాత వచ్చినందుకు లచ్చునిపై కిట్టుపా ధ్యాయుడు కోపపడినాడు. లచ్చుడేమో 'లెక్కలమాష్టారు పిలిస్తే వెళ్లవద్దా?' అని సమా ధానం సిద్ధంగా చెప్పాడు.

తరువాత ఇద్దరు రాత్రి భోంచేసి ఎక్కడనో తిరిగేఅలవాటు చేసుకున్నారు. తమ గుంపులోని జన్ననికి తెలియకుండా కార్యక్రమం నడిపించాలి. దానికికూడ ఒక నెపాన్ని వెదకాల్సివచ్చింది. సంజీవి ఇంటినిదాటి ఒక మాష్టారు వున్నారు. వారింటికే ట్యూషనుకు కుదురుకున్నారు. ఐతాళులు కుమారుడు గురువుగారింట్లో మరింత శ్రమపడి, శ్రద్ధతో చదువు తున్నాడుగదా అని ఊరకున్నారు. మరి రెండురూపాయలను లెక్కపెట్టలేదు.

కాని కొత్తమోజులో లచ్చునిజేబు ఖాళీ అయింది. తదుపరిస్నేహితుని పోకిరీపనులకు కూడ ఖర్చులు భరించాలి. తాతగారింటికివెళ్ళి అబద్ధాలు ఆడితే పప్పు వుడకదు. లచ్చుడు కిట్టని హోటేలులో ఒక కోలాహలం రేపినాడు. స్నానాలగదిలో తన మెడలోని బంగారు గొలుసు పెట్టానని ఎవరు లేపారో వెదకించండి అని గొడవచేశాడు. తరువాత దొరకలేదని తృప్తి చెందినట్లు నటించి రెండునెలలదాకా ప్రణయలీల జరిపాడు. తండ్రి ఇది తెలిసి కుమా రుని అజాగ్రత్తపట్ల శాపనార్థాలు పెట్టారు. కిట్టనికేమో హోటేలులో అపవాదువస్తే కళం కంగా భావించాడు.

ఈనడుమ జన్నడు ఒంటరిగా తపించిపోయ్యాడు. నరసింహుడు లచ్చుడుమాత్రం తమ ట్యూషన్‌పేరుతో అన్నీ కుదిరించుకున్నారు. ఒకనాడు వెంబడించి, దొంగతనం బయటవేసి వుడికించాడు. అందుకే ముగ్గురు మానసంరక్షణ చేసుకున్నారు.

అంతాసరే, వారి జేబులమానం ఎవరు సంరక్షిస్తారు? లచ్చునికి కాఫీహోటేలులో, అంగడిలో, ఎక్కడచూచినా బాకీలే. స్కూలుఫీజు బాకీపడితే, హోటేలువారిదాకా తెలిసింది. ఐతాళులకుకూడ తెలిసింది. వారు వృథా కంఠశోషణతో తృప్తిపడ్డారు. ఉపాధ్యాయుని చేతిలో అన్నిఖర్చులు ఇచ్చివచ్చే ఏర్పాట్లు చేశారు. అక్కడ తాతగారింటివారుకూడ డబ్బు లచ్చునికైతే ఇయ్యమని చెప్పారు.

లచ్చుడు ఏడిస్తే కుదరలేదు. తరువాత రోజూ సంజీవినుండి పిలుపు వచ్చేది. కాసులు లేని ప్రేమలు కుదరవు. వలలోపడ్డ లేడివలె ఆతనిమనస్సు అయింది. చివరికి నరసింహుని



తోనే తన బాకీసొమ్మును తీర్చమన్నాడు. 'ఒరే నేనిమ్మన్నానట్రా?' అని ఎదురుతిరిగాడు వాడు. లచ్చునికేమో కిట్టు, జన్నడు మిగిలారు.

ఐతాళులఇంట్లోకూడ విచిత్రసంఘటన జరిగింది. గోడ రంధ్రంలోనిఖజానాలో ముప్పై రూపాయలదాకా నగదు మాయమైంది, ఐతాళులు ఆలోచించి సత్యభామను అడిగారు 'మీరు నిన్న ఇంట్లోలేరు. అప్పుడు లచ్చుడొక్కడే వున్నాడు. సాయంకాలమే తిరిగివెళ్లాడు' అన్నది.

'వాణ్ని మళ్ళీ ఎల్లా, ఎప్పుడు ఎక్కడ అడగాలి, ఒక నెలతరువాతనే కదా. 'నాన్నా' దేవునిపై ప్రమాణంచేసి చెబుతున్నాను. నాకేమీ తెలియదు' అనిచెప్పి తప్పుకున్నాడు లచ్చుడు.

ఐతాళులకు కొడుకంటే నమ్మకం చచ్చిపోయింది. తుదకు తామే వాడే నిలువు, అడ్డ గీతల గుర్తులుకూడ నమ్మలేకపోయ్యారు. తమ ఖజానా ఆ చోక్కి ప్రపంచంలో ఎవరికీ తెలియ దని వారి గట్టినమ్మకం.

సరే, లచ్చుడుడబ్బు చాలదని కొంతకాలంపాటు ట్యూషన్ మానివేసి, చీకట్లో అన్వే షణ మానివేశాడు. సంభావితుడయ్యాడా? ముఖ్యకారణం చేత గవ్వలేదు. మరొకసారి వూ రెడితే ఐతాళులు ఖజానా ఎక్కడుందో గుర్తుకు రాలేదు.

లచ్చుడు హతాశుడైతే, జన్నడు ఆదుకున్నాడు. వానికేమో లచ్చునికంటే డబ్బు వసతులు తక్కువే. మాటలనేర్పుతోనే స్త్రీలను వలలో వేసేసుకుంటాడు. నోరుతెరిచి ఏమీ అడిగి తెలుసుకోలేదు. తెలుసుకోవాలనివుంది కాని లచ్చుడు అడుగజాలడు. అందుకే పొంచుండి జన్నని కార్యకలాపం గమనించాడు. హోటేలు యజమానురాలితోనే వాడు స్నేహం చేశాడు అని తెలిసింది. కిట్టు హోటేలుపనిలో మునిగివుంటాడు. జన్నడు తల నొప్పి అని బడిని ఎగగొట్టి ప్రణయం లోపడతాడు. ఒకనాడు లచ్చుడు 'ఒరే జన్న ఎంత మంచి మిత్రుడివిరా? నక్కవురా నీవు, ఎన్నిసార్లు కాఫీ తాపినా గుట్టుమాత్రం బయటపెట్ట వురా' అన్నాడు. 'సరే ఏమిరా చెప్పు' అంటే లచ్చుడు-జ....ల....జా అన్నాడు. జన్నడిని పొడిస్తే నెత్తురు చుక్కలేదు. 'అవునులేరా?' అని ఒప్పుకోవాల్సి వచ్చింది.

ఇకనేమి? లచ్చుని అంతరంగం ఆత్రంకూడ అంతే ఎక్కువ. యజమానురాలు స్నానాలగదిలో వున్నప్పుడే దారి ఏమో మరచినట్లు చూచివచ్చేవాడు. తాను ఆమె వెళ్ళ టానికి ముందుగావెళ్ళి నాలుగైదుబిళ్లు వదలేసివస్తాడు. తరువాత 'ఏమండీ డబ్బు చూచారా? మీరు తీసుకుంటే పరవాలేదు' అని చెప్పివస్తాడు. తరువాత వంటలగురించి 'జలజమ్మవంట భీమపాకం, నలపాకం' అంటూ మరింత తినేవాడు. వీనివెంట జన్నడుచేరి ఆమెను ఉబ్బించేవాడు. ఈవిధంగా ఎన్నో ప్రయత్నాలఫలితంగా ఆ బాలకూడ లచ్చున్ని పలచేస్థితి వచ్చింది.

లచ్చడు మళ్ళీ పాసు అయ్యాడు. మెట్రిక్కు చేరాడు. జన్నడు ఫైలు అయి సహపాఠి అయ్యాడు. లచ్చనిపట్ల ఈసారికూడ ఐతాళులు ఉదాసీనంగానే వున్నారు. కిట్టనిహొటేలు స్థితి తగ్గుముఖం పట్టింది. కాఫీహొటేలు భాగస్వామి సరిగాలేనందున మూయాల్సి వచ్చింది. అందుకే పగలల్లా భోజనాలహొటేలులోనే వుంటున్నాడు. జలజమ్మ పెత్తనం హొటేలులో తగ్గింది. ఊరకే బడిపిల్లల వంటలోమాత్రం ఆమె శ్రద్ధచూపాలి. ఈ జన్నడు, లచ్చడు తమ కార్యాలను నిరాటంకంగా సాగించడానికి కొంచెం కష్టమయింది. ఈ విద్యార్థులుమాత్రం గంటకు ఎనిమిదిమార్లయినా వంటగదిలోకిదూరి, 'మంచినీరు' అని చేరి మాట్లాడితే కిట్టడు అనుమానంతో అసూయతో భార్యను బాగా నిష్కారణంగా దెప్పడం, తిట్టడం మొదలు పెట్టాడు. జలజాక్షి మనస్సు తిరిగి మరేదో పుపాయంగా ఆడదారి మానలేదు.

కిట్టు వుపాధ్యాయుడు అడకొత్తులోని పక్క అయ్యాడు. జలజాక్షి రీతికూడ వానికి వహించలేదు. జనాన్ని తప్పించాల్సి వచ్చింది. రామఐతాళు లెప్పుడైనా వచ్చికూర్చుంటే 'మహారాజా! మామాట ననేమిరా వినడు. వానిమాటలు, చేష్టలు, దర్బారు, వాని వేళపాళలు మాకు నచ్చడంలేదు. వానినుండే ఇతరపిల్లవాండ్రు పాడైపోతున్నారు' అని నిందించాడు. ఐతాళులుకూడ 'క్షమించు మహారాజ! మీ హొటేలే లేకుంటే, వేరే హొటేలుచేరి యింకా చెడిపొయ్యేవాడే. ఈసారి మెట్రిక్‌తో వానిచదువు ముగించుతాం' అన్నారు.

కిట్టు వుపాధ్యాయునికి మళ్ళీ వుభయసంకటమే. ఉన్నకారణాన్ని విడమీసి చెప్పజాలడు. అన్నంబుప్పు బాకీవున్నాడని జన్నణ్ని వెళ్లగొట్టేశాడు. వాడువెడితే లచ్చడైనా వూరకుంటాడేమోనని, తనకోపానికి కళ్లెం వేశాడు. జన్నడు వెళ్లగానే జలజాక్షికి వుద్వేగం ఎక్కువైంది. మగణ్ని తానే దెప్పేవంతు అందుకొంది. రెండవసంవత్సరం గడువులో తాను అనవసరంగా పట్నం చేరానేమో అనేచింతతో భార్యతో మాటలను మానివేస్తూ, మళ్ళీ స్నేహం కలుపుకుంటూ ఎన్నోతంటాలు పడ్డాడు కిట్టు.

జలజాక్షి ప్రేమించకుంటే మానె. కిట్టనికిమాత్రం దేహం, జీవం, లేవా? ఆశలు లేవా- భార్య ముభావం చూపితే కామం పగబట్టింది. గట్టిగా భార్యను దండిస్తే హొటేలులో అపవాదాలూ బయల్దేరి వూరినుండి పారిపోవాల్సి వస్తుంది, మళ్ళీ 'వంటవానిపని, మళ్ళీపెళ్ళి అని' అన్నీ సమస్యలే ఎదురవుతాయి. తానుకూడ ఎల్లాగో సరిపుచ్చుకుంటూ హొటేలు తనకుతానే తుదముట్టేదాకా వుంచామని తానుకూడ చక్కని అడ్డదారి చూసుకున్నాడు.

లచ్చని మెట్రిక్ పరీక్షలకు చదువు తాపీగా మెల్లిగా సాగుతున్నది - కాలం ఎంత వేగంగా సాగిందో చెప్పజాలడు.



# 15

ఎందుకవ్వా ప్రతిసంవత్సరం ఎండకాలం సెలవులు వస్తాయి అని లచ్చనికి బెంగవున్న
వ్వుడే ఎండకాలం రానేవచ్చింది. సెలవులుకూడ వచ్చినై. ఏప్రిల్‌కే పరీక్షలుకూడ
అయిపోయినవి. చివరకు 'కోడిగ్రామమే' శరణ్యం అయింది. ఈ దరిద్ర వనవాసం ఎప్పుడు
తప్పుతుందో అని చింతతో ఎదురుచూచాడు. కోడి వద్దంటే పడుమున్నారు- అక్కడకూడ
సుఖంలేదు. తాతయొక్కవయస్సు బలాన్ని, దేహాన్ని మింగేస్తున్నది. ఆ ముసలికబోదితో
తనకేమి పొత్తు? అంతా చప్పగా వుందని దొంగతనంగా కుందాపురంకూడా వెళ్ళివచ్చేవాడు.
కాలేజీ, స్కూళ్లు, కోర్టులకుకూడ సెలవులు రాగానే హొటేలుకు సెలవులిచ్చి కిట్టు వుపాధ్యాయుడుకూడ వూరికి వచ్చాడు. తన చుట్టుపక్కల్లోనే జలజమ్మకూడ నివాసం చేస్తున్నదని
తెలుసుకొన్న లచ్చనికి పట్టపగ్గాలే లేవు. ఏదో మిషతో సుబ్రాయవుపాధ్యాయుల ఇంటికి
వెళ్లాడు. తాను వూళ్ళోనే వుంటున్నట్లు సూచించాడు.

'పిల్లవానికి పెళ్ళి చేయరాదా?' అని సరసోతి అన్నపై ఒత్తిడి తెచ్చేవేళలోనే,
సుబ్రాయవుపాధ్యాయుల భార్యకూడ ఏమో నీలాపనిందలు సరసోతి చెవిలో వేసింది. ఆమెకు
ఎక్కడలేని గాబరా పుట్టుకొచ్చింది. ఒకసారి తాను పసులను తోలుకొని వస్తుంటే సాయం
కాలం లచ్చడు దొంగగా జీడిచెట్లలో దూరాడు.

సగం కళ్ళుమూసుకుని సరసోతి అటువైపు చూచింది. 'అరే! లచ్చన్న, వాడెందుకు
ఇక్కడ?' అనుకున్నది. అటూ ఇటూ ఆలాగే చూచింది. మరొకప్రాణి కనబడింది. ఆజీవి
కదలింది. సుబ్రాయవుపాధ్యాయుల ఇంటివైపే అల్లా తప్పుకొన్నది. జలజాక్షి అని
సంశయం కలిగింది.

ఆమెకేమో ఆరోజు జ్వరంవచ్చిందా అనే సంశయం కల్గేటంత వేడెక్కింది. ఇల్లి
చేరింది. ఆమెకు తనగుట్టు తెలిసిందే అనుకుంటూ లచ్చడు మెల్లిగా ఏమీ తెలియనట్లు
నటిస్తూ ఇల్లు చేరుకున్నాడు. ఐతాళులు రాత్రి పదిగంటలకు పౌరోహిత్యాలుచూచుకుని ఇల్లు
చేరారు. సరసోతి ప్రాకారద్వారంవద్దనే అన్నకొరకు ఎదురుచూస్తూ నుంచున్నది. 'ఏమమ్మా
నిలబడ్డావు?' అన్నాడు అన్న. ఆమెకు కన్నీటిధార కట్టింది. తాను విన్నది, చూచింది
అంతా కలిపి వర్ణించి చెప్పింది. రెండేండ్లనుండి లచ్చనిముఖం చాల పీల్చుకుపోయింది.
ఎందుకో! వూళ్ళుతిప్పటలో బలహీనతయేమో అనుకున్న సరసోతి అంతాముగించి, 'ఏలాగైనా
సరే! ఒక బుద్ధి హితోపదేశం చెప్పు: వింటేసరే, లేకున్నసరే; తరువాత పెండ్లి తప్పక చేసి
వేయి. ముందే నామాటవింటే, ఈగతి పట్టేదికాదు వానికి' అన్నది.

ఐతాళులు ఇంట్లో జపం ముగించుకున్నారు. అంతదాకా నోరు విప్పలేదు. చివరకు
'రారా, లచ్చ!' అని కేకపెట్టారు. లచ్చడు నిద్రపోయినవానిలాగా నటించాడు. మరొకసారి

తండ్రిపిలుపు వినగానే, 'ఈ ఇంట్లో నిద్రకుకూడా నోచుకోరాదేమో!' అన్నాడు; తరువాత లేచివచ్చారు. ఐతాళులు 'ఒరే, కిట్టు వుపాధ్యాయునిమర్యాద చెడగొట్టినావు-అని మప్రాయరు చెప్పినా వినిపించుకోలేదు. నీవు ఇలాంటిపనులు చేసేబదులు పెళ్ళి కావాలని స్పష్టంగాచెప్పితే బాగుండలేదా? జలజమ్మతో నేస్తం అని తెలిస్తే నీకేమైనా వూళ్ళో వుప్పురాయి పుడుతుందా? పోనీ నిన్ను కన్నవారికి ఏమి విలవుంటుంది?' అన్నారు. లచ్చన్న ముఖంమాడ్చుకొని, 'ఎవ రెవరో చెప్పినవన్నీ నమ్మి మీరుకూడ అన్యాయంగా మాట్లాడుతారు! సరే కానీ' అన్నాడు. 'అవునురా, ఈ సాయంకాలం సరసోతి మీ ఇద్దరినీ చూచిందికూడ అబద్ధమా?' అన్నారు ఐతాళులు. లచ్చడు చలించలేదు. 'ఆమెనా? పగలే కళ్లు కానరావు అంటుంది. సాయంకాలం కూడ కనబడుతుందా?' అని కోపంతోనే వ్యంగ్యంగా పలికాడు.

రామఐతాళులు చెయ్యి పైకెత్తారు. కొట్టేశక్తి లేదు. లచ్చనితీరు తెలుసు. దానికి మందు లేదనుకున్నారు. ఒకేసమాధానం చెప్పారు. "నీవు ఈవిధంగా వుండేటాగుంటే ఇంట్లో వుండకు. నీకు, నాకు ఋణం తీరిందనుకో. నేను తండ్రిని కానులే. నీవు కొడుకేకాదు. నేను కష్టపడి జీవం పిండిచేసుకున్న ఆస్తి అంతా సచ్చికేగాని నీకు రాదు. నాది తప్పు-క్షమించు అని చెప్పుకొనేదాక నీకు ఇంట్లో స్థానం, తిండి లేదు" అనిరేగి వెళ్ళి పడుకున్నారు. సత్యభామకు అన్నీ తెలిసాక 'నిజమేనా నాకొడుకు అలాంటివాడా!' అనుకున్నది. లచ్చన్న మాత్రం స్తంభంలాగే నిలబడ్డాడు. చాలసేపు అలసి, ఇంటివెనుక ఇసుకదిబ్బమీద కూర్చున్నాడు. ఆకాశంలో చుక్కల్ని లెక్కపెట్టాడు. తెల్లవారింది. తలవంచాలి అంటే సిగ్గు, గర్వం. తండ్రి వెళ్ళగొడితే ముందుగతిలేదు. అదికూడ తెలుసు, మరునాడువుదయం పొన్న చెట్టు పైననే నివాసం.

పారోతికి లచ్చనిచరిత్ర అర్థమయింది. వానిచేష్టలకు ఆమె శరీరంకూడ బాగా తపించింది, వాణ్ని వెళ్ళగొడితే చెయ్యి జారిపోతాడని అనుకున్నది. ఆమె చాల ముసలిదయింది, సరసోతికంటె చిన్నదైనా నడిచేశక్తిలేకుండా పోయింది. సముద్రతీరం, ఇసుకలు, పొలం, కాలువ అన్నీ వెదకి కొడుకునుగురించి బెంగపెట్టుకుంది. మధ్యాహ్నం తాను భోంచేయలేదు. 'సరసోతి, నువ్వయినా సరిగా బుద్ధి చెప్పరాదా' అన్నది. రామఐతాళులు తిరుగజాలరు అని తెలుసు. సరసోతికూడ 'పారోతీ, నీకు వట్టిభ్రమ. ఒకసారైనా కొంతగట్టిగా, బింకంగా వుండాలి. లేకుంటే వాడు బాగుపడడు. వానికి ఆకలైతే ఇంటికే వస్తాడులే' అన్నది. ఆ రోజంతా పారోతి పస్తు పడింది. మళ్ళీ వెదకడానికి వెళ్ళింది. పొన్నచెట్టు మొదట్లో తిరిగింది అక్కడ కొనకొమ్మలో వూగుతూ లచ్చరాయడు వేంచేసియున్నాడు. 'బిడ్డా, నా మాటైనా వినరా, ఇంటికి రా' అని పిలిచింది. లచ్చడు దిగివచ్చాడు. మాట్లాడలేదు. 'ఇంటికి రారా' అన్నది. 'వారు నన్ను రానియ్యరులే' అన్నాడు. 'తప్పు చేసినవారు తప్పు చెయ్యనండీ అని చెప్పుకోరాదేమిరా!' అన్నది. లచ్చడు గొల్లుమని వెక్కి-వెక్కి ఏడ్చాడు. అప్పుడు పారోతిమనస్సు కరిగింది. తనతో చిన్నతనాన 'పెద్దమ్మ' అని వెంటతిరిగి ఆడు



కున్నదంతా జ్ఞాపకం వచ్చింది. వాని చిన్ననాటిచేష్టలన్నీ కళ్ళకుకట్టినట్లు జ్ఞాపకం వచ్చినాయి. 'లచ్చ, మర్యాదను మించి బతుకు దండుగరా!' అన్నది.

'అవును.'

'సరసోతితోనైనా చెప్పుకోరా! తప్పయిందని-అంతకష్టమా.'

'చెబుతాను. కాని వారి ఎదుటమాత్రం వెళ్ళను' అన్నాడు.

'నువ్వు చక్కగావుంటే వారిదేమిరా తొందరగా చల్లబడుతారు. వారంటే రాయి అనుకున్నావా? కొడుకుద్వారా సద్గతులు పొందాలని రెండవపెళ్ళి చేసుకున్నవారికి నీవు అక్కరలేదా చెప్పు? నీమీద పగ అనుకున్నావా?' అన్నది.

పారోతి పరుగెత్తివెళ్ళి సరసోతిని సంధికి, సమాధానానికై తెచ్చింది.

లచ్చడు అవమానంతో 'నాదే తప్పు' అని ఒప్పుకున్నాడు.

'ఇక నీవు ఇల్లాంటిపనులు చెయ్యకు-చేసింది మాపుతారా!' అన్నది.

'సరే.'

'దైవం మేలుచేస్తే నీకు తగ్గదాన్నితెచ్చి పెళ్ళిచేయిస్తా' అన్నది సరసోతి.

'సరే.'

'చూడురా! శీనమయ్యకొడుకులు బోలెల్లో గరిటెలుతిప్పి, డబ్బాలనిండా ధనం కుమ్మరించి తండ్రిని ఎల్లాగు సంతోషపెడుతున్నారో! తండ్రికి మంచిపేరు తెస్తేసరి - వేరేపేరు మోపితే 'కోడి ఐతాళులురా' అని భయపడేవారు ఏమంటారు?' అని వుపదేశించింది.

జడివాన, హోరుమనిగాలి తరువాత కొంత స్తబ్ధత కలిగినట్లయింది. వారింట్లో ఐతాళులకు పిల్లవానితో మాట్లాడాలని లేదు. కానీ కోపంమానేసి, 'పోనీలే మంచి యోగ్యురాలైన పిల్లను తెచ్చికడుతాను. ఆమెవలననైనా వీడు గౌరవంగా బతుకనీ' అన్నారు. అప్పటినుండి జాతకాలపరిశోధన చెయ్యజొచ్చారు. సరసోతి 'అన్నా! ఈకాలంవాడు తానే పిల్లనుకూడ చూస్తాను అంటాడేమో. చేతులు, కాళ్ళు, ముక్కు, కన్ను చక్కగావుండి ఎర్రగా బుర్రగా వున్నపిల్లనే చూచికట్టు' అన్నది.

'సరేలే' అన్నారు.

'ఏడునాళ్ళు ఎండలో ఎక్కడెక్కడో తిరిగివచ్చారు. తెలిసినచోట్లల్లా జాతకాలు అడిగారు. అడుగటానికి ముందుగనే ఊరివాళ్ళు రాయబారాలు నడిపారు. ఐతాళులనియమాలు రెండు. జాతకాలు కుదరాలి, పిల్లవాడు అంగీకరించాలి - అని. పదుమున్నూరివారుకూడ అల్లాగే కన్యాన్వేషణ చేశారు. ఇంతలోగా వానిభవిష్యత్తు చూచుకోవాలి. మెట్రిక్కుతరువాత ఏం చెయ్యాలి? కుందాపురంలోనే గుమాస్తాగా చేరాలా? లేక మరేమైనా చెయ్యాలా? అనే విచారం, యోచన జరిగింది. సరసోతికిమాత్రం ఇకముందు వానికి చదువు అక్కరలేదు

అనిపించింది. ఆమెకేమో అన్నతరువాత పౌరోహిత్యం ఆగిపోతుందే అనేబెంగ. దానికి తగినట్లే వుపదేశించింది.

రామఐతాళులు 'ఏమైనాసరే బాగా ఆలోచించాల్సివుంది. చెప్పు. ఈ లచ్చుడు ఇంటి భూమి సాగుచేసుకుంటాడంటావా? వాడు అంతా మూడుకాసులకు అమ్మి పోకుంటే గొప్ప-' అన్నారు. కొడుకు ఇంగ్లీషువిద్యతో గొప్ప పేరుప్రతిష్ఠ తెస్తాడనేనమ్మకం ఎన్నడో మానిపోయింది. కానీ ఆ మెట్టుతో తృప్తిపడితే ఏలాగు?' అనేచింత. ఆశలు లేకపోలేదు. యోచన చేస్తుండగానే ఐరోడు వకీలు వాసుదేవయ్యగారు తమగ్రామానికి వచ్చారని వార్త తెలిసింది. ఆ వకీలుగారింటికి అప్పుడప్పుడు పౌరోహిత్యం వెడతారు ఐతాళులు. కోడినుండి తూర్పుకు ఆవలి వొడ్డునవుండే గ్రామం ఐరోడి. అక్కడ ఉత్తరంతీరాన నిలబడితే కొబ్బెరచెట్లు, తోట వెంకటిల్లు వారిదే. అంటే వకీలుగారు మేనెలలో కోర్టులసెలవులు వూళ్లోనే గడుపుతారు కాబోలు. మిగిలిననెలల్లో మంగళూరిలో వకీలుపని. ఇల్లు ఆస్తి తమ్ముడు చూచుకుంటాడు. మంచి అనుకూలమైన ఇల్లు. ఊరివాళ్ళు ఏమైనా ఆ వకీలుగారిసలహాకే వెడతారు. మంగళూరి వకీలు!అంటే గొప్ప దర్జావారే. 'హరి, హరీ' అనుకుంటూ రామఐతాళులు వెళ్లారు. వారంటే వకీలుగారికి చాల ఇష్టం. గౌరవం. వారురాగానే చాప పరపించారు, ఉపచారం జరిగింది.

'మా పిల్లవాడు మెట్రిక్ చేశాడు. పాసు అవుతానంటున్నాడు. వానికేమి ముందుగతో ఆలోచన చెప్పాలి-ఊళ్లోనేవుంటే ఏం చేయాలి?' అని సలహాను అడిగారు. రామఐతాళులు బాగా కలిగినవారని విని వకీలుగారు 'బి. ఏ; పూర్తి చేయించరాదా? లేకుంటే, డాక్టరుగా, లేకుంటే మరొకపనికి పంపండి' అన్నారు.

'డాక్టరా?' అని ఆశ్చర్యంతో ఐతాళులు సమాధానం చెప్పారు.

'మీరేమో వైదీకులు. పీనిగలను కోయాలి కాబోలు' అన్నారు వకీలు.

'మీరు చాల వినోదం ఆడుతున్నారే-ఆ వృత్తి వద్దులేండి, మరేమైనా చెప్పండి.'

వకీలుగారు 'మాకాలంలో మెట్రిక్కుకే చిన్న వకీలుపని దొరకేది. ఈ రోజుల్లో వకీలంటె B. A., B. L., అవాలి? మొదట్లో రెండేండ్లు F. A. తరువాత చూద్దురులేండి.' అన్నారు.

'సరే అలాగా?'

'అది అలాగే-దేనికైనా మీ పిల్లవాని అభిరుచి తెలుసుకోవద్దా?'

'వాణ్నేమి అడిగేది? అంత బుద్దివుందా?'

'బుద్ధివుండనీ, పోనీ, తండ్రికాదు చదువుకొనేది. కొడుకేకదండీ. వాణ్ని పిలుచుకొని రండి, ఇంగ్లీషు నేర్చినాడుకదా? చూద్దాం. పట్నం ఇంగ్లీషా, పల్లెటూరి ఇంగ్లీషా మాట్లాడుతాను' అన్నారు. ఐతాళులు అల్లాగే అని అక్కడే భోజనాలు ముగించుకొని వూరికి తిరిగి వెళ్ళారు.



వారు వెళ్ళాక వకీలు వాసుదేవయ్యగారి తమ్ముడు నారాయణయ్య 'అన్నా! నీ కూతురికి వరుణ్ని ఎక్కడెక్కడో వెదుకుతావుగదా! ఈ పిల్లవాణ్నికూడా చూడరాదా! ఐతాళులు స్వయంగా అమాట ప్రస్తావించడం సబబుగాదు. 'గొప్పవారు, మా ఇంటికి పిల్లనిస్తారా' అని చెప్పగలరుకూడ, వారేమి పనికిరాని ఆసామీకారు. ఈనడుమ కోడిలోవుండే ప్రతియొక్క తోట శీనమయ్యగారిని విడిస్తే, వీరికే ఆయకంగా వుంది' అన్నారు.

'అయితే అంత గట్టివారా? భద్రంగా వున్నారా?'

'మనగ్రామంలోనే వందరూపాయలకుమించి సర్కారుశిస్తు చెల్లిస్తారు. కోడిలో రెండువందలపన్ను చెల్లిస్తారేమో! నగదు పదివేలైనా దాపరికం. వారి నాల్గుమూర్లపంచను చూచి వారి అంచనా వెయ్యరాదు.'

'తమ కూతురిజాతకల వారికుమారునితో కలిస్తే ఒక గొప్పసమస్య తీరిందనుకోవచ్చునుగదా' అని వకీలుగారుకూడ యోచించారు. వారికి నలుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. పెద్దదానికి వయస్సు అవుతున్నది. పేరు నాగవేణి. ఆమెకు పన్నెండవసంవత్సరం, సరే ఇప్పుడు కాకుంటే ఇంకెప్పుడు? అని తండ్రికి దిగులు. తాము మంగళూరివకీలు అయినా బంధుత్వం ఊళ్ళోనే కుదరాలి.

మరునాడు వాగ్దానంప్రకారం పొద్దుపొడిచినగంటలోనే ఐతాళులు వచ్చారు. వారివెనుక శుభ్రంగా దుస్తులుధరించి, తల దువ్వుకొని జుట్టు ముడివేసుకొన్న కుమారుడు లచ్చుడుకూడ వచ్చాడు; కోటు, షర్టు, చేతిలో దుకాణం వాటర్‌ప్రూఫ్ గొడుగు.

వకీలుగారింట్లో తలవాకిట్లోనే నారాయణయ్యగారు ఎదురువచ్చి 'ఓహో, తండ్రికొడుకులు ఇద్దరూ వచ్చారా? రండీ కూర్చోండి, అన్న కొత్తసాగు పొలంచూడటానికి వెళ్లారు. అక్కడ ఈసారి నూరు కొబ్బెరచెట్లు నాటారు. చూద్దాం అని వెళ్ళారు.' 'సరేలెండి-ఈవేళ పూర్వం, అపరం, శాంతి ఏమీలేదు. కూర్చుంటాను' అన్నారు ఐతాళులు. వారు ఏమో మాట్లాడేలోపుగానే లోపలినుండి పిల్లలు ఆడుకుంటూ కేకలతో బయటికివచ్చారు. జడవేసుకొని, నల్లని చిన్నపావడా కట్టుకొన్ననాగవేణి, చిన్నది, అన్న, తమ్ముడు, చెల్లెలు అందర్నీ తీసికొని ఆటకు బయటికి వెళుతుందేమో, వచ్చింది. నాగవేణి చిన్నదైనా ఏపుగా పెరిగింది. బడిలో చదువుకుంటుంది. ఆటలకోసం బయటపడినవారిని పినతండ్రి 'ఛీ, అల్లరి, ఇంట్లోకి పొండి. అక్కడ స్థలం చాలదా, బయలులో ఆడుకొండి. ఇక్కడెందుకువచ్చారు?' అని బెదరించారు. ఆ గుంపు శాంతంగా అక్కడినుండి మాయమై వెళ్లింది.

'వాళ్ళందరూ మా అన్నగారిపిల్లలు. సెలవులలో ఇంటికివస్తే ఇల్లు మిద్దె పీకి పెడతారు' అన్నారు నారాయణయ్య.

'ఆ చిన్నపిల్లకూడ మీ అమ్మాయికదా!' అన్నారు ఐతాళులు. 'మా బిడ్డకు ఎనిమిదేండ్లు. ఈమె పెద్దది. అన్నకూతురు. నాగవేణి. వాళ్ళనెందుకుచూస్తారు, ఎప్పుడో మూడేండ్లకొకసారి వచ్చేవారు' అన్నారు నారాయణయ్య.

లచ్చన్నదృష్టి ఆ బాలికవైపే సాగింది. తండ్రి ముందువిద్య సాగించడానికి సలహాలకై వచ్చారనితెలిసి, వానికి మరొకవూహకూడ కల్గింది. ఇంతదాకా కళాహీనమైన ముఖం ఎందుకో విచ్చుకుంది. నారాయణయ్యగారు అక్కడనే చావట్లో వారికి స్థానమిచ్చి 'ఐతాళులూ! మీకు కాఫీ ఇష్టమా! పెసరగంజియా లేక ఎడవీరా!' అని అడిగారు.

'మాకెందుకు? అంతా వుష్ణం అవుతుంది. ఈకాలంవారికేమో కాఫీలు కావాలి నాకేమీ వద్దు' అన్నారు.

'వూరకుంటారా! వద్దు, మీకు పెసరగంజి, పిల్లవానికి కాఫీ చేయించుతాను' అని లోనికి వెళ్ళారు.

తండ్రి, కొడుకులు వియ్యాలవారిలాగా కూర్చున్నారు. తండ్రిమాత్రం కొడుకుముఖం నేరుగా చూడలేదు. ఈ మూగతపస్సులమధ్య వకీలుగారే తోటను చూచుకొని వెనుకకు వచ్చారు. రాగానే, 'అవునా, ఐతాళులూ! వీడేనా మీకుమారమహారాజు! ఎక్కడ? కుందాపురమా. ఉడిపా చదువుకున్నది!' అనడిగారు.

కొంచెంసేపటిలోనే కాఫీ వచ్చింది. పెసరగంజి నూనెలోవేయించిన మంచి అప్పడాలు వచ్చాయి. ఆ ఉపాహారానికి వకీలుగారుకూడ కూర్చున్నారు. 'చూశారా! ఐతాళులూ! పాతకాలం వెళ్ళిపోయింది అనడానికి మీకొడుకే తార్కాణం, కాఫీ తాగుతున్నాడు. నాకేమో దినము కాఫీ తప్పదు' అన్నారు. 'అయ్యో! మీరా! వకీలుగారు, తాగితేబాగు, పట్నంగాలిలో కాఫి అవసరమే. మావూరి తోదేళ్ళకెందుకంట, తౌడుతినక కాఫిలు పీపీలు. శీనమయ్యలాంటి ముసలివాళ్లు బెంగుళూరుచూచానని కాఫీ తాగేది న్యాయమా? ఏమైనా అర్థముందా చెప్పండి' అన్నారు ఐతాళులు. అల్లాగే మాటలు, శీనమయ్యగురించి చర్చ జరిగింది. వాళ్ళపిల్లల సంపాదన, హోటేలువలన సంపాదనలు అన్నీ మాట్లాడారు. వకీలుగారు—'ఈ వకాలత్తు ఎవరు వ్యాజ్యం వేస్తారు? అని ఎదురుచూచేదానికంటే అదే నయం' అన్నారు.

'అవునులేండి, మా సుబ్రాయవుపాధ్యాయుడుకూడ అంతే. ఈసారి ఇంటికి పెంకు కప్పుతాడట, కొడుకేమో కుందాపురంలో చిన్న గుడిసెహోటేలు పెట్టుకున్నాడు' అన్నారు ఐతాళులు. 'అయితే కోటవారి హోటేలు కుందాపురంలో వుందన్నమాట' అని వకీలుగారు కూడ తమ జాతి అభిమానాన్ని ప్రకటించారు.

సరి. వచ్చినవారిని మధ్యాహ్నం భోంచేసివెళ్ళమని అహ్వానించారు వకీలుగారు. ఐతాళులు త్వరపడుతూ, వకీలుగారూ 'వచ్చినసంగతి ముందు ఏంచాయాలో చెప్పరైతిరి!' అన్నారు. ముందుయోచన అంటె కుమారుణ్ని మాట్లాడించి చూడాలి, వాడు చెప్పిందానికంతా మౌనంగానే సమాధానం నేర్చుకున్నాడు. తండ్రి ఎదుట సిగ్గుపడతాడేమోనని వకీలుగారు తండ్రికి తెలియనిభాష ఇంగ్లీషులోనే అన్నీ ప్రశ్నించారు. లచ్చనికి భోజనసమయంలో ఉభయసంకటం ఏర్పడింది. చివరలోకూర్చున్న సదాశివుణ్ని మాట్లాడించినట్లు కాదు. వచ్చి



మెరుపుతీగెలాగు వెలిసివెళ్ళిన ఆ చిన్నారినికూడ చూడలేకపోతినే అని చింత పట్టుకుంది. ఏమీ చెయ్యనియ్యకుండా వకీలుగారి ప్రశ్నల జడివాన విడువదు.

భోజనంతరువాత లచ్చడు వారిని తప్పించుకున్నాడు. ఈ ఇంగ్లీషువీరునితో మాట్లాడటానికి సదాశివుడు సిద్ధమయ్యాడు, ఇద్దరూ ఏమేమో మాట్లాడుతూ మిద్దెక్కారు. వకీలుగారేమో చావట్లో బాతాఖానీ వేస్తున్నారు. 'పిల్లవాడేమో చురుకుగానేవున్నాడు. వీలుంటే ఎఫ్. ఏ. చేయించండి. ఐతాళులు ఖర్చు వెచ్చాలకథ తెలుసుకున్నారు. 'మొత్తం నెలకు ముప్పైలెండి' అన్నారు వకీలుగారు. హోటేళ్ల వివరాలు అన్నీ తెలుసుకున్నారు! వకీలుగారు 'మీకు అన్నీ సర్దుకుంటాయి, ముప్పైరూపాయల తాహత్తులేదా' అన్నారు. ఐతాళులు పేదరికం నటించలేదు.

మాటలవరుసలో 'ఐతాళులూ, మీ పిల్లవానిజాతకం ఒకసారి పంపండి. చూదాం. లేకుంటే మీరే మా నాగవేణిజాతకం వెంట తీసికొనివెళ్ళండి' అన్నారు. ఐతాళులకు నోట మాట పెగల్లేదు. వకీలుగారే 'ఏమండీ, పలుకరు!' అన్నారు. 'కాదండీ, తమలాంటివారికి వైదీకం గొడ్లపిల్లవాడా!' అన్నారు. 'అది వెనుకటి కథ, ఈకాలంలో ఇంగ్లీషుచదువే చూస్తారు. ఇతరపురాణాలు ఎవరడుగుతారు? మీ పిల్లవానికి మా పిల్లజాతకం పొంతనం కుదిరితే వద్దంటారా?' అనగా ఐతాళులు హర్షమే ప్రదర్శించారు.

సరే, సాయంకాలం 'వాడెక్కడ?' అని ఐతాళులు విచారించారు. సదాశివునివెంట వాడు దిగివచ్చాడు, గంట రెండుగంటలస్నేహంతోనే యుగయుగాల స్నేహాలున్నట్లు చేరుకున్నారు. వెళ్ళేటప్పుడు లచ్చణ్ణి వానితో 'రావయ్యా మా ఇంటికికూడ' అని ఆహ్వానం చెప్పాడు. ఐతాళులతో వకీలుగారు 'చూడండి! ఇద్దరు ఇంగ్లీషుచదువరులు ఎల్లా జత చేరారో, మా పెద్దకుమారుడు సదాశివుడు, వాడుకూడ మెట్రిక్కే. అందుకే చూడగానే దోస్తీ కుదిరింది' అన్నారు.

ఐతాళులు నాగవేణి జాతకం వెంటతీసికెళ్లారు. రాత్రి ఆ గుడ్డిచిమినీలాంపులోనే 'స్ఫుటంచేసుకుంటూ, ఈ పడుచుకు ఈ వరుడు ఖాయం' అన్నారు. వకీలుగారు ఒప్పుకున్నారు. ఇంకేమి దిగులు. పిల్లను పిల్లవాడుసహా చూశాడు. వాని అభిప్రాయాన్ని ఒకసారి అడిగి తెలుసుకుంటే, రేపే మాటలు జరుపుతాననుకుని తీర్మానించారు, ఆరాత్రి ఆడవాళ్ళతో దైవం మేలుచేస్తే ఇంకొకలగ్నం బాధ్యతకూడ తీరేట్లున్నది. వానివిద్య ముందు నడడానికి, సరియైనస్థళం దొరికినట్లే నేను ముసలితనంలో వానిచింతతో నలిగిచావాల్సినపని లేదు' అన్నారు.

ఇక్కడ లచ్చడు 'తననేమో వెంటబెట్టుకొని పోయిందే లగ్నం ప్రస్తాపానికని, ఆ పాపిష్టిజాతకం కుదురకుంటే ఎల్లాగురా' అనేయోచనలో వున్నాడు. సరసోతి వానిదగ్గరకు రాయభారం వెళ్ళింది. 'ఒరే, అల్లుడూ! నీవు ఈవేళ వెళ్లావే వకీలుగారింటికి; ఒకవేళ వాళ్లు వాళ్ళబిడ్డ వివాహంగురించి అడిగితే నీవు వద్దంటావా? అనవుగదా! అల్లాంటి మంచిసంబంధం మళ్ళీ ఎక్కడా దొరకదురా!' అన్నది. మీరు చెబితే నేను వద్దంటానా అత్తా?' అన్నాడు లచ్చడు. 'పోనీలే, పిల్లవాడు సన్మార్గంలో పడేవేళ అయింది' అనుకుని తీర్మానించింది సరసోతి.

మధ్యాహ్నం భోజనంతరువాత, ముహూర్తంచూచుకొని, రెండుజాతకాలు వెంట బెట్టుకుని ఐతాశలు ఏరోడుకు వెళ్ళారు. 'నేనూ రానా:' అని అందామని లచ్చుడు ఆదుర్దా వున్నా, నాయన ఏమంటారో అనేభయంతో వారు వెళ్ళేదాకా తూర్పుదిక్కే చూస్తూ వారు సరిగా ఏరు దాటారో లేదో గమనించారు. ఐతాశలువెళ్ళి సాయంత్రానికి ఇల్లుచేరారు. అంగ ళంలో కాళ్లుపెట్టి నేలకు ఋడిస్తూ 'సత్య, సరసోతి చూడండే. దేవుడు నడిపిస్తే అన్నీ తమంతటే వచ్చేస్తాయి అన్నారు. 'ఏమి, ఏమి?' అని అడుగగానే, 'వాళ్ళందరూ చదివిన వారు; సరిగా చదువురానివాడు లచ్చడే' ఈ సంగతులు లచ్చడు వినాలని చెవులు నిక్కించు కుని కూర్చున్నాడు. 'ఈ వేసంగి సెలవులలోపుగానే పెండ్లి చేసేస్తారట. అల్లునిభారమంతా తమదే అన్నారు వకీలుగారు' అని ఎంతోచెప్పి శుభవార్తను తెలిపారు.

మరునాడే పడుమున్నూరికి వార్త పంపారు. అక్కడి ముసలివారుకూడ విన్నారు. వార్త పంపారు. 'లచ్చణ్ని ఒకసారి పంపండి. నాకు ఇంక ఎన్నాళ్లో లేవు. వాడు మంగళూరు వెళ్ళిపోతే అక్కడినుండి తిరిగి వచ్చేదాకా నే నుంటాననేధైర్యం లేదు' లచ్చడుకూడ తాత గారి ఆశీర్వాదాన్ని పొందడానికి పడుమున్నూరు వెళ్ళాడు. ఐతాశల ఇల్లుకూడ పెండ్లింటి సందడితో మోగుతున్నది. పందిరి, నేలవసతి, అప్పడాలు, వడియాలు ఎన్నో చెయ్యాలి. మద్రాయ ఉపాధ్యాయులే సర్వస్వం సాగిస్తానన్నారు. సరసోతి, సత్య, పారోతి ముగ్గురు కూడ విరామంలేకుండా కష్టపడుతున్నారు. పెండ్లిసంగతి పదునాల్గుగ్రామాలకు వ్యాపించింది. ఊరకే ఐతాశల కుమారునిపెళ్ళి అంటే అంత సంబరం కాదు. మంగళూరు వకీలుగారు, ఏరోడి మోతుబరీ ఇంట్లో పెళ్ళి అట అనే వార్త మరింత రక్తి కట్టింది.

ఊళ్లో చాలమందికి కొంత వినోదాన్నికూడ కల్గించింది. విని ఆనందించినవారున్నారు. అసూయపడినవారూ వున్నారు. 'జాతిపోసి సుఖపడ్డారు' అన్నవారున్నారు. 'వకీలుగారి ఖర్మ, ఈ వైదికం బ్రాహ్మణి వియ్యం అందాను' అన్నవారూ లేకపోలేదు. శీనమయ్యారు వకీలు గారి దుర్గతికి జాలిచూపారు. వాసుదేవయ్య మంగుళూరులో పేరుమోసిన వకీలు. సీనమయ్య పొలంవ్యాజ్యం కుందాపురంలో చెడిపోయింది, అపీలుకు వాసుదేవయ్యగారిదగ్గర వెళ్ళాలన్న రోజే పెళ్ళిసంబంధం కుదిరినసంగతి తెలిసింది. అతనికి సమాధానం లేదు. కాని వ్యాజ్యం రికార్డు చేతపట్టుకొని అక్కడికే వెళ్ళాల్సి వచ్చింది. వకీలుగారింటి ముందుకూడ పందిరివ్యవ హారంచూస్తే, 'వివాహం సిద్ధం చేస్తున్నారుగదా' అనో, ఎందుకో 'ఇల్లాంటివారి బెడద, సంబంధం ఎందుకండీ' అని మాత్రం అనలేకపొయ్యారు. ఊరకే ఇంటికి వచ్చారు శీన మయ్య.

వకీలుగారి వియ్యంకులు అనగానే రామఐతాశలుకూడ పిసినిగొట్టుతనం సడలించారు. అల్లా ప్రవర్తించాలని వుద్దేశ్యంకూడ లేదు. లగ్నం నిశ్చయమైనదినమే బిడ్డను, అల్లుణ్ని మనుమల్ని పిలిపించారు. లచ్చడుకూడ వెనుకటి అవతారం చూపలేదు. మనస్సులోని ముచ్చట తీరుకుందనేకారణం కాబోలు, చక్కగా మాటకథ అందరితో సభ్యంగానే ప్రవ ర్తించాడు. సుబ్బిమగడు ఇంగ్లీషురాని బావ, వానిపట్ల అంతమంచి అభిప్రాయం లచ్చనికి అంతరంగంలో బొత్తిగా లేదు.



వైశాఖబహుళ సోమవారం అందరూ చేరారు. బాణానంచా, తుపాకీలు, నగారాలు, తప్పెటలు, మంగళవాద్యాలు అన్నీ చప్పుడు చేసినాయి. మధ్యాహ్ననికే వట్టంచుపంచలు తోటనిండా ఆరవేశియున్నాయి. తూర్పు మైదానాలవారు ఐతాశలఇంటికి వచ్చారు. వియ్యాల వారికేమో తూర్పువైపు చేరేవారిసంఖ్య. రెండువైపులవారూ వచ్చి శీనమయ్యారును ఆహ్వా నించారు. వారికి వెళ్లాలని లేదు. వెళ్లకుంటే బాగుండదు. అందుకే పెళ్ళికొడుకు సమారాధ నకు వెళ్ళకుండా పెండ్లికూతురివారింటికే వెళ్ళి అక్కడిగుంపులో చేరిపొయ్యారు.

సాయంకాలం పెళ్ళివారి వూరేగింపు. గట్టునుండి నదీతీరందాకా పెళ్ళికొడుకు గుంపు, మేళంవారు, ఛత్రం, తోరణం, పల్లకి, పక్కతోరణాలు, ఉడుపీబ్యాండ్ (వకీలుగారే పంపిం దని) దానివెంట రెండు రెండేనుగులుకూడ వూరేగింపులో పాల్గొనాలి. ఈ అన్నీ నారాయి ణయ్యారు ప్రత్యేక అభిలాష. ఐతాశలేమో 'సరేనండీ, నాకుకూడ ఒక్కడే ఒక్కడు కుమా రుడు, అన్నిముచ్చటలు తీరుద్దామని రెండుజతల మదపుఏనుగులనే తెప్పించారు. గోధూళీ వేళకు అన్నింటితో నదిదాటి పెళ్ళిపందిరిలో చేరారు. ఐతాశలు రెండుసార్లు శీనమయ్యగా రున్నారో లేరో చూడమన్నారు. వా రింట్లో లేరని తెలిసింది.

అరవైసెంట్ల నేలలో పెద్దపందిరి. చేరువగానే రెండుగుంపులు ఎదురుకొన్నవి. పెళ్ళి కూతురితరఫువారు ఎదురువచ్చినప్పుడు బ్యాండ్లు ఆకాశంవైపు మొగ్గి మిన్ను విరిగేట్లు మోగాయి. బాణాసంచా లెక్కనేలేదు. ఉన్న ఛారీటపాకాయలను అమాంతం కాల్చేశారు. ఆ చప్పుళ్లమధ్య వరోపచారం జరిగింది. ఇంతలో ఐతాశలగుంపు ఆడవారు పాటలందుకొని వర్షాన్నే కురిపించేశారు. ఆ పందిరిలో ఎక్కడచూచినా ఎర్రకొబ్బెర బొండ్లాంగుత్తులు కట్టిన స్తంభాలు, పోకగుత్తులు, చివరలలో అరటిగెలలు వేలాడుతున్నాయి. స్తంభాలమధ్య మామిడాకులతోరణాలు, 'బయని' ఆకుల అలంకారం, సభామంటపంలో దిండ్లు, జముఖానాలు; చిత్రాలతో అమర్చిన పెండ్లిమంటపం ఎత్తుపైన అమర్చబడినవి, చాలనందుకు వుడిపినుండి కృష్ణమేళంకూడ వచ్చింది. ఐతాశలజన్మలో మొదటిసారి 'దౌలత్ జాదా' నడ చింది. ఈ వైభవంమధ్య లచ్చడుకూడ మైమరచి కూర్చున్నాడు. అగ్ని ప్రతిష్ఠించబడింది, పొగల చిమ్మింది, ఎదుట కూర్చున్నవారికి పంఖాలేకుంటే, విసనకర్రతో గాలి విసరేవారు. పన్నీరు చల్లేవారు, పానకాలు వెండిగ్లాసులతో నింపి పంచేవారు వరుసగా కార్యకలాపంలో మునిగివున్నారు. పెళ్ళి యజమాంతనము వూరికిపెద్ద, ఇంటికి పెద్దఅయిన నారాయణయ్యా గారే స్వీకరించాక దేనికి కొరత చెప్పండి?

నారీబృందం పాటలను 'జనకారాయడట, మిథిలానగరమట' అని సీతాకళ్యాణాన్ని ఎన్నో స్వయంవరాలకథలను పాడేవారు. పెద్ద పిడుగువంటి గాలివచ్చింది. మంటపంలో హోమం పొగను, అగరువత్తులపొగను పారదోలి దుమ్ము వడవేసింది. అందరూ అన్నీ మానేసి ఏమిది అని భయపడ్డారు. కారుమబ్బులు ఒకసారే కమ్మినాయి. మెరుపులు వరుసగా మెరి సాయి. సభలో కూర్చున్న ఐతాశలేమో 'భగవంతుడు ఏమి చేస్తాడో' అని మొరపెట్టు

కున్నారు. 'వాన వచ్చేట్టుంది. మీరు దక్షిణలు ఇయ్యండి. కన్యను ధారపోసేలగ్నానికి తొందర లేదు. పందిరిపైన పెంకు కప్పించాము. ఏమీ పరవాలేదు, వచ్చినవారు ఎల్లాగూ వచ్చారు. ఆశీర్వాదం చెప్పకుండ వెళ్లరు. ఎంతవర్షమైనా పరవాలేదు' అన్నారు, నారాయణయ్య. చెవిలో మంటపంలో మంత్రఘోష వర్షానికంటె త్వరగా సాగింది. పెళ్ళికూతుర్ని లోపలి గుమ్మారంనుండి వకీలుగారు ఎత్తుకొనివచ్చి హాజరుపరచేసమయానికే వర్షం పటపట పడింది. లచ్చనికి అమ్మాయి మాలవేసింది. వాడుకూడ వుత్సాహంతో పూలదండ వేశాడు.

ఐతాళులు దక్షిణలువంచేసమయంలోనే ఈ మాలికాధారణ మొదలుకాగానే 'ఇక భయంలేదు. నిర్విఘ్నంగా సాగని' అని సంతృప్తిగా ఇంటికి మూడణాలు, పెద్దవారికికూడ మూడణాలే దక్షిణ లెక్కించారు. తరువాత పెద్దలకు పావలా పావలాచొప్పున చెల్లించేశారు. 'భళీ, ఐతాళులు గృహస్థులందరికీ బుద్ధిచెప్పారు. ధారాళంగా దక్షిణలు పంచారు' అని అందరూ తృప్తితో వుంటుండగానే ఆ పందిట్లో నేలంతా తడి బురద పొలంగా మారింది. ధారామంటపంలో (పెండ్లి అరుగు) కార్యకలాపాలు నిర్విఘ్నంగా సాగినాయి. సరసోతికూడ, పారోతి ప్రక్కననేవుండి లగ్నంలోనివైభవం చూస్తూనే అలసిపోయింది. 'అయితే పారోతి, ఈ అన్న జాతకంలో లగ్నాలప్పుడే వాన రాసింది' అన్నది. పారోతికి తన పెళ్లి జ్ఞాపకం వచ్చింది. 'ఆ వేళకూడ దేవుడు ఈలాగే నడపాడు కద, ఈవేళకూడ అంతే' అన్నది పారోతి.

లచ్చుడు, నాగవేణి పీటలమీదినుండి లేచేసమయాన వాన పూర్తిగా ఆగింది. పెండ్లి సభకూడ పలుచబడింది. ఐతాళులు కోడికి వెళ్ళేసరికి రాత్రి సగంఅయింది. వెన్నెల, దిబ్బల ఇసుక స్వచ్ఛంగా నూరేగింపుచూచి నవ్వింది, సంతోషించింది.

పెండ్లి నాల్గురోజులు మంచివుత్సాహంతో జరిగినవి. పెండ్లికూతురు పెండ్లికొడుకు తమఇంటికి వెళ్ళారు. ఇల్లు అందరితో నిండింది. ఈ పెండ్లితరువాతనే ఐతాళులు కొడుకుతో సూటిగా, విశ్వాసంతో మాట్లాడినారు.

ఇక వదిహేనుదినాలకు సెలవు లైపోతాయి. కాలేజీ చేరాల్సింటే మరి నాల్గుదినాల తీరిక. అంతదాకా ఏం చెయ్యాలి? ఏరుదాటివెళ్ళేది. వాపసు వచ్చేది. ఒకసారి నాగవేణిని తాతగారింటికి పిలుచుకొనివెళ్ళాడు. తాత ముసలితనంమూలాన ఎక్కడకు కదలరు. అంతదాకా వాడు ఆ పిల్లతో మాట్లాడాలని ఎంతో ప్రయత్నం చేశాడు. కుదురలేదు. ఆమె సిగ్గుతో ముద్దగా మారింది. ఎప్పుడూ ఆడవాళ్ళమధ్యలోవుండి ఆశీర్వాదం, నలుగులప్పుడుమాత్రం మగనిపక్కన వుంటుంది. అప్పుడే ఒకళ్లనొకళ్లు చాటుగా చూచుకున్నారు. ఆమెతో తప్పక మాట్లాడాలని ఎంతో వుంది, అనుకుంటే అవకాశం దొరకనే దొరకదు. ఏమైనాసరే అనుకుంటే బావకూడ తయారవుతాడు.

అందుకే తాతగారివూరికి ప్రయాణంవలన మంచి అదను దొరికింది. తానే భార్యవెంట తొనసెవరకు నావలో వెళ్లాడు. తరువాత ఇంటిదాక ఏమి మాట్లాటినా ఎవరేమనుకోరు. నావ



వదలగానే కొంత మొదలుపెట్టినాడు. నాగవేణి ముఖంచూచి చిరునవ్వు నవ్వాడు. ఆమెకూడ తలవంచి నవ్వింది. 'నువ్వు మూగదానివా?' అన్నాడు. 'మీరు?' అన్నది, తొనసెగట్టు దిగగానే ఆమె మాటలమల్లిక్క అయింది. మగనితో మాట్లాడాలని తనకుకూడ వుంది, అందరెదురుగా వూరకే దొంగచూపులతో వుండేది, నాలుక కదలదు.

లచ్చనికి తాతగారింట్లో మంచి వుపచారం దొరికింది. మనుమనిభార్య అంటేకూడ వారు మంచి అక్కరచూపారు. 'దానికిమాత్రం అదృష్టం లేకపోయిందే' అని తన భార్య గురించి చెప్పారు మాదప్పయ్య. తాతగారింట్లో స్వేచ్ఛగా వుండవచ్చునని లచ్చుడు వారు చెప్పగనే అంగీకరించి నాల్గునాళ్ళున్నాడు. ఐతాళులు 'పదహారునాళ్ల పండుగ'కు తప్పక రమ్మన్నారని ఇద్దరు వెళ్లారు. మధ్యాహ్నం జనం ఎక్కడివారు అక్కడి కెళ్ళగానే 'బావ సముద్రం వెడదామా' అన్నాడు సదాశివునితో లచ్చుడు, చెవిలో 'చెల్లెలినికూడ తెస్తావా?' అన్నాడు. వానివెంటనే వెళ్ళాలి తప్పదు. నాగవేణి అన్నతో మాట్లాడుతూ బయలుదేరింది. లచ్చుడు అదివరకే వారిని నిరీక్షిస్తుండినాడు. ఆసంగతి వూరివాళ్లు చూచిచెప్పరా? సరసోతి వానిదగ్గరచేరి 'ఇదేమిరా నాయనా, పెండ్లి అయినవారానికే పెళ్ళాన్నివేసుకొని తిరుగరాదురా? ఊళ్లో ఏమంటారో తెలుసా' అన్నది. ఐతాళులు కోపంతోరేగి, 'ఈకాలంలో మానంలేనివాళ్లు, నేనైతే పారోతివచ్చాక సంవత్సరం దానివైపే చూడలేదు' అన్నారు.

వానగాలికి వైశాఖం ఎండలు చల్లబడ్డాయి. వకీలుగారు సకుటుంబంగా మంగళూరికి ప్రయాణం చేశారు. సదాశివుడు ఐతాళులవద్దకు వచ్చి 'చూడండీ నాన్నగారేమన్నారంటే, మీ లక్ష్మీనారాయణకూడ మంగళూరు మావెంట రావాలట' అన్నాడు. లచ్చుడు ఆ తరుణాన్నే ఎదురుచూచాడు. ఐతాళులు సదాశివునివెంటవెళ్ళి వకీలుగారిని దర్శించారు. అక్కడ తీర్మానమయిందేమంటే 'లచ్చుడు వారిఇంటిలోనే ఇల్లరికంవానిలాగా వుంటూ, మంగుళూరిలోనే విద్యాభ్యాసం చేయాలి, ఎఫ్. ఏ. తరువాత ఏమైనాసరే చూద్దాం' అని సమాధానంతో వుండాలని; ఐతాళులకేమో తనతలపై బరువు తగ్గిందనే తృప్తి. 'వాడు బొత్తిగా బుద్ధి చాలనివాడు, తమరి అనుగ్రహం. మీరే తల్లిదండ్రులులాగు బుద్ధిచెప్పండి' అన్నారు. 'మా బిడ్డశ్రేయస్సు కూడ వుందికదండీ, పరవాలేదు' అన్నారు వకీలుగారు. ఐతాళులముఖంలో 'నా కుమారుడు నా మానం కాపాడుతాడో లేదో అనే అధైర్యం, భయంకూడ వున్నవి.

లచ్చుడు మళ్ళీ తాతగారింటికి వెళ్ళివచ్చాడు. ఈసారి మాదప్పయ్యగారు వాణ్ణి కావలించుకుని, 'లచ్చ, మంచిసంబంధం దొరికింది. ఇప్పుడు నువ్వే పెద్దమనిషి, నీ కులం, వంశం, అన్నీ దొడ్డవి. ఇక పిల్లచేష్టలు విడిచేసి బుద్ధివంతుడై వంశమర్యాదలు కాపాడు నాన్నా-నీవు మళ్ళీ నన్నుచూసేసరికి వుంటానో లేనో జాగ్రత్త' అంటూ తగినట్లు వీడ్కోలు చెప్పినారు.

వారు చెప్పిందే నిజమయింది. లచ్చుడు మంగుళూరికి వెళ్ళాడు. ఇక్కడ వానలు ఎక్కువైనాయి. పగలు, రాత్రి సముద్రఘోష చెవులను చిల్లులు గొట్టేస్తున్నది. ఊళ్ళో

కొబ్బెరచెట్లన్నీ అల్లాడి బోదెలన్నీ పెళపెళమనాల్సి వచ్చింది. నదులేమో ఎర్రని కొత్త నీరును నురుగులుకక్కుతూ సముద్రానికి చేర్చి అసహ్యంగా వుండినవి. ఆ చిటపటలు, చరవరలు, జడివానలలో మాదప్పయ్యగారికి శీతజ్వరం తగిలింది. పక్కనుండి లేవకముందే ఇహలోకయాత్ర ముగించుకొన్నారు. వారి మంచంపక్కన సత్య, సుబ్బి, పిల్లవాడు. ఐతాళుకూడ చివరిక్షణాలలో చూచారు. మాదప్పయ్యగారి కుమారుడు అనాధుడయ్యాడు.

మాదప్పయ్య మరణవార్త లచ్చడు కాలేజీచేరిన ఒక వారానికి ఐతాళుల వుత్తరం ద్వారా తెలిసింది. 'ఇక పదుమున్నూరితో ఋణం తీరింది. ఆమేనమామకు, నాకు అంతంతే' అనుకున్నాడు.

దీనితరువాత నెలకూడ కాలేదు. లచ్చనికి తండ్రినుండి మరొక వుత్తరంలో పెదతల్లికి కూడ చాల బాధ కల్గిందని, మంచం పట్టిందని, వాణ్ని తప్పక చూడాలని కలువరిస్తున్నదని, నవరాత్రి సెలవులువుంటే తప్పక రావాలని, లేకుంటే కొంత ఆలస్యమైనా పరవాలేదని సూచింపబడింది. ఆ పక్కక్షణంలోనైన చిన్ననాటినుండి సవతితల్లికూడ తనపై చూపిన ప్రేమ జ్ఞాపకం రాకుండ వుండలేదు. మూన్నాళ్ళలో వూరికి వెళ్ళాల్సే వచ్చింది. జట్కాలో వూరికి చేరేసరికే పారోతి చివరిగడియలు సమీపించినట్లు తోచింది.

చావుఘడియలకు ఐతాళులు, సత్య, సరసోతి ఆమెపక్కనచేరి సేవ చేస్తున్నారు. ఐతాళులు తాము ఆడినమాటలన్నీ స్మరణకుతెచ్చుకొని పశ్చాత్తాపంతో ఏడ్చారు. 'ఏమే నానుండీ ఎన్నికష్టాలో పడ్డావే....' అని ప్రకటించారు. ఆమెకు నీరసంగావున్నా తెలివి తప్పిపోలేదు. 'లచ్చ'....'లచ్చడు వచ్చాడా? చెప్పరైతిరి' అంటూ పలవరించింది. 'వస్తున్నాడేమో' అన్నారు. సరసోతి ఆమె ఎగపోతనుచూచి 'పారోతి, నోట్లో తీర్థంవేద్దాం—నారాయణ అని పలుకగలవా' అన్నది. ఆమెచూపు సరసోతికేసే మళ్ళింది. 'నాకు ప్రాణ వుంది-చాలకుంటే చెవిలోకూడ నారాయణనామం చెప్పమ్మా' అని అంటూ ఇతర ఆశలను ప్రకటించింది. 'మరేమీ ఆశలేదు. లచ్చనితోనే పని' అన్నది. మళ్ళీ 'వారికి చెప్పండి, నా తలను తొడపై వుంచుకొమ్మని' అని క్షీణస్వరంతో అన్నది. సత్యభాను ఎదుటనే వున్నది. ఐతాళులు దేవునిగదిలో జపం చేస్తున్నారు. సత్యభామకూడ అనుకున్నది. 'నానుండి ఈ జీవి ఎన్నిసంకటాలకు గురి అయిందో' అని. తరువాత వెక్కివెక్కి ఏడ్చి మగనివద్దకు వెళ్ళింది, 'రండీ, ఆమెకాలం సమీపించింది. తొడపై తలనైనా వుంచుకొండి. ఆమె ఆశ తీర్చండి' అన్నది.

ఐతాళులు జపంచేసే నోరు వణకింది. పారోతి పక్కకు పరుగెత్తివచ్చారు. అప్పటికి ఆమెనాలుక ఆడటంలేదు. దీర్ఘశ్వాసం వెళ్తున్నది. ఆ వారదేసికళ్ళతో పారోతి ఐతాళులు వచ్చింది, తన తలను తొడపై పెట్టుకొని కూర్చున్నది గమనించింది. సరసోతి గంగాజలం నోటిలో వేసింది. కాళ్ళవద్ద సత్య కూర్చున్నది. పారోతి ముఖం ప్రశాంతంగా వుంది. కాస్త నిష్కల్మషమైన నవ్వుతో 'నా కింకేమి కావాలి?' అనే తృప్తిని ప్రకటించింది.



అన్నీ క్షణంలోనే. ఆ ఇల్లంతా హోరుమని ఏడ్చింది. సరసోతి ఏడవాలంటే ధ్వని కూడ వెళ్ళదు. తన కడుపు సంకటాన్ని ఆమెచేతులతో బాదుకొని బిగబట్టుకుంది. ఆమె మనస్సులో నీడ తప్పినతరువాత, లక్ష్యం లేకుండ ఎందుకు బదుకా లనుకున్నది.

ఇరుగు పొరుగువారు వచ్చారు. వచ్చినవారంత 'ఆమెకేమి పుణ్యాత్మురాలు' అన్నారు. పార్వతిని కాల్చడానికి కట్టెలు కొట్టేవేళకైన మంగుళూరినుండి లచ్చడు, ఊపిరి చేతబట్టుకొని వచ్చాడు. వసారాలో రోదనధ్వనివిని 'అయ్యో! ఆమెను జీవంతో చూడలేకుండా పోతినే ఎంత పాపిని....' అని పలవరించాడు.

పదుమూడునాళ్లు దుఃఖం అనుభవించాడు లచ్చడు. బయటపోయినా, చెట్లకిందగాని, పొలంలోగాని ఎక్కడవెళ్ళినా పారోతిరూపు, గత చరిత్ర వాణ్ని వెంబడించినట్లయింది.

ఆ ఇంట్లో అందరూ అదేవిధంగా అనుభవించారు.

# 16

లచ్చడు మంగుళూరికి మరలివచ్చి తన ఎఫ్. ఎ. ఉద్యమంలో పరిశ్రమించాడు. ఈ మధ్యలో కొత్త ఆవరణం, వాతావరణం. ఎవరైనా వాణ్ని 'లచ్చ' అని పిలిస్తే కోపంతో రేగుతాడు. 'లక్ష్మినారాయణ' అని పిలువాలి, తానేమో పెద్దమనిషయ్యానని అతని వూహ. సదాశివుడుమాత్రం ఎట్లాగు పిలిచినా పరవాలేదు.

లచ్చనికి మామగారింటి ఉపచారాలు బాగా నచ్చినవి. వాని బావకూడ రసికుడే, సరసుడే. చక్కగా మాట్లాడగలడు. వానిచేష్టలకు అంతులేదు. ఒకళ్ళొకళ్ళు పొద్దుపులవరకూ వచ్చేదాక హాయిగా మాట్లాడేవారు. వాడుకూడ చమత్కారి. ఏమాత్రం నొప్పించకుండ దాటేస్తాడు. అందుకే లచ్చణ్ని కొంతవరకు కవ్విస్తాడు. తమాషా చూస్తాడు. కొంత ముఖం ఎర్రబడిందంటే చెల్లెలిని పిలుసుకొనివచ్చి 'చూడు, మీవారు పిలుస్తారు' అని పంపి ఆమె నగుమోముతో వానికి మనశ్శాంతి చేకూర్చుతాడు. తరువాత వెంటనేవచ్చి హాస్యం చేస్తాడు.

నాగవేణితో స్నేహంకూడ లచ్చనికి హితకరమే. తానేమో మామగారింట్లో, మామగారు గొప్పవకీలు. వారియొక్క ప్రతిష్ఠనుచూచి అయినా హోటేలు కిట్టుపాధ్యాయుణ్ని బెదరించినట్లు ఇక్కడ కుదరదు. వారిని నిర్లక్ష్యంకూడ చెయ్యరాదు. ఇల్లటం అల్లుడైనాక ఇష్టం వుండని వుండకుండాపోని మెల్లకుండ, పిల్లిలాగుండాల్సే వచ్చింది. ఇష్టం వచ్చినట్లు తిరగడానికి, ఇష్టప్పట్లు పేకాటకు అవకాశం దొరకలేదు. మొదట్లో ఇవన్నీ చాల కష్టం అని

పించింది. 'ఈ మామ హంగులువద్దు, వేరే హోటేలులోనే వుందామనుకున్నాడు. అయితే నాగవేణిస్నేహం ఎందుకు వదులుకోవాలి? దూరంగా వుండగలడా? తన జాణతనం వర్ణించాలి. విశ్రాంతివున్నప్పుడు కొంత మాటకథ జరుగాలి; తానేమో మంచి తెలివిగలవాడని పాఠం చెప్పించుకొనేవాళ్లకూడ కావాలే. సదాశివుడు చాల తెలివి, చురుకుగలవాడే, లచ్చని కంటె చాల చురుకు. ఇద్దరు ఒకేతరగతివారే. నాగవేణి ఇంకా ఆ తరగతే. తనకు రానివి ఎవరివద్దనో చెప్పించుకోవాలిగదా? అందుకే మగనివద్దకే వెడుతుంది. ఆమె ఒకసారి రాకుంటే తానేవెళ్ళి 'ఏమైనా పాఠం చిక్కులువుంటే అడుగు' అంటాడు లచ్చుడు. సదాశివుడు లేనప్పుడే లచ్చని సాహసం. సదాశివుడైతే మొహమాటంలేకుండా 'ఏ, నాగవేణీ! ఎందుకే అవన్నీ; వానికేమి వస్తుందని ఆశ్రయిస్తావు?' అని హాస్యమే చేస్తాడు.

రెండుసంవత్సరాలు ఒకవిధంగా అగచాట్లపంజరం అంటే మామగారిల్లు అని అర్థమయింది. ఎక్కడైన ఫలహారంహోటేలు కనబడితే దూరుదామని అనిపిస్తుంది. జేబు తడుముకునే ధైర్యముంటుందా? ఏకో అబద్ధమాడి మామగారితోనైనా డబ్బు దోచుదామంటే సదాశివుడు అన్నీ చెబుతాడు. వద్దన్నా డబ్బు సదాశివునిద్వారా వస్తుంటుంది. ఇంకెట్లా? ఎందుకు అడగాలి? ఎవరిస్తారు?

రెండవసంవత్సరం విద్యాభ్యాసంకూడ అయింది. వాడు ఇల్లు చేరుకున్నాడు. వెళ్ళే ముందు నాగవేణితో 'వస్తావా?' అన్నాడు. నాగవేణి 'సరేకాని నాన్నను అడగండి' అన్నది. మామగారిని అడిగి భార్యను పంపమని చెప్పడానికేమో ధైర్యంలేదు. అందుకే కనుబొమ్మ ముడివేసి కోపం నటించాడు. నాగవేణికూడ వేసరుకుంది. దానికి మరొకకారణంకూడ లేక పోలేదు. సెలవులకు వారు వూరికి వెళ్లుతున్నారు. వానికెందుకు అంతతొందర? కాని వాని కోపంచూచి, నాగవేణి 'అప్పా, నువ్వు ఊరికి ఎప్పుడు వెళతావో ఏమో, నేను వెంట వెళ్ళనా?' అన్నది.

వాసుదేవయ్యగారు 'నువ్వు నావెంటనే వెడుదువుగాని, ఇప్పుడు వద్దు' అన్నారు.

'ఎందుకు?' అని అడిగే అవకాశం, ధైర్యం ఆమెకు లేదు. వకీలుగారే 'అల్లా వెళ్ళటం వానితండ్రి కిష్టంలేదు. వారు పాతపంథావారు. సెలవులలో ఇంట్లో ప్రస్తం (కార్యం) ముగించారంటే ఎంతకాలమైన వుండిరావచ్చు' అన్నారు. నాగవేణికూడ తాను సమర్తాడినపడుచు కదా తండ్రిమాట వాస్తవమే అని గ్రహించుకుని వూరకున్నది. లచ్చుడు వెళ్ళేరోజు, 'నీకేమో, తండ్రి చాలముఖ్యం. నేను అక్కర్లేదులే' అనిచెప్పి ఆ పిల్ల కన్నీటిని ఒలకించే వెళ్ళాడు. ఆమె చాల మనస్సు నొచ్చుకున్నది. వాడు వెళ్ళాక తానెందుకు రాలేవో అంతా వివరంగా వ్రాసింది.

ఒక వారంతరువాత వకీలుగారు తమవూరికి వెళ్ళారు. లచ్చుడు తన ఏకాంతజీవనాన్ని తన ఇంటిగదిలోనే గడిపాడు. మామగారు వచ్చారనితెలిసి ఒళ్ళు గగుర్పాటు చెందిందేమో



మళ్ళీ మామగారింటికి వెళ్లాడు. చెల్లెలితో అన్నివిషయాలను విన్న సదాశివుడు 'ఓహో! బావగారికి కోపం తగ్గిందా?' అని హాస్యంతోనే స్వాగతం చెప్పాడు.

సెలవురోజులు-పరీక్షఫలితాలు తెలిసినవి - సదాశివుడేమో ఎఫ్. ఎ. మొదటిమెట్టులో, లచ్చుడు రెండవవర్గాలో పాసయినాడు. కోడికికూడ వార్త తెలిసింది. రామఐతాళులకుకూడ చాల ఆనందమే. వకీలుగారింటికివెళ్ళి 'అంతా మీ దయనండీ, మీబిడ్డ చేతివరున, ఆమె పాణిగ్రహణం చలువ' అన్నారు. లచ్చుడు అక్కడే వున్నాడు. వానికి ఇటువంటిపొగడ్తలు సరిపడవు. పెద్దలేమో లచ్చని నిషేకముహూర్తం (కార్యం) విషయం ప్రస్తావించారు. ఐతాళులు, 'ఆలాగేనండీ, ఈ సెలవులే మంచిది, తరువాత వాడు మరెక్కడ చదువాలో ఏమో! ఈ కాలం పిల్లవాండ్రు-మధ్యలో అడ్డదారి పట్టరాదండి' అన్నారు.

ఈ సెలవులలోనే లచ్చుడుకూడ సంతోషం, సంకోచంల మధ్య బాధపడ్డాడు. ఏటికి అవతల, ఇవతల గుంటలనీళ్ళు తాగి వూరకుంటున్నాడు. సరసోతికూడ 'నాల్గురోజులు, నువ్వు, నాగవేణీ హాయిగా వుండిపొండిరా ఇక్కడ మాకు ఆనందం' అన్నది; 'అవును, వకీలుగారికూతురు అక్కడ తిండి తీర్థం, ఉపచారాలకు కరువేలేదు. మీరేమో దాన్ని అంట్లు తోమడానికే పెడతారు' అన్నాడు. సరసోతి నవ్వుకుంది. 'మీ అమ్మనే అడుగురా! మీ అమ్మ కొత్తకాపురంలో ఎంతపని చెప్పామో, ఏమేమి చేసిందో అడిగితెలుసుకోరా! ఏమో ఆమె స్వతఃబుద్ధితో పనిలో దిగింది. మేమెందుకు చేయిస్తాము' అన్నది. 'పోనీలే, నీభార్యకు ఏమేమి చేసిపెట్టాలో అడిగిచెప్పరా, ఏమైనాసరే సంవత్సరంలో మున్నాట అరపై అయిదు నాళ్లకూడ అక్కడేవుంటే మంచిదనిపించదురా!' అన్నది సరసోతి.

లచ్చనికి అత్తమాటలు సూటిగా నాటుకోలేదు. అందుకే రామఐతాళులనుండి చెప్పించితే బాగు అని యోచించింది. లచ్చనితో చెప్పటానికిమారుగా ఐతాళులే ఐరోడుకు వెళ్ళి వప్పుడు చూద్దాంలే అనుకున్నారు. ఒకనాడు వకీలుగారితో 'అక్కడికి ఒకవారం పంపండి కోడలిని' అని అడిగారు. వారేమో 'అదేం భాగ్యం, నెలంతా, సెలవు లయిపోయేదాక వుంచుకోండి మీ పిల్లకాదా' అన్నారు. నాగవేణికికూడ లచ్చని ఇంటివారు ఎలాంటివారో తెలుసుకుందామని వుంది, అందుకే మామగారివెంట నేరుగా కోడిగ్రామం వెళ్ళింది.

నాగవేణి వెన్నంటి లచ్చుడుకూడ ప్రయాణంచేశాడు. తనభార్యను తెచ్చేవిషయానికి తనకు పరాజయం కల్గిందే అని బాధ. తండ్రికదా అని మౌనం వహించాడు. ఆమెకు అత్త గారింట్లో వుపచారాలకు ఏమాత్రం లోటులేదు. ఆపిల్ల తనకుతానే 'నేనే అలుకుతాను, తోము తాను' అని పైబడిచేస్తే వూరకున్నారు. ఆమె స్వయంగా అత్తతో 'అత్తా నేను సుబ్బమ్మ వదినెను సరిగా చూడనేలేదు, మాటలుకూడ ఆడలేదు. నేను మంగుళూరికి వెళ్ళివచ్చేలోగా పిలిపించండి' అని కోరింది. సరసోతి 'నీ మగనికి చెప్పమ్మా పిలుచుకొనిరానీ' అన్నది. లచ్చనితో ఆమె అదే చెప్పింది. 'చెల్లెలిని పిలుచుకురాండీ, నేను చూడక్కరలేదా?' అన్నది.

అతడు 'ఆమెకుకూడ నీలాగే రెండుకళ్ళు, రెండుకాళ్ళు అంతే' అన్నారు. అయితే నేను రెండుకళ్ళు, కాళ్ళున్నవాళ్ళను చూడక్కర్లేదా' అని సమాధానం చెప్పింది.

లచ్చుడే మంత్రిలోవున్న చెల్లెలింటికి వెళ్ళాల్సివచ్చింది. ఏం చెయ్యాలి? ఇక్కడ ఐతాలు కానీ సరసోతికాని వెళ్ళాలంటే నాగవేణికూడ వొప్పుకోదు, ఆ ముసలిమామ గారిని సతిపించేది ఇష్టం లేదు. అందుకే మగణ్ణేబాధించి మంత్రికి వెళ్ళడానికి ప్రోత్స హించింది. రామఐతాలకు ఆసంగతి తెలియగానే, ఆ పడవవాడు గోవిందుణ్ణిపిలిచి తెల్ల వారగానే నాగవేణి, లచ్చున్ని ఇద్దర్నీ బారకూరిదాకా చేర్చాలి. తరువాత మంత్రికి విడిచి రావాలని ఏర్పాటుచేశారు. వచ్చేటప్పుడు సుబ్బిని ఆమె మగణ్ణి పిల్లవాణ్ణి పిల్చుకొని రావాలి. లచ్చునినోరు వకీలుగారింట్లో రెండేండ్లు మూతబడింది. ఇప్పుడు తండ్రికి ఎదురాడటానికికూడ వెనుకంజ వేసింది.

తెల్లవారుజామున ఇద్దరూ బయలుదేరినారు. బరోడు మంగుళూరులలోనే తిరుగు లాడిన నాగవేణికి ఆ కొత్తవూరిలో తిరుగుతుంటే సంతోషంతో మనస్సు నిండింది. పరి చయాలు చేసుకోవాలి అనే ఆత్రం. లచ్చని జడత్వంచూచి 'మీరేమో అన్నీ చూచినవారు, నాకు ఆశవద్దా?' అన్నది నాగవేణి. తెల్లవారి నావలో వెళ్ళాలంటే ఆమెకూ ఉత్సాహమే. ఆ దృశ్యాలకు ముగ్ధురాలైంది. ఆ ద్వీపాలు, తోటలు మంగుళూరిలో వస్తాయా? ఈ అందం అక్కడ లేదే' అన్నది. గోవిందుడు మార్గదర్శకుడైనాడు. నాగవేణి 'అదేమిటి? ఇదే మిటి?' అని ప్రశ్నించింది. పాడువల్లెలు, గుడి, చెరువు, వీధులు అన్నింటివివరాలు, చరిత్రలు తెలుసుకుంది. గోవిందుడు తన స్థళపురాణజ్ఞానాన్ని విస్తరించి చెప్పినాడు. లచ్చుడేమో 'నీకెందుకు అంత అధికప్రసంగం? ఆ పాడుగుడితో ఏమి విశేషాలట?' అని మగని అధి కారాలను చెలాయించుకున్నాడు. జాముపొద్దు కాగానే మంత్రికి బావ ఇంటివద్దకే చేరినారు.

ఆరోజు మంత్రిలో వుడిపికి పర్యాయపు సంబరం ఆనందం అయింది. సుబ్బి, ఆమెమగనికి లచ్చని వెనుకటిప్రవర్తన జ్ఞాపకంవచ్చి ఆశ్చర్యం, మార్పుకు ఆనందం కల్గినవి. నాగవేణికి ఎక్కడా దొరకని వుపచారాలు చేశారు. రెండు మూన్నాళ్లు అక్కడనుంచి కదల రాదని ఏర్పాటు. మంత్రిలో దశావతారమేళం (భాగవతుల ఆట) చేరింది. మేళంవారి కార్య క్రమాలలో చివరిఆట ఆడవలసివున్నది. నాగవేణి ఏ చిన్ననాటనో బయలునాటకం చూచి వుండినది. తరువాత ఆ అవకాశాన్ని పోగొట్టుకో దలచలేదు. రాత్రిఅంతా రెప్ప వాల్చకుండ సుబ్బి, మగడు, లచ్చుడు, నాగవేణి వీధిభాగవతాన్ని తిలకించారు.

నాగవేణికి చుట్టూరావున్న అడవి, గుట్టలు, ఆ వానరసేనలనుచూచి 'ఎంత చక్కగా వుందో ఈ మంత్రి' అని అరుపిపాలు సుఖంగా వుంది. అందరూచేరి ఇల్లు చేరుకున్నారు. సుబ్బి, ఆమె నాల్గేండ్లపిల్లవాడు 'సణ్ణ' (బుల్లి అబ్బాయి)కూడ కోడికి వెళ్ళారు.

ఆదినం సరసోతి, సత్యభామలు చాల సంతోషించారు. లచ్చునికి భగవంతుడే సద్బుద్ధి



నిచ్చాడని, ఈ మంచిగడియ పార్వతికూడ చూచింటే ఎంతో బాగుండేదే అని దుఃఖించింది సరసోతి.

మే నెలవులు గాలిలాగా కొట్టుకుపోయినాయి. రేపే జూన్ నెల, వకీలుగారు మంగు ళూరికి వెడతారు. తానుకూడా ముందు పై చదువుకు వెళ్లాలి. నాగవేణి ముందేమి చెయ్యా లని తోచకుండా వుంది. ఐతాలేమో 'పిల్ల బాగా ఎదిగింది. మేముమాత్రం ఆమెను భరింవ లేమా? నెనుకటిమాట వేరు. ఇప్పుడు శోధనంకూడ అయిందిగదా?' అని అన్నారు. మంగు ళూరిలో లచ్చని విద్యాభ్యాసంగము వుండబోదు అని తెలిసింది. వకీలుగారేమో వాణ్ని మద్రాసుకు పంపాలన్నారు. ఐతాలు సరే అన్నారు. ఒక్కసారి మట్టికి మాసిన ఐతాల ఆశలు మళ్ళీ ఉదయించినవి. లచ్చునికేమో తానుకూడ గొప్పవకీలు కావాలని ఆశ పుట్టినట్లు తెలిసింది. కాని నాగవేణికి దూరంగా రెండేండ్లు వుండాలనే చింత ఒకటి. కాని, మంగుళూరులో నాగవేణివుంటే సరిపడదు, 'మూడవపారం కానీలే నాన్న' అన్నాడు లచ్చుడు. ఐతాలు 'ఆడపిల్లలకు ఎందుకులేరా అంత చదువు' అన్నారు. సరసోతికూడ ఒక సారి 'నాగవేణి నెల తప్పినట్లుంది' అన్నది. సరే ఆ తీర్మానం తరువాత చూసుకోవచ్చు ననుకున్నారు, 'బిడ్డను మంగుళూరికే పంపండి' అని వకీలుగా రన్నారు. 'సరే ఆలాగే' అన్నారు ఐతాలు.

బి. ఎ. చేరడానికి ఆవేళలో మంగుళూరికి వెళ్ళివుందామని వాని అభిలాష. అందుకే వాళ్ళవెంట తానుకూడ సిద్ధమయ్యాడు. నాన్నతో 'ఒక చిల్లిగవ్వకూడ వాళ్ళను అపేక్షిం చేట్లు పెట్టకండి. బి. ఎ. నేర్వాలంటే చాలఖర్చు. వాళ్ళకేమో సదావుని ఖర్చుంటుంది' అని లచ్చుడు జాగ్రత్త చెప్పినాడు.

ఐతాలు చిన్నవాళ్ళతో బుద్ధి చెప్పించుకున్నవారేమో కాదు. 'సరే లేరా, దబ్బులేదని నీ చదువు ఆగదులే' అన్నారు. ఇంకా తనపైన తండ్రికా గౌరవం పుట్టలేదే అని నొచ్చు కున్నాడు లచ్చుడు.

ఐతాల ఇంటిజాత్ర కద్దేశారు. లచ్చుడుభార్య మంగుళూరు వెళ్లారు. కూతురు, మను మడు మంత్రి వెళ్ళారు. మళ్ళీ ముగ్గురే మిగిలారు. సరసోతి 'ఇదేమన్నా? ఈ ఇల్లంటే మనం ముగ్గురే శాశ్వతం, గట్టి అనిపిస్తుం'దని హాస్యం చేసింది.

రామఐతాలకు ఈ నడుమ బలహీనతమూలాన పౌరోహిత్యంకూడ తగ్గించుకోవాల్సి వచ్చింది. 'ఏటి అవతలకు నడువటానికి చేతగాదు. నడిచి ఎవరు చస్తారు?' అని చెప్పాల్సి వచ్చింది. అందుకే ఇంట్లో వేసరికవస్తే ఎప్పుడో ఒకసారి 'సత్య, నేను పనిలేకుండకూడ వుండలేను. ఇంటిలో వ్యవసాయం చక్కగా జరగటంలేదు, పుల్లరి సక్రమంగా సాగు తున్నది. ఏమైనాసరే ఒకసారి మంత్రికైనా వెళ్ళివస్తాను' అన్నారు. ఐతాలలాగు వారి

వియ్యంకులుకూడ ముసలివారే. ఇద్దరూ కూర్చున్నచోటనే కూలబడి మాట్లాడడం పరిపాటి అయిపోయింది. ఐతాళులకేమో మనుమణ్ని తొడపై పండుకోబెట్టి లాలించే అలవాటు. చాల ఇష్టం. సుబ్బికిమాత్రం తండ్రిముఖంచూచి ఆనందంతో చేసేపనులన్నీ ఎంతో తేలికగా కని పించినవి. తరువాత ఏదో మిషతో నెలకు నాల్గురోజులైనా మంచ్రత్తిలో గడపే అలవాటు వద్దారు ఐతాళులు. ఒక్కొక్కసారి మనమణ్నికూడ వెంటబెట్టుకుని వచ్చేవారు.

'అవునయ్యా! నేను ఇంకేమి చెయ్యాలి? ఏం చేయగలను? అక్కడినుండి పిలుపు రావాలి అంతే' అంటూ వచ్చేవారు. కాని తమ మనస్సులోని ఒకలోటు తీరలేదు. శీనయ్య పెంకు టిల్లు డాబా తూర్పున కనబడుతుంటే ఒకవిధంగా వ్యసనంగా వుండేది. ఈమధ్య కొందరు బెంగుళూరికి వెళ్ళివచ్చి అక్కడిలాగే పెంకులు వేసేఅలవాటు పెట్టుకున్నారు. ఆరో ఏడో ఇండ్లు ఎక్కువైనవి. సుబ్రాయవుపాధ్యాయులుకూడ ఇంటికి పెంకులు వేయించారు. ఐతాళు లకు తమ ఇంటిలోపం తీరలేదు. 'ఏమన్నా! నీకు పెంకుటింటివయ్యామే పట్టినట్లుందే' అని సరసోతి అన్నది. మళ్ళీ 'ఏమన్నా నీకు ఇంటికి పెంకులేకుంటే చావుకూడ రానన్నదా అన్నా' అని హాస్యంచేసింది. 'చూడు, ఈ ఇంటిలో నీ తరువాత ఎవరు గొప్పగా ఇక్కడే వుంటారు? ఎందుకీ నీబెంగ? లచ్చుడుంటాడా చెప్పు' ఐతాళులు: 'లచ్చుడు వుండడు, ఎవరూ వుండరు. కాని మనమే చక్కగావుండి, దాన్ని చూచుకుంటూ తృప్తిగా చావాలి.' సరసోతికి అన్నయొక్క ఆశ ఎంత లోతుగా దట్టంగావుందో బోధపడింది సరసోతి అభిప్రాయంలో పనసచెట్లనుకొట్టే హనుమాచారిని మానేస్తే ఇంకెవ్వరైనా వడ్లవాడు వచ్చినాసరే. 'ఇంటిపని ముగించు' అని సరసోతి అనుమతి తెల్పింది 'ఈ వర్షాలు పొయ్యాక మంచి గట్టిరాళ్ళ పునాదివేయించి ఇల్లు కట్టు. మేడకూడ కట్టెయ్యి' అన్నది. ఐతాళులు ఆమె మళ్ళీ గేలిచేస్తా వుందని అన్నారు. 'లేదన్నా! గేలికాదు. నాకేమో అంతా కొత్తవింతగా తోస్తున్నది. నీ అనంతరం అన్నీ ఎవరికని? సరిగా ఆలోచిస్తే, నీతరువాత రొక్కం అంతా లచ్చుడు నాశనం చేశేలాగానే వుంది. మంచి ఇల్లు, పొలంచేసి. ఇంకా డబ్బుంటే మంచి బంగారం కోడలి మెడలో వేసెయ్యి, లేకుంటే చాలకష్టం' అన్నది సరసోతి. మళ్ళీ సుబ్బికికూడ ఏమైనా ఇస్తే సరి. అదికూడ కడుపున పుట్టిందికదా!' అన్నది. సత్యభామకూడ కూతురికి కొంత బంగారం పెట్టేవిషయంలో ఏకీభవించింది.

ఈ మాటలన్నీ వాస్తవమే అని ఐతాళులకే స్ఫురించింది. త్వరలో క్రొత్తఇంటిపని చేపట్టారు. మంచిఆస్తినికూడ కొనటానికి ఏర్పాట్లు చేశారు. నగదుడబ్బు మిగిలితే లచ్చుడు మూన్నాళ్ళలో హారతి పడ్తాడు అని అర్థం చేసుకున్నారు. ప్రతినెల మద్రాసునుండి లచ్చని జాబులో 40,50 రూపాయిలకు తాకీదు వచ్చేది. కుందాపురంలో ఒకరిని అడిగి తెలుసు కుంటే లచ్చుడు మామగారి ఇంటినుండికూడ కొంతడబ్బు తెప్పిస్తున్నట్లు అనుమానంతోచింది. ఒక స్నేహితునిద్వారా మంగుళూరికి వుత్తరం వ్రాయించారు. అక్కడినుండి ఏమీ వార్త రాలేదు. వారికి విసుగువచ్చింది. 'నేను చెల్లించే జుల్మానా చెల్లిస్తాను, తరువాత వాని తల వ్రాత' అన్నారు. డబ్బు సక్రమంగా పంపుతూవచ్చారు.



వారిమనస్సు పూర్తిగా ఇంటిపనిలో మునిగింది. వారికి తీరికలేదు. ఇంటి పాయా లెక్కలు దినదినము మార్చుతూ కొంత బాధపడ్డారు.-'మేడ కావాలా వద్దా' అనే ప్రశ్న వచ్చినా, తరువాత తగినంత మంచిఇల్లే కట్టించారు.-'ఐతాళులుకూడ ఇల్లు కట్టేస్తున్నాడయ్యా! ఆ ముసలిమ్రోడు, గొడ్డు. ఎందుకని లంకంత ఇల్లు?' అని శీనయ్య హాస్యం చేశాడట. సరసోతివిని 'అన్నా! నీకెందుకు కోపం; వాని అలవాటే అది. బాధపడవద్దు-నీ మనస్సార పని సాగించు' అన్నది సరసోతి.

ఉగాదివేళకు ఇంటికి పెంకు పూర్తి అయింది. 'లోపలి గోడలగచ్చు, నేలగచ్చు అంతా చేయించి గృహప్రవేశం బ్రహ్మాండంగా చెయ్యాలి. వకీలుగారినికూడ ఆహ్వానించాలి!' అని యోచిస్తూవున్నప్పుడే లచ్చుడుకూడ మద్రాసునుంచి మేనెల సెలవులకు వచ్చాడు. 'ఏమిరా వంటరిగా వచ్చావు? నాగవేణి రాలేదా? వకీలుగారు సెలవుల్లో ఏరోజురా రాకడ? మీ బావ ఎల్లాగున్నాడురా?' అని ఎన్నోప్రశ్నలు వేశారు. వాడేమో సరియైన సమాధానం ఇయ్యలేదు. 'ఏమి సరసోతి? ఎందుకు వీడు వంటరిగా వచ్చినట్లు?' అంటే సరసోతి 'నెల లుండవచ్చులే, వూరుకో!' అన్నది. సరసోతి తీరికగా వానితో మాట్లాడి సరియైనసమాధానం తెప్పిద్దామని ప్రయత్నించి విఫలురాలైంది. వాడెందుకో నిరుడు ఎంత వుల్లాసంగావున్నాడో ఈసారి అంతే నిరుత్సాహంతో వున్నాడు. ఒక్కసారి ఐతాళులు, 'లచ్చ, ఈ ఇల్లు మనకు సరిపో తుందా? మళ్ళీ కట్టాలా' అని అడిగారు. వాడు అప్పుడు హుషారుగా సమాధానం ఇచ్చాడు 'ఇక్కడ ఎవరుంటారని ఇంత ఇల్లు' అని. తరువాత సరసోతినిచూచి, 'నేను పదిరూపాయలు ఎక్కువ అడిగితే పంపరుగాని ఇంటికిమాత్రం వర్షంలాగు కురిపిస్తున్నారు? ఈ పల్లెకెందుకు? ఒకరూపాయి కిరాయి వస్తుందా?' అని తండ్రిపై వ్యాఖ్యానం చేశాడు. వాడు అంతా స్వార్థంలో వున్నాడు, మిగిలినవారిచింత లేనేలేదు.

సరసోతి ఇంటిపని పట్టించుకోకుండా తెలియనిదానిలాగే 'ఏమిరా? వకీలుగారు నీకు డబ్బేమీ పంపడంలేదా?' అన్నది.

'వారికేం కొడుకులు లేరా? ఎంతని పంపగలరు చెప్పు' అన్నాడు.

'పోనీలేరా, వచ్చేయేడు నువ్వు సుఖంగా చదువుదువుగాని' అన్నది. గృహప్రవేశం లగ్నం ఏర్పాటయింది. వకీలుగారికి ఆవిషయం ఆహ్వానంగా వుత్తరమూ వెళ్ళింది, సమా ధానం రాలేదు. ఐతాళులు 'లచ్చన్నా! దాని కెన్ని నెలలురా. ఏమిసంగతి చెప్పు! అన్నీ వ్రాయ రాదా?' అన్నారు. 'పోనీలేరా! నీవైనావెళ్ళి అందరినీ పిలుచుకొనిరారా!' అన్నారు.

'నాకు చేతగాదు. నావెంట దాన్ని పంపమని అడగలేదనుకున్నారా!' అన్నాడు లచ్చుడు.

అయితే అడిగినా పంపకుండావుండటానికి కారణమేమోనని ఐతాళులు చాల గాబరా పడ్డారు. తల్లిగారింట్లో చాలనాళ్ళ గోముగా అల్లారుముద్దుగా, పెరిగినపిల్ల. ఆమె చాల

మంచిదే. అత్తగారింట్లోకూడ చక్కగా ప్రవర్తించింది – అని అనుకుని చక్కగా ఐరోడికే వెళ్ళారు. నారాయణయ్యగారింటికివెళ్ళి తమకష్టాలు చెప్పుకున్నారు. వారు అనవసరంగా మాట్లాడకుండా 'ఐతాళులూ! మీ అబ్బాయికి మరొకపెండ్లి చేయించండి, అన్నకేమో అల్లుడంటే ఆసక్తి చచ్చిపోయింది' అన్నారు.

ఐతాళులగుండె జారిందేమో అనిపించింది. తమకుమారు డేమి తప్పుచేశాడో ఏమో! 'ఏమీ వివరం తెలియకుండా ఒకసారిగా అంత దారుణంగా వార్త తెల్పడానికి కారణమేమి?' అన్నారు. వారి ముదిమికళ్ళలో ఎంతో దుఃఖం కనబడింది 'నారాయణయ్యా! నా తప్పుంటే చెప్పండి? లచ్చని తప్పులు చెప్పండి. బుద్ధి చెబుతాను' అన్నారు.

నారాయణయ్య చేసేదేమీలేక, తమ ఇంటిగుట్టునే బయట పెట్టవలసివచ్చింది. 'చూడండి, మీకోడలు మీ ఇంటినుండి గర్భిణిగా వెళ్ళింది. మంగుళూరికివెళ్ళిన రెండునెలల లోనే చాల కడుపునొప్పివ్యాధి తగిలింది. ఆమెకడుపు పోయింది. ఆమె ప్రాణంకూడ నెమ్మదిగాలేదు. చివరకు డాక్టరుగారికి చూపారు. మీ కుమారుడు సంపాదించి ఇచ్చిన రోగాలమూలాన ఆ బిడ్డ జీవితమంతా రోగంతో బాధపడవలసిందేనట' ఐతాళులు తలపంచుకున్నారు. కలలోకూడ తలవని ఒకపిడుగే నెత్తిన పడినట్లయింది.

'అన్న అభిప్రాయం—నాగవేణికి మగడు ఇంక లేడనుకున్నాను-అని అన్న అంటున్నాడండి' అన్నారు నారాయణయ్య.

ముందుమాట లనవసరంలేకుండా, ఐతాళులు ఇంటికివెళ్ళి 'ఏమో! ఏమేమి చూడవలసివచ్చెరా....?' అనుకుంటూ కొడుకును కొట్టడానికే వెళ్లారు. 'నువ్వు పాడయినా పరవాలేదు. ఆ పాపంలేని పిల్ల జీవితం అన్యాయం చేస్తివిరా!' అని తిట్టారు.

లచ్చడు కోపంతో వెళ్ళిపొయ్యాడు-శీనమయ్య ఇంటికి.

శీనమయ్య యేమో 'మీ నాన్న నాకు ద్వేషం. నువ్వు కాదురా. మీ నాన్న నీ చదువుకు డబ్బు ఇవ్వడంటే నేనిస్తా. ఏమీ పరవాలేదు' అన్నారు. ఈ లాలన తండ్రి కొడుకులవైరం స్పర్థలకు నాంది అయింది. సరసోతి పదిసార్లు వెళ్ళింది శీనమయ్య ఇంటికి. లచ్చణ్ని రమ్మని బతిమాలింది. సత్యభామ కన్నీరు కార్చింది. లచ్చనిసమాధానం ఒక్కటే, 'ఎవరెవరి అన్యాయం మాటలోవిని, నా మర్యాద తీసేశారు' అని. సరసోతి వాని అపద్దాలకుమాత్రం లొంగేస్థితిలో లేదు.

సరే, పిల్లవాడు రాకుండానే గృహప్రవేశమూ జరిగింది. శీనమయ్యగారికి ఐతాళుల స్వభావంగురించి మరింత హాస్యంచేసే అవకాశం దొరికింది. లచ్చని ఇతిహాసంకూడ తెలిసి వచ్చింటే ఇంకేమయ్యేదో! తనకైన అవమానాన్ని లచ్చడు తండ్రికి తనపై ద్వేషం అనే



తెరకప్పి అణగద్రొక్కి తాత్కాలికంగా జయమే పొందాడు. జూనునెలకే సంవత్సరానికి కావలసినడబ్బును సేకరించుకొని ప్రోనోటు వ్రాసిచ్చి మద్రాసుకు వెళ్లాడు.

ఇక్కడ నాగవేణిబ్రతుకుకు గొప్ప గ్రహణం పట్టుకుంది. నిరుటిసెలవులలో మగనితో బాధపడి 'డిశెంబరు శెలవులకు తప్పక రాండి' అని పిక్కోలు చెప్పింది. కాని ఒక నెలకే 'నాకేమో ఏదో ఘోరవ్యాధి పట్టుకుంది' అని వ్రాసింది. 'తల్లిని కాలేకపోయినా రోగంమాత్రం కడుపులోనేవుంది' అని వ్రాసింది. వాసుదేవయ్యాగారు బిడ్డకుగానుపడ్డ పడుపాట్లు ఇంతింతనిగాదు.

అల్లుణ్ని చూచి భయపడి దూరముంచారు. నాల్గునెలలు సరిగా డబ్బు పంపారు. వాడే కోపంతో 'మీ ఋణం నాకు వద్దు' అని జాబు వ్రాశాడు. సదాశివుడు ఇంటికథలువిని వాణ్ని బాగా చెప్పినాడు. అందుకే లచ్చనికి అందరితో పగ వచ్చింది. నాగవేణికూడ చివరకు 'తనే బదుకును, కాపరాన్ని పాడుచేయడానికి పచ్చినప్రాణి' అని భావించింది.

నాగవేణికి ఆరుమాసాలనుండి ఆరోగ్యముగావున్నా ముఖానికి తగినకాంతి రాలేదు. ఆమెకు పగలల్లా చింతలే. ఒక్కొక్కసారి 'అయిందేమో అయింది, వారినివిడిస్తే ఇంకేమి గతి? నాతండ్రికి చాలినంతమంది మగపిల్లవాండ్లున్నారు. నేను ఇక్కడేవుంటే వారికే భారం' అని అప్పుడప్పుడు చింతచేస్తుంది. మళ్ళీ మగనికే జాబువ్రాసి క్షమించమని వ్రాసుకుందామని అనుకుంది. నారాయణయ్య ఐరోడినుండి తండ్రికి వ్రాసినజాబు అంతలోనే అందింది. లచ్చడు ఐతాళులతో వైరంకట్టుకుని వెళ్ళినసంగతి అన్నీ వ్రాశారు. 'ఇక ఆ పిల్లవాడు చెయ్యి జారినట్లే' అని వాసుదేవయ్యగారు తీర్మానించారు. వారిభార్యకూడ కోపంతో సహకరించింది. నాగవేణిమాత్రం ఆకాశంచూస్తూ విలవిల కండ్లు విడుస్తూ కూర్చున్నది.

లచ్చడేమో అప్పుచేసిన రొక్కంతో మద్రాసులో సుఖంగా వూరేగుతున్నాడు. తరువాత మరిన్ని రూపాయలు తండ్రికి జబర్దస్తీగావ్రాసి తెప్పించుకోవడానికికూడ వెనుకాడలేదు. ఐతాళులకు ముసలితనంలో ఆ స్వేచ్ఛ చాల అతిగా తోచింది. ఐతాళులు వాసుదేవయ్యగారికి వ్రాయించారు: 'నా దుర్దైవానికి మీ నాగవేణిదారికి అడ్డంగా నిలబడ్డాడు లచ్చడు. నా ఆస్తి స్వార్జితం-మీ బిడ్డను, నా కోడలిని చక్కగా చూచుకుంటాను. ఆమె ముఖమైనా ముసలితనాన కొడుకుకు మారుగా చూచే అవకాశం ఇస్తారా' అని.

వకీలుగారేమో డిశెంబరు సెలవులలో వచ్చేప్పుడు బిడ్డను తమవూరికి వెంట తెచ్చారు. మరునాడు స్వయంగా బిడ్డను అత్తవారింట్లో దిగబెట్టివచ్చారు. అక్కడ ఐతాళులు చాల దుఃఖంతో సంకోచంగానే వాసుదేవయ్యగారికి సరిగా వుపచారాలు చేశారు. 'చూడండి-ఈ మేడ, ఈ గోశాల అన్నీ ఎవరికి? నేనేమో ఆఖరిగడియలవాణ్ని' అన్నారు ఐతాళులు. సత్యభామవచ్చి నిలబడింది, కోడలినిచూస్తే ఆమెకు కన్నీరు కారింది. కోడలినిచూసి 'వస్తివా

బిడ్డ' అన్నది. నాగవేణి పెద్దలకు నమస్కరించింది. 'చూడండి మీకోడలు వుంది, ఇష్ట ముంటే మీవద్దనే వుంచుకోండి, యోచించి. సంకోచించకండి, ప్రయోజనంలేదు' అన్నారు. వకీలుగారు, ఐతాళులు 'పోనీలేండి, ఎవరితలవ్రాత వారిదే. నా ఆస్తిలో మూడువంతులు నా స్వార్జితం. దాన్నంతా కోడలిపేర వ్రాశేస్తాను. కొంచెమే సుబ్బికి వ్రాస్తాను. మా తాతగారి సొమ్ము కొంచం లచ్చుడు తినని - అమ్ముకోనీ, పెంకులుపీకి గడ్డివేయని వరవాలేదు' అన్నారు.

వాసుదేవయ్యగారు ఐతాళులఇంట్లో ఒకదిన మున్నారు. తరువాత కన్నీళ్లు నింపు కున్నారు. నాగవేణి 'నేను ఇక్కడ నాలుగునాళ్లుంటాను' అన్నది.

అప్పటినుండి నాగవేణియే ఆ ఇంటికుమారుడు. చదువుకున్న పిల్లనే, శ్రీమంతుల బిడ్డనే ఎన్నివున్నా ఆమెవినయాన్ని తప్పకుండా చెప్పుకోవాలి. సత్య, సరసోతులే ఆ పిల్లను గంటగంటకు సమాధానపరుస్తూ 'అమ్మా బ్రహ్మవ్రాతను ఎవరైనా చెరిపేస్తారా? నన్ను చూడు' అని సరసోతి అంగలార్చుతుంది. 'సరే దుఃఖినులు అభాగినులలో తానుకూడ ఒకతె అయినాను' అని నాగవేణి భావించుకుని కుదుటబడింది, మళ్ళీ చింతాక్రాంతురాలైంది.

ఐతాళులు తుదిసారిగా మకరసంక్రాంతి తదుపరి సాలిగ్రామంజాత్రకు వెళ్ళారు. తమ కులదైవం నరసింహస్వామి సేవలు, మొక్కుబడులు చెల్లించుకొని వచ్చారు. ఇంటిల్లిపాది వెళ్లారు. అక్కడ 'స్వామీ! మా లచ్చన్నకు మంచిబుద్ధి నీవూ ఇయ్యజాలవా?' అని ఎన్నో విధాల అడుగుకున్నారు. తిరిగివచ్చాక ఐతాళులకు జ్వరం తగిలింది. నెల, రెండునెలలు. పేరుకు జ్వరమే, ఎందుకో వారు నానాటికి తీసికట్టయి క్షీణించారు. ఏప్రిల్‌కు లచ్చుడు బి. ఏ. ముగించుకుని వచ్చాడు. తండ్రి మంచం పట్టాడన్నవార్త తెలిసికూడ ఇంటికి వెళ్ళలేదు. శీనమయ్యగారింట్లోనే బస చేశాడు. సరసోతి 'నేను ఎల్లాగయినాచెప్పి వాణ్ణి పిల్చుకొని వస్తాను' అని అన్నది. ఐతాళులు, 'పోనీలే, నాకు వాణ్ణి చూడాలనే లేదు;' అన్నారు. కాని మనసులో వాడు వేరేఇంట్లోనైనా వుడింటే అక్కడికి తామే వెళ్ళిచూచి, నచ్చజెప్పా లనే తోచింది. శీనమయ్య పార్టీవాడైతే ఒక చిక్కే. అందుకే వాణ్ణిచూచే ఇష్టం మాను కున్నారు.

చైత్రబహుళ అమావాస్య వచ్చింది. ఐతాళుల ఇంట్లోకూడ చీకటి మూదింది. ఆ తెల్ల వారి సరసోతి, నాగవేణి, సత్యభామ సముద్రస్నానం చేసివచ్చారు. వారి ఒంట్లో వేడెక్కింది. చెమటలు. ఎందుకో శరీరంపై స్మారకంకూడ లేదు. నాగవేణి తన మామ ఆకారం చిన్న పిల్లవానికంటె తీసిపోయినందుకు చాల వాపోయింది. 'మామగారూ, నేను వెళ్ళి వారిని స్వయంగా పిల్చుకొనిరానా?' అన్నది. ఆమెకు మామ శుశ్రూష అంటే నచ్చిన బతుకైంది. అతని చివరికోరికలు తీర్చగలననే తృప్తికలిగింది.



'అమ్మా నీవువెడితే వాడు వచ్చేఘటమా! నీకంటె అక్కరగల శీనమయ్య లేడా!' అన్నారు. నాగవేణి మూభావంగా వుండాల్సివచ్చింది. సుబ్రాయ ఉపాధ్యాయులువచ్చి 'ఈ రాత్రిగడిస్తే మరి నాల్గుసంవత్సరాల ఆయుస్సు వుంటుంది' అన్నారు. శీనమయ్యకుకూడ ఆ సంగతి తెలిసింది. వారిమనస్సు పట్టు తప్పింది.

'అతడు ఎంత పటంగి (దుష్టుడు) అయినా చచ్చే వేళకు చూడకుండవుండరాదు' అను కుంటూ శీనమయ్య సముద్రం ఒడ్డువెంట ఐతాళులఇంటికి వెళ్లాడు. ముఖంవాల్చి ఐతాళుల వద్దకే వెళ్ళారు. ఐతాళులకు అప్పుడు తెలివివచ్చి, 'ఓహో శీనడా!' అన్నారు.

'అవును ఐతాళులవారూ!' అన్నాడు. 'నేను చచ్చాక అయితా పగమానుకోరా! నా కొడుకుకు మంచి హితబోధచేసి సంసారిగా చెయ్యరా' అన్నారుఐతాళులు. శీనమయ్యరు పిల్ల వానిలాగా ఏడ్చారు 'నేను పొరబాటుగా అనింటే క్షమించంతి' ఐతాళుల కాళ్లుపట్టుకొని. ఆ పూర్వంగాని, తరువాతగాని ఎలాగున్నారోకాని అప్పుడుమాత్రం చిత్తశుద్ధితోనే వున్నారు. ఇద్దరు ఎన్నోఏండ్లు పగ కక్కినారు. ఆనాడు స్నేహపూరితనయనాలతో కూర్చున్నారు.

నాగవేణి వెంటనే పరుగెత్తి వారిస్నేహంసంగతి సరసోతికి నివేదించింది. సరసోతి నాగవేణిని వెంటబెట్టుకొని శీనమయ్యఇంటికి వెళ్ళింది. తలవాకిట్లోనే లచ్చుడు కూర్చున్నాడు. నాగవేణిని మొదట్లోచూచి 'ఎలా వచ్చిందబ్బా' అనుకున్నాడు. ఆమె కన్నీటితో తడిసిన చెక్కిళ్ళను గమనించి 'ఏమి?' అని అడిగాడు. 'వారు చావుబతుకుల్లో వుంటేనైనా చూడరా?' అన్నది. వాడు ఆమెవెంట ఇంటికి వెళ్లాడు. అందరూ ఇల్లు చేరారు, ప్రాకారంలోపలికి వెళ్ళడానికి లచ్చునికి కష్టం అనిపించింది. నాగవేణి మామగారిదగ్గరకువెళ్ళి 'వారు వచ్చారు, కుమారులు' అన్నది. 'అమ్మా నీవు మాఇంటి మహాలక్ష్మి, నీపైన నాకు కోపమా? వాణ్ణి తీసుకురా' అన్నారు. మగనిచేతులుపట్టుకొని మామదగ్గరకు తెచ్చింది. లచ్చునికి బుద్ధి భ్రష్ట మయింది. తోచలేదు. శీనమయ్యరునుచూచి కొంత ధైర్యం, వెలుగు వచ్చాయి. మయ్యరు, 'లచ్చణ్ణా! వారి పాదాలు పట్టుకో, వారితో మనకెందుకు వైరం? చాలు, ఇంక పగపూనితె మంచిదికాదు. దేవుడు మెచ్చడు' అన్నారు. లచ్చుడేమో బురదముద్దలాగ తప్పగా నేలకు కూలబడినాడు.

ఐతాళులకు రాత్రిఅంతా సగం జ్ఞానం, సగం మూర్ఛ. నవగ్రహదానం, గోదానం, భూదానం అన్నీ వారి తెలివిఘడియల్లో జరిపించారు. ఐతాళులు 'ఒరే! నీకు బుద్ధిచెప్పే శక్తి సామర్థ్యం లేదురా! చెయ్యిపట్టిన ఆడదాన్నిమాత్రం మర్యాదతో కాపాడు. నీమీద ధైర్యం చాలక అంతా ఆ పిల్లపేరట వ్రాసినారా. శ్రద్ధగా కాపాడుకో' అన్నారు. లచ్చుడేమో ఒక విధంగా మూగవానివలె నిలబడ్డాడు.

అమావాస్యఘడియలు ఆఖరులోగానే ఐతాళులు గతించారు. పార్వోతి చావుతో సగం చచ్చిన సరసోతిశరీరం క్షణంతో చీపురుపుల్లలాగయిపోయింది. బంధుబలగాలకు

ఈ వార్త తెల్పాలని మంది వెళ్ళారు. సుబ్బి వసుగెత్తుకొని వచ్చింది. ముందు కార్యక్రమం నెరవేరాలి. శీనయ్యరే ఆ శవాన్ని మోసినారంటే మిగిలిన పరమవైరుల మనస్సు కూడ చల్లారింది. సరసోతి కంట తడికూడ పెట్టలేదు. ఆమె కన్నీటి ఊట ఏనాడో ఎండిపోయింది. మాటలుకూడ బంద్ అయింది. ఆమె తరువాత పెదవులు విప్పి మాట్లాడే శక్తికూడ లేకుండా పళ్ల గట్టిగా ప్రయత్నంతో తెరచిచూసేది. చెల్లెలు, భార్య, తల్లి, అందరూ ఏడుస్తుంటే లచ్చనికి 'ఈ సంసారం నరకంరా! దీనిలో పదిసుఖాలకు పది వేలకష్టాలే సత్యం' అనే వైరాగ్యం, వేదాంతం బోధపడ్డాయి. కాని అది కథలోని వాక్యాలలాగే శ్మశానవైరాగ్యం అని తెలిసివచ్చింది. ఉత్తరక్రియలతరువాత చెల్లెలు తదితర బంధుజనులు వెళ్లాక వాని వైరాగ్యం, తండ్రి చావు దుఃఖం మాసిపోయ్యాయి. కాని ఇంట్లో ఎక్కడచూచినా అంధకారబంధురమే. కాని వెంటనే శీనయ్యరింట్లో పని చేసేది ఇష్టంలేదు. తనకు, తండ్రికి వైరంపెంచిన శీనయ్యరే తండ్రికి లొంగేట్లుచేశాడే అని తోచింది. ఇంట్లో ఏమైనా సుఖమా? నాగవేణితో తొలిరోజుల్లాగా ఏమైనా వుత్సాహంతో మాట్లాడగలడా! ఎవరో వియ్యాలవారిలాగా ఆమె ప్రవర్తిస్తున్నది. తండ్రి సాధించినపగ ఆమెకూడ కొనసాగిస్తున్నట్లే భావించాడు. నాగవేణిమాత్రం ముందుచూపులేని పసిపిల్ల. జరిగినఅన్యాయం మరచిపోయి వాణ్ని శ్రద్ధగా తనకు తానే ఎన్నిమార్లో పలకరించింది. కాని త్వరలో 'ఆ స్నేహం ఎక్కువైతే మళ్ళీ నరకయాతన వస్తుందా!' అని సంశయంకూడ కలుగకుండా వుంటుందా? వెంటనే చప్పబడుతుంది. సరసోతి, సత్యమాత్రం నాగవేణి ముఖంచూస్తే దానికి నిజంగా అన్యాయమే జరుగుతున్నదని భావిస్తూవచ్చారు. లచ్చని దుష్ట చేష్టలకుగాను వారే క్రుంగి కృశించారు.

•

లచ్చడేమో తన కామ తృప్తిని బయట తీర్చుకునేఅలవాటు పడ్డవాడు. నెలవు రోజుల్లో కిట్టు వుపాధ్యాయుడు వచ్చాడని తెలిసింది. తరువాత మాయోపాయాలతో జలజకు చేరువయ్యాడు.

బి. ఎ. ఫలితాలు వచ్చాయి. ప్యాసయ్యాడని తెలిసి మరింత గర్వించాడు లచ్చడు. ముందుగతి ఏమి? అది గొప్పప్రశ్నగా మిగిలిపోయింది. ఊళ్లో నరకంలో వుండగలడా, మరి ముందుకు చదువాలా? ఉద్యోగం చూచుకోవాలా? దారి మొదట్లో కనబడలేదు. ఒక తీర్మానానికి వచ్చాడు. 'అమ్మా! మీరంతా ఇక్కడే వుండండి. నాన్న ఏమో నాగవేణికి వీలు నామా ఎలాగూ వ్రాసేశారు. ఆమెతో భిక్షాన్నం ఎందుకు తినాలి? ఈ బి. ఎ. అంటూ వుంది కదా! ఒక మంచి వుద్యోగం వెదుకుకుని వెళ్తాను. ఇక్కడ నేనుమాత్రం ఏమి చేయ గలను - వెడతాను' అన్నాడు.

సరసోతికేమో 'ఇక, ఇంటిభవిష్యత్తు మళ్ళీ అంధకారంలో మునుగుతున్నట్లు తోచింది. నాగవేణితో 'నువ్వమ్మా! ఏమిసంగతి చెప్పు' అన్నది. అందుకు వాడే 'దానికేం, అక్కడ ధనవంతులు గొప్పవకీలు తండ్రిగారు, ఇక్కడ తానే యజమానురాలు, కావాలసి



నంత తినటానికి వుంది' అన్నాడు విష్ఠురంగా. మళ్ళీ శీనయ్యఇంటికి అప్పుకు వెళ్లాడు. శీనయ్యరేమో 'ఒరే ఎందుకురా అప్పులు మళ్ళీ. నీవు యజమానుడు కదరా!' అన్నారు తండ్రి మరణవేళలో చేసిన ఏర్పాటును లచ్చడు వివరించిచెప్పారు. 'పిత్రార్జితంమాత్రం వ్రాయ లేదు. అదికూడ వ్రాసింటే నేను చిప్ప ఎత్తుకొని తిరుగాల్సివచ్చేది. మా తాతగారిభాగం వుంది' అన్నాడు. శీనయ్యరు వాడు భార్యనుండి దూరంవెళ్ళేదానికి అంగీకరించలేదు. లచ్చడేమో 'మీకు వీలుంటే నా ఆస్తిపైన నమ్మకంతో అప్పు ఇస్తారా, ఉద్యోగం దొరికేదాకా నేను ఆమెఋణంలో పడదల్చలేదు' అన్నాడు.

బతాకులఇంట్లో మగపురుగులేదనితెలిసి బరోడుమంది నారాయణయ్యగారు అప్పు డప్పుడు వచ్చి చూచేవారు.

'మీరేమి చేస్తారమ్మా! నాగవేణి ముందుగతి ఏమి? ఆమె నా ఇంటికివస్తే నా ఆక్షే పణ లేదు' అన్నారు.

సరసోతి యేమో 'అనటానికి ఏముంది? కావాల్సిందికూడ ఏం మిగలలేదు, నేనేమో నాల్గునా ళ్లుండేదాన్ని, ఇక్కడే ప్రాణం విడుస్తానండి' అన్నది. సత్యభామమాత్రం 'కొన్నాళ్లు అన్నదగ్గర కెళ్ళాలి అని కోరింది. మళ్ళీ ఎందుకో వద్దులే అనుకొన్నది. 'నాగవేణి కావా ల్సింటే చిన్ననాటినుంచి సుఖంలో పెరిగింది. ఎందుకు కష్టపడాలి! తండ్రిగారింటికి వెడితే వెళ్లని. భర్తయొక్క సుఖం అంతంతే, ఏకాంతవాసంలో ఎందుకు నలిగిపోవాలి' అని సత్య చెప్పింది.

నారాయణయ్యగారు మళ్ళీ ఒకనాడు నాగవేణిని వెంట తీసికెళ్ళాలనే ప్రయత్నంతోనే వచ్చారు. కానీ నాగవేణి వెళ్ళడానికి ఒప్పుకోలేదు. కొన్నాళ్ళనుంచి ఆ సరసోతి స్నేహం, వాత్సల్యం చూరగొన్న నాగవేణికేమో ఆ ఇంటినుండి బయటికివెళ్ళే అభిలాషలేదు. సరసోతియొక్క విచిత్ర, విలక్షణ విశిష్ట వ్యక్తిత్వం నిండివుండే ఆ ఇంట్లో ఆమెను వదలి పోవాలని లేదు. ఆ ఇంటివట్ల మంచిభక్తి కుదిరింది.

నారాయణయ్యగారేమో నిరాశతో ఇంటికెళ్లారు. తమ మేనల్లుడు రాకుండా, చెప్ప కుండా వెళ్ళిపోయాడే అని మాదప్పయ్యగారికొడుకు జనార్దనకూడ చెల్లెలిని కొన్నాళ్లు వూరికి పిల్చుకొనివెళ్ళాలని వచ్చాడు. ఒక సంవత్సరమయినా ఆమె తనవద్ద వుండాలని పట్టు పట్టాడు. సరసోతి నాగవేణితో 'అమ్మా! ఎందుకు నీకి కష్టం-సుఖంగా వెళ్ళిపో' అన్నది. నాగవేణి కన్నీళ్లు కురిపించింది. 'మామగారి వాక్పరిపాలన, ఋణం చెల్లించడానికైనా వుంటాను. వారికెప్పుడైనా మంచిబుద్ధి పుట్టివస్తే పిలిస్తే వెడతాను. అప్పుడు అత్తను వెంట తీసికెడతాను. లేకుంటే మిమ్ములనువిడచి పోను' అన్నది.

నాగవేణి లేతవయస్సు. అనుభవంలేని మనిషి, భావుకత ఎక్కువ, మమత ఎక్కువ.

హృదయం విశాలమై ఉదారంగా మాట్లాడింది. సరసోతి నాగవేణికి 'మామ్మ' అయింది. నాగవేణి పెద్దపిల్ల అంతే. సరసోతి ఇంటిపెద్ద. కసవునూకి, దీపాలుపెడితే నాగవేణి వంట చేస్తుంది. వాళ్ళకు వ్యవసాయం, కోసకాయలతోటలు ఏ గొడవలు లేవు. 'ఎవరికి కావాలి, అన్నపేసు వున్నన్నాళ్లు ఎవరైనా తినని, మనకింత తిండి జరిగితేచా'లని స్వంతవ్యవసాయం మానేశారు.

ఇంతలో ఆరునెలలకే వకీలుగారినుండి వుత్తరం వచ్చింది. ఆమె మగడు బళ్లారిలో వున్నాడని ప్రభుత్వ వుద్యోగి ఒకడు చెప్పాడట. తరువాత అంతకంటె ఎక్కువ తెలియదనికూడ వ్రాశారు. 'ఆ పనివల్ల ఎవరికేమి లాభం!' అన్నారు.

ఇప్పుడు, నాగవేణి నిజంగా ఒక తపస్విని. సరసోతి వుపదేశించిన 'నమః శివాయ' మంత్రం, జపమాలలే ఆమెకు కాలక్షేపం, తోడు అయినవి. చాల వేసారినప్పుడు ఒకరోజు బిరోడువెళ్ళి చిన్నాన్నను చూచివచ్చేది. ఆ ముసలిది (సరసోతి) వున్నన్నాళ్లు ఇంటిభూమి, ఆదాయం, వ్యయం, బాధలు ఆమెవే. తనకు కష్టంలేదు. నారాయణయ్యవచ్చి గుత్తలు వసూలుచేసిచ్చేవారు. వకీలుగారు భూమికాని, డబ్బుకాని ఎక్కడ ఎవరికివ్వాలో, చక్కని సలహాచెప్పి వ్రాసేవారు. లచ్చనికి సంక్రమించిన పొలం, బుట్ర శీనమయ్య చూస్తున్నారు. అది నాగవేణి చేతికి రాదేమో!

లచ్చడు ఇల్లువదలి మూడేళ్ళు అయినవి. మరొక్కసారి అతడు ఊరిలో అందరిని చూచాడు, అప్పుడుకూడ నేరుగా ఇంటికిరాకుండా శీనమయ్యరు ఇంట్లోనే దిగాడు. ఒక వుదయం ఇంటిలో కనబడ్డాడు, ఇల్లంతా చప్పన.

ఇంట్లో జనంముఖాన కళలేదు- నాగవేణి చెరువులోమునిగి ఇంటికి వస్తున్నది. ఆమె దూరంనుండి తమఇంట్లో ఎవరినో చూచింది. ఆమె త్వరగా అంగళంలోకే వెళ్ళింది. వచ్చినవ్యక్తిని త్వరగా పోల్చుకోలేకపోయింది. ముఖంపైన మంచి మీసాలున్నవి, వేషం పరదేశందే. లచ్చడు దౌలగా వచ్చాడు- 'ఓహో నేను గుర్తుకు రానైతినా?' అన్నాడు- నాగవేణి వానిస్వరంకూడ సరిగా గుర్తుకు తెచ్చుకోలేకపోయింది. కొంచెం నవ్వి, గంభీరంగా దుఃఖంతో ముఖం పెట్టుకొని 'నన్నేమి దెప్పకండి' అన్నది. వెంటనే వెక్కివెక్కి ఏడ్చింది- లచ్చడు ఇంటి అరుగుమీదనే కూర్చున్నాడు. సరసోతి విసురుగావచ్చి సరసంగా 'ఒరే, ఎప్పుడురా రాక? ఎక్కడనుండి?' అని ఎన్నోప్రశ్నలు వేసింది. వానికి ఎప్పుడు వచ్చాడో సరిగా చెప్పడానికి సిగ్గేసింది.

'ఒరే ఎత్తి ఆడించినవాళ్ళను మరచినా సరవాలేదురా, అగ్నిసాక్షిగా పెండ్లాడిన పిల్లను మరువవద్దురా? దాన్ని ఎందుకురా ఇంతగా ఏడిపిస్తున్నావు?' అని అడిగింది. తండ్రి చావు గడియల్లో తాను అందరిఎదుట చేసినవాగ్దానం వెంటనే లచ్చని కళ్ళఎదుట తాండవ



మాడింది. వాడు మౌనంగా వున్నాడు- ఆ ఇంట్లో ఏమో చీకట్లోకి కొన్ని సూర్యకిరణాలు ప్రసరించినంత హాయి కలిగింది ఆ లచ్చని రాకవలన.

లచ్చనికేమో ఆ వయస్సుతో పొంగుతున్న నాగవేణి రూపంకూడ వెన్నెలను ఈవినట్లు తోచింది. ఈ రూపరాశిని ఇంట్లో మూలేట్లుచేసి ఎందుకు వెళ్లానో అని ఒకసారి తోచింది. భోజనం చేసేప్పుడు ఇంటోవాళ్ళందరు వాణ్ని వియ్యంకులలాగు శ్రద్ధగా గౌరవించారు. మధ్యాహ్నం భోజనాలయ్యాక 'నేను బళ్ళారిజిల్లాలో ముఖ్యఅధికారిగా వున్నాను. దూరం నిజమే- మంచి అనుకూలం. తరువాత నా పనితనం మెచ్చుకొని తహసీల్దారుగా చేస్తారట- జీతం తక్కువైకాని, పై ఆదాయం వుంటుంది. అంతా లాభమే' అని తన పరిస్థితి వర్ణించి చెప్పాడు.

రాత్రి అయింది, భోజనం వుపచారాలుకూడ జరిగాయి. చిన్ననాటినవ్వును తెచ్చిపెట్టుకోవాలని నాగవేణి బాగా సాహసించి యత్నించింది. అప్పుడే లచ్చడు వెళ్ళుతున్నాడు. 'ఎక్కడికి' అని అడిగితే, 'శీనమయ్య ఇంటికి' అన్నాడు. 'నిన్నవచ్చాను, ఈవేళకూడ వెళ్ళద్దా' అన్నాడు.

'ఏమండి, ఎందుకండీ? ఇది మన ఇల్లు కాదా? నేను పరస్త్రీనా?' అని నాగవేణి ప్రశ్నించింది. దుఃఖంతో వణుకుతూ ఈ మాటలు పలికింది. 'నీకు నేను అవసరమో, కావో తెలుసుకుందామనే వచ్చాను- తెలుసుకోకుండా బయలుదేరాను' అని లచ్చడంటే నాగవేణి దుఃఖంతో 'మళ్ళీ ఆ పొదుపులు ఎందుకు?' అని ఏడ్చింది.

లచ్చడు నాగవేణి యౌవనాన్ని మళ్ళీ తన అదుపులో పెట్టుకున్నాడు. ధర్మం, హృదయాలమధ్య కట్టివేసిన ఆమె స్నేహం, ప్రాణం అన్ని ఆలోచనలవీ మరచిపోయి, వానిశయ్యలో భాగస్వామినిగా మార్చేసినవి. ఆమె ఉగ్రవైరం మరచింది.

తన లీవు (సెలవు) పూర్తి అయ్యేదాక ఇంట్లోనేవుంటు వూళ్ళో తిరుగులాడినాడు లచ్చడు. నాగవేణి ఇంటిలో ధనధాన్యాల దాపరికాలన్నీ వానికి చెప్పేసింది.

ఒకనాడు ఆ వినోదాలకుకూడ ఆఖరువేళ వచ్చింది. 'నేను వెళ్ళాలి, లీవులేదు. నేను బళ్లారికేవెళ్ళి పనిలో చేరుకోవాలి.' అన్నాడు: నాగవేణి 'ఎందుకండీ ఇక్కడవుంటే వీలు కాదా' అన్నది. సరసోతికూడ ఆమోదించింది. తరువాత నాగవేణి, 'వెళ్లండి మమ్మల్ను ఇద్దరినీకూడ వెంట తీసుకెళ్ళండి' అని వత్తిడిగా చెప్పింది. ఇంటిపనులు పినతండ్రికి అప్పజెప్పవచ్చునని ఏమేమో ప్లాను వేశారు. 'అలాగే కానీ' అన్నారు. సరసోతికేమో ఎల్లాగైనా నాగవేణిని లచ్చనితో అన్యోన్యంగా జత కలపాలని, తానేమో అదే ఇంటిమట్టిలో చేరిపోవాలని గట్టి ఆశ. ఆ దినాలు ఎప్పుడొస్తాయో అని మీనమేషాలు ఎంచుకుంటూ కూర్చున్నది.

# 17

ఊళ్లోనుండి మణేగారు (రెవిన్యూ ఇనస్పెక్టరు) లక్ష్మీనారాయణరాయని వుత్తరాలు అప్పుడప్పుడు కోడిగ్రామానికి వస్తుండేవి. నాగవేణికూడ ప్రత్యుత్తరాలిస్తుండినది. ఈలాగు ఇద్దరి పరస్పరస్నేహాలు తండ్రి కింకా తెలిసిరాలేదు. నాగవేణేమో 'మమ్ములను ఇక్కడే వదలి విరిచి, మురుగనియ్యకండి' అని వ్రాస్తుండింది. ముఖ్యంగా ఆమెకు సరసోతి ఇంకా కష్టపడేది ఇష్టంలేదు. వాడేమో 'నేను ఎప్పుడూ సర్క్యూట్ (పర్యటన) చేస్తుంటాను. అప్పుడప్పుడు స్థానచలనం, బదిలీలు' అని సమాధానాలువ్రాస్తే కొన్నాళ్ళకు 'మీకు ఆ దిగులక్కరలేదు. నేను తల్లి నవుతున్నాను, మీరు తండ్రి. కొత్తఏర్పాట్లు చెయ్యకండి' అని వ్రాసింది నాగవేణి. మరి ఆరుమాసాలలోగా ఆ రాయడు కేరళనుండి జాబులు వ్రాయడం మొదలుపెట్టాడు. 'కొందరిస్నేహితులసహాయంతో నాకు ఆ దికారిలోకి బదిలీ అయింది. ఈ పనిలో మరింత పై రాబడి- ఇన్‌స్పెక్టరుగా వేశారు. తరువాత త్వరలో మన జిల్లాకే వేసేఅవకాశం వుందిలే' అని ముద్దుగా వ్రాశాడు.

లక్ష్మీనారాయణ కేరళకు వచ్చింది నిజమే. ఉద్యోగం దొరికింది వాస్తవమే-కాని వానికి దురాశ మెండు. మరొక ముందుమెట్టు ఎక్కాలనికూడ వుంది. వాని ఇలాఖాకూడ డబ్బుదోచేదానికి అనుకూలమే. వాడు ఏ పేరుతో రాసి లంచం, నజరానా, కానుకలు ఏవిధంగా వానిచేతిలో రొక్కంపడినా మొహమాటం, నామోషీ లేకుండా స్వీకరిస్తాడు. కాని ఖర్చు, మిగులు ఎంత అనిమాత్రం ఎవరైనా ప్రశ్నిస్తే వానికి అప్పులే ఎక్కువ అని తేలింది. వాని దర్బారు జబర్దస్తీలుకూడ చాల పై మెట్టువే. తన వుద్యోగశాఖలో మంచి చాతుర్యం దక్షతతోనే ప్రవర్తిస్తూండేవాడు. కొన్నాళ్ళకే కొంత వృద్ధికలిగింది. మరొక్క పైమెట్టు దొరుకుతుందనే నమ్మకంకూడ కలిగింది.

కాని వాని దుడుకుతనం, దుబారాలమూలాన మనశ్శాంతి ఎక్కడిది? వానికి స్త్రీ వ్యామోహం అతి. ఎంత చేతికివచ్చినా ఆ పాతాళంలోకి పడవేసేవాడు. ఎప్పుడూ వట్టి చేతులే- ఒకసారి ఇంటికివ్రాసి డబ్బు తెప్పిస్తామనుకున్నాడు. 'నాకు ఆదాయం చాలదు-పంపండి' అంటే వింటారా? అందుకే మరొకసారి వ్రాసేటప్పుడు, 'నువ్వు-అక్కడ వడ్డీకి ఎవరెవరికిచ్చావో, చాల తక్కువవడ్డీ ఇస్తారు- ఇక్కడ డబ్బంటే కరువు-చాలవడ్డీ లభిస్తుంది. ఇంట్లో కొంచెం బియ్యం వుంచుకుని, మిగిలినబియ్యంకూడ అమ్మి డబ్బుపంపితే నేను అంతా ఎక్కువ వడ్డీకిచ్చి మంచిలాభం పంపుతాను' అని ఏదో యుక్తితోనే వ్రాశాడు.

ఆ జాబు వచ్చినప్పుడు నాగవేణి చాల అలసటలో బాధపడుతుండినది. ఆమె ఆరు నెలల గర్భిణి. ఆ జాబు సారాంశంకూడ ఆమెమనస్సును పాడుచేసింది. నారాయణయ్య గారే బియ్యం విక్రయించి లోగడనే మరెవ్వరికో వడ్డీకి ఇచ్చేశారు. 'ఉన్నదివున్నట్లు వ్రాయమా వద్దా' అని పినతండ్రితో ఆలోచించి చెప్పాలనుకుంది. సరసోతికూడ ఆ కాగితంసంగతి అడిగింది. 'ఏమి, వాడు ఇంటికి రాడా, ఎప్పుడు వస్తాడట, వ్రాశాడా?' అని విచారించింది. ఆ పత్రంసంగతి తెలుసుకొని సరసోతి సరిగ్గా చెప్పింది, 'చూడు ఇక్కడినుండికూడ డబ్బు తెప్పించుకుని పాడుచేస్తామని వున్నాడేవాడు, చేతికి బాగా నెలకు యాభై వస్తే ఏమిధాదీ? ఖర్చులకు చాలదా చెప్పు' అన్నది. నాగవేణి భర్తను నమ్మకుండా ఎలాగుంటుంది? ఏదో విధంగా మిగత బయట ఇచ్చామంటే తప్పు. వాడు 'అవునులే. నువ్వే యజమాని, నన్నెందుకు అడుగాలి, తగినంతధైర్యంలేదా నీకు?' అని వ్రాస్తాడేమో అని భయం. ఏమి చేయాలో తోచకుండ పినతండ్రికి వర్తమానం పంపింది. వారు ఆలోచించి 'సరే'. ఇక్కడకూడ చక్కగా అధికంగా వడ్డీ వస్తున్నది. పినతండ్రిగారే వున్నబియ్యం ఎంత మిగిలిందో అంతాకూడ ఎక్కువధరలకే విక్రయించి డబ్బేమో తమ పేరుమీదనే వడ్డీ కిచ్చేశారండీ' అని వ్రాయమని ఆదేశించారు.



ఆ జాబు వచ్చేలోపుగా లచ్చనినుండి మరొక జాబు వచ్చింది. '500 రూపాయలు వెంటనే పంపు. చక్రవడ్డీతో వాపసు ఇప్పిస్తాను' అని వ్రాశాడు.

నాగవేణి ఎల్లాను మొదటివుత్తరానికి వ్రాసిన సమాధానం చేరివుంటుంది పరవాలేదని తెలిసికొని వూరకుంది. ఆ నెలలోనే పై పైన ఎన్నోజాబులు ఇంటికి లచ్చడు వ్రాశాడు. చివరికి విసిగి నాకు ఒంట్లో బాగాలేదు, రెండువందలరూపాయలు తక్షణమే పంపు' అని వ్రాశాడు. సరసోతికిమాత్రం వానిజాబులు ఎన్నివచ్చినా, ఎల్లాగు వ్రాసివున్నా నమ్మకం కుదరలేదు. నాగవేణి ఆమెనుచూచి భయపడి వూరకున్నది. వెంటనే పినతండ్రివద్దకేవెళ్ళి ఏడ్చింది. నారాయణయ్య 'అమ్మా, నీకు భ్రమ. వాణ్ని పాడుదారి తొక్కిస్తున్నది నువ్వే అని తోస్తున్నదీ- చేతిలో డబ్బు ఖాళీఅయితే, ఇంట్లోనే వుండిపోనీ' అని వ్రాయమన్నారు. కాని కొంతసొమ్ము ఎలాగో లక్ష్మీనారాయణకు చేరింది, దానిపైన మరొకజాబులో అలాటి కారణాలే వ్రాశారు. 'సాధ్యమైనంతత్వరలో వూరికే వచ్చేసివుండు, పరవాలేదు. ఇక్కడ తీరికగా హాయిగా మంచిచికిత్స చేయించుతాం. అందులో నీభార్యకు కనువొద్దులు- ఎక్కడికి ఆమె వెళ్ళి డబ్బుప్రయత్నం చెయ్యజాలదు. ఇంట్లో మగవాడులేకుంటే చాలకష్టం' అని మరిన్ని బుద్ధివాక్యాలు చేర్చి వ్రాశారు.

చాలరోజులదాకా ఆ వుత్తరానికి తగినసమాధానం రాలేదు. నిజంగా వానికి రోగం రాలేదు. మరేమి తొందర, దుర్ఘటన సంభవించలేదు. ఇంటినుండి డబ్బులు లాగాలి అనే ధోరణి గలవానికి 'ఈ నారాయణయ్య ముసలిగొడ్డు. ఏమిట్రా మా ఇద్దరిమధ్య? మా నాన్నే మల్లెను నేను తింటే నీనికేం' అని తిట్టుకొంటూ కేరళలోనే వుండిపొయ్యాడు. 'ఒరే భార్య కాన్పుఅంటే గడ్డురోజుల్లో తియ్యనిమాటలైనా ఆడకుంటే ఎల్లాగు' అనికూడ తోచలేదు.

నాగవేణికేమో నవమాసాలు నిండినవి. పినతండ్రిమాత్రం ఆమెకాన్పు తమ ఇంట్లో జరపాలని ఆమెను ఎంతో బతిమాలారు. కాని ఆమె అందుకు అంగీకరించితేగా? 'మా సరసోతిఅత్తవుంటే ఏమీ పరవాలేదు' అన్నది. సరసోతికేమో ముదిమి; ఆపైన ఒక సంపూర్ణ ఆయుర్దాయమంతా చీకుచింతలతోనే గడిపి నలిగినజీవం; 'బిడ్డ, నాచేత నేమవును-సత్యభామ వుంటె బాగుండేది' అని లోలోన కుమిలిపోయింది సరసోతి. పనివాళ్ళను పడుమన్నూరికి తరిమి ఆమెను వెంటబెట్టుకురావాలని ఆజ్ఞ చేసింది. సత్యభామ వెంటనే తొందరగా వచ్చేసింది. అన్నిరోజులు నాగవేణిని వదలిపెట్టిందే గొప్ప అపరాధంగా భావించి పశ్చాత్తాపపడింది. సరసోతికి ధైర్యం చేకూరింది. 'నాగవేణీ చూడు, భగవంతుడే నీకు తోడుగా సత్యను పంపాడు. పరవాలేదు' అని సరసోతి చెప్పింది. సత్యవచ్చి కోడలికి ఒక ఇంటిపని కూడ పెట్టకుండా జాగ్రత్తగా చూచుకున్నది. తన కుమారునినుండివచ్చిన వుత్తరాలు ఏమని తెలుసుకొని 'మీ రెవ్వరూ నాకు వానికథ చెప్పకండి. వానిపేరుకూడ నేను వినదల్చలేదు' అన్నది సత్య.

ఫాల్గుణమాసం వచ్చింది- పున్నమినాడు ప్రొద్దుటినుంచి నొప్పులతో నాగవేణి పొర్లాడుతున్నది. సంగతితెలిసి నారాయణయ్యగారి భార్యకూడ పరుగెత్తివచ్చింది. ఎందుకో పగలంతా విపరీతమైన నొప్పులను నాగవేణి సహించాల్సి వచ్చింది. ఆమెముఖంలో ఎన్నో కష్టాలకు ఓర్చుకొని తట్టుకునేస్తోమత కనబడింది. భీష్మించిన ముఖముద్రనుచూచి సరసోతి వామెదగ్గరనుండి కదలకుండా కూర్చున్నది. సత్యభామమాత్రం వంటశాల ప్రసూతిగదికి మధ్య అల్లాడుతున్నది. నాగవేణి పళ్ల బిగించినముఖం చూచినప్పుడెల్ల పినతల్లిమాట లొక్కటే- 'ఆమెకు పాపం, బయకలు (వేవిళ్ళు) లేవు. సీమంతం లేదు. అచ్చటముచ్చటలు లేవు. మగడైనా దగ్గర వుండాలా?' అని అనేది. నాగవేణిమనస్సులోమాత్రం 'ఇంకెన్ని బాధలు, కష్టాలు చూడాల్సింకో ఏమో!' అనేదిగులే చుట్టుకుంది. వెనుకటికి మూడునెలల్లో కడుపు పోయినసంగతి మరువగలదా? ఆవిషయం సరసోతికికూడ తెలియదు. పినతల్లికి మాత్రం తెలుసు. అన్నీ జ్ఞాపకంపెట్టుకుని, నాగవేణి ఆశలు, నిరాశలు అన్నీ ఆవికరంగావున్న ముఖంలోనేచూస్తూ పినతల్లి 'ఎందుకమ్మా దిగులు, పరధ్యానం; మొదట్లో అయినట్లు కాదులే! దేవుడు చల్లగా కాపాడుతాడు లేమ్మా' అని నోరు జారి నాలుక కొరుక్కుంది. నాగవేణి గావుకేక వేసింది. 'వద్దు పిన్నీ వద్దు' అని ఏమో అనబోయింది. సరసోతికిమాత్రం 'మొదట్లోలాగు' అని అర్థం కాలేదు, ఆ సంగతి ఆమెను అడిగింది కాని, పినతల్లి మౌనం, నాగవేణి కేకలువిని ఇక ఆమె నాగవేణి ముఖంవైపుచూచి, ఆ వివర్ణతను చూచి మౌనంగావుండి తగినట్లు 'ఏమీ పరవాలేదమ్మా! ఊరకే భయపడవద్దు, మనఇంటి నరసింహస్వామి విన్నూ, శిశువును సుఖంగా వుంచుతాడులే' అని ధైర్యం నూరిపోసింది.

నాగవేణి ఆ కేకతరువాత సొమ్మసిల్లి పడింది. అందరూ చుట్టుచేరారు. కళ్ళకు చన్నీరుతడిమి గాలివీచారు. ఒకమూలకు కూర్చునియున్న చాకలిదికూడ దగ్గరకు వచ్చింది.



పగంరాత్రివేళ అందరిముఖాలేమో కొండమల్లెల్లాగు వికసించినవి. నాగవేణి బాగా అలసిపోయి పడికునివుంది. ఒకగంటక్రితం మగశిశువు జన్మించాడు. ఎదురుగానే కూర్చున్న సరసోతి 'నాగమ్మ బిడ్డ!' అని అనింది. ఆ పిల్లవాడు ఆమెమాట విన్నవానిలాగా కేకలతో ఏడ్చాడు. ఆ పిల్లవానిముఖంచూసి కేకవినగానే నాగవేణిముఖం స్థలకమలంలాగు వికసించింది. దేవుడు చెయ్యి విడువడు; ఎవరు చెయ్యి విడువనీ పరవాలేదు' అన్నది సరసోతి. నాగవేణేమో 'అల్లా అనకండి. వారుకూడ తప్పక వస్తారు' అని నమ్మకం ప్రకటించింది.

మరునాడే కేరళకుకూడ శుభవార్త వ్రాశారు. 'పిల్లవాని నామకరణానికి తప్పక రావాలి' అని ఒత్తి వ్రాశారు. నాగవేణి చాల బలహీనతలోవున్నా తనప్రక్కలో ఆ ఎర్రని లేత పసికూన ఏడిస్తేకూడ ఎంతో ఆనందంతో వాణ్ని చూచుకున్నది.

ఆరవనాడు పినతల్లి బరోడుకువెళ్లి త్వరలోవస్తానని వెళ్ళింది. మధ్యాహ్నం అందరూ భోంచేసి కూర్చున్నారు. శిశువుకూడ హాయిగా నిద్రపోతున్నది, అప్పుడు నాగవేణి 'అవును ఆ రోజు నేనే కేకలుపెట్టాను....' అన్నది.

'అవునులే ఒక్కొక్కసారి అల్లాగే అవుతుంది- నీవు చాల గాబరాపడ్డావుకదా!' అని అడిగింది సరసోతి.

'నేనేమో అక్కడలేను- ఆ కేకవిని దగ్గరికొచ్చాను- ఏమైనా చూశావా' అని అడిగింది సత్యభామ.

'ఏమీ చూడనూలేదు, ఏమీ లేదు. మా పినతల్లి ఏమో చెబుతుంటే వద్దని సంకేతం చేశానేమో!' అన్నది నాగవేణి.

'బాను! వెనుకసారి ఏమయింది చెప్పు.'

నాగవేణి నవ్వుకుంది. మీకు తెలీదులెండి. అప్పుడు మూడుమాసాలకే....' అని జ్ఞాపకంచేసుకుని ఏడ్చింది.

'బానులే! బిడ్డ! అలాగే అవుతుంటుంది ఒక్కొకసారి. ఐతే ఆరోజు చాల భయపడ్డావుకదా!' సత్యభామకు సరసోతికిస్పష్టంగా తెలియకుండానే 'ఏడవకమ్మా. ఈసారి నీకు కష్టాలుండవు- దేవుడు చెయ్యివిడువడు' అన్నారు. వారికీవార్త కొత్తది-'ఎవరూ ఏమీ చెప్పలేదే' అనికూడ అడిగినారు. 'సరే ఆ పిన్నమ్మనడిగితే అన్నీ తెలుస్తుంది- నేనెలా చెప్పాలి' అన్నది వాగవేణి.

పినతల్లి ఆరాత్రికివచ్చి వెనుకటికథ చెప్పింది. భర్తవలన ఆమె ఎంత నలిగిపోయింది, గర్భస్రావం అంతా వర్ణించింది. ఈసారికూడ పిల్లగతి యేమో అని భయపడిందో యేమో' అని సమస్యను పూర్తిచేసింది పినతల్లి.

దానికి సరసోతి ఒకసారిగా నిర్ధరించి చెప్పింది. 'ఏమైన చెప్పు - ఈ స్త్రీజన్మ ఎన్నో

పాపాల జన్మలఫలం అని అనవచ్చును. ఇక్కడ నరకాలే అనుభవించాలి, సుఖం దక్కదు తల్లీ' అన్నది.

నాగవేణిమాత్రం 'తంతి వచ్చిందా? వుత్తరం వచ్చిందా? తంతికి వుత్తరం కొట్టారా?' అని విచారిస్తూనే వుంది. ఆమెకేమో కుమారునికి నామకరణం జరపాలని పతిదేవుని ప్రక్కన పీటలమీద కుమారుణ్ని ఒడిలో వేసికొని కూర్చోవాలని చాల అభిలాష. వారిపై ఆత్మీయత వుట్టిపడకున్నా భవిష్యత్తులోనైనా బాగా బ్రదుకాలనేఆశ. తొమ్మిదవరోజే వుత్తరం వచ్చింది. నారాయణయ్యగారు హంగారకట్టి తపాలాఫీసునుంచి తెచ్చి పంపారు. అది తంతి. వీరు పంపినతంతి వీరికే వెనుకకువచ్చింది. దాన్నిచూచి 'వారికి మరెక్కడో ట్రాన్స్ఫర్ అయివుండవచ్చు' అన్నది నాగవేణి. 'బదిలీ అయితే అక్కడికే తంతి వెడుతుంది. 'వాడు ఎక్కడ గొడవలుపడి తిరుగుతున్నాడో' అన్నారు నారాయణయ్య.

శుద్ధ స్నానంతోనే నాగవేణిస్నానంమైల పోయింది. నామకరణం జాతకర్మ పుణ్యాహవాచనాలు ఇంకా జరుగలేదు. ఆశ మిగిలింది. అందరూ ఒకసారి పిల్లవాణ్ని వూరకే 'సణ్ణ' అని, పుట్ట అని, బుల్లిబ్బాయి' అని పిలువసాగారు. మూన్నాళ్ళు 'సణ్ణ' అన్నారు. 'పుట్ట' అనేది ముద్దుపేరు అయింది. ఆ పుట్టన్న వుపచారాలలో తన సంసారం మరచిపోయింది నాగవేణి. రెండునెలలలోనే వాసుదేవయ్యగారు వచ్చారు. బంగారు మొలత్రాడు కట్టారు. చాలసేపు నాగవేణి ఇంట్లోనే గడపేవారు. మనుమనితో ఆడుకొని చాల ఆనందించారు. ఆమె వంటరిగావున్నప్పుడు తండ్రి 'నాగూ! నీవు గర్భిణి అనగానే నాగుండె నీరైంది. మళ్ళీ ఇదివరలోలాగే ఆ నొప్పులు మళ్ళీ వస్తాయేమో అని భయం వదలలేదు. సరే సురక్షితంగా కన్నావంటే చాల సంతోషమమ్మా' అన్నారు.

నాగవేణి చెల్లెలు పండ్రెండేళ్లది కృష్ణవేణిమాత్రం అక్కనుచూడాలని అప్పుడప్పుడు వస్తుండేది. నాగవేణి తండ్రితో 'అప్పా! ఈసారి కృష్ణవేణికి పెళ్ళికదా!' అన్నది. 'నీవు పెళ్ళి అంటే భయం పుట్టించావు. నీవు అనుభవించేనరకం చాలదా! ఆమెకు ఏ కష్టాలు రాకుంటే చాలు' అన్నారు. 'ఏమోలే నా తలవ్రాతలో వున్నది. దానికి ఎందుకు వస్తుంది చెప్పు!' అన్నది నాగవేణి. 'కుందాపురంలో వున్నప్పుడే ఈ పిల్లవాడు ఎల్లాంటివాడు? అని విచారించుంటే బాగుండేది. ఇప్పుడేమో అందరూ చెప్పేదేమంటే మొదటినుంచి వాని తలవ్రాత అంతేనని' అన్నారు వకీలుగారు.

నాగవేణికి మరింత వ్యధ కలిగింది. లచ్చని పూర్వవృత్తాంతం తండ్రికూడ చెప్పలేదు. మగడు మంగుళూరిలోనే చెడిపొయ్యాడనుకున్నది. ఏవిధంగానైనా తండ్రిని బాధించి 'వారిని ఒకసారైనా రప్పించు నాన్నా! వారు ఈ పిల్లవానికి ఎల్లాగయినా తండ్రి అవుతారుగా?' అని అందామని, ఏమోలే అనుకుని అభిలాష తెలిసింది. అప్పుడు తండ్రి 'అది తల్లీ బంగారం ఎప్పుడైనా అపరంజి బంగారం అయ్యానా? ఎందుకు? ఎలా?' నేను వానిసంగతి తెలుసుకుంటున్నాను. దగ్గర ఎక్కడా. ఒకసారి తన అధికారులతో



పోట్లాడి కేరళ నౌకరి ,మానేశాడని తెలిసింది' అన్నారు. తండ్రిమాటలవలన నాగవేణికి నిరాశ ఎక్కువైందేకాని సుఖం లేదు.

నిజానికి వాసుదేవయ్యగారు మంగుళూరికి వెళ్ళటానికిముందే పెద్దకుమారునికి, చిన్న కూతురుకు తప్పక పెండ్లి చేసెయ్యాలని ఏర్పాట్లు చెస్తున్నారు. కొడుకు వారిలాగే వకీలు అయ్యాడు. అతడు లగ్నానికి యోగ్యుడే. అతడు లగ్నమే వద్దనేవాడు. అంగీకారానికి వేచి ఉండడం అయింది. ఎన్నో జాతకాలు వచ్చిపడ్డాయి. చక్కనిసంబంధం ఏరి కోరుకోవాలని వుంది. ఆడపిల్లసంగతి అల్లాకాదు. ఆ వరునిచరిత్ర కూలంకషంగా తెలుసుకోవాలి. లేకుంటే దుస్సాహసం తగదు. 'అయిన ఒకలగ్నమే చాలు' అంటున్నారు వారు. అవసరమైతే వరుణ్ని ఇంట్లోవుంచుకుని, గుణగణాలు గమనించి గీటురాయిపై పరీక్షించినపిదపగాని బిడ్డలకు పెళ్ళి చెయ్యరాదని వూహించారు. ఏమీ తెలియకుండా 'పునుగుపిల్లి' అని పట్టుకొని వస్తే కరుస్తుంది. కథ అడ్డం తిరుగుతుంది అనుకున్నారు.

అలాంటి మోతుబరి పేరుమోసిన వకీలుగారికి సంబంధాలకు కరువా? లచ్చని చరిత్ర వల్ల భయమేసింది. కాని వూళ్ళోఅందరూ చెడరుగా? మంచిచోటనే సంబంధం కుదిరింది. సదాశివుని పెళ్ళి. వాని భార్య అన్నకే చెల్లెలి లగ్నం. ఈ ఎదురుబదులు పెళ్ళిళ్ళ వలన ఒకరు మరొకరి నిష్ఠురానికి పాత్రులవాల్సి వస్తుందేమో అని మొదట్లో భయపడ్డారు. ఏమయినా నాగవేణిమాత్రం పసివాణ్ని ఎత్తుకుని ఐరోడులో జరిగిన చెల్లెలిలగ్నం చూచి వచ్చింది. అన్నగారిపెళ్ళి చూడలేకపోయింది. వానకాలంలో పెళ్ళిళ్ళు ముగిసినవిగనుక, తరువాత వకీలుగారు తమ వుద్యోగానికి వెళ్లారు.

'కోడిగ్రామం' ఇంట్లో ముగ్గురు అనాధురాళ్ళు కూర్చున్నారు. 'వూరకే వాననీళ్ళను చూస్తుంటే లాభమేమి—ఏమైనా సాగుచేసుకుంటే బాగవదా?' అని అంచనా వేసుకుంటున్నారు. సరసోతి 'నాకు వీలైనంత చాకిరీ చేస్తాను' అన్నది. ఆమె ఇంటిసమీపానవున్న పొలానికిమాత్రమే వెళ్ళ రాగలదు. చాల ఎక్కువపని చేతగాదు, సత్యభామ మగనికాలంలో వ్యవసాయంలోదిగి వుండలేదు, సరే కాలక్షేపంఅయినా అవుతుందని 'ఒకే తూమెడుగింజలు విత్తనం వేయిద్దామా' అన్నది. ఆ వానకాలంలో పేరుకుమాత్రం 'ఇంటిసేద్యం అంటూ బండచాకిరీ' చేశారు. దసరా కొత్తభోజనాలకు పొరుగింటివడ్లు దంచి పాలుపాయసంచేసేగతి పట్టలేదు. నాగవేణి 'సరే వచ్చేయేడు మూడుతూములు విత్తించాలి, వులవలు, అనుములు వేద్దాం, ఈ కోతలతరువాత. దోసతోటలకు నీళ్ళు తోడలేము, వద్దులేండి' అని ఏమేమో పథకాలు వేసింది. ఆమెకు వ్యవసాయం లోతుపాతులు తెలియవు, కాని 'ఊరకే కూర్చుని తింటే మంచిదికాదు' అనే సరసోతి సూక్తిని ఆమె ఆమోదించింది.

కాని ఆమెస్వప్నం సఫలమైతేగా. పుట్టన్న ఆరుమాసాలప్పుడు, యకృత్ (లివర్) వ్యాధి వచ్చింది. పిల్లవాని చురుకుదనం ఆటలు నిలబడినవి. ఏడ్పు. కేకలు. నాగవేణి మన

లక్ష్మీనారాయణునికి బుద్ధి రాలేదేమని కాలం ఆగుతుందా? అది ఎవరినీ ఎదురు చూడదు.

నాగవేణి గతకాలాన్ని, ఋతువులను లెక్కపెడుతున్నది. ముంగారుకు వరిపంట, కోడి జాత్రవేళకు పులవసేద్యం, మకరసంక్రాంతికి దోసతీగలు అని. లెక్కపెట్టే మధ్య మధ్యన 'ఏమిచేసి ఏమిలాభం? ఈ మంగళసూత్రంవల్లకదా ఇంత బాధ మనకు? వారి ముఖంచూచికూడ అన్నాళ్ళు అయింది. పుట్టన్నకూడ వెళ్ళిపోయి అన్నాళ్ళయింది' అని పలవరిస్తుంది. సరసోతి ఒకతే చంటిపిల్లలాగున్నది. ఆమెకుకూడ డెబ్బైఏళ్ళు వచ్చినాయి. కళ్ళకు మబ్బులు కమ్మినాయి. మసకలోనే తడుముకొని తెలిసినచోట్లకు వెళ్ళివచ్చేది. అల్లాంటి సరసోతితోనే నాగవేణి ఏమేమో మాట్లాడుతుంటుంది. ఆమే ఆ ఇంటికొక దేవత.

సరసోతి నాగవేణి చేతులుపట్టుకొని తనకు తెలిసిన చిన్ననాటిగాథలన్నీ చెప్పేస్తుంది. తన బీదతనం, అనాథజీవనంగురించి, ఎన్నోఏళ్ళు రామబతాళులు, పారోతిగడిపిన సుఖ జీవనం, ఎన్నోచూచి చివరకు మొద్దులాగు ఎందుకుండాలనో తోచటంలేదని పశ్చాత్తాప పడింది. నాగవేణిమాత్రం 'నేనున్నన్నాళ్ళుమాత్రం మీరుంటే చాలు.' అనేది.

'బిడ్డ, నీవు చిన్నపిల్లవు, ఎంతోకాలం బతికి వర్ధిల్లాలి! ఎప్పుడైనా వానికి బుద్ధి వస్తే చాలు, నీవద్దకు వచ్చి వుండిపోతాడు. నేనుండి చేసేదేముంది చెప్పు కాని, 'ఒకటే ఒకటి ఆశ మిగిలిపోయింది. అన్నకే చెప్పివుంటే చేయించేవాడేమో? ఇప్పు డెవరు చేయిస్తారు?' అన్నది సరసోతి.

'మీకేమి ఆశో చెప్పండి. మీ బతుకే ఒక యజ్ఞం, త్యాగం' అన్నది నాగవేణి. 'అల్లా కాదులే. చచ్చేలోపుగా కాశీయాత్ర చేసివస్తే బాగు. కోదండబతాళులు, రాముని తండ్రి మాత్రం నడచి కాశికి వెళ్ళివచ్చారు. కుంభమేలా వెళ్ళి గంగతీర్థం నేను తేవాలి, నాకు కళ్ళు గుడ్డి, మేనల్లుడు ధర్మభ్రష్టుడు, వ్రతాలు తీర్థాలు వద్దులే' అన్నది సరసోతి.

అరవ ఉగాది-అంటే పుట్టన్న నాగవేణిని వదలిపెట్టి ఆరేండ్లయినవి. ఆమె అప్పటి నుంచి బయటవెళ్ళదు. వెళ్ళినా బరోడు వెళ్ళి సాయంకాలానికే తిరిగివస్తుంది. సరసోతి కళ్ళు కానరాకుంటే పడి చెరువులోపడినా కష్టమే అనుకుంటూ భయంతో త్వరగా ఇంటి పట్టు చేరుకుంటుంది. ఆమెనువిడిచి బయటికిపోతేకూడ అదేచింత తప్పదు.

ఉగాది గడచింది. వైశాఖమాసానికి సెలవులకు వకీలుగారు వచ్చారు. బిడ్డతో మాట్లాడ టానికి వచ్చి అందరినీ కుశలప్రశ్నలువేసి 'లచ్చడు మైసూరులో, బెంగుళూరిలో హోటేళ్ళు తెరిచాడట. అప్పు, జూదం, మరొక్కటి- 'ఏదో ఒక పేరుతో అప్పులు. పరుగెత్తివెళ్ళేది జరిగినదట. మొన్న నేను వూళ్లో లేకుంటే సదాశివునివద్దకు వచ్చాడట. చివరకు వూటకెర కాను, బస్సుఖర్చు లిమ్మన్నాడట. ఐదురూపాయలు దొరికినా పట్టుకెళ్ళాడట. భోజనానికి వుండమన్నా వుండలేదట' అని అన్నారు.



సరసోతి 'పోనీలేండి! ఇప్పుడైనా బుద్ధిరానీ- ఈ పిల్ల బతుకైనా బాగుపడని' అన్నది.

'ఆమెను బతికించేదా? ప్రాణం తీసేదా? వానికేం' అన్నారు. 'అయితే వూరికొచ్చాడా?' అడిగింది సరసోతి.

'నేను మళ్ళీవుంటే రాడులే, ఒకవేళవస్తే డబ్బులు లాగుకుపోతాడు. డబ్బు వ్యవహారంలో దింపితేమాత్రం నావద్దకు పంపు' అన్నారు.

ఆరాత్రి వాసుదేవయ్యగారు అక్కడే వుండిపోయినారు. వకీలుగారు కూతురితో చాల సేపు మాట్లాడినారు. చిన్నకూతురికథ వుత్సాహంగా చెప్పారు. 'ఇద్దరూ మద్రాసులోనే చాలా సుఖంగా వున్నారు. అల్లుడు మంచియోగ్యుడు, వుత్తరాలు వ్రాస్తుంటారు. నూరురూపాయల జీతం తెస్తాడు' అని సంతోషం వెల్లడించారు. నాగవేణి అన్నా తమ్ముల క్షేమసమాచారాలు అడిగి తెలుసుకుంది. వారు చాల సంతోషంతోవుండే మనఃస్థితిగమనించి నాగవేణి 'నే నొకటి చెబుతానాన్నా! చేయించాలి, కాదనరాదు' అన్నది. 'చెప్పు, ఏం చెప్పు' అన్నారు. 'కచ్చితంగా చేస్తానంటే చెబుతా' అన్నది నాగవేణి. 'నాకు వీలైతే తప్పక చేస్తాను' అన్నారు. 'పెద్ద పనికాదు, సరసోతి అత్త చాల ముసలిదయింది. ఆమె లేకుంటే ఈ ఇల్లు ఇప్పటి దాకా నిలబడేది కాదు. వారిది ఒకఆశ తీర్చాలి.'

'చెప్పు.'

'కాశికి వెళ్ళిరావాలట. మీ ముందు చెప్పుకోడానికి సిగ్గేస్తుంది. ఈ ముసలిమూటను ఎవరు మోస్తారు, కండ్లులేనికబోది అని బాధ పడుతుంది. వారికి ఈ పుణ్యం తెప్పిస్తే, అట్లయినా నా గ్రహచారం పరిహారమవుతుందో ఏమో చూడు' అన్నది.

వాసుదేవయ్యగారు కొంతసేపు మౌనంగా ఆలోచించారు.

'సరేనమ్మా! నాకూ వెంట్రుకలు తెల్లగయ్యాయి. నా ప్రాక్టీసు చాలవరకు సదాశివునికే వదిలేశాను. నిన్నుకూడ వెంటబెట్టుకొని వెడతాను' అన్నారు.

'నేను రాను. వీలైతే సత్యమ్మత్త వస్తుందేమో కనుక్కుంటా- నాకు ఇల్లే కాశి, కైలాసం' అన్నది నాగవేణి. బిడ్డకు నచ్చజెప్పటానికి కాలేదు. చివరకు ఆ ఇంటినుండి పెద్దలిద్దరే ప్రయాణం కట్టాలని ఏర్పాటుచేసింది నాగవేణి. వకీలుగారు ఆలస్యం చెయ్యరాదని మరునాడే ప్రయాణం ఏర్పాట్లు చేశారు.

మరుదినమే నాగవేణి 'అప్ప, కాశికి వెడతారంట. మీ ఇద్దరినీ వెంట తీసికెళ్ళతారు.' అనగానే సరసోతి 'అమ్మా! నన్ను అంతమాత్రం అడిగితేనే ఆనందం. గుడ్డిదాన్ని వద్దని చెప్పు. ఎందుకు ఆ బాధ మీ నాన్నకు? నేను దారిలోచస్తే, నాకే పాపం, సత్య వెడితే చాలు,' అన్నది. నాగవేణి మొండిపట్టు పట్టింది. 'ఏమైనా సరే! మీరు వెళ్ళాలి' అని ఏడ్చుకుంటూ

పెద్దలను బలవంతం పెట్టింది. 'రైలు, మోటారు, డోలీలు. మీకేమీ పరవాలేదు. హాయిగా వుంటుంది' అన్నది. ఆమె కన్నీళ్ళే గెలిచినవి. ఇప్పుడు విత్తనాలయ్యాయి. కోతలకు వాపసు వస్తారు. ఏం పరవాలేదు' అని నచ్చచెప్పింది నాగవేణి.

వెళ్ళవలసినదినము రానే వచ్చింది. నాగవేణికిమాత్రం అమితోత్సాహం, ఆనందం కల్గినవి. అంతకుముందురాత్రి అత్తతో గొంతు ఎండేటన్నిమాటలు మాట్లాడినా ఆశ తీర లేదు. వకీలుగారుకూడ వచ్చి ఆహ్వానించారు. సరసోతి తీరా వెళ్ళేసమయానికి గద్గద కంఠంతో 'చూడూ, నేను చూస్తానో లేవో, భగవంతుడే నిన్ను రక్షించాలి. నాదేమీ పరవా లేదు' అని చెప్పింది.

'మీరు ఎందుకురారు, మీ కాళ్ళు పిసికేటంత ఎక్కడికీ పోదులెండి, సుఖంగా యాత్ర చెయ్యండి' అన్నది నాగవేణి.

ముసలిదాన్ని పల్లకీలో పరుండబెట్టి సాగనంపాలని నాగవేణి కోరిక. కానీ 'అల్లా కాదు. నడవాలి, నేనే యాత్ర వెడతాను. పెద్దలు కాశీకే నడిస్తే, నేను బస్సుదాకా నడవలేనా' అనుకుంటూ సరసోతి నడచింది. చివరకు పడవవద్దకు నాగుచేతిలో చేతులువేసి పట్టుకొని వెళ్ళింది. నాగవేణి బరోడుకువెళ్ళి అక్కడ అందరూ ప్రయాణం చేసేదాకావుండి, కన్నీళ్ళతో వీడ్కోలిచ్చి వచ్చింది.

నాగవేణి చెక్కిళ్ళపై అశ్రుధారలే కనబడినవి. ఆమె పినతండ్రి 'వుండమ్మా! ఒక రాత్రి అయినా వుండు' అన్నారు.

'లేదు, వద్దు. ఇంట్లో దేవునికి దీపం వెలిగించాలి. ఇంటిదీపం ఇన్నాళ్ళు ఒకనాడైనా ఆరలేదట. ఆ ఆచారాన్ని నేనే నిలబెట్టకుంటే ఎల్లాగు?' అన్నది. పినతండ్రి ఏమీ అన లేదు.

నాగవేణివెంట వాసుదేవయ్యగారు పంపిన బంట్రోతుకూడ వెళ్లాడు. ఇద్దరూ అక్కడ చేరేసరికి ఆ ఇంటివద్ద ఎవరో తిరుగులాడుతున్నారు. 'అమ్మా! వా డెవడో దొంగనమ్మా! లేకుంటే మీరు లేనిదిచూచుకొని తిరుగులాడుతాడా?' అన్నాడు మనిషి.

'దొంగ కేముందిలేరా!' అని నాగవేణి ఆ వ్యక్తివైపు చూసింది. ఎవరో కనుపించారు. అవును, ఆమెను అతను గుర్తించలేదు. వూరకే నిలబడ్డాడు. ఆ రూపం చింకిపాతలతో కప్పాడు. రూపమేమో వికారంగా వుంది. సరిగ్గా పోల్చుకులేకపోయింది. క్రాపింగు చెదరింది. ఏడురోజులుగా మాసినగడ్డం, నిద్రలేనికళ్ళు, ఇవన్నీ విచిత్రవ్యక్తిత్వానికి కళలుగా మారినవి.

మనిషి 'ఎవరక్కడ?' అన్నాడు.

వ్యక్తి మాట్లాడలేదు.



'ఎవరు....' అని గద్దించాడు. 'ఇంట్లోవాళ్ళు లేనప్పుడు ఎందుకున్నావు?' అన్నాడు.

ఆ వ్యక్తి నవ్వాడు.

నాగవేణికి సంశయం తీరింది. దగ్గరకువెళ్ళి 'మీరా? ఎప్పుడు వచ్చారు? భోంచేశారా?' అని కుశలప్రశ్నలు వేసింది.

'అయితే; వచ్చాను, గుర్తు చిక్కిందా?' అన్నాడు.

పనిమనిషియొక్క ముఖంచూస్తూ నాగవేణి 'వారేరా! ఆయన!' అని సంతోషంతో పొంగిపోయింది.

ఆరాత్రి విచిత్ర భావోద్రేకం, ఉన్మాదాలతో కలగాపులగమయింది నాగవేణి. ఈ అవరూపమైన కలయిక ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. కాని సరసోతివుంటే చాల ఆనందించేదే అనే వ్యథకూడ కల్గింది. అంతలో పతినిచూచిన సంతోషాన్ని కొడుకుచావుయొక్క జ్ఞాపకంవచ్చి చంపేసింది. ఆమెయొక్క నీరసమైన మానససరోవరాన్ని పతిరాక అల్లోలకల్లోలం చేసింది.

# 18

లక్ష్మీనారాయణ వచ్చి మూన్నాళ్ళయినా ఇంట్లోకూడ అతిథిలాగే ప్రవర్తించాడు. నాగవేణికి అతిగా పైబడి ఉపచారం చేస్తామంటే మనస్సు నెమ్మదిగా లేదు. అతనితో ఆత్మీయత ఎన్నడో ముక్కలుగా తెగిపోయింది. ఆ పుట్టన్న చావువలన మగడంటే ఒకవిధంగా రోతపట్టింది. కాని ఇంటికివచ్చిన మగణ్ని 'వెళ్లండి!' అని వెళ్ళగొట్టే దుష్టురాలుకాదు నాగవేణి. అలా చెప్పడంకూడ వుచితంకాదని తోచింది. 'భోంచెయ్యండి, స్నానంచెయ్యండి, పడుకోండి' అని అన్నీ చెబుతుండేది కాని తానేమో ప్రక్క అమర్చి ఇంట్లోకివెళ్ళి పడుకునేది; బయట మగణ్ని విచారించడానికి తండ్రిగారి మనిషికూడ వుండేవాడు. లక్ష్మీనారాయణ వూరికి రాకముందు అన్నీ విచారించుకుని వచ్చాడు.

కానీ ఊరకే నిరాశతోకూర్చునే పరిస్థితిల్లో లేడు లచ్చుడు, మూడునాళ్ళు నోరుమూసుకుని వున్నాడేమో నాల్గవరోజు ప్రసంగం మొదలుపెట్టాడు. నాగవేణి వంటఇంట్లో వచ్చికట్టెలను వూదలేక కండ్లు పోగొట్టుకుంటూ ఏడ్చేసమయాన, 'నాగవేణీ నన్ను వుండమంటావా? వెళ్ళమంటావా?' అని ప్రశ్నించాడు.

'నే నట్లా చెప్పానటండీ.'

'నువ్వు చెప్పవూ? సరిగా మాట్లాడవూ.'

'నాదగ్గర ఏముందని మాట్లాడగలనండి. మమ్మలను తృణీకరించి వదిలివెళ్లారే? ఇన్నాళ్లూ నన్ను కాలదన్నారే ఎందుకండీ? మళ్ళీ మా నెత్తిన నిందలువేస్తే ఎల్లాగండీ?' అన్నది.

'జరిగిందేమో జరిగింది. నా అదృష్టమే చెడ్డదిలే. ఏమిచేసినా బరకత్తు (వృద్ధి) లేదు. ఎంతకష్టపడినా ఒకటికి రెట్టింపునష్టమే కలుగుతున్నది- లాభాలులేవు. ఆ గొడవ లెవరికి చెప్పాలి?'

నాగవేణికి వానిమాటలు బోధపడలేదు.

'బయట కష్టపడింది చాలు. ఇంక ఇక్కడే వుండాలనివున్నాను' అన్నాడు.

నాగవేణి ఏమీ పలుకలేదు. లక్ష్మీనారాయణ యోచనచేశాడు.

'అయితే ఇక్కడ వుండవద్దా? నీ అభిప్రాయం చెప్పు. ఎవరికి భారంగా వుండాలని నాకుమాత్రం ఇష్టమా? ఇదంతా మా నాన్న ఆస్తిఅయినా మీ అందరిధర్మం, బిచ్చంపాలు చేశాడు. మర్యాదలేకుండ చేశాడు. ఇక్కడ వుంటానన్నాను. నీకు ఇష్టంలేకుంటే ఇక్కడ వుండను. నాకున్న ఒకముక్క ఆస్తినికూడ మీ నాన్న అప్పు తీర్చేనెపంతో కాజేశాడు. మీ కున్నాగాని నేను అడుక్కునేలాగ చేశారుగా!'

నాగవేణి అందాక వూరకున్నది విరక్తితోను, వినుగుతోను వాని విషంకక్కేమాట లను ఓర్వలేకపోయింది. 'నా సుఖంకొరకే అప్పులు చేశారా? నరసింహమయ్యరుకు చెల్లించినడబ్బు ఎవరిదంటారు? మీకు దండుగ ఇచ్చినట్లే కాదా? పెద్దలు చేసిచ్చినఇల్లు మట్టిపాలు కావలసిందేనా? మీరు అనుభవించరాదని నాకు ఒక్కదానికే అవి అన్నానా?' అన్నది.

అది తెలివిలేనిమాట గాదు. లక్ష్మీనారాయణ వూరకేవున్నాడు. తరువాత మూడునాళ్ళు తిండి, నిద్ర. ఒరటమయ్యరువద్దకు వెళ్ళివచ్చేది ఇవే అతని కార్యక్రమం. ఊళ్ళో క్షౌరం అన్నీ అయినాయి. బిచ్చగానికిమల్లే వుండేవికారస్వరూపం మాసిపోయింది. లక్ష్మీనారాయణ వెనుకటి రోజులలాగు నిండుగ, పుష్టిగలవిగ్రహంతో లేడు. వూరకే చర్మంతోకప్పిన ఎము కలగూడుమాత్రమే. అతణ్ణిచూచి నాగవేణికి సుఖం అనిపించలేదు. ఒకనాడు భోంచేసే సమయాన 'ఈ ఎండినకట్టెతో శుష్కంగా ఎందుకు? బదుకాల్సివచ్చికూడ వూరకున్నా రెందుకు? సరియైన ఔషధం సేవించరాదా? ఇక్కడ లేకుంటే ఉడిపికైనావెళ్ళి రండి' అన్నది.

'డాక్టరు మందంటే డబ్బు కురిపించాలి? ఊరకే అవుతుందా?'



'నేను ఇయ్యనన్నానా?' అని అన్నది. ఆరోజే ఐదురూపాయలు ఆమెవద్ద స్వీకరించి లక్ష్మీనారాయణ ఉడిపికి వెళ్ళివచ్చాడు. మూన్నాళ్ళు గడిచినతరువాత 'తాగటానికి పాడుమందిచ్చారు? ఎవరు తాగుతారని?' అన్నాడు.

'నయం కావాలంటే తాగాల్సిందే, మళ్ళీ యాభైరూపాయ లెక్కడినుండి తేవాలి? నాన్నవచ్చాక ఇప్పిస్తాను.'

'మళ్ళీ చూడు! నా ఇంట్లోనే నేను భిక్షాటనం. నీవు అర్జీపెట్టి, మీ నాన్న శాంక్షన్ చెయ్యాలి. అందాక నా వ్యాధి నయంకాకుండా శవయాత్ర కెళ్ళినా సరేనా?' అన్నాడు.

నాగవేణి పెదవి కొరుక్కుంది. ఇప్పటికే కొన్ని శ్మశానయాత్రలు కండ్లారచూసింది. తన పసుపుకుంకుమసమస్య రాగానే ఏకో పెద్దమెరుపు తనలో దెబ్బతీసినట్లే అయింది. ఆ పగలల్లా మొద్దుగా వున్నది. మరునాడువుదయమే తన ఒకజతగాజులను ఒలిచిఇచ్చి 'తీసుకొండి. మంచిమందుతిని బాగుచేసుకొని రండి. ఇక్కడుంటే పాలు, పెరుగుల వుపచారం చేస్తాను. ఇంకెక్కడా దొరకదు. ఆలోచించండి' అన్నది.

నాగవేణి కరుణను, జాలిని (వుపయోగించుకోవచ్చునని) చూచి 'ముందు ఆశవుంది' అని తోచింది లచ్చనికి.

మరునాడే ఒరటనివద్దకు వెళ్లాడు. ఆ బంగారునగలు కుదువవుంచి యాభైరూపాయలు తీసుకుని వుడిపికి వెళ్లాడు. వైద్యులను చూచాడు. అందాకా నిజం. వారు చెప్పిన పథ్యం వుండలేనని తెలుసుకుని మందును సీసాలోనింపుకొని తన భార్యవద్ద పథ్యం సరిగ్గా జరుగదులే అని నిశ్చయించి దక్షిణవాడలోని వేశ్యాగృహంలోనే మూన్నాళ్ళు బస చేశాడు. తరువాత వూరుచేరాడు.

పదిరోజులమందు దొరికింది. మందేమో తాగాడు. మంచిమందని ఏమేమో ప్రశంసించాడు. స్వంతఇంట్లో పడివుండడమంటే వానికెప్పుడు సరిపడదు. భోజనానికిమాత్రం ఇల్లు చేరేవాడు. ఒరటమయ్యరువద్దకెళ్ళి అనేకంగా వూళ్లోని అందరిగురించి కోతలు కోస్తాడు. ఒరటడు మోతుబరీవాడు- ఎందరో వస్తారు. అప్పులు, లావాదేవీలు, వ్యవసాయం. లక్ష్మీనారాయణ తన ఛలోక్తులతో, సరసప్రసంగాలతో కాలక్షేపం చేసి ఇల్లు చేరుతాడు. అతడు వచ్చినసంగతి ఐరోడుకు తెలిసింది. నారాయణయ్యగారుమాత్రం 'అమ్మా నీవు అన్నపానాలకు లోటు చెయ్యవద్దు. కాని నగదురొక్కం ఇయ్యవద్దు. వ్యవహారాలు-అంతరంగం గదిలోకి రప్పించకు జాగ్రత్త' అని హెచ్చరికచేసి వెళ్ళారు.

ఒరటనికి మాటలకు తగిన జత కావలసివుయుండేది. బెంగుళూరినుండివచ్చి రెండేండ్లయి ఊరు కొంత కొత్తగా మారినా, ఆ పట్టం బజారులలో షికార్లుచేసేవానికి ఈ పల్లె

చాల వ్యర్థం అని తోచింది. అన్న భయానికి పల్లెలో వున్నాడేగాని ఇష్టంతోమాత్రం కాదు. బాల్యస్నేహితుడు లక్ష్మీనారాయణ దొరికితే బహుభాగ్యంగా భావించాడు. ఒరటని తల్లి మాత్రం జాగ్రత్తగావుండుమని చెప్పింది. 'నేనుమాత్రం వానిచేతిలో దొరకడానికి చిన్న పిల్లవాడినా? కాలక్షేపానికి నేస్తం. ఏం పరవాలేదు' అన్నాడు ఒరటడు.

లచ్చుడు ఊరికి వచ్చి నెలన్నర అయింది - వేళకు సరిగా భోజనం, స్నానం, నిద్ర అన్నీ జరిగితే ఆ క్షామ రూపం పోయి కొంత చైతన్యం ఏర్పడింది. వ్యాధి మాత్రం పూర్తిగా మానలేదు. ఆ సందర్భంలోనే రెండు జతల గాజులు, యాభై రూపాయలు వాడు స్వాహాచేశాడు. వాని శరీరోపచారం పేరున ఆమె చెల్లించుకున్న కానుకలవి.

లచ్చుడు కాముకుడైనా నాగవేణిని మాట్లాడించే సాహసం చాలలేదు. 'ఇద్దరు పిల్లలు చనిపోయారే, సావాసం చాలు' అంటే ఏం చెయ్యాలి - అని భయం. సాయంత్రం కాగానే ఆమె అతి జాగ్రత్తగా వ్యవహరిస్తుంటే వాడు గమనించడా? ఒక్కసారి 'నేను అయితే ఒక కుష్ఠురోగి అనుకున్నావా?' అని ఆమెను దెప్పాడు కూడ. నాగవేణి ఏమని చెప్పగలదు? ఒక్కసారి పెద్దవాళ్లు యాత్రనుండి వస్తే అన్నీ సర్దుకొంటాయి అని నమ్మకంతో వుంది.

యాత్రలు అంటే ఈ రోజుల్లో యుగాలు పడతాయా? కోదండ బతాదుల కాలంలో అయితే సగం రైలు, సగం నడకలాగు ఈకాలం గుంపులయాత్రకాదు. కాళ్లు నేలకు తాకనీయకుండా కాశీలో దిగవచ్చు. తిరిగి రావచ్చు. ఏడువారాలలో కాశీ, రామేశ్వరాలు చూచుకొని వకీలుగారు పరివారంతో ఇంటికి వచ్చేశారు. నాగవేణి పరుగెత్తికొని వెళ్లి వారికి స్వాగతం చెప్పింది. సరసోతి చెవిలో 'మీరు వెళ్లినరాత్రే వాడు వచ్చాడు' అని చెప్పింది. 'పోనీలేవే, వున్నా వకటే, వెళ్లినా ఒకటే' అన్నది.

సత్యభామ, సరసోతి ఇల్లు చేరారు. వాళ్ళ ఇల్లు కూడ జాత్రల ఇల్లే అయింది. ఊళ్లోని పెద్దవారు, సుమంగళులు వచ్చి యాత్రావిశేషాలు అడిగి తెలుసుకొన్నారు. అందరూ సరసోతికి 'అవ్వా! మీరు బహు పుణ్యాత్ములమ్మా; యాత్రలుకూడ చేసివచ్చారు' అని చెబుతూ కాళ్ళకు సాష్టాంగనమస్కారాలు చేసేవారికి కరువేలేదు. సత్యభామనుకూడ 'ధన్యురాలైతివి?' అని పొగడినారు.

ఇంటికి వచ్చిన నాటినుండి సరసోతి ముఖంలో నవ్వు తొలకిసలాడుతున్నది. 'నాగూ, మహాతల్లివమ్మ! మీ నాన్నగారి ధర్మాన యాత్రలు బాగా జరిగాయి. నీవు నా కోరికలు తీర్చావు. ఆ పుణ్యం నీకు ఫలించకుండ వుండదులే' అని ఆశీర్వదించింది. ఆమె ఆనందం తనదిగా భావించి నాగవేణి 'మీ అందరిపుణ్యంతో వారికి కొంత బుద్ధి వచ్చి వుంటే చాలు' అన్నది. లచ్చుడు ఇంట్లోనే వున్నాడు. సరసోతి 'దైవం మేలుచేస్తే ఏమి కాజాలదమ్మ?'



అన్నది. సత్యభామమాత్రం ఇంట్లో వుండే రోకలికైన మొలకలు, చిగుళ్లు వస్తాయి, కాని వాని కెక్కడ? బుద్ధి ఎక్కడ?' అని మనస్సులో అనుకుంది. జనం వెళ్ళాక సరసోతి లచ్చునితో 'ఎల్లాగున్నావురా?' అని అడిగింది. 'ఉన్నాను. వూరు వద్దంటుంది. కాడు రమ్మంటుంది. యముడుకూడ వద్దంటాడు' అన్నాడు. 'అదేమిటి! యముడంటే మాలాంటి వాళ్ళకు.' అన్నది సరసోతి.

'అన్నీ విషంతో అన్న మాటలని తెలియవా నాగవేణికి?' ఆ సంధ్యకు లచ్చుడు దగ్గరగా వచ్చినపుడు 'ఏమండీ ఎందుకు ఆ పెద్దవాండ్లతో ఆ పరిహాసం, ఇంట్లో ఎవరైనా మీ చావును కోరారా ఏమి? పెద్దలంటే ఇలాగే నా మాటలు?' అని అన్నది. లచ్చునికి గుండెలో మండింది. 'ఆస్తిమదంతో అనవే. బుద్ధి చెప్పు, కానీ! మీకు బుద్ధి చెప్పడం కష్టమా!' అన్నాడు.

నాగవేణి ముఖం ముడుచుకుంది. 'ఎందుకండి, మాటలు ఎక్కడికో లాగుతారు. పెద్దల మనస్సు నొప్పించరాదని నేనంటే వూరకే' అన్నది. 'నువ్వు ఇంటియజమానురాలని తెలుసు. లేకుంటే మూడునాళ్లు వంటలు పంపకుండా దేశాంతరం నెట్టేశారు. ఈ సంవత్సరమేమో వనవాసం చేశాను. ఇప్పుడు చూడు, నీకు కావలసిన వాళ్ళంటే కాశీ, రామేశ్వరం యాత్రల ఖర్చులు భరిస్తావు. ఏమీ మనస్సుకు బాధ లేకుండా ఖర్చులేమో చేస్తావు. అన్నీ అలాగే వుంటే నేను అనరానిమాట లేమన్నాను? నేను యమునికి కాకుండా ఇంకెవరికి పనికివస్తా, లోపల బాధపడేమాటలు బయటికి రాకుండా వుంటాయా?'

నాగవేణి ఈ మాటలకు మాటలు పెంచితే లాభం లేదని ఇంట్లోకి వెళ్లిపోయింది. సత్యభామ వచ్చి కోపంతో మండిపోయింది. 'నీవు చేసిన మూడువేల రూపాయలు ఎవరురా తీర్చారు? మేము యాత్రకు వెళ్లివస్తేనారా నీకు కండ్లుమంట? నీకు బుద్ధి చక్కగా వుంటే ఎందుకొచ్చేవిరా ఇన్ని కష్టాలు?' అన్నది.

సరసోతి 'సత్య, వూరుకో. వాడు అనాలి. ఈ ఇంట్లో ఎవరింక? నేనేమో ఆరు మాసాలలో (వెళ్ళే)దాన్ని - ఈ మాటలుకూడ వినే పోతాను!' అన్నది.

ఆ సాయంకాలం ముసలిదాని మనస్సులో కాశీయాత్రతో తృప్తివున్నా నాగవేణి ఋణంలో-అంటే మనస్సు లేకున్న లచ్చుని ఋణానికి పడ్డట్టు అయిందని కొంత చివుక్కుమన్నది. ఇంత ఎన్నాళ్లుండాలి వీళ్ళ ఋణంలో అని కూడ తోచింది. మనసులో బిగబట్టుకోలేక పోయింది. సత్యభామతో 'నువ్వు ఇక్కడనే వుండాలి. నీ మగని ఆస్తి, నేనేమో వేరే గోత్రాని కెళ్లాను. లచ్చునికి నేను ఇక్కడుంటే సరిపడటం లేదు. నాకొరకు నువ్వు ఏమి ఖర్చు చేసినా, వానితో పోట్లాడుతూండేది న్యాయంకాదు. రేపు పొద్దుబొడిస్తే మందర్తి వెడతాను. వాళ్లేమో నన్ను చచ్చేరోజు బయటికి నెట్టరు కదా?' అన్నది. నాగవేణి కూడ

కొంత ఉద్విగ్నతతో 'పెద్ద అత్త నోటిలో ఇల్లాంటి మాటలా— కారణం' అని ఏడ్చింది. తరువాత 'అత్తా! ఇది వారేమి సంపాదించిందికాదు. పెద్దలు వదలిన ఆస్తి. అన్నీ తెలుసు గదా! ఈ ఇల్లు చక్కగా నడచింది అంటే మీ మూలాననే. మీరు వెళ్లాలని ఎవరన్నారు? ఇక వారు అలా అనరు. వారు ఇల్లు వదలి ఐదేళ్లు అయింది. మీరు లేని ఆరువారాలు ఎంతకష్టంతో దుర్భరమైనాయో వారికేం తెలుసు? నాకేమో మీరు లేకుంటే జీవించినట్లే లేదు' అన్నది.

ఈమాత్రం గట్టి జవాబు ఇవ్వడానికి ధైర్యం భర్తపై కోపమే. ఆమె మళ్లీ నొప్పి పడింది. 'పోనీలే వాడు ఏలాగైనా చేయి పట్టుకున్నవాడు. వాణ్ని ఏమనకు. నేను వున్నా, పొయ్యినా వానితో పగ పూనవద్దు' అన్నది సరస్వతి.

లచ్చుడు కూడ వచ్చాడు. 'నీవు వకీలుగారి కూతురు. అంతా చట్టం. నీ హక్కులోని ఇంట్లో నీవు వుండు — నేను మళ్లీ దేశంపై వెడతాను-' అన్నాడు. ఆరాత్రి వాడు ఇంట్లో భోంచేయలేదు. వెళ్లిపొయ్యాడు. దూరమేమి వెళ్లలేదు. మిత్రుల ఇంటికే. ఒరటనికి లచ్చని మాటలు బాగా నచ్చినవి. అందులో ఇరుగు పొరుగువాడే కదా! ఆశ్రయం ఇయ్యకుండా వుంటాడా?

తరువాత రెండు నెలలు వానింట్లోనే వుంటూవచ్చాడు. ఇంటికి అడుగుపెట్టడు. ఊళ్లో ఎవరైనా కనబడితే నాగవేణిని వారి ఎదుట ఆడిపోసి చెడుపుమాటలు చెప్పి పంపుతున్నాడు. నాగవేణికిమాత్రం గుండె బద్దలై పొయ్యేది. 'కొత్తమగణ్ని చూచి పాతమగడు రోత చీదర' అని కూడ సాహసించి చెప్పంపాడు. అందువలన నాగవేణి మనస్సు మరింత కఠినం అయింది. సానుభూతికి మారుగా పగనే ఎక్కువైంది. కాని మగనికి సమాధానం చెప్పడానికి ఆమె వెళ్ళలేదు. సత్యభామ మాత్రం అన్నీ విని కాళింగుని లాగు పడగలెత్తింది. 'ఇల్లాంటి పిల్లలు పుట్టనేమి? వారు గిట్టనేమి?' అన్నది. సరసోతికిమాత్రం కాశీయాత్రవల్ల, ఎంతైనా తృప్తి కల్గింది కానీ లచ్చని చరిత్ర, అఘాయిత్యంవల్ల మనస్సులో తుఫాను చెలరేగింది. 'నేను త్వరనా కన్ను ముయ్యాలి. కాని ఇది దక్షిణాయనం.... అక్కడ స్వర్గద్వారం మూసి వుంచుతారట. మకరసంక్రాంతి తరువాతనే భగవత్సంకల్పం కలుగాలి' అన్నది.

సత్యభామ 'ఎందుకమ్మా ఎప్పుడూ అవేమాటలు. ఎలాగున్నా మీకు మాత్రం అకాల మరణం ఇస్తాడా దేవుడు?' అన్నది.

ఒకనాడు, ఒరటని చిన్నకొడుకు వచ్చాడు. 'నాగవేణమ్మ వున్నారా?' అన్నాడు. నాగవేణి వాని కేక విని బయటికి వెళ్ళింది.

సరసోతి వాని గొంతు కనిపెట్టి 'ఎవరమ్మా!' అన్నది. అప్పుడు 'నాన్న నాగవేణమ్మను ఒకసారి రమ్మన్నారు' అని చెప్పాడు.



నాగవేణి 'నాకేం పని లేదను, ఎందుకో చెప్పు' అని అడిగింది. 'అది నాకు తెలియదు- మీవారి నెవరో పట్టుకొని పోతున్నారట' అని చెప్పి మరింత గాబరా పెట్టాడు

సత్యభామ 'వుండవే నువ్వెందుకు—నేనువెళ్ళి చూచివస్తాను' అని ఆ పిల్లవాని వెంట ఒరటనివద్దకు వెళ్లినది. అక్కడి దృశ్యమే వేరు. లచ్చుడు 'సివిల్ ఖైదీ అయి నిలబడ్డాడు. మలబారులో వాడు చేసిన అప్పుల ఫలితమట అది అంతా. జైలుపేరు విని సత్యభామ చాల గాబరా పడి ఇంట్లో చెప్పింది. నాగవేణి 'తన పతికి ఏమి అవమానం జరుగుతుందో అని భయపడింది.

'వాడు ఎల్లాంటివాడైనా సరే జైలుకు వెడుతుంటేకూడ చూడాలా?' అన్నది సరసోతి.

నాగవేణి స్వయంగా వెళ్లాల్సి వచ్చింది. అక్కడ ముందుమార్గం అడుగాల్సి వచ్చింది. 'వారి అప్పుల బాబతు ఎనిమిదివందల పైచిలుకు ఇస్తే వదలుతారట' అన్నాడు ఒరటడు. ఇయ్యటానికి నగదు రొక్కం వుంటుందా? తండ్రికి చెప్పి తెప్పించటానికి వీలుంటుందా? తరువాత ఆలోచించి ఒరటడు ఆ ఋణం చెల్లిస్తానని, నాగవేణి కాగితం వ్రాసి ఇవ్వాలని తీర్మానించాడు.

అన్నీ ముగించి నాగవేణి ఇల్లు చేరింది. 'ఏమైంది!' అని సరసోతి అనే మాటలకు అన్నీ వివరంగా చెప్పింది నాగవేణి; 'ఇదొక్కటేనా? ఇంకెన్ని వస్తాయో ఇల్లాంటివి!' అని అనుమానించారు. ఒక్క సంవత్సరం ఒరటని ఇంట్లో మకాము చేశాడు లచ్చుడు. ఇంటికి రాలేదు. అప్పుడప్పుడు ఒరటనివెంట ఉడిపియాత్రకూడ చేస్తాడు. తన మేటి విద్య లన్నీ ఒరటనికి నేర్పించాడు—అందుకే ఇద్దరి స్నేహం మంచి గట్టిగ పెరిగింది; ఒరటని తల్లికి కూడ వానిచేష్టలు బోధపడ్డాయి. ఆమె భయపడి పెద్దకొడుకుకు జాబు వ్రాయించింది.

మకరసంక్రాంతి సమీపించింది. నరసింహుడు తమ ఇంటి పరిస్థితులను విని గాబరా పడి బెంగుళూరు వదలి వూరికి వచ్చేశాడు. వచ్చిందేమో వరటనికి బుద్ధి చెప్పడానికి; పైకేమో ఇంటిదైవం జాత్ర, తరువాత వెడతాను అని చెప్పాడు. వాణ్ని లచ్చనినుండి వేరు చెయ్యడానికి నరసింహుడు 'చూడు, ఇంటివారికంటే నీదేమిరా అతిచేష్టలు? భార్య తరుమగొడితే నువ్వెందుకురా వాణ్ని వుంచుకున్నావు?' అని తమ్ముణ్ని గద్దించాడు. ఒరటడు వితండవాది. పైపెచ్చు లచ్చనికి శిష్యుడు. అందుకే నరసింహునితో, వాడు నెలనాళ్లుంటే, ఏకో ఒకవిధంగా జగడం, కోతలు, పొడుపులతో గడిపాడు. ఇక తమ్ముని కి ఇంటి వ్యవసాయం పెత్తనం ప్రయోజనం లేదని, తానే చూచుకోవాలని నరసింహుడు తీర్మానించాడు - ఒరటనితో లచ్చుడు తన హక్కుభాగం కొరకు పోట్లాడాలని ప్రేరేపించాడు. అందువల్ల శీనమయ్యరు ఇంట్లో రెండు ముక్కలైనవి.

తరువాత విభాగం ఏర్పడినప్పుడు ఐదు ఇళ్లు అయినాయి. మిగిలిన తమ్ములు పెద్దన్నతో సహకరించారు. ఒరటడుమాత్రం తనభాగం తీసుకొని తండ్రి ఇంట్లోనే ఒక భాగంలో

వుంటూ వచ్చాడు. తల్లికూడ వానికి శత్రువయింది. ఒరటని అన్న ఒకడు పెద్దన్న తరపున వూళ్ళో వుంటూ ఆస్తి చూచుకొంటున్నాడు.

దీనివలన లక్ష్మీనారాయణకు ఒక పని దొరికింది. కలహాలు చాడీలు అవీ ఇవీ చెప్పి ఒరటనికి మేత పెడుతున్నాడు. ఒరటని ఇంట్లో పేర్పాటుకాగానే నాగవేణిపై అప్పుడబ్బుకు వత్తిడి తెచ్చాడు. అందుకే ఆమె తండ్రివద్దనుండి డబ్బుతెచ్చి ఇవ్వాల్సివచ్చింది. దాని తరువాత బౌరింగుపేటలో లచ్చడు హొటేళ్ళు తెరచి చేసిన అప్పులబాబతు వారంట్లు కూడ వచ్చాయి. అన్ని అప్పులవారంట్లు వూరుచేరాయి. అందరూ తగాదా చేసి జైలుకు పంపుతామని బెదరించేవారే. నాగవేణి ఎల్లాగూ భర్తను జైలుకు పోనివ్వదని తెలిసికొని ఎందరో ఈలాగు ఎగబడ్డారు. మాటలతో తిట్టినా, భర్తను ఏలాగు కృష్ణ జన్మస్థానం పంపగలదు?— అనుకుంటూ తనకు రావలసిన బాకీ లన్నింటిని రాబట్టి అప్పులు తీర్చింది. చాలనందుకు ఆస్తిపైన కూడ భారం పడింది. అప్పులు తీర్చడానికి వచ్చిన వాసుదేవయ్యగారు 'లచ్చణ్ణిపిలచి ఈ అప్పులు తీర్చితీర్చి ఇల్లంతా గుల్ల అయింది. ఇష్టముంటే ఇంట్లో భోంచెయ్యి—లేకుంటే జైలులోనైనా వుండు. ఇంట్లోనయినా వుండు. నీ అప్పులు మాత్రం తీర్చము. ఇంట్లోనే వుండు. ఆరోగ్యం బాగుచేసుకో. ఆడవారిని వేపుకుతినకు. లేకుంటే వూరువిడచి పో' అని అన్నారు.

'సంకట బందాగ వెంకటరమణా—ఆపదలకు ఏడుకొండలవాడు' అన్నట్లు తానేమో అప్పులు తీర్చలేదు. ఒరటని ఇల్లు వదలి తన వసారాలోకే రావలసివచ్చింది. 'ఏమో నా గ్రహచారం బాగాలేదు. నాకూ కష్టమే—మీకూ కష్టమే—' అని పశ్చాత్తాపపడ్డాడు. ఒరటని ఇంటికి మాత్రం వెళ్ళి వస్తున్నాడు. కాని ఇంట్లో హాహాకారం లేవనెత్త లేదు—నాగవేణి ఒత్తిడితో తన శరీరాన్నికూడ చక్కగా చూచుకుంటున్నాడు.

ఈమధ్యన నరసోతి క్రమంగా, దినదినం క్షీణిస్తూనే వున్నది. ఏమైనా సరే ఏ పనికి తనకు తోడుగా ఎవరూ రాకూడదని ఆమె హఠం. గోడలు, కిటికీలు. పంచలు పట్టుకొని అటు ఇటు తిరుగుతూ అన్నీ చక్కబెట్టుతుంది. ఒకనాడు 'పోనీలే ఆ లచ్చని గ్రహచారం గురించి ఒక శాంతి నడపిద్దాం. ఏమైనా అన్నీ చక్కబడతాయేమో చూద్దామని జాతకం చూపిస్తే మంచిదని' తన సంకల్పాన్ని, అభిలాషను ప్రకటించింది. సత్యభామ తన కుమారుని జాతకం మంచిగా తెలిసిన వారికి చూపించి వచ్చింది. 'అది ఏలినాటి శనియట. సాడేసాతు. ఇప్పుడు విడిచే రోజులొచ్చాయి. ఇప్పుడు చండికా హోమం, పాపపన శాంతి చేయించి నలుగురు బ్రాహ్మలకైనా భోజనం పెట్టాలి' అన్నారు. లచ్చడు స్వయంగా బ్రాహ్మల్ని పిలచివచ్చాడు. శాంతిహోమం సమయాన ఇద్దరూ ప్రక్కన పీటలమీద కూర్చోడానికి రావాలి. ఇన్నాళ్లు వేరుగా వుండి పేచీలు పడి ఒక్కసారే ప్రక్కన కూర్చోటానికి నాగవేణి అంతరంగం ఒడంబడలేదు. కాని చేబట్టినవానికి మంచిరోజు లొస్తాయని అందరూ అంటే తానుమాత్రం అడ్డు ఎందుకు తగలాలని వూరకుంది. ఉన్నంతలో నవ్వు ముఖంతో



అన్ని పనులు చేసింది. నారపట్టుతో మడిగా శుచిగా కూర్చున్నది. ఆరోజు వచ్చిన బ్రాహ్మణుల గుంపు సుఖంగా సుష్టుగా భోంచేసి మనసార దీవించి వెళ్లింది.

లచ్చడు ఆ రోజునుండి చాల వుల్లాసంగా వుంటూవచ్చాడు. అదొక వేషమే. నాగవేణి మనస్సును ఎన్నివిధాల వశపించాలో అన్ని ప్రయత్నాలు చేశాడు — ఎనిమిది మాసాలదాకా వాని ప్రవర్తనలో చక్కని మార్పులువుంటే చూచి సత్యభామకూడ 'ఒరే! ఈ బుద్ధి అప్పుడే దేవు డిచ్చివుంటే ఎంత బాగుండేది!' అన్నది. ఇంటిలో ఎవరూ వాణ్ని కోపం వచ్చేలాగు మాట్లాడరు. ఏమీ బుద్ధివాదం చెప్పరు. వాడే స్వయంగా శాంతిహోమం ఏర్పాట్లు చేసుకున్నాడు. 'ఈసారి ఒక తూమెడు విత్తనమైనా వెయ్యాలి' అని చెప్పి అందరికీ ఉత్సాహం పుట్టించి ప్రయత్నాలు చేశాడు.

వానకాలం కాలుబెట్టింది. లచ్చని మొదటి వ్యవసాయంకూడ ఫలవంతమైనది. అలాగే ఇంట్లో అందరి మనస్సులూ చిగుళ్లు తొడిగినవి. ఇంట్లో అందరూ సంతోషంగా, లచ్చడు కూడ చాల చనువుతో, అన్యోన్యంగా ప్రవర్తించాడు.

ఒకరాత్రి లచ్చడు వానఫలితంగా దగ్గుతో చావడిలో కూర్చొని దగ్గుతున్నాడు. అందరి భోజనాలయ్యాక వాడు 'నాగవేణీ చూడు కొంచెం, మిరియాలువేసి పొంగించి కషాయం చేసి పట్టుకురా! చాల శీతం అయింది! లేకుంటే రేపు విపరీతమయితే వికటిస్తే కష్టం' అన్నాడు. కొంచెపగైరా కషాయం తయారుచేసి లచ్చనిదగ్గరకు వెళ్ళింది ఆమె. అక్కడే ఇద్దరూ కూర్చున్నారు. మాట్లాడుతున్నారు. కషాయం తాగాడు. కారంతో కొంత బాధపడ్డాడు. ఇకముందు చేయాల్సిన వ్యవసాయం పనులు, తియ్యని కలలు వర్ణించాడు. వానిచేతులు ఏవో తడుముతూ నాగవేణి చేతులు అందుకున్నవి. 'చూడు నాగవేణి మనం వేరై ఎన్నాళ్ళయింది! ఏండ్లు గడచాయి కాబోలు!' అన్నాడు —వాని గొంతు గద్గదస్వరం అయింది. వానిచేతి స్పర్శ ఆమెలో కొంత తికమకచేసింది. ఈసారి మగడు వచ్చిననాటినుండీ ఇద్దరూ ఒకపక్కలో వుండలేదు. ఆ సంగతి జ్ఞప్తికి వస్తే చాలు అమెకు భయం, కంపం పుట్టేవి. ఆ రాత్రి ఎందుకో ఎదిరించలేక పోయింది. పతియొక్క బాధ తనకు తెలియదా? తనకు కోరిక లేదా? అప్పుడప్పుడు పతివున్నా ఎందుకీ వైధవ్యం?—అనే ప్రశ్నకూడ ఎదురయ్యేది. కాని ఆ పతి స్నేహపు పరిణామాలను తలచుకొని భయపడేది. తండ్రిగారు కూడ ఆంక్ష విధించారు. కాని ఆ లేత హృదయం, శరీర వాంఛలు పిచ్చి ఎత్తించినవి. తనవాడైనా అదనుచూస్తున్నాడు లచ్చడు. లొంగిపోయింది. ఆ రాత్రి మరొకసారి వరుసగా. భయపడవలసిన పరిస్థితి ఏర్పడింది.

తరువాత ఎన్నో దినాలు అలాగే గడిచాయి. ఆమె తన వివాహం తొలిరోజులు వచ్చాయిలే, శని తొలగింది అని పొంగిపోయింది.

ఆ సంవత్సరం పంటలు పాడు కాలేదు. లచ్చని పెత్తనంవలన ఇంటికి భర్తీగా గింజలు వచ్చిపడ్డాయి. 'ప్రతిసారి ఇంత కఠినంగా పని చెయ్యరాదు. పేరుకు రెండుతూముల

వ్యవసాయం చాలు. ఊరకే అలసిపోయి సన్నగిల్లరాదు' అని అన్నాడు. వడ్లసంచులు వడ్డాయి. గడ్డికూడ నాల్గు వాములనిండా అయింది. బలిపూజ (పంటపూజ) నరకచతుర్దశిదినం ఇంట్లో నాలుగుదిక్కుల కాగడా లుంచారు. దీపావళినాటికి నాగవేణి సరసోతితో మెల్లిగా 'ఏమో మీ రేమంటారో భయంగా వుంది. నేనేమో మళ్ళీ .... .... త....డు .......పుతో వున్నాను' అని వణుకుతూ చెప్పింది.

ఆమె 'సరే. ఏమి? ఎందుకు? ఆ శని తొలిగిందేమోనమ్మా అదెల్ల మన మేలుకొరకే—భయపడకు. వానికి సరిగా బుద్ధి వచ్చింది. దేవుడు చల్లగా చూస్తాడులే' అనింది. 'ఏమో! మీ పుణ్యంమూలాన నేను అమ్మ అని పిలిపించుకోవాలి' అని ఏమీ తోచకుండ నేలమీదబడి ఆమె పాదాలు ముట్టుకొన్నది. నాగవేణి శరీరాన్నంతా తడుముతూ సరసోతి 'భగవంతుణ్ని ప్రార్థించుకో—అన్నీ ఇస్తాడు—నడుపుతాడు' అన్నది.

'నాకేమో! మీరే దేవుడు' అన్నది నాగవేణి. సరసోతి సిగ్గుపడింది. 'నాకు చింత మొద్దుకున్నన్నేళ్లు వచ్చాయి. అంతే. అందుకే కాబోలు నేను గొప్ప అని నమ్మావు. నిరుడు ఉత్తరాయణానికి వెళ్ళాలంటే కాలేదు. ఈసారి మకరానికి పిలుపు రావాలి.'

'నేను ప్రసవించాలి. మీరు తప్పక నా బిడ్డకు పాలు పట్టాలి' అన్నది నాగవేణి.

మకరసంక్రాంతి వస్తున్నది. ఆవారంలోనే సాలిగ్రామజాత్ర. వారికుల దైవం నరసింహస్వామి. సరసోతి లచ్చనితో 'ఒరే! నాగవేణిని మెల్లిగా నడిపించి జాత్ర దర్శనానికి తీసి కెళ్లురా, ఇద్దరూవెళ్లి దేవునికి కాయ, పండ్లు-కర్పూరం అర్పించి రావాలిరా' అన్నది. లచ్చనికి దేవుడు, మొద్దు, అన్నీ సమానమే. కాని నాగవేణిని, సత్యను వెంటబెట్టుకుని మెల్లిగా వెళ్ళి నైవేద్యం చేయించి వచ్చాడు. నాగవేణి సరసోతికి కొబ్బెర, పళ్లు, ప్రసాదం, తెచ్చిచ్చి ఆశీర్వాదం పొందింది.

ఈ సంతోషాలమధ్య ఒకటనింటి కేమో హాజరు తప్పదు. వానికి వాని తమ్ముళ్ళు అన్నలపై చాడీలు చెప్పేపని నడుస్తూనే వుంది. ఒకటడు 'లచ్చన్నా' ఈ ఆస్తితో ఏమీ సాగదు—అన్నలు, తమ్ముడు చక్కగా హోటేళ్ళలో సంపాదిస్తున్నారు, నేను వూళ్ళోనే పడివుంటే లాభంలేదు. మైసూరులోకూడ మావాళ్లు ఒక హోటేలు తెరవారట—నిండ లాభాలేనట—నేను ఈ ఆస్తిని కట్టుగుత్తకు ఇచ్చివేసి మైసూరిలో ఒక స్వంత హోటేలు తెరుస్తాను' అన్నాడు. లచ్చడు 'భేషుగ్గా వుంది' అన్నాడు.

ఆ వైశాఖమాసంలో కోడిగ్రామంలో రెండు కొత్తవార్తలు: ఒకటడు పూరువిడిచి వెళ్ళాడు. నాగవేణి నవమాసాలు నిండకుండానే కొడుకును కనింది. అక్కడ ఒకటడు అన్నగారి 'శ్రీరామా రెస్టారెంట్'కు నేరుగా ఎదురుగుండా 'ఢిల్లీదర్బారు రెస్టోరెంట్' తెరచాడు—తన కార్యకలాపం అంతా లచ్చనికి ఉత్తరాలలో వ్రాస్తున్నాడు.



నాగవేణి ప్రసవానికి పుట్టిల్లు వెళ్లలేదు. సరసోతి ఎంతో చెప్పి చూచింది. 'వారు ఇంట్లో వుంటే నే నెల్లా విడచి వెళ్లాలి?' అన్నది. తొమ్మిదో నెలలోనే బిడ్డ నొప్పులు, కాన్పు అన్నీ అయ్యాయి. పిల్లవాడేమో సన్నగా, పీలగా దుర్బలుడుగానే వున్నాడు. వాణ్ని చూచి అదికూడ మూడవ అవలక్షణమేమో అని చింతచేసింది. ఆ ప్రసూతికి సహాయం తక్కువ లేదు గాని నొప్పులబాధ దుర్భరమైంది. శిశువుకు తల్లిపాలు పడలేదు. సత్యభామ శిశువు నెత్తుకొని ఆవుపాలను దూదితో తడిపి పిండి నోరు తడిపేది. తల్లికి పిల్ల శుశ్రూష చేసేటంత బలంకూడ వుండలేదు. లచ్చడు వుడిపికి వెళ్లి ఆమెకు తగిన ఔషధాలనుకూడ తెచ్చిపెటాడు. తియ్యని మాటలుకూడ ఆడి సంతోషింపజేశాడు. కాని వానిమనస్సు మళ్లీ వెలిబాట పట్టినటే పసికట్టింది నాగవేణి.

శిశువుకు మూడునెలలలో కడుపుబ్బరం, ఇతరబాధలు వచ్చాయి. కాని చురుకుదనం ఆటపాటలు బాగానే వున్నాయి. నిరాశకు తావుమాత్రం లేదు? మే నెలలో వకీలుగారు వచ్చి ఎన్నో మందులు చెప్పి చేయించి 'అమ్మా' ఎల్లాగయినా నీవు డాక్టరు మందు తాగాల్సిందే. తప్పదు, వెనుకటికైతే నాగవేణి ఒప్పదు' అన్నారు. వకీలుగారు చెప్పినపుడు ఆమె 'కానీ భగవత్సంకల్పం' అని ఒప్పుకుంది. లచ్చనికి ఉపచారం బాధ్యతకూడ తక్కువైంది.

నవరాత్రి వేళకు ఆరోగ్యం బాగయింది. ఒళ్లు పట్టలేదు అంతే. అందుకే సత్యభామ అతిజాగ్రత్తగా కాపాడింది. నాగవేణి సందేహాలు పోవు. కానీ సరసోతి మాటలు 'దేవుడే కాపాడుతాడు' అనే పలుకులను స్మరించుకొని స్వస్థురాలవుతుంది.

ఆమెకు క్రమేణ మగని బెంగపట్టుకుంది; పిల్లవానిబెంగ తగ్గింది. లచ్చని ముఖంలో ఆ నవ్వు ఎందుకో తగ్గిపోతున్నది. ఎందుకో వాడు తనకు తానే లోకువగా, చూసుకుంటున్నాడు. మాటల్లో మళ్ళీ నిష్ఠురత కూడ వచ్చేసింది. 'ఏమండీ—ఎందుకల్లా వున్నారేం?' అంటే వూరకొంటాడు. నాలుగైదుసార్లు బుజ్జగించి అడిగితే 'నాదీ ఒక బతుకేనా— వెధవ ముండలాగు.........?' అన్నాడు.

'అలాగంటే?'

'నీవు తిలనార్థం (భరణం) వేస్తే తింటాను. చదివి, ఏమి చేసినా, నేను జీవించలేకున్నానే.... ...'

'మీకేమిటండీ లోటు? ఈ ఇల్లు వాకిలీ అన్నీ మీవి కావా? చెప్పండి.'

'ఇల్లు, అన్నీ నావే—వూరివాళ్లేమంటారో వింటే తెలుస్తుంది.'

'అంటే'

'దినం గంజి తాగాలంటే భార్యనే అడుక్కుంటాడురా! ఎందుకురా వాని బతుకు! అంటారు. విని విని చాలయింది.'

ఆమె మరేమీ మాట్లాడలేదు. తరువాత చాలనాళ్లు, అలాగే వున్నారు. ఒకనాడు లచ్చడు కొడుకును చేతిలో వుంచుకుని 'నాగవేణి పిల్లవాణ్ని వూరకే, బుల్లోడు— అంటే బాగుంటుందా— మనిషికి ఒకపేరు వద్దా!' అన్నాడు.

'సరే పుట్టినరోజు వరకు ఆగండి— ఇప్పుడేమి తొందర?'

'వానిపేరు పెట్టించి వెళ్ళాలని వున్నాను, ఎక్కడికైనా వెడతా' అన్నాడు.

'అయితే మళ్ళీ వదలివెట్టి వెడతారన్నమాట'

'నిన్ను విడవాలని లేదు; బయటపడే సుఖంకూడ అంతంతే— కాని, నా కూలితో నా పొట్టపోసుకుంటాను. నా బావలు ఒకడు వకీలు.... ఒకడు డాక్టరు— నా స్నేహితులంతా పెద్ద వుద్యోగాలలో వున్నారు. నేనేమో ఇంటికి దయ్యంలాగున్నాను. ఇల్లాగే ఒకచోట కూర్చుని వుండజాలను' అన్నాడు.

'నాన్నాళ్లు ఆగండి' అన్నది నాగవేణి. ఆ నాన్నాళ్లలో ఆమె మనస్సు లేత తరంగాల లాగు జ్యేష్ఠ ఆషాఢాలలో సముద్రం కెరటాలు ఎంతపైకి లేస్తాయో ఎన్ని అటుపోట్లకు గురి యౌతాయో దానికంటె జోరుగా, హోరుగా కల్లోలపడింది. భావన కన్నీరుగా మారింది. వాని సంగతి తలచుకుంటే మనస్సనే సముద్రం నురగలపై నురగలే కక్కుతున్నది. తరువాత ఒకనాడు 'నాకు కావాలని నేను ఆస్తి వుంచుకోలేదు. మీ పేర వ్రాయించేస్తాను. మీ మనోవ్యథ బోధపడింది. మీరు విసుగుతో జీవిస్తే నాకు మాత్రం సుఖమా?' అన్నది నాగవేణి.

సాలిగ్రామం పండుగ కాగానే ఒకనాడు అతి చమత్కారంగా లచ్చడు భార్యను వుడిపికి పిలుచుకొని వెళ్లాడు. తరువాత ఏదో నెపం పెట్టి బ్రహ్మావరంలో ఆమె ఆస్తిని తనపేరట చేయించేశాడు. ఆమె ఇంట్లో ఎవరితోకూడ ఆసంగతి చెప్పలేదు.

ఇంట్లో పెద్దవాళ్ళేమో 'ఉడిపి కృష్ణుని దర్శనానికే వెళ్ళారులే' అనుకున్నారట.

ఎండకాలంలో పిల్లవానికి సంవత్సరంకూడ అయింది. వానికి ఏమి పేరు పెట్టాలి? చర్చ జరిగింది — నల్గురు బ్రాహ్మలను పిలిపించి భోజనం సంతర్పణ. నామకరణం చేయించండి. తాతపేరు నిలబెట్టండి' అన్నది సరసోతి. సత్యభామ 'అల్లాగే కానీ' అన్నది. మామ మమతను చవిగొన్నది ఏలా మరుస్తుంది నాగవేణి. లచ్చనికి ఒళ్ళంతా తండ్రిపై పగవున్నా సరసోతిమాట విన్నాడు. పుట్టిన పండుగనాడే నామకరణం చేయించారు. రామబతాళుల ప్రేతాత్మ తృప్తిపడింది కాబోలు.



ఆ నామకరణం తరువాత ఒక నెలకే బరటమయ్య మైసూరునుండి తిరిగి వచ్చాడు. అతని 'ఢిల్లీదర్బారు - హోటేలు' ప్రారంభమై చాల నాళ్ళయింది. చాల జోరుగా సాగుతున్నది. అన్నగారి హోటేలులో ఒక పురుగుకూడ తినదని అని కోతలు కోశాడు. వాడు వూళ్లో మంచి మాటలతో తన ఆస్తిపై అప్పు తీసుకొని, ఢిల్లీదర్బారు శాఖలు బెంగుళూరిలో కూడ తెరుద్దాము అని ఏర్పాటు చేశాడు. లచ్చనికి కూడ ఆ బరటనివాటాలో వుంటే బాగనిపించింది. తానేమో ఆస్తికి యజమాని, సర్వాధికారి తనసంగతి బరటనితో చెప్పాడు— ఇద్దరూ కొత్త హోటేలు ఏర్పాట్లలో వాటా పంచుకోవాలని ఒకడు మైసూరిలో ఒకరు బెంగుళూరిలో వుండి మేనేజరు పని చేయాలి అని తీర్మానించారు.

అన్ని నిర్ణయాలు ఎక్కడో బయట జరిగాయి. నాగవేణి చెవిలోకూడ వెయ్యలేదు. ఆమె ముసలి గూబలకు చెప్పి ఏమీ పడనియ్యదని తెలుసు. 'నేను ఉడిపికి వెడతాను. నాల్గు వాళ్ల మందు తినివస్తాను' అని వెళ్లాడు. 'రాముణ్ని ఎత్తుకొని — వాని కేమన్నా తెమ్మంటావా?' అనికూడ అడిగినాడు లచ్చడు.

ఒకవారం, పదిహేనురోజులు. లచ్చని జాడలేదు. వార్త లేదు. సరసోతి కూడ లచ్చణ్ని చూడాలని అభిలాషపడింది. సత్యభామ మాత్రం 'అది కుక్కతోక — ఎప్పుడూ వంకరయే' అన్నది. కాని నాగవేణికి సరసోతికి ఆ సందేహం కలుగలేదు. 'తప్పకుండా వస్తాడులే' అని వారు నమ్మారు. అంతలో సంవత్సరం తరువాత నరసింహమయ్యరు వచ్చే అలవాటు ప్రకారం వచ్చాడు. తమ్ముని పథకాలు తెలుసు. లచ్చని కథ చెప్పాడు. 'బెంగుళూరిలో మళ్ళీ నాకు ఎదురుగా పోటీకి హోటేలు తెరుస్తాడట. నన్ను ముంచుతారట' అన్నాడు. సరసోతి చాల దిగులు పడింది.

నాగవేణి మౌనంగా కూర్చున్నది. తరువాత కొడుకును ఎత్తుకొని కన్నీళ్ళు కార్చింది. సరసోతితో 'నేనే నా కొడుకునోటికి మట్టిగడ్డ ఇచ్చాను వారు మోసం చేస్తారని నమ్మలేదు. కలలోకూడ అనుకోలేదు.' అని తన ఆస్తి వానికి ధారపోసిన సంగతి చెప్పింది. దాని వ్యథ కూడ చంద్రనిప్పుల మంటలాగయింది. ముందు దారి తెలియకుండ వారి పినతండ్రిని పిలిపించారు. నాగవేణిపై ఆయన అతిగా కోపగించాడు— 'నాగూ, మాకు ఒకమాట కూడ చెప్పకుండా వ్యవహారం జరిపితే ఎల్లాగమ్మా?' అన్నారు. ఆమెకొరకు బెంగుళూరు వెళ్ళి మాట్లాడారు. 'నా ఆస్తికి మీ బిడ్డకాళ్లు పట్టేలాగు మీరేగా చేశారు' అని మాట్లాడాడు లచ్చడు.

# 19

సత్యభామ సామాన్యమైన సంకటాలలోనే నొప్పిపడి తికమక అయింది. ఈ సారి మళ్లీ తన కొడుకు తెచ్చిపెట్టిన ముప్పును తలచుకొని మరింత కుమిలిపోయింది. తన కోడలు కొడుకు మోసానికి బలిఔతున్నదని ఆమె వూహించుకో లేక పోయింది. 'ఏమమ్మా —

మేము పెద్ద ముసలిగొడ్లున్నామే! ఒక పొల్లుమాట అయినా నాతో అనలేదే! వానికి తల్లి తోడు ఏమీ వుండదు. అందరినీ వెళ్లగొట్టితే ఏమిచేస్తావు? రేపు ఇల్లుఅంతా అమ్మేస్తాడు. చచ్చేటప్పుడు మాకు ఈ గతి తెచ్చిపెట్టావుగదూ!' అని శోకించారు. సరసోతి 'పోనీలే! ఆ పిల్లను ఎందుకు బాధిస్తున్నావు? గ్రహచారం చెడగొడితే ఎవరేమి చేస్తారు? వాని ప్రవర్తనను చూచి మనమే నమ్మేశాము. ఆమె ఏమిటి?' అని ఓదార్చింది.

సత్యభామ కేమి నెమ్మదిలేదు—ఆ ఇంటినుంచిఎవరో వచ్చి వెళ్ళగొడతారు అనే భయం పుట్టుకొచ్చింది. 'నేను ఆ పిల్లముఖం, దుఃఖం చూస్తూ కూర్చోలేను. సుబ్బి ఇంట్లో నాల్గునాళ్ళు వుండివస్తా' నని సత్యభామ వెళ్లి పోయింది. సూరడు వెంటవెళ్లాడు.

ఇప్పుడు ఇంట్లో నాగవేణి, సరసోతి, రాముడు మాత్రం వున్నారు. నాగవేణికి తన పిచ్చి, మందమతి తలచుకొని ఆశ్చర్యం కలిగినది. అయితే ఇప్పు దేమీ దారిలేదు. తన మగడు ఇంటికేమో రాడు. అన్నీ పోగొట్టుకున్నాక తప్పక వస్తాడు. సరసోతి పూర్తి గుడ్డిదయింది. పిల్లవాణ్ని చేతిలో పెట్టుకొని ఆడిస్తుంది. అప్పుడప్పుడు నాగవేణిని పిలిచి 'ఏడవకమ్మా, చింతచేయవద్దు. దేవుడే కష్టాలిస్తే ఎవరు తప్పిస్తారు?' ఇంకేమి చెప్పడానికి నోరాడలేదు. నాగవేణిఏమో 'ఇక ఎందుకు బదుకాలి? ఈ పిల్లవాడు పెద్దవాడై తన నరకాన్ని ఎందుకు పంచుకోవాలి. దానికంటే తాను చనిపోతే ఏబాధ లేదు. అందరికీ సుఖమే కదా!' అని తీర్మానించింది.

సత్య మాటలు నిజమైనాయి. మూడునెలలకే ఇల్లు, పొలం, తోట అన్నీ లెక్కలేకుండా వచ్చినంతకే అమ్మివేసినట్లు తెలిసింది. ఉడిపిలో ఒక శ్రీమంతుడు అచ్చనితో కొన్నాడట. వాడేమో డబ్బు తీసికొన్నవెంటనే వెళ్ళిపొయ్యాడు. వారేమో తొందరగా గడబిడ చెయ్యకుండ ఆరేడు నెలలలో నోటీసు ఇచ్చారు. దానిలో ఇల్లు, ఆస్తి స్వాధీనం చేయించాలి అని వుంది.

నాగవేణికి ఆ రోజు ఒక మెతుకుతిండికూడ సహించలేదు. పిల్లవానికి పాలుత్రాగించి, సరసోతికిచ్చి తానేమో పిన్నయ్యవద్దకు వెళ్లింది. ఆయన ఉడిపికి వెళ్లి కొన్నవారివద్ద సంప్రతింపులు జరిపారు. వారికేమి దయ? 'నేను 8000 రూపాయలు ఎంచానండి. ఎలాగ వదలమంటారు?' అన్నాడు. తిరిగి కొనటానికి కుదరలేదు—అన్న కూతురి కన్నీళ్లు చూచి ఏదో తక్కువ కట్టుగుత్తకు కౌలుకు తీసుకొని వచ్చారు. అదే గొప్ప వుపకారమయింది.

నారాయణయ్య ముసలామె వద్దకు వచ్చి 'ఇలాగయింది. ఇప్పుడు మళ్లీ దున్ని బదికే రోజులే వచ్చాయి. నాకు చేతనైనంతసహాయం చేశాను. పూలమ్మిన చోట కట్టెలు అమ్మవలసి వచ్చెనే' అని దుఃఖించారు. సరసోతిమాత్రం వలవలఏడ్చింది. 'నాగవేణి, దేవుడు నన్ను తీసికెళ్లితే చాలు. నీవు మీ నాన్నవద్ద వుండవచ్చు. ఆ పిల్లవాడు పెద్దవాడై గంజినీళ్లు



పోస్తాడులే. తండ్రి దుర్మార్గం రాదని నమ్మకం. నేనందాక వుండాలా? నీవు ఈ బికకు వుండేదే సహించలేదే-గుత్తకుకట్టి మిగిలేదేమిటి?' అన్నది. 'నారాయణయ్య మేమున్నాములెండి. మీ ఇంటినీడ తప్పించరాదని మాత్రమే ఈ ఏర్పాటు. మీరు ముగ్గురు మా ఇంట్లో వుండండి పరవాలేదు. నాకేం భారం కాదు-' అన్నారు.

సరసోతి నాగవేణిని పిలిచి 'పోమ్మా! బాబాయ్ మాటలు విను. నీవు, పిల్లవాడు వెళ్ళండి. లేకుంటే మీ నాన్నవద్ద వుండు. ఎల్లాగు రాముని ఇల్లే ఇది; మరిన్నినాళ్లు ఇక్కడే తోసిపోతాను. నేనూ సత్య, కాశీలోనే వుంటే ఎంతో బాగుండేది. క్షేత్రంలో చావు ప్రాప్తం అయ్యేది. ఇప్పుడు అదీ లేదు' అన్నది.

నాగవేణి పినతండ్రితో 'మీరు వెళ్ళండి. ఫరవాలేదు. ఎండకాలం దాకా నియ్యం గడుస్తుంది. నాన్నవచ్చాక చూద్దాం' అని చెప్పి పంపింది. ఆ పిల్లవాడు తల్లి కన్నీళ్ళు చూచి ఏడ్చాడు. వానికి ఆకలేమోఅని సాయంకాలం గంజి కాచింది. సరసోతి రాత్రి భోంచెయ్యాదు. తనకా అవసరంలేదు. పిల్లవాణ్ని పస్తుచంపరాదు. వానిపై శ్రద్ధ తీసికొన్నది. సరసోతి చెయ్యి పట్టుకొని పడుకోబెట్టి, తానుకూడ పడుకుంది. తరువాత ఒకమాట కూడ లేదు. ముసలిది కూడ మాట్లాడలేదు.

రెండుమూడుదినాలు అలాగే అయింది. ఒక సాయంకాలం వాసుదేవయ్యగారు అతివేగంగా ఇంటికి వచ్చారు. తమ్ముని ఉత్తరం అందింది. బిడ్డకాపురం మట్టిపాలవుతుందని, ఆమె కడుపేద అయిందని విన్నారు. ఏమీ మార్గం తోచకుండా అక్కడికి వచ్చారు. వారి సంసారంకూడ పెద్దది. ఇంట్లో ఎందరో భోజనాలు. ఖర్చుకుతగిన ఆదాయమే వుంది. లోటులేదు. నలుగురిని అదనంగా భరించాలంటే కష్టమే. కాని విడువగలరా? వేరే గతి లేదు. అందుకే బిడ్డతో చర్చించడానికే వచ్చారు.

'నాగవేణి 'అయ్యో! బాబాయి వ్రాశారా? నేను చెప్పానే. ఎండకాలం దాకా పరవాలేదన్నానే—ఎందుకిచ్చారో మీకు తొందర.' వాసుదేవయ్య నవ్వారు. 'అమ్మా! నీకు బుద్ధి వుంటే బాగుండేది, ఈ పిల్లవాడు, ముసలివాండ్లు, వాళ్ళను కట్టుకొని ఏమని సాగుచేస్తావు? మిగిలేదేమి? మీ అత్త బిడ్డవద్దనే వుంటే, నీవు పిల్లవాడు నావద్దకు రాండి, ముసలి ఆవిడ తమ్మునివద్ద వుంటుంది. నేను ఎప్పుడో నిన్ను పిలిచాను. వచ్చేవుంటే ఇన్ని కష్టాలు రానే రావు గదా!' అన్నారు.

నాగవేణిముఖం పాలిపోయింది, సత్యభామ బరువుమోయడం తండ్రికి మాత్రం ఇష్టం లేదని స్పష్టమయింది. సరసోతి మాటలనుబట్టి 'వూళ్లోనే బిచ్చమైనా ఎత్తుకొని తింటాగాని వూరు విడువను' అని ధ్వనించింది. తానేమో తండ్రికి చెడ్డపేరు తేవడానికి పుట్టింది, కష్టాలకు భయపడి మళ్లీ వెడుతున్నానని పేరు రారాదని ఆమె భావించింది. నాగవేణి వాళ్ళిద్దరి

విషయం ఎంతో ఆలోచించింది. తండ్రిమాటలు ఆమెకు చెవిలో బడనే లేదు. తండ్రికి వంటచేసి వడ్డించింది. 'మీరు వేసవిసెలవుల్లో వస్తారుగా—అప్పుడే అన్నీ తీర్మానిస్తాను' అన్నది.' చూడమ్మా! ఇంకా పిల్లవాడు రెండేండ్లవాడు. ఇక ఇరవైఏండ్లు ఎవరు చూడాలి? అక్కడికే వచ్చేదారి చూడు, ఫరవాలేదు' అన్నారు. ఆ మనుమణ్ని చూస్తూ అన్నీ మాట్లాడారు వారు. ఆమెకు తెలుసు ఎవరింట్లోనూ ఆ సరసోతి వుండజాలదని. వాళ్ల పినతండ్రి భార్య మంచిగడుద్దాయి. ఆమె స్వార్థంలో భర్తయొక్క ఔదార్యం ఏమూల బడుతుందో? 'ఇంతవాకా ఇక్కడే బదికి మళ్ళీ నీడ ఎందుకు తప్పాలి?' అనే ఉష్కాభిమానం. అందుకే 'ఫరవాలేదు—ఇప్పుడేమీ వద్దు'—అని చెప్పి పంపించింది. వకీలుగారు 'నేను ఇప్పుడే నారాయణయ్యతో మాట్లాడి రేపే వచ్చేస్తాం సర్దుకో. కోర్దుకాలం. ఎక్కడా కదలటానికి లేదు. త్వరపడు' అన్నారు.

నాగవేణి, సరసోతి తీవ్రంగా చర్చించుకున్నారు. 'మీ అత్తసంగతి చూడు, ఈ వేళ కాకుంటే రేపు ఇంటికి రాదా? మళ్లీ బిక్షవద్దకే వెళ్లాలా? లేకుంటే పను మున్నూరు వెడుతుందా? నా సంగతి వదులు, నాకు ఈనేల చాలు. చచ్చేఘడియలు లెక్కబెడుతూ పరాయికొంపలో బాధపెట్టే ఇష్టంలేదు' అన్నది. అదీకాక తన స్నేహితురాలు సిరి చెడి పరులపంచ బడి బాధలు, యాతనలు పడే కథకూడ వర్ణించింది సరసోతి. నాగవేణి మాట్లాడలేదు. రాత్రి పండ్రెండు దాటింది. పడుకుంటే నిద్రరాదు. ప్రక్కన పిల్లవాడు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. చూచి నవ్వుకుంది. వెంటనే ఏడ్చింది. 'రామ, రేపు వారు వస్తారు. నిన్ను ఎత్తుకొని వెళ్లి సాకుకుంటారులే' అని వాని వళ్లు నిమిరింది.

అలాగే పక్కలోనుండి లేచి, పెద్దత్త పాదాలకు మొక్కి మెల్లిగ బయలుదాటి వెళ్లింది. చల్లగాలి వీస్తున్నది. ఆకాశంలోంచి వేలకొలది చుక్కలు తొంగి చూస్తున్నవి. నోట్లో 'రామ, రామ' అంటూ ప్రాకారందాటి ఇసుకదిబ్బ ఎక్కింది. పడమటిగట్టుకు వెళ్లింది. అక్కడ ఆమె మనసు ఆగలేదు. సముద్రానికి దారితీసింది. రొమ్ము వాల్చకుండ నడిచింది. ఆమె వేగాన్ని ఆ సముద్రం కెరటాలుకూడ ఆపలేకపొయ్యాయి. ఒక్క వూపు వూపేవరకు ఆమె మత్తును ఆవేగాన్ని హెచ్చింపజేసినవి. అక్కడ ఎక్కడనుండో నక్క ఒక్కటి వూళపెట్టింది. 'హుయ్యో, హుయ్యో' అని మొత్తుకుంది. అదేమో ఎండ్రకాయలు తినడానికి వచ్చింది. వేరేవాళ్ల తన వెన్నుపై కాళ్లు మోపితే ఓర్వలేకపోయింది.

ఆమె సముద్రంనుండి తిరిగి ఏమీ తెలియనట్లే నదీముఖానికి వెళ్లింది. పెద్ద చావచుట్టలో అన్నట్లు ఇసుకదిన్నె నదీసంగమాన్ని అడ్డగించి వున్నది. ఆ ఏటినీళ్లు కిలకిల నవ్వుతూ సముద్రంలోకి నిరంతరంగా దుముకుతున్నవి. ఆ మట్టి దిబ్బలు 'నువ్వు వద్దు' అనేలాగు నీటిని వెనుకకు నెట్టేస్తున్నవి.

నాగవేణికి తన ఆఖరుగడియ వచ్చిందని మళ్ళీ నిశ్చయమయింది. మనస్సేమో కొడుకువైపు లాగుతున్నది. ఒక్కసారి సరసోతి మనస్సులో ప్రత్యక్షమయింది. ఆమె



కొరకే ఇన్నాళ్లు జీవించింది. 'క్షమించండి' అని మనస్సులోనే ప్రార్థించుకున్నది. ఎలుగెత్తి ఆకాశం బాగా చూచుకుంది. చుక్కలుకూడ రెప్పవాల్చకుండ ఆమెకేసి చూచాయి. మళ్ళీ ఆమెకు ధ్యానభంగం అయింది. ఇప్పుడు అరచింది నక్కగాదు, కుక్క. ఆమెవెంట నీడలాగే వచ్చింది. దానివెంట మనుషుల కేకలు. ఎవరో తనవద్దకే వస్తున్నారు. కుక్కకూడ తన వద్దకే మొరుగుతూ వెంటబడింది. ఇక ఆలస్యం చెయ్యరాదని మట్టిదిబ్బనుండి నీళ్ళదిశకు దూకింది.

కుక్కకూడ దూకితే, ఏమిది అని ఇద్దరు మనుష్యులు పరుగెత్తి వచ్చారు. మనిషి నీటిలో వుంటే, కుక్క మొరుగుతుంటే వారూరకుంటారా! చీకట్లో నాగవేణి నల్లని నీడలాగా మునకలు వేస్తున్నది. ఒకడు 'ఆమె కుక్కభయానికి జారిందిరా పాపం' అని వెంటనే దూకాడు. సముద్రంనీరు వెనక్కి - నదినీరు ముందుకు కొట్టుకునే స్పర్ధలో నాగవేణి కూడ సుడి తిరుగుతున్నది. స్మృతిలేదు. బెస్తవాడు చేతిలో ఆమె చెరగు చిక్కించుకుని ఈతగొట్టాడు. మరొక్కడు ఇద్దరినీ బయటికి లాగేశాడు. ఇంకా కుక్క మొరుగుతూనే వుంటే వాళ్ళు దాన్ని కొట్టి తరిమివేశారు. వారు గాబరాతో కొబ్బెరతోటలో వుండేవారిని పిలిచి దీపం వెలిగింపజేసి ఆమెను దించారు. ఆ ఇంటి బెస్తముసలిది ఉపచరించి 'అమ్మ- మిమ్మల్ని చూశానమ్మా ఎక్కడో! అవును —అవును ఐతాఘల కోడలేగా?' అని అడిగింది.

'ఔను ఔను' అని నాగవేణి మరింత కేకలతో 'మళ్ళీ వెయ్యండమ్మా సుఖంగా చావనియ్యరాదా! అన్నది.

ఐతాఘల ఇంట్లో తెల్లవారుఝామునకే పిల్లవాడు లేచి అమ్మను వెదుక్కుని ఏడ్చాడు. సరసోతి 'పడుకోరా! అమ్మ తెలివితప్పి నిద్రపోతున్నదేమో! పాపం - ఏడవకు' అని సమాధానం చేసింది. 'నాగూ! నాగూ!' అని సరసోతి పిలిచింది. 'రాము దేవుస్తున్నాడే రావే' అని తారాడింది. రాముణ్ని మళ్ళీ సమాధానం చేసింది. 'సరే అప్పుడే అంట్లు తోమడానికి వెళ్లింది కాబోలు! అయితే ఆ చెరువుకే వెళ్లివుంటుంది. నా కేకలు విని వస్తుందిలే. లేకుంటే ఇంక పొద్దు పోయిందంటూ ఆ పొన్నచెట్లకు సేవలు చేస్తున్నదేమో' అని సమాధానపడింది. తెల్లవారేవేళకు బయటనుండి ధ్వనులు 'అమ్మా! అమ్మా' అన్నాయి. సరసోతి 'ఎవరు ........ఎవరు' 'ఏమమ్మా మీ కోడలు తెల్లవారు ఝామున కాలువలో పడాలని వెళ్లిందండీ— ఆ ఎండ్రకాయలవాళ్ళు లేకుంటే ఆమె దొరికేదికాదు' అని వర్ణించారు. 'నాగూ ఏమమ్మా! అలాంటి అఘాయిత్యం!' అని, 'ఆమెదేం తప్పు! దేవుడే అన్ని కష్టాలిచ్చారయ్యా' అని తమ కష్టాలు ఆ బెస్తలకు చెప్పింది సరసోతి. 'వారు తప్పుకుని వెళ్లారు. 'అమ్మా! వద్దమ్మా! నీ కొడుకు ఒక క్షణం వూరకుంటాడా? నేనెలాగో సమాధానం చేశాను. మనమేనా లోకంలో కష్టాలు పడుతున్నామని? మనకంటె లక్షరెట్లు బాధలు పడేవాళ్లు లేరంటావా' అని ఏమేమో హితవు మాటలాడింది.

పొద్దుపొడిచి రెండుగడియలలో తండ్రివచ్చారు. 'బరోడులో ఏమీకష్టం లేదట. అందరూ ఇప్పుడే వెళ్ళండి ఫరవాలేదు — నాగవేణీ, నువ్వేమో మంగుళూరికి రావాలి' అన్నారు. నాగవేణి వినజాలకపోయింది. ఆవులపాకలో దూరింది. దూడల మెడలు విప్పి తోలుకొని పోయింది బిడ్డ రాకుంటే. సరసోతి 'నేనూ, సత్యభామ ఎల్లాగో బతుకుతాము. మీరు మనుమణ్ని కాపాడాలి. నిన్నరాత్రి నదీముఖాన ఏరు దాటడానికి వెళ్ళిందట' అన్నది. వాసుదేవయ్యగారి యోచన ద్విగుణమయింది. 'అయ్యో! నాబిడ్డను పూలల్లోపెట్టి పెంచాను. ఈ మండుటెండలో ఎండబెట్టాల్సి వచ్చిందే' అని వ్యధపడ్డారు. వారు బిడ్డను వెదకుతూ బయటికి వెళ్లారు. మళ్లీ ఆ నదీమార్గం పట్టారు. ఒకర్ని చూచి 'మాబిడ్డనండీ, రామబతాయల కోడలు అగుపించిందా?' అని అడిగారు. 'ఏమండీ, ఇంటి వెనకాలే దూడలను మేపుతున్నట్లుందే' అని వుత్తరం వచ్చింది.

'ఔనూ, అ పొన్నచెట్ల సమీపాన ఇప్పుడే చూచివచ్చానని' ఎవడో అన్నాడు.

మళ్లీ ఇంటివెనుకకు వచ్చారు. నాగవేణి పొన్నచెట్లలో తలపై చేతులుంచుకొని ఏడుస్తూ యోచిస్తున్నది. తండ్రినికూడ చూడలేదు. కాళ్లపై చూపుతో ఏమో ఆలోచన — వారు ఆమెవద్ద చేరి 'ఎందుకమ్మా! నీవు నిజంగా అల్లాగే చేశావా? లేక అవిడ అన్నీ కల్పించి చెప్పిందా!' అని నెమ్మదిగా మాట్లాడినారు. నాగవేణి గొంతెత్తి చూచింది. కన్నీళ్ళు రాలినవి. 'ఈ వయస్సులో వాళ్ళిద్దరూ వరులపంచ వుండగలరా చెప్పండి! పెద్దత్త ఇక్కడే కట్టపైన ప్రాణం విడుస్తానన్నది' అన్నది.

'అందరితో నాకేం పని, నేనేంచెయ్యాలి? ఏమైనా ఏర్పాట్లు చేయవచ్చు. నువ్వుకూడ ఇక్కడే వుంటానంటే ఎల్లాగమ్మా?'

'వారు అక్కడికి రారు. వారుండేదాకా నేనూ రాజాలను —' అన్నది.

'అయితే ఆ పసివాని గతిఏమి? నీ గతి?'

'ఏమైనా కాని — ఇక్కడే వుంటాము — గుత్త, కవులు అన్నీ ఇస్తాము. బ్రతికినన్నాళ్ల అలాగే కాని. ఆయన బదికితే, వస్తే చూడనీ. రామబతాయల మనుమడు నన్ను వదలడు అనే వాక్యం ఫలిస్తుంది' అన్నది.

'సరే ఇంత రాతిగుండె గలదానివి, నిన్న ఎందుకు ఆఘాయిత్యం చేశావు?'

'మీరు ఆ పెద్దత్తను వేరు చేయాలని వున్నారని దుఃఖం. నా కష్టం చూచి సరే పొమ్మన్నా ఆ దృష్టిలేని, కాళ్లలేని, బలహీనురాలిని, డెబ్బైఐదేళ్లదాన్ని విడువలేను — చావు అందరికీ ఒక్కటే! గడ్డితిన్నా బతుకుతారు' అన్నది.



ఒకవిధంగా వాసుదేవయ్యగారికి బిడ్డ పట్టుదలకు గర్వం కలిగింది. 'సరేనమ్మా! నువ్వే — మగపిల్లవాడుగా పుట్టింటే చాల బాగుండేది. కాని పేగు తీపి, కడుపు తీపి బాధ అంతా కన్నీరవుతుంది. కనికరమే కల్గుతున్నది.' అన్నారు.

మళ్ళీ 'సరే, నీ ఇష్టం. నీవంటి దాన్ని భగవంతుడు చెయ్యి విడువడు. ఇక్కడ ఇల్లాగే ఎందుకుండాలి? ఏటి అవతల మన పొలం వుంది; అది చూచుకుందువు గాని. ఈ కొంచానికి గుత్త ఇస్తే నీకేమి మిగులుతుందమ్మా. ఇంత యాతన లెందుకు? ఎవరికైనా ఇస్తే ఏమీ మిగులదే. చూడు' అన్నారు.

'ఉంటే ఇక్కడే వుండాలి, ఇంటి యజమాని వెళ్లగొడితే ఆ ఇసుక దిబ్బలపై సర్కారి బయలుంది. అక్కడనే వుంటాను. వారు వస్తారు. అన్నీ చక్కబడతాయి. లేకుంటే తన కొడుకుకు తానే తెచ్చిపెట్టిన కష్టాలను చూస్తూ సంతోషించనీ' అన్నది.

ఆమె మనస్సు ఈవిధంగా వుంది. ఇంటి పెద్దలపై మమకారం, గౌరవం ఎంత ఎక్కువో తన దుర్గతికి కారణమైన మగనిపై కూడ అంతే కోపం. తన చేతులు కాళ్లతో - మగడు విడచినా కాళ్లమీద నిలబడగలనని చూపాలని వుంది.

సరే ఇంట్లోకి బిడ్డను పిల్చుకొని వచ్చారు. 'సరసోతమ్మా! మీ ఋణానుబంధం ఎల్లాంటిదో కాని, నేను దానిని తెంచదలచలేదు. దేవుడే చక్కగా అతికినలాగే వుంది. ఒకటి వినండి. ఎప్పుడైనాసరే మీకు నాతో అవసరం పడితే ఏమాత్రం వెనుకంజ వేయవద్దు — నేను లేకున్నా నారాయణయ్యనే అడిగి తీసుకొండి. అంతైనా మీరు నా సహాయం పొందకుంటే నామైన ఒట్టు' అని హామీ ఇచ్చారు.

బిడ్డ బలవంతంతో ఆ మధ్యాహ్నం భోంచేసి వెళ్లాలి. మనుమని నోటికడి తాము తింటున్నట్లే భావించారు ఆయన. సరిగా తినలేక పొయ్యారు. మాటలలో 'అమ్మా! ఈ సంసారం, నరకం దేవు డెందుకు చేశాడో ఏమో' అని అన్నారు. ఇల్లాంటి మనోవ్యథ ఎన్నడూ అనుభవించి వుండలేదు. ఆ రోజు వారిని ప్రవేశించిన దుఃఖం చనిపోయ్యేదాక వదలలేదు.

వకీలుగా రేమో వూరెళ్లారు — వారు వెళ్ళిన రెండు మూడు రోజులలోనే సత్యభామ ఇష్టంతో తన ఇంటికే వచ్చేసింది. సరసోతి నోటినుంచి ఆమెకు ఇంటిచరిత్ర తెలిసింది. 'తన కోడలు మనిషికాదు — దేవత' అని భావించింది. నాల్గు దినాలకే వియ్యాల వాళ్లింట్లో సిగ్గేసింది 'మన మెందుకుండాలి! ఆమె చూడండి! మంగళూరినుండి వచ్చాక పుట్టింటికి ఒక తడవకూడ వెళ్లలేదు. నాన్నా, బాబాయిలు మాత్రం వచ్చి చూడాలి. తానేమో బరోడులోకూడ ఒక రాత్రి వుండదే పాపం — ఈ ఇంట్లో ఆమె చేసే చాకిరీ, తపస్సు వ్యర్థం కాదు — మేము కన్నీళ్ళు వదత్తే మనుమనికి కష్టం' అని సత్యభామ సమాధానపడింది.

రామునికి రెండేండ్లు. ఉగాది అయింది. లచ్చడు మోసం చేసి వెళ్ళి ఒక సంవత్సరం అయింది. ఆ ఒక సంవత్సరంలో బతాఖులంతటి మోతుబరీ వంశం వారే కొలిచ్చి బదుకాల్సి వచ్చింది; ముసలి సూరణ్ని పిలిపించి నాగవేణి తన ఏడ్పేదో ఏడ్చింది. 'చూడు సూరడు! నీ కొడుకులు పెద్దవారయ్యారు. నువ్వేమో ముసలివాడివి. నీవొళ కాడి తోలితే మాకు మూడుతూముల పొలం చేతిలో వుందని గర్విస్తాము. మమ్మలను బదికించురో, అని అడుగుకుంది. కట్టమీద కూర్చున్న సరసోతి 'ఒరే చూశావా! భగవంతుని లీల అంటే చూశావా?' అన్నది. సూరడు తాత లగాయతు వాళ్ళ పాలికాపు; అందుకే 'అవునమ్మా! మీకు కొంచెం అలికిస్తే కష్టపడతానా?' అన్నాడు. అల్లాగే సరసోతమ్మగారి ఆధ్వర్యాన మూడు తూముల నేలకు విత్తనం వెయ్యడానికి సిద్ధం చేశాడు. పదునయింది. ఎండకాలమే రెండు చినుకులు పడగానే మొలకలు తలఎత్తాయి. నాగవేణి. సత్యభామ చలిలోకూడ రాముణ్ని ఆడిస్తూ పొలంలో ఒక కోడికూడ రాకుండ కావలి కాశారు.

ఎండ తీవ్రమయింది. తెల్లని మబ్బులు పడమట్లో కొండలు కొండలుగా పరుగెత్తాయి. వాటిని చూస్తే పెండ్లి, కార్యం ఉపనయనాలవారికే భయం. తరిపొలాల వారికి ఆనందమే. పొలం పచ్చబడింది. సరసోతికూడ 'సత్య! ఈ నీళ్ల మోటకు, ఏతాలకు కూలి ఇచ్చివుంటే కొలు కట్టేవాళ్ళమే కాదు. దేవుడే రక్షించాడు' అన్నది. అలాగే రాముని కేకలు చూచి 'సత్య! పిల్లవానికి వానకాలంలో తినడానికింత చేసిపెట్టరాదా? ఏమి లేకున్నా బియ్యంతో అప్పడాలైనా!' అన్నది. నాగవేణి కలుగజేసికొని 'వానికే అనుకొని బియ్యం ఖర్చుచేస్తే, కోతలు, కలుపులు అన్నిటికి బియ్యం కొలిచేదెల్లాగ?' అన్నది. సరసోతి నవ్వి 'పోనీలేవే ఒక్కొక్కరు, మూడు ఏకాదశులు చేద్దాం. తరువాత కష్టాలుండవు.' అన్నది. నాగవేణి సిగ్గుపడి మెల్లిగా 'ఎల్లాగయినా ఇదే ఖజానాలాగు కావలాచేసి పెట్టుకోవాలి. బియ్యంలేకుండా ఇంకేమైన పెట్టి చేద్దాం లెండి' అన్నది. ఊళ్ళో ఏమి కరువైనా ఆ ముంతమామిడివళ్ళ కరువులేదు. దాన్ని ఎవరూ తినరు, వాడరు—దాన్నే తీసి ఎండబెట్టి గింజల వడియాలు, అప్పడాలు చేసింది. 'పోనీ ఇవి వానకాలంలో పాసిపోకుండా చూడాలి' అన్నది. సత్యభామకు మళ్ళీ బిడ్డ ఇంటి పనసకాయలు జ్ఞాపకం వచ్చాయి. నాలుగు పనసపండ్లు పడవేస్తే చాలు. కానీ ఎవరు మోసుకుని వస్తారు? నాగవేణి కూడ కష్టమే అని అంగీకరించింది. సరసోతి తన యౌవనకాలంలో బారకూరి మామిడితోపునుండి తెచ్చిన మామిడిపిందెల కథను వల్లించింది. 'మీఅంత ధైర్యం—బలం వుండాలిగా' అన్నది సత్యభామ. కానీ మనుమని నోటి తురతుర అలాగే వుంచుతుందా. దానికిగాను తల్లిని బాధించరాదు—అనుకుని మళ్ళీ సత్యభామ మందర్తికి వెళ్లింది—'రెండునాళ్లలో వస్తానమ్మా, ఫరవాలేదు!' అని చెప్పి వెళ్లింది. నాల్గునాళ్లయినాయి. సుబ్బికొడుకుకూడ సత్యభామ వెంట పెద్ద ముల్లె మూట మోసుకొని వచ్చాడు—ఆమె తలపైకూడ పెద్ద గుడ్డలమూట. సత్యభామకు తన దేహపరిశ్రమపట్ల తనకే గర్వం కలిగింది. పట్టరాని ఆనందంకూడ కల్గింది. 'చిన్నవాడా! బావయ్యను చూడవూ. అప్పడాలురా, వాడు నీ కొరకే తెచ్చాడు' అన్నది. పిల్లవానికి 'బావ' అంటే ఏమిటో అన్నీ బోధపడలేదు గాని 'అప్పడం' అంటే నోరూరింది. సత్యభామ బిడ్డ ఇంట్లో పనసకాయలు తెంపి, కోయించి అప్పడాలుచేసి ఎండబెట్టి మూటల్లో తెచ్చింది. తోడుగా గెణుసుగడ్డ, చేమగడ్డ ఇంకెన్నో రకాల అప్పడాలు, వడియాలు తెచ్చింది. అన్నీ మేనత్త పంపిన కానుకలేమో! ఆ బావయ్య రెండే దినాలుండి వెళ్లాడు. వానివెంటనే వానలు పట్టుకున్నవి.



అన్ని ఏళ్లల్లోనూ ఆసారి త్వరగా వానకాలం వచ్చింది. ఊళ్లో చెరువునిండా, పొలాల నిండా గోదురు (గోండ్ర) కప్పలవాద్యాలతో గింగురు మంటున్నాయి. సముద్రం హోరు, ఆర్భాటం కూడ ఎక్కువైంది. ఇసుకతిన్నెలను ఒకేసారి మింగేస్తానంటూ వరదలు. ఘోష విని సరసోతి 'వరుణదేవుని ఇష్టమెట్లా వుందో ఏమో! అంతా ఆపోశం పడతానంటాడా?' అన్నది. వానల తాళాలకు మొక్కలు నృత్యం చేస్తాయి. సత్యభామ, నాగవేణి, సూరని మనుమలతో పొలం చూచివచ్చారు. నాగవేణి కేమని చింతఅంటే సూరని ఇంటినుంచి నాట్లకూలికిగాని, దేనికిగాని వాళ్లువచ్చి అడుగక పోవడం. రెండుకుండల బియ్యానికి గాను వాళ్ల ఋణంలో ఎందుకు వెళ్లాలి? అనుకొని నాగవేణి మూడు నాలుగు మార్లు అందరినీ పిలిపించింది. సూరడేమో వాళ్లింట్లో పుత్తర్వు చేశాడు. 'ఒరే! వాళ్ల ఇంటి పూరగాయ, అన్ని పదార్థాలు, బియ్యం తిని బతికాము. ఆ బతాఖులు ఒకసారి ఒక తూమెడు వడ్లకు ఎందరినో పీడించారుగాని నన్ను ఏమీ అనలేదు. అన్నీ మాఫీచేశారు. అలాంటివారింట్లో పేదరికంవస్తే ఈసారి కూలినాలి తీసికోరాదు.' సత్యభామ చెప్పినా వినరు. నాగవేణి స్వయంగా వెళ్ళి 'సూరా, రా! ఆ బియ్యం ఖర్చయితే కష్టం. పురుగుపడితే కష్టం' అంటే, 'సరే మీ ఇంట్లో దాన్ని మా పేరుతో నిలువవుంచండి. కావలసినరోజు అడిగి తీసుకుంటాను' అన్నాడు.

నాట్లయినాయి. వీలున్నప్పుడు నాగవేణి వెళ్లి కలుపుతీసి వచ్చేది. లేకుంటే పసుల వెంట వెళ్లేది. వానలేకుంటే రాముడు వెంటపడతాడు. రాముని ఒంట్లో ఎంత బలహీనమైనా ముద్దుముద్దుమాటలు, తప్పటడుగులకుమాత్రం తక్కువలేదు. పెద్దలందరూ ఆ మాటలకే వినోదం పొందారు. తల్లికికూడ విశ్రాంతిలో వాణ్ని ఎత్తుకోవాలంటే పుత్సాహమే, ఎండ తగ్గినాకే ఎక్కడైనా ఎత్తుకొని వెళ్లేది. 'అమ్మా సముద్రం చూత్తా. అదిగాడు అల్లాంటే ఏమిటి?' తల్లి 'పెద్ద చెరువులేరా' అన్నది. 'అయితే పెద్ద కలువలు, కమలా లుంటాయా?' అన్నాడు. సముద్రానికి పిల్చుకొని వెళ్లేదాక మారాము మానడు. నాగవేణికి కొడుకును నీటివద్దకు వెళ్లనియ్యాలంటే చాల భయం. రామునికేమో మట్టిదిబ్బలతో ముద్దులాడే సముద్రం కెరటాలను కౌగిలించుకోవాలని ఆశ. సముద్రం నురగలను చూస్తే వాటికంటే శుభ్రంగా కిలకిల బిలబిల నవ్వుతాడు వాడు. నాన్నాళ్ల కొకతడవయైనా వానికి సముద్రతీరం షికారు కావాల్సిందే. రాత్రి నిద్రలో కలవరిస్తూ వాడు తల్లితో 'ఆ మొర ఎవరు పెడ్తారు?' అంటాడు. 'సముద్రం' అంటే, 'ఎందుకమ్మా! దాని కెవరు కావాలి? ఏం కావాలట?' అని అడుగుతాడు. వా డెప్పుడైనా ఏడిస్తే 'రామణ్ణ! రారా! సముద్రం షికారుకూ' అంటే చాలు! అదేం నూరు గజాల యాత్ర. కాని వానికేమో భాగ్యం—రామునికి తిండి తీరాలకు లోటేలేదు. బొమ్మ

తెచ్చిన అప్పడాలున్నాయి. ఒకటి కాల్చి ఇస్తేనే వానికెంతో సంతృప్తి. మిగిలిన వేళలలో ఎప్పుడూ అవ్వతో, సరసోతితో మాటలు.

వానకాలం వెలిసింది. మహాలయఅమావాస్య వస్తున్నది. ఊళ్లో అందరూ సముద్రంలో మునకలువేసి పుణ్యం సంపాదిస్తున్నారు. సరసోతికికూడ అదేఆశ పుట్టింది. ఆమె కాశీనుండి వచ్చాక సముద్రానికి ఒకసారికూడ వెళ్లలేదు. తాను నడవలేను, చన్నీట మునుగలేనని ఊరకే వుంటూ వచ్చింది. 'నాగూ! ఎన్నాళ్లుంటానే, ఈసారి మునిగివస్తే చాలు. కండ్లు కానరావుగానీ చేతులు పట్టుకొని నీళ్లల్లో ముంచండి. చాలు. లేకుంటే తడి ఇకలో నుంచుని మునకలు వేస్తాను. పితృపక్షంనాడైనా మునిగి రావాలని ఎంతో ఆశ. ఇక జాత్రవద్దు. క్షేత్రం వద్దు. తీర్థం వద్దు. ఈమాత్రం చేయించు తల్లీ' అన్నది సరసోతి.

ఆదినం తెల్లవారే ఇంట్లో ఒకసారి స్నానం చేసింది. ఇంటిదైవం వద్దకు ఎవరి సహాయం లేకనే వెళ్లి మొక్కి వచ్చింది. తరువాత 'సత్యా! నువ్వు వస్తావా! నాగవేణా! నువ్వేనా. మెల్లిగా నిలబడి, ఆగి, సేదతీర్చుకుంటూ వెడదాము. ఒకేసారి వెళ్ళటానికి కాళ్లు ఆనవు. మునకలు వేసేప్పుడు ఉపాధ్యాయుల భార్య సహాయం ఇప్పించు. ఇద్దరూ చేరి సుఖంగా స్నానం చేయించండి. నాగవేణి యేమో పిల్లవాణ్ని చూచుకుని ఇంటివద్ద వుండని' అన్నది సరసోతి.

రాముడు ఇంటిలో వుండమంటే వుండగలడా! సముద్రానికి తాను గూడ వెళ్లాలని మారాము చేశాడు. తల్లేమో 'ఉండరా! ఉండు, నిన్ను విడువలేను. భయమేస్తుందిరా, ఒంటరిగా అని' ఎంత చెప్పినా మరింత మారాము చేశాడు. అందుకే నాగవేణి వాణ్ని చంకనెత్తుకొని సముద్రం వద్దకు వెళ్లింది. తరువాత అందరూ ఒకటిగా చేరారు. రాముడు అవ్వ చెయ్యి పట్టుకొని 'రామ్మా, నీకు స్నానం చేయిస్తానని' ధైర్యం చెప్పాడు. సరసోతి అడుగు మీద అడుగువేస్తూ సత్యభామభుజాల సహాయంతో ముచ్చటగా సముద్రం అంచు చేరింది. సత్యతో 'చూడు, పారోతి ఉన్నన్నాళ్లు ప్రతి అమావాస్య స్నానాలు సక్రమంగా చేస్తుండే దాన్ని.' అన్నది; పారోతి స్మరణతో మరిన్ని కన్నీళ్లు రాల్చింది. అందరూ నీటి అంచు వద్దనే వున్నారు. అక్కడ కొందరు స్నానాలు చేస్తున్నారు. కొందరేమో తిలతర్పణాలు వదులుతున్నారు. రాముడుకూడ అన్నిదిక్కుల చూచాడు. 'అమ్మా! నేను కూడ వాళ్ళలాగే చేస్తాను' అంటూ మట్టి వుంటలతో 'ఓం, వాం, రాం, వాం ......' మంత్రాలు పలికాడు. వాని మంత్రాలకు బామ్మ నవ్వింది. 'సత్యా! అన్న అవతారమే దిగింది చూడు వీనిలో. అతని యోగం పూర్ణంగా వుంది. వాడే వుంటే ఈ ఒడ్డు మంత్రాలతో మారుమ్రోగేది' అన్నది సరసోతి.

అందరూ స్నానాలకు సిద్ధపడ్డారు. రాముడుకూడ తానూ మునకలు వెయ్యాలని మళ్ళీ మారాము. చివరకు సత్యభామ, నాగవేణి చేతులు పట్టుకొని మునకలు వేయించారు. వాని



కళ్లకు ఉప్పునీళ్లు తాకిడి అయినా పరవాలేదు, ఆ కెరటాలదెబ్బలకే హాయిగా నవ్వుతున్నాడు. 'మళ్లీ—ఇంకా—మరొకసారి' అని మునుగుతున్నాడు. రాముడు లెస్సగా స్నానం చేశాడు. ఎండ ఎక్కినాక ముసలామెకు కష్టం కలుగరాదని సుబ్రాయ ఉపాధ్యాయుల భార్యను వెదకారు. ఆమె తన చిరకాలస్నేహం సంగతి సరసోతితో మాట్లాడుతున్నది. నాగవేణి రాముని చేయి పట్టుకున్నది. సత్య - ఉపాధ్యాయినీ ఇద్దరూ సరసోతి చేతులు పట్టుకొని ఇంటిదారి పట్టారు. సరసోతి స్నానాలు అయినాయి. ఒక బ్రాహ్మనికి దానంకూడ చేశారు.

సరసోతికి మళ్లీ పూర్తి నిస్సత్తువ మూదింది. అక్కడక్కడ కొంతసేపు విశ్రమిస్తూ మాట్లాడుతూ ఇల్లు చేరారు. ఇంటి ముంగిట్లోకి రాగానే 'నాకు భోజనం వద్దు - అమృత పానకం ఇస్తే చాలు' అన్నది. నాగవేణి పిల్లవాణ్ని దింపి, ఇంట్లోకెళ్ళి అమృతపానకం చేసుకురావాలని వెళ్ళింది. రాముడేమో 'అవ్వా! నేను నీకు పానకం తాపిస్తాను కూర్చో' అని ఓదార్చాడు. ఎందుకో ఆ కొన్ని నిమిషాలలోనే ఆమెకు జీవమంతా కుమిలినట్లు సంకటమయింది; పడుకున్నది, నాగవేణి రామునిహతం మూలాన వానిచేతితోనే సరసోతికి పానకం కాస్త్రం చేయించింది. కొంత తెప్పరిల్లుకుని 'ఒరే! నీవైన బాగుండురా, అమ్మ, అబ్బలకు మంచి కీర్తి తేరా!' అని నవ్వుతూ ఆశీర్వాదం చెప్పింది. 'ఏమోనమ్మా! కాశీనుండి నేను తెచ్చిన గంగతీర్థంకూడ పట్టుకొస్తే బాగుంటుంది—' అన్నది. సత్యభామ గంగచెంబుకు మెత్తించిన లక్క తీసేసి, ఒక మిల్లెడు (ఒక వుద్ధరిణి) గంగాజలం ఆ ఎండే పెదవులలోకి దింపింది. రాముడుకూడ 'అవ్వా! నేనుకూడ తీర్థం వేస్తాను' అన్నాడు. 'ఔనురా! నువ్వుగాక ఇంకెవ్వరు వెయ్యాలి?' అన్నది. ముసలిఅత్తకు పానకం చేసే సమయంలోనే నాగవేణి తలలో గందరగోళం లేచింది. సూరనివద్దకు పరుగెత్తి ఒక మనిషిని పినతండ్రి ఇంటికి పంపింది. ఆమె తిరిగి వచ్చేవేళకు రాముడు గంగతీర్థం తాపుతున్నాడు. ఉపాధ్యాయులభార్య, సరసోతి భీకరంగా వుంటే చూచి, ఎవరైనా మగవాళ్లుంటే బాగుండేది' అనుకున్నది. ఆమె సంకటపడుతున్నది. ఆ మాటలు సరసోతి వినింది. 'ఈ చిన్నరాముడుమాత్రం మగవాడు కాడంటావా?' అని నవ్వింది.

అవే ఆమె ఆఖరుమాటలు. ఎంతో ఆయాసంతో, సంకటంతో పడుకున్నది. రెండు నిమిషాలకే రాతివలె మొద్దయింది నాగావేణి ఏడుస్తూ 'అప్పుడే అనుకున్నాను ఈ బీభత్సం జరుగుతుందని. అత్త అన్నదిగదా పారోతీకూడ అమావాస్యనాడే పోయిందని అని జ్ఞాపకంతో మరింత వెక్కివెక్కి ఏడ్చింది. 'ఆమె, ఈమెను పిలిపించింది కాబోలు!'అనుకొంది.

రాముడు అవ్వదగ్గరకెళ్ళి తాకి, గీకి, పొర్లాడించి ఏమేమో మాట్లాడాడు. నాగవేణి చూడలేక వాణ్ని దూరంగా ఎత్తుకొని వచ్చింది. సత్యభామ నారాయణయ్యగారితో 'అమేమో! ఇచ్ఛామరణం గలదండీ. మాలాంటి పాపులకథ ఏమో!' అన్నది.

# 20

నవరాత్రి గడచింది. ఊళ్ళో అన్నిపొలాలు పక్వమైనవి. సముద్రం హోరు కూడ శాంతించింది. పెద్దపలబెస్తలకు మంచి అనుకూలమైన కాలము. హంగారకట్టి పీటిలోకి కూడ బొరుగూరి పడవలు రాదొడగినవి. రామునికేమో ఇల్లంటే విసుగు పుట్టింది — అమ్మను ఊరికే 'బయటికి తీసికెళ్లు' అని బాధిస్తాడు. పదిరోజులు సరసోతిని తలుచుకొని 'అవ్వా! నేను వస్తా! అవ్వ ఎక్కడ?' అని పలవరించాడు. నాగవేణి రోజూ సాయంకాలం ఏటి వడ్డు, సముద్రం, అటూ ఇటూ తిప్పుకొని వస్తుంది. ఒకనాడు తమ తోటగా భావించే కొబ్బెరతోటకు వెళ్ళారు. ఐతుపూజారి (ఈడిగపూజారి) వద్ద రాముని తాతగారు కొన్న తోట అది. అది చేతులు మారింది. ఎందుకో నాగవేణికాళ్లు అక్కడికే లాగినాయి. రాముణ్ని ఎత్తుకొని వెళ్లింది. అది నందనవనంలాగా వుంది. ఆ కొబ్బెరకాయ గెలలు వంగి నేలను తాకుతాయా అనేట్లున్నవి. సత్యభామ వెంట ఇదివరలో ఎప్పుడో ఒకసారి వెళ్ళి వుండినది. అప్పుడు జ్ఞాపకంతో 'మీ తల్లవాతలో లేదు గాని, లేకుంటే ఇది మనదేరా!' అన్నది. రాముడు కొబ్బెరకాయల చూచి 'అమ్మా! అవి నాకివ్వవే' అన్నాడు. 'అవి మనవి కావమ్మ' అని నచ్చజెప్పి ఆమె వాణ్ని ఇంటికి తేవాల్సి వచ్చింది.

సరసోతి సూతకం పోయింది. ఆమె మగనింటివారు వచ్చి అక్కడే కర్మలు ముగించారు. ఆ ఇంటి స్థితిగతులు చూచి సత్యభామ అల్లుడు జాలిగొన్నాడు. 'మా ఇంట్లో నాన్న వెళ్ళాక అన్నీ భాగాలయినా, ఆస్తి మాత్రం మాలోనే వుంది. ఇక్కడి కథ భిన్నంగా వుందే' అన్నాడు. 'ఏమైనా వకటే' అన్నది నాగవేణి. ఉత్తరక్రియలు చేసిన వారు ఎవరి దారిన వారి వెళ్ళారు. ఒక్కొక్కరు వెళ్లేనాడు రామునికి వెండి పావలా బిళ్లలు ఇచ్చి వెళ్ళారు. రాముడు 'అమ్మా! ఇదేమి? ఎందుకు?' అని అడిగాడు. సత్యభామ తన పేదరికానికి కుంగిపోతూ 'దానినుండేరా అన్నీ జరుగుతుంట' అన్నది. నాగవేణి 'ఏంలేదు బాబూ! నువ్వు దానితో ఆడుకోవాలి తెలుసా!' అన్నది. తరువాత ఆ పావలాలు మెల్లిగా లాగుకొని వానికి ఆడుకోడానికి తాతగారి జంధ్యాలువడికే కదురు ఇచ్చింది. రాముడు దానితోనే ఆడుకుని పొద్దు పుచ్చాడు.

సూతకం అనుకుంటుంటే అన్నం, నీళ్ళు వద్దా? కడుపు తిప్పలకు పండిన పంటను మరుస్తారా? నాల్గునాళ్ళకు ఆ మేఘరాజుకు కోపంవస్తే అంతా భూమాతకే అవుతుందని — పెల్లగిస్తాడని తెలిసింది.

కోతలు కావాలి. సత్య, నాగవేణి ఎన్నడూ కొడవళ్ళు, కత్తులు పట్టినవారే కారు. సూరణ్ని పిలుద్దామంటే వెనుకటి కూలికూడ చెల్లుబడి కాలేదు. సరే ఏమైనా కాని కోతలు వాళ్ళతో చేయించి ఇంట్లో కంకులు పడేస్తే, కొట్టుకొని దులుపుకొనేది ఇంట్లో నెమ్మదిగా



చేసుకోవచ్చని నిశ్చయించారు; సూరడుకూడ తన దొరసాని పొలం మొదటనే కోసి తరువాత తనపని చూచుకున్నాడు. వానింట్లో పిల్లలందరూ ఎదిగిన వాళ్ళే. వాని మాట వింటారు. వానికి తీరికవుంది. అత్తకోడలు గడ్డిని వామిగా వేస్తున్నారు; రాముడు కూడ ఆ గడ్డిని తన చిన్నారిచేతులతో కొడతాడు. ఎత్తి వామిలో వేస్తుంటాడు. నాగవేణి 'మొదట సూరిని ఋణం చెల్లించాలి. ఎందరు కూలీల పనోచేశాడు' అని అంతా లెక్కపెట్టి గింజల కుప్పలో కొంత వేరే పోసిపెట్టింది. సూరని రమ్మన్నది. ఆమె ఎందుకు పిలచిందోననివస్తే, ఆమె 'ఒరే! ఈ గింజలు నీ కూలి తీసికోరా. తరువాత మిగులకుంటే కష్టంరా?' అన్నది. 'అమ్మా! ఈసారికూడ వద్దమ్మా? నలుగురు వుచితంగా చేసి పుణ్యం సంపాదిస్తే తప్పా?' నాగవేణి 'సూరడూ, నాకు ఋణం అంటే బాధరా! మా నాన్న పిలిచినా వెళ్ళలేదురా?' అని చెప్పి చక్కగా ఇంట్లోకి వెళ్ళింది.

సూరనికి ఆ మాటలు విని చాల బాధ కల్గింది. ఆ షావుకారికి గుత్తకట్టాక, కూలీలిస్తే ఆమెకేమి మిగులదని తెలియదా? అంతా పదితూముల బియ్యం మిగిలేని. సంవత్సరం పొడుగునా చాలుతుందా? దానితోనే బట్ట, వుప్పు, పప్పు వద్దా?-అని అన్నీ ఆలోచించాడు. రెండవదఫా విత్తనంవేసి నీరు కడితే బహూశా నాల్గుతూముల బియ్యమే దొరుకుతుంది. అంతే. 'ఒరే! నువ్వు అలకరా! కోతలు మేము చూస్తాము' అని అన్నారు. మొత్తంమీద కట్టుగుత్త సేద్యం కూడ ఏమో యాతనతప్ప మిగిలేది లేదు. అని నిర్ధారణకు వచ్చారు. అందుకే ఆ రోజునుండి పగలంతా బూడిద, ఎరువుమన్ను అన్నీ మోత — నీళ్ళుకట్టి కూరగాయల మళ్లపెట్టేది — ఆ కార్యక్రమాలే మింగుతున్నాయి కాలాన్ని. వడ్లు దంచడానికి కూలివెడదామంటే భయమే. కొన్ని మినుములు, నువ్వులు, అనుములు అనుకుంటూ కూరగాయల మధ్య కొన్ని పంటలు వెట్టుకున్నారు.

విత్తనం అయింది. విరామవేళలలో వెనుకవుండే చెట్లకింద ఆకులను వూడ్చేపని, వడ్లు ఎండపోసుకునేది; అక్కచ్చు కాంచేది; కొన్ని కొన్ని వడ్లు దంపుకుని దాచేది; అన్నీ కార్యక్రమాలే నాగవేణికి ఈలాగు తీరికలేకుండ చేతులు మందమైనా జ్వరం తగిలినా ఫరవా లేదు. రెట్టలు పడిపోయేట్లు పని. కానీ బ్రతకాలిగా! రేపటి బ్రదుకు తెరువు అందులోనే వుంది, రాముడుకూడ వెంట వెంట పనికి వస్తుంటే నాగవేణికి చింత తగిలింది. 'ఈ పని కూనకూడ ఈ మట్టికి, నీటికి, పొలానికి, గడ్డికేనా అంకితం?' అనుకుంది. సత్యభామ యేమో 'వానికి ఇంత వుపనయనం చేసేస్తే, ఇంటివిద్య సాగుతూ వుంటుంది. నాల్గు అష్టకాలు అధ్యయనం అయితే మన కష్టాలకు గురికాడు. ఇంటికి గౌరవంగా కాయ, పండు, బియ్యం, డబ్బులు వస్తాయి. వారున్నప్పుడేమో ఎవరికి ఏమి తెలియలేదు. ఇప్పుడన్నీ అర్థమయినవి' అన్నది. 'ఎవరికెరుక, వాని తలవ్రాత వాడేమి వ్రాశాడో, వాని మేనమామల లాగు చదువుకొని హోదాకొస్తాడో, నా మామలాగు వైదీకం చేస్తాడో, లేక నరసింహాని లాగు హోటేళ్ళు తెరుస్తాడో? వారు మాత్రం ఎంతో చదివి చివరకు ఏం చేశారు? హోటేళ్ళకే

ఎగబడ్డారుగా!' అని కుమిలిపోయింది నాగవేణి. ఆమె నిరాశావాది కానేకాదు. కాని కొడుకు భవిష్యం ఏమవుతుందో మాత్రం కచ్చితంగా చెప్పజాలదు.

ఇంటి వ్యవసాయం అవీ ఇవి అనుకుంటూ రాముణ్నిమాత్రం అత్తాకోడళ్ళు అశ్రద్ధ చెయ్యలేదు. నాల్గేళ్ళు వచ్చాయి. ఐదేళ్ళకు తమవూరిలోని శాలలోనే వేద్దామని తీర్మానించారు. ఆ బడిరాకతో శంకరవర్ధులబడి ఎన్నడో లేచిపోయింది; అత డెక్కడికెళ్ళాడో! ఎప్పుడైనా గింజలకు, యక్షగానాలకు మాత్రం వస్తాడట: అందాక రాముణ్ని పిల్లవానిలాగ ఆడిస్తూ, పాడిస్తూ వుండాలి. వానికి సముద్రం చూపడం; పశువులు కాసే అప్పుడు వెంటతీసికెళ్ళడం; పక్కన వూళ్ళ జాత్రలకు ఎత్తుకొని పోవడం ఇత్యాదులే వానికి వినోదాలు. సముద్రంలో కొట్టుకొని వచ్చే రంగురంగుల గవ్వచిప్పలు, పొన్నకాయలు వాని ఆటవస్తువులు, ఎక్కడైన తప్పెట్ల మోతలు వినబడితే 'నన్నెత్తుకొని వెళ్ళు' అని హఠం పడతాడు. అప్పుడప్పుడు పెద్ద వలల బెస్తలు కుందర్తినుండో, మారనకట్టనుండో మేళం భాగవతం తెప్పించి ఆడిస్తారు. రాముడుకూడ అక్కడికివెళ్ళి ఒక గంట అయినా ఆటలు తిలకించి వస్తాడు. అమ్మ ఏమో 'పడుకోరా: తెల్లవారుఝామున రంగువేసుకొని భాగవతుల వేషాలువస్తాయి. అప్పుడు చూద్దువుగాని' అంటే వినడు. ఆట చూడాల్సిందే. సత్యభామ తెల్లవారుఝామున మళ్ళీ వాణ్ని ఆటరంగంలోకి తీసికెళ్ళాల్సిందే. సత్యభామమాత్రం ఆ రంగస్థలంలో అందరిదీ మైల వుంటుందని అసహ్యంతో బాధపడేది. మంది వెళ్ళాక ఆ వేషాలదగ్గరకు తీసికెళ్ళి రావణుణ్ని, భీమణ్ని అందరినీ. అన్ని తోలుబొమ్మలను చూపించుకువచ్చేది. రాముడు ఇంటికి వచ్చి చూచినట్లే చెంబులు, తపెలు అన్నీ దగ్గర పెట్టుకొని వీధినాటకాన్ని పునః అభినయించేవాడు. ఆటవారి 'తరననన—అలల్లా—కూం, ఆం, ఆం' అంటూ రాగాలాపనలో అన్నీ చిందులుతొక్కి ఇంట్లో గందరగోళం లేపేవాడు. 'ఏమిరా, ఎందుకురా, నువ్వేమీ మేళాలవాడటరా?' అంటే అవును నేను 'ఉప్పల్లి శేషుడు—రావణుడౌతాను—నేను ఇప్పుడు పాండేశ్వరపుట్టయ్య—అర్జునుణ్ని అవుతాను. చూడు నా తడాఖా' అని బాగా నటించేవాడు. ప్రసిద్ధిచెందిన వేషధారులలాగు రాముడు గుర్తించి ఆడగలడు.

ఒకనాడు ఆట హనుమంతుని దేవళంలోనే అయింది. రాముడు రాత్రే వెడదామని పట్టుపట్టాడు. ఏల్లాగో సత్యభామ వాణ్ని తెల్లవారఝాములో తీసుకెళ్ళింది. ఎత్తైన ఇసుకదిబ్బపై నిలబడి ఇద్దరూ ఆటచూశారు. ఆనాటిలాగు వాడెన్నడూ చక్కగా ఆటను గమనించివుండలేదు, దగ్గరగానే చక్కగా అన్నీ కనబడ్డాయి. ఆ ఇసుకదిన్నె పైననే వాడు 'ఝణతోం ఝణ—తకిదిం తకిదిం' అంటూ ఆట మొదలుపెట్టాడు. ఆ నాయనమ్మకు కూడ తన బాల్యం జ్ఞప్తికి వచ్చిందేమో!

ఇద్దరూ ఆటచూచి తిరిగి వచ్చేశారు. వచ్చేప్పుడు రాముని తలపై మంచు చినుకులు పడ్డాయేమో తడితడిగా వుంది. 'అయ్యో! వీనికి చలిబట్టిందే. ఆటలో సరిగా కప్పలేదే'



అని భయపడింది సత్య. దానితోబాటు ఏనాటి బాదరాయణ కథో జ్ఞాపకం వచ్చింది- పారోతి లచ్చణ్ని వులవచేనుకు తీసికొనివెళ్ళిన దృశ్యం. తానేమో కడుపు ఆత్రంతో ఆమెను చెడా బడా అన్నానే అని పశ్చాత్తాపపడింది. వాని కళ్ళెంబడి నీరుకారింది. సత్యభామ ముఖం మామిడిపిందెలాగు చిన్నబుచ్చుకుంది. ఎదురుగా నాగవేణి వచ్చింది. 'అత్తా! రాముడు నిద్రపొయ్యాడా? బాగా ఆట చూశాడా?' అని ప్రశ్నలు వేసింది. సత్యభామ దిగులుతో ముద్దాయిలాగ, 'నీ వేమంటావోనమ్మా! సరిగ్గా చూచుకోలేదు మంచు పడి శీతమయింది. అప్పుడు నా మనస్సు ఏ రాయల రాజ్యమేలుతుందిందోనమ్మా' అంది. 'పోనీలేండి కాస్త మంచుపడితే ఏమంత శీతములెండి. ఎందుకంత చిన్నబుచ్చుకుంటున్నారు?' అంటూ నాగవేణి రాముణ్ని ఎత్తుకుంది. సత్యభామ 'జ్వరంవస్తే' అనింది. 'జ్వరమేకదా! మరేం కాదు గదా!' అన్నది నాగవేణి. సత్యభామ తనకు పారోతికి జరిగినకథ చెప్పింది. నాగవేణి, 'ఆమె, పెద్దత్త బహుశా పూర్వజన్మంలో కవలపిల్లలేమో! లేకుంటే అంత అన్యోన్యంగా వుండగలరా? ఒకటే మంచిగుణం' అన్నది.

రాముణ్ని తల్లి చాపపై పండపెట్టింది. ఇద్దరూ తక్కిన ఇంటిపనులు చూచుకున్నారు; రాముణ్ని నిద్ర లేవరాదంటూ పనులలో వాణ్ని మరచిపొయ్యారు. వాడు మధ్యాహ్నానికి నిద్ర మేల్కొన్నాడు. నాగవేణి వాని వంటిని నిమిరింది. 'తల ఏమి, ఒళ్ళంతా వెచ్చనైనది. ఆమె నమ్మలేకున్నది. అత్త చెప్పిన కథవలన తనచేతులే వేడెక్కినయేమో' అనుకున్నది. పొయ్యి అంటించి నీళ్ళు కాగబెట్టింది. 'ఎవరిదృష్టి తగిలిందో, గాలిసోకుడు తగిలిందేమో' అని ఒక ఇనుపగరిటె కాలబెట్టింది. ఎర్రగా కాగగానే కొడుకుకు దిగదుడిచివేసి నీట అద్దింది; అది చుయ్యిమని పొగలెక్కింది. ఆ అలికిడికి పిల్లవాడు కళ్ళు తెరచాడు. 'అమ్మా ఏమి పని అమ్మా' అన్నాడు రాముడు. 'ఒరే కాపడం, దృష్టిరా!' అన్నది.

'దృష్టి అంటే?'

'మళ్ళీ చెబుతా! నీకు జ్వరం వచ్చింది. ఊరకే పడుకో.' అని లోనికి వెళ్ళి ఉప్పు, మిరపకాయలు తెచ్చి గరిటెలోవేసి దిగదుడిచి వేసింది. పొయిలో పటపట మనిపించింది. ఎసట్లో బియ్యం వేసి, అత్తకు తెలియకుండ వెళ్ళి ఉపాధ్యాయు లింటినుండి 'సంబారంతీగె' (తిప్పతీగె) తెచ్చి దాని రసంతో శీతజ్వరం మాన్పాలనుకుని వెళ్ళింది.

ఇంతలో రాముడు 'అమ్మా, అమ్మా! ఆకలేస్తుంది' అని లేచాడు. సత్యభామ వాని ఘోష వినలేక ఎత్తుకుంది. 'అయ్యో! అనుకున్నంతా అయిందే ఖర్మ' అని పెదవి కొరుక్కుంది. వానిగుండె గట్టిగా కొట్టుకుంటున్నది. ఆమెగుండె పగిలింది. పెదవి మళ్ళీ కొరుక్కుంది. 'అవ్వా, అమ్మ ఎక్కడ? ఆకలే' అన్నాడు. నీళ్ళల్లో మెతుకులేసి సత్యభామ గంజి కాచింది. సత్యభామ ధైర్యం నీరయింది. ఆమె ఒకేవిధంగా ఎందుకో ఏడ్చింది.

'ఎందుకు బామ్మ ఏడుస్తావు?' అవి వాడినముఖంతో బాబు అడిగాడు. ఆమెకు పలికే వెళ్ల లేదు. ఈ దృశ్యం నాగవేణి వచ్చి చూచింది. చేతిలో మందుతీగె. ఆమెకూడ పిచ్చిగా ఏడ్చే అత్తనుచూచి దిఙ్మూఢురాలైంది. 'ఎందుకత్తా, అంత భ్రమ! కొద్దిగా వేడిచేస్తే ఇంతబాధ? నేనేమో దృష్టి తీసినాను. మందేస్తాను, ఫరవాలేదు' అన్నది. రాముడు 'అమ్మా, బామ్మ ఎందుకమ్మా ఏడుస్తుంది?' అని అడిగాడు. 'కళ్లల్లో ఏవో దుమ్ము లేరా!' అన్నది ఆమె. 'నా గడచిన ఖర్మరా అంతా అన్నీ' అని ఆమె ఏడ్చింది. నాగవేణి రాముణ్ని ఎత్తుకొని అవ్వ దగ్గర దింపకుండ పొయ్యివద్ద కూర్చుంది. 'చూడు, గంజికాగానే చల్లార్చి తాపుతాను—' అని ముద్దుమాటలతో చెప్పింది. రాముడు పొయ్యివేడికి కూర్చున్నాడు. తల్లి అన్నం వార్చింది. మందు రసం తీసింది. అన్నం గంజిలో మరింత అన్నంవేసి బాగా కలిసేట్లు వుడికించింది. ఒక వుప్పురాయి వేసింది. వూరగాయ నంజుకొని తాగురా అన్నది- తరువాత ఎవరికీ ఊరుగాయ లేదు—పాలు, మజ్జిగల పేరే వినరు. తీపిమాటలే మృష్టాన్నంగా మారినవి. రాముని భోజనం ఆయాక 'అమ్మా! నీ కాళ్లపై పడుకుంటానే' అన్నాడు. ఆమె వాణ్ని కాళ్లమీద వేసుకొని జోలలాగు పడుకోపెట్టింది. పిల్లవాడు ఆ నాటకం సంగతి మళ్ళీ 'చూడమ్మా! ఆ బండి భీమడు ఆటలో ఎంత తిన్నాడో ఆ మురమురాలు. నాకు కొంచెం కూడ ఇయ్య లేదమ్మా' అన్నాడు. 'సరేలేరా! ఆ సాలిగ్రామ జాత్రకు వెడదాం. కావాల్సినన్ని మురమరాలు పోసుకొచ్చుకుందువుకాని' అన్నది. తల్లికొడుకులు మాటల్లో పిల్లవాడు అలసి నిద్ర పొయ్యాక చాపపై పండబెట్టి, చీరముక్కను కప్పి వచ్చింది.

అన్నమయింది. అనుపానం, అని యోచన చేసింది నాగవేణి. తరకారి (కాయ కూరలు) కనబడలేదు. చింతపులుసు పిసికి, కాచి, ఉప్పు మిరపపొడి వేసి తిరగబోత పెట్టింది. పచ్చిపులుసు-చింతచారు చేద్దామంటే గుజ్జుగా మారింది. అంతే చేసి అత్తతో 'అత్తా, స్నానం చేశారా?' అని అడిగింది. అత్త ఎన్నిసార్లో కన్నీళ్లతో స్నానమాడి వుంది. స్నానం మళ్ళీ చేసివచ్చి కూర్చుంది. ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. నాగవేణి అత్తకేసి చూచింది. అత్త ఒక్కొక్క మెతుకును కష్టంతో గొంతులో దింపుతున్నది. అత్తపై కోడలికి కోపమే వచ్చింది. 'ఎందు కూరకే పిచ్చా ఏమి? దుఃఖపడుతున్నారెందుకు? పెద్దత్త చక్కగా దీవించే వెళ్ళారు. ఏమీ భయంలేదు. ఆమె పుణ్యం విడిచి వెళ్ళింది. వున్నది సుఖంగా భోంచేశెయ్యండి. అన్నీ ఫరవాలేదు' అన్నది.

భోంచేశారు. ఆ దినమంతా సత్యభామ బిడ్డ పడుకున్న చాపనుండి లేవలేదు. సాయంకాలానికి చెమటపట్టింది; 'దేవుడా! ధన్యురాలైతి' అని శాంతితో నిట్టూర్చింది.

వచ్చే సోమవారమే సాలిగ్రామం జాత్ర—కులదేవునిగుడి అక్కడే. గర్భిణివేళ మగని వెంట వెళ్ళివచ్చింది. అన్నీ జ్ఞాపకమున్నాయి. పిల్లవాని మురమురాల ఆశ వేరే! పిల్లవానికి ఎంత ఆశో ఏమో. వెంటబెట్టుకొని వెళ్ళాలి, ఆ మురముతాలు ఇప్పించాలి-అని తోచింది.



జాత్ర అంటే ఊరకేనా? అంతా ఖర్చులే. ఒక అణాయైన కావాలా? ఇంటినుండి కొబ్బెర కాయ పట్టుకెళ్ళినా పండ్లూ, తాంబూలం, కర్పూరం కావాలిగా! మూడు కానీలైనా మురమురాలు తేవాలి. మూడుకానీలు దక్షిణ. ఎక్కడినుండీ రావాలి. అత్తతో ఆ సంగతి ప్రస్తావించింది, 'నేనుకూడ పిల్లవానికి జ్వరంవిడిచిందని నరసింహస్వామికి మొక్కుకున్నాను. సరే. ఒక సేరుబియ్యం అమ్మితే ఖర్చు అవుతుందిలే' అని తీర్మానించారు.

రథం దినం వచ్చింది. ఊరి జనమంతా అక్కడే వున్నారు. పాతషష్ఠిపంచ రామునికి కట్టారు. అత్తకోడలు తెల్లవారుఝాముననే బయలుదేరారు. అక్కడ వెళ్ళగానే ఆమె పిన తండ్రి కలిశారు. నాగవేణికి వారి ముఖం చూడటానికే సిగ్గేసింది. 'అత్తా, ఈ దారిలో వెడదామంటూ జనసంఘంలో దూరి అతణ్ని తప్పుకుంది. కాని చుట్టూ తిరిగి గర్భగుడి ప్రదక్షిణం చేసి వచ్చేవేళకు పూజవద్ద పినతండ్రి వాళ్ళకు సాక్షాత్ ఎదుటనే వుంటే కాదంటారా? 'నాగవేణి!' అన్నారు పినతండ్రి. నాగవేణి ఏడాదిలో ఎముకల గూడయింది. ఎవరికీ ఆమె గుర్తుపట్ట వీలులేదు. వూరంతా కొత్తచీరలు కట్టుకుంటే, ఆమె పాత చీరతోనే వుంది. కొడుకుకు కూడ పాతపంచ. ఆయన గద్గదస్వరంతో 'నాగవేణి' అంటే 'బాబాయ్!' ఇద్దరి కళ్ళలో దుఃఖం, సిగ్గు ఏర్పడినాయి. చివరకు ఆ గుంపులో ఏమీ మాట్లాడజాలకపోయినారు. 'రామా రారా!' అని మనుమణ్ని ఎత్తుకున్నారు. 'నీకు జాత్ర చూపుతా రారా' అని అక్కడ గుడ్డల సంతలోకి పిల్చుకువెళ్ళారు. ఒక గీతల అంగీకొని తొడిగించారు. 'నాకా?' అన్నాడు. 'ఔను బాబూ!' అన్నారు. 'నా పంచ నాకు ఇవ్వండి' అంటూ తన పాతపంచను కూడ వారిదగ్గరనుండి లాగుకున్నాడు. తరువాత వాణ్ని ఎత్తుకొని 'నావుడర' హోటేలుకు వెళ్ళారు. అక్కడ వానికి ఒక్కణాకు కారాలు, బెండు బత్తీసులు ఇప్పించారు. రాముడు నారాయణయ్యగారి తలపట్టి ఎత్తి 'మీరు మంచివారు' అన్నాడు. నారాయణయ్య గారికి సిగ్గేసింది. 'నాదేమి మంచితనంరా!' అని వాని జేబులో ఒక అణా వుంచి తల్లి వద్ద తెచ్చి వదలారు'

ఆ తరువాత 'నాగవేణి, అందరూ బిరోడుకు రండి. సాయంకాలం వెళ్ళొచ్చు. అన్నారు. 'ఆ దూడలు' అన్నది నాగవేణి. సత్య 'దూడలను నేను చూస్తా. నీవు వెళ్ళిరా' అన్నది. నాగవేణికి మరుమాటలు లేవు. ఆమె మనస్సులో వద్దనుకున్నా పినతండ్రి పట్టు పట్టాడు. ఆ మమతతోబాటు పిల్లవానికి పండుగ భోజనం చేయించాలనే ఆశతో వెళ్ళింది. సత్యభామతో నాగవేణి 'మీరూ రావచ్చు' అన్నది. ఆ పసులముందు గడ్డి వేయకుండా వచ్చాము. వాటినెందుకు వుపవాసం పెట్టాలి?' అన్నది సత్య.

మరోదారి లేకుండా నారాయణయ్య నాగవేణిని, పిల్లవాణ్ని వెంట తీసికెళ్ళారు. 'నీ వెందుకమ్మా వూరకే మోత?' అని పిల్లవాణ్ని తామే ఎత్తుకున్నారు. 'నాకేం ఫరవాలేదు' అన్నారు. 'లేదు కొంతదాకా నడవని' అన్నది. 'అయితే ఇల్లు వద్దా!' అని నారాయణయ్య నవ్వారు. అందరూ నడినెత్తిపొద్దుకు బిరోడి చేరారు. ఆమె సరసోతి కాశీయాత్ర వెళ్ళివచ్చింది అని చెప్పిననాడు వెళ్ళింది. మళ్ళీ ఎన్నో ఏండ్ల తరువాత ఆమె స్వరూపం

అందరికీ విచిత్రం అనిపించింది. అందరూ ఎంతో మర్యాద చూపారు. రాముణ్ని అందరూ ముద్దుగా పలుకరించారు. అందరూ దయచూపారు. మధ్యాహ్నం భోజనానికి కుడుములు, పాయసం, ఖారం అంతా చేశారు. రాముడు అమ్మ పక్కన కూర్చుని తింటూ ఆమె చెవిలో 'అమ్మా. నువ్వు ఇవన్నీ చెయ్యవు గదవే' అన్నాడు. 'చేద్దాంలే' అన్నది నాగవేణి. ఒక చుక్క కన్నీరు పాయసంలో పడింది. చెరగుతో కన్నులు తుడుచుకొని మాట్లాడింది. భోజనాలయ్యాక ఇష్టాగోష్ఠి. సాయంకాలం రథం చూడాలని అందరి ఏర్పాటు. నాగవేణి వుంటే ఇంట్లోనే వుంటాము.' అన్నారు. నాగవేణి 'అత్త వంటరిగా వుండదు. నేను కూడ వెళ్లాలి' అని హఠం బట్టింది. 'రామా, ఇంటికి వెడదామా?' అన్నది. 'నాదీ అయింది' అన్నాడు వాడు. నారాయణయ్య భార్య కొంచెం గయ్యాళి అయినా నాగవేణిని చూచి జాలి పడింది. ఇంటికివెళ్లే బిడ్డతో 'నాగూ. నువ్వు హఠవాదివి-చెప్పి ప్రయోజనం లేదు. పిల్లవాణ్ణయినా నాల్గునాళ్ల వదులు' అన్నది. 'నాకు మరెవ్వరు తోడు' అన్నది నాగు.

తరువాత నాగు పిల్లవాణ్ని వెంటపెట్టుకొని వెళ్లింది. నది ఒడ్డువరకు నారాయణయ్య గారు వచ్చారు. నది దాటించి తరువాత ఇల్లు చేరారు. ఆ దినం ఇంట్లో అందరూ నాగవేణి కథలే చెప్పుకున్నారు.

సాయంకాలం ముంగిట్లో రాముడు ఆడుకుంటూ జాత్రను తలుచుకున్నాడు. 'అమ్మ. అక్కడ బొరుగులు కనబడ్డాయా అమ్మ!' అని ప్రశ్నించాడు. నాగవేణికి ఆ మరుపులేదు. కాని పినతండ్రి ఎదుట కొంచెం ఖర్చుతో అవి కొనాలంటే అవమానం అనిపించింది. 'ఒరే! నా మరుపుగాల!' అన్నది. సత్యభామ 'అదేం భాగ్యం? నేను మరువలేదు. తీసికోరా' అని ఒక పిడికెడుతెచ్చి ఇచ్చింది. 'ఇంకా వున్నవిలే. రేపు తిందువుగాని' అన్నది. 'సరే' అని వాడు అంగీకరించాడు. ఆ బొరుగు గింజలను ఒక్కొక్కటి ఏరి శ్రద్ధగా తిన్నాడు. తరువాత చెరువుకు, బావికి, మందకు శ్రమతో పెద్దలవెంట వెళ్లివచ్చాడు.

రాత్రి నాగివేణి పిల్లవాణ్ని పక్కలో వేసుకొని వానికి నిద్రవస్తే చూచి 'ఒరే! ఆ కొత్తంగీ తీసిపెడదామా?' అన్నది. 'వుండనీ అమ్మా బాగావుంది' అన్నాడు. తెల్లవారేదాకా దానితోనే పడుకున్నాడు. రాత్రి పిల్లవాణ్ని ముట్టి ఒళ్లుచూస్తే అంగీ అడ్డంగా వుంది. ఆ అంగీతో తన దుఃస్థితి కన్నెదురైంది. దానివెంట వాడు కడుపున వున్నప్పుడు మగనివెంట తేరుకువెళ్లి చూచివచ్చిన మధుర క్షణంకూడ జ్ఞాపకం వచ్చింది.

ఊరంతా జాత్రకెళ్లి వచ్చింది. జాత్ర అయినా దానిగురించి ప్రసంగాలు తగ్గలేదు. ఆ వార్తల తరువాత మరొక విపరీతవార్త బయలుదేరింది. దూరమైన ఉడిపి- మరెన్నో వూళ్లనుంచి చావులజడివాన వార్త. ఏదో జ్వరమట! ఇల్లంతా నాశనమట- అంతట ఎగబడే వార్తలే. 'అవునా నాగూ' అని అత్త; 'నిజమేనా అత్తా' అని నాగూ. అందరూ సూరణ్ని



'ఏమటరా!' అని అడుగడం-వాడు 'నిజమట-అనడం' అంతా ఒకసారి జరిగింది. 'ఎవరెవరినో అడిగితే' 'గానుగగూటంలాగు పిండే జ్వరమట'-అన్నారు. ఇదంతా ఆడవాళ్లు తమ గాజులు పోగొట్టుకొన్న కథలని నవ్వి అది కాదనవలసి వచ్చింది.

అందరూ నవ్వుకుంటూవుండే రెండుదినాలకే సూరనికి జ్వరం వచ్చింది. మంచం పటాడని వాని కోడలు చెప్పింది. ఆ సాయంత్రం కోడలుకూడ పడుకుంది అన్నారు. మరునాడు సూరనింట్లో అందరికీ జ్వరమే అని తెలిసింది. సత్యభామ దేనినీ నమ్మదు. అక్కడికి వెళ్లిచూస్తే, సూరని శ్మశానయాత్ర జరుగుతున్నది. వాని పెద్దకోడలుకూడ బదికే ఆశ లేదట. సత్యభామ భయంతో కాతరురాలై ఇల్లు చేరింది. 'ఇదేమి విచిత్రం! నన్నిపాతం అన్నా పదిహేను దివసాలు బాధిస్తుంది. మాయ జ్వరం-మంది క్షణంలో చస్తారట.' అన్నది భీతితో.

ఆ రాత్రి గడచేలోగా సత్యభామకు పెద్దజ్వరం వచ్చింది. ఒళ్లు మండిపోతున్నది. నాగవేణి కంగారైంది. ఇంటి వెనుకలున్న మందుదినుసుల కషాయం కాచి ఇచ్చింది. 'శీనమయ్యరు కొడుకువద్దగాని, సుబ్రాయర ఇంట్లోగాని మందు తెస్తాను' అన్నది. ఉపాధ్యాయుల ఇంటి ఇసుకదిన్నెవద్ద వెళ్లతుంటే అక్కడే రోదనధ్వని వినవచ్చింది. అక్కడికి వద్దులే అని నరసింహమయ్య ఇంటికి వెళ్లింది. ఆ ముసలామె, నరసింహుని తల్లి చూపించింది. నాల్గు చాపలపైన నలుగురు పడుకొన్నారు' అని. 'ఏమి చేస్తున్నారమ్మా మందున్నదా?' అని అడిగింది నాగవేణి. 'అంతా దైవాధీనం' అన్నది ఆమె.

నాగవేణి వణుక్కుంటూ ఇల్లుచేరింది. ఆ సాయంకాలం పిల్లవాడు రాముడుకూడ జ్వరంతో పడ్డాడు. రెండు పక్కలమధ్య దైవధ్యానం చేసుకుంది నాగవేణి. ఇచ్చిందే మందులే అనుకొని వాసనగడ్డి కషాయంచేసి ఇచ్చింది. ఎందుకైనా మంచిదని పిల్లవానికి కూడ కషాయం తాపించి. రాత్రి ఇద్దరి కావలితో జాగరణచేస్తే ఆమెకుకూడ ఒళ్లు వెచ్చగయింది. తెల్లవారితే ఒకళ్లనొకళ్లు మాట్లాడించే ధైర్యమేలేదు. రామునికి తీవ్రమైన జ్వరం. సత్యభామకు నోట మాటకూడ రావటంలేదు. ఈ విధంగా వూరంతా రణరంగం లాగు పడిపోతారని ఎవరనుకున్నారు? ఆ క్షణంలో తన ఇల్లుకూడ ఈ వేషం దాల్చాలా?

దినాలు ఎలా గడిచింవో ఎవరికీ బోధపడలేదు. కొన్నాళ్లకే ఎన్నో యుగాల జ్వరం వచ్చినట్లయింది.

నాగవేణి కళ్లుతెరచే సమయానికి రెన్నాళ్లయింది. ఆమెకు పిల్లవాని స్మరణలేదు. అత్త స్మరణాలేదు. తానెవ్వరో ఏమవుతుందో అని కూడ బోధపడలేదు. ఆమెకు ఎవరో గంజి తాపుతున్నారు. మూడవనాడు తెలివివచ్చింది. నాల్గవనాడు కళ్లుతెరిచి లేచిచూస్తే

జ్వరం తగ్గింది. నోట్లో గంజివేస్తున్నవారు పినతండ్రిం అని తెలిసింది. 'అరే! నేనెల్లా వచ్చాను! ఎక్కడికొచ్చాను?' అన్నది.

'మీ ఇంట్లోనే లేమ్మా!'

'ఎవరు పిలిపించారు.'

'నేనే భయంతో చూడటానికి వచ్చాను.'

తాను నాన్నాళ్లక్రితం మందుకు తిరుగులాడిన సంగతి నాగవేణికి జ్ఞప్తికి వచ్చింది. కారణం బోధపడింది. పిల్లవాని సంగతి అప్పుడు దిగులుపుట్టింది. 'బాబూ!, అత్తరా!' అని ఒకసారి పొర్లాడింది. అయితే పక్కన అత్తలేదు. ఎడమప్రక్కన పొర్లింది. పిల్లవాడు కూడ కనబడలేదు. 'అయ్యో! అంటూ 'మరింత గాబరాపడ్డది. 'ఏమీ భయపడవద్దు. పిల్లవాడు మా ఇంట్లోనే వున్నాడు, సుఖంగా వున్నాడు' అన్నారు పినతండ్రి. అయితే 'అత్త?' అన్నది. అయితే నారాయణయ్యగారు మౌనంగా వున్నారు. 'ఎవరు బాబాయ్, ఎవరింట్లో వుంది? ఎవరు పిలుచుకెళ్లారు!' అని వలవరించింది. ఎన్ని తక్కిన మాటలు చెప్పి ఆమెకు సమాధానం చెప్పాలని ప్రయత్నంచేసినా, 'వద్దమ్మా, నువ్వెందుకు అలసిపోతావు' అని మరపించినా వినకుంటా ఏడిస్తే చివరకు 'దేవుడమ్మా!' అనాల్సి వచ్చింది.

నాగవేణి అప్పుడు మరింత ఏడ్చి కొడుకువైపు చూచుకుంది. 'బాబాయ్ మీరందరూ అన్నీ అబద్ధాలు చెబుతున్నారు. సూరని ఇంటిలాగు మాఇంట్లో అన్నీ అయిందిలే' అన్నది. 'లేదమ్మా భయంవద్దు! నిన్న జ్వరం తగ్గింది!' అన్నారు. 'లేదులే' అన్నీ శుద్ధ టక్కులు నన్ను అందరూ వదిలిపెట్టారు.' అని వెక్కివెక్కి ఏడ్చింది. నారాయణయ్య 'లేదమ్మా నీపైన ఒట్టేసి చెబుతా! వాడు సుఖంగా వున్నాడు' అన్నారు. అయితే 'అత్త' అని మళ్లీ ఏడ్చింది. 'అత్త-బిడ్డ' అనుకుంటూ ఏడ్చింది. మరొక జ్వరం వచ్చింది. ఆ సంసార భ్రమలోపడి సంతాపంలో మునుగుతున్నది. మరి నాల్గునాళ్లు తెలివిలేదు- అశక్తత - బాధపడింది. ఆ పిల్లవాడు, ఆ పేదరికం అన్నీ, ఆ అత్తచావు అన్నీ పిడుగుదెబ్బలలాగు పనిచేసి నయమైన జ్వరం మళ్లీ తిరగబెట్టింది. అంతా భీకరచిత్రం సముద్రం పొంగులాగు ముంచుకెత్తుతున్నది. తాను గొప్ప రోగాన్ని అనుభవిస్తున్నట్లే తోచింది. 'ఇది మన ఇరుగు పొరుగుకు కూడ వచ్చిందా' అని సంశయం వచ్చి అన్నీ పినతండ్రిని అడిగి తెలుసుకుంది. 'మీ ఇంట్లో?' అని అడిగింది. 'అది వెళ్లింది - వీరు వెళ్లారు' అని చెప్పారు. సుబ్బి ఇంట్లో?' అని అడిగితే 'ఒకరి సుఖదుఃఖాలు మరొకరు అడిగే నెమ్మది ఎవరికుందమ్మా!' అన్నారు.

ఐదురోజులనుండి నాగవేణికి జ్వరం లేదు. పిల్లవాణ్ని చూడకుంటే ఏడుస్తుందని వాణ్నితెచ్చి చూపారు. పిల్లవాణ్ని ఆపాదమస్తకం నిమురుతూ 'అయితే! అత్తకు ఉత్తర



క్రియలు జరుపాలిగా' అనింది. 'అయితే, వాడు రావాలిగా. ఎక్కడున్నాడో తెలిస్తేగా!, అన్నారు. వెంటనే మయ్యరింటికి వెళ్లారు. అక్కడకూడ సూతకమే. ఆ ముసలి ఆమె, మరి రెండు జీవులు కృష్ణార్పణం అయ్యారు. నరసింహుడు గాబరాతో బెంగుళూరినుండి వచ్చాడు; అక్కడ ఈ కొత్త సంక్రామక వ్యాధినిగూర్చి వర్ణించాడు. తల్లి చావుకు ఏడ్చాడు; చివరకు నారాయణయ్య 'నరసింహయ్యా! ఎవరిగొడవ ఎవరు వర్ణిస్తారు? ఇంటింట దుఃఖాలే. ఏడిస్తే వస్తారా! మా ఇంట్లో అంతే- ఒక్కొక్క ఇల్లు అమాంతం నాశనమైంది. పీనుగులను కాల్చి, పూడ్చేవారే లేరట.' అని అన్నీ మాట్లాడి 'మా నాగవేణి అత్త చచ్చింది. మా అల్లుని చిరునామా, అతని సంగతి తెలిసేదెలాగ? చచ్చినవారు ఎల్లాగూ రారు! ఒక పిండమైనా వేయించాలిగా! కొడుకు బ్రతికివున్నప్పుడు మరొక్కరు ఎల్లా చెయ్యాలి?' అన్నారు. దానికి నరసింహయ్య 'వాడా! మైసూరిలో మా తమ్మునివద్ద దర్జాగా బతుకుతున్నాడట. డబ్బు ఎల్లావస్తే అల్లాగే జూదం, ముండ ఇంకేమో దౌర్జన్యాలు చేసుకుంటూ బాగా భోగం అనుభవిస్తున్నాడు. ఇంక చాలనాళ్లు వాని ఆటలు సాగేట్లు కనబడవు' అన్నాడు.

ఏవో చిరునామా తెలుసుకొని నారాయణయ్య నాగవేణి ఇంటికి వచ్చారు. 'అల్లుని మైసూరు చిరునామా తెలిసింది. వానికి టెలిగ్రాము పంపుతాను. లేకుంటే, రాకుంటే మరొక్క ప్రయత్నం చేస్తాను. నాగవేణీ, మా ఇంట్లోనూ అదే దాడి. ఇదికూడ సూతకాల ఇల్లు. అదికూడ అంతే. కానీ అక్కడైతే వంటచేసేవాళ్లు గట్టిగా వున్నారు. నాకు ఇక్కడే కూర్చుంటే జరుగదు. రామ్మా! వెళదాం. మా యజమానురాలి వైకుంఠ సంతర్పణ తరువాత వచ్చేస్తువుగాని- లేకుంటే, ఆ పుణ్యాత్ముడు రాగానే వచ్చేస్తువు' అన్నారు.

నాగవేణి 'సరే! బాబాయ్ వెళ్లు- నేను ఫరవాలేదు. వండుకుంటాను. తింటాను. నా దిగులు పెట్టుకోకండి. చేతులు కాళ్లలో బలం వస్తున్నది' అన్నది. 'అమ్మా! నువ్వా! సర్వకాల సర్వావస్థలలో హఠవాది కావద్దు. పెద్దల మాటలకు మర్యాదపెట్టు' అన్నారు కొద్దిగా కోపంతోనే- వారికి నొప్పి కల్గిందని నాగవేణి 'ఈ పశువులకు కుడితి, తిండి, గడ్డి అన్నీ ఎవరు చూస్తారు? ఇప్పుడు అన్నీ జ్ఞాపకమొస్తున్నాయి.' అన్నది. 'ఏమి ఫరవాలేదు. అన్నింటిని మా ఇంటికి తోలించాను. ఏమీ భయపడవద్దు' అన్నారు. 'సరే ఎండతగ్గాక వెడదాం' అన్నది నాగవేణి. సాయంకాలం ఇద్దరూ ఏరోడికి వెళ్లారు. పిల్లవాణ్ని నారాయణయ్యగారు ఎత్తుకున్నారు. ఏరుదాటేటప్పుడు రాముడు 'అమ్మా! నేను పెద్దవాణ్ని అయ్యాక నిన్ను ఎత్తుకొని నది దాటుతాను. సరేనా!' అన్నాడు. నాగవేణికి నవ్వువచ్చింది. 'సరే, కానీ' అన్నది. ఈలాంటి పిల్లవాని ముద్దుమాటలతో ఆ పేదరికంతో గుండెపగిలిన నాగవేణి కొంత వెలుగును చూస్తుండేది. ఆ గాఢాంధకారంలో వాని మాటలు మెరుపు తీగెలాగు వెలుగుతుండేది.

'అమ్మ, అమ్మ, మాట! బామ్మను పాపం? వదిలేసి వచ్చామమ్మా ఆమె రావద్దా!' అన్నాడు.

'బామ్మ పోయింది మళ్ళీ వస్తుందా?'

'అయితే ఆ సాలిగ్రామం తేరుకు వెళ్ళింది కాబోలు.'

'అల్లా అనవద్దు.'

'ఎందుకు?'

'నీకు తెలియదులేరా! పసివాడివి. ఆమె చచ్చిందంటే ఏమి అర్థమవుతుందిరా నీకు?'

'సరే లేమ్మా! పెద్దవాడయ్యాక తెలుస్తుందిలే! పెద్దవ్వలాగు పడుకుంది కాబోలు!' అన్నాడు రాముడు.

'అవునులే'

నారాయణయ్యగారి కనికరం, హృదయం ఆ పిల్లవాని మమకారంవల్ల ముద్దు మాటలవల్ల వుప్పొంగింది. 'బాబూ! ఊరకేమాట్లాడి అలసట చేసుకోవద్దు. పడుకో' అన్నారు. పిల్లవాడు పడుకున్నాడు. గంటలోపల అందరూ బిరోడి ఇల్లుచేరారు. నాగవేణికేమో ఒక అడవినుండి మరొక్క అడవికి వచ్చినట్లయింది. అక్కడ ఒక పెద్దమగవాడు పినతండ్రి గుండె రాయిచేసికొని, తన దుఃఖం నాగవేణికికూడ వెళ్ళబోసుకోకుండా ధైర్యంగా చేతులు కాళ్లు బిగించి నడుస్తుంటే, ఆ ఇంట్లో అందరూ గంభీరంగా చింతలు మరిచి కూర్చున్నారు.

నారాయణయ్యగారే హంగారకట్టకువెళ్లి మైసూరుకి తంతికొట్టారు. లచ్చనికి నమ్మకం లేదేమోనని మరొక్కబదులు టెలిగ్రాంకుకూడ డబ్బుచెల్లించి వచ్చారు. వాని వుత్తరం రాగానే నాగవేణికి తెలియజేశారు. 'అబ్బ! తల్లయినా స్మరణకు వచ్చింది కాబోలు' అన్నది. 'నేను పిండంలేకుండా అనాధగా చావాలి' అని ఆమె పాపం భయపడుతుండినది. ఆ గొడవ తీరింది' అన్నది. అంతా దేవునిదయ అని అనుకున్నది.

చచ్చిన తొమ్మిదవనాటి సాయంకాలం లచ్చడు వచ్చాడు. తనకు ఆ సూతకాలు లేనట్లే మంచి సూటువేసుకుని దిగాడు. మోటారునుంచి దిగి నారాయణయ్యగారింట్లోకి వెళ్లాడు. అక్కడే నాగవేణి, పిల్లవాడు వున్నారని వానికి తెలియలేదు. వాళ్లింటి బయటి కట్టమీద కూర్చున్నాడు. ఎవరో వేషంతో వచ్చారని చెబితే నారాయణయ్యగారు బయట వచ్చి చూశారు; ఆ లచ్చరాయడు అక్కడే వున్నాడు. 'ఏమైనా దాహం తీసుకుంటారా?' అని విచారించారు.

'నాకేమీ వద్దు. ముందు కార్యక్రమం చెప్పండి. ఆ ఇంట్లో ఎవరున్నారు? ఆవిడ వుందా?' అని అడిగినాడు.



'ఆమె పిల్లవాడు ఎల్లాగో బ్రతుకుకున్నారు. మీ అమ్మనుమాత్రం ఆ వ్యాధి పొట్టన పెట్టుకుంది. ఆమె పడుకుంది. అందరూ జ్వరంతో పడుకున్నారు. వూళ్లో ఎవరికీ ఆనాడు తెలివేలేదు. ఆమె ఒక రాత్రిలోనే పోయింది. నేనొక్కడే ఆమెకు దహనసంస్కారం చేయాల్సివచ్చింది.'

'అరే! వ్యాధి అని వ్రాస్తే నేను రాకుండేవాడినా?' అన్నాడు లచ్చడు.

వానితో మరింత మాట్లాడితే ప్రయోజనంలేదు అని తెలిసింది.

'నువ్వేమో వుత్తరక్రియలు వుపక్రమించు. నాగవేణి చాల బలహీనంగా వుంది. ఆమెకు ఏ పనీచేతగాదు- ఇక్కడవుంటూ అన్నీ నెరవేర్చు. ఏమీ ఆక్షేపణలేదు. నీ ఇష్టం' అన్నారు. లచ్చడు 'ఆవిడ ఎక్కడ?' అన్నాడు లోనికి పిలుచుకొని వెళ్లారు. నాగవేణి తల వంచుకొని కూర్చున్నది. పిల్లవాడు నిద్రపోతున్నాడు. చూచి ఏమీ పలుకకుండా లచ్చడు బయలుదేరాడు.

'ఏది ఏలాగున్నా ఒరటవింటికి వెళ్ళి మాట్లాడుతాను. తరువాత చెబుతాను. రాత్రి భోజనానికి వస్తాములేండి' అని చెప్పి గబగబా వెళ్ళిపొయ్యాడు.

'మీ మగనికి ఇక్కడ సరిపడినట్లు లేదు—ఒరటని ఇంటికి వెళ్తానన్నాడు. భోజనానికి వస్తాడట' అన్నారు నారాయణయ్య.

'మీ కర్తవ్యం మీరు చేశారు. చెప్పారు. దేవుడు ఎల్లా బుద్ధి పుట్టిస్తే అల్లా చెయ్యని. వారిష్టం' అన్నది నాగవేణి.

రాముడు లేచి తల్లివద్దకు వచ్చాడు. నాగవేణి 'ఒరే! మీ నాన్న వచ్చాడురా?' అన్నది. 'అంటే ఎవరమ్మా?' అన్నాడు రాముడు. 'చిన్ననాడు నిన్ను ఎత్తి దింపిన వారు' అన్నది.

'అయితే ఇప్పుడు ఎత్తుకుంటారా? వద్దు పో! నేనే నడుస్తా - అన్నీ వచ్చు కదా నాకు. చెప్పు?' అన్నాడు.

'ఔను నీవు చాల పెద్దవాడివి కదా?' అన్నది.

'ఔను రేపే మీసాలు వస్తాయి, అపుడు నీ అంత ఎత్తునా పెరుగుతా, తెలుసా?' అన్నాడు. తల్లి నవ్వి నవ్వి వుబ్బిపొయ్యింది.

రాత్రికి బచ్చుడు వస్తాడేమో నని నారాయణయ్యగారు చాల పేపటివరకు ఎదురు చూచారు. వాడు రానేలేదు. మరునాడు అక్కడనుండి మనిషి వచ్చాడు. 'వారు అక్కడే అన్ని విధులను నిర్వహించుకుంటారట. అక్కడే అన్నీ అనుకూలంగా వున్నాయట' అన్నాడు. నాగవేణేమో 'అత్త కర్మలు మయ్యారింట్లో జరిగినా తాను అక్కడ వుండ వలసిందేనేమో'. అని కర్తవ్యబుద్ధితో ఆత్రపడింది. 'అక్కడే అంటే—శివమయ్యారిల్లా—తమ ఇల్లా' అనే సంశయం తీర్చడానికి మళ్ళీ మనిషిని పంపారు. తన ఇంట్లో అయితే నాగవేణి తప్పక వెళ్ళాలని అనుకుంది. అప్పుడు మనిషి తిరిగి వచ్చి. ''శరటుని ఇంట్లోనే అన్నీ జరుగుతాయి. బలహీనురాలు నాగవేణి రానక్కరలేదని కూడ ఆజ్ఞ ఇచ్చారు' అన్నాడు.

అత్తగారి క్రియలను కళ్ళారచూచే భాగ్యం లేదని నాగవేణి దుఃఖపడింది.

'వానిష్టం వచ్చినట్లే చెయ్యని—పాపపుణ్యాలన్నీ వానికేలే!' అన్నారు నారాయణయ్య.

ఐదారు దినాల క్రియలు, వైకుంఠసమారాధన అన్నీ బాగా వైభవంగానే సాగించారు. బ్రాహ్మణులకు చేతినిండ దక్షిణలూ అందినాయి. నారాయణయ్యకు పదమూడవ నాటికి రమ్మని పిలుపువచ్చింది. ఆయన నాగవేణిని, పిల్లవాణ్ని వెంటబెట్టుకొని వెళ్ళారు—తెల్లవారివెళ్ళి 'వంట లెక్కడైనా చెయ్యని, విస్తళ్ళు మీ ఇంట్లో వేయించు, అక్కడ సంతర్పణలు నడిస్తే బాగు' అని నారాయణయ్య చెప్పి చూచారు.

''ఇండ్లు దగ్గర వున్నాయి వరవాలేదు. కానీ అమ్మివేసిన ఇంట్లో మనకేం పని!' అని దౌలు చూపించాడు బచ్చుడు.

నారాయణయ్య చిన్నబుచ్చుకొని వెనుదిరిగారు. తరువాత నాగవేణి హారం బట్టి తన ఇంట్లోకే వెళ్ళింది. పిల్లవాణ్నెత్తుకొని నారాయణయ్యగారు ఆ బతాళుల ఇంటికి వెళ్ళి, తరువాత తమ ఇంటికి వెళ్ళిపొయ్యారు. వెళ్ళేనాడు వారి మనస్సు చాల వుడికి పోయింది. 'అమ్మా, ఏమైనా సరే అతడు వస్తే. చనువుగా మాట్లాడకుంటేనే బాగు!' అని హెచ్చరిక చేసి వెళ్ళారు.

మరునాడు పుసయం బచ్చడు, అమ్మివేసిన ఇంటికి వెళ్ళి నాగవేణితో 'చూడూ ఎందుకుంటావు ఈ ఇంట్లో. నావెంట మైసూరు వచ్చేసేయ్, నిన్ను వెంట తీసికెళ్ళాలనే నా యిష్టం. మీ పినతండ్రి అభిప్రాయం కూడ తెలుసుకొని వారు సరే అంటే వస్తావా? వచ్చేయ్' అని నాగవేణికి తెలియబరచాడు. ఆ మాటల్లో కూడ తగుపాటి విషం మిశ్రమయింది. 'వారి నేం అడిగేది, వీరినేం అడిగేది? నాకు అన్నీ అర్థ మయినాయి. అవుతాయి, ఒక్కొక్కరి నెత్తిపైన ఒక్కొక్కరి (భస్మాసురుని) హస్త ముంటుం దని తెలియదా?' అన్నది. ఊరికే రెప్పలారుస్తూ కూర్చున్న రాముడు 'అమ్మా! నే నిక్కడే ఈ ఇంట్లో వుంటాను. వారి వెంట ఎక్కడికో రానమ్మా' అని ఏడ్పు ధ్వనితో అన్నాడు.



బచ్చని అభిమానం బాగా దెబ్బతిన్నాది. 'సరేలే, ఆ చిన్న పసివానికి కూడ అన్ని మాటలు నేర్పించావు గదా! కానీ' అనుకుంటూ మరి మారు మాటలాడకుండా వెళ్ళి పోయాడు. నాగవేణి ముఖం సూదిమొనలాగు సంకోచించుకున్నది. ఒకసారి మాడ్చుకున్న ముఖం మళ్ళీ ఏమో తలచుకొని ఏడ్చింది.

# 21

నాగవేణి తన భవిష్యత్తులోని భాగ్యాన్ని ఎన్నుకోవలసిన గడియలు ప్రాప్త మయ్యాయి.

ఆమె సంసారమంటే రాము డొక్కడే దిక్కుగా మిగిలాడు. బచ్చడు మళ్ళీ ఏమీ సమాచారం చెప్పకుండా మైసూరు వెళ్ళాడట. వాడు వేడుకొని వున్నా, వాని వెంట ఆమె వెళ్ళి వుండేది కాదు. ఆమె మనస్సు వానిపట్ల బాగా ముక్కలు ముక్కలై పోయింది. అవి ఎన్నటికీ అతుకజాలవు. 'నాపైన కోపమున్నా పరవాలేదు. తన కొడుకును కరుణించి ముద్దాడనైనా లేదే —అల్లాంటి తండ్రి ఎక్కడైన వుంటాడా?' అనే చింతలో రక్తం వుడికిపోయింది. జీవనసంగ్రామం ఒంటరిగా రాముణ్ని చాటున బెట్టుకుని చెయ్యగలదా, ఆ పెద్ద ఇంట్లో ఒంటరిగా పసివానితో ఎలా వుండాలి? వ్యవసాయం ఒకతే చెయ్యగలదా? ఇదివరలో కలిసి ఏడ్చేవారైనా వుండిరి. పెద్దత్త, చిన్నత్త ఎవ్వరూ లేరే? ఆమె ఎప్పుడు ఎక్కడికి పోయినా, అన్నివైపులనుండి గాలి మాట్లాడిస్తున్నది. 'ఏం, ఒంటరిగా వుంటావా? ఆ పసివాణ్ని కట్టుకొని అంత పని చేస్తావా? నీవా రెవరూ లేరా? నీ కన్నీటి కూటికి ఆ రాముణ్ని ఎందుకు బలిచేస్తావు? నీవు పోతే వాని గతి యేమి?' అనీ ఎన్నో ప్రశ్నలు వేస్తున్నది. ఆమె మనస్సులో తికమక, కలవరం ఏర్పడ్డవి. నీటివరద, క్షీణదశ రెండూ కలిసి సుడిగుండం ఏర్పడినట్లే ఆమె హృదయం సుడిగుండంలాగు ఒక్కొక్కసారి సుడిగాలిలోని పడవలాగు ఎక్కడికో లాగుతున్నది. రాముని దీననేత్రాలు కనబడగానే పెదవులు మౌనవ్యసనంతో తడబడుతాయి, కన్నీటిధార కారుతుంది. 'దేవుడే ఈగతి ఇచ్చాడే' అని విస్తుంది. తండ్రి ఇంటికే వెడితే ఓటమి, మగనితో సంతమాడిన తానే భిక్షార్థినిగా వెళ్ళాలా? వెళ్ళకుంటే ఆ గంజినీళ్ళతోనే కాలక్షేపం. రాముడుకూడ మరొక భిక్షాటనకు బయల్దేరాల్సిందే—వాని మామలేమో వకీలు, వైద్యుడు, ఉపాధ్యాయుడు- అందరూ హోదాలలో వున్నారు. ఊళ్ళో చదివి ఎందరో కొత్తదారిలో పడ్డారు. కోడి గ్రామంలోని అనువ, ఆకుకూరకంటె మంచి అనుపానంతో భోంచేస్తున్నారు. ఐతే ఆ ముసలివాడు తన వంశం మీద ఆశతో తనకే మొత్తం ఆస్తి అప్పగించి వెళ్ళాడే—అతనిప్రేతం తిరుగుతుంటుంది. ఇంటి వెనుక పొన్నతోటలోనే అతణ్ని కాల్చారే—తన మనుమడైనా తన ఆశయాలను పూర్తి చేయాలని కోరదా ఆ ప్రేతం?

సత్యభామ ఉత్తరక్రియల తరువాత ఒకమాసం గడిచింది. నారాయణయ్యగారు రెండుసార్లు వచ్చి 'ఏమైనా అవసరమేమమ్మా' అని అన్నారే గాని; తమ ధోరణిలో తప్పక వచ్చేసేయ్, ఇక్కడ వుండే అవసరం లేదని మాత్రం చెప్పలేను: రమ్మని కూడ అనలేను. 'నేను రాజాలను' అన్న రోజుల్లో రెండుసార్లు అడిగారు. ఈసారి 'రావాలా' అనే స్థితిలో అడుగలేదే అనుకున్నది.

తన నవ్వులేని ముఖాన్ని మరింత కఠినంగా, క్రూరంగా చేసుకుని కూర్చుంది. పెదవి బిగబట్టి పని చేస్తున్నది. రాముడు 'అమ్మా! నాతోకూడ మాట్లాడవా?' అని అడిగాడు. 'అవునురా! నీతోనే, ఇంకెవ్వరు మాట్లాడుతారు?' అన్నది. 'అయితే, నా కొక కథ చెప్పమ్మా' అన్నాడు. ఏదో కథ చెప్పింది. ఎక్కడినుండి ఎక్కడికో చెప్పేసరికి ఆ పిల్లవానికి రసభంగం అయింది. 'అమ్మా! ఏమి కథసే, ఏమో ఆలోచన, చింత, యాష్ట. అవ్వ రాదా?' అని అడిగేవాడు. పిల్లవాడు ఆ చచ్చిన పుణ్యాత్మురాళ్ళను తలుచుకుంటున్నాడని మరపించే నిమిత్తం అక్కడిక్కడ వాణ్ని తీసికెళ్ళింది.

ఆవేళ అల్లాగే, తదియనో, చవితో, మునిమాపుకే గంజి కాచి కూర్చుంది, ఆకాశంలో తేలిపొయ్యే మేఘాలను చూస్తున్నది. రాముడు, 'సముద్రం చూద్దాం పదమ్మా' అన్నాడు. 'బాబూ, రేపు చూడవచ్చు. రేపు వెళదాం. ఇప్పుడు చీకటి పడుతుంది'. 'లేదమ్మా! ఇప్పుడే వెళదాం! నువ్వేమో ఏమీ మాట్లాడవే!' అన్నాడు.

'సముద్రంలో ఎవరురా మాట్లాడుతారు?'

'సముద్రమే!'

'అన్నా! అదా నీతో మాటలాడడం!'

'ఔను దానికి నేనంటే ఇష్టం. అది నన్ను పొగడేస్తుందిలే. రామ్మా వెళదాం' అని హఠం చేశాడు. పిల్లవాని యాష్టపోతే చాలులే అని తన భారం కూడ మోసుకొని సముద్రం వద్దకు వెళ్ళారు. అప్పుడే ఆకాశం ఎర్రబారింది. సముద్ర తీరానికి దక్షిణంగా దిక్చక్రం అంతా మసక మసక అయింది. సూర్యుడు ఎర్రగా ఆ మబ్బులనే ఇనుపవూచల పటుకారలతో పట్టిన ఇనుపముద్దలా గున్నాడు. తల్లి ముఖంచూచి రాము 'అమ్మా! నీ ముఖం అందంగా వుందా?' అన్నాడు. నాగవేణి నవ్వింది. పిల్లవాణ్ని చూచింది, వాని ముఖం ఎర్రగా బంగారులాగు, శాంతంగా నిమ్మకాయలాగు కనబడింది ఆ సంధ్యా స్వర్ణిమలో. 'నువ్వురా, సరిగ్గా మేలిమి బంగారు బొమ్మలాగున్నావురా!' అని లాలించింది.

రాముని మనస్సు బంగారు తరగలతో నిండిన సముద్రంవైపే వెళ్ళింది. 'అమ్మా, చూడు, ఎంతో బాగుంది' అన్నాడు. ఆ చిన్నారి అడుగులతో ఆ దృశ్యాన్నే కావలించు



కోవడానికే వెళుతున్నాడు. సముద్రం నీటిలో కాళ్ళను ముంచేదాకా వాని ఆశ తీరలేదు, తల్లి పరుగెత్తి వచ్చి 'ఏమిరా! సముద్రంలోకే వెళుతున్నావు? పడితేనా?' అన్నది. 'లేదమ్మా! ఎంతో అందంగా వుంది.........' అన్నాడు రాముడు మైమరచి.

ఇద్దరూ ఆ చల్లని ఇసుకపైన కూర్చున్నారు. పిల్లవాడు తన చెక్కిళ్ళను తల్లిచేతులలో నుంచి, ఆ సముద్రంలోకి దూకే సూర్యుణ్ని గమనిస్తున్నాడు.

ఆ బంగారుబొమ్మ వెనుక దిగంతందాకా ఒక బంగారు స్తంభమే వుంది. నాగవేణి సూర్యదేవునివైపే ధ్యానిస్తున్నది, పిల్లవాడు మరొకసారి 'అమ్మా, సూర్యుదెక్కడ?' అని అడిగాడు.

సముద్రం లోనికి దూరాడేమో?'

'ఐతే మళ్ళీ రాడా?'

'రేపు మళ్ళీ వస్తాడు, రేపు తూర్పుగట్టునుండి వస్తాడు—రాత్రి అంతా తిరుగుతాడు.

'అమ్మా; అయితే పెద్దవ్వా, చిన్నవ్వకూడ అల్లాగే తిరిగి మళ్ళీ రాగలరా? నీవు యాష్టపడద్దు—వాళ్ళు వస్తారు—నాకు తెలుసులే' అన్నాడు.

పిల్లవాని మాటలకు నాగవేణికి ఏడ్పు వచ్చింది 'అవును, జన్మలు తప్పవులే' అన్నది. పిల్లవాని కళ్ళు అక్కడే తూలుతున్నాయి. నాగవేణి మనస్సు అక్కడినుండి లేవ బుద్ధి కాలేదు. వెనుకనుండి చవితిచంద్రుడు తూర్పుకెక్కాడు.ఆ ఆవరణం చాల శాంతంగా వుంది. మనస్సులోని కలవరం మాయమయి, ఏదో సంతోషాన్ని, నవ్వులను తెచ్చి పెడ్తేలాగున్నది. నాగవేణేమో పిల్లవాడు భుజాలమీద నిదపోతుంటె, అల్లాగే తీసుకొని వచ్చింది; 'అరే, నాకుకూడ పిచ్చే! దేవునికి దీపమైనా పెట్టలేదే!' అనుకుని ఇంటికి వెళ్ళింది. ఇంటివెనుక ఇసుకదిబ్బకు వచ్చింది. కాలు తడబడింది; ఆమెకు ఎదురుగా ఎవరో నిలబడ్డారు.

ఇంట్లో చాలసేపు ఆమెను నిరీక్షించి చివరకు ఇసుకదిబ్బపై కూర్చున్నవారు నిలబడ్డారు—వాసుదేవయ్యగారే. కొద్దిగా ఆలస్యమైతే ఆ కోడి అంతా గాలించే వచ్చేవారు.

తమ్ముడు చెప్పగా నాగవేణి ఒంటిపాటు అర్థమయింది. తాను ఏమన్నా బిడ్డ వినదని తమ్ముడిప్పుడే చెప్పాడు. అన్ననేమో చూచి పొమ్మన్నాడు. వారు వకీలు వృత్తినిమానినా విశ్రాంతి లేదు. వారే కావాలని కొడుకులకు వేరు వేరు ఇళ్ళు చేయించి వచ్చారు. ముందు యుద్ధాలతో బతికి ఒకే ఇంట్లో వుండేదానికంటే సుఖంగా తమ తలవ్రాత కొద్దీ బ్రతికేది నయమని అలాగే చేశారు. అందరూ సుఖంగానే సంపాదించుకుంటున్నారు. అల్లాగంటే

తమదే దుఃస్థితి. వకీలువని పోగొట్టుకున్నారు. వున్నదంతా కొడుకుల కిచ్చేశారు. విరక్తు లయ్యారు. కొడుకులు రమ్మంటే వెళ్ళి వస్తారేగాని అక్కడే వుండిపోరు. ఒంటరిగా ఆలు మగలు కాలక్షేపం చేసేది కష్టమయింది. అందులో నాగవేణి దిక్కులేని దయిందని తెలిసి వచ్చింది—కాని వెంటనే వెళదామంటే తీరలేదు. నాగవేణి చెల్లెలు కృష్ణవేణి కాన్పుకు వచ్చింది. అక్కడ కొత్తగా మనుమణ్ని చూచి, ఈ కోడిగ్రామం మనుమణ్ని చూచి వెడదాం అనుకొన్నారు. ఆత్రంగా వచ్చారు.

'ఇంత చీకట్లో కూడ ఎక్కడమ్మా! నాగవేణీ!' అన్నారు. ఆమె భుజాలపై వున్న రాముణ్ని ఎత్తుకొన్నారు. 'సముద్రం చూద్దామని వెళ్ళాం. రామునికి ఎంత యాష్టవచ్చినా, సముద్రం చూస్తే హాయిగా వుంటుంది. అన్ని ఆలోచనలు మరుస్తాడు' 'ఇంక ఎన్నాళ్ళు ఈ తరంగాల లెక్కలు చేస్తుంటావు?' అన్నారు తండ్రి. బిడ్డ మరుమాటాడలేదు. తరువాత 'సరే! ఎప్పుడొచ్చారు!' అన్నీ విచారించింది.

'ఈ సాయంకాలం మోటారుదిగి ఇక్కడికే వచ్చాను. ఎనిమిదినాళ్ళ క్రితమే రావాల్సి వుంది. నీ చెల్లెలు కాన్పు, స్నానం తరువాతనే వచ్చాను.'

'అయితే కృష్ణ కాన్పు అయిందా? ఏమిబిడ్డ! బాగున్నదా?'

'మగపిల్లవాడు, ముద్దుగా ఆరోగ్యంగా వున్నాడు. అంతా తండ్రి పోలికనే. అతడూ వచ్చాడు. తనకు కాన్పసంగంటే ఎంతేనా అదుర్దా. తానే కంటున్నట్లు చేశాడు. తొందర, వట్టి తొందర.'

'అది చాలా పుణ్యాత్మురాలప్పా!'

'ఏమి పుణ్యమో! ఏమి పాపమో! ఒక్కొక్కసారి ఒక్కొక్కరికి పరీక్ష జరుగు తుంటుంది.' అని బిడ్డకు సమాధానం చెప్పి బయలుదేరారు.

ఇల్లు వచ్చింది. రాముణ్ని పక్కకోబెట్టేసరికి వాడు నిద్ర లేచాడు. తల్లి పిల్లవాణ్ని చూచి 'తాత వచ్చారు చూడరా!' అన్నది, 'తాతా! తాతా! అని వాని సగం కళ్ళతో చూచాడు. మైసూరుపాకుముక్కను ఒకదాన్ని వానికి అందించారు. తాత. 'నువ్వే తెచ్చావా? ఇందులో అమ్మ కే భాగం?' అన్నాడు రాముడు.

'అన్నీ నీకేనయ్యా! అమ్మకు వద్దు.'

'తాతా! అమ్మకు కావాలి, పాపం. ఆమె సరిగా భోజనంకూడ చెయ్యదు' అన్నాడు. తండ్రి బిడ్డముఖం చూచారు—'రామ! అన్నీ అబద్ధాలేనారా? నేను తిననా రా?' అన్నది. 'కొంచెమే కొంచెం, కడుపునిండా తినవుగా!' అన్నాడు.



వాసుదేవయ్య కూతురిముఖం చూచి, మళ్ళీ ప్రసంగం మార్చి 'నువ్వే తినరా!' అన్నారు. పిల్లవాడు మైసూరుపాకం తింటూ 'తాతా! బాగా రుచిగా వుంది. మీ ఇంట్లో ఎప్పుడూ ఇవే చేస్తుంటారా? సరే ఎప్పుడూ తెస్తుంటారా? చిన్న తాత జాత్రిలో కారంసేవు తెచ్చి ఇచ్చారు.' అని ఎన్నో చెప్పాడు. తల్లి సిగ్గుతో అక్కడ వుండకుండ వేరే చోటికి వెడుతూ 'అప్పా! అన్నం వండుతాను. వంటలన్నీ వున్నాయి.' అని వెళ్లింది. 'సరే వట్టి అన్నమే చాలు!' అన్నారు. వట్టి అన్నం ఎన్నడూ తిని ఎరుగరు. కాని బిడ్డ ఇంట్లో అంతకుమించి లభించదని గ్రహించారు.

నాగవేణి మెల్లిగా వంటచేసింది. అ రుబ్బురాతిని గబగబ చేసింది. కొబ్బెరకాయ ఒలిచి తురుగబోత పెట్టింది. ఆ వసంలో తన వంటఇల్లే కొత్తదిగా తోచింది. ఇన్నాళ్లూ దొరికింది వండుకుని తినింది. కావాలని వండుకోలేదు. నూరని కోడ లొక్కతి వచ్చి 'మీ నాన్న కూర్చున్నారే! రాత్రి తోడుగా పడుకోడానికి రానా వద్దా?' అన్నది. 'సరేలేవే పిల్లవాని జ్వరం తగ్గిందా చెప్పు' అన్నది. 'ఈపేళ తగ్గిందమ్మా! ఆ అమ్మ పోయించింది చాలు అమ్మా!' అన్నది. వెళ్లేలోగా మళ్ళీ 'అమ్మా, వారు కొడియలం (మంగుళూరు) రమ్మంటే పడలొద్దు' అని చెప్పి వెళ్లింది.

ఆ మొద్దుబారిన మనస్సుకు కూడ తండ్రి పిలుచుక పోవడానికి వచ్చారని స్ఫురించింది. బచ్చి వృపవేం పని కాబోలు, 'సరేలే వే. దేవుడు ఎలా నడిపితే అల్లాగే జరుగుతుంది. నా రాముని తర్వాత ఎల్లావుందో అలాగే కానీ!' అన్నది.

అంతలో వాసుదేవయ్యగారు 'నాగు, పిల్లవానికి నిద్ర వచ్చేలాగున్నది. ఆవులిస్తు న్నాడు. దానికైనా వడ్డించు. నేను తరువాత తింటానులే' అన్నారు. 'లేదు తాతయ్యా! ఇద్దరం కూర్చుందాము' అన్నాడు రాముడు. 'అమ్మా తాతకు ఏమైన చేశావా?—నేనే చెయ్యాలా? తాతా నాకు పుల్లచారు, మజ్జిగచారు, మజ్జిగపులుసు. అన్నీ వస్తాయి—చెయ్యనా?' అన్నాడు.

'అవును—నువ్వు మంచి తెలివిగల వాడివేరా! నీకు మైసూరుపాకు కూడ వస్తుందా?' 'అంటే', 'ఇప్పుడు తిన్నావే అది?' 'కాదులే! గట్టిగా చేసిన, కాదు అది గట్టినాం పలక.' అన్నాడు. (రాగులు రుబ్బిన పాలనుగాని, కుసుమలుకాని, గోధుమ రుబ్బిన పాలుగాని కాచి బెల్లంవేసి గట్టిగ వుడికించిన పిండివంట నాంపలక).

'సరేలే, నువ్వు చేస్తావా?'

'అన్నానికి బెల్లంవేసి చేశేస్తానులే.'

అంతలో ~~కృష్ణ~~ నాగవేణి భోజనానికి లేవాలన్నది. తండ్రి కొక్కటి, కొడుకు కొకటి విస్తరాకు ముక్కలు వేసింది. పూరగాయ వడ్డించింది. ఆకులో అన్నం వడ్డించింది. రాముకు ఇష్టమైన 'హోలబాయి- నాంపలక' వడ్డించింది. తండ్రి దాన్ని రవతో జేళారనుకున్నాడు. 'ఈ అవేళలో ఎందుకమ్మా ఇవన్నీ' అన్నారు తండ్రి- 'నాన్నా! కృష్ణి ఇంట్లో ఎన్నో పిండి వంటలు తింటారే? ఈ కాస్త పిండివేయించి తయారుచేస్తే కష్టమా! పిల్లవానికి చేసి చాల రోజులైంది.' అన్నది. రాముడేమో తన పిండివంటను కడుపార భుజించినాడు వాసుదేవయ్యగారు కూతురి శ్రద్ధకు తృప్తిపడ్డారు. బిడ్డ మమత వాత్సల్యం ఆ హోలుబాయి రుచికంటె ఎక్కువగా ఉంది.

'నాగూ నువ్వుకూడ ఆకేసి వడ్డించుకో' అన్నారు. ఆమె మళ్ళీ వట్టువట్టి తండ్రికి వడ్డించడంలో నిమగ్నురాలైంది. రాముడు తల్లితో ఆ మాటలు ఈ మాటలతో వంటింటికి వెళ్లాడు. ఆమె మిరియాలపొడితో తిన్నది. 'అమ్మ' నీకు నాంపలక'. 'తిన్నానురా!' 'అంతా అబద్ధం- తాతా అమ్మ వేసుకోలేదు. నువ్వు తెచ్చావేదాన్ని తెచ్చివ్వు' అన్నాడు.

వాసుదేవయ్య వంటింట్లోకివచ్చి 'అవునా! చేసిందంతా మాకే వడ్డించి వట్టి గంజి వార్చుకొని తింటున్నావా? అందుకేనా ప్రత్యేకంగా కూర్చున్నావు' అన్నారు. నాగవేణి నవ్వింది. 'మీరు తినింది చాలు, నాకు సంతోషం. మీ ఋణం తీర్చుకుంటానా ఎన్నిచేసినా?' అన్నది. వాసుదేవయ్యగారి మనస్సు కొరతవేసినట్లయింది. రామునితో 'సరే నువ్వు మళ్ళీ తిందువుగాని, ఇది అమ్మను తినుమను' అన్నారు. ఆమె తినకుండ 'వుండనీరా! నీకే రేపటికి వుంచుకో' అన్నది. రాముడు కోపగించుకున్నాడు - 'నువ్వే తినాలి. నీకవి ఇస్తే నేను ఏప్పటికీ తినను-' ఆ పిల్లవాని ఆనందానికి తినింది. 'రుచిగదరా!' అన్నది. 'లేవమ్మా నువ్వు చేశావే ఆ నాంపలక మరింత రుచి తీపి-' తీపి బెల్లం నున్నని వెన్నఅన్నీ అవే వానికి.

'ఇది అంగడితిండి కాదోయ్' అన్నది.

నాగవేణి భోజనం అయింది. చెరువుకు చేతులు కడుగుకోవడానికి వెళ్లింది. ఎంగిళ్ళు, అంట్లు అయినవి- పిల్లవాని కొక చాప పరచింది దానిపైన తాతగారి చివిగిన ఆకువచ్చ శాలువపరచి 'రామూ పడుకోరా, చాల చీకటయింది' అన్నది.

రాముడు 'అమ్మా! తాత కథలు చెప్పరా?' ఆమె. 'వారికేం తెలుసు కథలు గిథలు' అన్నది. 'నీకే తెలుసుకాదోయ్' అన్నాడు. 'నా కథమాత్రం నాకు తెలుసురా!' అన్నది. 'అమ్మా కాళ్లపై వేసుకోవే పడుకుంటాను' అన్నాడు. 'రారా నా తొడపై పడుకో' అన్నారు తాత. వాడు వారి పద్మాసనం తొడలపై ఒంటిని పర్దుకొని కాళ్లుచాచి పడుకున్నాడు. 'మీకు ఇక్కడ వేస్తాను' అని ఒక చాప, దానిపై ఖర్జూరం సంచిలోపెట్టిన దిండు పెట్టింది. వేరే బట్టలు లేవు అని నవ్వింది.



'రా, కూర్చో' అన్నారు తండ్రి నాగవేణిని. మాటల్లో 'చూడు, ఈసారి హఠం పట్టవద్దు. ఇక్కడ ఇంకెవరైనా అడ్డు మాట్లాడుతారా? అత్త, పెద్దత్త చచ్చారు. బిడ్డలు ఏ లగ్నంలో ఇల్లుకట్టారో! ఇల్లుపాడ్చి. అలికేవారుకూడ లేకుండపోతున్నారు. నీకు ఆ వ్యవసాయంగతి, పిచ్చి ఎందుకు? సరే. నువ్వు మట్టిలో దొరుతుంటే ఈ కొడుకుగతి చెప్పు? వానికి చదువే వద్దా? ఎందరో ఏవో కొలువుచేసుకొని సుఖంగా వుంటున్నారు. నేను చిన్నతనాన వున్నచోట సుఖం మోక్షముందేది. ఈ కాలంలో ఎన్నో అవసరాలు- మంచి డ్రెస్సు, మంచితిండి. షష్ఠి పంచలతో ఇకముందు రోజులు నడువవు' అన్నారు.

భవిష్యత్తును గురించి ఇద్దరికి తెలుసు. తన ప్రతివాదం పూరకే పట్టుదలకే కాని రామునికి నిష్ప్రయోజనమేనని నాగమణికి ఎప్పుడో తెలిసివచ్చింది. ముందు బతుకుంటే రామునికొరకే. వాని పడవ నడపాలి అన్నప్పుడు నాగమణి 'సరే ఏం చెయ్యమంటారు నాన్నా!' అని అడిగింది.

'ఏం చెయ్యాలి? నాకు ఇంట్లో పొద్దుపోదు. నాల్గునాళ్ల తరువాత కృష్ణవేణి వెళ్లిపోతుంది. ఇల్లు ఓన్నపోతే విరక్తిపుడుతుంది. కొడుకుల కాపురాలు బాగున్నాయి. మేమిద్దరూ బ్రతికినందుకు మీ ఇద్దరినీ పెంచుకున్న పుణ్యం దక్కనీ- వానిష్టమొచ్చినంత చదువుకోని. చదువుకున్నవాళ్లందరూ లచ్చనిలాగే అవుతారంటే, నేను మాత్రం అంగీకరించను' అన్నారు. అల్లాగే!' అన్నది. 'కానీ, ఇన్ని విడిచి ఎల్లాగుండేది చెప్పండి' అన్నది!

'ఈ ఇల్లు వాలికి మోసుకొని పొమ్మంటావా? ఆ భూమి నీదేమి కాదు. అంతా కట్టు గుత్తదేగదా! వాడన్నీ తిన్నాడు గదా!'' అన్నారు.

'అయితే గుత్తకు హక్కైనా మనదేగా!'

'ఆ గుత్త అన్నీ పోతే ఏమి మిగులుతుంది? ఈ భూమి ఎవరికైనా ఇస్తే ఇంట్లో ఎవరుంటారు?'

'ఏమైనా సరే తీరుగుత్త- అన్నారు బాబాయి! ఎప్పుడైనా ఆశపుడితే వచ్చివుండవచ్చు. రాముడు పెద్దవాడై తన ఇల్లు చూడాలంటే వుంటుంది గా. అందుకే పొలాలనుమాత్రం మన స్వాధీనం కౌలుకు ఇచ్చేసి, ఇల్లు మన అధీనంలోనే వుంచుకుందాం' అన్నది.

బిడ్డ మాటలకు మంచి విలువ వుంటుందని వారు నమ్మలేదు. ఆమెను నొప్పించరాదని 'సరే! అలాగే చేద్దాం' అన్నారు. నాగవేణి 'రాముడు, నాన్నా, ఈ సముద్రాన్ని చూడంది వుండదే. ఎల్లాగు' అన్నది. అందరూ నిద్రపోయ్యారు. నాగవేణి తలలోని సముద్రం కూడ శాంతించింది. ప్రొద్దునలేచి వాసుదేవయ్యగారు- 'ఈవేళే వెడదామా?

పొలాలు అవీ చాల తక్కువేకదా! నారాయణయ్య అన్నీ ఇంటికి తెప్పిస్తాడు. తన ఇంటి వాళ్ళకే ఎవరికో లోసంచు గుత్తకు ఏర్పాడు చేస్తారు. ఇంకేమైనావుంటే చెప్పు!' అన్నారు.

నాగవేణికి మళ్ళీ ఆ బచ్చిమాటలే జ్ఞప్తికి వచ్చాయి. బచ్చిని పిలిపించింది. 'బచ్చీ! మాకు ఇక్కడి ఋణం తీరిందనుకో! నాన్న వెంట రమ్మన్నారు. అలాగే నన్నానే' అన్నది. బచ్చికూడ 'అమ్మా! అదే మంచిదమ్మా. ఆ సరసోతమ్మా, మీ మామయ్య ఇక్కడి పొలంపై రక్తాన్ని చెమట చేశారనే నమ్మకంతో నువ్వు పిల్లవాణ్ని సతాయిస్తావు. తప్పు. వాని అదృష్టం బాగుంటే, ఎవరేం చేస్తారు? ఎక్కడుంటే ఏం?' అన్నది. తరువాత ఏమో ఆశతో 'మీకు స్వాధీన కౌలు అట. వదలకండి. ఎవరికైనా ఇచ్చేటట్టుంటే మా జ్ఞాపకం వుంచుకొండి' అన్నది. వాసుదేవయ్యగారు విన్నారు. బచ్చి మగణ్ని పిలిపించారు. వానికి అన్నీ ముందే తెలుసు. 'అయ్యగారూ! మీవద్ద లోగుత్తకే వుండనీ. బతాళుల సమయాన మీ రైతులే మేము. ఇప్పటికీ మీ ఋణం వుండనీ' అన్నాడు. వాసుదేవయ్య ఒకే మాటతో 'సరే' అన్నారు. వారి భారంకూడ తగ్గింది.

ఆ మధ్యాహ్నం భోజనాలయ్యాక అందరూ ఆ ఇట్లు వదలాలి. నాగవేణి కొడుకును చంకనెత్తుకొని తెలిసిన వారింటికి వెళ్లివచ్చింది. నరసింహమయ్యగారింటికి కూడ వెళ్లి వచ్చింది. సుబ్రాయ ఉపాధ్యాయుల భార్య 'సరే అవశ్యం కానీ' భగవంతుడే అన్నీ నడుపుతాడు అన్నది. వాసుదేవయ్యగారు ఇంటికి తొందరగావెళ్లి ముఖ్యమైన సామాను వేరుగా కట్టి పెట్టారు. తరువాత ఆవులు- కాళీ. కపిల, సరసోతి, పారోతులచంపి, కెంపి ఇంటిలో పెరిగినవి. వాటిని బరోడుకే పంపాలని నాగవేణి అభిలాష. సూరని పెద్దకోడలు బచ్చి, వాని కొడుకు కాళడు యజమానిని సాగనంపడానికి వచ్చారు. వారితో 'ఒరే నీవు అన్నీ శ్రద్ధగా చేసుకో. ఈ ఆవుల దూడలు నావిరా, మే మెప్పుడొచ్చినా గరిట పాలు త్రాగించాలి తెలుసా!' అన్నది

కాళిని, కపిలను బచ్చికి అప్పగించినప్పుడు నాగవేణికి చాల దుఃఖం కల్గింది రాముడుకూడ 'పసులు వారికేనా' అన్నాడు. 'వారు సాకి పెద్దగాచేసి నీకిస్తారటరా!' అన్నది నాగవేణి.

ఆ ఇల్లు వదులుతున్నామనే సత్యం వానికి బోధపడింది. వాసుదేవయ్యగారు బరోడుకు కూడ వెళ్ళివచ్చారు. 'రామ, రా, నాన్నా! వెడదాం మా ఇంటికి' అన్నారు. 'ఆ ఇల్లు వదిలించేస్తున్నా'రని రాముడు పెద్ద కేక పెట్టాడు. 'నేనూ వస్తున్నానురా! నా వాళ్ళందరూ వున్నారు' అని ఏమి చెప్పినా వ్యర్థం అయింది 'నాకు ఈ ఇల్లే కావాలి- ఇక్కడే వుంటాం' అన్నాడు. ఏడ్చాడు రాముడు. నాగవేణి చివరకు 'ఒరే మనం సముద్రం వెళ్ళి. గవ్వ చిప్పలు శంకులు తెస్తాం పదరా' అంటే వూరకున్నాడు. 'వాడు కొంచెం నెమ్మది అయినాక



సముద్రం తీరానికివెళ్ళి అన్నీ ఏరుకొనివచ్చి తరువాత 'ఒరే- ఇక్కడ నాకు భయం. తాతగారిల్లు చూచి వచ్చేస్తాము' అన్నది. 'సరే! మళ్ళీ రావాలి- వస్తాముగదా!' అని వాగ్దానం చేయించుకున్నాడు రాముడు.

ఆ దినం ప్రయాణం మొదలుపెట్టారంటే, వెనుకటికి కాశీయాత్రకు వెళ్ళినంత ప్రయత్నమే అయింది. గుండెనిండా దుఃఖమే. రాముడు చూచి మారాము చేస్తాడని కన్నీళ్ళను మింగుకుంది నాగవేణి- వేడి నిట్టూర్పు, లోని కన్నీటితో తడిసి చల్లబడాల్సి వచ్చింది. నది ఒడ్డుదాక బచ్చి, కాళడు, సుబ్రాయగారి ముసలి భార్యకూడ వచ్చారు. ఆమె పాదాలకు రాముణ్ని పడవేసి 'మామ్మ! వాణ్ని ఆశీర్వదించండి' అంటే, 'సరే! దేవుడే మేలుచేస్తాడు లెండి' అని ఆమె ఆశీర్వదించింది. ఆమె ఎదుట సరసోతి అమావాస్య స్నానం దృశ్యం కనబడింది. 'నాగు, ఆ మహాతల్లికూడ ఇలాగే ఆశీర్వదించింది- నేను ఆమెకంటె ఘనురాలు కాను. ఆమె సత్యమే నీ వెంట వుంటుందిలే. ఉద్ధారం అవుతాడులే. భయపడవద్దు. అన్నది.

నది సాయంకాలం బాగా వెల్లువతో ప్రవహిస్తున్నది. ఈవేళ కొంత తగ్గుముఖం పట్టిందేమో! నీళ్లు పిల్లవానికి తగులకుండ వాసుదేవయ్యగారు ఎత్తుకొని పట్టుకున్నారు నాగవేణికూడ నడుములలోతు నీటిలో నడుస్తూ బతాళుల ఇంటి పెంకుపెంకును గమనిస్తూ వెనుకకు మళ్ళిమళ్ళి చూస్తూ వెడుతున్నది. తమ ఇల్లు చెట్లమరుగున దాగుకుంటే, శీనయ్యగారు పెద్దవాకిలికూడ కనబడింది. తండ్రిగారి ఇల్లు చేరేలోపుగా ఆమె మెడ వెనుకకు తిరగటం మూలాన బహుశా వాపెక్కిందేమో!

నారాయణయ్యగారు నాగవేణిని, పిల్లవాణ్ని మరొక్కసారి కండ్లో దింపుకున్నారు. ఆప్యాయతతో చూశారు. రాముడు చిన్నతాతగారి మమతను, వాత్సల్యాన్ని మరువలేదు. అందరూ ప్రీతితో చూశారు.

ఆ రాత్రి నాగవేణి మనస్సుకు మాత్రం శాంతిలేదు. దుఃఖం కాదు. చీకుచింత కాదు. ఎన్నో చిక్కుపీడని యోచనలు చిలికేస్తున్నవి.

తన మామగారింట్లో జరిగిన ప్రతి సంఘటన కలగామారి చలనచిత్రంలాగా సాగిపోతున్నది. తన పుట్టింటి నేపథ్యం కూడ దాని వెనుకనే కలలో ప్రవహించింది. రేపు జరిగే సంగతులుకూడ సూచింపబడుతున్నవి. వెలుగు నీడలను, దివా-రాత్రాలను అన్నింటిని ఆ కలలలోనే కలిసిమెలిసి చూచింది. రాత్రి కలలోనే తన కొడుకును తడుముకుంది- ఉన్నాడో లేడో పరీక్షించుకుంది. వాడుగూడ తన పతిదేవునిలాగా, పారిపోతాడాయేం- అనే భయంకూడ గాబరా చేసింది. ఎన్నో విచిత్రమైన సందేహాలు! ఆ సందేహాలకు హద్దూపద్దూ వుంటేగా!

వాసుదేవయ్యగారేమో పిల్లవానితోబాటు మరునాడే మంగుళూరు వెడదామన్నారు. కాని నారాయణయ్యగారు తమ ఇంట్లోకూడ నిశ్చింతగా తినుకుంటూవుండని నాన్నాళ్లైనా వుండనిమ్మని కోరినడు. సరే తమ్ముని మాట మన్నించి, తన ముద్దులబిడ్డకు మరికొంత మనస్సు కుదుటబడాలనే రెండురోజులు అక్కడే వుండాలని నిశ్చయించుకున్నారు. ఆ సమయంలో రామునికి జతగాళ్లు దొరికారు. నారాయణయ్యగారి బిడ్డకూడ ఆడుకుంది. ఆమెతో వాడు పెద్ద మనిషిలాగు 'మీ ఇంట్లో సముద్రం లేదే' అని చెప్పాడు. అందుకొరకు నారాయణయ్యగారు హంగారకట్టెకు పిలుచుకొనిపొయ్యారు. అక్కడనుండి నదీ ముఖద్వారం అందంగా వుండేచోటు చూపించారు. సముద్రమే కావాలని రాముడు పట్టుపట్టాడు. రాత్రి ఇంటికివెళ్లాక 'ఇక్కడినుంచి సముద్రం రాదమ్మా! పెద్ద నది అడ్డ మమ్మా! దూరంనుంచే చూశాం. దగ్గరకు వెళ్లలేకుంటి మమ్మా' అన్నాడు.

నాగవేణికి తోచిందేమిటంటే వానికి సముద్రంపై ఆశ ఎక్కువగావుంటే మరొకసారి స్వగ్రామం చూచి రావలసిందే అని. 'మరొకసారి ఊరికెళ్ళి సముద్రాన్ని చూపుకొని వస్తాను. అన్నది. తండ్రికి ఆ సంగతి తెలిసింది. వారేమో "ఒరే! నీకు పెద్ద బెస్తలవల ఇప్పిస్తా' వేసుకొని పడవలో వెద్దువు కానీ. మంగుళూరిలో పెద్ద సముద్రం వుంది సుఖంగా రోజూ సముద్రం చూపెట్టుతానులే' అన్నారు. వారు చక్కగా నటనచేసి అన్నీ చెప్పేసరికి నాగవేణి మనస్సుకేమో వెక్కిరించినట్టు దుఃఖమయింది. 'వాణ్ని మీరే అలాగంటే, వాడు మంకు పట్టుపడితే మరీ కష్టం' అన్నది. 'ఏమీ లేదు లేమ్మా! మన ఇంటివద్ద వచ్చిపొయ్యే మోటార్లను చూపితే హాయిగా ఆడుకుంటాడులే. ఆ సముద్రం మరుస్తాడులే. వాళ్ల ఆశలే మమ్మ అన్నీ మూన్నాళ్లే' అన్నారు.

ఆమె నమ్మలేదు. తన కొడుకు సముద్రంపై ఆశను మరుస్తాడని కలలోకూడ నమ్మదు నాగవేణి. తనకుకూడ తన బ్రతుకులో అంతర్భాగంగా వుంటూ వచ్చాయి. సముద్రపు హోరు, కెరటాలు, సూర్యాస్తమయం అన్నీ.

రాత్రి గడచింది. తెల్లవారింది. నాగవేణి అనుకొనడానికి ముందుగ రాముడే లేచి 'అమ్మా, సముద్రం చూడవద్దన్నారా? ఇక్కడ నాకు చాల వేడిగావుందే' అన్నాడు. 'సాయంకాలం వెడదాం' అన్నది. మధ్యాహ్నం ఇంట్లో పిల్లలతో ఆడుకున్నాడు. మధ్యాహ్నం భోంచేశాక చూచి' ఆవులే లేవు' అన్నాడు. 'ఉన్నవిరా! ఆ సముద్రం దగ్గర కొండలో మేతకు వెళ్లాయి' అన్నది. 'సరే అక్కడికే వెళ్ళి చూద్దాం' అన్నాడు. 'అది మన వూళ్లోరా'. 'అయితే అక్కడికే వెడతా' నన్నాడు తల్లి. 'అక్కడ నీకు సరిగాకూడ తినిపించలేదు కదరా! ఇక్కడ హాయిగా లేదా? పెరుగు పాలు తింటావురా, మనం రేపు తాత ఇంటికెడితే ఇంకా మోటార్లు ఎక్కి తిరుగుతావురా' అన్నది. అన్నీ మోటారు కథలు చెప్పింది.



మరునాడే స్నానంచేసి ప్రయాణం చేశారు. వాళ్ల సామానులన్నీ నది దాటినవి. ఇంటి వాళ్ళందరూ వకీలుగారిని, వారిద్దరినీ విడిచి రావడానికి నదివద్దకు వెళ్ళారు. మోటరు వచ్చింది 'అదా మోటరు?' అని అడిగాడు రాముడు. 'నది అంచున నిలబడిందే. అది' అన్నది.

బాబు అందరివెంట నది దాటినాడు. ఆ నావలు అవీ చూస్తూ చాల వుల్లాసంగానే వున్నాడు. మోటరు అనుకూలంగా వుంది. నారాయణయ్య 'రామ, వెళ్లిరా, సెలవులలో రండి' అని చెప్పారు. 'సరే చిన్నాన్న' అని కన్నీళ్లు కారుస్తూ చెప్పింది. అంతలో అనుమానం. ఆ ఐతాళువ ఇంటనీరు తాగే ప్రాప్తం వుందో లేదో అని.

అందరూ మోటరులో కూర్చున్నారు. నారాయణయ్యగారు అన్నకు వీడ్కోలు చెప్పి సెలవు తీసికొన్నారు.

పగలంతా మోటారు ఎక్కేది, నదివద్ద దిగేది, మళ్లీ ఎక్కేది జరిగింది. రామునికి ఏమాత్రం విసుగు కాలేదు. నదులువస్తే వానికి పరమానందం. మంగుళూరిలో ఇల్లు చేరేసరికి సాయంకాలం అయింది. నాగవేణి వాళ్లమ్మ పిల్లను కౌగిలించి ఏడ్చింది. లోపలికి రమ్మని అన్ని వుపచారాలు చేసింది. పిల్లవాణ్ని శ్రద్ధగా చూచి ముద్దాడింది. కృష్ణ వాణ్ని తన గదిలోనికి ఎత్తుకొని వెళ్ళింది. నాగవేణి చెల్లెల్ని చూచి సంతోషించింది. పిల్లవాణ్ని చూపి 'ఒరే! నీ తమ్ముణ్ని చూడరా' అన్నది.

'నాతో ఆడుకోవటానికేనా' అన్నాడు రాము. 'అవును' అన్నది కృష్ణ. నాగవేణి చెల్లిని చూచి ఎన్నేళ్లయినవో, తల్లిని చూచి మూడేండ్లయినవి. ఆ చాలకాలం తరువాత చేరడం చాల విచిత్రమే. వాసుదేవయ్యగారి భార్య 'నాగూ పిల్లవానికి ఆకలేమో! పాలు తాగుతాడా!' అని అడిగింది. రాముడు అవునమ్మా తాతకు, నాకు, అమ్మకు అందరికీ ఆకలి!' అన్నాడు.

ఆమె త్వరగా అందరికీ వుపాహారం ఏర్పాట్లు చేసింది. వకీలుగారే రాముని కాళ్లు కడిగించి వంటింట్లోకి తీసికెళ్ళి పాలు త్రాగించారు. నాగవేణి చెల్లెలి ముఖమే చూస్తూ కూర్చున్నది. కొంచెంసేపు మౌనం వహించారు.

కృష్ణవేణి భర్త ఎందుకో లోనికి వచ్చాడు. లోపలున్నవారు ఎవరో తెలియనట్లున్నాడు. 'అక్క, నాగవేణి తెలియదా' అని పరిచయం చేసింది. ఆమెకు పట్టిన దుర్గతి కథగా విన్నాడు, ముఖపరిచయం లేదు. 'ఎప్పుడొచ్చారు? ఏమిటి?' అని విచారించాడు. నాగవేణికి ఏమి సమాధానం చెప్పాలో తోచలేదు.

తరువాత అన్న సదాశివుడు వచ్చాడు. లోనికి రాకముందే 'నాగవేణీ! అని బిగ్గరగా అన్నాడు. ఆమె లేచి నిలబడింది. 'బాబు ఏడీ!' అన్నాడు. 'తాత వెంటవున్నాడేమో!'

అతడు రాముణ్ని వెదకి చేతినిండ ఆట సామగ్రి నింపాడు. అన్న ముఖంకూడ అపరిచితమే అన్నట్లు నాగవేణి శ్రద్ధతో చూచింది. వైద్యుడు అన్నకూడ వచ్చాడు. ఆ సాయంకాలం వారి బంధువులందరూ వచ్చి ఆమెను చూచారు. అందరూ వానిపై కురిపించే ముద్దులు మరి పేరు వాణ్ని తికమక చేశాయి. తెలియని రాము సంతోషిస్తే, తెలిసిన నాగవేణి సంతోషం పట్టాలా? తాను ఇన్నాళ్లూ ఏమి పోగొట్టుకొన్నదో అవి ఆమెకు తెలిసివచ్చింది.

# 22

నాగవేణి పుట్టింటికి వచ్చిన కొన్నాళ్లు జాత్రలాగు సందడిగా జరిగింది. ఇదివరకు కృష్ణవేణి ప్రసూతి గృహంగావున్న పుట్టిల్లు ఆమెకు ఆతిథ్య గృహమయింది. కృష్ణవేణి పని పాపను ఎత్తుకొనేబదులు అందరికీ రామునితో ఆటలే విపరీతమైనవి. ఆమె ఇన్నాళ్లు వనవాసం చేసింది. ఇంట్లో అందరి దృష్టిలో ఆదర్శమూర్తిగా నెలకొనింది. ఆమె దుఃఖాల నెవ్వరూ చూచివుండలేదుగాని, విని వాడిన ముఖాలు ఈవేళ కరుణారసంతో వుప్పొంగి సంతోషంగా మారినవి. ఆమెకూడ తల్లికో, చెల్లికో కొంత శుశ్రూష వుపచారాలుచేసి పొద్దుపుచ్చింది. అన్నగారింటికి వెళ్లివస్తుంది. చిన్ననాటి స్నేహితురాండ్రు, సహపాఠులున్నారు. అమ్మవెంట సదాశివువింటికివెళ్ళి పిల్లలతో ఆడుకుంటూ వుంటుంది. ఆ ఆటపాటల నడుమకూడ తన భయంకర అనుభవం స్మరణకు వస్తుంటుంది. రాము తన అలవాటు ప్రకారం కొత్త అంగీని దాచుకుని సాలిగ్రామం తేరుకు వుంచుకుంటానంటే చివుక్కుమనేది. 'పరవాలేమరా ఎన్నో వున్నాయి బిత్తలు తిరుగవద్దు' అంటే వానికి ఆశ్చర్యం కలిగేది. ఒకనెలపాటు శ్రద్ధ, భోజనం అన్నీ కలిసి రాముని ముఖం రంగుమారింది. శరీరం దృఢంగా, పుష్టికరంగా మారింది. బాగా బలిసిన పెదవులను చెక్కులను ముద్దిస్తూ అమ్మ 'ఒరే నాన్న, నీకు ఈ ఆరోగ్యం లేకుండా తిండిలేకుండా చేసింది నేనేరా! పాపివి' అనేది.

ఆమెకు కూడ సుభిక్షమైన చోటే అది. తెల్లవారినుండి సాయంకాలంవరకు చాకిరీ, కసవు, పెండ, చేను, పొలంపనులు తప్పినవి. అక్కడ పనివారే అన్నీ చేస్తారు. మహా అంటే తల్లికి వంటలో కొంత సహాయం మాత్రం. తల్లికి బిడ్డ శరీరాన్ని నొప్పించే ఇష్టం లేదు. 'నాన్నాళ్లు కానీ. అన్నీ నువ్వే చేద్దువుగాని' అని చెప్పి విశ్రమింపజేసేది. చిన్ననాటి శరీరపటుత్వం, జిగి, నునుపు ఆమెలో వచ్చాయి. ముఖంలో కండవచ్చింది. 'ఇక్కడ బాగుందిరా' అని కొడుకుతో అంటే వాడు 'అవునమ్మా! హాయిగావుంది తాతగారింట్లో. మనింట్లో ఎవరున్నారమ్మా? ఇక్కడే వుంటామా?' అని అడిగేవాడు. ఒక్కొక్కసారి వాని మనస్సు మళ్ళీ ఆ పడమటి సముద్రాన్నే కోరేది. 'అమ్మా! ఇక్కడ సముద్రంలేదే, ఆటలకు స్థలమేలేదే!' అనేవాడు. 'అమ్మా మంగుళూరిలోకూడ సముద్రం వుందన్నావే!



ఏమైందమ్మా! అంతా అబద్ధాలు.' అన్నాడు. ఒకనాడు కాలేజీ గుట్టకు తీసికెళ్లి దూరం నుండి దృశ్యం చూపితే 'ఏమమ్మా! అదేమి గొంగడంతవుంది ఆ సముద్రం. నా సముద్రం చూడు ఎంతో బాగుంది. పెద్దది, జోరుగా వుంటుంది' అన్నాడు. ఆమె 'లేదయ్యా! దూరంగావుంటే అన్నీ చిన్నవే. సరిగా కనబడవు.' అన్నది. దానివల్ల వాని మోచేతిదాకా బెల్లం తగిలించిందే కాని రుచి కివ్వలేనట్లే అయింది.

'పోనీ లేరా! మామతోచెప్పి సముద్రవిహారం చేయిస్తా.'

'ఎప్పుడమ్మా.'

'వారికి తీరికగానీ'

'నువ్వూ రావాలి.'

'అల్లానే'

అల్లాగే రోజులు ఎదురుచూస్తుంటాడు. వకీలు సదాశివునికి తీరిక ఎల్లాగూ దొరకదు. ఆ పిల్లవాని ఆశ తీరదు. ఇక రెండునెలలకు మే సెలవులలోనే మళ్ళీ వూరు. అక్కడ సముద్రం.

కృష్ణవేణి పుట్టింటినుండివెళ్ళే ప్రయాణంలో వుంది. ఆమె వూరు మద్రాసుకు దూరంగా. ఒకసారి మగడు వచ్చిచూచి, మరొకసారి ఆమెను వెంట తీసికెళ్ళడానికి వచ్చాడు. మనుమణ్ని పూరంపే కార్యక్రమం వకీలుగారికి తగిలింది. వెళ్లేరోజు కృష్ణ 'అక్కా, నువ్వు నాల్గురోజుల కొక వుత్తరం వ్రాయాలి' అని చెప్పింది. నాగవేణి 'మీ వూరికి వస్తాను. వీడు కొద్దిగా మచ్చిక అయితే చాలు. చూద్దాం' అన్నది. రాముడు పెద్దవాడై తనకొక ఇల్లు ఏర్పాటుచేసేదాకా కట్టలమీద వేంచేసే ఉత్సవ విగ్రహాలలాగా, తాను అందరి ఇళ్లల్లోవుండి వుపచారాలు చెయ్యాలి, పొందాలి — అని ఆమెకు నమ్మిక కల్గింది.

ముఖ్యమైనదే గడ్డు ప్రశ్న. ఆమెకు కాలక్షేపమయ్యేదే కష్టం. తన ఇంట్లో చేతినిండా పని. ఇక్కడ కృష్ణవేణి వెళ్లాక అంతా ప్రశాంతం. రామునికి స్నానం చేయించే కార్యక్రమమే మహత్కార్యం. రేపు- తాతగారన్నట్లు జూన్ నెలకు ఐదేళ్లుదాటాక బళ్లోవేస్తే, ఇంట్లో పెంకులు ఎంచుకోవాలి. అంతే. వకీలుగారు కోర్టుకు వెళ్లకున్నా, కుమారుని ఇంటికెళ్లి కక్షిదారులకు తగిన సలహాలనిచ్చి కుమారునికి అనుకూలం కల్గించేవారు. విశ్రాంతిలో స్నేహితులవెంట వెళ్ళేవారు. సాయంకాలం ఇంట్లోనే మఠంలాగు భక్తులు, విరక్తులు చేరేవారు. యోగులు, సిద్ధుల పటాలను తగిలించి గదిలోనే పూజలు, భజనలు, యోగాలు అన్నీ వడపించేవారు. వెనుకటికాలం జపాలు, పూజలకంతా చక్రవడ్డీ చెల్లిస్తున్నట్లున్నారు. ఇంకా తీరిక వేళల్లో రామకృష్ణపరమహంస చరిత్ర, సువార్తలు, ప్రవచనాలు, భగవద్గీతలు పఠించేవారు, వారికి భక్తియోగం హృదయంలో ఆహ్వానం పొందలేదు. ఇక తమ వృత్తిలోకూడ సంపూర్ణ తృప్తిని చెందలేదు. నాగవేణి మరీ అధ్వాన్నం. దేవునికి దీపం మాత్రం వెలిగించి వచ్చేది. ఆ కాలంలోకూడ సరసోతిలాగు జపాలెన్నడూ చెయ్యలేదు.

ఆ మధ్యన రాముడు తాతముందు-బల్లిభక్తు డౌతాడు. వాని చేతికి తాళాలు దొరికితే బాగా గంటసేపు భజన చేస్తాడు. ఆటలలో పడితే భజనమాని మూడునిమిషాలకే బయటికి వస్తాడు. తమ వూరి వాతావరణంనుండి కొత్త వాతావరణంలోకి తల్లి, కొడుకులు సర్దుబాటు చేసుకోలేక పోతున్నారంటే ఆశ్చర్యం కాదు. ఒక్కొక్కనాడు నాగవేణి 'రారా!, మంజునాథ గుడికైనా వెడదాం. ఇంట్లో కాలక్షేపం కావటంలేదు' అన్నా అంటుంది. తరువాత గుడిపక్కనున్న గట్టు లెక్కి దూరంనుండి సముద్రాన్ని చూపించేది. నాగవేణి తల్లిమాత్రం గుడిలోనే వారిని నిరీక్షిస్తూండేది. తరువాత అందరూ చేరి ఇల్లు చేరేవారు. వకీలుగారి భార్యకు ఎందరో స్నేహితురాళ్లు. రాముణ్ని వెంటబెట్టుకొని అందరిండ్లకూ వెళ్లి పొద్దుపుచ్చివచ్చే అలవాటుంది ఆమెకు.

దినాలు గడచేకొద్ది నాగవేణికి ఎందుకో బదుకే భారమయింది. తీరికలో కొంత చదువుకోవాలని నిశ్చయించుకున్నది. ఆమెకు ఇంగ్లీషు చదువు పాతబడ్డది కొంత సహాయపడింది. ఏదో ఒక ఇంగ్లీషు కథ తీసికొని చదివింది. అంత లాభం లేకపోయింది. తొలినాడే మంగళం పాడింది ఇంగ్లీషుకు. తండ్రిగారి నిత్యపారాయణం గీతను తీసింది. కన్నడం లిపి సులభమే. బాగా చదివేసింది. అందులోని అక్కడి ఇక్కడి ఒకొక్క అభిప్రాయం ఆమె హృదయానికి హత్తుకున్నవి. తండ్రిలాగు మడికట్టుకొని ఆద్యంతం చదువాలని పట్టుపట్టలేదు. 'నేనెందుకు భక్తి వంచితురాలయ్యాను? పోతోతి, సత్యభామ, పరసోతులుకూడ ఎంతో భక్తిని అలవరుచుకొనివుండిరిగదా! ఎందుకో నాకు తీరికమాత్రం పుష్కలంగా వున్నా భక్తి కుదరటం లేదు.' మళ్లీ కథలు, నవలలు ఇష్టమయ్యాయి. స్నేహితురాళ్లనుండి ఎన్నో నవలలు తెప్పించుకుని చదివేసింది. కొంత అభ్యాసంచేసి ఇంగ్లీషునుకూడ కొంత అందగా జేసుకుంది. ఒక్కొక్క పుస్తకం చదివాక 'వీరంతా మనుషులేనా' అని ఊహించేది. ఇంకొకదాన్ని చదివి 'మా జీవితనం దీనికంటే ఏం తక్కువగాదులే' అని స్మరించింది. తన విశాలహృదయం మూలాన తాను చదువుతున్న నవలలపట్ల తన నిశిత విమర్శకూడ చేస్తుండేది నాగవేణి. రామునికి కొన్ని ఘట్టాలను వినిపిస్తూ తన యాష్టను అప్పుడప్పుడు పోగొట్టుకునేది. కాని రాముని సహజమైన అభిలాషే వేరు. కథ ముగింపుకైనా 'అక్కడ ఒక సముద్రం. చాల పెద్దదిలే' అని ఎన్నో వర్ణిస్తేనేగాని వాని తనివి తీరదు. సమయం గడుస్తున్నది.

సుఖమో, విసుగో మొత్తంమీద తమ తమ హద్దుపద్దులలో కాలం గడిచిపోతున్నది. పుట్టిల్లుచేరి నాల్గుమాసాలయ్యాయి. జూను రానే వచ్చింది. ఒకనాడు తాత 'రామ! బడికెడతావు కదా:' అని పురమాయించారు. రామునికి ఇంట్లో కూర్చుని చాలయింది. తమ తోటివారు మాలతి, చిదా మొదలగువారితో ఆడుకున్నా ఆశ తీరలేదు. అందుకే బడికి తాతగారు కొన్నాళ్లు వదలిపెట్టి వచ్చారు. 'ఏమమ్మా ఏమిబడి అమ్మ! ఎక్కడేసిన గొంగడి అక్కడే లాగున్నది. అందరూ ఏమీ పలుకకుండ మూగలుగా కూర్చుంటారు' అన్నాడు. మరునాడు చిదానంద స్వయంగా వచ్చి 'రామా రారా!' అని పిలిస్తే కొందరైనా తోడుగా వుంటారనే ఆశతో కొత్తచొక్కా వేసుకుని తానే వెళ్లాడు. ఒకే నెలకే రాముడు తాను స్వయంగా రెండుపూటలూ బడికి వెళ్లివస్తాడు. తన సంచి తానే తీసికెడతాడు. వానికింక విసుగే లేదు. తల్లికిమాత్రం వాడు బడినుండి వచ్చేదాకా యాష్ట కొచ్చేది. రాముడు ఇంటికివస్తే వస్తాడు. లేకుంటే మేనమామ సదాశివునింట్లో మధ్యాహ్నం భోంచేస్తాడు. వాళ్ల ఇల్లు బడికి దగ్గర. సరే ఎల్లాగు పిల్లవాడు సర్దుకుంటే చాలని నాగవేణి అభిప్రాయం. సాయంకాలం వాడు వస్తే వాని కాళ్లు కడిగి 'ఏమయిందమ్మా బడిలో ఏమేం చేశావు?' అంటుంది. వాడు ఎగిరింది, దూకింది, ఇంకేమైనా సాహసకృత్యాలుంటే చెబుతాడు.



ఇప్పుడు తీరికలో నవలలు చదువటంకూడ భారమే అయింది. వేరే గతి లేదు. విశ్రాంతి, చదువుల మధ్యలో ఆమెలో నిద్రాణమైన అనేక శక్తు లుప్పవిల్లినవి. తనకూ మగ డున్నాడు. తనకు ఈ గతి వానివల్లనేగదా వచ్చింది. ఎందరో ఎల్లాగో కాపురాల్లో సుఖంగానే వున్నారు. ఈ మగనినుండి తన కాపురం మట్టి పాలయింది. పాతికేండ్లకే ఇంత బాధ. ముందెంతో బ్రతుకాలి. ఒక సంవత్సరమేమీగాదు. ఎన్నేళ్లో!'—అనుకుంటూ పుటలు తిప్పి మరొకళ్ల జీవిత చరిత్రపై విమర్శచేస్తూ తృప్తిపొందుతుంది. తనకేమో అంతా శూన్యం. ఒక కొడుకున్నాడులే; వాడుకూడ తాతగారి దయాధర్మంలో పడ్డాడు. తన గతియేమో! వాని ముందు గతియేమో!

ఈ చింతలలో ఆమె బ్రతుకే దహించుకుపోతూ వాడు పెద్దవాడయ్యే నాటికల్లా బూడిద అవుతానేమోనని భయపడ్డది. కాని ఏ పనీలేకుండ మరొక్క పాతికేళ్లైనా జీవించే దెల్లాగు.

ఈ విచిత్రం తీరని సమస్య. తనకు తానే సమాధానం తెచ్చుకుంది. 'శద్రి'లో ఒక స్నేహితురాలింట్లో సంగీత సమాజాన్ని స్థాపించారు. ఎవరో ఒక ఫిడేలు (వయోలిన్) గాయకుడు చాల చక్కగా వాయిస్తాడట. దాన్ని వినటానికి సదాశివుడు వెడుతాడట. వాళ్లింటివాళ్లంతా వెడతారు. చెల్లెలు ఏదో తలవంచుకొని ఎందుకు కూర్చోవాలి, కొంత మార్పునిస్తామని అతడు ఆమెను వెంటబెట్టుకొని వెళ్లాడు. ఆమె ఏ తీరిక వుద్యోగానికైనా సిద్ధమే. తానుకూడ చిన్ననాడు కొన్ని పాటలు వాయిస్తుండేదని ఆనాడు జ్ఞప్తికి వచ్చింది. కానీ అన్నీ జ్ఞాపకం లేవే. కాని పూరకేవస్తే తప్పేముంది—అని రాముడు చిదానందుని వెంట అక్కడికి వెళ్లే ఏర్పాట్లు చేయించింది. ఆ ఇంటికి నూరుగజాలలోనే వుంది ఆ మిత్రుల ఇల్లు. అది సదాశివుని మిత్రుడు మోహనరాయని ఇల్లు.

ఇద్దరికీ వకీలుపనే. వారి వకీలు స్నేహితుడే సంగీతం కూడ అభ్యాసం చేస్తున్నాడు. వూరకే వినోదానికి సంగీత కచ్చేరి ఏర్పాటు చేశారు. నాగవేణి సభకు చేరేవరకే ఆ సంగీతజ్ఞులు ఫిడేలు చెవులుపిండి శ్రుతిని పెడుతున్నారు. ఆనాడు మాత్రం మాటలు, పరిచయాలు లేకుండా సంగీత కచ్చేరీ ప్రారంభమైంది. ఆ సంగీతజ్ఞులకు పాటలు రావని కాదు. నోటిపాటకూడ వాద్యం వెంట అప్పగించారు. ఆడవారు ఒక ప్రక్కన కూర్చున్నారు. కొంత

కాలానికి వ్రేళ్ల నృత్యంతో తీగెలనుండి దివ్యమధురగానం ఇల్లంతా ప్రతిధ్వనించింది. రాగాలపై రాగాలు పోటీతో వాయించారు. తెలిసినవారేమో 'చూడు అది బిలహరి, సావేరీ, ఖమాసు, బేహాగు, ఇది దక్షిణ రాగం' అంటూ గొణిగినారు. కొందరేమో తోడిరాగంతో చేతి తీటను తీర్చి దిద్దుకున్నారు. మూడుగంటలు ఆ కచేరి సాగింది. ఇంతలో 'వంట చెయ్యాలమ్మా' అని ఆడవాళ్లు సగంలో ఇళ్లకుకూడ వెళ్లినారు. ఆరుమంది మాత్రం బొమ్మరాళ్లలాగు కూర్చున్నారు. నాగవేణి కూడ చెవులున్న బొమ్మగా ఆనందించింది. తన భూత భవిష్యత్తులు అనే సంగతులను ఆ రాగాలకు జతపరుస్తూ, మేళవిస్తూ కూర్చున్నది నాగవేణి. సముద్రం, కాలువ, నది, తరంగాలు, గాలి, సుడిగాలి, చావులు, సంకటాలు, రోగాలు, కోరికలు అన్నీ ఆ రాగాలాపనలనే నౌకలలో కూర్చుని ఎక్కడికో దొర్లుకుంటున్నాయి. కళ్లు అరమోడ్పు కళ్లయ్యాయి. రాముడు ఎప్పుడో వచ్చాడు; తల్లి తొడపై కూర్చుని తల్లికి అనుకుని పడుకున్నాడు.

అందరూ కరతాళ ధ్వనిచేస్తే కచేరి ముగించారని తెలిసింది. నాగవేణి కలలోనే లేచింది. కాళ్ళపైన రాముడున్నాడని అప్పుడు తెలిసివచ్చింది. 'బాబూ ఎప్పుడొచ్చావు!' 'అప్పుడే' అన్నాడు. అందరూ ఇండ్లకు వెళ్లారు. నాగవేణి అందరిలాగు వాద్యగాళ్లకు నమస్కరించి వెళ్లింది. సదాశివుడు, 'ఎల్లాగుంది నాగు! సంగీతం!' అన్నాడు. అతడు ఇంటికివెళ్ళి మళ్లీ వచ్చాడు. నాగవేణి 'నాకేం తెలుస్తేనా! మొత్తంమీద బాగుంది.' ఆమె మనస్సు ఏమీ చెప్పజాలకున్నా ఆ రాత్రి సంగీతం లోతుపాతుల్లోకే దిగింది. ఇంట్లో తండ్రితో తృప్తిగా నిట్టూర్పు విడిచి, 'చాల యోగ్యులప్పా! వారు' అన్నది. 'వారు ఫిదేలు వాయిస్తుంటే భూమి మీద లేనట్లే' అగుపడ్డారు.

తండ్రిగారు బిడ్డకొరకే భోంచేయకుండా వేచివున్నారు. సదాశివుడు 'నాన్న నువ్వు వస్తే చాల బాగుండేది. ఇందాకా ఈ వూళ్లో అల్లాంటి సంగీతమే వినలేదంటే నమ్ము' అన్నాడు. 'అదేమోరా!, గంటకే తల నొప్పేస్తుందిరా' అని తండ్రి అంటే 'అవునులే నాన్నా! మీ భజనలకు రాత్రి అంతా మేము ప్రశాంతంగా వుండమా!' అని నవ్వాడు. 'మీరేమిరా కుర్రాళ్లు అన్నీ అదుపులో వుంటాయి' అన్నారు.

సరి, సదాశివుడు రాత్రి అక్కడే భోజనానికున్నాడు. భోంచేస్తూ 'నాన్న ఈ నాగవేణి వూరకే పొద్దుపోక విసుక్కుంటుంది. ఆమెకు కొంత సంగీతం నేర్పుదామా!' అన్నాడు. ప్రక్కన ఆమె భోంచేస్తూ అన్నను చూచింది. ఆమె హృదయం దాన్నే కోరింది. 'కాని ఇక్కడ బాగా నేర్పేవారు లేరే!' అన్నాడు. నాగవేణి 'వాళ్ల నోటిపాట వింటే అలాగే అనిపిస్తుంది' అన్నది. భోజనం అయ్యాక అందరూ వెళ్లారు.

నాగవేణి రాముణ్ని ఎత్తుకొని తన గదిలోవెళ్లి పడుకుంది. రాముడు నిద్రలేచి 'ఎవరమ్మా ఫిడేలు వాయిస్తా' అని అడిగాడు. కొడుకు అడిగిన ప్రశ్నకు ఆమెకు నవ్వు వచ్చింది.



ఆమె 'ఏమిరా! బాగా లేదా? ఏమీ! నీకు అర్థమయిందా?, నీకూ విసుగు వచ్చిందా?' 'అమ్మ, నేనేమో నీ తొడపై కూర్చున్నాను. నాకేమో మన కోడిగ్రామం ఇల్లు, తోటలు, సముద్రం హోరు అన్నీ వినిపించాయి. నేనసలు సంగీతమే వినలేదు లే.' 'ఔను లేరా! అయితే నువ్వు అవే చూశావా!' అన్నది. 'అమ్మా మనం ఎప్పుడే ఆ వూరు వెళ్ళేది?' అన్నాడు. 'నీవు చదివి పెద్దవాడయ్యాకరా' అన్నది. 'అమ్మా నువ్వుకూడ నేర్చుకోవే. వాయిద్దువు కాని' అన్నాడు.

తరువాత రాముడు వూరకే తల్లి మొగంకేసి చూశాడు. తల్లి ఏమీ అనలేదు. 'పడుకో. రేపు ప్రొద్దున బడికెళ్లాలి,' వాడు పడుకున్నాక వాని పంచనే తాను పడి నిద్దరపోయింది. తరువాత మరునాటి సాయంకాలందాకా ఆ రాగలహరి తన జీవనతరంగాలతో మేళవించుకున్నది. తన నిద్రయేమో కలలోని నౌకా విహారంలాగా అనిపించింది నాగవేణికి. నిద్ర అనే వుయ్యాలకు, గానం జోలపాటలాగు మంచి విశ్రాంతి, చైతన్యం ఇచ్చింది. అల్లాంటి ఉల్లాసాన్ని ఆమె ఏ యుగాన అనుభవించి వుండినదో ఏమో!'

ఆ రోజు నుండే నాగవేణికి కూడ తప్పక సంగీతం నేర్వాలి అనే ఆశ పుట్టింది. తన పెళ్లినాట ఏమి నేర్చుకుందో అంతా అట్టడుగున పడివుంటుందేమో! ఎల్లాగో కొంత ఆనందంతో పొద్దుపుచ్చవచ్చునని తండ్రితో ఆ ప్రస్తావన చేసింది. కూతురేమో ఎనిమిది నెలల నుండి చుక్కలనే లెక్కపెట్టి కూర్చుంటే నాన్నకు సమాధానం లేదు—అందుకే అతడు 'అమ్మా! దేవునిముందు ఘడియసేపు కూర్చోమ్మా. అంతా మనశ్శాంతి కలుగుతుంది' అన్నారు. ఒకనాడు భజనకు కూర్చుంది. ఎదుట నేమో భగవద్విగ్రహం—హృదయంలో నేమో ఆ కోడిగ్రామంలోని ఆళువ (వాగు) నీటిప్రవాహమే. దానిపైకి రాముని భవిష్యమనే క్రొక్కారు మెరుగుమాత్రం కనబడేది. ఒకనాడు ఆమె 'బుద్ధి స్థిరం లేకుంటే తాళాలు పనికిరావు, తంబూర పనికిరాదు.' అనాల్సి వచ్చింది.

ఆ మాటలు అదేసమయాన 'తాళాలు పట్టలేనిది, తంతి వాద్యం వాయిస్తుందా' అని అంటారేమో అని భయంకూడ వేసింది,' కాని ఆ ఫిదేలు కచ్చేరి నిజంగా కొత్తది. దాన్ని నేర్వాలనే వుత్సాహం ఆమెను లాగుతున్నది.

అందుకే ఫిదేలువాద్యం నేర్వాలనే సంకల్పించింది. నోటి పాట కూడ వుంటే వాద్యానికి తోడుగా వుంటుంది. మంగళూరిలో పాఠం చెప్పే సుప్రసిద్ధులు సుబ్రాయ వుపాధ్యాయులు. అతడు మూడుకాళ్ల ముసలివాడు. తన కేమాత్రం గర్వమే లేదు. నేర్పే వగలుకూడ లేదు. 'నాకు వచ్చింది చెబుతాను' అని వినయంగా చెబుతాడు. 'ఇష్టం వచ్చిందే నేర్పండి' అంటాడు. చిన్నతనాన 'అమ్మా! నాగూ! సాధన లేనిది సంగీతం అబ్బినా!' అనేవాడు. అప్పుడు దెప్పే గురువుగారే ఇప్పుడు నవనీతహృదయు లయ్యారు. ముదిమి, పేదరికం రెండూ సంగీతజ్ఞుల ఆప్తమిత్రులు. అందుకేనేమో వారి విద్యకూ

ముదిమిబట్టింది. నాగవేణి నేర్వాలని పురోగమించింది. రాముడు లేనప్పుడే ఆమె చక్కగా సంగీతం నేరుస్తుంది. ఆ తంతెలు ఎంత మీటినా రాగం రాకుంటే 'అవునులే! పుల్లల్లో పెట్టేదాక మనకేం సంగీతమేం' అని విరక్తి చెందేది. ఒక్కొక్కసారి తన ఫిడేలు భీకర, కర్కశధ్వనుల నిస్తే ఆపి బయట ఎవరైనా వున్నారేమో అని చూచి వచ్చేది. గురువుల వద్ద కొంతసేపు సంగీతం నేరుస్తుంది. మరింతసేపు వారింటి సుఖ దుఃఖాలు తెలుసుకుంటుంది. వారి బిడ్డలు, భార్య, రోగం, రుణం, అన్ని తాపత్రయాలలో తాను మునుగుతుంది. 'అమ్మా! ఈ సంసారం ధ్యాసలో పడితే ఈ తీగలు తెంచిపోవాలనే వుంటుంది.' అనేవారు గురువులు.

ఆ మాటలు విన్నాక రాత్రుళ్లు ఆమెకూ సరిగా నిద్ర పట్టదు. తన సంసారయాతనలు మరువాలని సంగీతం నెపం వెదకితే గురువుగారి సంసారయాతనలో మునుగాల్సి వచ్చిందే అనే చింత తగిలింది. 'ఆ రాత్రి విన్న సంగీతం మాత్రం సుబ్రాయగారి జీవనరాగం కాదే. సంసారంపై విరక్తి నివ్వలేదే!' అని వదులుకుందామనే సంగీతానికి మళ్లీ వెళ్లింది.

మంగుళూరిలో జడివాన, చిటపట చినుకులు నాల్గునెల్లు; తరువాత వడగాడ్పులు. సుడిగాలులు ఎనిమిదిమాసా లుంటాయి. అల్లాగే ఆ గాలులే నీటికి విష మయ్యే లాగా నేలలో వూట లూరేదాకా వానగొట్టేస్తాయి. ఆమె మనస్సు అన్నీ బాధలు పడ్డది. ఆ ఒడుదుడుకులతోనే తన సంగీతాభ్యాసం నడిపించింది. మొదలుపెడితే గంటలకొద్దీ ఒకనాడు — లేకుంటే దినమంతా ఏమీ చెయ్యదు. ఆమె వుదాసీనభావాలు చూచి, సుబ్రాయగారు తమ వేదాంతాన్ని కట్టిపెట్టారు. 'అమ్మా, ఏమైనా సరే! సంగీతం వదలకండి. అది దేవతల విద్య, గంధర్వకళ. అవమానించకండి' అనేవారు. ఆమె మళ్లీ వ్యాసంగం చేసేలాగ ప్రోత్సహించేవారు.

రామునిరాజ్యం క్రమంగా పెద్దగయ్యింది. వాని కిప్పు డెందరో స్నేహితులు. ఆటలు పాటలు ఎక్కువైనాయి. ఆ కాలంలో వాని దిగంతం కేవలం అమ్మతో నిండి వుంది. ఇప్పుడు దానిలోకి తాత, అవ్వ, ఎందరో స్నేహితులు చేరారు. తల్లిప్రభావం తగినంత తనపై తక్కువయింది. కానీ ఆమెపై మమకారం ప్రీతి తక్కువ కాలేదు. ముద్దు మాటలతో 'అమ్మా!' అనే శబ్దంలో అమృతం ఇంకా తొణికిసలాడుతునే వుంది. కాని వయస్సుకు తగిన ఆటలు ఇతర పనులకు కూడ తగిన గౌరవం ఇస్తున్నాడు.

మంగుళూరైతే ఏమి —— కూర్చున్నచోటనే కూర్చుని వుంటే తిని పెరిగే వారికి వింత లేమీ వుండవు? అదే ఆవరణం, స్నేహితులు, అదే వేదన తప్పవు. నాగవేణి వచ్చి ఏడాది దాటింది. రెండు మూడేళ్లు గూడ అయ్యాయి. 'కోడి' కాలంలో ఇంటి పనులతో గడిపితే ఇప్పుడు సంగీతంతో పొద్దుపుచ్చుతుంది. రాముని సమయము ఆటపాటలు, బడిలో ఖర్చవుతుంది.



రాముడేమి గొప్ప. అందరిలాగా వాడు - చిదానంద, అక్కజలు వానికంటె ఆటలలో చదువుల్లో కుశలత చూపారు. తాతకూడ అందరినీ సమానంగా చూస్తున్నాడని తెలిసింది. వానిలో వుండే విశేషం ఏమిటంటే ఎక్కడబడితే అక్కడ గీతలతో నింపి ఏవో పిచ్చి బొమ్మలు తయారుచేసి చెప్పేవాడు. అమ్మను పిలచి 'చూడు, ఇది సముద్రం, ఇది నావ' ఇది వాన, ఇది గాలి, చంద్రుడు, మేఘాలు' అని ఏవేవో గీచి చూపేవాడు. తరువాత 'చెప్పమ్మా! బాగుందా?' అంటాడు. అమ్మ 'వద్దురా గోడలు పాడుచెయ్యకు. బాగుండదు అంటే—'పోమ్మా! పెద్ద సముద్రాన్ని పెద్ద గోడమీదే గియ్యాలి. అంతమాత్రం తెలియదా నీకు' అద మందలించేవాడు. 'ఈ పలక, ఈ నేల, ఈ బండలు కేవలం కాలువలు గీవడానికే చాలవమ్మా' అనేనాడు. పిల్లల సంభాషణలకు తొలిలేదు, కొనలేదు — నాగవేణి వానితో ఎంత వాదిస్తుంది!

కాని ఆమెకు బోధపడిం దేమంటే ఆ పిల్లవానికి చిన్ననాటినుంచి సముద్ర దృశ్యం అనే పిచ్చి కుదురలేదని. సముద్రంతో మొదలైన తమ జీవితగాథ సముద్రం వద్దనే అంతమొందాలని కూడ వూహించుకుంది. వానికి సముద్రం కథలే రుచిస్తాయి. 'పోరా! పో! నీవు వెనుకటిజన్మలో ఒక పెద్ద బెస్తవాడురా. అంతా చేపలవేటకే లాయకు' అని నవ్వింది. రాముడు దాన్ని విని రేగి 'నేనేం వలవేస్తా ననుకున్నావా? నాకు చేపవద్దు—వల ఎన్నటికీ పట్టను' అన్నాడు.

నాగవేణి మంగుళూరిలో వుండేరోజుల్లోనే వాసుదేవయ్యగారు కొన్నిసార్లు ఐరోడికి వెళ్ళి నాల్గునాళ్ళకే తిరిగి వచ్చారు. ఒకసారి వారివెంట తానూవెళ్ళి వూరు చూచుకొని వస్తే బాగనిపించింది. ఆశను వ్యక్తంచేసే దేలాగు? 'కాని కోడిలో నిలబడి ఏం చెయ్యగలదు. మూడు నాల్గేళ్ళనుండి కొడుకుకు నోటి తురతుర లేదు. పేదరికం కనబడదు. వాడు సుఖంగా వున్నప్పుడు మళ్ళీ ఆ కోడిపై ఆశవద్దు—అన్నీ—ఆకష్టం చెమటలు అన్నీ తనకే వుండనీ పోనీ' అని అనుకుంది మళ్ళీ. కోడి వదిలేరోజు తాము మళ్ళీ వెనుకకే వద్దామనుకున్నా కొడుకుకు వచ్చని పాన్పు దొరికింది పోగొట్టరాదని తీర్మానించుకుంది. తాను స్వయంగా బాబుకొరకు తన కోరికలను మరువాలని యత్నించింది.

వానికి పదేళ్లు నిండినాయి. ఐరోడులో నారాయణయ్యగారి బిడ్డ పెండ్లికి వాసుదేవయ్యగారు వెడితే ఆమె వెళ్ళకుండా వుంటుందా? ఇంటికి యజమానులుగా వాసుదేవయ్యగారిని తప్పితే ఇం కెవ్వరుంటారు? అందుకే ఎండకాలం సెలవులలోనే లగ్నం ఏర్పాటయింది. వారు ఇల్లాంటి ఉత్సవాలకు ఎక్కడ పోరు. ఒక బస్సు కిరాయికి తీసికొని వారేమో పిల్లలు, మనుమలు, మిత్రులు అందరితో ఐరోడికి ప్రయాణం చేశారు. పిల్లవానికి, అందరికీ మరింత ఉత్సాహం అయింది.

పెళ్ళికి మూడునాళ్ళముందుగ అందరూ చేరారు. ఆ ఇంటి పెండ్లి సందడిలో

భాగస్వాము లయ్యారు. పెళ్ళివారి పూరేగింపు బయలుదేరేదాక ఎవరికీ తీరికలేదు. నారాయణయ్యకు అన్న ఇంటివారినంత ఒకసారి చూశానని పరమానందం కల్గింది.

వకీలుగారు బిరోడులో పదిహేనుదినా లుండాలని నిశ్చయించారు. తీరిక వుంటుందని తెలిస్తే నాగవేణి తన పొలం, ఇల్లు అన్నీ చూచి రావలెనని కోరటంలో తప్పేమీలేదు ఆశ్చర్యంకూడ లేదు. రాముడు అన్నీ మరచిపొయ్యాడేమో అని తోచింది. బచ్చికూడ ఆ పెళ్ళిసంగతి విని తన దొరసాని, చిన్న దొరగారిని దర్శించాలని అభిలాషతో బిరోడు వెళ్ళింది. 'అమ్మా ఇంటికి రారై తిరి?' అని అడిగింది. దానికేమో నాగవేణి లేకుంటే వూరువల్లకాడుకంటే దరిద్రంగా వుందట. 'కాశీ'కి మాత్రం రోగం తగిలి గత సంవత్సరం చచ్చిందట. కపిలకు రెండు దూడలు. 'నాల్గుసేర్ల పాలున్నవి — పిల్లవానికి తాపించండి అని తియ్యనిపాలు తెచ్చి ఇచ్చింది.

బచ్చికి ఆ నాగవేణిపట్ల ఆ వంశపరంపరకు చెల్లవలసిన గౌరవం కల్గింది. కాని బిదేళ్ళకు బచ్చి పూచికపుల్లగా తయారైంది. 'అమ్మా మీరు సుష్టుగ వున్నారు. పిల్లవాడు కూడ నున్నగా వున్నారు. ఆ వూరు పంటబట్టింది' అని చెప్పింది. అయితే వెంటనే నాగవేణి 'బచ్చీ! నువ్వెందుకే అంత బక్కచిక్కావు? మగడు కుశలమేనా?' అని ఆప్యాయంగా నాగవేణి దాన్ని మాట్లాడింది. 'అవునమ్మా! అన్నీ తొందరలే; ఒకటిపై మరొక్కటి— తిండికీ కష్టమే. మీ స్థలం, పొలంవల్ల కొంత గంజి దొరుకుతున్నది. మీ పినతండ్రికి మాత్రం ఈసారి కౌలు నివ్వజాలమైతిమి. మీ పొలంలోనే మరొక్క పంపుకే మేము బిదు తూము లిచ్చేవాళ్ళము. మీ బాబాయిగారు పదితూముల కెక్కించారమ్మా. పోనీ మిగిలింది మూడు తూములైనా పరవాలేదు చూడండి. మరొకరిభూమి కట్టుకుందామంటే నా మగడే చాకిరీ చేసుకోవాలి. పిల్లలు, నేను ఏమీ తగినట్లు సహాయం చెయ్యలేము. మాకేమైనా అందరికీ ఎక్కేప్రాయమా చెప్పండి?' అన్నది.

ఆమె మాటలన్నీ వింటే తన ఇంటిని ప్రత్యక్షంగా చూడాలనే ఆశపుట్టింది. మరొకనాడు ఆమె 'ఒరే రామ! సముద్రం చూడాలి అని లేదారా?' అని అడిగింది. రాముడు విని గంతులు వేశాడు. వాణ్ని ఎత్తుకొని ఆమె నదిని దాటింది. తనవూరి ఇంటిముందు బయలు చూచింది. బితాళుల డాబామేడ కన్పించింది. మామగారి చివరిరోజులు బాగా కనబడ్డాయి. నాగవేణి ఇంటికి వెళ్ళటానికి ముందుగా 'బచ్చీ వచ్చామే!' అని ఆమెకే మొదటి దర్శన మిచ్చింది. 'పొండమ్మా! మీ ఇంట్లో కూర్చుండండి. ఇప్పుడే వస్తా' అన్నది. రాముడు ఏమీ మాట్లాడకుండా ఆ చెరువుగట్టుపైన పూలబాటలో నడిచినట్లు హాయిగా నడుస్తున్నాడు. అమ్మ 'ఒరే ఎవరిల్లురా!' అని అడిగినా వినిపించుకోక చక్కగా తన ఇంటి చావట్లోకి వెళ్ళి పడుకున్నాడు. బచ్చి వాళ్ళెప్పుడైనా వస్తారని ఇల్లు వూడ్చి, అలికి అద్దంలా గుంచింది. నాగవేణివెంట బంధువులుకూడ వున్నారు. తెల్లవారి పొద్దెక్కింది. ఎండ ఇంట్లోకి దిగింది. ఇల్లంతా ఖాళీగా కనబడింది. చిన్నబోయింది. ఇంటిపెంకులు, గోడలు,



కర్రెలు, చెట్లు అన్నీ 'ఏమండీ వచ్చారా!' అని కుశలప్రశ్న లడుగుతూ సంభాషణ చేస్తున్నాయని, తల నిక్కించుకొని చూస్తున్నవేమో అని తోచింది. బచ్చి పెద్ద ఇత్తడిపాత్రలో అప్పుడే పాలు పితికి ధారోష్ణంగా తెచ్చింది, 'చిన్న దొరగారికి తావండి' అన్నది. 'అమ్మ. మీ కపిలగోవుపాలు పిల్లలకంతా తీర్థం లెండి' అన్నది. నాగవేణి చిదానంద జయ, రాముడు అందరూ చిన్నపిల్లలకు. ఆ పాత్ర నోటిదగ్గరకు తెచ్చి గుక్కెడు పోస్తూ వెళ్ళింది. 'రామ! చూడు పీ ఆవులపాలు' అన్నది. 'అమ్మా! అయితే ఆ కోడిగ్రామం ఇదేనా! మన ఇల్లు అంటావే, అది ఇదేనా!' అని అడిగినాడు. 'ఒరే దొంగ—ఇంత త్వరగా అన్నీ మరిచినావుటరా!' అన్నది.

'దొరసాని చూడని' అని కపిలను, దాని దూడలను బచ్చిమగడు ఆ పిల్లలవద్దకు తోలుకుని వచ్చాడు. బచ్చి 'చూడండి. ఇది మూడేండ్ల పడ్డ— మరొకటి ఏడాదిది' అని మంచి లేగలను చూపింది. నాగవేణి ఆశతో 'క....ప్పి....లా!' అని పిలిస్తే — ఎక్కడినుంచి వచ్చిందో పరువెత్తి ఆ గొంతుగల నాగవేణి వద్దకే వచ్చింది కపిల — రాముడు 'అమ్మా ఆవు కుమ్ముతుందే' అని అన్నాడు. 'అదేనా నన్ను పొడుస్త' అని దాన్ని నాగవేణి ముద్దుచేసింది. 'ఐతే రామూ! ఈ ఆవును, దూడల్ని, పిల్లల్ని సముద్రానికి పిల్చుకొని పోతా!' అన్నది. నాగవేణికి ఎందుకో మళ్ళీ దుఃఖం పొంగివచ్చింది. పిల్లలకు చూపరాదని ఆ వుపాయం చెప్పిందేమో! 'అమ్మా! దగ్గరే వుందా సముద్రం' అని అడిగాడు రాము. 'పోనీలేరా. నువ్వన్నీ మరచి కూర్చున్నావు. కాశ! అందరికీ సముద్రం చూపించుకుని తొందరగా రారా!' అని కాశనికి ఆజ్ఞాపించింది నాగవేణి. అందరూ సముద్రం చూడాలనే పిచ్చితో గబా గబా నడచారు. తరువాత బచ్చి, నాగవేణికి ఎదురుగుండా కూర్చుంది. నాగవేణి 'చూడే, మాకు ఈ నేల ఋణం లేకుండా చేశారే ఆయన—' అని ఏడ్చింది. ఆ బచ్చి కళ్ళుకూడ ఏడ్పుచెరువు లయ్యాయి. 'ఎందుకమ్మా! అలా గంటారు. అన్నీ బ్రహ్మయే వ్రాసిపెట్టి వుంటాడు. పోనీలెండి! అక్కడైనా సుఖంగా వుంటున్నారు. అంతే చాలు' అని తృప్తిగా పలికింది. బచ్చి మళ్ళీ 'పిల్లవానికి మంచిచోటు దొరికింది లెండి. ఇక్కడ మీరుంటే ఎల్లా జరుగుతుంది? మేమైతే మంటికే పుట్టాము. ఎల్లాగో బతుకుతాం. మాకు కూడ గడవటంలే. మీరేమో బాగున్నారు కదా!' అని అడిగింది.

నాగవేణి ఇంటివాకిళ్ళన్నీ తెరచింది. బయటికి లోపలికి ఎన్నిసార్లో తిరుగులాడింది. దీపం లేదు, ప్రతిమ లేదు. ఆ దేవు నింటిలో తొంగి చూచింది. మళ్ళీ మూనివుంచింది. చివరకు దీర్ఘ నిశ్వాసం వదలింది. 'బచ్చి! ఆ వుపాధ్యాయు లింట్లో ఎవరెవరున్నారో చెప్పు' అన్నది. 'సుబ్రాయ వుపాధ్యాయులు వైకుంఠం చేరారట. వారి కొడుకు, కోడలు కుందాపురంలోనే వుంటారు. వారి ముసలిభార్య మాత్రం ఇక్కడే చస్తానని పట్టు పట్టుకుంది. పొలాల సాగుసరిగా లేదు. కొడుకే ఆమెకు సరిపడినంత బియ్యం, కిరాణాలు తెచ్చి పడేస్తారట' అన్నది బచ్చి.

బిచ్చి వెంట ఉపాధ్యాయుల భార్యనుకూడ చూడటానికి వెళ్లింది. ఆమె నాగవేణిని చూచి 'అమ్మా! నా బతుకు ఇలా తెల్లవారింది. నేనే ముందుగా చచ్చి, వారు తరువాత వెళ్లింటే ఎంతో బాగుండేదమ్మా!' అని ఏమో చెప్పి ఏడ్చింది. ఆమె నాగవేణిని అక్కడే భోంచెయ్యమని పట్టుపట్టింది. 'చూడమ్మా అన్నం, గొజ్జు, చట్నీ అంతే. కానీ నువ్వు భోంచేస్తే నా మనస్సుకు చాల శాంతి, తృప్తి కలుగుతుంది' అన్నది. 'లేదత్తా నా పరివారం అందరూ, మళ్ళీ వస్తామని' తప్పుకుంది.

దారివెంట ఎన్నో పొన్నచెట్లు, ఇప్ప ఇతర జాతి నూనెగింజల తోటలు ఎదురు పడ్డాయి. 'ఏమే! కాయలు తెంచలేదే?' అని అడిగింది. బిచ్చి 'ఈ కాలంలో అవి మూల బడ్డాయి. అందరూ చిమిణీదీపం (కిరొసిన్ నూనె) వెలిగిస్తారు. ఎవరో దేవుని దీపాలకుమాత్రం ఈ పొన్నలు, కానుగలు, ఇప్పగింజలు నూనె ఆడిస్తారు. నాగవేణికి మయ్యారు ఇంటి సంగతి తెలుసుకోవాలని వుంది. కానీ తాను స్వయంగా వెళ్లాలని లేదు. 'ఏమే! ఆ మయ్యారు గారింట్లో ఎవరెవరున్నారే!' అని అడిగింది. బిచ్చి వెంటనే 'అమ్మా! ఇప్పుడు ఆ పెద్ద మయ్యారు వున్నారు. అన్నీ వారే చేయిస్తారు. ఆ ఒరటమయ్యగారు అమ్మకుని తిన్నారట. తమ్మునినుండి వారికి చాల వ్యాపారం దెబ్బతీసిందట. గతసంవత్సరం, అంతకుక్రితం మీ దొరగారు, ఒరటమయ్యారు నాల్గుదినాలిక్కడే వుండినారు. కొంప, గోరి, పొలం తోట అన్నీ అమ్మించి వెళ్ళారమ్మా! మీవారేమో మావారిని ఏమేమో తిట్టి బెదరించి వెళ్ళారటనమ్మా!' అన్నది.

నాగవేణి మళ్ళీ ఇంటికట్టకు ఒరిగి కూర్చుంది. ఎంతసేపటికీ పిల్లలు రాలేదు. వాళ్ళందరినీ ఇంట్లో విడిచి తానే రేపు రావాలని వుంది. కానీ ఆ రామదండు ఇల్లు చేరేసరికి కాళ్లు బాగా కాలుతున్నవి. అందరూ బాగా సముద్రతీరంలో విహరించి వచ్చారేమో.

# 23

ఏరోడు వాళ్లు చేరేసరికి ప్రొద్దు పడమటికి వాలింది. అందరి ముఖాలు ఆ ఎండలో దొండపండ్లలాగు ఎరుపెక్కినయి. ఆ ఎండకు కాళ్లు మాడుతుంటే దారి నడువలేక అడుగుపైన అడుగులను మోపి పెళ్ళివారిలాగానే అందరూ మౌనంగా ఇల్లు చేరారు. భోజనాలయ్యాక పిల్లవాళ్లు ఆటలు అమర్చుకున్నారు. నాగవేణి మనస్సంతా తన స్వంత ఇంటిలోకి వ్యాపించింది. అందరూ రాత్రికూడ భోంచేశాక పడుకున్నారు. ఆమె మాత్రం చింతాక్రాంతురాలయింది. 'తాను ఏమి చెయ్యకున్నా కొన్ని నిమిషాలపాటు తన ఇంట్లో కూర్చున్నప్పుడు ఎంతో ఆప్యాయంగా, హాయిగా తియ్యగా కాలంగడిపినట్లు భావించింది. అక్కడే ఆమెకు వాస్తవమైన శాంతి లభించిందట - రాత్రి ఏకాకిక 'రామ! పడుకోరా!' అన్నది. వాడదివరకు తన ఆటలతో ఇల్లంతా ఏకమయ్యేట్లు గొడవచేస్తున్నాడు. వాడు పడుకున్నాక తాను పడుకుంది. దీపాలార్పేశారుగాని, నాగవేణికి నిద్రపట్టలేదు. అన్నీ తన ఇంటి తలంపులే.



మళ్ళీ రాముడు 'అమ్మా, రేపుకూడ ఆ కోడిగ్రామం వెడదామా మన ఇల్లు బాగుందే!' అన్నాడు.

'పోరా! పో ఏమి ఇల్లు - ఎక్కడిది? నీకేమీ జ్ఞాపకం లేదులేరా!' అన్నది అమ్మ. 'కాదులేవే! ఆ సముద్రం వొడ్డులో అన్నీ జ్ఞాపకం వచ్చినవమ్మా! నమ్ము! అన్నీ నావే అనుకున్నాను.'

'అయితే మీరంతా అక్కడ ఏం చేశారురా? స్నానాలేవైనా జరిగాయా!'

'లేదమ్మా! అన్నమాత్రం స్నానంచేద్దామన్నాడు. నాకేమో భయమేసింది. నేనేమో ఆ ఇసుకపైన బొమ్మలు గీస్తూ కూర్చున్నాను. నీవు అప్పుడంతా అనేదానివే! అల్లాగే చాల పెద్దచిత్రాలే గీచానమ్మా!' అన్నాడు. 'నేను గీస్తుంటే, ఆ సముద్రానికి ముంచేవనితప్ప ఇంకేమీ లేదమ్మా' అన్నాడు రాము మళ్ళీ.

'బాసురా! నీలాగే నేనుకూడ ఆ రోజుల్లో గీచేదాన్ని. సముద్రం కెరటాలతో పోటీ వేసుకున్నా! కానీ దాని ఎదుట మనమెంత? పిచ్చిగాని' అన్నది నాగవేణి.

'రేపు మళ్లీ సముద్రానికి వెడదామమ్మా! నువ్వేమో అది మన ఇల్లంటావే. రెండు రోజులు అక్కడే వుంటే తప్పా? సముద్రం చూడవచ్చుగా' అన్నాడు. 'చూద్దాంలేరా!' అన్నది.

మరునాడు తెల్లవారగానే పినతండ్రికి తన అభిలాష చెప్పింది. కొన్ని అటుకులు, పెరుగు, పొడులు ఏవేవో కట్టుకొని బయలుదేరింది. పిల్లలందరూ వెళ్ళాలని కేకలు పెట్టారు. బాబాయి అందరినీ గద్దించి ఆపారు.

ఆమె పై పుటచారాలకు మాత్రం అందరినీ రమ్మనింది. ఎవరూ రానందుకు శాంతంగా ఏరు దాటేవరకు మౌనంగా వుంది.

ఇంట్లో చప్పుడుకాగానే బిచ్చి మళ్ళీ వచ్చింది. రాముడు త్రాగడానికి అప్పుడు పిండిన పాలు వచ్చింది. దాన్ని కాచిమ్మని ఎండుపుల్లలు బిచ్చి తెచ్చిచ్చింది. పాలు కాచి త్రాగినాక 'అమ్మా సముద్రం వెడదాం' అని కొడుకు మళ్లీ ఆగ్రహం చేశాడు. ఇద్దరూ వెళ్లారు. బిచ్చికూడ తనకు తీరిక వుందని వాళ్ళ వెంట నడచింది. తరువాత ఉపాధ్యాయు లింటికి వెళ్ళి 'వచ్చాం' అని చెప్పారు. అక్కడినుండి ఆ చిన్నఏటి చివరిదాకా వెళ్ళారు.

నదీ సంగమం చూశారు. వెనుకటికి ఎన్నడో తాను జలప్రవేశం చెయ్యాలని పడిన స్థలం కూడ కనబడింది. ఆమెకు పాతవి మళ్ళీ జ్ఞప్తికొచ్చాయి. అక్కడ నీరులేదు. ఇసుక మేటపడ్డది. అక్కడ ఆమె ఆగింది. 'అమ్మా! ఎందుకే నిలబడ్డావు?' అని అడిగాడు. 'అమ్మా! వాగు చాల దూరంగా వుందిలే' అన్నది బచ్చి. నాగవేణి కూడ నవ్వుకుంది. రామునికి తన గాథను చెప్పింది. రాముడు కనురెప్పలార్పక అమ్మ ముఖం చూశాడు. వానికప్పుడు ఆ ముసలివాళ్లందరూ తనను ఎత్తుకొని ముద్దాడిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. మాయమయింది. తరువాత ఈడిగవారి తోటకు వచ్చారు. 'అది ఇప్పుడెవరిది?' అని అడిగింది. 'ఎవరిదోనమ్మా!' అన్నది బచ్చి. 'రామా! దీన్ని మీ తాతగారు కొన్నారురా! చాలనాళ్లు మనదే! కాని, మీ నాన్న అంతా హారతికర్పూరం చేశారులే' అని నోరు జార్చుకుంది. 'అయితే వారెక్కడున్నారు?' అని గట్టిగా కుమారుడు అడిగేసరికి, తల్లి కొంత కన్నెర్రజేసింది విరక్తితో.

తరువాత పొన్నపొదకు వచ్చారు. అక్కడ కపిల నీడలో నుంచున్నది. అది నాగవేణిని గుర్తించింది. అందరూ అక్కడే కూర్చున్నారు. కపిల ఆమె భుజాలను నాకింది. ఆమెకు చక్కలిగింతలయినవి. ఆమె బచ్చితో 'చూడవే! ఈ మూగజీవులకు కూడ ఎంత అక్కరనే చూడు' అని మెచ్చుకుంది. పొన్నపూలు గుబాళిస్తున్నవి. వాడిన పూలు కింద రాలి నేలకూడ సురభిళం అయింది. తరువాత బచ్చి, నాగమణి ఎంతసేపు మాట్లాడుకున్నారో, ఏమి మాట్లాడుకున్నారో ఎవరికీ తెలియదు. ఇంతలో 'నాగవేణీ' అని ఎవరో పిలిచారు. ఉపాధ్యాయుల భార్య వచ్చి భోజనాలకు లేపింది. 'అన్నీ మరుస్తావని నేనే పిలవడానికి వచ్చానమ్మా!' అన్నది. ఆ నాగవేణి బచ్చితో మాట్లాడితే తేలిందేమంటే బతాకుల వదంతులలో, వారు ఎక్కడెక్కడో గోడల సందులలోనే బంగారం దాచేవారని, మనుమనికైనా అదృష్టం దక్కుతుందని ఆశపుట్టింది. మామగారు అల్లా చేసింది తనకూ తెలుసు. కాని చేతులకు వ్రాసిచ్చింది పోగొట్టుకున్న నిర్భాగ్యురాలకు, ఆ కలలోని కలుములు దక్కునా? అని చింతించింది.

ఉపాధ్యాయుల భార్య ఇంట్లో అప్పడాలు, నెయ్యి, గొజ్జు, అవీ ఇవీ అని తాను నెలకు నిలవచేసుకున్నవన్నీ ఒకేసారి వడ్డించింది. 'ఎందుకు మామ్మా! ఇన్ని వంటలు' అన్నది నాగవేణి. 'నువ్వేమైనా రోజూ వస్తావా?' అన్నది ఆమె. 'ఎందుకమ్మా! రామునికిష్టమైతే ఇక్కడికి రాడా?' అన్నది. 'పేట, పట్నాలు తిరిగే వాళ్ళకు ఊరేం నచ్చుతుంది? ఊళ్ళో ఎప్పుడూ వున్నవాళ్ళే పల్లెను బాసి పట్నాలు చేరారమ్మా? ఊళ్లో అనుప ఆకులు తప్ప ఇంకేమి తింటారు? కొంచెం ఉపనయనం అయిందంటే చాలు బెంగుళూరే ఇల్లవుతుంది వాళ్ళకు. ఇప్పుడు కోడిగ్రామం అంటే అంతా ఆడవాళ్ళు, కళ్ళులేని కబోదులుంటారు, దిక్కులేనివారేమో ఎప్పుడూ ఇక్కడే పడ' అన్నది ముసలిది. వాళ్ళ కిట్టని హోటేలు సంగతి కూడా చెప్పింది. 'చాలులేరా పీ హోటేలు. నాల్గు తూముల విత్తనం వేసుకొని బతకరా అంటే హోటేలుతో మేడలే కడ్తానంటాడు. నేను చస్తే ఎవరూ వానికి తంతికొట్టేవారూ లేరు' అని వాపోయింది ముసలిది.



చాలసేపు ఏమేమో మాట్లాడుకున్నారు. పొద్దయిందని నాగవేణి పిల్లవానితో బయలుదేరింది. రాముడు అమ్మతో 'అమ్మ ఇంకొక్కసారి సముద్రం చూసివద్దామే!' అని ప్రార్థించాడు. వాడు చాలసేపు విహరించి ఆకాశం చూసినాడు. 'అమ్మ! చంద్రుడున్నాడే ఫరవాలేదు' అన్నాడు. 'ఫరవాలేదురా! కాని చంద్రుడు పెద్దవాడైతే ఆ ఏరు పొంగుతుంది. మనం దాటలేము' అని అన్నది నాగవేణి.

'అయితే అమ్మ! ఇక్కడే రాత్రి పడుకుందాములే! అవ్వగారు గొంతుదాకా, ముక్కుమునగ అన్నం పెట్టారులే. రాత్రి ఏం వద్దు' అని అన్నీ మాట్లాడి పొద్దుగూకేదాకా గడపి ఆ సూర్యాస్తమయాన్ని తిలకించాడు. వెన్నెల బాగా ఎక్కినాకనే బరోడుకు తిరిగినారు. అప్పుడు ఆ నేలపై, మట్టిపై, ఇసుకపై పడిన వెన్నెలతో వాళ్ళ మనస్సుకు ఇంతింతనరాని ఆనందం కలిగింది. సముద్రం గాలి జోలపాటకు కొబ్బెర ఆకులు 'బరబర' గీతాలు పాడినవి. ఆ ఇసుకదిన్నె వచ్చింది. ఇంటి చెరువు వచ్చింది. ఇల్లు వచ్చింది. ఇంటిచుట్టు వున్న కొబ్బెరతోటలు ఆ వెన్నెలలో స్నానంచేసి శుభ్రంగా వున్నట్లు తోచింది. మరొకసారి సముద్రం చూడాలి అని కుమారుడు పట్టుపడితే నాగవేణి 'ఫరవాలేదు. బచ్చీ నువ్వు రాత్రి ఇక్కడే తోడుగా పడుకో' అన్నది బరోడుకు మనిషి వెళ్ళి వాళ్ళక్కడే వుంటారని చెప్పాడు.

రాత్రి బచ్చి తెచ్చిన గుడ్డి దీపంతో చావట్లో కూర్చున్నారు. రాత్రి వాళ్లు వండుకోరు అని తెలిసి వున్న పాలు తెచ్చి ఇచ్చింది. మంగుళూరిలో తాటిముంజెలు దొరకవులేండి అని బచ్చి కొన్నింటిని రామునివద్ద పెట్టింది. రాముడు 'అమ్మా! బహురుచి, బాగుంది' అనుకుంటూ బాగా తిని త్రేన్చినాడు. చాల పొద్దయింది అని ఏవో మాటలలో కళ్లు మూసుకున్నారు. రాముడుకూడ నిద్రపొయ్యాడు. తాటాకులు, కొబ్బెరమట్టల సంగీతంలో నిద్రించారు.

రాత్రి ప్రశాంతంగా కలతేలేని హాయి నిద్దుర వచ్చింది. తెల్లవారగానే బచ్చి లేచి తన ఇంటికి వెళ్ళింది. తన ఇంట్లో రాత్రి వేయించిపెట్టిన వడ్లను బియ్యంగా దంచుకోవాలి. అందుకే తొందరగా పని ముగించి వంటకు బియ్యం కడుగసాగింది. అన్నీ ఆదుకుంటూ చేసింది. నాగవేణికి, రామునికి పేటలవాళ్ళలాగే ఇంకా నిద్ర వస్తూనేవుంది. తెల్లవారు ఝామున ఏ పూర్వకాలంలో లేచిందో, ఈనాడు ఏడుగంటలకు లేచింది. గాలి కొంత మారింది. చల్లగాలి, సూర్యోదయం చుట్టు వెలుగేకాని పడమటికి నల్లమబ్బులు వున్నవి. పడమట ఇంద్రధనుస్సును చూచి, 'అమ్మా! చూడు! ఇప్పుడే వెళ్లాలి, సముద్రం చూడాలి.' 'వాన వచ్చేలాగుందిరా!' అన్నది. 'అప్పుడింకా గమ్మత్తు' అన్నాడు. ఇద్దరూ నదీసంగమం

చేరారు. సముద్రంలో మేఘాల నల్లని నీడలు కమ్ముకున్నవి. అదికూడ మునుగులో పడుకున్నట్లే వుంది. పైన మేఘాల పందిట్లో ఆ ఇంద్రధనుస్సు ఒక తోరణంగా అగుపడింది. ఏ దేవతల పెళ్ళి జరుగనున్నదో, వరుణదేవుడు ఎప్పుడు ప్రత్యక్షమవుతాడో పౌరోహిత్యానికి అని ఆ దృశ్యంలో ఊహలు రేగినవి.

ఇద్దరూ సముద్రం చేరారు. తనివితీర, విసుగు వచ్చేదాక బాగా దృశ్యాలను తిలకించారు. రెండు చినుకులుకూడ పడ్డాయి, ఎండకు ఆరిపోయినాయి, ఆకాశం కాటుకనుండి బూడిదరంగుగా మారింది. సూర్యుడు వేడిని పంపి ఆకాశాన్ని కాల్చి పారేశాడట. 'ఒరే ఈవేళ ప్రొద్దుటే చాల ఎండ వచ్చింది. త్వరగా వెడదాం' అన్నది.

మళ్ళీ ఇంటికి వెళ్ళారు. దారిలో రాముడు, 'అమ్మ! ఈ ఇల్లు విడిచి మనం మంగుళూ రెందుకు వెళ్లామమ్మా?' అన్నాడు. ఆమె 'ఇక్కడ మనవాళ్ళందరూ వెళ్ళిపొయ్యారు?' అని అన్నీ పాతవి జ్ఞప్తికి తెచ్చింది. అందరి కథలు చెప్పింది. తన మగని కథ మాత్రం చెప్పలేదు. రాముడు తండ్రి సంగతి ఒత్తిడిచేసి అడిగితే 'వారు మంచిగా వుంటే మనమెందుకు ఇంటింట పడివుండాల్సి వచ్చేది?' అన్నది ఉదాసీనంగానే.

అందరూ ఐరోడు చేరుకున్నారు. తరువాత తన ఇల్లు, సముద్రం చూడటానికి వీలు కాలేదు. నారాయణయ్య 'ఏంరా! అన్నీ చూశావా!' అని అడిగారు. మళ్ళీ 'అతడు గత సంవత్సరంకూడ వచ్చి ఆ ఒరటని ఆస్తి నాశనం చేయించి వెళ్ళాడట. నిజమో, అబద్ధమో అంతా వినికిడి. మైసూరు, బెంగుళూరునుండి పనులు చాలించి విజయనగరంలో ఏమో హొటేలు పెట్టారని ఇప్పుడే అందిన వార్త' అన్నారు. 'ఒరటుని భార్య బిడ్డలకుకూడ నీ గతియే పట్టింది. అక్కడ తండ్రికే కష్టం. అవునమ్మా అంతా ఖర్మ! ఐతాళుల ఇంటికొక లచ్చుడు. శీనమయ్యరింటికొక ఒరటడు చాలు. చూడమ్మా ఆ కంబళజాత్రల ఎడ్లకు తడివేసి (కూర్చోడానికి వేసిన జీను) తోలినట్లే అయింది. మంచి జతలే' అన్నారు.

మళ్లీ 'బాబూ! ఈ ఊరికంటే మంగళూరు బాగాలేదా? మన దరిద్రం ఊరికంటే ఏదైనా మంచిదే అనిపించదా చెప్పు. ఇక్కడి తాకట్లు, తగరార్లు, గొడవలూ ఎన్నో ఎవరు చెప్పగలరు' అని రామునితో అన్నారు.

'మాకేమో రోజూ ఇంటి బెంగ, జ్ఞాపకం తప్పవు. బాబాయ్! నేనొక్కర్తే అయితే కోడీలోనే పడివుందామని వుంది. కానీ, ఈ రాముడు అక్కడ ఏం చెయ్యాలి? వానికి ఆ కోతలు, విత్తనాలు, నాట్లు అన్నీ చేతనవుతాయా? కాలే మన్ను, వానల్లో మూన్నాళ్లుండగలడా?' అన్నది.

'రాముని గొడవ అంటావు? ఇక్కడ వున్న మగపురుగులే ఎగిరిపొయ్యాయి. వ్యవసాయం ఋతువుకు సరిగా బెంగుళూరినుండో, హావేరీనుండో ఎక్కడెక్కడినుంచో అందరూ



వస్తారు. నాట్లు వేయిస్తారు. కోతలకు గాని పొలం ముఖం చూడరు. ఎనిమిది నెలలు అందరూ మాయమే. ఏ పెండ్లికో, పర్వానికో మగవాళ్ళ దర్శనం' అన్నారు.

మాటలలో అన్నిపనులు ముగించుకున్నారు. రెండురోజులకు వకీలుగారి గుంపు కోడియాలం (మంగుళూరు) వెళ్లాలి. నాగవేణి, రాముకూడ ఆ గుంపులోనే చేరుకున్నారు. సెలవు లయ్యాయి. రామునికి మళ్ళీ బడిలో దినచర్య ఆరంభమైంది. నాగవేణి తన ఫిడేలు పట్టుకుంది. కోపతాపాలన్నీ ఆ కమానుపై చూపింది. గురువులు ఇంటికి రారు. వారికి ఫిడేలు పట్టుకుంటే చేతులు వణుకుతాయి. వృద్ధాప్యం-వేళ్ళకు స్థిరత్వం లేదు. అందుకే నాగవేణి స్వయంగా వాళ్లింటికి వెళ్లి వాద్యం వాయించి కొంత అభ్యాసం చేసేది. 'అమ్మా! నాకేమో ఎప్పుడూ విద్యపై మమతే. నా శిష్యులంతా, శిష్యరాండ్రంతా పెళ్ళికాగానే ఫిడేలును అటకకు ఎక్కించారు, గాంధీగారి చరఖాలకుమల్లే. అంతా ఆరంభశూరత్వం. కాని నువ్వెందుకో ఇప్పటికీ వాయిస్తున్నావు. నీ చేతివాద్యం వింటే నన్ను జ్ఞాపకం చేసుకుంటారులే. సరే నువ్వైనా విద్యను నిలబెట్టుకున్నావు. అంతే చాలు.' నాగవేణికి చాల ఆనందమయింది. వాళ్ళ ఇంట్లో ఆ ఫిడేలు ఎవరూ వినరు. రాముడు విని 'బాగుందమ్మా!' అంటే, అంతా తల్లిప్రేమవల్ల అంటాడు అనుకుంది.

గురువుల పొగడ్తకు చాల సుఖం కల్గింది. ఎవరికి కాదు?

మరొక్కసారి ఎన్నడో సుబ్రాయగారు, 'అమ్మా, నువ్వు నల్గురి ఎదుట వాయించమ్మా', అన్నారు. 'వద్దండీ, నాకెందుకు. నేనేమీ పొగడ్త పొందాలా? డబ్బు సంపాదించాలా? అన్నది. 'కాదమ్మా! మన విలువలందరు తెలుసుకోవాలి. బయట ఏ గొడ్డు, మృగం అరచినా సంతోషిస్తామే - దేవత అని ఊరేగిస్తామే'.

సుబ్రాయగారి కోరిక, ఒత్తిడులు రెండేళ్ళ తరువాత ఫలించినవి. మోహనరాయని స్నేహితుడు రాఘవేంద్రరావు మళ్లీ వచ్చాడు. సదాశివుడు అతని ఎదుట తన చెల్లెలి విద్యను ప్రదర్శింపజేయాలని కుతూహలపడ్డాడు. దానికోసం మరొక మిత్రబృందం సభను చేర్చి ఎందరినో ఆహ్వానించాడు. ఎవరొచ్చారో నాగవేణి కంతగా తెలియదు. ఆమె వాయించింది. సుబ్రాయగారు మాత్రం ప్రక్కన తాంబూలం నములుతూ, తాళం వేసుకుంటూ పూరకే కూర్చున్నారు. రాముడుకూడ శ్రుతి మీటుతున్నాడు. నాగవేణి తల వంచుకుని వాద్యంపై అన్నీ వరుసగా రాగాలాపన చేస్తున్నది. రెండు గంటలు అల్లా వాయించింది. తరువాత ఎవరో 'తోడి' అన్నారు. నాగవేణి తోడిరాగం మొదలుపెట్టుకుంది. నాగవేణి పేగుల్నే కరిగించి వేస్తుంది తోడిరాగం. ఆమెకూ ఇష్టమే, వాయించింది. భావలహరులు అందరినీ వూగిసలాడించాయి. మధ్య నాగవేణికూడ ఎలుగెత్తి సన్నగా పాడుకుంది. సుబ్రాయగారు ఎన్నడూ అలాంటి వాదనం వినివుండలేదు. ఎవరబ్బా అడిగింది అని ఆమె ఒకసారి చూచింది. చెయ్యి ఆగింది. సభలో స్తబ్దత. ఎదురుగుండా వకీలుగారే 'ఓహో' అనుకుంటూ తనలో ఇన్నాళ్ల గానంపట్ల

అభిలాషలను మెచ్చకుండా ఈనాడు తనివితీర రాగామృతం గ్రోలుతున్నారని తోచింది, రాఘవేంద్రరావుగారుకూడ కనబడ్డారు.

'ఎందుకమ్మా ఆపినావు?' అన్నారు సుబ్రాయరు.

'నాన్న ముందు నా పాండిత్యం, ఏమి తులువతనం అనిపిస్తుంది' అన్నది.

సుబ్రాయరు కొత్తవారి నెన్నడూ చూడలేదు. తరువాత నాగవేణి, 'నాది చాలు లెండి; కొత్తవారితో పాడించండి. వారినికూడ విందాం?' అన్నది.

తరువాత అందరూ ఆ కొత్తవారిని ప్రోత్సహించారు. నాగవేణి ఫిడేలుపైన రాఘవేంద్రరావుగారు తోడిని మరింత విస్తారంగా వాయించారు. తదుపరి భైరవిలోని లోతులను అందరికీ చూపించారు. సుబ్రాయగారు 'భేష్' అన్నారు. సదాశివుడు ఆ వకీలుగారితో 'అంతా మీ ప్రసాదం అండీ. ఆ రాత్రి మీ వాద్యం విని-అభ్యసించింది' అన్నాడు. సుబ్రాయగారినికూడ చూపించి 'వారే గురువులు' అని పరిచయం చేశాడు. వారేమంటారో అని సుబ్రాయరు నిరీక్షించారు. 'బాగుంది. ఐదేళ్ళలోనే ఇంత అరణ్యం దాటించారే. ఇద్దరూ దొడ్డవారే!' అని ప్రశంసించాడు. తరువాత గురువుగారు, కొత్త వకీలుగారు మాట్లాడుకున్నారు. నాగవేణికి సిగ్గేసింది. 'చూడండి, పాట నేర్పేది కష్టం కాదు. కాని, దానివెంట వాయించేవారి హృదయం కూడ నిండివుంటుంది. ఆ వాద్యం వింటూంటే ఆ కమానువెంట వాదకుని వ్యథలుకూడ రాగాలవెంట చేరాయి అనవచ్చునన్నారు. మీరు స్వయంగా వాయిస్తే విందామని అభిలాష' అన్నాడు. 'నాకు 70 సంవత్సరాలు చేతులు కృశించినవి. ఇప్పుడు కడుపుకూటికొరకే ఈ సాధనగా మారింది అంతే' అన్నారు.

రాఘవేంద్రరావుగారికికూడ సుబ్రాయగారి దారిద్ర్యంపట్ల చాల సానుభూతి కల్గింది.

రాఘవేంద్రరావుగారు మరునాడు సుబ్రాయరుగారింటికి వెళ్ళారు. అక్కడికి నాగవేణిని పిలిపించి మళ్ళీ ఆమె పాట, వాద్యం విన్నారు. 'నేను మళ్ళీ రాగలనో లేనో! ఆనాడు విన్న గానలహరి మళ్ళీ వినగలనో లేనో!' అన్నారు. బయటికి వెళ్ళేటప్పుడు నాగవేణి ముసలిగురువుగారికి తాను తెచ్చిన శాలువ జోడును కప్పి సత్కరించారు. పాదాభివందనం సల్లించారు. 'అందులో మీలాంటి విద్వాంసులెందుకండీ ఇంత శ్రమపడుతున్నారు. మా పిల్లలుకూడ ఈలాంటి సత్కారం చెయ్యలేదు.' అన్నారు సుబ్రాయరు.

అన్నీ వుపచారవాక్యాలు. వారు వెళ్ళేవరకు రాఘవేంద్రరావుగారు ఒకే కుటుంబంలోనివారు లాగే మమకారం చూపారు. సంగీత సామ్రాజ్యంలో కూడ వైరం, మాత్సర్యం, దాయాది చేష్టలు నిండివుంటాయి. అంత మమతను సుబ్బరాయగారు ఎన్నడూ అనుభవించి వుండలేదు. నిష్కలంక బంధువయ్యాడు అతడు. తరువాత ఇద్దరూ సెలవుతీసికొన్నారు.



సంగీతం క్రొత్తగాదు. వింతగాదు. అది నాగవేణి జీవనసంగీతంగా మారింది. మోహనరాయని పిల్లలకు, తన పిల్లలకు ఆమె సంగీతం పాఠాలుకూడ చెప్పాల్సి వచ్చింది. ఒక్కొక్కసారి రాముడుకూడ ఫిడేలు పట్టుకుంటాడు. కాని వాని అభ్యాసం ఏదో చాల చాంచల్య మిశ్రణమే. ఒక్కొక్కసారి పిచ్చిగా వాయించేస్తాడు.

అన్నింటిలో అన్నివిధాల సొగసులే. సంగీతం కూడ అల్లాంటిదేకదా! బతుకు అనే దుర్భరమైన వెగటులో అదొక మాధుర్యాన్ని చల్లుతుంది అంటే తప్పుగాదు. బ్రతుకులోని రోగాలన్నింటిని అది ఏకాకిగా రూపుమాపగలదా? ఎవరు చెప్పగలరు? ఈ ప్రశ్నకు సమాధానం నాగవేణి కింకా తెలియటంలేదు.

ఆమె బ్రతుకుకు మరిరెండు గీతలు పడ్డాయి. ఒకటి అదే సంవత్సరం గురువుగారి అస్తమయం. వారి మృత్యుశయ్యవద్ద కూర్చుని నాగవేణి స్వంతకూతురిలాగు అశ్రుతర్పణం చేసింది. ఆమె అపేక్షతో అతని చావుకు ముందు రాఘవేంద్రరావు ఇచ్చిన శాలువను గురువుగారికి కప్పి ఆనందించివుండినది. వారికి జీవితంలో ఏమాత్రం మదింపు లేకపోయెనే. సానుభూతికూడ చూపని సమయంలో తనకు కూడ ఈ సంగీతం అక్కరలేదులే అనుకున్నది.

రెండవ సంవత్సరం, ఆమె కూర్చున్న నేలనుకూడ పెల్లగించే సంఘటన జరిగింది. ఒకనాడు సాయంకాలం వాసుదేవయ్యగారు పూజాగృహంలోనే గుండెనొప్పి అన్నారు- పడుకున్నారు. కొడుకులిద్దరూ వచ్చారు. వైద్యంచేసేవాడు పరీక్షచేసి ఇంజక్షను ఇచ్చాడు. తరువాత 'ఏమో అన్నా! మందివ్వడం పిచ్చిలాగే తోస్తుంది. వారికి చివరిఘడియలు అనుకుంటాను' అన్నాడు. ఆ మాటే సత్యమయింది. రాత్రికి వారు దివంగతులయ్యారు. నాగవేణి తల్లికి వచ్చిపడిన దుఃఖాన్ని ఆదుకోడానికి ప్రయత్నించి తన దుఃఖాన్ని మింగివేసుకుంది.

ఇది జరిగిన తరువాత ఒకనెలకే తల్లి, నాగవేణి, రాము సదాశివుని ఇల్లు చేరాల్సివచ్చింది. రాముకు అది కొత్తదికాదు. కాని నాగవేణికి తన తండ్రి ఇల్లుకూడ స్వంతంగా తోచలేదు. అన్న ఇల్లుకూడ స్వంతంగా తోచలేదు. రెండునెళలు హాయిగానే జరిగింది. తరువాత ఇంటి పెద్దకుకూడ ఇది బాధగా మారింది. అతని భార్య అసమాధానం కొన్ని మెత్తని మాటలతో వెలువడింది. నాగవేణికిగాని, అమ్మకుగాని అల్లాంటి మాటలు వినబడకుండా వుంటాయా?

అన్నాళ్ళయ్యాక నాగవేణి కుమారుడు తాతగారింట్లోనే వుంటూ మెట్రిక్కు పరీక్ష ముగించాడని చెప్పగలము, గాని అంత దీర్ఘకాలం తల్లి, కొడుకులు నిశ్శబ్దంగా ఎంతో సంకోచంతో, భయంతో ఎట్లా గడపారో, ఆమె తన బాధలను ఎల్లా మింగివేసుకుందో సులభంగా బోధపడదు. కొంత ఫిడేలు తీగెలపైన దుఃఖాన్ని ప్రసారం చేస్తుండేది.

సదాశివునికి నెలకు రెండువందల మించి నికరాదాయం, తండ్రి ఆస్తి వరుమానం వేరే. అన్నీ పరవాలేదు. పెద్దవాడు చిదానంద ఇంటర్ చేరాడు. రెండవవాడు స్కూల్ ఫైనల్, పిల్లల స్కూళ్ళ చదువు ఖర్చులు. రాముణ్ని, చెల్లెళ్ళి, తల్లిని కర్తవ్యదృష్టితోనే చూచుకుంటున్నాడుగాని కేవలం డబ్బు ఎక్కువైగాదు. లలిత (అతని భార్య) అతన్ని పోరు పెడ్తుంది. 'పంపండి, మీ తమ్ముని్ంట్లో ఎందుకు వుండరాదు? ఏ రోడుకైనా పంపరాదూ? చెల్లెళ్ళి ఎల్లకాలము మనమేనా సాకాల్సింది?' అని గొణిగింది.

రాముడు స్కూల్‌ఫైనల్ పరీక్ష ఫీజు పన్నెండు రూపాయలు అడుగగానే ఆమె అసమాధానం ఇంతింతకాదు. 'చిదానందుడూ పరీక్షకట్టాలి' అన్నది. నాగవేణి వక్కగదిలో వుంది. అదే సాయంకాలం చిన్నన్నపద్దకెళ్ళి డబ్బు అడిగింది. డబ్బు దొరికింది. కొంత సమాధానం అయింది. పెద్దన్నకు కొంత బాధ కల్గింది, తననే అడుగాలిగాని తెలియకుండా తమ్ముణ్ని అడిగింది బాగనిపించలేదు. ఆమె లలిత కారణమని చెప్పలేదు. చెల్లెలుకూడ తనని అవమానించిందని బాధపడ్డాడు. నాగవేణిమాత్రం లలితపైన చాడీలు చెప్పదలచలేదు. ఆమె అన్నం తింటూ ఆమెను అవమానించరాదని నాగవేణి కృతజ్ఞతాబుద్ధి. భార్యాభర్తలకు కలహం పెట్టరాదు.

రాముడు పరీక్ష అయ్యాక 'ఇల్లు చూచివస్తాను' అన్నాడు. నాల్గునాళ్ళైనా వదినె గారికి మనశ్శాంతి నిస్తామని అనుకున్నది. తల్లి, ఆమె, రాము-అందరినీ అన్న ఐరోడికి పంపే ఏర్పాట్లు చేశాడు.

నారాయణయ్యగారి సంసారమేమీ చిన్నదికాదు. నాన్నాళ్ల వదినె పిల్లలు భారమౌ తారా? నాగవేణి మరునాడే 'అమ్మా! మా ఇంట్లో నువ్వు నా పెళ్ళినాడు వచ్చావేమో? తరువాత రానేలేదు. చూచివద్దువుకానీ' అని పట్టుపట్టింది. రాముడు పదహారేళ్ళ యువకుడు. వాడు పదేళ్ల ప్రాయంలో ఒకసారి వారింటికి వెళ్ళాడు. ఇప్పుడు బాగా వూరు చూడాలనే ఆశకూడ ఎక్కువే. చదివి వేసారిన తరువాత మార్పుకోరకు నాల్గు పూట్ల చూద్దామన్న సమయంలో మంచి అవకాశమే దొరికింది. వారివెంట తిరుగాలంటే ఆ పట్నవాసంలోనే ముసలిదైన తల్లికి కష్టమే. కాని బిడ్డ కోర్కెపై ఆమె ఇంటి నొకసారి కళ్ళారా చూడాలనే ఆశపుట్టింది. మోకాళ్ళదాకానే నీళ్ళున్నా అందరూ పడవెక్కి ప్రయాణంచేశారు. ఆవలిగట్టు చేరారు. ఆ మైదానం తరువాత ఇంటిదారి పట్టారు. దారిలోనే 'బచ్చీ' అని బిగ్గరగా కేక పెట్టింది నాగవేణి. బచ్చికి వినరాలేదు. పిల్లలు వచ్చారు. 'ఎవరో వచ్చారు - బికాళల ఇంట్లో దూరారు' అని అమ్మతో చెప్పారు. ఆ ఇంటికి తాళంవేశారు. దయ్యాలేమీ రావు వస్తే దొరసాని వస్తుంది అని సంశయంతోనే బచ్చి వచ్చింది. బచ్చి నాగవేణి సమ వయసుక్రాళ్ళు. నాగవేణి పుష్టిగానే వుంది. మనస్సే పాడయింది. బచ్చికి పదిమంది పిల్లలు. చూడటానికి మరొక రెండు దశాబ్దాలెక్కువ వయస్సుగానే కనబడుతుంది. తన



వెంట బిడ్డ, బిడ్డను కూడ తెచ్చుకుంది. బచ్చి గొంతు, నడక, భావాలు అన్నీ సంసారంలో ఆఖరుమెట్టు ఎక్కినవారిలాగా కనబడుతుంది.

'బాగున్నావా?'

'ఏమిబాగో దొరసానీ—మదియల కెదురుచూస్తున్నా! అంతే! ఇంటినిండ పిల్లలు పూటకో పూటన్నరకో తగిన ప్రాణంతో వుంటున్నాను. అమ్మ! ఓహో చిన్నదొరగారా? చాల అందంగా వున్నారమ్మా!' అని మెచ్చుకుంది.

'ఎవరిబిడ్డ ఇది?' అని నాగవేణి తల్లి బచ్చినిగూర్చి అడిగింది. 'మన పాలికావమ్మ!' మా పొలంకట్టుగుత్తది లోగుత్త ఈమె చేసుకుంటున్నది. పేరుకైన మనది అనుకుందామని ఈమెకిచ్చి వెళ్లాం అంతే.'

'అమ్మా! అందరి గంజి త్రాగే బదులు ఇక్కడే వుంటే బాగవ్వదా' అన్నది బచ్చి.

'బానే నాగు, నాకుకూడ కొడుకుఇల్లు చాలయింది. నీలాగే నేనుకూడ వానికి కష్టమని నిమిషాలు లెక్కిస్తూ వున్నాను. ఆ కోడలిభిక్ష వేడాలి. మనస్సు వంగదు. అది మంచిది కాదని తెలిసికొని వారేమా వేరే ఇల్లువాకిలి చేశారు. కాని, వారి అనంతరం అన్నీ ఇరుకాటాలే.' అన్నది తల్లి.

నాగవేణి మనస్సు సుబ్రాయ ఉపాధ్యాయుల భార్యవైపు లాగింది. 'బచ్చీ ఆ ఇంట్లో ఉపాధ్యాయులవా రెవ్వరెవ్వరే వున్నారు?' అని అడిగింది. బచ్చి 'అమ్మా! తనువు శాశ్వతమా? నిపుడు ఆమె ఋణం తీర్చుకున్నది. ఆమె చచ్చినరోజు ఇంట్లో దయ్యంకూడ వుండలేదు. ఎవరో దారిన నడచేవారు చూచి, కుందాపురం వెళ్ళి కొడుకును పిలిచారు.

'అమ్మ! ఆ అవ్వ చూడే! ఆసారి వచ్చినప్పుడు అలాగే చెప్పి నన్నేమో బాగా ఆదరించి భోంచేయించింది' అన్నది నాగవేణి.

'అమ్మా! తిరుగులాడి వస్తాను. సముద్రం, అవీ చూసిరానా!'

'అల్లాగే' అన్నది నాగవేణి. రాముడు తన పంచ ఎగకెక్కి ఇసుకదిబ్బలు తొక్కుకుంటూ సముద్రం చేరువకు చేరాడు. బాగా తిరిగాడు. తరువాత పడమటి చెరువువారి పెద్ద వలల పడవలను చూశాడు. బెస్తవారు చేపలతో నిండిన బరువైన వలలను లాగినప్పుడు బయటికి లాగబడి ఇసుకలలో పడి తన్లాడుకుంటున్న నీటిపాములను చూచి రాముడు చాల కనికరించాడు. ఇంతలో ఆ పాములను గద్దలు ఎత్తుకొని పోతున్నవి. వానికి మరింత పాప మనిపించింది. ఆ చేపల చిక్కాలకు బెస్తలు, గద్దలు, కాకులు; కూతలు, కేకలు పెట్టి వాటాలు కోరుకునే విచిత్ర దృశ్యంకూడ ఆశ్చర్యకరంగా వుంది. సముద్రంలోని నీటి చైతన్యంకంటె సముద్రంపై ఆశ్రయంతో బ్రతికేవారి జీవన సంగ్రామంలోని ఎక్కువ

యాతనలు వాని మనస్సును ఆకర్షించింది. అన్నీ చూసేలోగా ఎండ నడినెత్తి కెక్కింది. శరీరం, ముఖం అన్నీ వేడెక్కి ఎర్రబడ్డాయి. కడుపులో (ఎలుకలు పరుగెత్తినాయి) దోసెలు తయారవుతున్నాయి (చుయ్, చుర్రుమంటున్నది). వెంటనే అతి త్వరగా ఇంటికేసి నడచాడు. ఇంట్లో 'అమ్మా! ఈ ఎండలో ఏరోడుకు వెళ్ళలేను. రెండు ఎళనీర్లు, తాటిముంజెలు తెప్పిస్తే కడుపు నిండుతుందమ్మా!' అన్నాడు. 'సరేలే చూద్దాం-మొదట వెళ్లు. చెరువులో స్నానం చేసిరా!' అన్నది. వారు వెళ్ళిన వెంటనే నారాయణయ్యగారు చాపలు, వంట సరుకులు అన్నీ పంపారు. నాగవేణి-వారిని కోరిందేమంటే రెండురోజులైనా వుండే అనుజ్ఞ నిమ్మని. 'ఉండమ్మా! కాని మీ హనుమాన్లు మాత్రం సముద్రంలో ఈతగొట్టేది, ఆ వేగమైన నదీ సంగమంలో దిగేది-అలాంటి పనులు చెయ్యకుండా ఒట్టు తీసుకో' అన్నారు. వాడు వదుల్తాడా, సముద్రంలోకి కొంత నడిస్తే ఆ హోరుమనే పెద్ద కెరటాలు తగుల్తాయని భయమేసింది. అబ్బ అనుకుంటూ వాపసు వచ్చాడు. నీళ్లేమో అతి కటువు, ఉప్పు అని అసహ్యించుకున్నాడు. యౌవనంలో చిన్ననాటి సముద్రతరణం ఆశలు సన్నగిల్లాయి. దానికి తోడు తాతగారికి చేసిన వాగ్దానంకూడ వెనుకకు లాగుతున్నది.

పిల్లవాని స్నానం అయ్యేదాక అమ్మమ్మ, అమ్మ కూర్చున్నారు. బిచ్చి ఇచ్చిన అరటి ఆకును ముక్కలుచేసి సిద్ధబరచారు. 'ఏమిరా చాల ఆలస్యం' అన్నారు. కడుపులు కూడ చప్పుళ్లు చేస్తున్నాయి ఆకలితో. 'ఒరే, వూరకే గంజి వార్చాను అంతే,' అన్నది. 'దొరికిందే పుణ్యం' అన్నాడు రాముడు. కాని వుప్పు, మిరియాలపొడి కూడ మృష్టాన్నంగా మారింది. నాగవేణికేమో తన చిన్ననాటి జీవితాన్ని జ్ఞప్తికి తెచ్చింది. నాగవేణి పచ్చి మిరపకాయ కొరుక్కుంటూ అన్నం మింగుతూ బాధపడినా 'అమ్మా ఎన్నాళ్లో ఈలాగు సుఖంగానే వుంటినమ్మా! కాని ఎందుకో ఈ వరాన్నం ప్రాప్తించింది, దేవుడెందుకుచేశాడో అల్లాగు?' అన్నది. 'పోనీలేవే! మీ అన్న పెడితే వరాన్నం అనవద్దు. అది ఒక్కతే వేరే కులగోత్రాల పిల్ల. తన పిల్లల్లాగు రాముణ్ని చూడమంటే ఎందుకమ్మా చూస్తుంది చెప్పు-అది సహజమే.' అని అమ్మ సమాధానం చెప్పింది.

మూడునాళ్ళు ఆలాంటి వనభోజనం చేశారు. రాముడు 'కేంప్ లైఫ్ (Camp Life) బాగుంది' అంటూ అన్నీ తిరిగితిరిగి వస్తున్నాడు. ఆకలికి ఆ జీడిపళ్లు, జీడిపప్పు తింటాడు. ఏరుకొనివచ్చి తల్లికి చెప్పి కాల్చిపెట్టుమంటాడు. భోజనంలో మజ్జిగనీళ్ళు, చామాకు చెట్నీ, గణుసుగడ్డ పచ్చడి, పనసగింజల కూర అన్నీ బిచ్చి తెచ్చిన కూరగాయల పుణ్యం అనవచ్చును. అన్నీ ప్రశాంతంగా వుంటే తల్లి చూచి 'నాగవేణీ! ఈ పిల్లవాని సమస్య లేకుంటే హాయిగా ఇక్కడే వుండవచ్చు. తిన్నా పరవావేదు, లేకున్నా పరవాలేదు. ఏ చీరకట్టినా ఎవరూ అడుగరు! గంజికి మాత్రం గింజలు దొరికితే చాలదా?' అన్నది. 'మా కపిల పుణ్యమా అని మంచి మజ్జిగ దొరుకుతుంది. అన్నీ పరవాలేదు. రాము ఏమేమి చదువాలనుకున్నాడో దాన్నిబట్టి నిర్ణయించాలి' అన్నది నాగవేణి.



మూడవనాటి సాయంకాలం చాలసేపటికి అమ్మ, పిల్లవాడు సముద్రతీరంలో వున్నారు. అమ్మ వంట చేసిపెట్టింది పరవాలేదని ఆమె వెళ్ళింది. పడమట సూర్యుడు తొలుత పెద్దగా వున్నాడు ఎర్రగైనాడు — తరువాత సన్నగిల్లి పడ్డాడు. ఎర్రని కిరణాలు సూర్యుని నుండి వెలువడ్డాయి. అప్పుడు పెద్ద వలల బెస్తలు, పడవలు అన్నీ కనబడ్డాయి. వాళ్ళు ఈ కొత్త వాళ్ళెవరని శ్రద్ధగా చూశారు, గుర్తుపట్టలేక ఉదాసీనంగా వెళ్ళిపొయ్యారు. మునుచీకట్లో వెలుగుకూడ మునిగిపోయింది.

తరంగాలు ఎర్రగా మడతలుబడుతూ, దుముకుతూ, ముందు సాగుతూ ఒక్కపెట్టున మంటల కొరువులలాగే అగుపడ్డాయి. వాడు ఆ నీళ్ళను చూడటానికి తొక్కడానికి సముద్రం వెంట పరుగెత్తుతున్నాడు. నీళ్ళలో వాడు తొక్కినప్పుడు ఎర్రని చినుకులు పడ్డట్టు అయ్యాయి. 'అమ్మ! ఈ దృశ్యాలను నేను ఎన్నడో మరచిపొయ్యానే!' అని వుత్సాహంతో అరచాడు. 'సముద్రం నీరు ఎండకు ఆవిరి అయితే అల్లాగే; నది నీరుకూడ అంతే; సరే పోదాంపద పొద్దయింది.' అన్నది నాగవేణి.

'అల్లాగే' అని ఇద్దరూ ఇంటిదారి పట్టారు. 'ఒరే! ఇప్పుడు ఈ వూరు ఎల్లాగుందిరా?' అని ప్రశ్నించింది. 'ఎందుకమ్మా?' అన్నాడు.

'ఏమోనయ్యా! పరుల ధర్మానికి వుండేది ఇష్టమేలేదు నాకు.' అన్నది.

'అమ్మ ఈ వూరు కూడ నాకు బాగనిపిస్తుంది. ఇక్కడ ఇల్లు కూడ మనదే— వుంటే రేపటి భోజనం ఎల్లాగూ అని వుంటుందికద ఒక ప్రశ్న' అన్నారు.

'అయితే మామయ్య ఇల్లు నచ్చిందా? నీకు?'

'అది వద్దు. ఏమో నాకు తెలియదు. ఎల్లా చెప్పాలని తోచదు. వాళ్ళకేమో మనమంటే ఎల్లాగో వుంటుంది. అయితే వాళ్ళపై భారం పడరాదు. నేను ఇంటర్ చదువు ఎక్కడైనా చదువుకుంటానమ్మా! మంగుళూరులో చదువుకోరాదనే నిశ్చయించానమ్మా!' అన్నాడు.

'ఎక్కడ?'

'మంగుళూరు అక్కర్లేదు. మరెక్కడో వూహకందదు. ఎల్లాగో బి. ఎ. అయితే మంచి నౌకరి దొరుకుతుంది. ఇప్పుడు పదిహేను రూపాయల కూలికూడ రాదమ్మా!' అన్నాడు.

'బాబూ! నీవు ఎక్కడైనా ధైర్యంగా వుంటే మేము సుఖంగానే వుంటాము. తాతగారిచ్చిన డబ్బు అమ్మమ్మ దగ్గర కొంత వుంది. మేమిద్దరం కొన్నాళ్ళయినా ఎవరి మాటలూ

పడకుండా వుండగలము అనుకుంటాను. పినతండ్రి కూడ ఆపదలలో ఆదుకుంటాడులే. నీకు బి. ఎ. అంటే ఎంత డబ్బుకావాలి? సదాశివుడెంత ఇయ్యగలడో!' అని చింతలోపడ్డది ఆ తల్లి.

'చూద్దాంలే ఎల్లాగో అవుతుంది—కాసీ' అని చూడని భవిష్యత్తును నమ్ముకొని, యౌవనంలోని ఆశలను పెంచుకుని మాట్లాడే కొడుకును వెంటబెట్టుకుని తల్లి ఇల్లు చేరుకుంది. ఇంట్లో కూడ భోంచేసేటప్పుడు దారిలో మాట్లాడిన విషయాలే పునరావృత్తిచేశారు. ప్రొద్దున లేచివెళ్ళాలి. వంటసామగ్రి కూడ ఖర్చయిపోయింది.

వెళ్ళేటప్పుడు బిచ్చిని పిలిచి 'ఏమే ఎప్పుడో వస్తే రావచ్చు. నువ్వు అవుదూడలను ఇస్తావుగా!' అన్నది. 'ఎందుకియ్యనమ్మా! మీది మీకు అప్పగించకుంటే దేవుడైనా దండించడామ్మా!' అన్నది బిచ్చి.

బిరోడు చేరిన రెండునాళ్ళకే నాగవేణి తల్లికూడ మరదితో నాగవేణి అభిప్రాయాలే తెల్పింది. వారికి మళ్ళీ ఆశ్చర్యమయింది. 'అయితే వదినే మీరుకూడ మీ బిడ్డకు పట్టిన పిచ్చినే ఆమోదిస్తారనుకోలేదు.' 'అలాకాదు. అక్కడి పరిస్థితి తెలియదు. చచ్చేనాడు ఒకరి అరుపు ఆజ్ఞల అన్నం నాకు ఇష్టంలేదు.' అల్లాగే ఎన్నో మాట్లాడుకున్నారు. సంసారం కలతలు, నాగవేణి మనస్సు ఎలా నొప్పిపడ్డదో అర్ధమయింది. 'వదినా! నాదేం ఆక్షేపణ లేదు. అన్న మీకు సంవత్సరానికి నూరురూపాయలు ఆదాయం ఏర్పాట్లు చేశారు కదా! కోడిగ్రామంలో నూరురూపాయలు చాలుచాలు. తక్కువబడితే నేనున్నాను. కాని వచ్చిన చిక్కు రాముని చదువు జరిపించడం. తండ్రి సుఖం చూడనివాడు ఇప్పుడు అవ్వ నుండి, తల్లినుండి దూరం చేసేస్తున్నామనే చింతకూడ ఎదురవుతుంది.'

'రాముని చింత మీకు వద్దు. అన్న ఎన్నో ఏళ్ళు సాకినాడు. ఇంక చేతగాదు. వాడు ఎల్లాగో చదవాలి. అంతే' అన్నది.

పదిహేను సంవత్సరాల క్రితం బితాళుల ఇంటినుండి బిరోడుకు పంపిన పాత్ర సామాను త్వరలో బితాళుల ఇల్లు చేరింది. బితాళుల జీతగాళ్లు ఎనిమిదినాళ్ళలో ఇంటికి పూత, మెత్తు, సున్నం చేసి శుభ్రంగా చేశారు. తల్లీ బిడ్డలు, రామూ మళ్ళీ కోడిగ్రామం చాల వుత్సాహంతో చేరారు. రాముడు 'అమ్మ ఆ ఫిడేలు అటకచేరిందే తీసివాయించమ్మా' అన్నాడు. అందుకే నాగవేణి వెంట పిడేలు పెట్టెకూడ భుజంపై మోసుకొని వెళ్ళాడు.

కోడికి వెళ్ళిన రెండు దినాలలో 'ఇదే మన ఇల్లు. ఇక్కడినుండి మనమెన్నడూ కదలలేదు.' అనే ధోరణిలో మాట్లాడింది నాగవేణి. నారాయణయ్యగారు మెల్లిగా కాళ్ళ నొప్పులతోనే 'ఏమమ్మా మీ గుంపు సరిగా చేరిందా లేదా? ఇల్లు చక్కపెట్టుకొన్నారో లేదో చూద్దామని వచ్చాను' అని కోడి ఇల్లు చేరుకున్నారు. 'ఉంటాము సరే! సాగువళి (భూమి సాగు) మాత్రం వద్దు' అని నవ్వింది.



రాముడు 'ఎవరమ్మా వ్యవసాయం చేసేది?' అని అడిగినాడు. 'నీకేం తెలుసులేరా! మీ అమ్మ నిన్ను ఎత్తుకునే బాగా వ్యవసాయం చేసింది' అని పరిహాసం కూడ చేశారు నారాయణయ్య.

ఎండకాలం శెలవులు కాగానే రాముని మనస్సు చాల చంచలం అయింది. 'ముందేమి చెయ్యాలి?' అనే తొందరపాటు చుట్టుకుంది. ఇసుకదిబ్బలపై రాలిపడే ఆకులలాగు చంచలంగా కొట్టుకొని పోగలడా! మంగుళూరు వదిలిపెడితే ఎక్కడికి వెళ్ళాలి? మద్రాసు! అక్కడ చదువు అనుకూలమే. కాని వుండటానికి నిలువనీడ, పట్టుకొమ్మ వుండాలిగా! ఎన్ని రూపాయల ఖర్చో ఏమో! నారాయణయ్యగారికి ఈ మధ్యనే సదాశివుడొక వుత్తరం వ్రాశాడు. 'అమ్మ, అక్క ఏలాగున్నారు? రాముడేం చేస్తాడు?' అని వ్రాశాడు. నారాయణయ్య సంగ్రహంగా వ్రాశారు. 'నాగవేణి. వాళ్ళమ్మ కొంతకాలం అక్కడే వుండాలట. రాముడు ఇక్కడికొచ్చాడు. కాని మంగుళూరికి వచ్చే అభిప్రాయం ఎవరిలోనూ కనుపించలేదు.' అని వ్రాశారు. ఈ చివరిముక్క చాల బాధ కలిగించింది సదాశివునికి. 'తన తల్లికి కూడ తన ఇంట్లో మనస్సు విరిగిందేమో' అని తోచింది. భార్యతో 'చూడు, నీ నోటి దుడుకుదనంతో అమ్మకు చాలా కోపం వచ్చింది' అని తమ్ముణ్ణి అన్ని వివరాలు అడిగి తెలిసికొని పినతండ్రికి మరల ఒక ఉత్తరం వ్రాశాడు. 'వాళ్ళకు వేసరిక వచ్చివుండవచ్చు. రామునికి ఎస్.ఎస్.ఎల్.సి. అయింది. అది ఏమీ పనికిరాదు. బి.ఎ. చదువని. నేనూ తమ్ముడు కలిసి నెలకు పది రూపాయలు మాత్రం పంపగలము. తరువాత వానిష్టం.' అని వ్రాశారు.

కాగితం తాత్పర్యం తెలిసింది. రాముడు 'అమ్మ! వారి పది రూపాయలు కూడ వద్దంటాను.' అంటే, తల్లి, అమ్మమ్మ 'ఎవరైనా సహాయం చెయ్యకుంటే ఎలాగురా. పది రూపాయలదాకానైన కొంత కష్టం తగ్గుతుందిలే' అన్నారు. డబ్బు వదులుకునే స్థితిలేదు. అడిగే బుద్ధిలేదు. అప్పటికేమీ నిశ్చయానికి రాలేదు.

జూన్ నెలకు రాముడు తన తల్లికి వీడ్కోలు చెప్పాడు. 'అమ్మ! నా బెంగవద్దు. ఎల్లాగైనా బి.ఎ. కష్టపడి చేస్తాను. ఒక స్థలం చేరిన తరువాత నీకు వుత్తరాలు వ్రాస్తాను. అందాకా వ్రాయను. చింతపడవద్దు' అని తల్లిని ఓదార్చాడు. కొడుకు ప్రక్కన తల్లి కూర్చుని తన మగని చరిత్రలు చెప్పి తన భంగపాట్లు వివరించి అంగలార్చింది. 'వారేమో వదలిపెట్టారు. నేను ప్రాణంతో వున్నానంటే నీ కొరకే అని నమ్ము. నువ్వూ చెయ్యి వదలితే నా ప్రాణాలుండవు. నీపైన ఒట్టు.' అని ఏడ్చింది. రేపే వూరు వెళ్ళే కొడుకుతో ఇంకేమి చెప్పగలదు? చెప్పింది.

కోడిగ్రామం ఉదంతం వింటే రామునికి గుండె ఝల్లుమంది. తన మనస్సులో జ్ఞాపకం లేని క్రూరుడు, ఘాతుకుడు అయిన కటిక తండ్రివట్ల కూడ చాల కోపం వచ్చింది. తల్లి విషాదగాథ నాటకంలాగా కళ్ళకు అకట్టుకుంది. గుండె నీరైంది.

తా నెవ్వరని జ్ఞానం వచ్చి తన కన్నీరు తల్లిపై పడేలాగా దుఃఖించి 'అమ్మా! నన్ను నమ్మూ, వారిలాగు ఎన్నడూ చెయ్యను' అని అమ్మ చెయ్యి లాగి తన చెయ్యిపెట్టి ప్రమాణంచేశాడు. తల్లి వాణ్ని తన కౌగిట్లో అదుముకొని మరింత ఏడ్చింది. మరునాడు రాముడు తన తల్లికి చెక్కిళ్ళానిచ్చి ముద్దుమాట్లాడి, అవ్వగారికి నమస్కరించి ఆశీర్వాదం పొంది వెళ్ళాడు. 'బచ్చీ వెళ్ళొస్తా' అని దానితో నాన్నాళ్ళ పరిచయానికే చుట్టంలాగు పలకరించి వెళ్ళాడు. ఐరోడులో చాలసేపు చిన్నతాతతో మాట్లాడినాడు. 'నా క్లాసు పిల్లవాడు ఉత్తీర్ణుడైనాడు' మద్రాసులోనే వున్నాడు. నన్ను రమ్మన్నాడు. అక్కడ మనప్రాంతంవారు కూడ చాలమంది వున్నారట' అని చెప్పాడు. పిల్లవాని ధైర్యానికి తాతగారు ఆశ్చర్యపడ్డారు; అభినందించారు. 'సరే వెళ్ళిరా! అమ్మను, అవ్వను మరువరాదు' అని బుద్ధిచెప్పారు. వాని చేతికి ముప్పై రూపాయలిచ్చి 'జాగ్రత్త!' అని ఆశీర్వాదించారు. 'అక్కడ అన్నీ కుదిరినాక జాబులు వ్రాయి. నాకు కొద్దిగా ఇంటిచిక్కులున్నవి. కష్టాలకు తప్పక ఆదుకుంటా. సంకోచవడవద్దు' అన్నారు. విద్య తప్పక పూర్తిచెయ్యాలని ఆదేశించారు.

మరునాడు సాయంకాలానికి మంగుళూరు వెళ్ళాడు రాము. మామ ఇంటికి భోజనానికి వెళ్ళలేదు. తన వుపాధ్యాయుల ఇంటికివెళ్ళి ఎక్కడా కనబడకుండా స్కూలుకే వెళ్ళి సర్టిఫికేట్లు తెచ్చుకున్నాడు. రెండు పరిచయ లేఖలు తెచ్చుకున్నాడు. రెండవ రోజు మద్రాసుకు రైలెక్కాడు.

ఒంటరిగా ఎవరూ తెలియని రాముడు 'రామారావు' అని చలామణి అయి, అప్పుడప్పుడు కిటికీలో తొంగిచూచి సాగే మైదానాలను, దృశ్యాలను చూస్తున్నాడు. బండిలో రాత్రి నిద్రకూడ పట్టింది. మనసు మాత్రం శూన్యాకాశమే. అంతా క్రొత్తదే-అనిశ్చితమైన భవిష్యత్తు! మరునాడు మద్రాసు స్టేషనులో దిగాడు; తన పక్కచుట్టను చంకన బెట్టుకొని దిగాడు. కూలీలకు మాత్రం తన బెడ్డు నివ్వలేదు. టిక్కట్టు అప్పగించి చూశాడు. 'ఎక్కడికెళ్ళాలి! ఎవరూ రాలేదే!' అని యోచించాడు.

తన స్నేహితుడేమో తనకంటే ముందుగానే మద్రాసు చేరాడు. వాని అడ్రసు కూడ ఇచ్చాడు. వాడు ఒకవేళ రాకుంటే — అని యోచించాడు. నోటిలో వేలువేసికొని ఎదురుగుండా మనుష్యులను నింపుకునే ట్రాములు, ఒకటి తరువాత ఒకటి పరుగెత్తే బస్సులు అన్నీ చికాకు కల్గించాయి. ఎంత ఎదురుచూచినా ఎవరూ కానరాలేదు. ఎంతసేపు వేచివున్నాడో ఎవరు చెప్పగలరు?



# 24

రైల్వే టికెట్టు గేటువద్ద నిలబడి ఎంతసేపు నుంచున్నాడో వీధులలో ఎందరిని చూశాడో తెలియలేదు. ఊరివారైనా పరిచితులైనా దొరుకుతారేమో అని చూసి ఆశాభంగం చెందాడు. తరువాత విసుగుతో 'సత్రం వుందా?' అని అడిగాడు. ఆ సత్రం లోనవసారా, బయటి వసారాల నిండా పని లేనివారు, బిచ్చగాళ్ళు, దుర్మార్గులు అందరూ కనబడ్డారు. వీళ్ళందరూ తన పక్కచుట్ట, పైసలను కాచెయ్యకుండ వుండగలరా అనే సంశయం ఏర్పడింది? ఎవరిని నమ్మాలి? లోపలనైనా బయటైనా జేబును గట్టిగా పట్టుకొని తిరుగాడాలి.

మధ్యాహ్నం అయింది. సంధ్యవేళ అయింది. తన గురువుగారి పరిచయ పత్రాల చిరునామాలను ఎవరిని అడగాలి? కాలేజీ చేరటానికి అవి పనికి వస్తాయి. దిస, భోజనాలకు పనికిరావు.

సరే కాలేజీనైనా చూద్దామని, తిరువళ్ళిక్కేణి సముద్రం ఒడ్డుకు చేరుకున్నాడు. అక్కడ విశాలమైన ఇసుకబయలు సముద్రం అందంగా వుంది. తన వూరిలాగే సముద్ర తీరం హాయిగానే వుందని అనుకున్నాడు. తన ఊరి స్వప్నాలను చూచాడు. ఆ మోటార్లు, బస్సులు జనసమ్మర్దం కిటకిటలు, ఏమాత్రం మనశ్శాంతి నివ్వవు. తరువాత ఏమీ తోచక ప్రెసిడెన్సీ కాలేజీ ఎదుటనున్న ఇసుక మేటను చూస్తూ కూర్చున్నాడు. రేపు తప్పక ఆ కాలేజీలో చదువుతాను తనకే అదృష్టం వుండాలిగాని - అని ఏవో దివాస్వప్నం కన్నాడు ఆది చుట్టూ సాయంకాలం బీచిలో వున్న అల్లరిని కూడ మించి ఆవరించింది.

వాణె మబ్బు కలలోనే ఎవరో వాని భుజాలమీద చేతులు గట్టిగా కొట్టినట్లు అయింది. 'రామా', అని పిలచినట్లయింది. తనను ఏదో పులి పట్టుకుందేమో అనే భయం పుట్టుకొచ్చింది. 'ఎవరు? ఎక్కడ? ఏమిటి' అని గాబరాగా పలవరించాడు. వెనుకకు చూస్తే తన పిన్ని భర్త, పిల్లలు విహారానికి వచ్చారు. వాణ్ని గుర్తించారు. రామునికి తన పినతల్లి మద్రాసులో వుందనే విషయమే తెలియదు. ఒకవేళ తెలిసినా బంధువుల అదుపు ఆజ్ఞలు వద్దు అని చెప్పేవాడేమో! కాని ఆ క్షణం మాత్రం పినతండ్రి మాధవుని చూచి అయిన ఆనందం ఇంతింతనలేదు. తన రాకను గురించి వివరించాడు. 'తరువాత వసతిని వెదకాలి చిరునామాలు దొరకాక వెళ్ళాలి' అన్నాడు. మాధవుడు నవ్వి 'ఒరే పిచ్చివాడా! పినతల్లి ఇంట్లో తగిన చోటే లేదంటావా? ఒక కార్డుముక్క వ్రాస్తే నువ్వు ఇంటికే వచ్చేవాడివిగా. సదాశివుడు కూడ నువ్వు వస్తావని వ్రాయలేదు' అని ఏమో చెప్పి తన ఇంటికి మైలాపూరుకు పిలుచుకొని వెళ్ళాడు. పిల్లలను వదలేసి 'పద నీ సామాను తెస్తాను' అన్నాడు. ఇద్దరూ వెళ్ళారు. తాళంవేసి గదిలో వుంచిన సామాను కనబడలేదు. గదితలుపులు బాగా తెరచియున్నాయి. రాముడు వెలవెల బారిపొయ్యాడు.

'అయితే రొక్కం ఎంత పోయింది?' అన్నాడు మాధవ.

'రొక్కం జేబులో వుంది. నాల్గు జతల బట్టలు, పక్క-అన్నీ పొయ్యాయి. వేరే మారు దుస్తులే లేకుంటే ఇంకేం గతి' అని దుఃఖించాడు.

పరాయి ఊరి అగచాట్లు చటుక్కున బోధపడ్డాయి. మాధవుడు వాని వీపుతట్టి నెమ్మదిగా 'చూడు నాకు వ్రాయకుండా సాహసించి వస్తే నీకు సుంకం తగిలింది. పోనీ!' అని ఛలోక్తిగా చెప్పాడు.

'అవును లెండి' అన్నాడు రాముడు.

దారిలో మాధవుడు తాను ఆంధ్రదేశంనుండి మద్రాసుకు బదిలీ అయిన సంగతి తెలిపాడు. 'అక్కడ మంగుళూరివారు లేరు. మద్రాసు చాల అనుకూలం. అందరూ తెలిసిన వారే' అన్నాడు.

కృష్ణవేణి పిన్ని చాల చక్కగా ఉపచారం చేసింది. భోజనాలయ్యాక 'అమ్మ, అక్క అందరూ మంగుళూరిలోనే వున్నారుగా' అని అడిగింది. రాముడు వారి కథ వివరాలు చెప్పాడు. ఆమెకు ఏమీ బాగనిపించలేదు. 'సరే అప్ప వున్నన్నాళ్లు అంతా బాగే! ఇప్పుడేమి మిగిలింది?' అన్నది. 'కానీ నాగవేణి చాల గట్టిదేలే! కీకారణ్యంలో కూడ బ్రతుకనేర్చింది. కాని అమ్మకు పల్లె అంటే చెరసాలగాదా?' అని అడిగింది.

మరునాడే రామునికి బట్టలు పట్టించారు. ముందు గతి ఏమి అనికూడ విచారించారు. మాధవునికి 150 రూపాయల జీతం వస్తుంది. నలుగురి పిల్లలతో ఇంటి అద్దె చెల్లించి బ్రతకాలి. తాను సహాయం రొక్కంగా చేయజాలడు. భోజనానికి ఇబ్బందిలేదు. బి.ఎ. చదువవచ్చు. మంగుళూరివారి సహాయం కొంత వస్తే పరవాలేదు - అని నమ్మకం పుట్టించాడు. రాముదేమంటాడు?

●

మాధవుడు ఆఫీసుకు వెళ్ళగానే రాముడు పరిచయపత్రాల అడ్రస్సుల వేటకు వెళ్తాడు.

ఇంతలో తనకు కావలసినంత డబ్బంతా దొరికితేకూడ మంచిదే. దానికొరకు కూడ తిరుగాడినాడు. కాలేజీ ప్రవేశం సులభంగానే దొరకింది. తరువాత ట్యూషన్ ఫీజు, పై ఖర్చులు ఇంట్లో అడుగరాదని మంగుళూరివారింట్లో ట్యూషన్లు ఒప్పుకున్నాడు. చిన్న పిల్లలకు చదువుచెబితే నెలకు ఇరవై రూపాయిలు దొరుకుతాయి. మాధవ చాల సంతోషించాడు. 'కాని రామ, నువ్వేమో ఈలాగు కాలంగడిపితే నీ చదువుకు తొందరకాదా చూసుకో' అని అడిగినాడు మాధవుడు. రాముడు నవ్వాడు.

రాముడు రెండు నెలలు అమ్మకు వుత్తరం వ్రాయలేదు. మాధవుడే 'రాముడు మద్రాసులో చదువుకు చేరాడు' అని తెలిపితే సదాశివుడు కూడ వేసరికతో ఒక వుత్తరం



వ్రాశాడు. రాముడు సమాధానం వ్రాయలేదు. మాధవునికి చెప్పి, అతడు పంపిన ఇరవై రూపాయలు కూడ వెనుకకు పంపించేశాడు. 'నాకు మనవాళ్ళ సహాయం అక్కరలేదు' అని వ్రాశాడు. కృష్ణవేణి తనకు తెలిసిన విషయాలు మగనికి చెప్పింది కాబోలు. మగడు ఏమీ ఆశ్చర్యపడలేదు. 'సరేలేరా! కానీ పిన్నమ్మను మాత్రం డబ్బు అడిగి తీసికో. పరవా లేదు' అని చెప్పాడు.

ఒకసారి రాముడిని మాధవుడు అడిగాడు. 'ఏమిరా ఇంటికి వ్రాశావా క్షేమసమాచారం?' అంటే 'లేదు' అన్నాడు. సరే. భార్యతో 'వాడు ఇంట్లో ఏమి కోపం చేసుకున్నాడో! నువ్వయినా అక్కకు జాబులు వ్రాసేయి' అని చెప్పాడు.

కృష్ణవేణి రాముని సమాచారాలు వ్రాసింది. అక్కడినుండి. 'రాముడే స్వయంగా వ్రాయరాదా?' అని ప్రత్యుత్తరం వచ్చింది. అప్పుడు కృష్ణవేణి వుత్తరం ఇస్తే రాముడు నవ్వితే 'ఏమిరా! ఏమి తల్లితోనా ఇవి?' అని అనింది. 'సరే, నువ్వు కోపపడనంటే చెబుతా' అన్నాడు 'ఏమని' అన్నది. 'నేను స్వయంగా సంపాదించి అమ్మకు జాబువ్రాస్తానని శపథం చేశాను' అన్నాడు. 'అమ్మ పరుల అన్నం తినడం నాకు ఇష్టంలేదు' అన్నాడు. 'ఒరే నేను లలితత్తలాంటిదాన్ని కానురా' అన్నది. వానికి మంగుళూరిలో లభించిన అనుభవమే ఇట్టి స్థితిని తెచ్చిపెట్టింది. మనుష్యుడు ఒకరి అదుపులోవుండి భోంచేయాలంటే బాగుండదు అనుకున్నాడు. ఆమెకు మనసు కుదుటబడింది. మాధవునికి మాత్రం కొంత ఆశ్చర్యమే అయింది. చివరకు ఒకరోజు రాముడు కృష్ణవేణి వద్దకు వచ్చి 'చూడు కోపపడనంటే చెబుతా. నేను అమ్మకు జాబువ్రాయనా?' అడిగాడు.

'ఎప్పుడో వ్రాయాల్సింది. నాల్గుమాసాలైనా రాయకుంటే ఎలాగు?'

'సరే అలాగే వ్రాస్తాను. నేను రేపటినుండి ఇక్కడికి భోజనానికి రాను. మంగుళూరివారింట ట్యూషన్లకు 20 రూపాయ లిస్తామన్నారు. మరిరెండుచోట్ల పదేసి వస్తాయి. ముప్పై రూపాయలు హోటేలు, పది చదువుకు సరిపోతాయి.' అన్నాడు.

కృష్ణవేణికి వేసరకొచ్చింది. 'ఐతే ఇది నీ ఆఖరు తీర్మానమేనారా? ప్రతిదినం మాట్లాడటానికైనా ఒకసారి రారా, పరస్థలంలో తమవారిని విడువరాదు. అరుచి అనకుంటే కాఫీతాగి పో. పడుకో వచ్చి. మా ఆనందుమాత్రం నిన్ను వదలి వుండలేదు.' అన్నది.

రాముడు నవ్వాడు. 'సరే నేను ఇంట్లో వుంటూ హోటేలు భోజనం చేస్తానులే-నా అన్నం నేను సంపాదించి తింటున్నాను అనే సంతోషం, తృప్తి దక్కని నువ్వు చూపినంత ప్రీతి. అభిమానం మరెవ్వరూ చూపలేదు. అది చాల పటునిచ్చింది.' అని ఏమో మాట్లాడుతుండగా నాల్గు సంవత్సరాల ఆనందు పరుగెత్తుకుంటూ వచ్చాడు. 'అన్నా నువ్వు తినకుంటే నేనుకూడ తినను' అన్నాడు. 'లేదులేరా!' అన్నాడు రాము.

మరునాడు భోజనం వేళకు రాము లేడు. మాధవుడు చాల ఆశ్చర్యపడ్డాడు. భార్యను విచారిస్తే తెలిసింది. 'అయితే చెడ్డబుద్ధితో మాత్రం అలా చెయ్యలేదుకదా!' అని అడిగాడు. కాదన్నది. రాముడు రాత్రి ఇంటికి వస్తే ఆనందు పెద్దగా ఏడ్చి కేకలుపెట్టాడు. 'రామన్నా నువ్వేమో మా ఇంట్లోనే భోంచెయ్యాలి. లేకుంటే నేను తినను' అని హఠం పట్టాడు.

రాముడు ఆరోజే తల్లికి అన్నీ వివరాలు వ్రాశాడు. తాను క్రిస్‌మస్‌కు రానని మే నెలలోనే వీలుకలుగుతుందని వ్రాశాడు. ఇక్కడి కోలాహలంతో తికమక అయింది. రాముదేమి చెప్పినా వాడు వినటంలేదు. మాధవుడుకూడ ఆ చిన్నపిల్లవానిని సమాధానం చెయ్యలేక పొయ్యాడు. తానుకూడ రాముణ్ని విడువలేక పొయ్యాడు. మాధవుడు ఒక తీర్మానం చేశాడు. 'రామ! నేను ఇలా చెబుతుంటే నాకే సిగ్గేస్తుంది. నీ వంతమేమో హొటేలు అన్నమే తినాలనా? లేక సంపాదన చెల్లించదలచావా?'

'ఎందుకిల్లా అంటారు? నేను పందెం గెలవాలని అనుకున్నారా?'

'సరే, నీ ఇష్టం. హొటేలుకు ఎంత వృథా చేస్తావు?'

'అది వృథా కాదు. భోజనానికి పన్నెండు రూపాయలు.'

'సరే రామ! ఆ రూపాయలు నాకే చెల్లించు. ఇక్కడే తిను.'

సమస్య ఆ విధంగా పూర్తి అయింది. మాధవుడు ఎంతో సిగ్గుతో ఆ మాటలు అన్నాడు. తాను ఎంతో అవమానం అనుభవించానని తెలుసు. కానీ, ఆనందుసికిగాను ఆ మాత్రం చెయ్యాలి. రామునికికూడ ఇంట్లో డబ్బివ్వడమంటే అవమానించినట్లే తోచింది. ఆనందు కొరకే వాడు ఒకరోజు హొటేలు సంతర్పణ తిని తృప్తి చెందాడు.

నెల పూర్తిఅయ్యాక మాధవుడు కృష్ణవేణితో, 'చూడు, రాముడు రూపాయలిస్తే తీసుకో, బుద్ధి లేనివాడు. మీ అక్కకు జమచేసి పంపు. రామునికి మాత్రం తెలుపవద్దు' అన్నాడు.

కృష్ణవేణికి అది మంచి ఉపాయమని బోధ పడింది. ఆమె అక్కకు అన్నీ వ్రాసింది. కాని, తనపై ఒట్టుగా భావించి రామునికి మాత్రం ఆ డబ్బు గురించి వ్రాయవద్దని చెప్పింది.

నాగవేణి తన కొడుకుయొక్క చేష్టలకు ఏడ్చింది. 'అతని దురదృష్టం కానీ, కొడుకు సత్యం, నిజాయితీలనైన చూచే భాగ్యం లేదే!' అని ఏడ్చింది.

నెలకు పన్నెండు రూపాయలు మనియార్డరు రాగానే నాగవేణి తన మామగారిలాగా తలుపు ప్రక్కన, నాగబంధం వెనుక సందులు చేసి పెట్టెలాగ అమర్చి డబ్బు దాచిపెడుతూ వచ్చింది.



తరువాత ఎన్నోనాళ్లు నాగవేణి తన కుమారుని భవిష్యత్తు గురించి పగటి కలలు కంటూ వచ్చింది. కొడుకు వెంటనే వున్నట్లు, మాట్లాడినట్లు భావిస్తూ వచ్చింది. వాడెప్పుడు వస్తాడో అని యెదురుచూస్తూ వుండేది. ఈ మధ్య కృష్ణవేణికూడ జాబులు వ్రాయలేదు. వారానికి ఒకసారి వ్రాస్తుండేది. ఆమెకేమో రాముడుకూడ తన కొడుకే అని గర్వం. మాధవునికి విశ్రాంతి లేదు. ఆఫీసులో దాస్యంతో పగలంతా గడచేది. ఇంటికి రాగానే ఒకసారి అయినా రాముని గుణం గానంచేస్తూ వచ్చారు. వారి కుమారులు వరుసగా రామచంద్ర, జయ, సదానంద, ఆనంద అన్న చదువు ముగించేవరకు నిరీక్షిస్తారు. భానువారం మాత్రం 'రామన్నా! ట్యూషను లేదుగదా! అందరూ బీచికు వెడదాం' అంటే అతనికికూడ తాను పెద్దవానిలాగా అందరిని వెంటబెట్టుకోవాలంటే సుఖం అనిపించేది. "సముద్రం అంటే మంగళూరు వకటే. మద్రాసు వకటే. అదేవిధమైన బెస్తలు, బాధలు. కాని, కోడిగ్రామం సముద్రతీరం, దాని అనంతత, శాంతి మద్రాసులో కనబడలేదు. ఈ మోటార్ల చప్పుడు, జనసమ్మర్దం ఏమీలేని సందర్భంలో వూరకుందామంటే 'సాంబశివా!' అని భిక్షం అడిగేవారి బెడద." కాని వున్నదాంట్లో తృప్తిపడాలి.

మార్చి వచ్చింది. రాము మద్రాసుకు వచ్చి ఎనిమిదినెలలు అయినవి. ఏప్రిల్‌కే వూరు వెడతాడని ఆనందుకు తెలిసివచ్చింది. వాడు, 'రామన్నా, ఊరికెడతావా? వద్దులే. నువ్వా ఇక్కడే వుండు, నాతో ఆడుకో' అన్నాడు. ఊరికెళ్లదామంటే డబ్బు లేదు. రైలు, మోటారుల ఖర్చు 30 రూపాయలు కావాలి? అందుకే అమ్మకు జాబు వ్రాశాడు.

'అమ్మా! నేను ఊరికి రాకుంటే కష్టమా? ఇంటర్ పూర్తిచేసే వస్తాను. రైళ్లకు దండుగ లెందుకు? అంత ఖర్చు ఎందుకు?' అని అనుకుంటూ విసుగ్గా వ్రాశాడు, నాగవేణి, 'బాబూ! నాల్గుదినాలు వచ్చివుండు. విసుగు వస్తే వెనుకకు వెళ్లు. మాకు మాత్రం నిన్ను చూడాలని లేదా? మీ అవ్వకూడ చాల ఆశగా చెప్పింది. ఊరకే పిదేలు వాయిస్తే వూసు పోతుందా?' అని ప్రత్యుత్తరం వ్రాసింది.

రాముడు తప్పనిసరిగా వెళ్ళాల్సే పడింది. వాని చేతిలో కానైనా లేదు. మాధవుడు డబ్బిచ్చాడు. ఇష్టం లేకున్నా తీసుకున్నాడు. మద్రాసు విడిచి మంగుళూరికి మరుదినం సాయంకాలం చేరాడు. మామలింటికి వెడదామా అంటే ఇష్టంలేదు. వద్దనుకుని హోష్టలులో రాత్రి గడిపి తెల్లవారి మోటారు ఎక్కి మాయమయ్యాడు.

మధ్యాహ్ననికి కోడిలో నాగవేణి, వాళ్లమ్మా 'పిల్లవాడు వస్తే అప్పడాలైన కాల్చకుంటే బాగుండదు అని మినుములు విసరి, పిసకి అప్పడాలు చేస్తున్నారు. రాముడు మధ్యాహ్నం ఐరోడికి వెళ్లి, దాహం మాత్రం తీసుకొని రెండు గంటలకు ఎండలో 'అవ్వా! కోడికి వెళ్లివస్తాను' అని వెళ్ళాడు.

తన ఇంటికి వచ్చి ఇంటిముందు నిలబడి దూడలాగు కేకపెట్టాడు. 'అంబా! అంబా!' అన్నాడు. అరే! తుంగను విడిచామా? కట్టివేయలేదా? ఏమో పాలు తాగేసిందేమో!' అనుకుంటూ నాగవేణి బయటికివచ్చి చూస్తే తన గిత్త రాముడే! ఆనందంతో ఆమె కేక పెట్టింది. అప్పుడే రాముడుకూడ 'ఎందుకమ్మా అంత కేక!' అనికూడ అరచాడు. నాగవేణి వాళ్ళ అమ్మకూడ బయటికివచ్చి 'ఏమిరా అంత ఆలస్యం, భోంచేద్దువు లే' అనింది.

'లేను, బరోడు తాత ఫలహారం పెట్టించారు.'

'పిచ్చి నాగూ! వానికి తెలియదు. పస్తులు పడితే, పెద్దవాడైన తరువాత దాని దెబ్బ తెలుస్తుంది. ఇప్పుడు ఒంటిలో బలం వుంది. పస్తు పడినా ఫరవాలేదు, పోమ్మా! ఏలాగైన కాని వంట చేసిపెట్టు' అన్నది.

రాముడు తల్లిచేతులు పట్టుకొని, 'వద్దమ్మా! నిజంగా వద్దు. నిన్ను చూస్తే ఎంతో తిన్నట్లే లే' అన్నాడు. నాగవేణి, కొంత అప్పడాల పిండికి నూనె రాచి 'పిండినైనా తింటావా?' అని అడిగింది. అప్పడం పిండి ఉల్లెను తన చిన్ననాటి రోజుల్లాగే ఒక్కదెబ్బతో చప్పరించి మింగేశాడు.

ఆ దినం ఇంటినిండా పండుగే. రాముడు ఇంటికివచ్చాడు అనే ఆనందం మూల మూల నిండింది. ఈ ఉల్లాసంలో తుంగకూడ కళ్ళు తప్పించి గంగపాలు పూర్తిగా తాగింది, రామునికి రాత్రి పాలకు నామాలు పెట్టింది. వాళ్లకు తెలేదు. వాళ్ళింట్లో అందరూ బిగ్గరగా మాట్లాడితే విని, బచ్చికూడ వచ్చింది. 'ఓహో చిన్నదొర వారూ! ఎప్పుడండి రాకడ! మద్రాసు పెద్దదా! మన హంగర కట్టెలాగనే వుంటుందా?' అని అడిగింది.

రాముడు నవ్వుతూ, 'బచ్చీ! మద్రాసు మన కోడిగ్రామంకంటే పెద్దదేలే? ఇంత మంది జనంకూడ లేదులే. నాల్గయిదు లక్షలమంది వుంటారు లేవే!' అని మాట్లాడి వెంటనే సముద్రం చూడటానికి వెడతానన్నాడు. అమ్మమ్మ, 'ఒరే! ఆ సముద్రం ఎక్కడికీ పోదు లేరా? సాయంకాలందాకా వుంటుంది. ఇప్పుడు ఇసుకమేట మండుతున్నది. ఎందుకురా తొందర, వంటయ్యేదాకా చాపవేసుకుని పడుకో. కాళ్ళ బడలిక తీర్చుకోరా!' అన్నది.

'అమ్మమ్మా! ఇప్పుడు ఇసుక మండుతుందని చెబుతావే. వచ్చేప్పుడు మాత్రం ఎండలో ఆ కాలే బీడుభూమి తొక్కి రాలేదా? మన ఇంటి చెరువువద్ద వుండే ఇసుక మరింత మండెక్కింది.'

'అయితే, మళ్ళీ ఎందుకురా సముద్రాన్ని కలవరించుతావు?'

'అమ్మమ్మా! ఎవరో అన్నారు. మన సముద్రం మే నెలవులకే కుందాపురం వెడు తుందని. తొందరగా చూద్దామని లే. అంతే లే.'



'ఒరే! ఏమిటీ బచ్చితో మాట్లాడినట్లు ఎందుకురా నాతో....'

బచ్చి వాని మాటలకు ముగ్ధురాలై చెరుగు కప్పుకొని చెక్కిళ్ళను చేతుల్లో వుంచు కొని నిశ్శబ్దంగా చూస్తున్నది.

'దొరగారు పిల్లతనం వదలలేదమ్మా' అని అన్నది.

'ఔనే బచ్చీ! గడ్డాలు నెరసినా ఈ కాలం పిల్లల పిల్లతనం పోదు లేవే!' అన్నది ఆమె. రాముడుకూడ ఆమోదించాడు.

ఆ తియ్యనిమాటలలోనే అప్పడాల పని ఏమీ సరిగా కాలేదు. నాగవేణి, 'అయ్యో! కాలేదే!' అని మరింత శ్రద్ధగా చేసింది.

రాముడు 'అమ్మా! నేనుకూడ చేస్తానమ్మా' అన్నాడు.

'మద్రాసులో అవికూడ నేర్పుతారా ఏమిటి?' అన్నది తల్లి.

'మద్రాసు అప్పడాల సంగతి నీకేమి తెలుసు? కాగితంలాగు పలుచగా చేస్తారు. నాలుకపైన వేస్తే కరగిపోతుంది. కోడివాళ్ళలాగు పిడకలలాగ చెయ్యరమ్మా' అన్నాడు.

'మీ మద్రాసు పెద్ద నగరంలే మహారాజా' అనింది నాగవేణి.

రాము అప్పడాలు చేసే వేషంలో అప్పడాల కర్రకింత, పీటకింత, వేళ్ళకింత పిండి మెత్తించాడు. ఒకటి ఎల్లాగో చేసి, 'అమ్మా! బాగుందా' అని అడిగాడు.

'పోనీ లేరా! అది కాలేజీ అప్పడంలే' అన్నది.

'అవునమ్మా! దొరగారు మద్రాసులో అన్నాళ్లు చదివితే కదా, ఒక అప్పడం చే.... ....య గల్గినారు' అని బచ్చికూడ పరాచికమాడింది.

'అవునే బచ్చి, అక్కడ దోసె పిండితోనే అప్పడాలు చేసేస్తారు' అన్నాడు.

'ఔనా అమ్మగారు!' అని బచ్చి అడిగి తన మూర్ఖత్వం బయట పెట్టుకుంది.

తల్లి వానికి సాయంకాలంలోగా ఉపాహారం అందించింది.

'అమ్మమ్మా! నువ్వేమో వంటచేసిపెట్టు. మేము ఇద్దరం సముద్రం చూసేసివస్తాము' అన్నాడు రాము. 'చూడమ్మా, అక్కడ పిల్లలతల్లి నిత్యము పిల్లలను వెంటబెట్టుకుని వెడు తుంది. మంచిది' అని తన పినతల్లిని పొగడాడు. తల్లివెంట వెడుతూ, 'బచ్చీ! నువ్వుకూడ రావే, గాలి తిందువు గానీ' అన్నాడు.

'అవునులే దొరా! తిండి లేనివాళ్ళు అందరూ అదేగా తింటున్నది?' అన్నది బచ్చికూడ నవ్వుతూ. రాముని మనస్సు నలిగి, చిన్నబుచ్చుకుంది. 'అమ్మ, వాళ్ళంతా ఏలాగున్నారే పాపం!' అని బచ్చి వివరాలు అడిగాడు.

'అదిప్పుడే చెప్పిందిగా!' అన్నది తల్లి.

'అయ్యో పాపం!' అన్నాడు రాము.

ఇసుక దిబ్బలెక్కి- ఎదురుగుండా తమ వూరి సముద్రం చూడగానే రామునికి పిచ్చెత్తింది. నోరు తెరచి ఎలుగెత్తి ఆ గాలికంటె వేగంగా కేకలు పెట్టాడు.

'నీకేం పిచ్చి పట్టిందా? అక్కడకూడ సముద్రం సైరు వెడుతున్నావన్నావు గదరా!' అన్నది అమ్మ.

'ఎన్నాళ్ళు వెడితేనేమి? మన సముద్రానికి అది దేనిలో సరిపాటి? ఇక్కడిలాగు కేకలుపెడితే ఆస్పత్రిలో దాఖలు చేస్తారు అక్కడ. సాయంకాలం అయిందంటే ఆ ఇసుక తీరమంతా ఇసుక రాలకున్నంతమంది క్రిక్కిరిసి కూర్చుంటారంటే నమ్మ. ఈ శాంతి అక్కడ ఎక్కడొస్తుంది?'

'అయితే మన సముద్రమే నయం అంటావు?'

'మనది మనకు ఎప్పటికి గొప్పదేనమ్మా!'

'మద్రాసులో బాగా ఛలోక్తులు, తమాషాలు నేర్చినావు రాము' అన్నది.

'అవున్లే! పిన్నికూడ అల్లాగే అంటుంది. నేనేమో అతిగా మాట్లాడుతానంటుంది. నిజమేనా?'

'అవునురా! మాటలేమో ఎక్కువైనాయి. మంగుళూరిలో ఏమో నాలికకు కళ్ళెం విగించారేమో! ఇప్పుడా లగాం లేదురా!'

'ఈ సంవత్సరం మనస్సు బాగా వికాసం చెందిందిలే నాకు! సరే మీ రెల్లాగున్నారమ్మా?'

'అప్పుడప్పుడు చిన్నాన్న వస్తారు. సరిగా విచారిస్తున్నారు. అన్నీ బాగున్నాయి. మిగిలిందంతా నీదే చింత.'

'అయితే, కాలక్షేపం ఎల్లాగు? ఫిడేలేమైనా వాయిస్తావా?'

'వాయిస్తానురా. ఎల్లప్పుడూ కాదు. ఎప్పుడో ఒకసారి. ఎప్పుడూ నీ చింతనేరా. జాబులు వ్రాయవూ? బచ్చి వస్తుంది.'



'అమ్మా, ఏమది! కుంయ్, కుంయ్; టుంయ్, టుంయ్ అంటారు? దానినుంచి ఏమి కడుపు నిండుతుందా మరి?' అని అడుగుతుంది.

'పొద్దు పోకుంటే వాయిస్తానే' అంటాను.

'ఫిడేలు మానితే అ దూడను ఆడించుకుంటా. అది ఈ మధ్య వంట ఇంట్లోకే దూరుతుంది. నా వీపు నాకుతుందిరా! ఆ మూగజీవులకు కూడ యెంత ఆశరా!'

'వాటికున్నంత ప్రేమ మనుష్యుల కుండదమ్మా!'

'నిజంలేరా!'

అని ఎన్నో మాట్లాడుతూ సరిగా సముద్రం నీటి అంచుకు చేరుకున్నారు. నోటి నీరు ఎండిపోయి దాహమేసేదాకా మాట్లాడుకున్నారు. పొద్దు గూకిందికూడ వారికి తెలియలేదు. కాకుల గుంపులు నేరుగా తలపైగుండా వెళ్ళినా తెలివిలేదు. దూరపు ఉప్పునీటి మడుగుల నుండి చేవలకంపు కొట్టినా మాటలలో పట్టించుకోలేదు.

చీకటి కమ్మితే లేచి నిలబడ్డారు. ఇంటికి బయలుదేరారు. మళ్ళీ 'ఎండకాలం. గాలికి రాత్రి పడుకొన్న పాములు లేచి పారాడుతాయి. జాగ్రత్తగా వెళ్ళాలి' అని జాగ్రత్తగా నడచారు. మొగలి పొదలనుండి వాళ్ళకు మాత్రం అప్పడాల వాసనే తగిలింది. 'అయితే ఆ పొదలో పాములు చుట్టుకుని వుంటాయి కాదూ!' అని అడిగాడు రాము. 'వాటికేమి ఎక్కడైనా వుంటాయి' అని అన్నది అమ్మ.

రాముడు ఇంటి చెరువులో దిగాడు. అమ్మమాత్రం కాళ్ళు కడుగుకొని వెడితే, వాడు గొంతుదాకా మునిగి స్నానం బాగా చేసేశాడు. నోటిలో నీళ్ళు పోసుకుని 'గుళగుళ' అని పెద్ద చప్పుడు చేస్తుంటే తల్లి వచ్చి, 'ఏమిరా, మద్రాసులో స్నానం గట్ర చెయ్యవా?' అంటే లేచాడు. తరువాత భోంచేశాడు. అవ్వకూడ 'బాబూ! ముంతమామిడి గింజలకు పోపు పెడితే బాగుందా?' అని అడిగింది,

'అవునులే, ఎవరు తిన్నారు' అని అంటే అందరూ నవ్వుకున్నారు.

'ఒరే! నీకు మాటల్లో మతిమరుపుకూడ వచ్చిందిలే; నేనే బచ్చితో చెప్పి జీడిగింజలు తెప్పించాను. బకాసురినిలాగు తిన్న జ్ఞాపకం కూడలేదే!' రాముడుకూడ నవ్వాడు. 'సరే, నేనే అంతా తినేశానులే - అల్లాగే - రేపుకూడ చేయమ్మా!' అన్నాడు.

తరువాత మళ్లీ తల్లికూడ పిల్లవాడుగా మారి మాటలలో చేరింది. నాగవేణి తల్లికి చాల వినుగుపుట్టింది. 'ఒరే, అన్నాళ్ళు మద్రాసులో తిరిగి, చదివి, ప్రయాణాలుచేసి శ్రమ పడ్డావు. నోటికైనా తీరికలేదు-పడుకోరా!' అని గద్దించింది.

తల్లి కొడుకులు నిద్రపొయ్యారు. తరువాత మళ్ళీ లేచి గుసగుసగా ఎన్నో మాట్లాడుకున్నారు. 'అయితే, కృష్షి ఇంట్లోనైనా నీకు సుఖంగావుందికదా!' అని అడిగితే 'అలిత త్తకూ పిన్నికీ హస్తిమశకాంతరంలే. నక్క ఎక్కడ - నాగలోకం ఎక్కడ అంటారే!' అన్నాడు రాము.

మళ్ళీ మాటల్లో అలసటచెంది పడుకున్నారు. మరొక గంటకు రాముడు లేచి 'అమ్మా' అన్నాడు.

'ఊం....'

'నిద్రపట్టలేదా?'

'ఈవేళ నిద్ర రాదులే.'

'అయితే వెడదాం పద. ఆ ఇసుకదిబ్బపైన కూర్చుందాం. చల్లగా గాలి వస్తుంది.' అన్నాడు.

'ఒద్దురా! అమ్మకు కోపం వస్తుంది.'

'అమ్మమ్మకేం-సణుగుకుంటుంది. మన మాటలు ఆ తాటికమ్మల చప్పుడులో చేరిపోతాయి. రామ్మా రా! నీ ఫిడేలు పట్టుకొనిరా! విందామని ఆశగా వుంది.'

తల్లి కొడుకు ఆశలకు లొంగిపోయింది. ఇద్దరూ దొంగల్లా తప్పించుకొని ఇసుకగట్టుల నెక్కారు. అష్టమి చంద్రుడు పుట్టాడు. ఆ లేత వెన్నెలలో సముద్రపుటంచు వల్లని కత్తులకు దంతం ఒరలలాగు మెరుస్తున్నది. నాగవేణి ఫిడేలుకు శ్రుతిబెట్టింది. మనస్సు ముంగిటింలో ఎగురలాడే లేగల చిందుల్లాగు ఎక్కడో గంతులు పెడుతున్నది. స్థిరంగా లేదు. 'అమ్మా! నీకు ఇంత అనుభవమున్నా శ్రుతిపెట్టడమే రాలేదు' అని లాగుకొని చెవులు బిగించి; కమానును ఉత్తరంనుండి దక్షిణానికి లాగేసరికి భూమి దద్దరిల్లిపోయింది. తల్లి ఓరచూపుతో వాణ్ని చూస్తుంటే ఎండ్రకాయ దగ్గర నుంచుని, నక్క తిందామా వద్దా- అని ఆలోచించినట్లున్నది.

రాముని చేతులు సముద్రం హోరుకు తగినట్లే వాయిస్తున్నాయి. ఏదో రాగంనుంచి రాగానికి దూకుతున్నాడు. లాగుతాడు - మెల్లిగా పలుకోబెడుతాడు - రాగాలకు నానాబాధలు పెడ్తాడు. తెల్లవారినా వాని చేతులు ఆగవు. వాద్యం మానడు.

వడ్లుదంచే అలవాటుగల బిచ్చి లేచి ఇంటివద్ద అమ్మగారు లేకుంటే ఆ 'టుంయ్', 'టుంయ్' వింటూ ఆ గాలికి వచ్చింది. నాగవేణి గట్టి రాతి స్తంభం మాదిరి కూర్చుంది. రాముడు పిచ్చిగా కమాను లాగుతున్నాడు. గాలిలోని స్వేచ్ఛ వాని హృదయాన్ని కూడా కదలించి పారేసింది. బిచ్చి గట్టిగా, 'అమ్మ నీ కొడుకుకు కూడ ఈ 'టుంయ్' పిచ్చి నీలాగే పట్టుకుందంటే నమ్ము' అన్నది.



ఆ రాగాలాపన ముగింపో లేక ధ్యానభంగమో ఇద్దరూ లేచారు. 'ఎందుకే నువ్వొచ్చావు?' అన్నాడు రాముడు.

'అమ్మ, ఈ గరగరకు నిద్రపడుతుందా?' అని నవ్వింది బిచ్చి. 'పోమ్మా పో! ఏదైనా దేవరనామమా, పదమా, సరిగా నైనా వాయిస్తాడా. విందామంటే, ఈ అయ్యకు కూడ నిద్ర లేకుంటే....' అని ఎంతో మాట్లాడింది బిచ్చి.

నాగవేణికి అప్పుడు తల్లి జ్ఞాపకం వచ్చింది. 'పోదాం పదరా!' అన్నది. తల్లికి చోద్యంగా తోచిందేమంటే కొడుకు ఎప్పుడు అభ్యాసం చేసి, ఎప్పుడు అన్ని రాగాలు నేర్చాడో అని. 'ఒరే! మంగుళూరులో నేను వాయిస్తే విన్నావట్రా లేక మద్రాసులోకూడ నేర్చావా?' అని ప్రశ్నించింది.

'చాటుగా విన్నది, చాటుగా వాయించేశానులే! జనాన్ని చూస్తే మాత్రం సిగ్గు, భయం వదలలేదు. ఈ దరిద్రం బిచ్చికి మాత్రం నా రహస్యం తెలిసిపొయ్యింది' అన్నాడు.

'దొరగారికి అప్పుడే కోపం తగిలింది' అన్నది బిచ్చి.

'పోనీలేవే, ఏదో తమాషాకు అన్నానులే' అన్నాడు.

ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు. అమ్మమ్మ ఇంకా నిద్రపోతున్నది. వారిద్దరూ కూడ పడుకున్నారు. నిద్రలేచేసరికి మండుటెండ వారిపైన బడింది.

# 25

సుఖంలో పొద్దు తెలియదు. అల్లాగే సెలవులు అన్నీ ఎప్పుడు అయిపోయాయో చెప్పలేము. జూనుకు తొలకరి చినుకులు పడ్డాయి. తల్లి కొడుకుల సుఖంగా వుండే రోజులు, ఆ సుఖస్వప్నాలు భంగం అయినాయి. రాముడు ఒకవారంలోనే మద్రాసులో వుండాలి. మరొక నాల్గురోజులలో కాలేజీ మొదలవుతుంది. కానీ తొందరగా వెళ్ళి ఆ ట్యూషన్ల ఇండ్లలో అవకాశం పోగొట్టుకోరాదని వెళ్లాలి. మరొక అపూర్వ సంఘటన జరిగింది. మందర్తినుండి సుబ్బికూడ అన్నకొడుకు వూరికి వచ్చాడంటే చూద్దామని కోడికి వచ్చింది. పదేళ్ళక్రితం వాళ్ళను చూశాడేమో రాముడు. పదేళ్ళనుండి ఎవరిని పంపినా సుబ్బికి వాళ్ళ ఇంటికి తాళంవుందని సమాచారం తెలిసేది. ఈసారి ఆదరాబాదరాగా తానే వచ్చింది. సుబ్బికి సంసారసాగరం విశాలంగానే వుంది. ఎనిమిదిమంది తల్లి. దానిలో ఆటు

పోట్లు, తీరిక లేదు. తల్లిగారిల్లు జ్ఞాపకం వస్తే ఎవరిని చూడాలి. ఈసారి ఎవరో వాళ్ళింటికి నాగవేణి వచ్చినట్లు చెప్పారు.

తల్లిగారి వుత్తరక్రియలు ఒరటనింట్లో జరిగాయి. సుబ్బి అక్కడికొచ్చింది కాని పుట్టింటి సుఖమెక్కడ? వెంటనే వెళ్ళిపోయింది. ఇప్పుడుకూడ సందేహించింది. లచ్చడు ఆనాడు పలుకరించనే లేదు. తానేమో బీదరాలయింది. తన అన్నగారి అశ్రద్ధ, దుర్మార్గాలకు అతని చెల్లెల్ని నాగవేణి చూస్తే ఏమంటుందో అని భయంకూడ లేకపోలేదు. సరేలే! ఎల్లాగైన నాన్న కట్టిన ఇంటి గాలినైనా తాగివెడదాం అని ధైర్యంగా వెళ్ళింది సుబ్బి కోడికి రాముడే పెద్దవాడైతే పుట్టింటి చిగురుటాకు కొమ్మయిందేమో అనే ఆశతో వచ్చింది. పిల్లలను తేలేదు. సరే వంటరిగావస్తే ఏమైనా పరవాలేదు. ఆమె ఏటిలోకి వచ్చింది. రాముడు ఏటిలోకి దిగాడు. సుబ్బి ఎందుకో నాలుక తీటతోనే కాబోలు 'ఏమిరా అబ్బాయ్! ఆ ఐతాబుల ఇంట్లోకి ఎవరైనా వచ్చారా?' అన్నది. 'ఎందుకు? మా అమ్మ వుందిగా!' అన్నాడు.

'అరే! నువ్వు రాముడారా! ఎంత పెద్దవాడయ్యావు నాన్నా! నిన్నే చూద్దామని వచ్చారా!' అని కౌగలించుకుంది సుబ్బి.

రామునికి దిక్కుతోచలేదు. 'ఎవరామె?' చిన్ననాడు ఎప్పుడు ఎవరిని చూచాడో జ్ఞాపకంవచ్చి చస్తేగా!' కాని తనను అంత ప్రియంగా చూచుకొనే ఆడదాన్ని అనాదరించ రాదని 'అమ్మా! నేను మద్రాసువెళ్ళాలి. పిన్నిగారింటికి. మధ్యాహ్నం మోటారులో మద్రాసు వెళ్ళాలి. తొందరలో వున్నాను.' అన్నాడు.

'అయితే ఒరే! నేను వచ్చింది దండుగాయె గదరా: నేను నీ సుబ్బత్తమ్మనుగాదుట్రా!' అన్నది. రాముని ముఖం చిరునవ్వుతో వికసించసాగింది. 'అయితే మీరా సుబ్బత్త, నాకు సరిగా జ్ఞాపకం లేదు. మీకింకా జ్ఞాపకముందా? వెడదాం రండి' అని తన మద్రాసు ప్రయాణం కొంత వాయిదావేసుకున్నాడు.

'అత్తా మిమ్మల్ని ఎప్పుడు చూశానో ఏమో!'

'అప్పుడు లేరా! నువ్వేమో జేనెడే వుంటివిలే! ఇప్పుడైతే చాల పెరిగేవులేరా! అమ్మ వుంటే మిమ్మల్ని చూచిపోతుంటిలేరా! మీనాన్న అందరినీ వదలిపెట్టాడు. నేను రాకపోకలు మానుకున్నాను. ఎవరైనా వుంటేగా రావాలి? అయితే మీ అమ్మ ఈ వూరొచ్చి ఎన్నాళ్ళయిందట?'

రాముడు దారివెంబట ఎన్నో సంగతులు చెప్పుకుంటూ అత్తవెంట ఇంటి ముంగిట్లోకి వచ్చాడు. రాముడు మళ్ళీ ముంగిట్లో చప్పుడుచేస్తే నాగవేణికి ఆశ్చర్యమయింది. 'ఏమిరా ఏమైనా మరచావుట్రా' అన్నది. 'సుబ్బత్తను!' అని నవ్వాడు.



రాముడు ఆ పగలంతా తన ఇంటి పూర్వగాథల నన్నింటినీ విన్నాడు. తండ్రిగారి బాల్యక్రీడల, తాతగారి కీర్తి, శ్రద్ధ, శ్రమలు అన్నీ చెప్పింది సుబ్బి. మరువకుండ పనస కాయల అప్పడాలు, వరుగులు, వడియాలు వేయించి రాముని నోట్లో పెట్టింది. రాముడు కొన్ని పచ్చి అప్పడాలు విరుచుకొని కొరికి పారేశాడు. 'ఓ అత్తా! నువ్వు ఒక నిమిషం ఆలస్యం చేసుంటే రాముడు నిన్ను చూడలేక పొయ్యేడివాడు లే' అని పశ్చాత్తాపపడ్డాడు.

సుబ్బత్త పట్టుపడితే, తనకు టయిం లేకున్నా ఆమె మమతలు, ఆప్యాయతలను కాదనలేక మరునాడు మందర్తికి వెళ్ళి ఆమె ఇంటిని, పిల్లల్ని చూచుకొని వచ్చేశాడు. 'మళ్ళీ సెలవుల్లో వస్తే, నేరుగా మీ ఊరికే వస్తాలే' అని చెప్పివచ్చాడు.

మళ్లీ తొందరగా మద్రాసుకు వెళ్ళాడు.

ఈసారి వానికి రైలు ప్రయాణంలో తన కంటికి సుబ్బత్త తప్ప ఇంకేమీ కానరాలేదు. 'ఆమె వెనుక తండ్రి లచ్చన్న ఎక్కడుంటాడు- ఏమయ్యాడు. వెనుకసారి విజయనగరంలో వున్నాడన్నారే! ఒకసారి చూచిరావాలి' అని అనుకున్నాడు.

యోచనలు దొర్లిపోయినట్లే రైలు, దానిలో గాలికూడ దొర్లుతున్నాయి. రెండవరోజు ఆనందంగా మద్రాసులో వున్నాడు. మూడవరోజు ట్యూషన్లు ప్రారంభమయ్యాయి. ఇంటర్ సీనియర్! పాఠాలు బిరుసెక్కాయి.

డిసెంబరులో సెలెక్షను పరీక్షట. చదివి చదివి కళ్ళు ఎర్రనైయాయి. సరే, తాను పరీక్షకు కట్టాలి. మూడు నెలలు ఎల్లా గడపాలి. ఇంటికి జాబు వ్రాశాడు. 'అమ్మా! ఇంకెవ్వరినీ అడుగలేను. నేను పాఠాలు చెబితే నా పాఠాలు సాగేట్లు లేదు. మూడునెలలు మాత్రం ట్యూషన్లు మానుకోవాలి. అయితే ఖర్చుకు కాసులు లేవు. ఏమో!' అని వ్రాశాడు. మాధవునికి ఇది తెలుసు. 'సరే, నా వద్ద డబ్బు తీసుకో, నువ్వు ఉద్యోగం చేరాక తీరుద్దువు కానీ' అన్నాడు.

రామునికి దారి కానరాలేదు. కాని, మాధవుణ్ణి తొందర పెట్టేదంటే తప్పే. అప్పుడే అమ్మ యాభైరూపాయిలు మనియార్డరు పంపింది. రాముడు నమ్మలేదు. తరువాత ఒక జాబుకూడ అమ్మ వ్రాసింది.

'ఒరే! రామూ: నీ అదృష్టం బాగుందిలే, కిటికీ అమర్చాలని తవ్వితే నూరురూపాయలున్న ముంత దొరికిందిలే. నువ్వు సుఖంగా చదువుకో. మీ తాత చలువలే! జాగ్రత్తగా ఖర్చుపెట్టు. తరువాత మళ్ళీ రాస్తే, పంపుతానన్నది. పాత కథలలో తండ్రికూడ తాత దాచిన గోడల సందులను దొంగిలించి దెబ్బలు తిన్నది విన్నాడు కాబట్టి నమ్మాడు. తాత డబ్బు తనకు దొరికిందంటే ఊహించరాని సంగతే!

కృష్ణవేణి జాబు విని, 'రామూ! సరే ఇప్పుడు కష్టాలు తేలిపొయ్యాయి, చక్కగా చదువుకో. స్వస్థంగా ఇంట్లోనే వుండు' అన్నది.

కృష్ణవేణికికూడ సందేహం ఏర్పడింది. 'ఆ గోడల్లో కిటికీలలో డబ్బుంటే, ఇల్లు పడగొడితే రాముడు శ్రీమంతుడే అవుతాడని' ఊహించింది.

నిజం దేవుడెరుగు. రాముడు కృష్ణవేణికి అన్నం ఖర్చులిచ్చాడే, అదే కోడికి వెళ్ళి మరలివచ్చింది. ఇచ్చి చెప్పిన కథనే నాగవేణి యుక్తిగా వుపయోగించి వ్రాసింది అంతే. పిల్లవాడు బి. ఎ. పూర్తిచేసేదాకా ఆ రహస్యం చెప్పరాదని తీర్మానించింది.

ఆ చదువు వేడిలోనే ఇంటర్ పరీక్షలు అయిపొయ్యేవి. తన పరీక్షలకు రాముడు రాకుంటే ఆ ట్యూషను చెప్పించేవారు అసంతృప్తి చెందారు. ఒక ఇంట్లో మాత్రం వేరే మాష్టరు రాలేదు. పదిహేను దినాలు చెప్పించి కొంత చేతిలో పెట్టారు.

రామునికి ఇంటినుంచి రమ్మని పిలుపు వచ్చింది.

పోవాలని తనకు మాత్రం లేదా! డబ్బు రైలుకు దండుగ! బి. ఎ. కు మరింత కష్టపడాలి. అందుకే సెలవుల్లోనే కొంత గడించాలి అనుకున్నాడు. ఒకసారి మధ్యలో గనుక డబ్బే చిక్కితే, తండ్రి ఎల్లాంటివాడో చూచి రావాలనే వుంది. మాధవుని భార్య- 'చాల రోజులైంది, అన్నీ చూచుకొని రావాలి' అని పట్టు పట్టింది. 'పో, పిన్నీ! నేను మీఇంటికి కావలా కాస్తాను' అన్నాడు రాముడు.

'రారా! ఒకనికేం ఖర్చు' అని మాధవుడు చెప్పినా, రాముడు వినిపించుకోలేదు. అక్కడే వుండాలని నిర్ధారించాడు.

కృష్ణవేణి మంగుళూరు చేరింది. మాధవుని ఇల్లు ఉడిపిలోనే వుంది. అక్కడినుండి అందరూ ఉడిపి చేరుకున్నారు. తరువాత అక్కను చూడాలని ఆశతో, తల్లివి అక్కను చూడటానికి కోడిగ్రామం వెళ్లింది. 'తల్లికి, అక్కకు ఆమెను చూస్తే ఆనందం కాదా!' కాని రాముడు రాలేదే! అని తల్లి యోచించింది. ఆ ఇంట్లో పెద్దవాళ్ళతో కృష్ణవేణి రామున్ని ఏదో ఒక దైవస్వరూపంగా తెగపొగిడింది. ప్రతి మాటకు 'రాముడు ఇల్లాగంటాడు, అల్లా చేస్తాడు, అల్లా చదువుతాడు' అని ఎన్నో ప్రశంసలు. తల్లికి తాను చిన్ననాడు ఎన్ని కష్టాలకు గురి అయినా, వాడు పైకెక్కి వస్తే చాలని తృప్తి కలిగింది.

చెల్లెలు అక్కతో, 'నాగవేణీ, నువ్వు అప్పుడు చాల బాగా ఫిడేలు వాయిస్తుంటివే ఏమయింది?' అని అడిగింది.



నువ్వు వచ్చి, జయకు పన్నెండేండ్లు అయింది గదా! సంగీతం నేర్పితే చాలు. అక్కడ చూడు, ఒక్కొక్కరి సంగీతానికి పన్నెండు రూపాయలు ఖర్చు. తరువాత స్కూలు ఫీజులు. ఇల్లు, పాలు ఎన్నో ఖర్చులు. ఐదేళ్ళకు మా సంసారం ఓ దారిన పడ్డది అన్నది.

ఇప్పుడు ఊరికి రాగలిగాము.

నాగవేణి 'రాముడున్నాడుకదనే! నాకంటె పదిరెట్లు బాగా వాయిస్తాడు' అని వాడు పిచ్చిగ అన్ని రాగాలు వాయించేసిన కథ చెప్పింది. కృష్ణవేణికి ఆశ్చర్యం దొంతరలుగా కల్గింది. 'అరే వాడు దొంగఅక్కా - అంతా దాచుకున్నాడు. వాడు ఇంట్లో కూనిరాగమైనా తియ్యడు. అయితే, ఇప్పుడు తెలిసిందిలే ట్యూషన్లో పాట నేర్చుకుంటాడు' అనింది కృష్ణ.

రాముడు మేనెల 'డబ్బు-డబ్బు-' అని పలవరించి, మద్రాసు ఎండలోనే చెమటలతో తిరిగితిరిగి ట్యూషన్లు చిక్కించుకున్నాడు. ఈసారి చిలుకపలుకులు (చదువులు) గాదు. గాంధర్వం. వాడు మాధవుని జాబు చూచుకొని సెంట్రల్ స్టేషను వెళ్ళాడు. రైలు దిగగానే మాధవుని పిల్లలు 'దొంగమామ, ఫిడేలు వచ్చినా వాయించడు' అని హాస్యం చేశారు. రామునికేమీ అర్థంకాలేదు. 'రాముడు — దొంగ —' అని మళ్లీ కేకలుపెట్టారు. తరువాత కృష్ణవేణి తన గుట్టు బయటపెట్టింది. ఆనందుడేమో 'అన్న పాడుతే, ఫిడేలు వాయిస్తేనే నా భోజనం, లేకుంటే పస్తు' అని కూర్చున్నాడు. వాని సంతోషానికిగాను ఏదో పాత ఫిడేలు తెచ్చి తలుపు పెట్టుకొని వాయించాడు. కృష్ణవేణికి హాయిగా వుంది. 'ఒరే ఎవరికీ వద్దు—నీకు తీరిక వున్నప్పుడు జయకు మాత్రం పాఠాలు చెప్పు చాలు.' 'హూం అంటే అన్నం ఖర్చు సున్న' అన్నాడు. వానికి తరువాత ఒక భారం తగ్గింది.

జయమ్మకు ఫిడేలు వాద్య వ్యాసంగమేమో జరిగింది. రాముడు కృష్ణవేణికి భోజనం డబ్బు ఇయ్యడానికి వెళ్ళాడు. ఆమె 'వద్దు—నువ్వు చెప్పిందేమి?' అన్నది. రాముడు కోపపడి 'మువ్వు డబ్బు తీసికోవాలి? నాకు తగినంత సంపాదన వుంది' అన్నాడు. 'బాబూ! మీ అమ్మకు నాకు ఏమో దూరమున్నట్లు మాట్లాడవద్దు' అని ఎన్నో విధాల వద్దనింది. వాడు వినలేదు. అప్పుడు ఆమె (తీసికొన్నట్లు చేసి) అక్కకే పంపుతుండినది.

బి. ఎ. పాఠములు చక్కగా సాగినవి. వాని సంపాదన ముఖ్య ఖర్చులకు చాలీ చాలనంతనే వున్నాయి. ఎవరినీ అడుగజాలడు. అమ్మకు ఎప్పుడంటే అప్పుడు గోడలోంచి ఎల్లా రాలుతుంది? భోజనానికి చింతలేదు. ఫీజు, పుస్తకాలదే కష్టం. పుస్తకాలు స్నేహితుల వద్ద, ఫీజుకు మాత్రం అతి కష్టంతో ట్యూషను చెప్పడంతో జరుపుకున్నాడు.

మరుసటి సంవత్సరం మేనెలకు రాముడు రాలేదు. ఆమెకు వేసరికవచ్చి 'ఏమో కొడుకుకూడ మగనిలాగా అవుతాడేమో అనే భయం పుట్టింది. అలా వ్రాయడానికి సాహ

సించలేదు. వాడు ఎన్నో కారణాలు వ్రాశాడు. అన్నీ అంగీకరించి 'సరే, బి. ఎ. పూర్తి చేసి తప్పక ఇక్కడికి రా' అన్నది.

మద్రాసులో నాల్గవసంవత్సరం చదువు—మైకల్‌మాసు సెలవులు వచ్చాయి. బి. ఎ. గొప్ప భారం అనిపించింది. సిగమెత్తినట్లు ఏమో చదువసాగాడు. వీలున్నప్పుడు స్నేహితుల ఇంటికెళ్ళి కలసి చదువుతాడు. తనవద్ద లేని పుస్తకాలు తెచ్చి చదువుతాడు. తన ముఖ్య స్నేహితుడైన రాజమయ్యరువద్ద సండర్‌ల్యాండు వ్రాసిన 'ఇండియా-ఇన్-బాండేజ్' అని గ్రంథం చదివాడు. రాజమణి ఒక రాత్రిలో చదివేశాడట. 'అది బహిష్కృత పుస్తకం— చదివినవాణ్ని కడలూరులోనో, వెల్లూరులోనో బంధీచేస్తారట' అని రాజమణి అయ్యరు చెప్పాడు. రాముడు అది ఏందుకు బహిష్కృతమయిందో తెలుసుకోవాలనే పట్టుబట్టి చదివేశాడు. ఊరకే వద్దంటే రాముడు చదివేవాడే కాడు.

తరువాత చదివాక రాజమణి ఎల్లాగుందని అడిగాడు.

'ఎల్లాగుంది-పరదేశస్థుడే మనదేశ బంధనాలను తెంచివెయ్యాలని ప్రోత్సహిస్తే మనం వూరకుండడం సబబుకాదు' అన్నాడు రాముడు. బి. ఎ. వెంట రాముని తలలో భారతమాత దూరుతుంది. తరువాత మాటలు నేర్చినవారితో Politics (పాలిటిక్స్‌లో) పడ్డాడు. ప్రతిరోజూ హిందూపత్రికను క్షుణ్ణంగా చదివి దేశనాయకుల పరిస్థితులు, భాషణములను చక్కగా గమనించేవాడు. ఆరోజుల్లో దేశంలో విపరీతంగా స్వాతంత్ర్యోద్యమం సాగుతుండేది. 1921 లో అసహాయోద్యమం కాలంలో తన స్కూలు రోజులలో కూడ ఎప్పుడో వూరేగింపులో 'గాంధీకి జై' అని అన్నది మరచిపోయ్యాడు. ఇప్పుడు వేడినెత్తుటిలో ఆ దేశభక్తి చేరి తైతక్కలాడుతుంది. తాను యువకుడై కూడ చేతులు కాళ్ళూ బిగించుకుని కూచుంటే సిగ్గుగా తోచింది. అవి మద్రాసు తిరువల్లిక్కేణి తీరంలో ఇసుకలో పెద్ద సభలుచేసి 'ఇంకిలాబ్ జిందాబాద్' అని కూడ నినాదాలు చేసేరోజులు. తానొక్కడు స్వార్థంలో కూర్చుంటే బాగలేదని సత్యమూర్తి ప్రకాశంలాంటి మహావీరుల రౌద్రావేశాన్ని తాళగలిగాడు.

అప్పుడే గాంధీమహాత్ముడు 'దండీపయనం' గట్టాడు. సబర్మతి అంటే భారత యువకులకు ఢిల్లీకి సమానం అయింది. అదే పానిపట్టు యుద్ధరంగం. గాంధీజీ వెంట వందలమంది లక్షలుగా మారారు. అందరూ సత్యాగ్రహసమరంలోకి దూకుతున్నారు. సత్యం, అహింస, తకలీలనే ఆయుధాలను, మంత్రాలను చేబట్టారు. సముద్రంనీళ్లు కడవలతో నింపుకొచ్చి ఉప్పు చెయ్యబట్టారు. ఆ ఉప్పు సత్యాగ్రహంతోనే దేశం ఒక వారంలోనే స్వతంత్ర మౌతుందని రాజమణి వేడిగా వాదించాడు. అంత వేగంగా కాకున్నా, భారతం అంతా ఉప్పు అనే సానరాయిపైన పదునెక్కితే ఆ రాటులు దీరిన వీరులు ఆకాశాన్ని బద్దలు చేసియైనా స్వాతంత్ర్యాన్ని సంపాదిస్తారని రామునికికూడ దృఢవిశ్వాసం కలిగింది.



నిత్యం కాలేజీలో చదువు ముగించుకుని 'బీచ్‌లో ఉపన్యాసాలు రాజమణిలాగ తాను కూడ ఆవేశంతో ఆ సభల్లో కూర్చుని ఇంటికి రాగానే 'ఏమోయ్ రాజమణి మనకు స్వాతంత్ర్యం కావాలని గట్టిగా మాట్లాడినప్పుడు కూడ దొంగల్లాగు అణగిమణగి వినాలా? ఇదేం ఖర్మ? సండర్‌ల్యాండులాంటి పరదేశీకున్న ధైర్యమే లేదు మనవారికి.' అనేవాడు. 'సరేలేరా! నువ్వే ఈ స్వతంత్ర భారతాన్ని ఏలుకుందువుకాని, నేను డబ్బు నాన్ననుండి తెప్పించుకోవాలి; దానిపైన నాకు భార్య, బిడ్డలూ కూడ వున్నారు. నేనేమైనా దొరికానంటే వాళ్ళ అన్నం, సున్నం అవుతుంది' అన్నాడు రాజమణి.

ఆ మాటలకు రాముని ఆవేశం మాత్రం తగ్గలేదు. ఈ మాటలకు తోడుగా వారి వుపాధ్యాయుల మాటలు వాణ్ని చిలికివేశాయి. కొందరెమో హెచ్చరిక చేశారు. 'రాజకీయపు అలజడి మీ విద్యార్థిదశ పూర్తి అయ్యాక తలకెక్కించుకోండి ఇప్పుడు వద్దు. ఒకవేళ మీకు ఆ పిచ్చి ఎక్కితే, బీచి సభలో కనబడితే సెలెక్షను పరీక్షకు స్వస్తి-' అని గద్దించారు. ఆదినం నుండి రాజమణి హిందూపత్రిక చదవటం మానేశాడు.

రామునికేమో ఏమీ నచ్చలేదు. 'బయట మనమేంచేస్తే వాళ్ళకేమి? అయితే మనం ఏం—వానికి ఆత్మలను కూడ అమ్ముకున్నామా మనం?' అన్నాడు. మూడునాళ్ళకు రాముని కిష్టమైన ప్రొఫెసరుగారే వచ్చారు. 'రామా! నీఅంటి బుద్ధిమంతుడు కూడ ఈ చక్రభ్రమణం చెయ్యవద్దు—ఉప్పుతో ఏమయ్యా స్వరాజ్యం గిరాజ్యం? ఎన్నో రాజ్యాలవారు, స్వయంగా వుప్పు చేసుకుంటున్నారు. వాళ్ళు స్వతంత్రులయ్యారా? ఈ వట్టి ఉత్సాహాలు వద్దు. ఆవేశం వద్దు.'' అన్నారు.

ఆ ప్రొఫెసరుగారిపైన నమ్మకం వుంది. వారి మాటలకు కాదనలేదు. మనస్సుమాత్రం ఒవ్వదు. 'సరే ఆలోచిస్తా'నని చెప్పివచ్చాడు. రాముడు చల్లబడ్డాడు. తరువాత పాలిటిక్స్ జోలికి పోనన్నాడు.

తరువాత క్రిస్‌మస్ సెలవుల సమయాన పరిస్థితులు తారుమారైనవి. సత్యాగ్రహమంటే ఊరకే పట్టుకొనిపొయ్యేది కాదు. బాగా లాఠీఛార్జికి దిగింది. ఉప్పుసత్యాగ్రహం చూద్దామని వెళ్ళిన రాముడు కూడ ఆ బీభత్సం చూడలేక భయపడి వెనుకకు మళ్ళాడు. ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు. తాను ఏమంత నపుంసకుణ్నయ్యానా? పసికూనలు, ఆడవాళ్ళు ముందుపడుతుంటే తానుమాత్రం ఎందుకు వెనుకబడాలి? క్రూరులైన పోలీసుల అఘాయిత్యం, దౌర్జన్యాన్ని ఎదురించాలి' అనుకుని సరకారుపైవుండే ఆగ్రహాన్ని ఒలకబోసుకున్నాడు. తన ఉక్రోశం పొంగి మీగడకట్టి చల్లారాక దృఢనిశ్చయంతో ఉప్పు చేసే చోటికి మళ్ళీ వెళ్ళాడు.

దేశభక్తు దొరకడు వచ్చి తమ పేరు ముందుగా లెక్కలో వ్రాయించకుండా పాల్గొనరాదని నిషేధించాడు. మరొకరోజు తనపేరెక్కించుకునే ప్రయత్నమే చేశాడు. మరునాడు

పుస్తకాలు చేతిలో లేవు. నేరుగా ఉప్పుకుండల దగ్గరకు వెళ్ళాడు. చేశాడో లేదో, 'ఇన్‌కిలాబ్ జిందాబాద్, గాంధీకీ జై' అనే వేలకొలది గొంతులతో తన గొంతుకను కలిపే శాడు. 'ఏమయిందో ఏమో' తరువాత అస్పత్రిలో తలకట్లు కట్టించుకొనిపడ్డాడు.

మూన్నాళ్లైనా రాము డింటికి రాకుంటే మాధవుడు, పిల్లలు చాల బాధపడ్డారు. అందరూ సత్యాగ్రహమనే శివమెక్కి తిరిగే రోజులవి. పోలీసులను చూస్తే 'మహాత్మా గంధీకీ జై' అని ఎగతాళి చేసేవారు. మాధవుని కొడుకులు కూడ ఇండ్లవద్ద వినాదాలు చేస్తున్నారు. ఎక్కడ చూచినా సత్యాగ్రహం. రాముదేమైనా సత్యాగ్రహం గుంపులో చేరాడా ఏమిటని మాధవుడు భయపడ్డాడు. కృష్ణవేణి 'ఛీ ఛీ! రాముడు అవని ఎన్నటికీ చెయ్యడు. ఇంట్లో ఆ మాటలుకూడ ఎత్తలేదే!' అన్నది. తరువాత ఇద్దరూ బాధపడ్డారు.

రామున్ని తలచుకొంటూ తన టేబిలుపై చూచుకొంటే అక్కడ చీటి వుంది. 'మీకు చెప్పకనే ఒక తప్పు చేస్తున్నాను క్షమించండి. దేశమాత ఆకర్షించింది. తన బంధనాలను తెంచండయ్యా అని ఆక్రందనం చేస్తున్నది. సత్యాగ్రహానికి వెడుతున్నాను. మీరేమీ కలవరంపెట్టుకోవద్దు. మన్నించండి' అని వ్రాసివుంది. రాత్రి అంతా మాధవుని తలలో కల్లోలం కాకుండా ఇంకేమవుతుంది?

'పిచ్చిపిల్లవాడు—వాడుకూడ భ్రమలోపడి సత్యాగ్రహం అని వెంటబడ్డాడు. కడుపు నిండినవాళ్ళకు అవన్నీ—కడుపుకు లేనివాళ్ళ కెందుకో ఈ బెడద' అని కలవరించాడు. ఆఫీసుకు వెళ్ళి లీవు తీసికొని ఆస్పత్రులు తిరిగాడు. ఆ సత్యాగ్రహం ప్రబలినవేళ ఆస్పత్రి ద్వారా జైలుకు దారి చూపుతుండేవారు.

కానీ స్వయంగా ఆస్పత్రిలో వెళ్ళి మాట్లాడితే సత్యాగ్రహికి బంధువని వ్రాసుకుంటే తనకేమవుతుందో అని భీతి పుట్టుకుంది. ఆ దీపస్తంభాలుగూడ సి. ఐ. డి. పనిచేస్తున్నాయి. కొంత భయపడాడు. కాని తరువాత ఏదో జనం గుంపులో దూరితే రాముడు మెత్తగా కూర్చున్నాడు. ఒకదెబ్బకే శరీరం కూలబడింది. మనస్సు సర్కారువాళ్ళ దురంతాలవల్ల మసలిపోతున్నది. శరీరమంతా వేడెక్కింది. మాధవుడు మెల్లగా 'రామ! మాతో మాట్లాడి వెళ్ళరాదా?' అన్నాడు.

'అయితే మీరు అంగీకరించేవారేనా?'

'ఇల్లాంటి ప్రాణాపాయం అవుతుందంటే ఎందుకు ఒప్పుకుంటాముదా? మాకు అనురాగం, రక్తబాంధవ్యం అవీ లేదంటావా? ఏమి మాటలు, నువ్వన్నూ!' అన్నాడు మాధవుడు.

'బాబూ! మీ అమ్మ వింటే ఆమె గుండె పగులుతుంది?'



ఆ దేశభక్తి అనే పొంగులో తల్లి దీనావస్థ కళ్ళ ఎదుట వచ్చిందో లేదో! వచ్చినా భారతమాత పిలుపుకు ఎదురాడించే శక్తి తల్లికుంటుందా? ఆ నొప్పి, తీరికలమధ్య ఏమో అమ్మ జ్ఞప్తికి వస్తుందో ఏమో!

'ఒరే నయం అయ్యాక ఇంటికి వస్తావా?'

'చూద్దాం'

'నీవు క్షమార్పణచేస్తే వదుల్తారట. పరీక్షకు కూడ కూర్చుండబెట్తారట. రెండు నెలలపాటు నీ స్వరాజ్యసాధనను వాయిదా వెయ్యరా!' పరవాలేదన్నాడు మాధవుడు.

'మీకు, నాకు, ఎందరికో ఈ అన్యాయం అర్థంకాదు. మనిషి కేవలం పొట్టతోనే వుంటే ఏమిబాగు?' అన్నాడు.

మాధవునికి వానితో మాట్లాడితే నిష్ప్రయోజనం అని తోచింది. కాని తనకు తానే బుద్ధితెచ్చుకుంటాడని నమ్మి ఇల్లుచేరాడు. మరి నాన్నాళ్ళకు చూద్దామంటే జైలుకు తీసి కెళ్ళారని చెప్పారు. ఆరునెలల కఠినశిక్ష విధించి వెల్లూరి జైలుకు పంపించారట.

కృష్ణవేణి చాలా గాబరాపడింది. కొడుకేమో పరీక్షలకు తయారవుతున్నాడని నమ్ముకున్న తల్లికేమని వ్రాయాలి? 'మీరంతా శ్రద్ధగా చూసినా అల్లాంటిపనులెల్లా చెయ్యనిచ్చారని' ఆమె అంటే ఏముంది సమాధానం? మరెవ్వరి నోళ్ళలో విని బాధపడేదానికంటే తానే శ్రద్ధగా నచ్చజెప్పి వ్రాయాలని అంతా వ్రాసింది.

నాగవేణి నెత్తిన పిడుగుపడేటంత దెబ్బ తగిలిందా? అన్నట్టు కూలిపడ్డది. తరువాత తాను విన్న దేశభక్తి కథలు, గాంధీజీ సాహసకృత్యాలు అన్నీ విని ఏమో అందరూ సర్కారును పరిహసించడానికి చేస్తున్నారనుకుంది—కానీ తన కొడుకు పాల్గొన్నాడంటే తీరని బాధ కలిగింది. బి. ఎ. పరీక్ష నాశనం చేసుకుని చెరసాలలో పడ్డాడంటే చాల వ్యథ పడింది. బహుశా తరువాతకూడ మగనిలాగే ఎన్నో వూళ్లు తిరుగుతూ ఇల్లు మరచిపోతాడేమో అని చాలా గుండె పగిలింది. 'అమ్మా! నేను చెడ్డ తలవ్రాతతో పుట్టాను. నానుండి ఎవరికీ సుఖంలేదు. అంతా పాపిష్ఠిదాన్ని. ఇంక రాముదేమి సుఖపెట్తాడు?' అని అతి కఠోరంగా నిశ్చయించుకొంది. అప్పటి పరిస్థితికూడ వాస్తవంగా అంతే—వేరే దారి తోచలేదు.

దేశభక్త రామరావు మరింత దేశాభిమానంతో గంతులువేశాడు. వెల్లూరు అంటే బిద్దరు సంత. ఆ గలాటాకు ఆకాశం బద్దలయ్యేది. ఆ గర్జనలకే పది స్వరాజ్యాలు వచ్చి వుండేవి. అల్లాగే అనేకమంది చేరారంటే, ముందు సంవత్సరంలోపుగా బ్రిటిష్

సామ్రాజ్యం కూలిపోతుంది. రూపుమాసిపోతుంది. అలాగని ఎందరో మాట్లాడుతుంటే రాముని భావోద్రేకం మరింత పొంగింది.

జైలుగోడలు విరిగేటంత క్రిక్కిరిసి ఖైదీలను నింపారు. వాళ్ళిచ్చే భోజనం కరువు కూలీల భత్యంకంటె హీనంగానే వున్నది. అందుకే ఆ ఖైదీల వుద్రేకాలు రెచ్చిపోయ్యాయి. 'నిరశనవ్రతాలు' కూడ చేశారు. అధికారులు తగ్గి పరిస్థితి కొంత మెరుగైంది. ఒక సత్యాగ్రహికే వంటపని అప్పగించారు.

ఆ విధంగా సత్యాగ్రహం — నిరశనంవల్ల భూమిని అదరింపవచ్చుని, లేక సాయుధ విప్లవం కూడ చాల మంచిదని ఒక కమ్యూనిష్టు సోదరుడన్నాడు. రాముడు పుట్టిన నాటి నుండి బీదతనంలో నలిగిపోతున్నాడు. లెనిన్ ట్రాట్స్కీలతత్త్వం బాగా హృదయంలోకి గుచ్చుకుంది. గాంధీతత్త్వానికంటే అదే నయం. ఈ పాడు సత్య — అహింసలతో ఎంతకూ తెల్లవారదని నమ్మసాగాడు, కొందరు మధ్యమార్గం పట్టారు. సత్యాగ్రహం పరిపాలించి స్వరాజ్యం పొందాలి. తరువాత విప్లవం, సామ్యవాదం, కమ్యూనిజం అని మెల్లేర్పాటు చేసుకున్నారు.

వారికి ఆవేశమే ఆత్మగౌరవం, న్యాయం, తర్కం. గొంతే వివేకం, అల్లాంటి కాలంలో రాముని తల సమ తూకంగా వుండమంటే ఎల్లాగుంటుంది?

ఒకనాడు అకస్మాత్తుగా జైలు తలుపులు తెరచారు. ఖైదీలు గాంధీ—ఇర్విన్ ఒప్పందం ఫలితంగా విడుదలయ్యారు. 'మీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళండి' అన్నారు.

రాముడు వెల్లూరు వీధులు తెగ తిరిగాడు. వానికి వేరే బట్టలు లేవు. ఊరికి వెళ్ళడానికి డబ్బులు లేవు. సత్యాగ్రహుల గుంపుతో కాట్పాడిదాకా వచ్చాడు. తరువాత ఎక్కడి కెళ్లాలి? మద్రాసుకా? మంగుళూరికా? ఎక్కడికైనా టికెట్టు లేకుండా ప్రయాణం చెయ్యవచ్చు, పరీక్ష తప్పించారని తెలిసింది. అప్పుడు మద్రాసులో ఏం పని? జైలులో అప్పుడప్పుడు తల్లి దిగులు పట్టుకునేది. 'అమ్మ ఏమంటుందో?' అని భయం. కాని మూడేళ్ళనుండి వూరెళ్ళలేదు. ఇప్పుడైనా చూద్దాం? మంగుళూరికే టిక్కట్టిప్పించుకున్నాడు. రైలులో కూడ సత్యాగ్రహులలో వాదోపవాదాలు. కొందరేమో చరఖా (రాట్నం)తోనే స్వరాజ్యం-సురాజ్యం సాధిస్తామని శపథం పట్టారు. గాంధీ అనే హనుమంతుడు బ్రిటిష్ అనే లంకేశ్వరునితో మాట్లాడాడు. తరువాత సామ్రాజ్యం దహనమవుతుందనుకున్నారు. అందరికీ విజయం కరతలామలకంగానే తోచింది. రాముడు ఆ పరిస్థితులలో రాముణ్ని చూచాడో! ఆంజనేయుణ్ని చూశాడో, రావణుణ్నో — ఏమైనాసరే తన తల్లి కేమి సమాధానం చెప్పుకోవాలి?

రాముడు మంగుళూరు హాస్టలులో దిగాడు. లలితను, చూడరాదని తీర్మానించి మౌనంగా ఇల్లు చేరుదామనుకున్నాడు. జైలునుండి తిరిగి వచ్చిన మద్రాసు దేశభక్తుడు



రామరావు కాలేజీలో మాట్లాడాల్సి వచ్చింది. రాముడు మంచి ధోరణిలో ఆవేశంతో గొప్ప వక్తలాగే ఉపన్యసించాడు: 'బీదల సేవయే మన లక్ష్యం. భారత స్వతంత్రమే తమ పరమావధి' అని ఎన్నెన్నో నినాదాలమధ్య 'శ్రీరామ బతాళజీకీ జై!' అనికూడ భయంకర నినాదాలు మంగుళూరిలో మార్మ్రోగాయి. మంచి పేరువచ్చిన ఉత్సాహంలో మరి రెండుపన్యాసాలను దంచేసి ప్రశంసార్హుడయ్యాడు.

మూడవనాడు సదాశివుడు వాని కీర్తి ప్రతిష్ఠ విని వాని ఉపన్యాసాలకు వెళ్ళి 'ఏరా! ఇంటికి రావా?' అని ఇంటికి తోడ్కొని వెళ్లాడు. తన అల్లుని చరిత్ర అతని కెన్నడో తెలిసి వచ్చింది. లలితతో సహా అందరూ అక్కరగానే చూచారు. లలిత 'ఏమయ్యా! అల్లుడూ ఊరికేనా? ఇంకెక్కడికైనా వెళ్లాలా?' అని కొన్ని సమయస్ఫూర్తి మాటలు ఆడింది. లలిత వలన తల్లి దృశ్యం బాగా జ్ఞాపకం వచ్చింది. రాముడు ఊరిదారే పట్టాడు.

మోటారులో 'మాబుకళ్' అనే స్టాపులో దిగి నేరుగా కోడికి వెళ్లాడు. చిన్న తాతను చూడాలంటే సంకోచించాడు. ఊరికే వేగంగా నడిచాడు. ఏటిలో మందకొడిగా. ఇసుక దిన్నెవద్ద పెండ్లి నడకలు. ఇంటివద్దనైతే కాళ్ళే కదలవు. తన ప్రత్యేక దుస్తుల్ని చూచుకున్నాడు. టోపీని జేబులో దాచుకున్నాడు. ఏమో ఆలోచించి ఆగి మళ్ళీ 'ఏమో ఐయింది' అనేవానిలా ఇంటి ప్రాకారంలోకి రభసంగా నడిచాడు. ఆ రభసానికి కారణం వాన చినుకులే అని గుర్తుకొచ్చింది.

దారిలో బచ్చికూడ రాముణ్ని చూచింది. అదేమో పిల్లలతో కలిసి పొలంలో కలుపు తీస్తున్నది. వానలో తెల్ల బట్టలు నాన్చుకొని వురుకులాడే రాముణ్ని చూచి 'అబ్బ! వస్తివా దొర! ఇన్నేళ్ళకు అమ్మ గుర్తుకొచ్చిందా! పో త్వరగా' అని పలుకరించింది. అది తన హృదయంలోని ఆప్యాయత అంతా గుమ్మరించి మాట్లాడింది.

రాముడు 'ఔను' 'ఔను' అని సమాధానం చెప్పాడేగాని మనస్సులో దాని మాటలు ములుకులలాగు నాటుకున్నవి. ఎందుకంటే మాటలలో అది తండ్రికి తనని పోల్చి చెప్పింది. తాను చేసిన పని — చదివినందుకు ఫలం అన్నీ ఎదురైనవి. బచ్చి మాటలలో అవ్వగారికి ఖాయిలా (వ్యాధి) అని బోధపడింది. రాముడు ఆలస్యం చెయ్యలేదు. బయటికావలి గది లోంచి చావడ్లోకి ఒక అంగలో దూకాడు. అక్కడ కాళ్ళు దాచుకున్న అవ్వగారు చూచారు. 'ఏమిరా రాంబాబూ ఇన్నాళ్ళకైనా వచ్చావా? రామ్మా' అని, 'నాగూ! చూడు ఎవరొచ్చారో! నేను అప్పుడే చెప్పానే, వాడు తప్పక వస్తాడని' అని అంతా వుపన్యసించింది అవ్వ.

నాగవేణి వానలో నానిన కట్టెలను ఏలాగో అంటించి పొగకు కళ్లుబ్బి దిక్కుతోచకుండా వుంది. 'ఏమంటివమ్మా' అని సమాధానం చెబుతూ బయటికివస్తే ఇంకేమంటుంది? రాముడు ప్రత్యక్షం.

'రామ, వచ్చావా బిడ్డ! నీ యోచనతో చచ్చి సున్నమయ్యానంటే నమ్మ! నువ్వుకూడ ఇల్లాగేనా చేస్తావు!' అని ఏడ్చింది. రామునికి కూడ కన్నీరు కారింది.

'ఒరే నాకెవరైనా ఉక్కున్నారని వెళ్ళావా? ఎవరురా, చెప్పు'అన్నది అమ్మ ఆవేదనతో.

రాముడు వెక్కి వెక్కి ఏడ్చాడు. ఎన్నాళ్ళయిందో ఆ విధంగా ఏడ్చేసి వాడు. ఆ క్షణంలో తాను నిజంగా అపరాధినే అని రుజువైంది. 'ఒరే మనస్సు నొచ్చింపా! ఏమనుకోకు, ఏడ్వకులే! భోంచేద్దువుగాని' అని ఒదార్చింది.

అమ్మకు కషాయానికి పెట్టిన మంటనార్పక మళ్ళీ త్వరగా అన్నం వుడికించింది. ఇంతలో అమ్మమ్మ రాముణ్ని పిలిచి 'ఒరే రామూ! నాకు దినాలు సమీపించాయి!' 'ఎందుకమ్మమ్మా! అలా అంటారు. పరవాలేదు' అన్నాడు. తాను మందు తెచ్చి నయం చేస్తానని హామీ నిచ్చాడు. అమ్మమ్మ ఆదేశంప్రకారం ఆ తెల్లబట్టలతోనే పూర్తిగా చెరువులో మునిగి వచ్చాడు. 'అరెరే! ఇదేంరా! తడిబట్టలతో వచ్చావు! వేరే బట్టలు తేలేదా!' అని అడిగింది.

'లేదమ్మమ్మా! అన్నీ మద్రాసులోనే వున్నాయి' అన్నాడు. వాడెప్పుడో పాతవి ఇంట్లో వదిలేసిన దుస్తుల్ని వెదకి తెచ్చి ఇచ్చింది అమ్మమ్మ. వాటిని కట్టుకొని భోంచేశాడు.

కొడుకు మనస్సు నొచ్చుకున్నాడని సంకోచంతో తల్లికూడ ఎక్కువగా మాట్లాడలేదు. గ్రహచారం బాగా లేనివాడితో మాట్లాడి అని, మనస్సు నొప్పించి వదిత్తే లాభం లేదని తెలుసు. ఏమైనా, అమ్మను తలుచుకొని వూరికైనా వచ్చాడు అంతే చాలు." అని తృప్తి చెందింది.

తరువాత రాత్రి అంతా తల్లికొడుకులు మెల్లిగా చాలాసేపు మాట్లాడుకున్నారు. రాముడు 'అమ్మా! అన్నీ ఏలాగో అయ్యాయి. వచ్చే యేడు శ్రద్ధగా చదివి బి. ఎ. పాసవుతా, ఒక ఉద్యోగం చేస్తాను' అని హామీ నిచ్చాడు, తల్లి సత్యాగ్రహాన్ని గురించి అడిగింది. దాని పుట్టుపూర్వోత్తరాలు, ఆ లాఠీచార్జీ, ఆ గొప్ప అహింసాయుత ప్రతిఘటనలు, ఆ జైలు జీవితం అంతా చక్కగా వర్ణించాడు. ఆమెకు హృదయం, ఒళ్లు గగుర్పొడిచింది. చివరకు తన కొడుకేమీ సిగ్గుమాలిన పని చెయ్యలేదని ఘనకార్యమేనని నిర్ధరించి గర్వించింది. కానీ 'బాబూ! చేసింది మంచిదే! కాని బీదవానికి సాధ్యంకాని పని. తగనిది అని అనవచ్చును. మనకు పగటికి లేదు — మాపటికి లేదు.' అన్నది. అవేమాటలు — మాధవుడు, పిన్నికూడ అన్నారని జ్ఞప్తికి వచ్చింది రామునికి.

మరునాడు రాముడు తన కర్తవ్యం నెరవేర్చాలనుకున్నాడు. తల్లి ఒకరూపాయ మళ్ళీ గోడసందులోంచి తీసి ఇచ్చింది. నారాయణయ్యగారి వద్దకు వెళ్ళాడు. తాతగారి దర్శనంతో మరొక మంగళారతి (చీవాట్లు) అయింది. 'బాబులేరా! మీ వేడినెత్తురికి ఏమీ అర్థంకాదు. సాకినవారిని — కన్నీరు కురిపించేవారిని అంతా త్వరగా మరుస్తారు' అని తాతగారు కూడ



అన్నారు. రాముడు ఏడ్వాలి — నారాయణయ్యగారు మళ్ళీ వాణ్ని సమాధానం చెయ్యాలి! ఆ ఘట్టం పునరావృత్తి అయింది. డబ్బు అడగలేదు.

నేరుగా బస్సెక్కి ఊరుపికి వెళ్ళాడు రాముడు. అవ్వగారికి మంచి డాక్టరువద్ద మంచి మందు కొన్నాడు. చేతిలో పావలా మిగిలింది. ఖర్చు చెయ్యకుండా, సముద్రతీరం పైన నడుస్తూ కోడిగ్రామం మార్గం నడచాడు.

దారిలో ఒక నడివయస్సు పెద్దమనిషి జతపడ్డాడు. అతనితో మాటలకు దిగి సత్యాగ్రహం గురించి వుపన్యాసం దంచుతూ తొణసె- కోడికి వెళ్ళే దారిని పట్టాడు. ఆయనకూడ కొంత సత్యాగ్రహమంటే ఆసక్తి చూపాడు. 'ఏమోనయ్యా! ఈ పాడు కరణీకం — కడుపు తిప్పలు లేకుంటే నేనుకూడ ఇప్పుడే సంచులనిండా వుప్పును చేయించి పంచేవాణ్నే' అన్నాడు. తరువాత తమ వూరి చీలు దారి కనబడగానే 'వెళ్ళనా?' అన్నాడు. 'ఒరే! మరచానయ్యా? అన్ని మాట్లాడి నువ్వెక్కడికి వెళుతావో నీ కుశల ప్రశ్నలు కూడ వెయ్యకుండా వెళ్లాను' అని తిరిగివచ్చి ఏమో పోగొట్టుకొన్నవానిలాగా అప్యాయతతో అడిగాడు.

'నేనండి కోడిగ్రామం వెళ్లాలి' అన్నాడు రాము.

'అక్కడ ఎవరు! ఎవరిల్లు?' అన్నాడతడు.

'రాము ఐతాళుల మనుమణ్ని లెండి?' అన్నాడు.

అప్పుడు ఆ కరణంగారు రాముణ్ని ఆపాదమస్తకం పరీక్షించాడు. ఒక్కసారి గట్టిగా నవ్వాడు 'ఓరి! డింగరీ! నేనెవరనుకున్నావు? మీ అవ్వ సత్యభామ పేరు విన్నావా? ఆమె నా చెల్లెలేరా! అయితే నువ్వు — మా సత్యభామ మనుమడివన్నమాట! రావయ్యా! రా! మా వూరు చూచి వెళుదువుగాని గంటలో ఏమవుతుందిలే' అన్నాడు. ఆ మాదప్పయ్యగారి కుమారుడు కరణం జనార్దనయ్యగారు. రాముడు తన అమ్మమ్మ వ్యాధి సంగతి చెప్పి, అతడు కోడికి తప్పక వచ్చే ఒప్పందంమీద పడుమున్నూరుకు అతని వెంటనే వెళ్ళాడు. దారిలో నాగవేణి లచ్చుడు పెళ్ళి అయ్యాక ఒకసారి వచ్చారని, వాని దుర్బుద్ధి మూలాన ఆ పిల్లకు పట్టిన గతిని అంతా వర్ణించాడు. అక్కడ పడుమున్నూరులో రామునికి రాజోపచారాలు జరిగినవి. జనార్దనయ్య భార్యతో 'చూడు, వీడు రాముడు, బి. ఎ. నా మనుమడు. నాగవేణి కొడుకు — స్వతంత్ర వీరుడని ఏమేమో వర్ణించి సంతోషించాడు. తన అమ్మమ్మ బాధపడుతుంటే వారి సత్కారంవలన రామునికేం సుఖంగా లేదు. కరణంగారు కూడ భోంచేసి 'సరే నయ్యా మీ తాతగారు మా చెల్లెలికిగాను వచ్చేవారు. మేంకూడ వెళ్ళి వచ్చేవారం. నీ నెపాన మళ్ళీ సత్సంబంధాలు ఏర్పడుతాయిలే. అందరినీ చూచివస్తాను. పోదాం పద!' అని వాని చెయ్యిపట్టుకుని వెంటనే ప్రయాణం కట్టారు.

తొణపెనుండి మళ్ళీ వానికి నడచే పనిలో కొంత ఆటంకం కల్గింది. కరణంగారు అక్కడ ఒక పడవవాణ్ణి పిలిచి 'ఒరే! కోడికి వెడదాం పడవ నడుపు చూద్దాం' అన్నాడు. తరువాత వద్దన్నా కొబ్బరబొండాంలు కొట్టితెచ్చారు. కడుపు హాయిగా నిండినాక మళ్ళీ ఎడ నీరు వెక్కసమే అయింది. మంచి మాటలమధ్య కోడీ తీరంలో దిగారు.

తరువాత రాముని మాటలు విని నాగవేణి గడపవద్దకు వచ్చి చెయ్యి అడ్డంపెట్టుకుని శ్రద్ధగా చూచింది.

'అమ్మా! వారెవ్వరో చెప్పు' అన్నాడు.

'వారురా! వారుకదా!' అని నాగవేణి ఏమో జ్ఞాపకం తెచ్చుకుంటున్నది.

'ఎవరన్నావు?'

'వారి తాతగారింటివాళ్ళయి వుంటారులేరా' అన్నది నాగవేణి.

ముసలామెకు మందిచ్చి, పత్యం అన్నీ చెప్పాడు రాముడు. 'డాక్టరుగారు ఏం పరవాలేదన్నా రవ్వా' అన్నాడు. కరణంగారేమో 'నేను మావాణ్ణి మందుకు రెండురోజుల కొకసారి పంపి తెప్పించి ఇక్కడికి పంపుతాను రామా!' అన్నాడు.

భోజనాలయ్యాక ఆ కరణంగారు తన ఇంటి కథలు, రామ బతాయిల పెండ్లి నాటినుండి లచ్చని పెండ్లివరకు కథలు చెబుతూ తరువాత నిద్రపొయ్యాడు.

# 26

రాముడు ఒక సంవత్సరం విధిగా విశ్రాంతిపొందాల్సి వచ్చింది. మరునటి విద్యా సంవత్సరం జూన్‌కు కాలేజీ చేరాలి. మళ్ళీ కష్టించి చదువాలి. మళ్ళీ సెలక్షను. పాత చదువు దండుగయ్యింది. సరే ఇంట్లోనే వుండి అవ్వకు ఉపచారం చేస్తూ వుందామనుకున్నాడు. అమ్మకు దూరంగా వెళ్ళరాదనుకున్నాడు. విశ్రాంతి దొరికితే మళ్ళీ ఫిడేలు వాయించుతాడు. ఇంతలో సాయంత్రం హంగారకట్ట రేవుకు కూడ వెళ్ళివచ్చే అలవాటు చేసుకున్నాడు. అక్కడ ఎవరైనా 'హిందూ పత్రిక' తెస్తే చదివి అన్నీ చర్చించేవాడు. ఆ షావుకార్లవద్ద పేపరు ఇప్పించుకొని వార్తలను భక్షిస్తాడు.

తరువాత ఎవరు కనబడితే వాళ్ళతో 'కత్తి, కొడవలి, సుత్తె, కంకి' అని తత్త్వాలు బోధించేవాడు. హరిజన సమస్య, దారం, ఖద్దరు, గ్రామోద్ధరణ, దేశభక్తి అన్నింటిగూర్చి



ప్రబోధం చేసిపారేస్తాడు. వీని వాదోపవాదాలు శ్రద్ధగా వినటానికి అక్కడ సమానవయస్కుడైన సగం ఇంగ్లీషు నేర్చిన స్కూల్‌మాష్టరు ఒకడు—ఆ ప్రేక్షకులలో ఒకరు 'బానయ్యా! గాంధీ వూరికే ఇవన్నీ మాట్లాడాలని చెప్పారా? మద్యపాన నిషేధం, నూలు వడుకుట, గ్రామ పారిశుద్ధ్యం ఇంకెన్నో నిర్మాణకార్యక్రమాలు పెట్టారే ఒకరైనా చేస్తారా చెప్పు! ఊరకే స్వతంత్రం అని గొంతు చించుకుంటే ఏం లాభం చెప్పు!' అని రామునికి నాటుకునేట్లు మాట్లాడినాడు. రాముడు అంగీకరించి 'అవునులెండి, నాకు పదినెలలు తీరికవుంది. ఏం చెయ్యాలో చెప్పండి.' అన్నాడు.

'ఏం చెయ్యాలి! కాంగ్రెసు ఆఫీసు, సభ్యత, చరఖాసంఘం, తకలీపోటీలు, ఖాదీ హాకింగు—ఎన్నో కార్యక్రమాలు వరుసగా!' అన్నాడతడు.

ఏకో ఒక కొట్టుకు 'కాంగ్రెస్ ఆఫీసు' అని బోర్డు తగిలించారు. కొందరు సభ్యు లయ్యారు, చరఖాసంఘం ఆఫీసులు అన్నీ ఏర్పాటయ్యాయి. ఉడుపినుండి యాభై తకలీలు తెప్పించి పంచారు.

ఒక సాయంకాలం చేనిలో కూర్చున్న బచ్చి రామునితో 'ఏమి దొరగారు, తకలీ పట్టుకున్నాడు. మీరుకూడ వలలు అల్లుకుంటారా!' అని తమాషాచేసింది. 'బచ్చీ నీకేం తెలుస్తుంది లేవే! నీకు జనుమూ, వలలు, చేపలు తెలుసు అంతే!' అన్నాడు.

కొత్త కదురు మిలమిల మెరుస్తూ పగలు చాలసేపు, ఆ మిణుకుమిణుకు దీపంతో చాలసేపు గిర్రుగిర్రున తిరిగి మెరిసింది. నాగవేణి 'ఏమిరా ఈ బాధ రాత్రి అంతా ఏమి పనిరా' అన్నది. 'అమ్మా, నీకు జట్టల కరువులేదు' అన్నాడు. నాగవేణి నవ్వింది. 'ఏమో నయ్యా! దీనితో నూలువడకి నా మానసంరక్షణ చేస్తావుగా!' అని నవ్వింది. 'అమ్మా గాంధీగారు గ్రామాలకేమి, అన్నింటికి ఈ కదురే శ్రీరామరక్ష అన్నారు' అని దానికి సంబంధించిన అర్థశాస్త్రం అంతా వల్లించాడు. 'ఏమి గాంధియో, ఎవరో, ఏం స్వరాజ్యమో! కానీ మీ తాతగారుమాత్రం ఈ నూలుతో మంచి జంధ్యాలు చేసేవారు. నేనేమో వాటిని నీకు గిర్గిటు తిప్పడానికిచ్చేదాన్ని.' రాముడు అమ్మకు కూడ ఒక గంటన్నర వుపన్యాసం దంచేశాడు. 'పోమ్మా! కనీసం వేసట పోగొట్టుకోవాలంటే పనికివస్తుంది—నీకేమో ఫిడేలు. నాకు తకలి—' అన్నాడు.

దినాలు గడిచాయి. నూలు తీసి ఉడుపికి నెయ్యడానికి పంపారు. 'తక్లీ జయించింది' అని చాల ఉబ్బిపొయ్యాడు రాముడు. తరువాత ఏం చెయ్యాలి? నాగణ్ణ మేష్టారు వచ్చి 'రామణ్ణ! ఈ బడి నౌకరి లేకుంటే నేను కార్యక్రమాలలోనే బాగా పాల్గొనేవాణ్ణి' అన్నాడు.

'మెంబరు కాండి' అన్నాడు రాముడు.

'అయితే మా బోర్డు ప్రెసిడెంటుకు తెలిస్తే దూరంగా ట్రాన్స్‌ఫర్ చేసేస్తాడు' అక్కడ కడుపులో గడ్డలు వస్తాయి' అన్నాడు.

'మరేమి చేయాలి?'

'రహస్యంగా మద్యపాన నిషేధం చేయిస్తా' నన్నాడు నాగణ్ణ.

'సరే! ఈ వచ్చే శుక్రవారం బారకూరులో సంత జరుగుతుంది. అక్కడ 500 మంది మెంబరనైనా చేర్పించాలి అని నిశ్చయించాడు. రాముడూ అతని మిత్రులు గాంధీగారి తత్త్వాలను ప్రబోధించి సంతలకు వచ్చిన వారిలో చాలమందిని మెంబర్లవ్వాలని ప్రోత్సహించారు. ఎందరో దస్కత్తు చేశారు. నాల్గణాలు రుసుము అనేసరికి—అయ్యో రెండు పంచలొస్తాయి వద్దులే అని వెనుకకు తగ్గినవారు లేకపోలేదు.

'చేరితే నాల్గణాలు మా కిస్తారనుకున్నాను' అని ఒక అమాయకు డడిగినాడు. నాల్గణాలకు రెండుసేర్ల కిరసిన్ రెండు వీశెల కొబ్బరనూనె అని ఏమో చెప్పుకున్నారు. పైసలిచ్చి చేరినవారు ఆరుమంది మాత్రమే

మరొక్కసంతకు ఖాదీ తెచ్చి అమ్మారు. 'గాంధీ జతలంటే చాలా చౌక అనుకున్నాం గాని ఇంత ప్రియమని అనుకోలేదని రాగాలు సాగదీశారు ప్రజలు. రాముడు ఉద్రేకంతో 'పరదేశం వస్తువులు కొంటే పైసలన్ని వాళ్ళే మోసుకొనిపోతారు. ఇక్కడ కొంటే అన్నీ బీద సోదరులకే కడుపు నిండుతుంది' అని మీ వూరి నేతవారికే చేరుతుంది. అర్థం చెప్పాడు.

ఒకడేమో 'అంతా నిజమే! మా నాన్న ముల్లె. ఆస్తి లేవండీ' అన్నాడు. మరొక్కడు 'ఇంత దుబారాగా కొంటే మేమే పరదేశీలవుతామయ్యా' అని నవ్వాడు.

సరే, దయాదాక్షిణ్యం గలవారికి కొన్ని గుడ్డలు అంటగట్టి పంటలపైన వసూళ్ళకు ఒప్పుకున్నారు.

మూడు నెలలకు కాంగ్రెసు సభ్యత్వం క్షీణించింది. తకలీలు మూలబడేశారు. తానేమో ఎవరు వద్దన్నా తకళీ వదలనని రాముడు ప్రమాణంచేశాడు. తాను కార్యదర్శి పనికూడ మానుకున్నాడు. తరువాత ఏంచెయ్యాలో తోచకుండా వున్నాడు. తన స్వగ్రామంలో మద్య నిషేధం అమలుపరపిస్తానని కూర్చున్నాడు. తీరికలో ప్రతి ఇంటికి వెళ్ళి నిర్మాణ కార్యక్రమంలో పాల్గొని, ఆ ప్రచారం చేసేవాడు. బచ్చి మగడు కాళడు 'ఏమయ్యా వచ్చారు?' అని అడిగితే రాముడు ఒక సభ చేర్చమని చెప్పాడు. కాళనికి ఆ నెలకయ్యే సారా ఖర్చు వర్ణించి దానివలన ఎంత డబ్బు పాడవుతుందో అంతా నష్టమని చెప్పి నచ్చజెప్పాడు.



కాళ డేమి చేపలు బాగా దొరికితే యాభై రూపాయలు కల్లు పోసించినవారు లేక పోలేదని అన్నాడు. కాళనికి రాముని మాటలపై విశ్వాసం కుదిరింది. బచ్చి సంతోషించి తన మగణ్ణి దెప్పుతూ 'బాగ బుద్ధి చెప్పండి, నూరుసార్లు చెప్పండి—తాగి తందనాలాడ వద్దని' అని రాముణ్ణి ప్రశంసించింది. కానీ ఒక్కొక్కరిని పిలిస్తే రారు. ఆ హనుమ దేవుని ముందు బెస్తలు భాగోతాలాడిస్తారు. అప్పుడు అన్నీ చెప్పాలని తీర్మానమయింది.

వచ్చేవారం హనుమంతుని గుడివద్ద ముగ్గురు ఖాయిష్‌తో ఆటలాడించారు. మూడు జట్ల దశావతారాల ఆట. మరుసటినాడు జోడాలు—ఆడ మగ జతల ఆట. మూడవనాడు మందర్తివారి ఆట. భాగోతుల వేషాల మేళాల పదిదినాలు—రాము దెప్పుడో చిన్ననాడు చూచిన ఆటల జ్ఞాపకం మరచిపొయ్యాడు— తిరిగి వాటిని చూడాలని ఆశపుట్టింది. అదే సందర్భంలో హంగారకట్టై మిత్రుల సహాయంతో రంగస్థలంలో ప్రేలాడవేయడానికి ప్రచారం బోర్డులు అట్టలు వ్రాసిపెట్టాడు. కల్లు మానండి. మద్యరాక్షసుణ్ణి చంపండి—అని ఏమేమో వాక్యాలు వ్రాశారు. పూర్వకాలంలో బడి గోడలపైన గాథలు వ్రాసి తరువాత సున్నం పూయించి వ్రాస్తే బడిలో సున్నం ఖర్చు మిగిలేది. అల్లాగే వీళ్ళ రంగురంగుల అట్టలు కూడ ఆ రంగస్థలానికి అలంకారమే అనిపించింది.

మందర్తి మేళం మొదట్లోనే వుంచారు. నాడు హాస్యం వెంకప్ప కూడ రావాలి. సుబ్బత్తకు వాడు జీతగాడు. రామ ఐతాళులువారికి సరిగా ప్రోత్సాహాన్నిచ్చాడు. వాడు హాస్యాలలోనే హనుమంతునిలాగు వేషం వేసుకొని వచ్చి 'చూడండీ, ఈ కల్లు, సార తాగే బెస్తలున్నారే వారిని వుద్ధరించాలని కృష్ణుణ్ని పిలుస్తాను. అప్పుడు కృష్ణుదేం చేశాడయ్యా అంటే' అని పీఠిక వేస్తే, ముగ్గురు దేశభక్తులు వచ్చి చక్కని ఆవేశమిచ్చే లెక్చరిచ్చారు. గంట లెక్చరైనా విసుగురాలేదు. ప్రజలు ఆశ్చర్యంగా విన్నారు. రాముడు వుపన్యాసంలో తెలివిలేకుండా ఎంతో మాట్లాడాడు. హాస్యకారుడు రామునికి పూలదండ వేశాడు. ఆట రక్తికెక్కింది. తరువాత ఆ ఇసుక గట్టుపైన మొట్టమొదటిసారిగా అందరూ 'గాంధీకీ జై' అని నినాదాలు చేశారు.

బచ్చి మగడు సభకు వచ్చి 'అంతా విన్నారు—ఈ బెస్తలు కల్లు సారాయి మాని వెయ్యాలి' అని చెప్పి, 'నేను కూడ ప్రమాణం చేస్తున్నాను. ఇక్కడనే కల్లు మానేస్తాను' అని అన్నాడు. ఆ పెద్ద బెస్తలు వూరకుంటారా? మేము కూడ మానుతామని నేను ముందు నేను ముందు అని ప్రమాణస్వీకారం చేశారు. రెండువందలదాకా ప్రమాణాలు చేశారు. మరునాడు పడుకెరెవారు ప్రమాణాలు చేశారు. మూడవరోజు జోడు ఆట—రాసక్రీడ—దానికి ఇబ్బంది లేకుండా ఈ ప్రమాణస్వీకారం జాగ్రత్తగా మణూరివారిచే చేయించారు. ఆట అయిన తరువాత ఆ కాళడు, గోవిందుడు అందరూ తమ ప్రతిజ్ఞల ననుసరించి సముద్రతీరంలో వున్న తాళ్ళకు కట్టిన కల్లుకుండలను రాళ్ళు రువ్వి పగులగొట్టారు. ఆ కుండలను ఉప్పు చెయ్య డానికి సముద్రం నీటిని నింపుకోడానికి వాడుకున్నారు. సిద్దుపూజారి తికమకపడ్డాడు. వాడు తరువాత రాత్రి బ్రహ్మావరం పోలీసు స్టేషనుకు వెళ్ళి రిపోర్టు చేశాడు.

తెల్లవారికి ఎర్రటోపీ పోలీసులు చుట్టు గ్రామాలకు గస్తీకి వచ్చారు. ఊళ్లో ఎక్కడ చూచినా గుసగుసలు—అప్పుడు హంగారకట్ట కాంగ్రెసు సభలు ఉద్ధృతంగా జరిగాయి. అప్పుడు మాత్రం నాగణ్ణ మాష్టారు ఆ ఖాదీ తొడుగుకున్నవారితో మాటైనా ఆడలేదు. రాముడు మాత్రం తానేమో పడమటి సముద్రతీరమంతా మద్యపాన పిశాచాన్ని పారద్రోలిన మహావీరునిలాగా గర్వపడ్డాడు.

పోలీసులు చాలమార్లు 'కోడి'లో తిరిగారు. కనబడినవాళ్ళనంత ఆ పనుల గురించి బెదిరించారు, గద్దించారు. సిద్ధుపూజారి రేపేమవుతుందో అని భయంతో అదే పోలీసులకు మిగిలిన సారాయితో పూజాసత్కారం కావించి తన గిరాకీ పట్టీ ఎక్కిందని తృప్తి పొందాడు.

ఇంగ్లాండులో రౌండ్ టేబిల్ సమావేశం జరిగిందని తెలిసివచ్చింది. గాంధీమహాత్ముడు తప్పకుండా బ్రిటిష్‌వారి గొంతు పిసికి స్వరాజ్యం తెస్తున్నారని యువకులంతా ఉవ్విళ్లూరుతున్నారు. స్వరాజ్యమే దొరకాలి—మరునాడే కత్తి, కొడవలి, సుత్తె, చక్రం తిప్పేస్తానని రాముడు డంబాలు పలికాడు. కానీ రాష్ట్రీయ ఆందోళన మాత్రం రౌండు సున్న అయింది. మహాప్రళయం రభస చల్లబడసాగింది. అక్కడక్కడ ఏవో పట్టింపుగలవారు మాత్రమే తకలీ తిప్పారు. ప్రభాత ఫేరీ పాటలు, ఊరేగింపులు కూడ మందకొడిగానే సాగాయి.

రామునికి ఊళ్లో జరిగిన ఒక సంఘటన అనుకూలించింది. 'కోడి'లో ఒక 'ఉప్పు చేసిన' కేసు రావటం, దాని సందర్భంలో రామునిపాత్రవలన దీనజనోద్ధారానికి రాముడు బద్ధకంకణం గలవాడని నిరూపించుకున్నాడు. ఎవడో సంకుమరవారి కాళడు ఉప్పుచేసి అమ్మాడని కేసువేశారు. కాంగ్రెసు ఆఫీసు లెక్కలలో ఆసంకుమరకాలడు లేడని మరెవ్వడో ఉప్పుచేసినా అమ్మినట్లు రుజువు కాలేదని పోలీసులు ఊరకే దొంగకేసు సృష్టించారని రాముడు వాదించాడు; తన ఇంట్లో వడ్డించిన విస్తరినే వదలిపెట్టి 'తాణసి'కి పరుగెత్తాడు. ఆ బెస్తలవెంట వెళ్ళి పుట్టడు అనే అనాథుణ్ని రక్షించాలని కంకణం కట్టుకున్నాడు.

హంగారకట్ట గోదాముల కచేరిలో ఒక గుప్తసమావేశంలో ఆ విషయం గాంధీజీ గారికే వ్రాస్తాం, కలెక్టరుకే అర్జీ ఇస్తాం ఇంకేమైనా చేస్తామని అనుకున్నారు. ఏమి చెయ్యాలో తెలియకుండ కూర్చొన్న సమయాన ఆ 'పుట్టడు' అనేవాణ్ని పోలీసులు రామునింటికి తెచ్చారు. వాడు 'అయ్యా, నేను వీరికేనయ్యా ఒక కుండెడు ఉప్పు అమ్మాను' అని రాముణ్ని పోల్చి చూపాడు. రామునికి చాల దిగులయింది. తాను స్వయంగా ఆ పుట్టని విడుదలకు అంత శ్రద్ధగా, గట్టిగా ప్రయత్నించాడే! వాడే అబద్ధం ప్రచారం చేస్తున్నాడే—అని చాల దుఃఖమయింది. పోలీసులు రాముణ్ని బెదిరించారు. 'ఏమండోయ్, జైలుకెళ్ళాల్సి



వస్తుంది' అన్నారు. 'కానీ, నేను రాజకీయంగా జైలును అనుభవించాను. మీరంతా అబద్ధాలతోనే బదుకుతున్నారు' అని గట్టిగా పోలీసులను మందలించాడు. ఈ వార్తలు పదుమున్నూరు కరణంగారికి తెలిసింది. రామునిపై రాజద్రోహం, ఆబ్కారి నేరం వచ్చిందని ఆ అల్లరికి, గొడవలపై నీళ్లు చల్లి చల్లార్చకుంటే చాల కష్టమని ఆ రాముని బి. ఎ. ప్రయాణం ఆగుతుందని వారు వెంటనే కోడికి రామునితో మాట్లాడాలని వచ్చారు. 'రామ, నువ్వేమో వాళ్ళ సహాయానికి వెళ్ళితే, వాళ్లే నిన్ను చిక్కించాడు చూడు. ఇల్లా వుంటాయి ఈ వూరివాళ్ళ తలవ్రాతలు, బుద్ధులు. రామ నీకు అనుభవం చాలదు. పరోపకారం ఈ కలియుగంలో పదదయ్యా!' అని తీర్మానంగా, కచ్చితంగా చెప్పి వెళ్లారు. పుట్టని చపలచిత్తం, రాముని ఉజ్జ్వల దేశభక్తికి ఒక వాత పెట్టించనవచ్చును. 'ఛీఛీ! ఈ కుత్రలమందికి సహాయం చేసేకంటే అళువ (కాలువ)లో పడితే నయం' అని అన్నాడు.

మరొకవారానికి హంగారకట్ట ముఖం కూడ చూడలేదు. 'అమ్మా ఇక మద్రాసుకు వెళ్ళి ముందుచూపు చూస్తా' నన్నాడు. తల్లికి కూడ రామునికి పిచ్చి కుదిరిందని సంతోషించింది.

'రామా! వెళ్ళటానికి ముందు ఒకసారి సుబ్బి ఇంటికి వెళ్ళిరారా! పోయినతూరి తానే వచ్చిందికదా! తొమ్మిదినెలలకు ఒకసారి అయినా వెళ్ళలేదు—వెళ్ళిరా' అన్నది నాగవేణి. వాడు తల్లిమాట మీరకుండ మేనత్త ఇంటికెళ్ళి మూడునాళ్ళుండి అందరినీ తృప్తిపరచాడు. ఇంటికి తిరిగివచ్చి చూస్తే వూళ్ళో ఒక ఆపద, ఇంట్లో ఒక ఆపద కల్గినవి.

ఇంట్లోనేమో అమ్మమ్మకు చాల దగ్గరకు వచ్చింది. నారాయణయ్యగారు దిగులుపడి 'ఈసారి వదినె నమ్మకం లేదు' అన్నాడు. అదే రాత్రి బెస్తలు తప్పతాగి పోట్లాడి పోలీసులకు దొరికారు. రాముడు మద్యపిశాచాన్ని పారద్రోలిన ఆరునెలలకే భీకరమైన మార్పులు వచ్చాయని విమర్శించుకుంటే రాముని తల తిరిగింది. మనస్సు పూర్తి వ్యథకు గురి అయింది.

తరువాత రెండు రోజులకు కృష్ణవేణికి తంతెకొట్టారు. సదాశివుడు, తమ్ముడూ మంగళూరినుండి వచ్చారు. ఎప్పుడూ ఏరు దాటి మందులు తేవాలంటే కష్టమని అమ్మమ్మను బరోడులో స్వంత ఇంటికి చేర్చారు. రాముడు కూడ అమ్మమ్మకు ఉపచారాలు చేశాడు, వాడు ఉడుపికి వెళ్ళి మందులు కూడ తెచ్చి ఇచ్చాడు. కానీ చావుకు మందులుంటాయా?—అని నాగవేణి చెప్పింది కూడ నిజమైంది. ముసలావిడకు తెలివిరాలేదు.

అమ్మమ్మ సూతకం స్నానం తరువాత, రాముడు తల్లితో 'అమ్మా! నీకు తరువాత అవ్వ రూపాయలూ రావు. ఒంటరిగా ఎల్లాగుంటావు చెప్పు. నేనేమో మద్రాసుకెళ్ళి శ్రద్ధగా చదువుతాను. తరువాత నౌకరీచేస్తా భయపడకు' అని మాట్లాడాడు. నారాయణయ్యగారు 'ఫరవాలేదు—నాగూ—నువ్వు మా ఇంట్లో వుండు' అని బతిమాలాడు. నాగవేణి

వినలేదు. కోడికి పయనమయింది. కృష్ణవేణికూడ తనవెంట నాగవేణిని మద్రాసుకు రమ్మనింది. ఆమె వినలేదు. కృష్ణవేణివెంట రాము ఒక్కడు వెళ్లాడు.

ఆ జూలై వేడిగాడ్పులకు రాముడు సముద్రతీరంలో అతిథి అయ్యాడు. విద్యాభ్యాసం మళ్ళీ చెయ్యాలి. పుస్తకాలు మార్చినారు. అన్నీ కొత్తగా చదువాలి. చదువు, సంపాదన ఒకేసారి జరిగేది చాల కష్టం.

వాడు మద్రాసులో త్వరగా ట్యూషన్‌లు వెదకాలని తిరిగాడు. వెనుక చెప్పిన ఇండ్లకు వెళ్లాడు. ఈసారి ఎక్కడా వీలుకాలేదు. ఆ సంగీతం ట్యూషన్లకు ఇంకెవ్వరో వచ్చారు. మిగిలిన ఒకతే విద్యార్థి ఆ కృష్ణవేణి కూతురే. ఆమెకు పదునాలుగేండ్లు. ఆమె మాత్రం విద్య నేర్చుకుంది. కాని సత్యాగ్రహం చేసి రాముడు జైలుకు వెళ్ళితే మాధవుడు మరొక మాష్టారుతో చెప్పించాడు. ఒకనాడు 'రామూ ఈసారి నీకు పాఠం చెప్పడానికి వీలుంటుందా చూడు. బి. ఎ. కు కూడ బాగా చదువాలిగా!' అని మాధవుడు స్వయంగా ప్రస్తావించాడు. రాముడు కేవలం స్వార్థపరుడుగా ప్రవర్తించే మనస్సు లేనివాడు. ఈసారి అన్నం కూడ వారి ఋణంలో జరుగవలసిందే. ఎక్కడైనా ట్యూషన్లకే తంటాలుపడితే చాల కష్టం—పిల్లలకు మాత్రం రామణ్ణ మళ్ళీ తమ మధ్యనున్నాడనే ఆనందం, ఉత్సాహం కలిగాయి.

ఆనందుడు 'రామణ్ణ! నువ్వు వెళ్లాక ఇల్లంతా చప్పచప్పగా చిన్నబొయ్యిందంటే నమ్ము! నువ్వు చెప్పించినట్లు సంగీతం కూడా ఎవరూ చెప్పరన్నా! వాయించు, వింటా' అని అంటూ, అతడు చెల్లెలు ఇద్దరు పట్టుపట్టారు.

ఆ జయకు పదునాల్గేండ్లు. ఆ లేత నవ్వు మొగం నిష్కపటంగా మాట్లాడితే కాదంటాడా? మళ్ళీ సంగీతం నేర్పసాగాడు. అప్పుడప్పుడు ఆమెకు జామిట్రీ, ఆల్జీబ్రా కూడ చేసిపెడతాడు.

మద్రాసుకు వచ్చేప్పుడు తల్లి ఇచ్చిన యాభై రూపాయలతో రెండు నెలలు సుఖంగానే గడచాయి. తరువాత కాలేజీ ఖర్చులకు కష్టమే అయింది. ఐరోడు తాతకు వ్రాద్దామా! మామలకు వ్రాద్దామా! అనే సందేహంతో వూరకున్నాడు. ఈసారి ఎవరి ఋణం అడుగకుండ చదువేమో సాగదని తీర్మానమయింది. కృష్ణవేణితో 'పిన్నీ! ఈసారి ట్యూషన్ గీషన్‌లు దొరకలేదు. కష్టమే. బి. ఎ. పరీక్ష అయ్యేదాకా ఏమైనా ఎవరు చేస్తారు?' అన్నాడు. కృష్ణవేణి 'మొద్దాంలేరా బాబూ!' అన్నది. రాత్రి మాధవుడు వచ్చి 'ఒరే నువ్వు! నాతో అప్పు తీసికో ఇష్టంవచ్చినప్పుడు తిరిగిచ్చేయ్. ఇయ్యకున్నా పరవాలేదు. కానీ పరీక్షలు బాగా వ్రాస్తే చాలు సంతోషం' అన్నాడు.

రామునికి తృప్తి అయింది. సంగీతం చెప్పి కొంచెం తీర్చితే మిగిలిందెప్పుడైనా తీర్చుతానని అనుకున్నాడు.



రాముడు మంచి తెలివితేటలు గలవాడు. వానికి బి. ఎ. ఏమంత కష్టం! ఏప్రిల్‌కు పరీక్షవ్రాసి నిట్టూర్చాడు. తరువాత ఊరెళ్ళాలి. నేరుగ వెడదామా! లేక కొన్నాళ్లు ఉద్యోగం చేసి వెడదామా? అని అనుకున్నాడు. ఎల్లాగైన తల్లికి వంటరిగా కష్టం తప్పించాలని ఊహ.

కొన్ని అర్జీలు వ్రాసుకొని ఆ మద్రాసులో కాళ్ళు మాడ్చే ఎండలో తిరిగాడు. ఆఫీసు మెట్లెక్కి దిగాడు—ప్రపంచం అంతా ఆర్థిక ఇబ్బంది! అక్కడ వుండవా! నో వేకన్సీబోర్డులు చూపుతారు ఎక్కడికెళ్లినా! పదిహేను రూపాయల గొప్పకొలువు దొరికే సూచనలు చిట్టచివరకు కనబడ్డాయి. రెండు ట్యూషన్లకే అంత సంపాయిస్తాను. అందులో బుక్ కీపింగ్ నేర్చుకుంటే బొంబాయివెళ్లి అక్కడనే వుద్యోగం చెయ్యవచ్చు అనుకున్నాడు. బొంబాయిలో దక్షిణ కన్నడం వారు చాలమంది వున్నట్లు తెలిసింది.

ఒకనాడు వూరికి వెడదామని నిశ్చయించాడు. ఆనందు, జయలు వెంట వస్తే బీచ్‌లో ఇసుకలో బాగా దుమ్మురేగేటంత నడచి, రేపు రైలుకు మంగుళూరికి వెళ్ళిపోతానన్నాడు.

'రేపా! రేపేనా' అన్నాడు ఆనంద్. 'ఔను' అన్నాడు రాము.

'నా పాట ఒకటి మిగిలింది. అది అయ్యాక' అన్నది జయ.

'దానికి, నెలైనా పడుతుంది. అయితే నువ్వు మళ్ళీ త్వరగా రావులేన్నా!' అన్నది జయ!

'మద్రాసుకు నే నెందుకు రావాలి? ఇక్కడియాత్ర అయింది. ఇక దైవం మేలుచేసి వుద్యోగం దొరికితే రావాలి - అంతే - వూరకే వస్తానా?' అన్నాడు.

'రామణ్ణకు ఇక్కడే నౌకరీ దొరకాలి' అన్నాడు ఆనందు.

ఆడపిల్ల ఏమీ మాట్లాడకుండ అన్నముఖం చూస్తూ కూర్చుంది. 'ఏమమ్మా! విసుగా!'; అన్నాడు. 'విసుగుండదా!' అన్నది.

ఆ సాయంకాలం మాట్లాడుతూ ఇంటికి వెళ్ళారు. ఆనందు ఒకడే తానే మాటల గుత్త తీసికొన్నట్లు ఎంతో మాట్లాడాడు. ఆడపిల్ల కిమ్మనలేదు. ఆనందే తల్లికి రామణ్ణ వెళ్లే కథ చెప్పాడు.

'ఏమంత తొందరలేరా' అన్నది కృష్ణవేణి.

'అమ్మ ఎదురుచూస్తుంటుంది లే' అన్నాడు.

అక్క ఆలోచన వస్తే, ఆమె మారాడలేదు. 'ఔనురా! ఆమెకు కష్టాలు తప్పవు' అన్నది. అందుకే వాణ్ణి వుండమని బలవంతం చెయ్యలేదు. మరునాడు రైలెక్కాడు రాముడు. హాస్టలులో దిగగానే మిత్రులు సామ్యవాదం గురించి విందామని వుత్సాహపడ్డారు. తన భవిష్యత్తు త్రిశంకు స్వర్గంలా వ్రేలాడుతుంటే ఏమని ఉపన్యసించుతాడు. స్వతంత్రం, దేశభక్తి అంతా దుడుగే అని అనుకొని వూరికే ఏమో మాట్లాడాడు.

తాను స్వయంగా సదాశివుని ఇంటికి వెళ్ళాడు. సదాశివుణ్ని అవ్వ చనిపోయిననాడు చూశాడు. అప్పుడతడు నాగవేణితో 'లలిత మాటలకు నొప్పి పడవద్దు. మనస్సులో పెట్టుకోవద్దు. అమ్మ అంత క్షాత్రంతో పొరుగూరిలో చనిపోవలసినగతి తెచ్చుకుంది. నాకు అమ్మకు సేవచేసే భాగ్యంకూడ లేకపోయింది' అని క్షమాపణ చెప్పి వెళ్ళినాడు. రాముణ్ని చూచి 'ఒరే నువ్వు నేను దూరబంధువని అనుకోవద్దు. ఎప్పుడైనా ఇంటికి రా' అని నచ్చజెప్పాడు. లలితకూడ ఇదివరకంటే మృదువుగా మర్యాదగానే మాట్లాడింది. ఆవూళ్లో ఏమైన మాష్టరు నౌకరో, మరొక్కటో వుందా అని రెండు రోజులు వెదుకుకున్నాడు. తనలాంటి నగరారణ్య సంచారు లెందరో మంగళూరిలోనే వున్నారని తెలిసి వచ్చి వూరకున్నాడు. 'అరే! ఒక ఆశతో చదివి ఆ అధ్యాయం ముగిస్తే, నిరాశ అనే పర్వతమే అడ్డు పడిందే' అని వ్యాకులతతో వూరికి వెళ్లాడు.

ఆ కాలంలో కిష్కింధలో రామునికిగాను ఆశబరికూడ అంతగా ఎదురుచూచిందో లేదో. కాని నాగవేణి తన రామునికిగాను ఎంతో మోహంవాచి కూర్చుంది. పరీక్ష లయ్యాయని తెలిసాక 'వా డెందుకో రాలే'దని కంట్లో వత్తులు వేసికొని ఎదురు చూచింది.

ఈ సంవత్సరం నాగవేణి బ్రతుకు గొడవ ఆ బ్రహ్మదేవుడే చెప్పాలి? నారాయణయ్యగారింటి నుండి ఏమంత సహాయం దొరకలేదు. అక్కడ అతని కొడుకులదే పెత్తనం. ఏమైన దానం చెయ్యాలన్నా అడిగి చెయ్యాలె. నాగవేణిని తల్లి చచ్చాక తన ఇంట్లో వుండమన్న రోజే గుట్టుగా చాటుకు తీసికెళ్లి నారాయణయ్యకు మంగళారతి చేశారు బుద్ధి చెప్పారు. బచ్చి మగనినుండి గుత్త మూడుతూములు పెంచి ఆమె ఖర్చుల కిప్పించారు. అయ్యో బచ్చి తిండికి మట్టివేశానని మనోవ్యథ నాగవేణికి కలుగక పోలేదు. సగం కడుపు గంజి తాగి వరకపుల్లగా మారింది. కొడుకును చూచాక తెలియకుండా నరసింహయ్య ఇంటికి వెళ్ళి బియ్యం తెచ్చి వండింది. ఇన్నాళ్లూ నాగవేణి కష్టపడి ఒకటే ఆశతో వుంది. అదేమో కొడుకు వుద్యోగంలో చేరుతాడనే ఆశ. లేకుంటే బచ్చి చెప్పిన జ్యోస్యం అయినా నిజం కావాలి. పిల్లవాడు భోంచేశాక 'అమ్మా! ఇక ఈ పరీక్ష బెడద తీరింది. ఇంక మిగిలిందేమో 'భవతీ భిక్షాందేహి' అనుకుంటూ వుద్యోగం వెంటబడాలి. నువ్వేలా గడపావమ్మా' అని వివరా లడిగాడు. పినతండ్రివద్ద నూటయాభై రూపాయలు అప్పుచేశానని చెప్పాడు.

ఇక నాగవేణికి తన కష్టాలతో దాగుడుమూత లాడే ప్రమేయం లేదు. 'పిల్లలు పెద్దలై చిన్నతాత పెత్తనాన్ని లాగేశారు. కాళడు ఏడుతూములగింజ లిస్తాడు. బచ్చిమగడు



కాబట్టి మర్యాదతో అమ్మా! ఈ సంవత్సరం వప్పుకున్నాను. వచ్చేసారినుండి ఇంకే భూమైనా చూస్తానన్నాడు. ఇంక విత్తనాల వేళ అయింది. వాడు కూడ లోగుత్త కరారునామా వ్రాయలేదు. నాకేమో చేతగాదు' అన్నది నాగవేణి. రామునికి తన స్థితిగతులు బోధపడ్డాయి. ఎక్కడికైనా వెళ్ళి ఉద్యోగం సంపాదించకుంటే చాల కష్టమని తెలిసింది. బచ్చికి కూడ ఎక్కువభారం వేసినందుకు చాల సిగ్గుపడ్డాడు. తానే బీదలను బాధించాడంటే తన సామ్యవాదం, పెట్టుబడిదారులతో పోరాటం అంతా పాతాళం చేరాయి అనుకున్నాడు.

ఆ రాత్రి ఇద్దరూ ఏడ్చి మనస్సు నొప్పించుకొని పడుకున్నారు పాపం! ఇదివరలో ఒకసారి మాట్లాడినంత ఆప్యాయంగా మాట్లాడుకోలేదు. మాటల్లో చాల వుత్సాహం, ఆనందాలకు బదులు లోపల క్రుంగి కృశించే వేడిగాలి బయటికి వచ్చింది. అంతే.

తల్లి నిద్రలేచి 'కాళన్ని నువ్వే అడగాలి పొలం నాట్లవుతుంటో లేదో అడుగు. బచ్చి వదిగి నోరు పడిపోయింది. అది మాత్రం ఏం చేస్తుంది? మగడుకదా కష్టించేవాడు!' అన్నది.

రామునికి కొత్తభారం, బాధ నెత్తిన పడ్డవి. తెలిసి తెలిసి గుత్త ఎక్కువచేసి నెత్తిన భారం పెడితే వాడుమాత్రం ఏమంటాడు? వాడు చేయకుంటే రాముడు, తల్లి ఉపవాసమే వుండాలి. ఈ లెక్కచూస్తే ఇంత అల్లరి సంవత్సరానికి పన్నెండురూపాయలు. వెలకే తాను ట్యూషన్లో సులభంగా సంపాదించేవాడు. కాని ఆ బీదవాణ్ని యాతన పెట్టేది అన్యాయమని తోచింది. చిన్ననాటినుండి పరిశుభ్రంగా పెరిగిన ఆ రాముని హృదయానికి వానితో ఎక్కువ అడుగక, వాళ్లూచెయ్యక తానూచెయ్యక భూమిని బీడుపెడితే, ఉడుపి షావుకారుకు తామెక్కడ తెచ్చికట్టగలమని పెద్ద చిక్కుప్రశ్న ఎదురైంది. తానే మెల్లిగా ఆలోచించి వెళ్ళాడు. పైమాటకు 'కాళా! ఎల్లాగున్నావు?' అని అడిగాడు. వాడు 'ఇల్లాగున్నాను, బావ దానికి సిద్ధంగా వున్నాను' అన్నాడు. వానికి వాతంతో కాళ్ల పడతపడడం కష్టం. తన సంసారం గొడవలు చెప్పాడు. రామునిలాంటివారు సాహసింపగలరా?

అంతలో బచ్చి వచ్చి 'దొరగారికి నిక్కచ్చిగా తేల్చండి, సాగు చేస్తారా? భూమి వదుల్తారా అని. అందుకే వచ్చారు కాబోలు, ఊరకే వసూలువానితో కష్టాలు చెబితే లాభముంటుందా' అని మగణ్ని గద్దించి పలుకరించింది.

రాముడు 'పొలం బీడుపడేలాగు చెయ్యవద్దురా—మేము ఆ గుత్త కట్టుకో లేము' అన్నాడు.

'అయ్యా! మీరు మాకు వుపకారం చేసినవారని తెలుసు. మీ కష్టాలు తెలుసు. నాకు ఈ బొటికెనవేలంత పిల్లలు. అందులో ఏడు తూముల కెక్కిస్తే కష్టం కాదా? చెప్పండి. అప్పుచేసి గుత్త కట్టమంటారా?'

రాముడు తిరిగి ఇంటికి వచ్చాడు. 'అమ్మా, సాగుకాకుంటే వీడే. మూడు తూము లెక్కస్తే వాడు చెయ్యడు. ఐరోడినుండి నీవు చెప్పిందాన్నిబట్టి చూస్తే ఏలాంటి సహాయం రాదు. పోనీలే పాతలెక్కకే చెప్పేదాం' అన్నాడు. నాగవేణి మనస్సు కూడ అల్లాంటిదే. 'వారు మన బీదతనం మర్యాదను దక్కించారు' అన్నది.

రాముడు వచ్చాడని కుండెడు బియ్యం మాత్రం అమ్మ తెచ్చింది నరసింహయ్యనుండి బదులుగా. వుప్పు ఇంట్లో చేస్తారు. మిరపకాయలు పండుతాయి. బియ్యం కొంచెం వేనిగంజి కాచింది. నాగవేణికూడ ఉప్పు సత్యాగ్రహం అనే పేరుతో వుప్పు ఖర్చు తగ్గించింది. తూప్పునుండి చింతపండు తెప్పించింది. బెల్లం లేకుండా ఆరునెలలు గడిపింది.

రాముడు మద్రాసులో ఎంతో హాయిగా తిని, ఇంట్లో కుచేలుని భోజనంతో కష్టంగా తిన్నాడే గాని వెల్లూరుకూడ తన ఇంటి ముందు పరీక్షకు ఆగగలదా? అని తోచింది. తల్లి చిరిగిన ప్రాతచీరలతో కాలక్షేపం చేస్తుంటే చివుక్కు మన్నది. నాల్గుదినములు ఆలోచించి తల్లికి తాను తెచ్చిన ఫిడేలు తీగెల నిచ్చాడు. నాగవేణి 'ఒరే! దీనికిబదులు నాకు పాత చీరలైనా కొనితెచ్చుంటే బాగుండేది కదరా! తిండికి తిప్పలలో సంగీతాలు ఎందుకయ్యా!' అన్నది. తాను ఫిడేలుపట్టి ఆరు నెలలైనదని చెప్పింది.

రాముడు రాత్రి ఫిడేలు వాయిస్తాడు. ఇంటినుండి ఎక్కువగా బయటికి పోడు. ఎక్కడికి కెళ్ళకున్నా పరవాలేదు రాత్రిమాత్రం అమ్మవెంట సముద్రం దగ్గరి కెళ్ళి వచ్చేవాడు. వానికి సముద్ర దృశ్యంమాత్రం విసుగురాదు. వైశాఖమాసం సముద్రం శాంతంగా వుంది. ఆకాశంలో మబ్బులే లేవు. నిర్మలంగా వుంటే చూచి రాముడు 'అమ్మా, మన సముద్రమేమి ఇంత చప్పబడింది. ఎన్నడూ ఇలా లేదే - ఏమి చిత్రం?' అన్నాడు. తల్లి 'అదెందుకంటె ఈసారి వానలు తొందరగా పట్టుకోవాలని, అంతే!' అన్నది. ఇద్దరూ ఎందుకో మాట్లాడే తహతహలో లేరు. ఒక్కసారి ఎందుకో రాముడు, 'అమ్మా! అప్ప (నాన్న) ఎక్కడున్నాడో ఒకసారి కళ్ళతోనైనా చూడకుండా వుండాలా?' అన్నాడు — 'చూచి వచ్చే సౌభాగ్యం మాత్రం ఏముంటుంది లేరా, వూరకో!' అన్నది. తరువాత ఎంతో సేపు మౌనంగా కూర్చుని ఇల్లు చేరుతాడు. తరువాత ఇంట్లో వుక్కపోస్తుంది; తరువాత ఉసూరుమంటూ చావట్లో పడుకొని పొర్లాడి నిద్రపోతాడు.

రోజూ వంటఇల్లు, సామాన్లగది, భోజనాలగదీ అవీ ఇవీ అన్నీ అమ్మ వెంట తిరుగులాడే రామునికి తన ఇంటి ధాన్యం నిలువలు కనబడ్డాయి; అన్నీ బోధపడ్డాయి. అంతా ఖాళీ అయ్యే లోగానే వెళ్లి ముందువారి వెదకాలని నిశ్చయించాడు.

ఒకసారి జ్ఞాపకం వచ్చి 'అమ్మ! ఆ రోజు గోడసందులో రూపాయలు దొరికాయి అని వ్రాశావే, ఎక్కడ చూపెట్టు!' అని అడిగాడు. 'సుబ్బత్తకూడ తాత కేమో గోడలలో



ఖరిజెలు దాచే అలవాటుందని ఆశ చెప్పింది. ఏమో ఈ కరువులో మనకు ఆధనం ఒదిగివస్తే చాల సహాయంగానే వుంటుంది అని కలగంటున్నాను' అన్నాడు. తల్లి నవ్వింది. 'బాబూ! చెల్లెలికి నువ్వు డబ్బిచ్చావే, అది నాకు చేరి తిరిగి పంపానంతే. అన్నీ నీకు తెలియరాదని అలా వ్రాశాను.' అన్నది కృష్ణవేణి.

ఒకసారి ఆ మాటలకు నవ్వేమో వచ్చింది. కానీ మళ్ళీ నిరాశ ఆవరించింది. వెంటనే 'చూడమ్మా, లలితమ్మకు, ఈ పిన్నికి చాలా తేడా చూడు. తన పిల్లలకంటే బాగా చూచిందమ్మ ఆమె. నేను ఇక్కడికి వచ్చేరోజు — అక్కను పంపేయి రాము. హాయిగా, కొన్నాళ్ళుండని అని పరిపరివిధాల చెప్పిందమ్మా! ఎంత మంచిదే పిన్ని!' అన్నాడు.

'ఒరే! ఆమెకు దేవుడే ఆ బుద్ధి నిచ్చాడు — లేకుంటే అందరూ ఆమెలా గుండరు. ప్రపంచం ఈలాగ ఏడ్వదు' అన్నది.

'అమ్మ ఈ వుద్యోగప్రయత్నంకూడ కష్టసాధ్యమే అని తోస్తుంది. చివరకు సంగీతం చెప్పి అయినా కాలక్షేపం చెయ్యాలి అని తోస్తుంది. అయితే నేను తిరుగుతుంటే నువ్వు ఇన్ని కష్టాలతో వుండగలవా? ఇక్కడ ఏమన్నా వుందా?'

'ఇక్కడ ఏమీ దొరకదు.'

'అందుకేనమ్మా నువ్వు పిన్ని ఇంటికెళ్లు — ఆమెకు చాల సంతోష మవుతుంది. నేనేమో నీచింత లేకుండా సుఖంగా పని వెదుక్కుంటాను.'

'అవును - ఆమె చాల మంచిది. ఆమె భగవత్స్వరూపమే, నువ్వు రావాలి. నువ్వే నన్ను దగ్గ రుంచుకొని తరువాత ఎక్కడికైనా తీసికెళ్ళు. అందాక ఈ నేలను వదలను' అని పట్టుదలతో చెప్పింది నాగవేణి.

రాముడు ఆ మాటలకు మౌనమే ప్రత్యుత్తరం అనుకున్నాడు. ఇంట్లో వూరకేవుండకుండ మాట్లాడటానికి నరసింహమయ్యరింటికి వెళ్ళాడు. అతడు రామునికంటె ఎన్నో ఏండ్లు పెద్దవాడు. అతనికేమో ఇంటి పరిస్థితి, బెంగళూరులో రాబడి అన్నీ అనుకూలంగానే వున్నాయి. రాముణ్ని చూచి 'ఎప్పుడయ్యా నీ రాక!' అని అన్నీ కుశల ప్రశ్నలు వేశాడు. ఇంతలో ఎంతో నేర్పుగా మాటలమధ్య, 'నీకేమో ఫిడేలు వస్తుందట, మేము, వూరివాళ్లు వినవద్దంటావా?' అన్నాడు.

'వినండి తప్పకుండా! కానీ నా విద్య అంత గొప్పది గాదు. విశేషం ఏమీ లేదు అని వినయంతో చెప్పాడు రాము.

'నీవు ఎన్నాళ్లుండ దలచావు? ఇక్కడ — ముందు దారి ఏమి' అని విచారించాడు.

అప్పుడు రాముడు ఆకాశం చూపి వూరకున్నాడు.

'నువ్వు ఇంగ్లీషు బాగా చదివావు. ఏమీ అనుకోకుంటే చెబుతా. మా తమ్ముని హోటేలు బెంగుళూరిలో వున్నది. నా తమ్ముడు జనార్ధనుడు వుండి చూసుకుంటాడు. ఎందరో గొప్పవారు వస్తారు. ఒక ఇంగ్లీషు వచ్చిన మేనేజరు కావాలని వ్రాశాడు. నువ్వేమో ఎల్లాగూ మావాడు నెలకు అన్నం వుచితంగా ఇచ్చి ఇరవై రూపాయలు వేతనం చెల్లిస్తాడట. మర్యాదకు లోటు అనుకోకుంటే ఆలోచించు' అన్నాడు.

రాముడు బాగా ఆలోచించాడు. కాని వానికి ఈ వృత్తివిషయంలో అంత కొత్తది. ఇప్పుడేమో ఏదో ఒక వుద్యోగం తప్పక కావాలె! కానీ హోటేలు పనికా చేరడం? చేరాలా వద్దా అనే ప్రశ్న మిగిలింది.

రాత్రి భోజనానికి పిలిచారు. తరువాత వాడు ఫిడేలుకూడ వాయించాలని పట్టు బట్టారు. వరసింహమయ్యరు ఎన్నో వూళ్లు తిరిగాడు. కొంత అనుభవంతోనే చెప్పాడు 'పరవాలేదు— రామ—వాద్యం మంచి పాకంగానే వుంది,' అనివెంటనే 'మా లక్ష్మికి పాఠం చెప్పు! ఏమైనా ఇప్పిస్తా. మీ అమ్మ పరిస్థితిని చూచిన వాడినేగదా పాపం' అన్నాడు.

నరసింహమయ్యరు మాటల్లో గొప్ప హొందాతోబాటు, ఐతాళుల మనుమనిపై ఆదరం కూడ చూపాడు. తమ ఇండ్ల జగడాల ద్వేషమే వుండివుంటే అమ్మకు బియ్యం అప్పు పుట్టేదికూడ కాదు.

రాముడు బి. ఏ., ఫలితం తెలిసేదాకానైన కాలక్షేపం చెయ్యాలి. అందుకే తన గాన విద్యను అమ్మకాసికి పెడుతున్నానని అమ్మకు చెప్పి ఆ 'లక్ష్మి'కి నోటిపాట ప్రారంభించాడు. తల్లికి కొంత మనస్సుపై భారం తగ్గింది.

# 27

నరసింహమయ్యరు బిడ్డ లక్ష్మి సంగీతం ప్రారంభించింది. రామునికొక వుద్యోగం కావాలి. భవిష్యత్తు అంతా అయోమయమే. అందుకే ఈ 'గుడ్డిలో మెల్ల' అని ఈపనికి దిగాడు. ఆ శిష్యురాలు మాత్రం కలకంఠి కిమారు 'ఖలకంఠి' (కాకిగొంతు)గా వున్నది. ఆమెకు పాటలు నేర్చే ఇష్టమూ లేదు, అభిరుచి లేదు. తండ్రికి ఆమెపై చాడీ చెబితే కొన్ని రూపాయలు ఆగిపోతాయి, భవిష్యత్తుకూడ లేదే!

ఈ ఒక నెల ఉభయభ్రష్టత్వం పని ఎలాగో చేశాడు.' అంతలో బి. ఏ., ఫస్టులో పాసయ్యావని కృష్ణవేణి వ్రాసింది. కృష్ణిమగడుకూడ అతన్ని అభినందించి ఆశీర్వదించాడు.



తానుకూడ వానికిక ఉద్యోగప్రయత్నం చేస్తాననే వ్రాశాడు. రాముడు అమ్మతో మాట్లాడి నప్పుడల్లా 'అమ్మా! నా ఈ వ్యాసంగంతో లాభంలేదు— ఎక్కడైనా తగిన వుద్యోగం దొరికితే నిన్ను పిల్చుకుపోయి అక్కడే వుండాలి. అందాక నీవు ఒంటరిగా వుండగలవా?' అని ఎన్నో విధాల ఆలోచన చేశాడు. భవిష్యత్తు 'భూత'మై ఎదురైంది. సంగీతం ట్యూషన్ ఫీజు నాల్గురూపాయలు నరసింహమయ్యరిచ్చారు. అప్పుడేమో అపారంగా ఆనందమైంది. అమ్మకొక కొత్తచీర తెచ్చి కట్టించాడు. 'అమ్మా, రేపు సాయంకాలం సముద్రతీరం వెడదాం' అని ధైర్యంగా మాట్లాడినాడు.

ఆమె మళ్ళీ కుమారునితో నరసింహమయ్యరు చెప్పిన మాటలనే వల్లించింది 'ఏమిరా! వాళ్లు అంత శ్రద్ధగా బెంగుళూరికి రమ్మన్నారే!' అంటే రాముడు చాల చిన్నబుచ్చుకున్నాడు. 'ఏం చెయ్యాలి! వేరే వుద్యోగమంటూ దొరికితేగా! మద్రాసులో బాగా తిరిగిన అనుభవం జ్ఞప్తికి వచ్చింది. అంత దారిద్ర్యంలో అమ్మను మాత్రం మనస్సు నొప్పించరాదు. సుబ్బత్త చెప్పిన కథలలో శీనమయ్యరుకు రామబితాళులకు నడచిన ఝటావటి, కేసులు, పోటీలు విన్నాడు. తాతకు హోటేళ్ళ సంపాదన అంటే ఎంత అసహ్యమో విన్నాడు. తనకు అది అంత హీనమని తోచకున్నా, తన వంశానికి శత్రువుల ఇంట్లో పనికి చేరడం సబబు కాదని మాత్రం తోచింది.

అయినా, పోయినా దానివల్ల మాత్రం ఏమంతలాభం! నెలకు ఇరవయ్యేగా ఆర్జన! దానిలో వృద్ధి భవిష్యత్తు లేముంటాయి? తన రేపేమి! అనే ప్రశ్న మాత్రం తెగదని తెలిసి వచ్చింది. తరువాత బెంగుళూరు మద్రాసుకు దగ్గరకూడ! అదికూడ ఒక మహా నగరమే! ఈ రెండింట్లో ఎక్కడో ఒకచోట కాలక్రమేణ ఉద్యోగం దొరకవచ్చు అవి కూడ ఆశ పుట్టింది. అందుకే రాముని మనస్సు ఎంతో ఆందోళన చెందింది.

మరునాడు సాయంకాలం 'అమ్మ ఎంతమ్మా టయిం? సాయంకాలం కూడ నువ్వు సముద్రతీరానికి రావేమిటి?' అన్నాడు. తల్లి కొడుకులు ఎల్లాగో మెల్లిగా ఇసుకలో కాళ్ళీడ్చుకుంటూ ఊరిఇసుక మెట్లను దిగారు. రాముడు దారివెంట ఇసుకనులేపి దిక్కులకు చిమ్ముతూ ఎగిరే పొడదుమ్మును చూస్తూ, ముందుకు నడుస్తున్నాడు. తల్లి ఏమీ మాట్లాడ లేదు. ఆమెకు రాము దేమంటాడో? తన ఈ నలిగిపోవడ మనేస్థితికి అంత్యం వుందా? అనే రెండే ప్రశ్నలు కనబడ్డాయి? ఆ సముద్రంలో తరంగాలలాగే ఆ రెండు ప్రశ్నలూ ఒకటిపై నొకటే పొర్లాడుతున్నవి. ఒక ప్రశ్నను మరొక్కటి మింగివేస్తున్నది.

సముద్రం సమీపించింది. తెల్లమబ్బుల వెనుక ఆ సూర్యుడు కళాహీనంగానే వున్నాడు ఒక్కొక్కసారి అదృశ్యు డౌతాడు. గొప్పగా మబ్బులుకూడ లేవు. గాలికి కొన్ని మబ్బులు కమ్ముకున్నందుకే రంగురంగుల సూర్యకిరణాలు ఆకాశంలో నిండుకున్నవి. నారింజ, ఎర్ర, ఊదా ఎన్నో! తరువాత పొగలాగు ఏమాత్రం శోభాయమానంగా లేదు? రాముడు కాళ్లు చాచు

కొని కూర్చున్నాడు. రాముడు ఒక ఆలిచిప్పను తీసికొని తేమగావుండే ఇసుకలో ఏమేమో గీచాడు. తన చిన్ననాటి చిత్రకౌశల్యం వాణ్నింకా వదలలేదు. వేళ్ళు నాట్యమాడుతున్నాయి. ఏమో బొమ్మలు గీచేశాడు. ఆమె ముఖం వాల్చుకుని సముద్రంలో వున్న ఓడ యొక్క పొగనే చూస్తున్నది. తరువాత కొంచెంగా మౌనభంగం చేసింది.

'ఈ బందరుకు గొప్ప చేపలు రాలేదు. లెక్కచూస్తే వానకాలం నాలుగైదు రోజులలో మొదలవుతుంది. ఈసారి మన గుంటలో కూడ తగిన నీళ్ళులేదు. పేరుకే వర్షాలు కురిశాయి. ఇకముందు సరిగ్గా వర్షం పడితే బాగుంటుంది.

రాముడు 'ఊఁ హుఁ' అన్నాడు.

'ఈ సంవత్సరం వ్యాపారాలు తక్కువేమో! తరువాత మన హంగారకట్ట వ్యాపారం కూడ తక్కువవుతుందేమో! ఆ సొరచేపలు, పడవలుకూడ తక్కువే అనిపించింది.'

రాముడు పరధ్యానం నుండి లేచి 'అమ్మా! ఏమన్నావు?' అని తన సమాధిని వదలుకున్నాడు.

తల్లి వెనుకటి మాటలనే చెప్పింది. 'అవునమ్మా! బందరులో కొల్లు గిడ్డంగులు మూసినవే ఎక్కువగా కనబడ్డాయి!' అన్నాడు. తాతకాలంలో ఇక్కడే మంచి వ్యాపార మటగా!' అన్నాడు.

'అట్లంటే మేమే చిన్నవాళ్ళుగా వున్నప్పుడు మంగుళూరినుండి హంగారకట్టకు వస్తే నాలుగైదు పెద్ద ఓడలు వస్తుండేవి. ఇప్పుడు అన్ని తెప్పలురావు, ఇంకేమీ రావు' అన్నాడు.

'ఉండనయ్యా! నరసింహమయ్యరుకు ఏమో ఒక సమాధానం చెప్పవద్దంటావా?'

'కాని అల్లాగే! నాకిప్పట్లో ఏ దిక్కూ తోచడం లేదు. కాని ఇరవై రూపాయలు కూడ ఒక జీతమేనా? అందులో నీకు దానిలో జరుపగలనా?'

'ఒరే! నువ్వు కొంత టికాణా చేసుకో. నీకు అదృష్టం బాగుంటే మంచిపని దొరుకుతుంది. కావాలంటే అప్పుడే వస్తానులే నీవద్దకు' అన్నది.

'కావాలంటే అంటావు? నువ్వు అక్కర్లేదన్నానా?'

'అల్లాకాదు రామ! నువ్వు లేకుంటే నేను ఎల్లా బ్రతుకుతున్నానో 'వానికే' తెలుసు. కాని తెలియనివాళ్ళో ఒకరికొకరు భారం, తొందర?.......'

'అది సరి! రావాలంటే?'



'ఈ కష్టం తెలిసికూడ మీ తాత కష్టపడి ఈ ఇల్లు కట్టారు. నేను అతని చావు గడియలలో ఇంటిపై అక్కరలు గమనించినదాన్ని. అల్లాంటిచోటును వదులుకుంటున్నామంటే మనది చాల దురదృష్టంరా? దైవేచ్ఛ ఎల్లాగుందో చూదాంలే!'

'దీనికంతా ఏమి దైవేచ్ఛనమ్మా!'

'అదీ నిజమేలే! అతన్ని తిడితే లాభం లేదు. సరిగదా మనమే చేతులార చేసుకున్న ఫలమేగదా! ఇదంతా? కాని మన చేతిలోకూడ వశం తప్పుతుంది.'

ఇంతలో చాల గాలివీచింది. ఇసుక కళ్ళలో పడింది, ముఖానికి కొట్టింది. ఆకాశం నిండా మేఘాలుకూడ కమ్ముకున్నాయి. 'బాబూ! ఎందుకో గొప్ప గాలివాన వచ్చేలాగుంది. త్వరగా ఇల్లు చేరాలి. అయితే వానకాలం ఈవేళనుండీ మొదలవుతుందా ఏమి?' అన్నది.

త్వరత్వరగా ఇద్దరూ ఇంటిదారి పట్టారు—రాత్రి ఏమంత కాకున్నా చీకటిగానే వుంది. గాలికి చీకట్లో అల్లాడే కొబ్బరచెట్లు మదించి ఆడే నాగుపాముల్లా కనిపించినవి. కళ్లు తెరిస్తే మన్ను ఇసుకకొట్టడంతో ఆ ఇసుకదిన్నెపై నడువలేక పోయ్యారు. ఎల్లాగో గాలి కెదురుగా పరుగెత్తుకుంటూ నడిచినంత కాలానికే ఇల్లుచేరారు. గాలివెంట జిగేలుమని మెరుపులు మెరిసాయి. ఒక్కపెట్టున గాలి, వాన, ఉరుములు మెరుపులు వచ్చాయి. ఇంట్లోకి అడుగుపెట్టగానే నాగవేణి 'అయ్యో పాపం! ఆ ఓడవాళ్లు నడుసముద్రంలో ఎల్లా గడుపుతారో ఏమో! అందుకే ఈ ఎండ వుక్కలలో వ్యాపారాలు చెయ్యరు. వాళ్ళు కనీసం హంగార కట్టకే వచ్చేస్తే నయం' అన్నది.

చాలసేపు వాళ్ళిద్దరూ ఆ సముద్రంలో వెళ్ళే బెస్తపడవల గురించి ఇతర కష్టాలను గురించి మాట్లాడుకున్నారు. ఒకొక్కసారి తమవూరి ఏట్లోనే సముద్రంనుండి కొట్టుకొని వచ్చి పడవలు మునిగిన సంఘటనలనుకూడ చర్చించుకున్నారు. ఒక్కొక్కసారి సొరచేపలు కూడ పడవలను బోర్లగిలవేసే సంఘటనలు లేకపోలేదు.

రాత్రి అంతా వాన తగ్గలేదు. విడువలేదు; నాగవేణికి ఆ ఏకాకిగా నడుసముద్రంలో తిరిగే నావయే నాల్గుసార్లు జ్ఞాపకం వచ్చింది. పడుకున్నా నిద్రపట్టలేదు. 'రామ, ఆ పసుల కొట్టం చూసి వస్తారా? అది కారుతున్నదేమో! దానిపైన గడ్డికూడ కప్పలేదు, గంగ—తుంగలను మంచేపోయ్యాము. ఈసారి వాటి పెంకులు కూడ కారుతాయి పాపం! దీపం గాలికి ఆరిపోతుంది. ఆ మెరుపుల్లో నే వెడతాను' అని నాగవేణి వెళ్ళింది. అంగళం దాటి పసులదొడ్డిలోకి వెళ్ళేలోగా బాగా తడిసిపోయ్యారు. ఆ పసులకొట్టం పెంకులుచీలి రంధ్రాలు పడ్డాయి. వానకు లొడలొడ జొటజొట నీళ్లు కారుతున్నాయి. తుంగ - గంగ (కరుణాపూర్ణ దృష్టితో) జాలిగా అంబా అంబా అని అరచాయి. 'పోనిలే, ఆ పేడ, కసవు రేపు తీస్తాం, రండివే చావట్లోనే వుందురుగాని' అని వాటిని చావట్లో కట్టేసుకుంది. తరువాత ఆ జంతువులు

ఒకటికొకటి చర్మాలను రాచుకుని, చలికి పడుకున్నాయి. తరువాత తమ శరీరాలను కూడ గట్టిగా ముడుచుకొని తల్లి కొడుకులు పడుకున్నారు. వారికి ఎండిన గుడ్డలుకూడ లేవు.

తరువాత నాగవేణి 'ఈసారి పాకలు తప్పించకుండా వుంటే అవి పూర్తిగా కూలి పోతాయి. అయితే గడ్డి ఎక్కడినుండి తేవాలి,' అన్నది.

'అయితే సూరనింట్లో లేనే లేదా?' అన్నాడు.

'ఈసారి ఆ గుత్త ఎక్కువ వద్దు అంటే వింటాడేమో! కాని ఈసారి వానలలో కప్పేదెల్లాగు? ఆ రాత్రి వర్షానికే ఊరంతా చెరువులా తయారైంది. చెరువునిండా కప్పలు గుటగుటకులు అని బెకబెకలు చేస్తున్నాయి. అప్పుడే వానకాలం మొదలైంది నిజమే. నిద్ర పట్టకున్నా సరిగా నిద్ర రాకున్నా తల్లి కొడుకులు ప్రొద్దుటనే లేచారు. కాని గంగా-తుంగలు పడుకొని వున్నాయి.

కొబ్బెరమట్టలతో నాగవేణి ఎప్పుడో చాప అల్లి పెట్టింది. ఆ తడిసిన గడ్డిని తీసి, ఈ తడిక లెక్కిస్తే బరువుకు తడిసిన గోడలు కాస్తా కూలిపడితే కష్టమే. ఈ పనికి సరిగా ఎవరు వస్తారు. కాళడు మంచం పట్టాడు. బచ్చి ఎన్నడో ఐదునూర్ల గడ్డిమోపులు తెచ్చి పడేసింది. అదికూడ నానిపోయింది. బచ్చి కొడుకులు దున్నడాని కెళ్ళారు. రాముడే పెంకు లెక్కాడు. వీలైనంత కొబ్బెర తడికెను దూర్చాడు. నాగవేణి దానిపైన మోపులు మోపులుగడ్డి అందించింది. ఈ వానకాలమైనా ఆగితే చాలని పని తొందరగా ముగించారు.

నాగవేణి స్వయంగా నరసింహమయ్యరు ఇంటికి వెళ్ళి కొడుకు విషయంలో మాట్లాడింది, బెంగుళూరు వెళ్ళడానికి ఖర్చులు సంచకరువుగా ఇస్తారట. నాల్గుదినాలవరకు రాము డింట్లో వుండి వెళ్ళేరోజు తల్లిని కౌగలించుకొని 'అమ్మా, నువ్వెంత ఖరైనా వారితో బదులుతీసికో. నా జీతంలో కోతవేయమంటానులే. నువ్వు మాత్రం వస్తు పండుకో వద్దు —' అన్నాడు. వానలో తడుస్తూ ఎల్లాగో వూరు విడచాడు.

నాగవేణికి మళ్ళీ ఏకాంతవాసం, ఏకాంతగానం అయింది. అప్పుడప్పుడు కొడుకు నుండి జాబులను నిరీక్షిస్తూ కూర్చునేది, వెళ్ళి చేరిననాడే ఉత్తరం వ్రాశాడు. — 'సరిగ్గా చేరాను—సురక్షితంగా వున్నాను' అన్నాడు. తరువాత ఎన్నో తల్లిని గురించి ప్రశ్నలు— ఆమెకు సలహాలు వ్రాశాడు. ఆమెకూడ ప్రత్యుత్తరాలు వ్రాస్తూ వచ్చేది. తరువాత 'అమ్మా! నిన్ను త్వరగా పిలిపించుకునే మంచిరోజు రావాలి,' అని ఆశించాడు. తరువాత జాబులలో 'అమ్మ నువ్వేమో నరసింహమయ్యరువద్ద ఒక తూమెడుబియ్యం తీసుకున్నావంటే చాల సంతోషం. నగదు రొక్కం అడుగు. నాకు భోజనం తిండి దొరుకుతుంది—పరవాలేదులే!' అని వ్రాశాడు. వీలైతే కృష్ణవేణి బాకీలు తీర్చాలి. తరువాతనే తాను ప్రత్యేకంగా గది. చెయ్యాలి అని వూహించాడు.



బెంగుళూరు వానంచేసి దినా లెక్కువయ్యేకొలది, తల్లిని అక్కడ కాపరాని కుంచా లనే వుత్సాహం క్రమంగా తగ్గిపోయింది. ఎలాగైన తన అట్టి ఆశలను జాబులలో మాత్రం వ్రాయలేదు. ఇల్లు అద్దెకు తీసుకుంటే ఇరవైరూపాయల ఖర్చు చాలుతుందా? అనే చింత? తరువాత నాగవేణి 'ఊరికెప్పు డొస్తావు?—నిరీక్షిస్తున్నానని' వ్రాస్తుంది. తాను ఎప్పుడు రావా లనుకున్నది ఆమె వ్రాయదు. దానికి బదులు వాడు 'అమ్మా! నిన్ను తప్పని సరిగా ఎన్నడు పిలిపిస్తానో—ఎంతో ఆపేక్షతో వున్నాను' అని వ్రాస్తాడు. ఒక జాబులో 'నువ్వు వచ్చినా నీకు నరకమేమి తప్పదు. చిన్నగది, తెల్లవారుఝామున నేను లేచి హోటేలులో కూర్చుంటే పన్నెండు గంటలవరకూ తీరికలేదు. తరువాత అరగంట మాత్రం విశ్రాంతి, మళ్ళీ భోజనం చేశాక రాత్రి పదకొండు గంటల దాకా తీరికలేదు. దీపా లార్పేసి పడుకోవాలి. పడుకొనేసరికి శరీరమంతా పండయిన ట్లవుతుంది. కాయబారుతుంది. నీతో మాట్లాడటానికైనా సమయం దొరికేనా అని సందేహం. అక్కడ సరిగా గాలి, వెలుతురు సుఖంగా వచ్చే చోటును వదలి ఈ చీకటికొట్లో ఎందుకు బదకాలి? జపం వద్దు, కష్టం వద్దు— నేనే సంవత్సరానికి కొన్ని రోజులైనా వచ్చి నాలు నాళ్లైనా నీతో సుఖంగా వుంటానులే!' అని వ్రాశాడు.

తరువాత తన చాకిరీ వివరాలూ వ్రాశాడు—'ఇక్కడ ఎందరో పెద్ద మనుష్యుల పరిచయం ఏర్పడింది. స్నేహంకూడ కుదిరింది. ఎక్కడైనా ఉద్యోగాలు దొరుకుతాయా అని కూడ అడిగి తెలుసుకున్నాను. మాటలలో మంచి నమ్మకం చెబుతారుగాని చేతలు శూన్యాలే. అందరూ డంబాచారులే. నేను తక్కువ ప్రయత్నాలు చెయ్యడం లేదులే. దానికి కూడ పోస్టుఖర్చులు కూడ దండుగైనాయి. ఎవరైనా పైకి లాగుకునే వా రుండాలట. మద్రాసు నుండి కూడ ఆశాజనకమైన జాబులు రావడం లేదు. ఈ సంవత్సరాంతానికి వాళ్ళ అప్పు తీర్చుతానులే. తరువాత బొంబాయి పెద్ద నగరం కదా! అక్కడికే వెడతా: అక్కడ మనవూరి వాళ్లు ఎందరో వున్నారు—అక్కడైనా ఎక్కువ జీతాలు వస్తాయేమో!' అని ఏమేమో తల్లికి వ్రాసేశాడు.

మరొక్కసారి తన దినచర్య పాట పాడాడు. 'తెల్లవారి లేచి కూర్చుంటాను. బిల్లు చూచి లెక్క ఎంచుకుని దాచేపని. రెండుగంటల కొకసారి మయ్యగారి తమ్ముడు వచ్చి రూపాయనోట్లు వేరుచేసి దాచేస్తాడు. నేను వచ్చి అరునెలలైనా నన్నేమో—వాళ్ల లెక్కలు చూచి డబ్బు ఎంచే ధోరణి చూస్తే—ఒక దొంగచేతికి తాళా లిచ్చినట్లు భావించారని తెలుస్తుంది. ఇంత వుంటే నన్నెందుకు వుద్యోగానికి పెట్టారు? వాళ్ళకు ఇంగ్లీషు రాదు. మా హోటేలుకు ఎదురుగుండా ఎవ్వరో బి. ఏ. చదివినవారు ఒక హోటేలు పెట్టారులే. దాన్ని పడవెయ్యాలని వీళ్లు వేసిన ఎత్తుకు పై యెత్తులే. డబ్బేకాదా! ఎల్లా నమ్ముతారు! ఇంగ్లీషు నాకు వస్తుంది. బాగా మాట్లాడుతానని ఉపయోగించుకుంటున్నా రంతేలే! నాలో నమ్మకం పొకెల్లా కల్గాలి—ఈలాగు వాళ్లు భావిస్తే? రోజూ లెక్కలు చూస్తారు. ఎవరైనా చెల్లని

బేద, పావలాలు ఇచ్చి పెడితే అవికూడ నా తప్పే. నా జీతంలో కోతలు పెడతారు. సాయంకాలం వ్యాపారం క్రిక్కిరిసివుంటే ఎల్లా చూచుకోగలను?

'ఒక్కొక్కసారి సంగీతం పాఠాల కెడుదామంటే సమయం దొరకదు. ఇక్కడ కాఫీకి వచ్చే సంగీతం మాష్టార్లకు స్వరాలే రావు, ఎందరో మాష్టార్లు పని లేక తిరుగుతుంటాపులే'. రామునికేమి తృప్తిఅంటే అమ్మకు అన్నవస్త్రముల కొరత కొంతకాలమైనా లేదు. తరువాత మాధవునికి నూరు రూపాయలు పంపడం. మాధవుడు 'ఏమి రామ! అంత తొందరేం వచ్చింది లే! నే నేమైనా డబ్బడిగానా? మేమేమి మారవాడీ వడ్డీ వ్యాపారులా? నిన్ను నమ్మలేదా! మీ అమ్మసంగతి చూస్తే చాలు' అని నిష్ఠూరంగానే వ్రాశాడు. రామునికి నొప్పికల్గినా వారు చూచుకొన్న శ్రద్ధ అన్నీ ఒకసారి జ్ఞాపకం వచ్చాయి. మాధవునికి క్షమాపణ వ్రాశాడు. ఆనందుడు ఒక పెద్ద గ్రంథమే వ్రాశాడు. 'అన్నా—నువ్వు నన్ను—మరిచిపోయ్యావులే' అని వ్రాశాడు.

ఎండకాలం మళ్ళీ వచ్చింది. రామునికి కొంత విశ్రాంతి అవసరమయింది. హోటేలంటే చాలయింది. కాని ఇంటికి వెళ్ళాలంటే రొక్కం—తరువాత నెల రోజులు జీతం రాదు. తల్లిని వదలి వుండాలంటే ఇష్టం లేదు—తల్లిని పిలిపించుకోవాలంటే కూడ అంతే—ఏం చెయ్యాలి? సరేలే మరొక్క సంవత్సరం నౌకరీచేసి రెండు నెలల లీవు తీసికొని బొంబాయిలో వుద్యోగం వెదుక్కుందాములే అనుకున్నాడు.

కానీ నాగవేణికి మాత్రం కొడుకును చూడాలని వుండదా?. 'ఒరే బాబూ! డబ్బు వెంటపడితే తెగదు. తల నెరిసినా పనులు సాగవు. అదృష్టమున్నట్లు కానీ, లేకుంటే పోనీ—నెలరోజులు తీరిక నడిగి రా!' అని నాగవేణి వ్రాసేసింది.

తరువాత ఒక వారానికి 'నరసింహమయ్యరు అడిగారు'. మీ కొడుకు సెలవులకు వూరికొస్తే రానీ—నేను తొందరపెట్టను' అని అన్నట్లు నాగవేణి వ్రాసింది. హోటేలు లెక్కవ్రాసి వాణ్ని వూరికి పంపుమని తమ్మునికి వ్రాశాడట. రామునికి చాల ఆశ్చర్యం అయింది. బహుశా తన పని శ్రద్ధలు చూచి అల్లా చేశా రనుకున్నాడు. తరువాత జీతం కూడ పాతికకు పెంచారని తెలిసింది. అది ఘనకార్యం. మహోపకారమని నమ్మాడు. కాని ఈ పదహారు గంటల చాకిరీ బదులు పన్నెండు గంటలకు దింపితే చా లనిపించింది. రాముడు ఇంటికి డబ్బు పంపివుండలేదు. దగ్గరున్న డబ్బుతో సరిపుచ్చుకొని దారి ఖర్చు మాత్రం తెచ్చుకున్నాడు.

జనార్దనుడు అన్నకు రాముడు వెళ్ళిన సంగతి వ్రాశాడు. రెండు రోజు లాలస్యం అయితే మయ్యరు నాగవేణికి ఆ సంగతి తెల్పి - ఎందుకు రాలేదో అని విచారించాడు. రాముడు మద్రాసుకు వెళ్ళి మాధవునిపట్ల కృతజ్ఞతను వెల్లడించి, అక్కడి ఆఫీసులు గాలించి ఉద్యోగానికి అర్జీలు పెట్టి ఒక వారానికి వూరు చేరి 'అమ్మా! అమ్మా!' అని పిలచాడు.



'అమ్మా, అమ్మా' అని కుమారుడు నోటనిండ తియ్యగా తల్లిని పలకరించాడు. తింటేశాక తానే అమ్మ ఎంగిలికూడ ఎత్తి తుడిచి 'రామ్మా! ఈ అంట్లు ప్రొద్దున తోముకుందువు గాని ఆ ఇసుకదిన్నెమీద వెన్నెల్లో కూర్చుందామురా! చాల రోజు లయింది చల్లగా నీతో మాట్లాడి' అని అన్నాడు. 'అమ్మా, ఫిడేలు ఎక్కడ?' అని అన్నీ తొందరగా ఆత్రంగా మాట్లాడేశాడు. సంవత్సరం మాటలన్నీ తొంగి చూస్తున్నాయి.

ఇద్దరూ హాయిగా తేలికపాటి మనస్సుతోనే ఆ కాలువదిన్నెమీద నిలబడ్డారు. గాలి మాత్రం వీచకున్నా చల్లగా వుండినది. 'ఒరే ఆ సముద్రం వద్దురా! ఇక్కడే చల్లని ఇసుకలో కూర్చుంటే చాలు' అన్నది. ఇద్దరూ కూర్చున్నారు.

'అమ్మా! ఈవేళ పని ఎక్కువయింది. శ్రమ ఎక్కువైందామ్మా!' అని విచారించాడు. 'కాఫీ.........ఏమో ఉత్సాహమే లేదురా' అన్నది.

ఆరోజు నాగవేణి నెమ్మదిగా 'బాబూ! నాకేమీ తోచలేదు. ఆ నరసింహమయ్యరు చెప్పిందే నీకు అప్పజెప్పుతున్నాను. అంతే! అతని కూతురు లక్ష్మిని నీకు ఇచ్చి పెళ్ళి చేసేస్తానంటాడు. ఇరుగు పొరుగువాళ్ళు - దూరం బంధుత్వ మేమీకాదు. బాగుంటుంది అన్నాడు. అతనికి నాల్గు హోటేళ్లున్నవట; ఒకదానికి నీకు సంపూర్ణాధికారం ఇచ్చేస్తారట. వున్న ఆస్తిలో సగంకూడ ఇస్తాడట—వాణ్ని ఇంటి నౌకరుగా భావించవద్దని — మరెన్నో చెప్పి వ్రాయమన్నారు' అన్నది.

రాముడు నవ్వాడు. 'నువ్వు వారికి వాగ్దానం చేశావా ఏమిటి?'

'లేదులే!'

'నీ అభిప్రాయ మేమిటి?'

'నీకు ఆ పిల్ల నచ్చితే కానిమ్మంటాను. ఈళ్ళో బడిలోనే ఇంతో అంతో వ్రాసేది, చదువేది నేర్పింది. నీకు మాత్రం ఈవేళ లేకుంటే రేపైనా పెళ్ళి వద్దంటావా? బీదలకు పిల్ల నెవరిస్తారురా .......నేను మాత్రం నీ ఆనందాన్ని, అంగీకారాన్ని గమనిస్తాలే. ఇంకా ఎవరికీ వాగ్దానం చెయ్యలేదు' అని చెప్పింది.

'అమ్మ! పిల్ల ఎలాగున్నా హోటేలు—వాటాలు అన్నీ చూచుకొని తృప్తిపడమంటావా? మా పిల్లవల్ల పెద్దవాడైనాడే అని మాటకూడ యావజ్జీవం నిలుస్తుంది — ధనం, అదృష్టం అంతా నిజమే కాని, నాకేమో ఇప్పుడు పనితోనే విసుగు పుట్టింది. నిమిషమైనా తీరిక లేదు. ఇన్నాళ్ళలో రెండు మూడుతూర్లు ఫిడేలు వట్టానంటే నమ్ము."

'పోనీలే, ఆ అమ్మాయికి పాట నేర్పావుగా? ఆమె ఎల్లాంటి దని తెలుసుకున్నావా?'

'ఆమెకు విశేషం తెలివితేటలు లేవు. గుణం అంతే, బుద్ధి కాని వున్నట్లు నాకు తోచదు. ఆమె పెద్దవాళ్ళతో సంభాషించే తీరు తెన్నుకూడ సబబుగా తోచదు. మణుగుల కొలది బంగారం మాత్రం ఆమె దేహంపైన మోపినారు. నాకేమో అలాంటి ఆశలు, వాంఛలు కలలో నైనలేదు. ఆమె మనస్సులో 'తాను గొప్ప—మగడు లేకి, పనికిరాడు అని ప్రవృత్తి ఏర్పడితే చాల అపాయకరం. నాకు వచ్చే మర్యాద ఊహించుకో.'

'అది నిజమే, కాని రామూ! అయితే నీకు పెళ్లి, పేరంటాలు వద్దంటావా? సరే! మంచి స్థలం ఎక్కడైనా దొరకితే వల్లెయంటావా?'

'అమ్మ! నీకేమో మళ్ళీ ఆ పిచ్చి భ్రమ పోలేదు. మనం గంజికే ఎంతో తిప్పలు పడుతుంటే, మరొక ప్రాణిని తెచ్చి ఏం పోషించగలం చెప్పు. నెలకు ఇరవై రూపాయలతో ఏమని చేస్తాము చెప్పు. ఎవరికి సుఖం?'

'ఇద్దరూ చాలసేపు మౌనంగానే వున్నారు. చివరకు రాముడు 'అమ్మా! వాయించమ్మా' అని తల్లికి ఫిడేలు ఇచ్చి వాయింపజేశాడు. ఆ పాటలో గతంలోని చేదే ప్రతిబింబిస్తున్నది. ఒక్కొక్కపాట లాగేసి నిట్టూర్చేదే ఒక విశ్రాంతి. ఆ జీవానికి వేసరిక అనేది మర్రి ఊడలలాగు దిగింది. రావిచెట్టులాగు ఆమె కష్టాల వేళ్లు ఎక్కడ బడితే అక్కడ కనబడేవి.

తరువాత ఎంతో సేపు ఎన్నో మాట్లాడుకున్నారు. 'అమ్మా! అప్పుడు వేసిన పాక నిలచిందా? చెప్పు!' అన్నాడు.

'సువ్వేయగా చాపలన్నీ నిలబడ్డాయి. ఈసారి తప్పక పెంకులే కప్పాలిరా! పది, పదిహేను రూపాయలైనా కావాలి. చెయ్యాలి. గంగ, తుంగ రెండూ ఈన నయ్యాయి. రెండు నెలలలో సమృద్ధిగా పాలు. అప్పుడు నీకు ఒక ఆవునుంచి మరొక్క దాన్ని అమ్మితే ఆ డబ్బు వచ్చేస్తుంది' అన్నది.

తరువాత, మరునాడు మధ్యాహ్నం నాగవేణి మయ్యారు ఇంటికి వెళ్లింది. మాటలలో వివాహం మాటకు 'వద్దనడానికంటే' 'సద్య వానికి పెళ్ళి ఆలోచన లేదట నండీ!' అని సమాధానం ఇచ్చింది. మయ్యారు నాగవేణికి చక్కని హితోపదేశం చేశాడు — 'అప్పుడు పాదయ్యింపికూడ ఇదేతీరు. యౌవనంలో పెళ్ళిలేకుంటే వూరుకుంటారా! ఇరవైమూడేళ్లకు కూడ వానికి పెళ్ళి లేకుంటే బెండకాయలాగు ముదిరి, మానులాగు మొద్దయితే ఎవరూ ఇయ్యరు. మా లక్ష్మి ఇంకా చిన్నపిల్ల, పరవాలేదు. వంటినిండ సొమ్ము. ఇంటికి మంచి పేరు వచ్చింది. దేవుని దయవలన ఎవరైనా వస్తారు. కానీ నీ కుమారుని మంచి, చెడు సువ్వైనా ఆలోచించాలిగా!' అని అన్నాడు.



నాగవేణి ముభావంతో ఇల్లు చేరింది. కుమారునికి అంతా చెప్పింది. తరువాత రాముడు మయ్యరు ఇంటికివెళ్లి నరసింహయ్యగారి దర్శనం చేసుకున్నాడు. లక్ష్మిమాత్రం అప్పుడప్పుడు రామునిముందు బంగారం మోసుకొని తిరిగేది అంతే. ఇంకేమీ మాటలు, కోతలు కాలేదు.

ఊరికి వచ్చి పదిహేనుదినాలైనవి. మూన్నాళ్ళకు బెంగుళూరు తిరిగి వెళ్ళాలి. త్వరత్వరగా ఆ పసులకొట్టాన్ని కప్పాడు. ఒకరోజు సుబ్బత్త ఇంటికికూడ వెళ్ళి వచ్చాడు. ఆ ఏడు మున్నారు కరణంగారింటికీ వెళ్లాడు. వారు నవ్వుతూ 'ఏమయ్యా! మనమడూ పప్పు, పాయసం తినిపిస్తావా లేదా!' అంటే రాముడుకూడ నవ్వుతూ 'నాకేమండీ! రోజూ పాయసం, పెళ్లిభోజనమే.' 'తరువాత భార్యకుకూడ తినిపిస్తే సరి!' అన్నాడు.

'అంటే!'

'కన్నీరేనండి పాయసం.'

కరణంగారు నవ్వారు. 'మంచి వుద్యోగం వెదుక్కో! ఎన్నాళ్ళయినా ఈ మయ్యారు హోటేళ్ళు చాకిరీ బాగాలేదు' అన్నారు.

బెంగుళూరులో వాడు వున్నప్పుడే కొన్నాళ్ళకు ఐరోడు తాతగారి మరణం గురించి జాబు వచ్చింది. తాతగారిల్లు చూచాడు. మళ్ళీ బెంగుళూరు వెళ్ళాడు.

తరువాత రోజూ వుద్యోగం వెదక. రెండవ సంవత్సరంలో దినాలు ఒకటి, రెండు, మూడు, అల్లాగే అన్నీ వేళ్ళమీద లెక్కపెడుతూ గడచినట్లు వేసటతో వ్రాసుకొనే వాడు రాముడు. ఎప్పుడో ఒకసారి జాబులు వ్రాస్తాడు అమ్మకు. ఆమె ప్రత్యుత్తరం వస్తుంది. ఏమో అన్నీ నిరుత్సాహంతో నిండిన వ్రాతలే. తరువాత కొన్నాళ్ళు వాణ్ని ప్రోత్సహించే జాబులు కూడ వ్రాసింది. ఆమె ఒక హర్షం నిండిన విషయం తెల్పింది.

నవరాత్రికి నెలకు ముందే మాధవుని జాబు వచ్చింది. వాళ్ళు వూరికి వెళ్ళే లోపుగా బిడ్డ పెళ్ళికిగాను మైసూరు, బెంగుళూరులు తిరుగుతారని, దసరాకూడ చూస్తారని నాగవేణి వ్రాసింది. వాళ్ళు వచ్చినప్పుడు తనకు సెలవిస్తారా? అనే చింత. దసరా అంటే యాత్రికులు నిండే సమయం, హోటేళ్ళకు మంచి గిరాకి.

తరువాత తనకు తొందర కల్గ రాదని, అతడు తన యజమానితో అన్నీ చెప్పుకున్నాడు 'వారు వస్తారు, నాకు కూడ ఆ వుత్సవం చూడాలనే వుంది' అని చెప్పాడు. అతడు కోప పడలేదు. 'సరే' అన్నాడు. నువ్వు ముందే మైసూరు వెళ్ళాలంటే వెళ్లు. మా హోటేల్లో భోంచేసి వుండు. వీలైతే రేస్‌కోర్సువద్ద ఒక హోటేలు తెరుస్తామని వుంది' అని యజమాని చెప్పాడు. ఎలాగైనా సరే మైసూరుచూచే అవకాశం దొరికిందని సంతోషించాడు.

మాధవుడు, కృష్ణవేణి, ఆనంద, జయ మైసూరిలో వున్నన్నాళ్ళు బాగా వారివెంట తిరగాలని నిశ్చయించాడు.

ఆ మంచిరోజు వచ్చింది. రాముడు వారి కొరకు అద్దెఇల్లు విడిది ఏర్పాటు చేశాడు. అక్కడ వారిని దింపాడు. ఆనందునితో నోటినిండ మాట్లాడాడు. తరువాత అందరితో మాట్లాడాడు. కాని జయతో ఏమీ మాట్లాడలేదు. ఆమెకు సిగ్గు మోయలేనంత బరువైంది. మాధవుని పెద్దకొడుకు మద్రాసులో చదువుతున్నాడు. మాధవునికి ఒకటే బాధ. 'రామ, ఏ కొరకు వుద్యోగమైనా చూసిపెట్టలేని చేతగానివాడు నేను. ఇరవైరూపాయలకు కోకొల్లలుగా నౌకర్లు బి. ఏ. లు వకీళ్ళు ఎందరో దొరుకుతారు. అయితే నీకు నయం అన్నం వెళ్ళి పదిహేనయినా మిగులుతుంది. అదే నయం అనిపిస్తుంది'. రాముడు 'నాకు బొంబాయిలో వుండాలనే వుంది' బెంగుళూరినుండి వారుకూడ రాముని వెంట మైసూరు వెళ్ళారు. మైసూరిలోని అందమైన వీధులు, ఉద్యానవనాలు, సౌధములు వానికేమీ గొప్ప అని తోచలేదు. కాని తనకు ఎలాగో విశ్రాంతి దొరికిందని మాత్రం సంతోషం కల్గింది. మాధవుడు, పిన్ని పిల్లలవెంట అన్ని స్థలాలకు తిరిగేది కూడ వానికి వినోదకార్యక్రమంగా తోచింది. ఒకనాడు యజమానుల హోటేలు కూడ చూపించాడు. నవరాత్రి ఉత్సవం, వేడుకలు ముగిసినవి. వాళ్ళను పంపాక ఒకనాడు మైసూరిలోనే విశ్రాంతి తీసికొని, వీలైతే రాజమహలులోని సంగీత కచ్చేరి విందామని కుతూహలం కలిగింది.

దసరా ప్రదర్శనాలు చూశాడు. చిత్రకలా విభాగం కూడ దర్శించాడు. మరొకసారి చూడాలని వెళ్ళాడు. పిచ్చివానివలె తెల్లవారినుండి సాయంకాలందాకా ఆ ప్రదర్శన శాలలో తిరుగాడినాడు. ఒకటి రెండు చిత్రాలను చూచి తానుగూడ చిత్రకారుడైనట్లే కలలుగన్నాడు. తానేమో సముద్రాన్నే చిత్రించాలి అనుకున్నాడు. అక్కడ ఎందుకో ఎవరూ సముద్రదృశ్యం గీయలేదు.' అనుకున్నాడు.

ఆ రాత్రి అంతా చిత్రశాలలో తన చిత్రాలు వ్రేలాడ వేసినట్లే కలలు కన్నాడు. మరునాడు హోటేలు మేనేజరు, రాముడు మళ్ళీ మైసూరులో షికారు వెళ్లారు. ఆ మేనేజరుకు గుర్రం పందేలంటే తెగపిచ్చి. 'రేసకోర్సు' చూచినట్లవుతుందని తానుకూడ వెంట వెళ్లాడు. తాను గుర్రం పందెం చూడాలని మాత్రం వెళ్లాడు. టికెట్ వున్నా దానిలో శ్రద్ధ తీసికోవాలని మాత్రం లేదు. బయట పచ్చిక బీటినుండే గుర్రాల పరుగులు చూచాడు. గుర్రాలు స్వయంగా సహజంగా పరుగెత్తితే, రామునికి ఏం ప్రత్యేకంగా ప్రభావం కల్గించలేదు గాని, ఆ మంది యొక్క పెంపరలాట, మోటారుకార్ల అలజడి మాత్రం వానికి ఆశ్చర్యం కలిగించింది. ఎందరో ఆ గుర్రాలకంటె మనస్సులను పిచ్చిగా పరుగెత్తించారు.

పంద్యాలు పూర్తి అయ్యాయి. హోటేలు స్నేహితుడేమో 'పదిరూపాయలు పొయ్యాయయ్యా!' అని తలవంచుకొని బయటపడ్డాడు. రాముడా కేశవుని కొరకే ఎదురు చూచాడు.



వానివెంట ఒక ముసలివాడు కూడ వచ్చాడు. కేశవుడు రాముణ్ని చూచి నవ్వి, 'వారు తెలుసా' అన్నాడు. రాముడు వూరకే గమనించాడు. ముసలాయన నవ్వాడు. రామునికా ముసలివాడు పరిచయం లేదు. కేశవుడు 'రామ! ఇతడేమో మన వూరివాడే, తెలియదా!' అన్నాడు.

'నేను ఆవూరు సరిగ్గా చూస్తేగా! ఎప్పుడూ పొరుగూర్లోనే పెరిగాను.'

'అందులో వీరు మన గ్రామం వారురా!' అన్నాడు.

రాముడు ఊరకే వున్నాడు.

'మీకు వీడు గుర్తు లేదా! మీరేమో పాతకాలం వారు. వీణ్ని చూచినా చూచి వుండవచ్చు' అన్నాడు.

ముసలాడు అన్నీ తెలిసికూడ కావాలని మాట్లాడినట్లు లేదు.

'రామ! ది గ్రేట్ దర్బారు రెస్టారెంట్ యొక్క యజమాని; ఇప్పుడది లేదులే. మేమంతా అక్కడే పని నేర్చాములే!'

రాముని కెవరో పెద్దలు చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చినాయి. 'అయితే వారు ఒకటమయ్యారే! మన యజమానిగారి తమ్ముడే అన్నారుగా!' అన్నాడు కుతూహలంగానే.

'అది సరియైనదే.'

'అత డెవరు' అన్నాడు ముసలాడు. కేశవుడేమో 'మీ స్నేహితుని కొడుకే కదండీ, రామ ఐతాళులవారి మనుమడు.'

'అయితే మా అప్పుడు మాత్రం ఇతడు పెద్ద వాడయ్యాక చూసిన పాపాన పొయ్యాడో లేదో?'

తరువాత కేశవుడు 'రామ! మీ నాన్న వీరివద్దనే వున్నారు. వారికి వాతరోగం పడుకొని వుంటారు. ఎప్పుడో ఒకసారి బయట వస్తారు. నీవు వెళ్లి వారిని చూడవద్దా!' అన్నాడు.

తన తండ్రి మైసూరిలోనే అజ్ఞాతవాసం చేస్తున్నాడని అన్నాళ్ళకు అర్థ మయింది. రామునికి తండ్రి జ్ఞాపకమే లేదు. 'ఎందుకు చూడరా ద'నే ప్రశ్న ఎదురైంది. ఆశ మొలకెత్తింది. కుతూహలంతో 'ప్రొద్దున వెడదాం' అన్నాడు.

'నువ్వు పేట (బజారు)కు వస్తావా?' అని కేశవుడు అడిగితే 'నే నిక్కడే కూర్చుంటాలే' అన్నాడు. కేశవుడు ఒరటమయ్యరు వెంట వెళ్లిపోయాడు.

రాముడు ఆ ఒరటన్ని ఎంతో దూరం వెళ్ళేదాక శ్రద్ధగా గమనించాడు. తల్లినుండి, సుబ్బత్తనుండి వాళ్ళ చరిత్ర కూలంకషంగా తెలిసే వచ్చింది. అయితే 'మాద్దామా! వద్దా! తల్లి ఏమనుకుంటుందో' అనే చిక్కుప్రశ్న మళ్లీ ఎదురైంది. ఎంతసేపో గడ్డిపోచలు తెంచుతూ ఒక్కొక్క లేతగడ్డి ముక్కను నమిలి వుమ్మి పారేస్తూ 'ఎల్లాగయిన తండ్రిని చూడు — ఐదేళ్ళవాడుగా వున్నప్పుడు చూచిన తరువాత చూడలేదు. మరొక్కసారి చూడు!' అని మనస్సు చెప్పింది.

చాల సేపటికి హోటేలుకు వెళ్ళాడు. కేశవుడు పది గంటలకే హోటేలు వదలివేస్తాడు. 'దుకాణం కట్టేదాక వెళవాంలే' అన్నాడు కేశవుడు. 'రాత్రి వారు పడుకొంటే' అన్నాడు రాముడు. 'వాళ్ళిద్దరికీ, అన్నీ పకటే — రాత్రిళ్లే — పగళ్లే' అన్నాడు. ఆ మాటలు విని మళ్ళీ చింతాక్రాంతు డయ్యాడు. ఊరకే కూర్చున్నాడు. కూర్చున్నవాడు లేవజాలక పోయ్యాడు.

# 28

మైసూరులో శ్రీరామపేటలోని ఒక మురికి సందులో తగ్గుమిద్దెలోని ఒక గదిలో మినుకు మినుకుమనే దీపం, మొంబత్తి దీపమే వెలిగించారు. మైసూరులో విద్యుశ్చక్తి వున్నా ఆ ఇంటి వారికి అది అవసరం లేదు. వారంటే ఆ ఒరటడు, లచ్చడు— లచ్చడు నొప్పిగా వున్న కాలు చాచుకొని, నోటిలో తుండు బీడి ముక్కను కాల్చుతూ, ఒక్కొక్క ఇస్పేటు ముక్క పంచుతున్నాడు. వాని ఎదురుగుండా అంతే లక్షణ పురుషుడు ఒరటుడు ఇద్దరికీ సుమారు యాభై సంవత్సరాలే! కానీ డెబ్బైదాటిన వారిలాగే మసళ్ళయ్యారు: తెల్లని వెంట్రుకలు, రంగులేని కళ్ళు, చెక్కిళ్లు లోతుగా ఎముకలు కన్పిస్తూ. చుట్టూ మూన్నాళ్ళు చేరుకున్న దుమ్ము, చెత్త, ఆకుముక్కలు. తమ్మలు, బీడీ ముక్కలు. కాలిన పీకలు, చుట్టూ వేసుకొని కూచున్నారు. ఆటలో మునిగి పొయ్యారు. ఒక్కొక్కరు పొగల సుడులను విడుస్తూ, ఎవరినీ చూడకుండా ఆడుతున్నారు.

బయట తలుపు చప్పుడైతే లచ్చడు 'వచ్చాడు కాబోలు! మహారాజు' అని మూల్గాడు. ఒరటడు మాత్రం రండి! రండి! అని లోనికి పిల్చాడు.

కేశవుడు, వెంట సిగ్గుపడుతూ అణగి మణగి రాగా, రాముడు కాళ్లు మోపి లోనికి వెళ్ళారు. వాళ్ళు 'హూం' అని మాత్రం స్వాగతం చెప్పి తమ ఆటలో పడ్డారు. ఆట అయ్యే




దాకా మాట్లాడలేదు. పోనీ సరిగ్గా చూడనైనా లేదు. మరొకసారి పేక పంచేటప్పుడుమాత్రం ఒకటి రెండు మాటలు. భూకంపమైనా సరే లెవ్వరు. ముఖం చూడకుండా రెండుముక్కలే మాట్లాడేవారు. కేశవు దేమో 'రామ! నా స్నేహితులు వేచివున్నారు' అని చెప్పి వెళ్ళిపొయ్యాడు. రాముడుమాత్రం రెప్పలార్పకుండా చూస్తూ నిలబడ్డాడు — ఒక ఆట ముగించినా మరొక ఆటను మొదలుపెట్టుకున్నారేగాని వల్లెత్తికూడ మాట్లాడలేదు.

అంతలో ఒరటడు ఒకసారిమాత్రం 'అయితే కేశవుడు వెళ్ళాడా?' అని అన్నాడు. మళ్ళీ ఆటయే. రామునికి అక్కడ వుండటానికి మనస్సు రాలేదు. అలాగే తపస్సు చేస్తూ ఎంతసేపు నిలబడ్డాడో తెలియదు. కేశవుడు ఎంతకూ రాకుంటే ఎదురు చూచి చాలయి: 'మయ్యరుగారూ! మా నాన్న ఎపుడు వస్తారండీ' అని అడిగి ఆ సంకిగ్ధావస్థను అంతమొందించాడు రాముడు — రామునికి ఎందుకో గుండె గాబరా అయింది. 'నాతో ఆడే వారెవ్వరనుకున్నావు?' అన్నాడు ఒరటడు. చూచినప్పటినుండి ఆ రూపం తన తండ్రి దని రామ బిళాళుల కుమారుని స్వరూప మని మాత్రం రాముడు నమ్మలేక పొయ్యాడు. సుబ్బత్త యొక్క ముఖవర్చస్సు కానీ, రూపం కానీ, పోలికలు కానీ ఒకటీ లేదు.

సరి! తండ్రి అందే కొంతైనా మాట్లాడాలని నిలబడ్డాడు. నుంచుని చాలయి — తరువాత కూలబడ్డాడు. లచ్చడు ఎన్నో ఆటల తరువాత ఒరటుని మూలకంగా పలకరించాడు. 'ఎప్పు డొచ్చాడబ్బ! ఏమట!' అని ముఖావంగా - ఆ పొగరు పోతు చేష్టలు రామునికి నచ్చలేదు. అసహ్యంతోనే 'ఎనిమిది నాళ్ళయింది. బెంగుళూరినుండి వచ్చాను! వెడుతాను' అని మూడేముక్కలు ఒరటనికి సమాధానం చెప్పి ఎల్లాగో బయట పడ్డాడు. కేశవుని కొరకు ఎదురుచూడనైనా లేదు. మనస్సు కోపంతో, అసహ్యంతో వుడికిపోతున్నది. అల్లాంటి జీవియొక్క కొడుకుగా తా నెందుకు పుట్టాడో అని కన్నీరు కార్చాడు. 'తండ్రి అని చూడటానికి వెళ్లితే చక్కగా ఆప్యాయతతో ముఖాముఖి మాట్లాడరాదా?' అని చాల మనస్సు నొచ్చుకున్నాడు. కేశవుడు తెల్లవారేదాకా కనబడలేదు. తెల్లవారే అన్నీ కేశవునితో చెప్పాడు. 'అతడు దానివల్లనే చెడ్డాడు. అతడంటే దుర్మార్గాలకు, దుర్గుణాలకు పుట్ట. ఈవేళ మద్రాసు, రేపు పూనా మరెక్కడో ఇంకొకరోజు— ఎక్కణ్ణించి వస్తుందో డబ్బు?' అని తానేమో గౌరవస్తుని లాగా మాట్లాడాడు కేశవుడు.

తరువాత రెండునాళ్లయినా వుండి సంగీతం కచ్చేరీలు విని వెళ్లాలనుకున్న వానికి ఆ రాత్రి సంఘటనతో ఆశలు వీరై పోయినాయి— మంట గలసాయి. మైసూరు అక్కర్లేదు అనుకుని వెంటనే బెంగుళూరికి వెళ్లాడు.

యజమాని జనార్దనుడు వెంటనే మైసూరి వినోదాలు, కాలక్షేపం అంతా అడిగినాడు. చివరకు 'రామ, మా హోటేలులో కేశవుడు బాగున్నాడా? దుకాణంలోనే వుంటాడా? మరెక్కడైనా విహరిస్తాడా?' అని ఎన్నో ప్రశ్నలు వేశాడు.

'నేను వెళ్లినప్పుడున్నాడండీ?'

'వాణ్ని రేసులో చూచామని ఎవరో చెప్పారయ్యా నాకు. అయితే ఆ రేసులపిచ్చి గలవాళ్లపై ఒక అజమాయిషీని వుంచాల్సిందే. లేకుంటే చాలకష్టం. ఉపాయాంతరం లేదు.'

రాము దేమీ మారాడలేదు.

జనార్దనుడు విడువడే; 'ఏమి? వూరకున్నావు? నీకేమీ తెలియదా? మా ఒరట మయ్యరు, మీ తండ్రి చెడిందికూడ ఆ పందేల మూలాననే. వాళ్లకూడ మైసూరిలో వున్నారని విన్నాను. కేశవుడు వారి పనివాడే! ఇప్పుడుకూడ వారితో కలిసి చాల సన్నిహితంగా వుంటాడని విన్నాను. నాకేమో ఆ కేశవునితో ఒక కొత్త బెంగ చుట్టుకుంది' అని సణిగాడు.

రాముడు ఇదివరలో కేశవుని కథలు విన్నాడు. తాను వాడు స్వయంగా జూదాలలో భాగస్వామి అయింది చూచాడు. అందుకే తాను తండ్రిని చూచిన సంగతి వర్ణించేలాగా అన్నీ వివరించి చెప్పాడు.

తరువాత తన దినచర్యలో పడ్డాడు. తల్లికి తన మైసూరు యాత్రను వర్ణించి వ్రాశాడు. తండ్రిని చూచిన కథ వ్రాయాలంటే చాల సిగ్గేసింది.

ఒకవారం లోగానే నరసింహమయ్యరు తన తమ్ముని జాబుకు బదులు వ్రాశాడు. 'కేశవుణ్ని నీ కింద వేసుకో! మైసూరుకు రాముణ్ని పంపు. కేశవుడు పందెము, జూదం మానితే వుంచుకో. లేకుంటే పని మాన్పించు' అని ఆదేశించాడు.

రామునికేమో ఆ రెండవ వుద్యోగ మేమీ ఇష్టం లేదు. వానికి మరొక అశాజనకమైన వార్తకూడ తెలిసింది. మైసూరులో తా నున్న హొటేలుకు ఎదురుగా మరొక హొటేలు యజమాని రాముని మంచిగుణాలు విని వాని విద్యా వినయాలు పురస్కరించుకొని చెప్పించాడు 'ముప్పై రూపాయల జీత మిస్తానని వెంటనే రమ్మని' కాని రాముడేమో తన వూళ్ళో అమ్మకు ఇబ్బంది రాదనే వూహతోనే మైసూరులో పనికి చేరాడు. పాత హొటేలు వదుల దలచలేదు. ఆ పని యేమీ క్రొత్తది కాదు. నిన్నటిదాకా 'శుచి భవనం'లో చేసిన పనే అది. యాత్రికుల ఋతువు తప్పితే, మిగిలిన రోజుల్లో చాల వ్యాపారం వుండదు. కానీ స్థలం వదలటానికి మాత్రం లేదు. బెంగుళూరిలో నేమో జాగ్రత్తపెట్టడానికి యజమాని వుండేవాడు. ఇపుడు ఒంటరిగా చూచుకోవాలి. దానికే భయపడ్డాడు.

రాముడు తన స్థానాన్ని అలంకరించిన క్రొత్తలోనే ఒక క్రొత్త ప్రమాదం ఎదుర్కోవాలని వచ్చింది. సాయంకాలం ఐదుకొట్టే క్షణంలోనే దగ్గుతూ లచ్చరాయడు వచ్చాడు. రాముడు చూశాడు. కాని ఆ రాత్రి అతని ప్రవర్తనవలన తానే మాటాడే సాహసానికి



పోలేదు. కొంతసేపు లచ్చరాయడు ఫలహారం తిని వెళ్ళాడు, సర్వరు 'ఛే ఆనే' (ఆరణాలు) అని బిల్లు సంఖ్యను కేకపెట్టాడు. లచ్చడు రాముని సీటుప్రక్కన వున్న గుడ్డిదీపంలో సిగరెట్టు కాల్చి, పీల్చి మళ్ళీ పొగ వదుల్తూ వెళ్ళాడుగాని ఏమనలేదు. బిల్లు చెల్లించ లేదు. రామునికి నవ్వు వచ్చింది. ఆ లెక్కను తన ఖర్చులో బాకీగా వ్రాసుకొని వూరకున్నాడు. నరసింహమయ్యరు హొటేలును పడగొట్టడానికి ఢిల్లీ దర్బారు హొటేలు తెరచినవాడు. ఈ నరసింహని హొటేలుకు టిఫిన్‌కు రావడం ఆశ్చర్యం కలిగించింది. రెండు మూడు రోజులు ఉదయం, సాయంత్రం లచ్చరాయడు వచ్చి 'ఛే ఆనే' చొప్పున తిని వూరకే వెళ్ళి పోతున్నాడు. ఆవిధంగా ఆ నెలలో ఎనిమిది రూపాయలదాకా పద్దు ఎక్కింది. నవ్వుకుంటూ హాస్యానికి అమ్మకు ఉత్తరం వ్రాశాడు. తన తండ్రికి తిండి పెడితే ఏం తప్పు లేదని వ్రాశాడు. కానీ అమ్మ జాగ్రత్త చెప్పి 'రసం వుండేదాకా పిండితే చాలు అనే గానుక కేమైన దయాదాక్షిణ్యాలుంటాయా?' అని వ్రాసింది. తరువాత కొన్నాళ్ళు మరొక పెద్ద ప్రమాదమే ఎదురైంది. లచ్చడు, ఒరటడు మరి వీధిలోని వా రెవ్వరో గుంపుగా కూర్చున్నారు. తెగతిని తరువాత 'సిసర్స్' అని సిగరెట్లు కూడ తెప్పించారు. ఒరటడుబిల్లు సవారూపాయ అని చెప్పినా వినిపించుకోక వెనుకవారిని చూపించాడు. ఆ మండగులు దురుసుగా చూస్తూ రాముణ్ని ఎక్కిరించి వెళ్ళారు. నాలుగైదు దినాలకు బిల్లు పది పదిహేను రూపాయ లైనాయి. రాముడు చాల మనస్సు నొచ్చుకొన్నాడు. తానేమో బాధపడి అమ్మకింత మిగిలిద్దామంటే ఈ లచ్చడు ఆమెనోట్లో మన్ను కొడుతున్నాడని తోచింది. తల్లి భోజనం ఈ తోడేలుకు పెట్టాలా అనిపించింది. అతనిమీద జుగుప్స పుట్టింది. నిష్ఠురంగా ప్రవర్తించాలనుకున్నాడు.

మరునాడు పరిస్థితికి మరొక పర్యవసానం కలిగింది. ఒరటడు, లచ్చడు ఫలహారానికి ప్రొద్దున లేచి వచ్చారు. తిండి, సిగరెట్లు సేవించి 'ఛే-ఆనే' బిల్లు చేశారు. బిల్లుకూతల పిల్లవాడు వాళ్ళ దగ్గరకు వచ్చి 'ఆరాణె' ఆరణాలు అన్నా వాళ్ళు వినిపించుకోకుండా గబగబా బయటికి వెళ్ళారు. రాముడు ఆ పనివారితో 'చూడు - వాళ్ళిద్దరిని పిలిచి డబ్బు అడుగు' అన్నాడు. మెల్లిగానే అన్నాడు. సరిగ్గా మాటలు రాలేదు. కాని కోపం తగ్గలేదు. మనిషి వారిని ఆపి పట్టుకొచ్చాడు. ఒరటడేమో 'ఏమండయ్యా! వినండీ! ఈ కాలం కొడుకుల నీతికూడ చూడండి - ఇతడేమో వాని తండ్రి - తండ్రికి కాఫీ ఇస్తే డబ్బు అడుగుతున్నాడు' అని అపహాస్యం మాటలే ఆడాడు. అక్కడున్న వారంతా (Cash Counter) కేష్ కౌంటర్ దగ్గర మూగినారు. వారికి ముందు వెనుకలేమి గోచరించలేదు. వాళ్ళతో వంద్యూయిషీ చెప్పి నచ్చజెప్పితే లాభం లేదని గుర్తుపట్టి రాముడు తన పనివార్లతో 'ఒరే! పిల్లల్లారా! వీళ్ళిద్దరికీ ఏమైనా తిండి తీర్థాలు ఇస్తే ఖబడ్దారు' అని గట్టిగా కట్టడిచేసి ఆజ్ఞ ఇచ్చాడు. నిర్దాక్షిణ్యంగా రాము డాడిన మాటలకు ఒరటడు మరింత రెచ్చిపోయ్యాడు. 'ఒరే. బాబూ నువ్వు పుట్టిందానికి సార్థకం' అని ఎన్నో శాపనార్థాలు పెట్టి వెళ్లిపొయ్యాడు. అక్కడ చేరిన తిండిపోతులు ఈ లచ్చడు నిజంగా వీనికి తండ్రి వుండవచ్చా లేదా అని సందేహంతో, హాస్యంతో గుసగుసలాడారు. రామునికేమో నలుగురిలో అవమానం అని

పించింది. ఆ రాత్రియంతా కన్నుమూసింది ఒట్టు! 'రేపేమి జరుగ నున్నదో' అనే భయ భీతులు మరింత కమ్ముకున్నాయి. వాళ్ల బ్రతుకులో ఎన్నో వేషాలు వేసి సంతరించినవారు ఇక మళ్లీ వచ్చి ఎంత అవమానిస్తారో అని బెంగ - ఎల్లాగయినా సరే సిద్ధంగా వున్నాడు. గడియారాన్నే చూస్తున్నాడు ఏడు, ఎనిమిది తొమ్మిది కొట్టినా వాళ్లు రాలేదు. నిన్నటి యుద్ధానికి వారు బెదురుకున్నారేమో! రాలేదు కాబోలు.

రాముడు ఒక దీర్ఘనిశ్వాసమే వదలివేశాడు. ఆ సాయంకాలం తల్లికి ఆ ఆరణాల బిల్లు కథను ఆసాంతం వ్రాసినాడు. 'అమ్మా! అటువంటివాడు నాకు తండ్రి అయ్యాడనే మాట వద్దాను. కాని కన్నతండ్రికి ఆ మాత్రం అధికారం లేదంటావా!' అని ముగించాడు.

ఇదే సంగతి—హోటలులో వుండే గూఢచారుల సాక్ష్యంతోబాటు బెంగళూరు యజమానులకు కూడ వెళ్లింది. వాళ్లు వచ్చారు. లెక్కలు చూచారు. తండ్రి బిల్లుమాత్రం రాముడు తన లెక్కలో వేసుకొని జీతంలో కోసుకున్నట్లు తెలిసింది. 'తండ్రివంటి మోసగాడు మాత్రం కాడని వారికి సంతృప్తి కల్గింది. కొడుకుకు మాత్రం ఆ వుద్యోగంపట్ల తీరని అసంతృప్తే కలిగింది. తీరికలేని దాస్యవృత్తి. తల్లికి తనకు ఎన్నాళ్ళో ఈ ఎడబాటు! ఇక్కడ నాగవేణి మాత్రం 'బాబూ! భగవంతుని దయతో, నీ పుణ్యాన నాకు కొంత స్వర్గం నీడలో వున్నట్లే తోస్తున్నది. నాకేమో ఇక్కడ మామగారి ఇంటిని కాపలా కాస్తూ ఋణం తీర్చిన సంతృప్తి కలుగుతున్నది. వారేమో కొడుకును ఏమాత్రం నమ్మరు. చనిపోయేరోజు నా చేతికి అంతా దారపోసి వెళ్లారు. ఆ తప్పును నేనైనా సర్దుకోవాలిగా' అని వ్రాస్తున్నది,

రామునికేమో బొంబాయి ప్రయాణం చేయ్యాలని చాల ఆదుర్దా పుట్టింది. దగ్గర వంద రూపాయలదాకా చేర్చి పెట్టుకున్నాడు. ఎక్కడైనా తిరిగితే మంచి వుద్యోగం రావచ్చు నని భ్రమపడ్డాడు. మంచి సంపాదన వస్తే వుంటాను, లేకుంటే వెనుకకు—కాని తల్లిని మాత్రం ఒప్పించి వెళ్ళాలి!' అని తన జీవితంలో ప్రతి నిముషాన్ని లెక్కించుకుని బాధపడుతున్నాడు.

డిశంబరు నెలలోగా మరింత డబ్బు చేరే అవకాశం లేదు. ఇట్టే వాయిదా వేస్తే బొంబాయికి తాను వెళ్ళనే వెళ్ళడు. అతి కష్టమైన సంగతేమంటే తన యజమానులతో చెప్పి విడువటం కావటం. తాను అతి త్వరగా వెడుతున్నానని తల్లిద్వారా నరసింహమయ్యగారికు వార్తల నంపాడు. జనార్దనయ్య ద్వారా వారేమో సరియైన వుత్తరం వ్రాయించారు. 'నీ కేమి కష్టం - అంత బాధ వుండేగా వెళ్లాల్సింది. నీ నమ్మకంమీద మైసూరు హోటేలు తెరచాము మరొక మేనేజరు త్వరలో దొరికేదాకా వుండాలిగా? కేశవుణ్ని కూడ నీమీద నమ్మకంతో పంపేశాను, నీకు జీతం మూడింతలు చేస్తాములే అనికూడ ఎన్నో మంచిమాటలు వ్రాశాడు. రాముడేమో తన తల్లితో హాయిగా తీరికగా వుండటానికి తగిన జీత మిచ్చే కొలువు వెదుకుతానని, హోటేలుపట్ల, యజమానిపట్ల ఎల్లాంటి అసంతృప్తి లేదని స్పష్టం చేశాడు.



క్రిస్మస్ యాత్రికులలో తా నొక్కడు - రైళ్ళు మోటార్లు ఎక్కడ చూచినా యాత్రికులే—మద్రాసుకు వెంటనే జాబు వ్రాసి మాధవుని స్నేహితులకు జాబులు వ్రాయించాడు. తన స్నేహితునికి వ్రాసుకున్నాడు. బొంబాయిలో దిగగానే అరణ్యంలాగేమీ కన్పించలేదు. ఆ నగరం వీధులు, ఇళ్లు, వాకిళ్ళు అన్నీ మద్రాసుకంటె ముందుపడినట్లే తోచింది. తన వూళ్లో వుండే విశాలమైన సముద్రతీరంలోని ఇసుకరేణువులాగు తానొక ఇసుక రేణువుగా అవుపడ్డాడు. ఆ నాగరిక జీవనంలో, తానేమో అల్పుడే. అయితే అంతటితో నిరాశ ఎందుకు చెందాలి? అల్లాంటి ఎందరికో కబళాల నిస్తున్న బొంబాయి తనకు అన్నం దొరికే మార్గం చూపజాలదా! తన వూరివారే వున్నారుగా? చూద్దాం? అని ఉత్సాహంగా వెళ్లాడు.

రామునికొరకు బొంబాయి స్టేషనులో మారుతిరాయుడు ఎదురు చూశాడు. ఒక్కరికి మరొక్కరు గుర్తులేము. ఒక్కొక్కరు ఒకే శాఖ బ్రాహ్మలుగామా—ఒక వూరివారు కూడ కాదు. మాధవుడు ఒక రంగుల కంపెనీలో పని చేస్తున్నాడు. అదే కంపెనీ బొంబాయి శాఖలో మారుతిరాయ డున్నాడు. అతడు మాత్రం కన్నడజిల్లా వాడు అంతే. మాధవుని స్నేహం మూలాన మాధవుని ఆత్మీయుడైన రామునికికూడ మర్యాద నిచ్చాడు.

మారుతి అతన్ని తన బసకు తోడితెచ్చాడు. ఇద్దరూ మాతుంగదాకా నడచే వెళ్లారు. ఒక మనిషి రాముని పెట్టె, పరుపులు వెంటతెచ్చాడు. అక్కడ ఒక ఎత్తైన భవంతినెక్కి చివరకు చిన్న గదిలోకి వెళ్ళారు. అదే వారికి విశాలహర్మ్యం. వాకిలి తెరువగా చూస్తే రాము ఇంటిలో చావడిలోని స్తంభాలస్థల మంతకాదు. అందులోనే స్నానానికి, వంటకు, చదువుకు అన్నింటికి అనుకూలం చేసుకున్నారు. ఇప్పుడు మావాళ్లు ఊరు వెళ్ళారులే. ఒకడు మాత్రం వున్నాడు. మరొకపిల్లవాడు, తల్లి తాతగారింటికి వెళ్ళారు. ఆమెకు నెలలయినవి. మేము క్యారియరు భోజనం తెప్పించుకు తింటున్నాము. ఉన్నంతలో భోంచేద్దాం లెవ్వండి అని నిష్కపటంగా చెప్పాడు.

తరువాత కొన్నాళ్లకు తన బిడారం గుర్తులను తెలుసుకున్నాడు. మారుతి ఇంటిఖర్చులు భరిస్తే అక్కడ హాయిగా కొన్నాళ్లుండవచ్చునని మాత్రం బోధపడింది. చిన్నదైనా పరిశుభ్రంగా గదిలో మారుతి వున్నట్లే తానుకూడ వుండాలని తీర్మానించాడు. మొదటి రోజు రామునికొరకు సెలవుతీసుకున్నాడట. తరువాత తెల్లవారుజామున వెడితే సాయంత్రం రావను. వాని పెద్దకొడుకు మాధవుని కొమారుడు ఆనందుని అంతటివాడు బడికి వెడతాడు. మారుతి ఆఫీసు కెడితే రాముడు ఆ ఇంటి కావలిగాస్తాడు.

వచ్చిననాడు భోజనా లయ్యాక మారుతిరాయడు తన సంగతి చెప్పేశాడు. 'నాకు ఇక్కడ ఎవరు పరిచయం సరిగా లేరు. మా బ్రతుకంటే ఈ ఇరుకు గదిలాగా ఇక్కట్ల బ్రతు కనుకో. ఏదో ఆదివారం ఒక రిద్దరు మిత్రులతో షికారు, బాతాఖానీ. మిగిలిన రోజులంతా ఆ విశాలజనం అనే మూక తరంగాల సముద్రంలో వున్నామనే ఆనందం తప్ప ఇంకే

సుఖమూ లేదు. మీ రొళ పనిచేస్తే మంచిది. ఈ పై అంతస్తులో మన వూరి బ్రహ్మచారులు కొందరున్నారు. వారేమైనా ఉద్యోగం తెచ్చి పెస్తారేమో చూడండి' అన్నాడు.

రామునికి మాటలు లేవు. అడిగే ప్రయత్నంలో వున్నాడు. అంతా క్రొత్త. ఏమీ తెలియదు. తన కార్యసాధనకే వచ్చాడుగా! అదృష్టాన్ని పరీక్షించుకోవాలి - అంతే!

రామున్ని ఆ రాత్రి మేడపైకి FRIENDS' ROOM లోకి మారుతి తీసికెళ్లి చూపాడు. అక్కడ సామ్యవాదం చిహ్నాలున్నాయి. సంసారులు కానివారెల్లా వుంటారో వెంటనే తీసి చూపింది ఆ గది. ఆ గది అంటే కేవలం నాల్గుగోడలే! వున్నవారు మాత్రం మిత్రులు. వారే లేకుంటే అది మృగాలయం మాత్రం - వారు వెళ్ళిన సమయాన ఆ గదిలో ముగ్గురు పక్కచుట్టలపై పండుకొని వున్నారు. ఇద్దరేమో రాజకీయాలను చర్చిస్తున్నారు. ఒకడు పాటలు పాడేస్తున్నాడు. మరొకడు వసారాలోకి తొంగిచూస్తూ వీధిలోకి వచ్చిపొయ్యే, మోటారులను, కార్లను లెక్కిస్తున్నాడు. మారుతిని చూచి ఒకడు ఎవ్వడో 'హెలో!' అన్నాడు. మారుతి 'వీరు కూడ మన జిల్లానుండి వచ్చిన మిత్రులే. మనలాగు బొంబాయి జీవితానికి భాగస్వాములుగా వచ్చారు. వారి బాబాయ్ నాకు మిత్రుడు.' అని మరిన్ని మాటలతో అక్కడ శంకరరాయణ్ని పరిచయ చేశారు. అతదే ఆ గదికి పెద్ద కాపోలు నని రాముణ్ని అతనికి మారుతి అప్పగించాడు.

శంకరుడు లేచి సిగరేటు వెలిగించి మారుతికి సిగరెట్లు ఇచ్చి కూర్చొమ్మని ఆదేశించాడు. తరువాత మారుతి 'ఏమయ్యా మీ పద్మనాభానికి ఉద్యోగం చిక్కిందా?' అని అడిగాడు.

'వారండీ! నలభైని మించి జీతం ఇయ్యరట' అన్నాడు శంకరం.

'వాడు గ్రాడ్యుయేట్ కాదుటండీ!'

'వాడి బాబుకు కూడ అంతే, బొంబాయికూడ మద్రాసులాగే, పిసినిగొట్లు చేసుకున్నారులే' అన్నాడు.

మారుతి, శంకరునితో 'చూడప్పా - వీరు కూడ బహుకుటుంబీకులు. ఎంతో ఆశతో వచ్చారు. నేనేమీ ఆశ చూపలేదు. కాని మనం చేతనైనంతా ప్రయత్నం చెయ్యాలిగా' అన్నాడు.

రాముడు వెళ్తుంటే 'ఏమండీ! మీ పేరు?' అన్నాడు.

'రామ!'

'What Ram!'



'రామరావు ఐతాశ, రామఐతాశ అనవచ్చు -'

'సరే రామరావు! రోజూ రండి - ఏమైనా తెలుసుకుందురు గానీ'. తరువాత రామరావుకు తీరిక దొరికినప్పుడల్లా ఆ మిత్రుల గదికి హాజరయ్యాడు. తరువాత మారుతిరాయని భార్య వచ్చాక వాళ్ళతోనే మిత్రులలోనే వుండాలి అని నిశ్చయించుకున్నాడు.

వాళ్లందరూ హాయిగా వినోదంగా వుండాల్సిన సుఖజీవులు. బొంబాయిలో ఉద్యోగ ప్రయత్నాలకు వచ్చారు. అందరూ యువకులే. ఒక్కొక్కరు మూడునెలలు, రెండునెలలు హంగామీ నౌకరీ గలవారు. కొందరేమో పదిహేనురోజుల కొక వుద్యోగం మార్చే అలవాటు గలవారు. కొందరు బాగా తిరిగిందే వుద్యోగం అని తృప్తిచెందే వారు. వారందరి ముఖ్యోద్దేశ మొకటే ఈ పెట్టుబడీదారీ విధానం రూపుమాసితే గాని భారతదేశానికి మంచి రోజులు లేవు' అని నమ్మేవారు.

రాత్రి బిర్లాలను గానీ, బజాజులను, వాల్‌చందులను, హారూన్లను, అందరినీ పూర్తిగా తెగతిడ్తారు. మరునాడు తెల్లవారి అర్జీ చేతబట్టుకొని బజాజులవెంట, కరీమ్‌భాయి మిట్సులవెంట ఉద్యోగాన్వేషణం చేస్తారు. అర్మిలేక నేమీ? ఏవో ఒకచోట వెళ్ళడం గతి. నాల్గు దినముల ఖాళీ అయినా ఉద్యోగం చేరేస్తారు. ఒక్కొక్కరు చూడటానికి అరటికెట్టుకంటె కూడ చిన్నగా వుంటారు. అన్నం తింటారో లేవో, ఎంత తింటారో! కొంత అధికమాత్రలో టీ. కాఫీలు తాగేస్తారు. తామే కనీసం కాఫీకైనా మాస్కోపద్ధతిలో పాత్రలలో తాగుతారు. వారి విలాసవస్తువు సిగరెట్లు. బొంబాయి వాతావరణానికి అది అత్యవసరమని సిద్ధాంతీకరించినవారు వారేనట.

వారి దుస్తులుకూడ వింతైనవే. ఒకరిని మించి మరొక్కరు ప్రత్యేక దుస్తులు ధరిస్తారు. సాయంకాలానికి అందరూ ఖద్దరు ధరిస్తారు, పఠాను పైజామ- పెద్ద కుడతా. ఆఫీసు వేళకేమో సూటు, బూటు, హ్యాటు. అందరూ నున్నగా బ్రష్ చేసుకుని శుభ్రంగా వుంటారు. రాత్రి జైలుడ్రెస్‌లాగు డ్రాయర్‌లో. వాళ్ళకు సుఖమంతా అన్నం కంటె మాటలలోనే. ప్రపంచంలో పెట్టుబడిదారీ నశించిన తరువాత సువర్ణయుగం పుడుతుందనే ఆశతో జీవిస్తారు. వారికి కార్మిక కర్షక రాజ్యపు పగటి కలలే వస్తుంటాయి. బొంబాయికి వెళ్ళిన యువకుల్లో ముఖ్యంగా ఏ ఒక్క నిరుద్యోగి కూడ సామ్యవాదిగా ఎర్రటోపీ ధరించడానికి మూడు వారాలు చాలు.

రాముడు జైలులోనే ఎరుపెక్కిన వాడు గదా!

రెండు వారాలలోగా శంకరుడు, రాముడు ఇద్దరూ అనేకంగా ఆఫీసుకు తిరిగి వచ్చారు. ఎక్కడికెళ్ళినా 'సారీ ప్లీజు, నో వేకన్సీ' అని గొడవపెడ్తారు. 'రామ ఈ ట్రాము, బస్సుల

ఖర్చులు మిగిలితే మూడునెలలకు సరిపోతుంది' అన్నాడు శంకరుడు. ఇరవై రూపాయల నోటికి ఎనిమిది రూపాయల ఖర్చుల అయితే ఎల్లాగు' అన్నాడు. శంకరుడు పాతవాడే. ఏడేళ్ళనుండి బొంబాయిలో వాసం చేస్తున్నాడు. సగం కాలం అంతా ఆఫీసుల బయట నున్నవాడే. సగం కొలువుకాలం ధనం గడిస్తే మిగిలిన రోజులకు వాడుకుంటాడు. ఆ మిత్రుల గదిలో శంకరునికే మంచి అనుభవం.

రాముణ్ని శంకరుడు తనకు 'నో వేకన్సీ బోర్డు' చూపిన ఆఫీసులన్నీ తిప్పాడు. తాను దెబ్బలాడి వుద్యోగాలు వదిలేసిన ఉద్యోగాల కచేరీలకు కూడ వెళ్ళాడు. రాముడు కూడ బొంబాయి దుస్తులతోనే వెళ్ళాడు. ఎక్కడికి వెళ్ళినా అవలక్షణం సమాధానాలే గాని లాభం లేదు.

శంకరునికేమో 'సినిమా' రంగం మంచిదని తోచింది. సినిమాకు కథవ్రాస్తే బాగు అని అనుకున్నాడు. తన కథలను నకలుచేసి, దొంగిలించి సినిమా కథకుడు తయారుచేస్తున్నాడని వానికి కడుపుమంట. అన్ని సినిమా కంపెనీలనుండి వానికి పిలుపు వచ్చిందట. కానీ ఒకనికి కూడ తనను సెలెక్టు చేసుకునే తెలివితేటలు లేవు. సినిమా డైరెక్టరును, తారలను అందరినీ ముక్తకంఠంలో దుయ్యబడతాడు. ఆ తారలు అవివాహితలు కావడంమూలాన ఈ యువకులకు అదొక సమస్యగా పరిణమించింది.

రామునికి ఈ మిత్రుల గదిలోని దినచర్యలే ప్రహసనాలవలె తోచేవి. అక్కడ వుండేకొలది నిరుద్యోగమే, అనేక తీర్మానములు, ఆడిపోసుకొనుట, ఆక్షేపణలు, నిందలు—అని రామునికి తోచకపోలేదు.

కొత్తలో బొంబాయికి సామాన్య రీతిలో దిగిన రాముడు, సూటుబూటు ఇత్యాదులకు బాగా ఖర్చు చేసుకున్నాడు. ఫ్రెండ్సు రూమువారు ఆ సూటును చూచి 'ఓహో, ఓహో, భళీ' అని కేకలు పెట్టారు. 'అవునయ్యా! ఈ డ్రెస్‌లో పోసులో పక్కా సినిమా స్టార్‌గా తయారయ్యావంటే నమ్ము' అని ఎగతాళికూడ చేశారు. 'ఈ పర్సనాలిటీకి సినిమా తార మోహించి నిన్ను హీరోగా చేసుకుంటుందేమో' అనికూడ అన్నారు. 'సువర్ణాదేవి తార తప్పక నిన్ను వరిస్తుంది. కానీ నువ్వు పాడగలవా? నటించగలవా?' అని అడిగారు.

'అంటే పాటలయ్యా! సంగీతం' అని అందరూ వివరించారు.

రామునికి తనకు కొంత సంగీతం తెలిసినా ప్రకటించుకోవలసిన తరుణం. చోటు కాదని పూరకున్నాడు.

తరువాత రోజు కొకసారి ఐన ఆ పాటలపిచ్చి గల గంగాధరు డనే స్నేహితుడు మాత్రం, 'అంధేరీకి వెళ్ళు - మరొక్కరోజు మరొక స్టూడియో వెళ్ళు' అని చాల ప్రేరే



పించి, ప్రోత్సహించేవాడు. రాము దొచ్చాక ఒక్కొక్కరు తుంటబీడీలను, పీకలను తాగుతూ (కాలుస్తూ) సినిమాపత్రికలు తిరగేస్తూ 'ఒరే చూడరా, ఆ చంద్రకాంతకు నలుగురు సంతాన మటా! ఎంత చెక్కముక్కలాగున్నది' అని చర్చకొనసాగించి. ఆమె ఎంత గడుద్దాయిరా నా ఫోటో వుంచుకున్నది కానీ, మర్యాదకైనా తన ఫోటో కూడ పంపలేదు అని ఎవడో చాల పశ్చాత్తాప పడ్డాడు. అందరూ స్నేహితునిపట్ల సానుభూతిలో పేదమొహాలు వేసుకున్నారు.

'ఒరే రాము చూడరా! శంకర్ చూడరా! నీ సినిమాకథను తీసికొని నిన్ను అరుసార్లు తిప్పాడుగా వాడు దివాలా తీశాడటరా! గుడ్‌న్యూస్ కాదుట్రా' అని ఒకరు ఎగతాళి చేశారు.

అందరూ ఆ సినిమా కంపెనీలన్నీ దివాలా తియ్యాలని, కొందరు క్యాపిటలిస్టులైనా దుర్గతిపాలు అవాలని దీవించి, శపించి ఆనందించారు.

ఎక్కువ వేడిగా చర్చలు జరిగితే సిగరెట్ల భోగమాత్రం తక్కువగానే లేస్తుంది. గంగాధరుడు మళ్ళీ 'ప్రేమకీ బాంసురీ బజావో' అని పాడేస్తాడు.

శంకర, గంగాధరుల సంవాదం రక్తికెక్కింది. గంగాధరునికి కంఠం బాగుంది. రూపం లేదు. ఆ సంగతి వానికి తెలిసి చస్తేగా! ఒక సినిమా డైరెక్టరు చెప్పాడటా. అప్పుడు శంకరుడు రాముణ్నిగూర్చి చెబుతూ ఈ రాముని మొండేనికి గంగాధరుని కంఠం తగిలిస్తే ఎలాగుంటుంది చెప్పండి అని అన్నాడు. అప్పుడు మన రాముకు నెలకు మూడు వేల ఆదాయం వచ్చేది. అందరూ హాయిగా మజా చేసేవారం లే అని తీర్మానించారు.

రామునికి ఈ మాటలు సరిగా అర్థం కాలేదు.

దాన్ని మళ్ళీ స్నేహితులే నీ రూపం—వాని కంఠం కలిపితే మంచి తారవయ్యే వారు రా అని వివరించారు. మన గంగాధరుడు అంటే ఏమంటావు? సాధారణ వ్యక్తి గాడు. నకిలించే. బొబ్బలుపెట్టే, గాండ్రుమనే. ఓండ్రించే కంఠమని అందరూ హాస్యం చేశారు.

అందరూ మళ్ళీ గొల్లుమని నవ్వారు. రాముడుకూడ కొంత నవ్వుకున్నాడు. 'నేనైతే పాడగలను కాని, నటింపజాలనయ్యా!' అన్నాడు రాముడు.

శంకరునికి ఆశ్చర్యమేసింది. 'అయితే రామునికి! సంగీతం వచ్చు అన్న మాట కర్ణాటకమా! హిందూస్తానీయా లేక రైల్వేసంగీతమా?' అని ప్రశ్నించాడు.

'నాది ఒకవిధమయిన సంగీతంలెద్దురూ? నోటికంటే ఫిడేలువాద్యం బాగా వస్తుంది. కాని ఈ సినిమాపాటలు 'తుమనే ముఝుకో ప్రేమ సిఖాయా' మాత్రం వాయించలేను.' అన్నాడు.

రామునికి నిజంగా సినిమా సంగీతం బొత్తిగా తెలియదు వాని విశాల మనఃప్రవృత్తి పరిమైన సంగీతాభ్యాసం కూడ తృప్తి నివ్వలేదు. ఈ ప్రేమగానం ఎందు కిస్తుంది? ఏమిస్తుంది?

ఆదినం సాయంకాలం మాటలు చేతలుగా మారినవి. రాముణ్ని తప్పక వాద్యం పైన పాడిస్తారు. ఎవరూ వదిలేట్లు లేను. రామునికి కూడ పాటలు వస్తే 'కమ్యూనిష్టస్కూల్ అఫ్ మ్యూజిక్' అని బోర్డు తగిలిద్దామని శంకర్ అభిలాష. రాత్రి పదిగంటల సమయాన మాతుంగ గాలించి ఒక ఫిడేలును పట్టుకొచ్చారు. గంగాధరుడు అప్పటికే 'చూడండి, ఫిడేలు బాగా వాయిస్తే దానికంటే వీణ, తబలా, వేణు అన్నీ వెనుకాతలే, తీసికట్టే' అని ఢంకా బజాయించి తీర్మానించాడు. ఆ మేశలో గంగాధరుడే గొప్ప 'ఆర్ట్ క్రిటిక్' సంగీత విమర్శకుడు. తానే ఆ గదిఅనే ప్యారిస్ పట్నంలోని సంగీత కళానిధిఅని గర్వపడేవాడు గంగాధరుడు. వానికి సగం సగం తీర్మానాలంటే గిట్టవు, అన్నీ గట్టి ఖండితమైన, కచ్చితమైన తీర్మానాలు, విశ్వాసాలున్నూ.

ఫిడేలు రాముని చేతులలో పడింది, రామునికి వేరే శరణులేదు. రాముడు నవ్వుమొగంతో అందుకున్నాడు. గంగాధరుని మాటలలో సారాంశం వున్నా లేకున్నా మరలు-వట్టి శ్రమ గొల్పించేవిగా మాత్రం, మభ్యపెట్టేవిగా మాత్రం వున్నవి.

అల్లాగే నవ్వుతూ రాముడు ఫిడేలును ఎత్తి, కమానును తీగెలపై లాగాడు. చేతులు మళ్ళీ రాచుకుని, రుద్దుకుని సర్దుకొని కమానుకు రాళం రుద్ది - లాగాడు.

ఆ ఫిడేలువాద్యమా? సితారానా, జలతరంగమా వాని వాద్యం అందరిలో అన్ని వాద్యాలు మోగించాయి. రాముని చేష్టలను అందరూ వింతగా చూశారు. తరువాత చక్కని తేనెచినుకులే కురిపించాడు. రాళ్ళగుండ్లల్లో గలగల ప్రవహించే సెలయేరులాగా, జలపాతంలాగా, కాశీవద్ద వుండే గంగాప్రవాహంలాగా అందాన్ని ఒలకబోస్తూ వాని సంగీతం వెలువడింది.

ప్రవహించి, పొంగి. నవ్వి, సముద్రంలో శాంతంగా చేరినట్లే ఆగిపోయింది. నవ్వులలో దుఃఖమే దాగుకున్నట్లు తోచింది. రాముడు ఎవరినీ చూడలేదు. తన ఓరచూపులతో ఫిడేలును మాత్రమే, కమానును మాత్రమే గమనించాడు.

ఒక్కపెట్టున వానిలో ఏమి ఉక్రోశం కల్గిందో ఏమో కమాను తాండవమే ఆడింది. రాగాలు మంటల నాలుకలలాగు ఎనలేని మేళాలవలె, కొంపలను కాల్చే మంటలలాగు చెవులను, గుండెలను దద్దరిల్లేట్లు చేశాయి. ఒక పెద్ద నిట్టూర్పులాగు ఎంతో పొడుగాటి నాదం ఆ సంగీతానికి ముగింపు నిచ్చింది.



రాముడు తన వాద్యాన్ని ఆపి లేచాడు. తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. మళ్ళీ వస్తాడేమో అని అందరూ మౌనంగానే కూర్చున్నారు. కొందరు వెదకడానికి వెళ్లారు. తరువాత మారుతి గదిలో వాడు ఎక్కడో పడి నిద్రపోయ్యాడని తెలిసింది.

ఆ దినం మాట్లాడినవారు లేరు. తరువాత మెల్లగా శంకరం మాత్రం 'అల్లాంటి సంగీతం మాత్రం ఎక్కడా ఎప్పుడూ వినియుండలేదు' అని చెప్పాడు.

గంగాధరుడు ఆ దినం తరువాత మాత్రం రాముని చూడగానే తన 'తుమనే మురుకో'ను కట్టిపెట్టేవాడు. గంగాధరుణ్ని చూచి మిత్రులు మాత్రం 'తుమనే మురుకో ఖామదిఖాయా' అని సంగీతం వానివద్ద శూన్యమని సూచించేవారు.

తరువాత మిత్రబృందం రామునితో 'మళ్లీ ఎప్పుడు వినాలో నీలాంటి సంగీతం' అని అడిగితే 'ఒరే నాకు మూడ్ కుదరాలిరా' అనేవాడు. పిలిస్తే, అరిస్తే అల్లాంటి పాటలు వస్తాయా 'రావు' అని అందరికీ తెలుసు. అప్పటినుండి రాముడంటే గౌరవం ఎక్కువైంది.

కానీ గౌరవం వస్తే నిరుద్యోగసమస్య తీరిందా? రెండు నెలలయ్యాయి. సగం డబ్బు కరిగిపోయింది. శంకరుడేమో 'సంగీతం ట్యూషనులు చెబితే' అన్నాడు. 'ఒరే' ఆ సినిమాపాటలకాలంలో నా సంగీతం ఎవరడుగుతారయ్యా' అన్నాడు రాముడు. నవ్వాడు:

మూడు నెలలుకూడ గడిచాయి. రాముని జేబులు ఖాళీ అవడానికి ఇంకెంతకాలమూ అక్కర్లేదు. మళ్లీ అలాగే నెలలు గడిస్తే తాను ఉపవాసమే పడుకోవలసిన రోజుకూడ వస్తుందని తెలుసుకున్నాడు. ఒకనాడు అదే బెంగతో అక్కడక్కడ తిరిగాడు. నడచి నడచి వేసరికతో చౌపాటీతీరం వెళ్ళాడు. అక్కడి ఇసుకకూడ మద్రాసులాగు లేదు: సముద్రంనుండి కుళ్లు ఎత్తుకొనివచ్చేదానికి నవ్వుమాట అసలే లేదు. అదికూడ నగరాన్ని అనుకుం దనేమో: దానికి అటుపోట్లు అవి ఇవీ కూడ లేవు. వర్షం వస్తే చెరువులో బురద ఏలాగు బయటికి వచ్చి మరింత మురికి ఔతుందో అలాగే ఆ సముద్రం కాన వచ్చింది; ఆ సముద్రతీరం విహారానికి కూర్చున్న జనంలో మాత్రం వినోదం, విలాసం, ఉల్లాసా లున్నవి. అందరిలో నడతకంటె నాట్యమే ఎక్కువగా వుందనవచ్చును. వస్తారు, పోతారు, తింటారు, త్రేన్పు త్రేవుమని తారు ఎన్నో తరహాల పలుతెగలజాతులు, భాషలు, ఘోషాలు, నగలు, వేషాలు గల జనం ఆ సంతలో చేరినా రాముడుమాత్రం శూన్యంలోకే చూస్తున్నాడు. రామునిలాగే బలహీనంగా ఆ సముద్రతరంగాలు కూడ కొద్దిగానే లేస్తున్నవి. సరే: సంగీతం ట్యూషన్‌లు చెప్పి ధనం ఆర్జించాలి. అంతే - తల్లికి నెలనుండి ఒక వుత్తరంకూడ వ్రాయలేదు. ఏమని వ్రాయాలి? ఎల్లాంటి ఆశలు లేపాలి? ఎల్లాగ నమ్మకం కుదిరించాలి? తన మిత్రుల గదివారైతే రెండుమూడేండ్లయినా బొంబాయిలోనే దొర్లుకుని, కొట్టుకుని సరిగా తిండికి లేకుండా కూడ జరుపుకుంటున్నారు. 'ఏమయ్యా?

ఎందుకు ఆ బెంగ! నెల, రెండు నెలలకే వుద్యోగం దొరకాలంటే మజాకా ననుకుంటున్నావా? మేమెంతైనా గడపాము. ఒక సంవత్సరం కష్టపడితే నీకు కొంత ఆశ కల్గుతుందిలే!' అన్నారు. వాడు అలాగు కాళ్లు లాగుకుంటూ కచేరీలవెంట తిరిగే ఓపిక లేనివాడు అల్లాంటి ఆలస్య మవుతుందని వూహించి వుండలేదు. అన్నీ వాడు కళ్ల యెదుట చూస్తున్నాడుగా! మళ్ళీ ఆ వడుగేరి- తనవూరు వెళ్లితేనే బాగు— వెళ్ళాలంటే రైలు, మోటారు ఖర్చు ఉండాలిగా అని వానికి అతి చింత తగిలింది. ఎంతో ఆలోచించి, విసిగి, తన విడిదికి వెళ్ళాలని నిశ్చయించాడు. దారిలో ఒక నోటీసు (ప్రకటన) అతికించివున్నది. దానివల్ల వచ్చేవారం ఒక చిత్రప్రదర్శన జరుగనున్నదని తెలిసింది. మైసూరులోని చిత్రప్రదర్శన ప్రభావం వానిపై ఇంకా మాసిపోలేదు. వానికి చిత్రాలపై వ్యామోహం తరగలేదు. అందుకే దాన్ని చూశాకనే వూరికి వెళ్ళాలని నిశ్చయించాడు. ఒకవారం వోపిక పట్టాలి. ఆ దినం రానే వచ్చింది. రాముడు కూడ ఆ చిత్రాలయం వెళ్ళాడు. 'టౌన్ హాలు'లో ఎక్కడెక్కడి కళాకారుల చిత్రాలో అతికించారు. మధ్యాహ్నం దూరిన రాముడు సాయంకాలం ప్రొద్దు మునిగినాక బయటికి వచ్చాడు. దగ్గరడబ్బు తక్కువవున్నా మూడు రోజులు వరుసగా ఆ ప్రదర్శనశాలకు వెళ్ళాడు. తానెందుకు తన చిన్ననాటి చిత్రాలమోజు వదులుకున్నాడు? అనే భ్రమలో పడ్డాడు. సరే ఇకమీదనైనా చిత్రాలు గీచే అలవాటు పెట్టుకోవాలి. 'ఎక్కడైనా గురువుదగ్గర అభ్యసించవనా? రెండేళ్లు చాలవా?' అని ఎన్నో అనుకుంటూ తిరిగాడు, డబ్బుండాలిగా! ఓపిక, సహనం. వుండాలి.

మూడునాళ్లు ఆ పిచ్చితోనే 'మాతుంగ'లో అన్నిండ్లూ తిరిగాడు. ఇదివరలో కచ్చేరీల గస్తీ చేశాడు. ఇప్పుడు ఇళ్లగస్తీ. ఉద్యోగాలు వెదకి విసుగుకున్నాడు. బాగున్న ఇండ్లలో దూరిదూరి 'ఏమండీ సంగీతం మేష్టారు కావాలండీ?' అని అడుగుతూ తిరిగాడు. అల్లాంటి పిచ్చిపని ఇదివరలో ఎవడైనా సంగీతం మేష్టారు చేశాడో లేదో తెలియదు; ఒక వారం ఆ ప్రయత్నం కాస్తోకూస్తో ఫలించిందనే చెప్పాలి. ఒక ఇంటివారు మాత్రం 'మీ పాట విని చెబుదాం' ఆదివారం రాగలరా?' అని చెప్పారు. తాను తన మిత్రులను ఎల్లాగైనా ఒక ఫిడేలు ఎరువుతెచ్చి పెట్టమన్నాడు. ఆదివారం త్వరగా ఫలహారం లేకుండా, ఫిడేలు మోసుకొని ఆ అడిగిన వారింటికి చేరాడు. అక్కడ వారుకూడ ఫలాహారం చెయ్యలేదేమో! పుణ్యాత్ములు రాముణ్ని కూడా 'చాయ్' (తేనీరు) త్రాగమని ఆహ్వానించారు. సంగీతం పరీక్ష కావాలి, వాళ్లు ధార్వాడు ఉడుపిరాయలట— ఉడుపిరాయలు ఇన్సూరెన్సు కంపెనీలో పనిచేస్తారట. మంచి సంపాదన వుంది. ఇంటినిండా పిల్లలున్నారు. సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు. చిన్నపిల్ల లిద్దరికి సంగీతం చెప్పించాలట. పిల్లలందరూ సినిమాపాటలు గునుగుతుంటే వారికి సంగీతంలో అభిరుచి వుందని అంచనా వేశారట. కానీ తమకేమో ఎల్లాంటి సంగీతం మంచిదో వివేచించే శక్తిలేదు. రాముడు ఫిడేలు బయటికి తీసి పాతపాట వాయించాడు. మొదట్లో సుబ్రాయగురువుగారు నాగవేణికి చెప్పించినపాట. తరువాత రెండు క్రొత్త పక్కీ పాటలు వాయించాడు. ఇంట్లో పెద్దల



కేమి అసంతృప్తి గలుగలేదు. బాలికలు శాంత, సీతలుగూడ గురువు కావాలన్నారు. వారానికి అరుపాఠాలు నేర్పాలి, నెలకు పండ్రెండు రూపాయలు వేతనం అని ఏర్పాటు చేశారు. తరువాత ఒక మైలుదూరంలో మరొక ఇంటికి వెళ్ళాడు. ఇంటి ముందు కారును చూచి మంచి ఇల్లని నిశ్చయించి ప్రవేశించాడు. ఆ క్రింది భాగంలో రావ్‌బహదూరు శివానంద రావుగారున్నారు. వారింటివద్ద రాముడు ఆగాడు. వెయిటింగ్ (డ్రాయింగ్) రూములో స్థానం దొరికింది. ఆ ఇంట్లో తప్పకుండా తగినంత జీతం దొరకవచ్చు నని రాముని అంచనా. శివానందరాయలు, పదహారేళ్లబిడ్డను వెంటతెచ్చి కూర్చున్నారు. చటుక్కున ఆ అమ్మాయి రాముణ్ని చూచి- తండ్రితో 'అప్పా! (నాన్నా!) అది మనదే. శంకరరావుగారు మొన్న ఎరువు తీసుకున్నారే అదే ఇది' అనింది. రామునికి ఫిడేలు గతిలేని మేష్టారనిపించుకున్నందుకు సిగ్గు కల్గింది. తన ఫిడేలు అమ్మదగ్గరనే వదిలిపెట్టాడుగా! దాన్ని ఏ యుగంలో పట్టాడో! అని తోచింది.

సరే. శివానందగారు మరేమీ అనకుండా శంకరరాయని మిత్రుడని (తృప్తితో) 'సరే! వినిపించండి' అన్నారు. రామునికి అన్నీ రాగాలు బాగా వచ్చు. ఎంతో దృఢవిశ్వాసంతో వాయించాడు. తెల్లవారే కాబట్టి కాస్త తృప్తితోనే వున్నాడు. ఆ ఇంటి పరిసరాల సొగసువల్లకూడ చక్కని ప్రోత్సాహంగా వాయించాడు. శివానందరాయగారు 'మీ కోరిక కూడ చెప్పండి. మా కూతురు ఇంగ్లీషు చదువుతుంది. విరామంలో సంగీత శిక్షణ కొంత జరిగింది. వారానికి రెండు పాఠాలు చాలు. ఇదివరలో చెప్పిన పాఠాలు అక్కర్లేదు. కొత్తవి నేర్పాలి. నెలకు ఇదివరలో పదేసిచొప్పున ఇచ్చాం. మీ ఇష్టం' అని ఆప్యాయతతో నివరించారు. వెనుకటి మాష్టారు సక్రమంగా రాలేదని అతన్ని పెట్టమన్నారట; అని చెబితే రాముడు దానికికూడ అంగీకరించాడు.

స్వంత ఫిడే లుంచుకోవాలని వున్న డబ్బు ఖర్చయినా పరవాలేదు, కొన్నాళ్లు కష్టపడదామని నిశ్చయించుకుని స్వంత ఫిడేలు కొన్నాడు. సంగీతం ట్యూషన్ల వారాలు చేసుకుని తిరిగి తిప్పలేమో పడ్డాడు. మనసార తాను చిత్రకారుడు కావాలనే చింత తప్ప ఇంకేమీలేదు వానికి. ఉద్యోగం వెదుకకున్నా పరవాలేదు. చిత్రకళనే పట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు. అప్పుడేమో ఏప్రెల్ మేలు — తరువాత డిశెంబరులోగా తగిన వుద్యోగం దొరకకుంటే ఇంటికే వెళ్ళాలనికూడ నిశ్చయించాడు. తల్లిని సంప్రతిస్తే ఆమె ఇలా వ్రాసింది. "ఒరే నీకు చిత్రకళాభ్యాసం అవసరం లేదని నే నెన్నడూ అనను. నీకు చిన్ననాట గీచే పిచ్చి ఇన్నాళ్లెక్కడ దాగుకుందో అని మాత్రం ఆశ్చర్యపడ్డాను. సంగీతానికి గాని, అ డ్రాయింగులకు గాని చింతకాయలు కూడ రాలవు. అన్నం ఎలా దొరుకుతుంది? సరే సాధ్యమైనంత త్వరలో తిరిగివచ్చేయి. నన్ను నీ కొరకు, పొట్టకొరకు కన్నీళ్ళు కార్చి ఎంత కాలం జీవించమంటావు? బొంబాయి నివాసానికి కూడ మనలాంటి వారు పూరకే పలవరించేది నిష్ప్రయోజనమే అనిపిస్తుంది" అని వ్రాసింది.

రాముడు చిత్రకళాభ్యాసానికి పూనుకున్నాడు—కాని తగిన గురువు దొరకాలిగా? చిత్రశాలలో ఒక చిత్రాన్ని చూచి వచ్చాడు. అది వ్రాసినవారు పరవాలేదని అనుకున్నాడు. ఆమె మేడం నోవా? శంకరరావు బొంబాయిరోడ్లకు ఒక డైరెక్టరీ అనవచ్చును. 'హార్న్బీ రోడ్డులోని చిన్నగల్లీలలో వుంటుందిలే!' అన్నాడు. 'ఆమె యూదురా లేమో! వాళ్ళకు ఫీజు ఇచ్చే తాహతు వుందా నీకు?' అన్నాడు.

రాము డేమీ నిరాశ చెందలేదు. రెండు దినాలు హార్న్బీ రస్తా సందు గొందులు తిరిగి తిరిగి ప్రతిద్వారం పేర్లు చదివి గొంతు పట్టుకొనిపోయినా 'నోవా స్టూడియో' జాడ తీశాడు. ఆమె వున్న మేడగది యొక్క ద్వారాన్ని మెల్లిగా చప్పుడు చేశాడు. 'Yes' అని వుత్తరం వచ్చింది. పదినిమిషా లయ్యాక ఒక నడివయస్సు స్త్రీ వచ్చి తలుపు తీసింది. 'ఏమండీ వచ్చారు?' అని ప్రశ్నించింది. రాముడు తన జీవితాశయాన్ని వర్ణించాడు. 'నేనండీ, టౌను హాలులో మీ 'దారిద్ర్య సంగీతం' అనే చిత్రాన్ని చూచి ముగ్ధుడనైనానంటే నమ్మండి' అన్నాడు.

'చూడండీ, నేను విద్యార్థులకు పాఠాలు చెప్పను. అసలు విద్యార్థులను రానివ్వను. ఇష్టంతో రప్పించినా అమితమైన, బ్రహ్మాండమైన శుల్కమే వసూలు చేస్తాను. బొంబాయి అంటే కాంపిటీషన్ (పై పోటీ) ఉన్న నగరమేగా! ఇంకెవరైన నేర్పుతారేమో వెళ్ళి చూడరాదా?' అన్నది.

రాముడు మౌనం వహించాడు,

'వెళ్ళవచ్చు,'

'నాది మనవి వింటారా?'

'ఏమి?' అని నవ్వింది,

రాముడు అతి నిరాశతోనే, 'నేనొక్క కళావిదుడనండీ! ఫిడేలు వాయిస్తా అంతే. నేను మీకు నేర్పగలిగితే........' అని సందేహిస్తూ చెప్పాడు.

'హిందీ సంగీతమా?' అన్నది. 'అవును.'

'ఏ పద్ధతి? నాకు మీ దేశంగానం అంటే చాల ఆసక్తి వున్నది - వింటాను లెండి.'

"మరొక్కనాడు వస్తా. వినిపిస్తా. మీరు అంగీకరిస్తే, మళ్ళీ వస్తా—కాని, నాకు ఆ చిత్రం మనస్సుకు నాటినందువలన వచ్చాను."

ఆమె మళ్లీ మాట్లాడలేదు. త్వరగా లోనికి వెళ్ళి తన వయోలిన్ తెచ్చింది. 'నేను కూడ అభ్యసిస్తున్నాను. వీలైతే వాయించండి' అన్నది.



రాముడు, ఫిడేలు పట్టుకున్నాడు. ఆమె ముఖం చూసి సగం వణికాడు. మనస్సు కంపించింది. ఏదో బరువైన గుండెతో, మనస్సు లగామును మెల్లిగా సడలించి వాయించాడు. తల వంచుకొని వాయించినా. ఆ చిత్రశాల మారుమూలలు పది నిమిషాలపాటు వాని సంగీతం రాగాలాపనతో మారుమ్రోగింది. నాట్యమే చేసిం దనవచ్చును. నోవా వాని ముఖాన్ని, చేతులను వంతువంతుగా గబగబ రెప్పలు కొట్టి చూస్తున్నది. వాద్యం అయ్యాక లేవడానికి సిద్ధపడి 'వెళ్ళనా?' అని ప్రశ్నించాడు.

నోవా వినయంగానే సమాధాన మిచ్చింది. 'తమరు చాల యోగ్యులు. మీ ఇష్టం వచ్చినప్పుడల్లా వస్తుండండి. మీ కిష్టం వచ్చింది అడిగి తెలుసుకోండి. నాకు తోచింది చెప్పి పెడతా. కానీ దానికి మారుగా తమరి గానామృతం గ్రోలే భాగ్యాన్ని మాత్రం దయ చేయండి' అని చెప్పింది.

ఆనాటినుండి రాముడు నోవాకు భక్తు డయ్యాడు. ఆమె వానికి తల్లిగా మారింది. ఆమె వానివద్ద పాటలేమి, ఇది, అది యని నేర్చుకోలేదు. వాయించింది మాత్రం శ్రద్ధగా వినసాగింది. తరువాత తాను ఏకాంతంగా వాటినే అభ్యసించేది. ఆమెకేమో వదమటి చేతి కదలికతో ప్రాచ్య నాదలహరిని ఎల్లా రాబట్టాలో అనే ప్రశ్న మాత్రం ఎదురైంది. కొంత భయపడి, సాహసించింది. ఆ విషయాలు సందేహం వచ్చినప్పుడల్లా చర్చించి తీర్చుకునేది.

రాముని చిత్రరచనా విద్యకూడ విచిత్రంగానే నడచింది. వాడు స్టూడియోలో నోవాకు పెంపుడు పిల్లిలాగా మెత్తని అడుగులతో వంగి, నక్కి తిరిగేవాడు. మొదట్లో ఒక మూలకు నిలబడతాడు. ఆమె స్వాగతం చెబితే పై నడకతో చిత్రశాలలో తిరుగుతాడు. ఆమెకు ఇల్లన్నా స్టూడియో అన్నా అన్నీ వకటే—హిట్లరు తరుమగొడితే వారు బయటి కొచ్చారు. ఆమె తండ్రి మౌనంగా స్టూడియోలో ఎక్కడో కూర్చుంటాడు. రాముడు ఆమె చిత్రఫలకాలను, రంగులను, కుంచెలను, పుస్తకాలను అన్నీ గమనిస్తాడు. 'మీ చిత్తం కొద్దీ వ్రాయండి' అని ఆమె చెబితే గీస్తాడు. ఆమె 'ఆ రంగు వద్దు. ఇది కలపండి' అని ఏవో సలహాలనిస్తే అలాగే చేస్తాడు. రామునిలో సహజప్రతిభ వుందని, దాహం వుందని గుర్తించింది ఆమె.

ఒకనాడు రాముడూ, నోవా ఏమో చర్చిస్తున్నారు. మాటలలో ఆమె తమ గతాన్ని చెప్పింది. రామునికి కూడ యూదులు పడే యాతన చదివినట్లు గుర్తుకొచ్చింది. వాడు వారి జీవిత సమరం ఎదుట తనదేమీ గొప్ప గాదని తెలుసుకొన్నాడు. తన తల్లిని మాత్రం వీరమాతగా వర్ణించి తృప్తిచెందాడు. తన వూరి సహజ సంపదనుకూడ వర్ణించాడు. అటు నదులు, ఇటు సముద్రం విశాలమైన ఇసుక ప్రదేశం, ఎగుళ్ళు, దిగుళ్ళు గల ఇసుకదిబ్బలు, మా ఇల్లు సముద్రపు టంచుననే వుంది. ఇంటి ముంగిట్లో చెరువు, చుట్టూరూ పనస, కొబ్బర. పొన్నతోటలు—' అని వున్నదే చక్కగా వర్ణించాడు.

దానితోబాటు ఆ బొంబాయిలోని సముద్రాన్నొక మురికివీటి గుంటలాగున్నది అని చెప్పుకో దానికే సిగ్గేస్తున్నదని, ఎంతో బాధాకరమని చెప్పి చింతను ప్రకటించాడు. మాటల మధ్యనే ఎదురుగుండా హాజరుగా వున్న ఫిడేలును పట్టి తన వూరి ఇసుకగట్టుమీద వెన్నెట్లో ఆ రాత్రి అమ్మదగ్గర వాయించేసిన రాగాల సమ్మేళనాన్ని వాయించి పారేశాడు. ఎంతసేపు, ఏమేమీ వాయించాడో; ఆ తన్మయత్వం, సమాధులనుండి ఎప్పుడు లేచాడో ఇద్దరికీ తెలియదు. నోవా తండ్రి లోనికి, బయటికి ఒకటి రెండుసార్లు వచ్చి వెళ్ళి అతని దృష్టిని మరలించి నప్పుడే పాట చాలించాడు. ఆమె కూడ, కృతార్థురాలైన భంగిమలోనే 'అయితే రామ్! మీ సముద్రం ఇంత అందంగా వుందన్నమాట—' అని ఒక ఉద్గారం తీసింది. ఆమె ఆనంద డోలికల్లో పరవశురాలైంది. 'చూడండి, నా స్నేహితులకు మిమ్ములను పరిచయం చేయిస్తాను: కాదనకండి' అన్నది. రాముడేమో 'నా చిత్రాలలాగే, నా సంగీతం కూడ అంతా మూడేళ్ళ బాలలకే!' అన్నాడు. ఆమె నవ్వింది.

తరువాత వచ్చిన ఆదివారమే తనలాగే పరదేశి కాందిశీకులను నోవా రప్పించింది. రాముణ్ని ఆ మిత్రులందరికీ పరిచయం చేయించింది. మరొక్కసారి అపడు అందరిఎదుట తన రాగాలను వాయించాల్సి వచ్చింది ఆ పరదేశీలబాధలను స్మరిస్తూ. ఆనాడు రాముని మన స్పేమో కల్లోలంలో మునిగింది. ఆ భావలహరినే రాగలహరిగా మార్చేశాడు. వారు కూడ దేశదేశాలలో యాతనలు చెందారు కాబట్టి వాని భావోద్రేకాన్ని గ్రహించారు. వారిద్రతుకంతా ఆ పాటలలో సంస్మరింపబడినట్లు భావించి కొంత హాయిని అనుభవించారు. తరువాత వాళ్ళలో వాళ్ళు 'అద్భుతం' అని తీర్మానించారు. నోవాకు కూడ రాముడు సందర్భోచితంగా రాగపరిశోధన చేశాడని అమందానందం కల్గింది!

నెలలేమో ఊరకే దొర్లుకుపోతున్నాయి. రాముని సంపాదన చిల్లిగవ్వకూడ ఎక్కువ కాలేదు. వెనుక దొరికిన రెండే ఇండ్ల ట్యూషను వుంది. ఉన్న ఇండ్లుకూడ సరిగ్గా జరిగే టట్లు లేదు. 'ఉడుపిరాయలు, శివానందరాయలు గురువుకు నియమంగా 'ఆ పాఠాలే నేర్పాలి' అని ఆదేశించే స్వభావం గలవారు. ఉడుపి రాయగారు 'వైష్ణవభక్తులు' చక్కగా పురందరు దాసుగారి దేవరనామాలే అన్నీ నేర్పాలని ఇష్టం—సుబ్రాయగారి గొంతులో విన్న కొన్ని మాత్రం నేర్పాడు. వారానికి ఒకటి చొప్పున తన సరకంతా చూపించేశాడు, తన సంచి ఇప్పుడు ఖాళీ.

శివానందరాయరు అయితే రెండు పాఠాలు ఎల్లాటిదైనా పరవాలేదు. ఫలానా రాగాలే నేర్పాలని కోరేవారు. కొన్ని తెలిసిన రాగాలు రాముడు నేర్పాడు. మరీ అపూర్వ రాగాలు పాతవి నేర్పాలంటే కష్టమే—'ఊరకే రాగాలలోకి, ఊరకే సాహిత్యమే' పాట అని అభి ప్రాయం అతనిలో పుట్టలేదు. తాను విన్న వాయించిన రీతిగా వాయించలేని స్థితిలో వుంటే కొత్తపాఠం ఇంకేమి చెబుతాడు? వెనుకబడ్డాడు.



శిష్యరాండ్రకు స్వరాలు నేర్పి, రాగాలధాటి నేర్పి, తానుకూడ ఇంట్లో స్వరాలుకలిపి వాయించి రాగంయొక్క లోతును సరిగ్గా వాయించి పిల్లలకు ఒప్పించవలసిన గతి పట్టింది. అంత పరిశ్రమ, విధానం వానికి గిట్టని పని. నెలకు 22 రూ॥ లను అంగీకరించాలిగా!

తన తిండి, వంట, వసతులను చూచుకుని నెలకు అమ్మకు ఐదే రూపాయలు పంపాడు. తా నిప్పుడు మిత్రబృందంలో శాశ్వత సభ్యుడయ్యాడు. మారుతిరాయని భార్య, బిడ్డ లొచ్చారు. అక్కడ బస వీల్లేదు. కాలమంతా ఆ మిత్రులకే ఖర్చు పెట్టాలి. గంగా ధరుని నోరుమూయిస్తే వాడు మాత్రం ఓర్చుతాడా? ఈ రాముని సాధనకుదిరేట్లు లేదు.

గంగాధరుడు ఒక 'స్నో' కంపెనీ పనిచేసి రెండు నెలలు పూర్తిగా బొంబాయిలోనే తిరుగులాడాడు. నెలకు యాభై రూపాయలు వచ్చాయి. షోకుగా వున్నాడు. తరువాత తగిన గిరాకీ లేదని తీసివేశారు. ఎన్నో పరిశ్రమలలో కూడ వానికి స్థానం లేకపోయింది.

బొంబాయిలో నేల కాలి, వానకాలాన్ని తోడితెచ్చింది. రాముడు అందాక గొడుగు కొనలేదు. జూన్ నెలలో ఆ దరిద్రం వానవలన, తన సంపాదనలో కొంత ఖర్చు చెయ్యాలి. ఒక నెల బయట 'చాయ్' తాగేది మానేస్తే 'ఛత్రీ' గొడుగు కొనగలిగాడు. ఒక్కొక్క పనికి ఒకటొకటి త్యాగం చేసేశాడు. మిత్రులగుంపులో ఉల్లాప సల్లాపాలు చేస్తే ప్రపం చాన్నే వదుల్తాడు, మరుస్తాడు. మొదట్లో పొగకు బాధ పడేవాడు. ఇప్పుడు సిగరెట్లు పొగలోనే కూర్చునే సహనం నేర్చాడు. గంగాధరు డేమో 'సిగరెట్టు లేకుంటే ఏమి ఆర్టి స్టయ్యా నువ్వు' అని ఎగతాళి చేసేవాడు. కాని అవి అలవడితే జేబుకే దెబ్బ అని భయంతో దూరం చేశాడు.

వానకాలం జరిగేకొద్దీ, మనుష్యుని కార్యకలాపాలు వాయిదా పడ్డాయి. ఉడుపి రాయని బిడ్డ సమర్తాడింది. వెంటనే సరియైన వాని కిచ్చి పెండ్లిచేశారు. లగ్నానికి రాముడు వెళ్ళాడు. ఆనాటి ఫలాహారం చివరిపాఠం అయింది. ఆ దినం పాలిపోయిన ముఖంతో ఇంటి కెడితే శంకరుడు 'ఏమయ్యా! అల్లాగున్నావు? స్టూడియోకు వెళ్ళలేదా?' అంటే 'వివాహో విద్య నాశాయ' ముఖ్యంగా సంగీతానికే అన్వయిస్తున్నదని వివరించాడు. శంకర గ్రహించి 'ఇంకెక్కడైనా ఇల్లు వెదుకు.' అన్నాడు.

'చూడకుంటే ఈ బండి సాగదు. ఎల్లాగయిన ఈ వర్షాలు ఆగేదాకా వుంటాను అంతే తరువాత బొంబాయి చాలప్పా' అన్నాడు రాము.

'ఏమయ్యా! అంత తొందరగా వైరాగ్యం—విసుగూ? చిత్రం మానేస్తావా? ఇది బూర్జువాల నగరం, చిత్రకలలో నిపుణుడైతే సుఖంగా గడుపుతావు నమ్ము—ఏదో ఒక మిల్లు యజమాని పటం గీస్తే ఐదువందల రూపాయలు ఇస్తాడు. నాలాగు ఐదులు - పదులు లెక్కపెట్టే గతి తప్పుతుంది.'

'ఆ ఆశతోగాదు నా విద్యాభ్యాసం. సంగీతం కూడ ఆ పనికి నేర్వలేదు. మా స్టూడియో యజమాని కూడ అష్టకష్టాలు పడుతున్నది. ఎక్కువ యోగ్యులాలే గదా! ఈ నగరానికి పనికిరాని ఫోటోలకు రంగు తుడిచి ఇచ్చేవాడు చాలు. ఆరో ఎనిమిది ఇస్తారు. అంతే— ఈ అర్ధు— గీర్దు దండుగ. ఒక చిత్రాన్ని మహారాజు కొంటే మిగిలినన్ని రోజులు? మిగిలిన చిత్రాల గతి ఏమి?

గంగాధరుడు రసికుడు. 'అలాగు రాజులు ప్రోత్సహిస్తే తప్పనిసరిగా శ్రేష్ఠమైన కలాకారులు బయలుదేరుతారు. అందులో నగ్నదిగంబర చిత్రాలే కావాలి' అన్నాడు. 'అదీ నిజమే. ఎలాగున్నా నాకు బొంబాయి వేసరిక పట్టింది. ఇక్కడ పస్తులు పడేకంటే ఇంట్లో వుంటే నయం. సూటు, బూటు ధరించి ఉపవాసం చేస్తే గొప్పవా డవుతాడా ఏమిటి?' అన్నాడు రాముడు.

'రాము, నీకు తెలియదురా! మన మంతా పాతికేళ్లు ఆలస్యంగా పుట్టాము. వెనుకటి తరంలో ప్రతి మెట్రిక్ పాసుకూడ బొంబాయి చేరినారు. ఇప్పు డొక్కొక్కరు వెయ్యికి తక్కువ లేకుండ సంపాదిస్తున్నారు. వారల కథలే వేరు.'

గంగాధరుడు: "ఇప్పుడు సినిమా ధరలు తగ్గుముఖం పట్టేయి. దానిలోను బోల్షివిజమ్ వస్తుంది. నాల్గేళ్ళలో—ఈ డైరెక్టర్లు, తారలు బూడిదపా లవుతారు. శంకర్! నాకేమో జర్నలిజమ్ ప్రయత్నించాలని వుంది. ఒక సినిమా జర్నలు ప్రచురించి ఈ వున్న తారలను చితకకొట్టేట్లు దుయ్యబట్టాలిరా!"

'అయితే అందుకు నువ్వెందుకురా పేపరు పెట్టాలి, సరిగా గమనించి మంచిశైలిలో విమర్శిస్తే ఎందుకు అచ్చు వెయ్యరురా! చూద్దాం!'

'రామ! నువ్వింకా బేబీరా! నాకు ఎంత సర్వీసో, తెలుసా? ఇప్పటికి నేను కూడ ఎన్నో పేపర్లకు వ్రాసేశాను. అన్నీ చెత్తబుట్టదాఖలా అయ్యాయి. అంతే!'

రామునికి ఆ నాగరిక ప్రపంచముయొక్క అనుభవం కావాల్సినంత అయింది. వాడు నవ్వుతున్నాడు. కానీ సోషలిజమ్ అనే స్వర్ణయుగం తాను కన్ను మూసేలోగా వస్తుందని నమ్మజాలడు. అతని సోషలిజమ్ ఆ హంగారకట్టె వఖలకే అంతం చెందాయి. తరువాత ఆ ఫ్రెండ్సు రూములో చూచాడు. కాని దాని చలువగాలి ఆ గది నాల్గు గోడలు దాటి వెడుతుందని మనస్సుకు రాలేదు.

వానకాలంలో రామునికి నాగవేణి ఎన్నో జాబులు వ్రాసింది. వెంటవెంటనే వ్రాసింది. 'ఒరే బాబూ! రారా. వూళ్ళో నీ చుట్టుపట్ల పల్లెటూరి స్కూలుమేష్టారు ఉద్యోగమైనా దొరకు తుందిలే. పదిహేను రూపాయలయిన చాలు. అక్కడ ఎందరో శ్రీమంతు లున్నారని వారి ప్రక్కన ఉపవాసం చేస్తే ఏమైనా బాధ తక్కు వవుతుందా? ఇక్కడ చాటుగా కష్టాలను అనుభవిస్తే తప్పా?' అనే ధోరణిలో వ్రాస్తూ వచ్చింది.



రాముణ్ని ఒక ట్యూషనువారు మానేశారు. మరొక్కటి దొరికేదిక్లిష్టమయింది. శివా నందరాయని బిడ్డకు కూడ పెళ్లి అయితే తరువాత గతి యేమి? క్రిస్‌మస్ సెలవులలోగా వీలైనంత చిత్రకళ వీలైనంత త్వరగా నేర్చుకొని ఊరు వెళ్ళడానికి ఖర్చులకైనా కాస్త డబ్బు నిలువ చేసుకొని వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. సాధ్యమైతే కొన్నాళ్లు ఖర్చులకు తగినంత తీసికెళ్ళాలని అనుకున్నాడు. రెండవది 'కల' గానే నిల్చింది.

ఈ అతిగడ్డు రోజులలో తల్లి మరొక్క వుత్తరం వేసింది. కొంత ఆనందం కలిగింది' ఆది పెద్ద జాబు. వానకాలంలో జరిగిన దుర్ఘటనతో ప్రారంభం. వర్షాలవలన తమ దేవుని ఇంటి స్తంభాలభాగం కూలబడ్డదని, పెద్దలు ఆ దేవునింటికి, పసులకొట్టాని కెందుకో మంగుళూరుపెంకు కప్పలేదని చింతపడ్డది. తరువాత కొన్ని పెంకులు విరిగి మిద్దె కారిన మూలాన గోడ కొంత నానినాని కూలపడింది అని వ్రాసింది. అది మాత్రం అంతా చింత, చీకాకుతో నిండిందే.

దాని తరువాత రెండవదినం మరొకజాబు వచ్చింది. పదిహేనుదినాల కొకటి చొప్పున వ్రాసే మనిషి ఎందు కంత తొందరపడ్డదో అని ఆశ్చర్యపడ్డాడు. అది ఏడ్పుసంగతి కాదు. ఒక శుభవార్త అనవచ్చును. లెక్కకుమీరిన ఆశ్చర్యమే కలిగింది. పనివారికి చెప్పేకంటె తానే పనిచేస్తే నయమని పారతో నాగవేణి మట్టిని తీసి బయటికెత్తి పోసిందట. గోడలో ఒక కుండ దొరికిందట. బచ్చిమాటలు నిజమేనా? అని ఆశ్చర్యంతో తెరిచి చూస్తే ముప్పై చిన్నపిడతలు నిండా రాణీకాలం సవరన్లు నింపినవి దొరికినవట—ఇది అంతా తన మామచేష్టలు, దాపరికం కాకుంటే మరెవ్వరి దుంటుంది? అని వ్రాసింది. చివరకు ఇంకెం దుకు అక్కడ రాముడు ముగ్గిపోవాలి? కొంత భూమి మరొక్కరివద్ద కట్టుగుత్తకు తీసి కొని శుభ్రంగా దున్ని, విత్తి, కోసి తరువాత తన ఆస్తిని కొనవచ్చులే అని ఆశ పుట్టించింది అమ్మ.

రాముడు ఆ రాత్రి స్వప్నసుఖాలలో పొర్లాడినట్లు ఎన్నడైనా చిన్ననాడు కూడ పొర్లాడ లేదేమో! 'స్వప్నంలో తాను ఇంటికి వెళ్ళాడట! అక్కడ ఇంటినంతా కూలగొట్టా డట! ఎన్నో సవరన్ల కుండలు దొరికాయట! ఒకనాటిలోనే లక్షాధికారి అయ్యాడట. మళ్ళీ బొంబాయిలో ఒక మోటారుకారులో అమ్మవెంట వాహ్యాళికి వెడుతున్నాడట! మెరీనా బీచ్‌లో ఎవరో తన కారును ఆపారు. లేకుంటే ఎంతో దూరం వెళ్ళేవారు. అప్పుడే తెల్ల వారి వెలుగు కళ్ళమీద పడ్డది. గంగాధరుడు 'మైక్యా జానూ! జాదూహై —జాదూహై' అని పాడుతున్నాడు. తల్లి వ్రాసిన జాబుకూడ స్వప్నమేనేమో అని తలచి సిగ్గుపడ్డాడు. ఆ జాబును జేబునుండి తీసి మళ్ళీ చదివాడు. వాని మనస్సు సంతోషంతో వుప్పొంగింది. తన స్నేహితులకు తప్పక ఆదివారం పార్టీ నిస్తానన్నాడు. అప్పుచేసి అదే ఆదివారం మిత్రబృందానికి తన ఇతర కమ్యూనిష్ట్ సోదరులకు మంచి వుపాహార విందు నిచ్చాడు! అందరూ సంతోషించారు.

మరునాటినుండి ఒక కాలు కోడికి లాగుతున్నది; మరొక కాలు స్టూడియోవైపు. ఒక కంటితో తన తల్లిని, రెండవ కంటితో ఆ నోవా తల్లిని చూడాలని అభిలాష. ఒకనాడు ఎంతో కష్టంమీద నోవాతో 'నేనొక్క నెలమాత్రం వుంటాను. వచ్చేనెల తల్లివద్దకు వూరికి వెడతాను' అన్నాడు. అప్పు డామె 'మీకు చిత్రకళపై దాహం వుంది. మంచి చిత్రకారు డౌతావు. దీనిలో డబ్బు సున్నే. కాని కీర్తి, తృప్తి వస్తాయి. మనశ్శాంతి తప్పక కల్గుతుంది' అన్నది.

'అందుకే నేను కూడ మా వూరు వెళ్లతున్నాను. నా తల్లి, నాసముద్రం రెండూ రెండు కళ్ళతో చూస్తుంటేనే నాకు తృప్తి. మీరు చెప్పి నేర్పిన కళ, విద్య వుందిగా, దాన్ని మరింత అభ్యసిస్తా.'

క్రిస్‌మస్ లోపుగా వీలైనన్నిసార్లు నోవావద్దకు వెళ్ళాడు. గంటలకొద్దీ స్టూడియోలో కూర్చుని చిత్రాలు గీచాడు. తరువాత ఆమె పద్ధతి బ్రష్ పట్టే విధానాన్ని గమనిస్తాడు. ఊరికి వెళ్ళేదానికి ముందుగా ఆమెను 'మీకు సముద్రం అంటే మంచి పిచ్చి వుందే' మీరు దాన్ని వ్రాసినట్లు లేదు' అని అడిగాడు. 'మేము మధ్యదేశం వారము. మాదంతా కొండలు, కోనలు దొంకలు మైదానం ఇప్పుడు మాత్రమే ఈ సముద్రం సమీపంగా వుంది. అక్కడ సముద్రం రమ్మంటే ఎల్లా వస్తుంది?' అన్నది.

'ఇది మా వూరిలాంటి సముద్రం కాదు. నాకేమో చిన్ననాడు సముద్రమే జోలపాట పాడేది. ఆ రాగం మా ఇంటి వెనుకకే వినబడుతుంది. ఇక్కడ ఏమీ లేని శూన్యంగా వుండే సముద్రం వలన నేనేమో పోగొట్టుకున్న వానిలా భావిస్తున్నాను. మా వూరి సముద్రానికి ఆత్మ వుంది. దీనికి ఆత్మ లేదు, జీవం లేదు.

'అయితే మీ వూరెళ్లాక నా జ్ఞాపకార్థం మీ సముద్రం దృశ్యం గీచి పంపండి' అన్నది.

'అది కూడ నా అభిలాషల లోనిదే.'

'రామూ! నీ దేశం ఎల్లాంటిది? ఇక్కడ బీదతనం నుండి ప్రాణు లన్నీ నిరాశతోనే జీవించాలా?'

'మీ వూళ్లో మాత్రం పేదరికం లేకున్నా, వర్ణద్వేషం బాధ వుంది గదా! అది కూడ మీలాంటి వారి వెన్నంటిన పెనుభూతంగా!'

'ఔను, లేకుంటే మేము ఆ వూరు వదలి బొంబాయి కెందుకు పరుగెత్తుకొని వచ్చేవాళ్లం? నేను కూడ ఆ కొండలు గుట్టలను చూడాలని కలవరిస్తున్నాను. ఏదేశం వెళ్ళినా తన దేశంలాంటి సౌందర్యం చూడలేము గదా!'



'నాకూ అంతే!'

క్రిస్‌మస్‌లో జనం క్రిక్కిరిసి ఆ 'నేత్రావతి' అనే స్టీమరు పైన 'ప్రిన్సెస్ డో' లో నుంచున్నారు. ఫ్రెండ్స్ రూమువారంతా ఆ రామబిదాకను వీడ్కొనటానికి వెళ్ళారు. శంకరుడు, అతని చేతులు పట్టుకొని 'రామూ! మళ్ళీ మంచి ఛాన్సు దొరికితే తప్పక మీకు వ్రాస్తాను—' అన్నాడు.

గంగాధరుడు; రామూ, నువ్వేమో సినిమో స్టుడియోకు వెళ్ళితే బాగుండేది. ఊరకే ఆ నోవా స్టుడియో లోనే కాలక్షేపం చేశావు. అది నీ తప్పే' అన్నాడు.

రాముడు నవ్వి, కనుసైగ చేశాడు. నోవాకూడ ఆ గుంపులో వున్నది. ఒక చిన్న చిత్రాన్ని చుట్టచుట్టి ఆమె అతని చేతిలో పెట్టింది. 'చూడండీ. ఇది మా ఇంటి వెనుక వున్న కొండ' అన్నది. స్టీమరు కూతపెట్టింది. నోవా ముఖమే చూచుకుంటూ 'రాము' కన్నీళ్లు వదలాడు. నోవా తన వూరినుండి పరుగెత్తి వచ్చిందే ఆమె ప్రాణానికి ఎంత బాధ కల్గి వుంటుందో—తన స్వగ్రామం చూడాలని ఎంత ఆశ పడుతున్నదో గ్రహింప గలిగాడు.

'నీ మాటలు.........నీ సముద్రం ....' అని నోవా అన్నది.

'సరే, అల్లాగే!' అని అన్నాడు.

# 30

తెల్లవారి మంచువెలిసి ఆ సముద్రం తీరపు అంచుల దిన్నెలపై వెలసింది. మకర సంక్రాంతి సమయం. చల్లగాలి బాగా వీస్తున్నది. ఒక్కొక్కసారి పెదవులు వణికే గాలి. చంద్రుడు వెండి కంచంలాగా ఆకాశంలో వెలుగుతూనే వున్నాడు. బెస్తవారి ఇంటి కంచెలపైన చిన్న పిట్టలు గువ్వలు చిలిపి ధ్వనులు, కలరవాలు చేస్తున్నాయి. ఇంటి వసారాలో పలుచని దుప్పటి కప్పుకున్న నాగవేణికి నిద్ర మెలుకువయింది. 'ఒరే! బాబూ! తెల్లవారుతున్నది రా. త్వరగా ఆ పొగాకుకు నీళ్ళు చల్లాలిరా!' అని హెచ్చరిక జేసింది. రాత్రి ఎంతో కాలం మాట్లాడుకున్నారు. తరువాత ఫిడేలు వాయించాడు. అంత వేగంగా మెలకువ ఎల్లాగవుతుంది? తల్లి కేమో పాతకాలం అలవాటు. పిట్టల కూతలకే లేస్తుంది. 'ఆం, ఊం—ఏమయింది?' అని రాముడు నిద్ర లేచాడు. ఇద్దరూ ఆ పడమటి ఇసుక దిబ్బలకు వెళ్ళారు. ఎదుట హిమం పరచినట్లుంది. పూర్తి పడమటిదిక్కులో సముద్రం కూడ అదృశ్యం అయింది. సముద్రం హోరుమాత్రం వినబడింది. ఇద్దరూ ఇసుకగట్టు దిగి కొత్తగా చేసుకున్న నీరుకట్టు పొలానికే వచ్చారు. అది కంపలు నాటిన పొగాకు పొలం—

దొడ్డి. ఒక బావి కూడ తోడుకున్నారు. రాముడు, నాగవేణి బావిలో దిగి వరుసగా పొగాకు మొక్కలకు నీరు పోశారు. పనిలో వేడెక్కి చలికూడ వదలింది. మంచి వేడే పుట్టింది శరీరాలకు. రాముడు తన తాతలాగే కట్టుకున్న పంచను విప్పి నెత్తికి చుట్టుకున్నాడు. అంతా తాతగారిలాగే కష్టపడ్డాడు. నీళ్లు తోడాక చూస్తే నీరెండలు చుట్టూరూ వున్న పొగమంచు పొరలను, మబ్బుల తెరలను కత్తిరించేశాయి. హిమబిందువులు కూడ పొగాకునుండి బిందువులుగా దిగుతున్నవి. 'కొన్ని దంటుకూర (పెరుగుతోటకూర) మొక్కలను గిల్లనా?' అని అక్కడ మరొక మూలలో పనిచేసే నాగవేణి చెప్పింది.

'అయితే ఎందుకులేమ్మా! రోజూ అదేనా?' అన్నాడు రాము.

'మరింకేముంది? కావాలంటే లేత.దోసకాయలు తురిమి అవ చేర్చితే బాగుంటుంది.'

'లేతవి ఎందుకు నష్టం చేయాలమ్మా?'

అందుకే తల్లి మళ్ళీ దంటుకూరనే కోసింది; క్రొయ్యగూర కూడ. 'నేను వెడుతున్నారా? తరువాత వచ్చి స్నానంచేసి భోంచెయ్యాలి' అన్నది.

'అమ్మా! ఈవేళ బడి లేదులే. ఆదివారమేగా! నేను సముద్రానికి వెడుతున్నాను. నా చిత్రం సగంలో వుంది. దాన్ని ఎల్లా ఎప్పుడు ముగించాలి చెప్పు? ఎప్పుడు పంపేది బొంబాయికి! ఊరికి వచ్చి మూడేళ్ళయ్యాయిగా!'

ఇలా చెబుతూ రాముడు సముద్రానికి పారిపోయ్యాడు. ఇసుకలో కూడ గుర్రంలాగే పరుగెత్తాడు. దాని అంచులో తపీమని కూలబడ్డాడు. ఆ తుంపరలు, గాలి, పొగమంచుల్లో మరుగున దుముకులాడే కెరటాలను లెక్కపెట్టాడు. ఒక్కొక్కసారి నీరెండకు అవి బంగారు తరంగాల్లాగే కనబడ్డాయి. ఆ నురుగు నారింజరంగుల్లో కనబడుతుంది. ఆ సముద్రం తరంగాల నవ్వులు, వన్నెలు అతని హృదయానికి వింత వుత్సాహాన్ని కల్గించాయి. మనస్సు అనే చిత్రఫలకంపై ఆ వర్ణచిత్రం హత్తుకుపోయింది. వేళ్ళలోనికి ఒక పుల్లను తీసుకుని ఇసుకపైన ఏమో గీచేశాడు.

ఎండ పడి ఆ నీటిని, కనీసం ఇసుకను వేడెక్కించినప్పుడు పారను పట్టుకొని బెస్తలచెన్నడు వచ్చాడు. 'ఏమండీ! మేష్టారు! బడి లేదా?' అని అడిగాడు. రాముడు వారి వూళ్లోనే మేష్టారు.

'చెన్నా! ఈవేళ పెద్దవల రోజురా! బడికి సెలవులే.'

'మేష్టారు, పెద్ద వలలు గాలాలువేసి నెల అయింది. 'బైగు' చేపలు (సొరచేపలు) దొరకకుండా సంవత్సరం అయింది. ఈ చేపలూ విచిత్రమే. ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్కలాగు పడతాయి.'



'ఒరే బైగలు దొరకకుంటే వందిచేపలు పట్టుకోరా?'

'అవి తింటే చస్తారండీ! ఆ వెక్కిరింపులు మానండి. కాని మా మగపిల్లవాడు ఎల్లా చదువుకుంటున్నాడు? ఇంట్లో ఏమీ వ్రాసుకోడు, చదువుకోడు, కనీసం సంతకాలు పెడితే చాలు. నాకు చూడండీ వ్రాసేది రాకుంటే ఎంత బాధ కల్గుతున్నదో?'

'అది రాకుంటేనే నయంరా. మా నాన్నకు చదువువచ్చే ఆస్తి పుడుపి కోమట్ల వశం అయింది.'

అయితే మీరు దాన్ని స్వంతంగా దక్కించుకుంటున్నారని విన్నాను?'

'వారు ఇస్తారో లేదో? మాకుకూడ డబ్బు కూడాలెగా!'

'అంతా! దేవుడే నడుపుతాడండీ—ఈసారి మీ పొగాకు మాత్రం మంచి పేరెన్నిక గాంచింది. మీ దొడ్డిని చూసి వచ్చాలేండి. నేను చేపల ఎరువు నిచ్చాగా? దాని తడాఖా తెలిసిందా!'

'ఒరే నీవు తెచ్చి పడేసిన ఎరువే అంత బంగారమైతే, నిన్ను లోనికేస్తే ఇంకెంత బంగారు పండుతుందోరా?'

'అవునులెండి! మీరు చేస్తే తారీపుకు కొండ లెక్కిస్తారు? అయితే వుండనీ. నాకు మీ ఫిడేలు వాయిద్యం కాస్త నేర్పరూ?'

'నీకైతే నేర్వకుండానే వస్తుందటరా—సరే ఇద్దరూ ముయ్యికిముయ్యి పెట్టుకుందాం. నీవు వలలు పన్నేది నేర్పాలి. నేనేమో సంగీతం నేర్పుతాను.'

'అవును లేండి. ఈ మేష్టారు, పరాచికాలంటే చెవి కోసుకుంటారు.'

అని ఏవేవో తమాషాలమధ్య కాళ్ళు కుంటుతూ బచ్చి వచ్చింది. 'బచ్చీ ఏమే నీవు కూడ దయచేశావుగదతే! నేను తెచ్చిన మందు రాశావా? లేదా?'

'అయ్యా! మా మగడంటాడు—లోవలినంజు (విషం) వెళ్తే గాని నయం కాదని. బయట మందెంత రాకినా ప్రయోజనం లేదట!'

'బాగుంది, నేను పని ఇప్పిస్తా, నీవేమో ఫిడేలు వాయించాలి. వాడేమో డాక్టరు పని చెయ్యాలి తెలుసా!' అని నవ్వులాటలో ఆమెకు మందు త్రాగించే విధానం చేషలలో వెక్కిరించాడు.

'అవునులే ఆ మెందుకు తాగుతుంది - మా రాణి' అని వెక్కిరించాడు.

'చెన్నా! మా దొడ్లో తోటకూరకు పురుగుపట్టింది రా, బిచ్చి చెప్పిన కారణమే వుండవచ్చురా?'

చెన్నడు నవ్వాడు. బిచ్చి తరువాత 'చిన్నదొరా! మీ అమ్మ రమ్మందండీ. మందర్తి నుండి అత్త వచ్చారటండీ. పిల్లలు వెంట వచ్చారట.'

'ఎవ్వరు? సుబ్బత్తేనా!?'

'నేను నవ్వులాటకు చెప్పా ననుకోకండి.... ముగ్గురు పిల్లల్ని నేను చూచాను. వారు అత్తపిల్లలో గావో చూడండి. అత్తబిడ్డను పెళ్లాడరాదనే శాస్త్రం చదివావా? ఏమో! వారికి పాతచుట్టాలే కావాలట! మీకు పెళ్ళిశాస్త్రం వద్దంటారా? ఆ చేతకావి అమ్మతోనే వండిం చాలని ఆశనా?' అని అన్నీ మాట్లాడేసింది.

'ఔనులేవే బిచ్చీ! నేను కూడ అందుకేలేవే ఆమెను రమ్మన్నాను. నాకు కూడ వంట పిల్ల కావాలంటావా? వద్దంటావా? మూడే రూపాయలు నెలజీతం ఇస్తానని కూడ చెప్పి వంపాలే! తెలియదా?'

'అరెరే! నాకు తెలియదే! ఆ పిల్లలంతా వంటలక్కలేనయ్యా! నెలకు మూడేసి రూపాయలు చాలంటారా? ఓ యబ్బో!'

'కాదే—వూరకే జీతంకూలి మాత్రమే ఇస్తా—వండిపెట్టి ఉడుపికి ఎండలో నడిచి భోజనం మాత్రం మఠంలోనే తినాలి తెలుసా!'

'అవునౌను—బలే బాగుంది—మీకు ఈ కువాదం — పిల్లచేష్టలు పోవడానికి కూడ జీతం ఇస్తారటండీ! సంవత్సరాలు ఎక్కినా............ఒకటే ధాటి!'

రాముడు లేచి ఇంటికి దొడు తీశాడు. 'బిచ్చి! నీ కారును మాత్రం మెల్లిగా తోలవే-నాకు ఢీకొనవద్దు—' అని కేకలతో వెళ్ళాడు.

ఇంట్లో నిజంగా వానికి స్వాగతం చెప్పడానికి సుబ్బత్త ఎదురుచూస్తున్నది. 'ఓ అత్తా!' అని రాముడు కేకపెట్టాడు. 'ఏమిరా రామయ్యా! నీకేమో ఐశ్వర్యము! ఈ వూరు వచ్చి మూడేండ్లయ్యాయట!—మా ఇంటికి ఒకసారైనా వచ్చావా! నేనే రావాలా? ఈ పిల్లలంతా బావను చూడాలని మొండిపట్టు పడితే నేనే వచ్చానురా! తరువాత ఎల్లాగూ సాలి గ్రామం యాత్ర వస్తుందిగా!' అన్నది అత్త.

సుబ్బివెంట ముగ్గురుబిడ్డలు వచ్చారు. పెద్దవాళ్ళిద్దరు ఇంటివద్దనే వున్నారు. పెండ్లి అయిన పార్వతి, పెండ్లికాని పదేళ్ళ జానకి, చిన్నవాడు రామకృష్ణ వచ్చారు. రాముడు



జానకితో 'అవునులే అప్పుడే బిచ్చి చెప్పిందిలే! నాకు బడికెళ్లేటప్పుడు కోటుజేబులో వేసు కొని వెళ్ళడానికి బాగుంటావులే, పెళ్ళామా?' అని అన్నాడు పరిహాసంగా.

సుబ్బత్త 'ఒరే రామా! నీకు పిల్లతనం, చెరలాట పోదులేరా! మీ తల్లి ఏండ్లకొద్ది అట్లు కాల్చి చేతులు కాల్చుకుంటే నీకు చాల సుఖ మనిపిస్తుందారా! త్వరలో పెళ్ళాడు, ఆమెకు భారం తగ్గించు. అంతే!' అని బుద్ధి చెప్పి 'నా బిడ్డ అయితే చిన్నపిల్ల........'

'అత్తా చిన్నదయితే పరవాలేదు. వంటకు తప్పక పనికి వస్తుందిలేత్తా! పరవాలేదు.'

'రామా! ఈ పనికిరానిమాట లెందుకురా! ఎప్పుడు వదుల్తావో ఏమో! అయితే నువ్వేమో బడిపిల్లలకు కూడ ఇవే నేర్పుతావో ఏమో అని భయమేస్తుంది!'

'అను, మళ్ళీ అను—కోడి పిల్లలంతా రామునిగాలి తగిల్తే ప్రయోజనం లేకుండా తయారయ్యారు—అని చెప్పు!'

ఇంతలో నాగవేణి వచ్చింది. 'అమ్మ! సుబ్బత్తకు దాహానికి ఏమైనా ఇచ్చావా లేదా?'

'పెసరపప్పు తయారుచేస్తున్నా; వారికి, మందర్తివాళ్ళుగా, ఇష్టానుసారం వండుతాలే!'

'ఔనులే, అత్తవాళ్ళకు కాఫీ తాగితే చాల గర్మీ చేస్తుందటలే!'

'ఒరే పిచ్చి, కాఫీగింజలు నీవు మోసుకొచ్చి వదేసినట్లు..........'

'వద్దులేమ్మా! గాంధీ కాఫీ (ఈతగింజలు వేయించి) చెయించవే!' అన్నాడు.

రామునికి బడి లేనందుకు కాలనిర్ణయం లేకుండా తెగమాట్లాడేశాడు. అమ్మ వంట ముగించి 'ఏమర్రా, భోజనాలు చేస్తారా? వద్దా?' అని అడిగింది. అయ్యగారు గాని, అత్తగారు కానీ అందాక స్నానం కూడ చెయ్యలేదు. అమ్మ అరిస్తేనే స్నానానికి వెళ్లారు. ప్రక్కన చెరువులో మునిగి వచ్చారు. అందరికి కొయ్యగూర, దంటుకూరలే గతి— కాని తిండికంటె మాటల సమారాధన సత్కారాలు ఎక్కువ చేశారు.

మధ్యాహ్నం భోజనాలు చేశారు. సుబ్బి, నాగవేణి తీరికగా మాట్లాడుతున్నారు. రాముడు 'అత్తా! నాకు ఉడుపిలో పని ఉంది. రాత్రికిగాని, తెల్లవారి నసుగులోగాని తప్పక దొడ్డిలో మొక్కల అభిషేకాలు చేయిస్తా!' అన్నాడు. నాగవేణి 'పడుమున్నూరు కరణం గారి వెంట పోరా! మరచిపోకు....షావుకారులేమో వారి మాట కాదనరట! జాగ్రత్త!' అని చెప్పింది. రాముడు 'అలాగే!' అని చెబుతూ ఆ ఇసుకగట్టు వెంబడే వెళ్ళాడు. మొదట పడుమున్నూరు, తరువాత, ఉడుపి వెళ్లారు.

వాడు వెళ్ళాక తన ఇంటి సుఖదుఃఖాలను మళ్లీ చెప్పుకొచ్చింది నాగవేణి. రాముడు వచ్చిన విషయం, తన ఇంటిగోడ కూలిపడటం, కొంత డబ్బు దొరికిన సంగతి, తరువాత వాడు కూడ భూములు సాగుకు తేవడం, తరువాత రాముడు ఆ ప్రయివేటు స్కూలులో పది రూపాయల వుద్యోగంతో తృప్తిపడటం అన్నీ వివరంగా చెప్పింది. 'కానీ, ఆ పని శాశ్వతం కాదు. ట్రేనింగ్ కావాలట — అది అతనికి గిట్టదు. ఒకవేళ షావుకార్లు ఒప్పుకుంటే శాశ్వతకౌలు ఎత్తివేసి, భూమిని మనమే కొనే, ఏర్పాట్లు చెయ్యాలి. ఆ టీచరుపని వున్నన్నాళ్ళు ఉండనీ—తరువాత ఊడిపోనీ;' అంటాడు. సుబ్బి 'ఎన్ని రూపాయలట!'

'మన యమయాతనలు చూచి సానుభూతితో ఆ పడుమున్నూరి తరణంగారే మన ఇంటి చుట్టూరా వున్న తోట, దొడ్డికి మాత్రం పదిహేను వందలకు వచ్చేలాగా చేస్తామని చెప్పారు. ఈ సంవత్సరం పొగాకు బాగా పండింది. ఏమో ఎల్లాగో తంటాలు పడితే మన మర్యాద దక్కుతుందేమో అని ఆశ, నేను పిచ్చిదాన్ని మామగారి మాటలను ఉల్లంఘించి నందుకు, తగినశాస్తి అయింది మళ్ళీ కొంటే ఊళ్లో అందరికి ప్రాయశ్చిత్తం అవుతుందిలే! అప్పుడయినా మనం ఎవరి హంగు లేకుండ దున్నుకొని బ్రతుకవచ్చు' అన్నది.

సుబ్బత్తకూడ తన తండ్రి ఆస్తి వాళ్ల కుటుంబానికే తిరిగి వస్తే చాలని భగవంతునికి మొక్కుబడి చేసుకుంది. 'వీలైతే ఆ పూజారితోట కూడ కొనండి. డబ్బుంటేనే గాని— ఇంటి పొలాన్ని మనమే సాగుచేసుకుంటే నలభై తూముల (సుమారు 20 క్వింటాల్స్) బియ్యం వచ్చి పడుతుంది. ఆశ ఎక్కడ తీరుతుంది? అందుకే ఆ ఇసుకదిన్నె వెంట జీడిచెట్లు వేశాడులే. మూడు ఎకరాల గుట్టనిండా జీడిచెట్లేలే. అవి ఇప్పుడు మానైనాయి. మరి రెండేండ్లకు పండ్లవుతాయి. మరొక రెండెకరాలకు కూడ ఇష్టానుసారం చల్లాము. కాని నీరు మోసేది చాల కష్టం. ఈ పొగాకు ఎంత నీళ్లు తాగేస్తుందో ఆశ్చర్య పడుతావు. కాని దానంత లాభం దేనిలో కూడ లేదులే!'

'అయితే నీవు నీళ్ళు బాగా పోస్తావన్న మాట!'

'ఆ పెద్దత్త (సరసోతి) లాగా కష్టపడటానికి మానవమాత్రునికే సాధ్యం కాదంటే నమ్మ! ఇద్దరికే కదా పంట; తరువాత వున్న విశ్రాంతి వూరకే పోతే ఎల్లాగ — పొట్ట గడువాలిగా?' అని అన్నది.

సుబ్బమ్మ మళ్ళీ తన తండ్రి కాలం పరిశ్రమనంతా పునర్విమర్శ చేసింది. ఐతాళలు వెళ్లాక తన తల్లి, సరసోతి పడిన కష్టాలు రక్తాన్ని చెమటగా చేసే దృశ్యాలను — అంతకు ముందు ఆపారోతి కష్టము వర్ణనచేసింది. దానికి సుబ్బి 'మావూరు మంద త్తిలో కూడ కష్టమేలే! అంత పగలూ రాత్రి కష్టపడితే అప్పులేని పప్పుకూడు తినగలము! అంతే!



సుబ్బి మాటలు తప్పించి ఏవేవో మాటలలో 'రామునికి 24 సంవత్సరా లయినాయి. పెండ్లి వద్దంటావా చెప్పు? ఎవరైనా మంచి సంబంధంవాళ్లు వానికి సరుచు వియ్య రంటావా?'

'వదినే! నేను వానికి ఈ మాటలు చెప్పజాలను — చెప్పినా వా డిచ్చే సమాధానం నాకు తెలియని కొత్తదేం కాదు. 'అమ్మా! మన అన్నాన్ని కొత్తప్రాణికి కూడ పంచుతా మనుకో! పుట్టబోయే పిల్లలకేం పెట్టాలి?' అని ఏడుస్తాడు.'

'నువ్వూ మంచిదానివేలే! గాలికి సరిగా పాటుతావు. ఒంటరిగా ఎందు కుండాలి? వా డెందుకు తపస్సులో అఘోరించాలి? ఊళ్లో బీదవాళ్ళు లేరా? పెండ్లిండ్లు చేసికోరా ఏమిటి? సంసారాలు చెయ్యకుంటా వున్నారా? పేదరికం, షావుకారితనం కొంతవరకూ మన చేతుల్లోనే వుంటుంది—మన భావనపై కూడ వుంటుందనుకో! ప్రాయానికి సరిగా కార్యాలు నెరవేరాలంటావా? లేదా?'

మళ్లీ సుబ్బత్త 'నేను వానికి ఎల్లాగూ బుద్ధి చెప్పడానికే వచ్చాను. వాని కిష్టమయితేనే, మా కుటుంబం పిల్ల బ్రహ్మవరంలో వున్నది. ఇద్దరు ఆడపిల్ల లున్నారు. తంటాలులేని కుటుంబం. ప్రశాంతంగా గడుపుతున్నారు. పెద్దదానికి పెళ్ళి అయింది. రెండు వందల తూముల పంట చేతికి వస్తుంది. రెండవపిల్లకు పదహారేళ్ళయినవి. పెళ్ళి ఈడు జోడు బాగుంటుంది. ఊళ్లోనే కొంత చదువుకున్నది. మా వారికి వారికి చాల సఖ్యం—నువ్వు చెప్పమంటే నేను, వారు వెళ్లి చెప్పి వస్తాము.'

జాతకం కుదరాలి. వాడు ఒప్పాలి.

'నేను వాని జాతకం ఇచ్చానులే. వా రప్పుడే చూశారటలే. బాగుంటుందన్నారు.'

'నువ్వు చెప్పింది న్యాయమని తోస్తుంది. నాకు కూడ ఆశ పుట్టింది వదినే! కానీ, రాముని మనస్సు మార్చే శక్తి ఎవరికుంది చెప్పు? ఈ ఉద్యోగం అల్లాగే జరిగితే ఈ మేష్టారుద్యోగం చాలు. పది రూపాయలు పై ఖర్చులకు హాయిగా జరుగుతుంది. కానీ ఆ పని చాల రోజు లుండదట—ఆ ట్రేనింగ్ గొడవంటే వినుగట....' అని నాగవేణి బాధపడింది.

ఆ రాత్రి వాళ్లు ఎంతసేపు—ఏవేవి మాట్లాడారో ఎవరికి సరిగా జ్ఞాపకాలు లేవు. వాళ్లు నిద్రపోతుంటే తెల్లవారి లేచినవాడు రాముడే! వాడు పడుమున్నూరినుండి ఏ రెండు గంట లప్పుడు బయలుదేరాడో తెల్లవారుఝామునకే ఇల్లు చేరినాడు. కొంతసేపటికి 'అమ్మా' అన్నాడు. ఎవరూ అక్కర్లేదని చెప్పినా నాగవేణి, సుబ్బమ్మ, పిల్లలూ అందరూ పొగాకుకు

నీళ్లు తోడారు. పని తొందరగా ముగిస్తామంటే, ఒక కుండ మాత్రం పగిలింది. ముక్కలు ముక్కలైంది; రాముడు నీళ్లు మోస్తూనే కొద్ది కొద్దిగా ఆ పడుమున్నూరు తాత వలన ఎందాక సహాయం లభించిం దనే విషయం వివరంగా చెప్పాడు. డబ్బు తగ్గించ లేదు. కాని మరికొంచెం భూమి విస్తీర్ణం చేయించారులే. మూడున్నర తూముల మడి, ఇంటి స్థలం, బాడవభాగం దానితోబాటు సుబ్రాయుర ఇంటికి ఆనుకున్న ఐదు ఎకరాల ఇసుకనేల కూడ ఇస్తానని వాగ్దానం చేశారు.

'విస్తీర్ణం పెద్దదే గాని దానిలో నాల్గు ముండ్లకంపల చెట్లు గూడ లేవు గదరా!'

'ఇప్పుడేం చూశావు! ఐదు ఎకరాలకు ముంతమామిడి చెట్లు వేస్తే, ఐదేళ్ల ఓపిక పడితే ఇరవై అయిదు బస్తాల గింజలు వస్తాయి. ఒక ముండ్లకంప మాత్రం కష్టం. పరవా లేదు. చూడు ఆ జీళ్ళకున్న గిరాకీ వ్యవసాయానికి కూడ లేదమ్మా!'

నీళ్ళు కట్టి, చల్లే పని తరువాత ఇద్దరూ ఆ తక్కువవడ్డ రెండు వందల రూపాయలు ఎల్లాగ అనే చింతలో పడ్డాడు. మంచి వెల వస్తే 150 రూపాయలు, ఎక్కువ లాభమే వస్తుంది. మిగత సొమ్ము ఎల్లాగు! కాని ఆ షావుకారు వాయిదా మాత్రం మళ్ళీ తాత్సారం చెయ్యరాదు. మాధవున్ని అప్పైనా అడిగి ఇల్లు, పొలం దక్కించు కోవాలని నిశ్చయించాడు.

ఆసారి ముద్భుత్తతో రాముడే స్వయంగా ఉల్లాసంగా, వినోదంగా మాట్లాడినాడు. కాని పెండ్లి మాటలు మాట్లాడటానికి మాత్రం ఆమె సాహసించలేదు. తర్వాత వూరికి వెళ్ళింది. వెళ్లేరోజు 'రామ, నేను వచ్చేనెలకు వస్తాను. ఈలోగా నువ్వుమాత్రం మీ ఆస్తి వ్యవహారాలు పర్దుకో. అప్పు డెన్నో మాట్లాడాలి' అన్నది.

ఊళ్ళో మిగతవారు తమ పొగాకు తోటలకు కత్తిపెట్టారు. రాముడు ఇంటిముందు మంచి పందిరి వేశాడు. తాను కూడ అమ్మను వెంటబెట్టుకొని పొగాకు కోసి పందిరికి కట్టాడు. మూకలు లేనప్పు డంతా ఇదే పని. మోపులు కట్టేది వ్రేలాడగట్టేది ఇద్దరే చేశారు. నిరుటి కంటె ఈసారి పెద్దగా పొడుగ్గా ఆకులు ఎదిగాయి. రాముడు స్వయంగా ఎన్నికచేసి తెచ్చిన ఆ పొగాకు విత్తనాలు బాగా పండేయి—అని సంతోషించాడు. ఆ బెస్తల చెన్నడైతే తన చేపల ఎరువు మాహాత్మ్యం అని పుబ్బిపొయ్యేవాడు.

ఊరి పొగాకు వ్యాపారివెంట అహమ్మదు అనే పెద్ద వ్యాపారికూడ వచ్చి 'మేస్త్రారూ, ఈ మొత్తం గుత్త ఇచ్చేమాట చెప్పండి! లేకుంటే తూకమేనా?' అని అడిగాడు. అప్పుడు



ఆ బజారు ధర ఎక్కువైంది. రాముడు నవ్వాడు. 'బేహారుల్లారా! మొత్తంగా ఇస్తాను. అయితే లాట్ ధర కూడ చెప్పండి' అన్నాడు.

వేపార్లు 150 అన్నారు. ఆ పందిరిని చూచి పొగాకుతూకం వెల చెప్పగలవారు వారు. వారంత అడిగారంటే దానికి కొన్ని రెట్లెక్కువ విలువ వున్నదని అర్థం. రాముడు 250 రూపాయ లన్నాడు. వ్యాపార్లు వెళ్లిపొయ్యారు. రామునికేమో 150 కిచ్చినా నష్టం లేదు. వచ్చిన గిరాకీని ఎందుకో వదలాను. అనుకున్నాడు. తరువాత వారే ఎవరి ద్వారానో రెండు వందలకు అడిగారు.

ధరలు నానాటికి పెరిగిపోతుందని, ఆ వేపార్లు రొక్కమే తెచ్చారు; ఇచ్చారు. వారం తరువాత ఒక చెట్టును తూకం చేశారు. వారికి నష్టమే లేదు. ధైర్యంగా వెళ్ళారు.

నాగవేణికేమో 250 అడిగితే బాగుండేదిరా అన్నది. 'అమ్మ, దానికి నిజంగా 150 రూపాయలే ఇస్తారు. ధర ఎక్కువైందని 200 వచ్చింది. నిరుడు 120 మాత్రమే వచ్చింది' అని తల్లిని శాంతింప జేశాడు.

డబ్బు అందిన ఒక వారంలోగా రామపితాళుల ఆస్తిలో ఒక భాగం రామునికి దక్కింది. ఆస్తి మళ్ళీ తమ పేరుకు వచ్చాక నాగవేణి చాల సంతోషించింది. 20 ఏండ్ల క్రితం లచ్చడు ఉడుపిలో ఆస్తిని మార్పించుకున్నాడు. ఇప్పుడు కొడుకు మార్పించుకున్నాడు. నారాయణయ్య బలం లేకుంటే అది శాశ్వత కౌలుకుకూడ లభించేది కాదు. తాము ఆచోట వుండే హక్కుకూడ లేనివారికి మళ్ళీ ఆ యింటిఋణం దక్కిందని చాల సంతోషించారు.

రాముడు ఉత్సాహంగా వున్నప్పుడే వాని పెళ్ళిప్రస్తావం చెయ్యాలని తల్లి అభిలాష. ఆ గడియను ఎదురుచూస్తున్నది. అప్పు లేకుండ పని మాత్రం నెరవేరిందని తృప్తి కలిగింది.

రామునికి తీరిక అనేదే లేదు. తెల్లవారుఝామున పొగతోటకు నీళ్లు తోడుతాడు. ఇప్పుడా పనిలేదు. తరువాత పంట వేసేదేమీ లేదు. ఆ నాగవేణి మాత్రం ఆ నారుమడికి దగ్గరగా మంచి కూరగాయల తోట వేయా లనుకుంది. 'అమ్మ! ఈసారి కూరగాయలు వద్దులే, నాల్గు కొయ్యగూరదంట్లు చాలు' అన్నాడు.

'ఒరే, పచ్చని కూరలు లేకుంటా ఊరకే చారు అన్నం తింటే ఏమీ రుచి లేదురా!'

‘అది పోనీ, కొత్త ఎనిమి దెకరాలలో వానకాలంలో చల్లినా పరవాలేదు. కొంత అచ్చుకట్టు చేసి రెండు తూముల విత్తనం తయారుచేస్తే?’

‘ఈ ఇసుక బూడిదకు ఏమి పంట వస్తుందిరా? అప్పుడు ఆ జీళ్లు వేస్తానన్నావే! ఏమైంది ఆ యోచన?’

‘అమ్మా! ధాన్యం వున్న పొలంలో విత్తితే చాలు. నాకేమో ఒక కూలివాణ్ణి పెట్టి మరొక ఎకరా పొగాకే వేయాలని వుంది. ఈ ధాన్యంకంటె దానికి శ్రమపడితే చాల లాభం! మిగిలిన ఇసుకకు సరుగుడు చెట్లు వేసినా నష్టంలేదు.’

రాముడు ఆ ఇసుకపైన మట్టి వేయడానికి తన మూడు మాసాల వేతనాన్ని ఖర్చు పెట్టాడు. ఇసుకను హెచ్చుతగ్గులు లేకుండా సమంగా చేశాడు. వీలైనంత తానే ఇసుక తీసి మోసి పారేశాడు. వానలు పడేలోగా రెండెకరాల ఇసుకను సమమట్టం చేసి కొంత పంటకు సిద్ధం చేయాలని హఠం—ఎండకు ఆ ఇసుకలో పని కుదరదు. తానుకూడ ఎండకు తిరిగి, కష్టించి నల్లగా అయ్యాడు. వానకు ఇసుక రెట్టింపు బరువవుతుంది. అందుకే చెన్ననితో ‘ఒరే, నీ కొడుకుకు బాగా ఇంగ్లీషు నేర్పుతా, నూరు బుట్టల చేపల ఎరువు మాత్రం పడవేయరా! ఇక్కడకూడ పొగాకే వేద్దాం అని ఊహరా!’ అని అన్నాడు.

‘అవును లేండి, మీరు ఇంగ్లీషు నిపుణులై కూడ ఈ తడిఇసుక మోశారు. నా మగపిల్లానికి వద్దులేండి—మేము సాయంకాలం (తాగాక) అంతా ఇంగ్లీషు, సంస్కృతమే కాదుటండీ పలికేది?’

‘ఒరే, ఎర్రసీసాలవల్లనే కదరా ఈ గొడవ? మీరు తాగుడు మానితే ఎవ్వరో బాగుపడేవారురా?’

‘అవునులేండి. మీరేమో ఆనాడు గాంధీ లెక్చరు దంచారు. మేమంతా మానేశాము కూడ!’

‘ఔనురా సీసాలపై సీసాలు మానేసి తరువాత కుండలతోనే తాగారులే, అదే కాబోలు నా తత్వం వుపదేశించిన ఫలితం.

‘నిజం వినవయ్యా! కల్లు గొంతుకలో పడకుంటే మా ప్రాణాలే పోతాయి. దాని బలం గేదెపాలులోకూడ లేదు. ఈసారి వలలు ఖాళీ, వ్యాపారం ఎడమచెయ్యి మూలాన



కల్లూలేదు, సారాయీలేదు లెండి. ఈసారి మంచిచేపలుపడితే హనుమదేవునికి మంచి ఆట చేయిస్తామని మొక్కున్నామయ్యా! చూద్దాం. అమావాస్యదాటాక, వలవేస్తాం, ఒకవలలో పదిబుట్టలైనా పడాలి. చూడండీ ఈ చేపలు ఒక సంవత్సరం వస్తాయి. మరొక సంవత్సరం పోతాయికదండీ ఎక్కడికి?

‘మీ పొట్టల్లోకేరా?’

‘ఈ అయ్యకు ఎప్పుడూ తమాషాలే,’ అంటూ చెన్నడు వెళ్లాడు. పొద్దు దిగింది. ఆకాశం ఎరుపెక్కింది. రాముడు సూర్యాస్తమయం తిలకించడానికి సముద్రతీరం వెళ్లాడు.

అతడు తన విశ్రాంతివేళలో సముద్ర చిత్రాలను గీచి దాచాడు. వ్రాసేదాక ‘దాన్ని తప్పక నోవాకు పంపాలని అనుకుంటాడు. గీచాక ‘అయ్యో గీచినట్లే. ఊరకే డంబాలు చెప్పాను’ అని ఆ చిత్రం బాగాలేదని పంపడు. వానికి నవ్వు వస్తుంది. ఆమె ఆ చిత్రాన్ని చూచి నవ్వుతుందేమో’ అని భయం లేకపోలేదు. ఈ సముద్రాన్ని దింపడానికి బట్ట ఎంత పెద్దదైనా చిన్నదిగా మారుతుందే. అని వాడు ఆ పనికే భయపడతాడు.

ముందునెలలో వస్తానన్న సుబ్బత్త రానేలేదు. ఉగాది పాడ్యం రాత్రికి ‘హరీ హరీ’ అని నడచి వచ్చింది. అప్పుడు రాముడు నాగవేణులు ఇంట్లో లేరు. ఆమె కూడ ఇసుకగట్టుకే వచ్చింది, పొన్నఆకులను గింజలను గానుగకు సరిగా ఊడ్చుకున్న బచ్చివాళ్లు నారుమడిలో వుంటారేమో అన్నది. ఆమె అక్కడికే పరుగెత్తింది. పనివారు విడిచివెళ్లిన బుట్టలమధ్య తల్లి, కొడుకులు కూర్చున్నారు. రామునికి ఒంటికంతా బురద అంటింది. సుబ్బి ఆశ్చర్యంతో నవ్వింది. అవును నాగవేణీ మీ ఇద్దరి కిప్పుడు ఆ సరసోతి సంబంధమైన యక్షిణీభూతమే పట్టుకుందిలే! ఆమెకు కూడ అంతే వేసంగి, వర్షం, చలి, అంతా ఒకటే. ఎప్పుడూ పనే మీకు అంతే!

‘అత్తా నువ్వు వచ్చేనెల వచ్చివుంటే బాగుండేది. మీ వూళ్ళో మగవాళ్లు మీసాలు దువ్వితే, ధాన్యం ఇంట్లో పడుతుంది. ఇది దరిద్రం కోడలే. చెమట ఓడ్చినా పంటలు కావు. ఎంతైనా కష్టమే’ అన్నాడు.

‘ఔను సుబ్బత్తగారు అన్నీ కౌలుకిచ్చి సుఖంగా భోంచేస్తారు. వాళ్ళకు పదిపుట్లయినా పండుతుంది. గురికారులంటే అన్నీ తక్కువ. మేం మాత్రం నిజంగా గొప్పవారు లేరా!’ అన్నది అత్త.

రాముడు లేచి నుంచున్నాడు. నాగవేణి ఆ బుట్టలు మోసుకుంది. సుబ్బత్త అన్నీ లాగుకుంది. రాముడు 'సముద్రం వెడదామా?' అన్నాడు.

'ఈ రామునికి సముద్రమంటే ఏమి పిచ్చో? రేపు చూడొచ్చులేరా! రాత్రి ఆ పీశ్ళేమీ ఎండిపోవులే! ఈ వేషంతోనే వెళ్ళాలా? స్నానం చేస్తే బాగవ్వదా?'

'ఔను నిజమే, ఈ వేషం నీ వెన్నడు చూడలేదని, జ్ఞాపకం వుంచుకోవాలని—ఆ సముద్రం గంటలో ఎండితే అని. ఔనులే, అది ఖాళీ కాదుగా ఎన్నటికీ ఖాళీ కాదుగా'' అని అన్నాడు.

అత్త 'రామునికి మాత్రం ఎప్పుడడిగినా కొంచెం వుప్పునీళ్ళే ఇవ్వాలి తెలుసా' అన్నది.

ముగ్గురూ నవ్వుతూ ఎర్రని ఆకాశానికి వెన్నిచ్చి ఇల్లు చేరారు.

ఆ ఇంటి ఇసుకదిబ్బల చెట్లలోగుండా ఎండ కూడ కనుమరుగయింది.

ఆ రాత్రి ఇంటికి వచ్చిన సుబ్బత్తపని ఏమంటావు? రాముడు ఏదో బాతాఖానీలో వూరి కథలు చెబుతాడు. సుబ్బత్త ఆ పల్లెటూరి మబ్బులాగే జవాబిస్తుంది. తరువాత మందర్తి ఆట సంగతి వచ్చింది. 'అత్తా! మీ వూరి మేళంవారు (భాగోతులు) రెండవవేషం ఎవరి కిస్తారట? రంగు లెవరేస్తారు? మా వూళ్లో ఏ ఆట కాలేదు మా బెస్తలచెన్నదేమో మొక్కున్నాడట—హనుమంతునికి.' సుబ్బత్తకు ఆటల సంగతిలో ఎక్కువ రక్తి కడుతుంది. అంతలో బ్రహ్మవరం నాగప్పగారిపిల్ల సంగతి తప్పక నిశ్చయించాలి. రాముకు పాచికల వాళ్ళలాగే ఎత్తుకు పైఎత్తు వేసి ఆమె ప్రస్తావనను ఆలస్యం చేస్తున్నాడు. రాత్రి పన్నెండు గంటలైనా మాటలు ఆఖరు గాలేదు. కాని పెళ్ళిమాటలే మొదలు గాలేదు.

తెల్లవారుఝామున వెంటనే ఆ పొగతోటలో వున్న కూరగాయల మొక్కలకు నీళ్లతోడే సంబరం ఎక్కువైంది. తరువాత నారుమడికి వెళ్లాలి. 'ఆ మన్ను తీసేస్తే మంచిది' అని ఆజ్ఞ నిచ్చాడు. స్నానంచేసి, ఆ కోడిలో బడికి చదువు చెప్పడానికి పరుగెత్తాడు. రాముడు వెళ్లాక సుబ్బి ''నాగవేణీ, నేను వాడి నోరు ఎదురుచూస్తే లాభం లేదు. నువ్వే చెప్పాలి. మావారేమో నన్ను తొందరపెడుతున్నారు. నూరుతూముల పిల్ల దొరికితే ఎవరైనా ఎగిరి గంతులేసి చేసుకుంటారు. వాడు వద్దంటే పొరుగూరిలో నూరు మంది బ్రహ్మచారులు వున్నారు' అన్నది.



నాగవేణికి ఎప్పుడైనా నూరు తూముల పంట అంటే తక్కువగా కనబడినా? నాగప్పయ్య అనంతరమే గదా ఆ బిడ్డలకు సంక్రమిస్తుంది? తమవంటి పేదరికానికి అది తగిన సంబంధం అని మాత్రం నమ్మకం కుదిరింది. రాముడు అమ్మాయిని చూడాలి, ఒడంబడాలి. తన ఇంటి ఆస్తి చేజిక్కింది. కాబట్టి ఇప్పుడు ఒప్పుకుంటాడు కాబోలు. తనకు పెళ్ళే అక్కర లేదు అనే అభిప్రాయమే వుండివుంటే ఈ బాగు ఊరికే ఆస్తికొరకు ప్రాకులాడేవాడా? మర్యాదకు పెనగులాడేవాడేనా? నాకు, నా మనశ్శాంతికి మాత్రమే అంతగా పోరాడుతుండెనా?....'అని నాగవేణి ఆలోచింపసాగింది. సుబ్బత్తకు మాత్రం ఇంకా సమాధానం చెప్పదయ్యె? ఏమైనా పరే ఒకసారి అడిగిచూస్తే సఫలమయ్యేనా?—అని రామునితో మాట్లాడటానికి మంచి అవకాశాన్ని వెదుకుతున్నది.

సాయంకాలం అయింది. బడిపిల్లలు తమ బ్యాగులు ఎత్తుకొని వెళ్లితే, రాముడు ఆ నారుమడివైపే వెళ్ళాడు. మట్టి ఎంత సమకూరింది? చుట్టు కంప ఎంత ఎక్కువగా పడ్డది? వానకాలం వచ్చేలోగా అక్కడికి ఆ ఏటిఒండ్రు మట్టి తోలుదామా? వెంటనే ఆ చేపల ఎరువు వేద్దామా?—అని ఎన్నో పందలకొలది ప్రశ్నలకు వాడు సమాధానం చెప్పుకోవాలి. సుబ్బత్తేమో నాగవేణి ప్రాణం తినేస్తున్నది. 'అవునులే వదినే! వాడు ఎవరిని పెళ్ళాడుతాడో తెలుసా! ఆ పొగాకు - పందిరినే' అని వెక్కిరింపుతో నటనచేసి చెప్పింది.

సాయంకాలం పనులన్నీ అయిపొయ్యాయి. మరొక వారం జాగ్రత్తగ పని సాగిస్తే రెండు ఎకరాల దిబ్బలు నేలమట్టం (అచ్చు కట్టయి) పదునుకెక్కుతుంది. అంత చాలు. కాని వరి నాటాల్సింటే మరింత ఎరువు తోలాలి. లేకుంటే ఇప్పుడుండే సత్తువ చాలు—అని ఆలోచిస్తూ ఇంటివైపే వెళ్ళాడు. అమ్మ చీపురు పట్టుకొని వచ్చింది. 'ఎక్కడికమ్మా?' అంటే ఆ గాలికి ఆకులు రాలాయి, వాటిని ఊడ్చి ప్రోగుచేస్తారా!' అన్నది.

'సుబ్బత్త ఎక్కడ?'

'ఈవేళ రాత్రి ఆమె వంట చేస్తుందట!'

'అయితే పదమ్మ! ఆ సముద్రం వెడదాం. ఆ నారు పొలం అపీ ఇపీ హడావిడులలో ఏమాత్రం తీరికలేదు. సుఖంగా హాయిగా ఆ ఇసుకదిబ్బపైన కూర్చోలేకుంటా అవుతున్నది. రామ్మా వెడదాము?' అన్నాడు.

ఇద్దరూ ఆ సముద్రతీరంకేసే వెళ్ళారు. ప్రొద్దుగూకడానికి ఒక గడియకాలమే మిగిలింది. పిట్టలు ఎగురుతోంటే ఆకాశం పూర్తిగా పల్లబడింది. కాకుల కావు కావులు

సముద్రం పక్షుల అలజడి, మధ్యలో చెట్లలో కీచురాళ్ళు, ఎక్కువైనవి. ఆ పిట్టలను చూచి రాముడు 'అయితే మనవూరి బెస్తలకు మంచి దశ కుదిరింది—పండుగేనన్నమాట' అన్నాడు.

'ఎందు కటరా?' అన్నది తాయి.

'అక్కడ చూడమ్మా!—ఒక పెద్దవల లాగారు కాబోలు. లేకుంటే ఇన్ని కాకులు పిట్టలు బాధ పడుతూ తిరుగుతాయా? ఇవ్వాళ విడియేగా!'

తల్లి కొడుకులు తొందరగా నీటివద్దకు వెళ్ళారు. దూరంగా ఆ వలను లాగేవారంతా 'హూఁ హూఁ' అని కోటేశ్వరం తిరునాళ్ళలో చేసినంత అల్లరి చేస్తున్నారు. ఆ నాటి వలంటే వల! ఎంత లాగినా పైకి రాదు. ఎన్ని చేపలు పడ్డాయో బరువు ఎక్కువైంది. 'చూద్దాం' అని ఇద్దరూ నడచారు. నాగవేణి 'నే నెందుకురా ఆ చేపలను చూడటానికి—ఛీ ఛీ' అని వెనుకకు వచ్చింది. రాముడు వాళ్ల పని చేసే చోటికి వెళ్ళాడు. కోడిలోని పాటకజనం అందరూ అక్కడే చేరుకున్నారు. ఎంత దోచారో ఏమో అన్నట్లు పెద్ద రాశిగా చేపలు పోసివుంది. ఆ హర్షంతోనే అందరూ నిలబడ్డారు. అంతోటి చేపలు ఐదారు వందలకైనా అమ్ముతుందని అందరూ నమ్ముకున్నారు.

రాముడు ఆ వూరి బెస్తల పుత్సాహం గమనించాడు. మళ్ళీ తల్లివద్దకు వెళ్ళాడు. 'అమ్మ! మన ధాన్యం వ్యవసాయం వల్ల ఏమైనా ఇంత లాభం ఒకేసారి వుంటుందా చెప్పు? ఎంత చేసినా దానికి ఒక హద్దు - పద్దు వుంటుంది. వలను ఒడ్డినట్లు వున్న ఇరవై ధర రెండు వందలకేమీ పెరుగజాలదు కదమ్మా?' అన్నాడు.

'రామ!' ఆ సముద్రానికి పోటుపాట్ల లాగేరా! ఆ వల వ్యవహారం.'

'అయితే ఈసారి మందర్తి ఆట తప్పక ఆడుతా రనుకున్నాను.'

'ఆ కల్లు వాసనకు ముక్కు పట్టుకొని కూర్చోవాలా?'

'అది సరేలే—చేతులో డబ్బుంటే కడవలు తాగుతారు— లేకుంటే ఉప్పునీళ్ళే తాగుతారు? అంతే గతి వారిది.'

'ఒరే ఈ వలగొడవలు నీకేలరా? ఆ సుబ్బత్త వచ్చి కూర్చున్నదే, ఏమైనా, ఎందుకు, అని అడిగావా?'

'ఆమె చెబితేగా!'



'ఒరే! దొంగ! ఆమె నీ లగ్నం కథలు ఆడుగుదా మని వున్నది. ఆ బ్రహ్మవరం నాగప్పగారి కూతురు పెళ్ళికి వుందట. ఎనిమిదవ తరగతి చదివింది. మంచిఅనుకూలమైన సంబంధం అని చెబుతున్నది. ఆమె అప్పుడే జాతకాలు కూడ చూపించి పెట్టిందట!'

రాముడు నవ్వుతూ 'ఆమెకు పొగాకుతోటకు నీళ్ళు మోసేపని వస్తుందటనా అడుగు!'

'రామూ—నాకు మొదట్లో ఈ పను లేమైనా వచ్చాయా? మంగపూడులో నేను రాజ భోగంలో పెరిగాను గదరా!'

'అందుకే సుఖంలో మునిగినవాన్ని ఈ సముద్ర దిక్చక్రంపాలు ఎందుకు చెయ్యాలి? ఈ ఎండకు మాడ్చరాదు. వానకు తడుపరాదు. మనం ఆ బాధలు పడితే చాలుగా!' అన్నాడు.

'అయితే, ఇల్లాగే వుంటానికి వీలవుతుందారా? మనుష్యునికి తన వాళ్లంటూ వుండాలి కదరా? లేకుంటే వాడు సరిగ్గా బ్రదుక గలడా?'

'హూఁ ఉప్—మనుష్యుడు బ్రతుకుతాడు—తప్పక బ్రదుకుతాడు. తనవారి వలనన్నా సరే—లేకున్నా సరే!'

'అయితే నన్నేం చెప్పమంటావు?'

'ఏమీ అనవద్దు—మళ్ళీ ప్రస్తావిస్తే నువమే వెళ్ళి మాట్లాడ దలచా మని చెప్పవే!' అన్నాడు.

'అరే! ఇప్పుడు వచ్చివుంటేనే మాట్లాడనివాడు, నువ్వే వెళ్ళి ఏం మాట్లాడుతావురా?'

'అప్పుడే ఏం మాట్లాడాలో తెలుస్తుంది—ఇప్పుడు నాకు మాత్రం ఏం మాట్లాడాలో తెలుస్తున్నదా?'

ఇద్దరూ చంద్రుడు (శుద్ధ విదియ చంద్రుడు) మునిగే వేళకు ఇల్లు చేరారు. సుబ్బత్త వంటచేసి సిద్ధంగా పెట్టి ఆ ఇద్దరినీ ఎదురుచూస్తూ కాచుకూర్చుంది. నాగవేణి కొడుకు యొక్క అభిప్రాయాన్ని చెప్పింది. రాముడు భోంచేసేటప్పుడు, సుబ్బత్త 'రామా! అయితే నువ్వేమో సత్యం చెప్పాలి—ఊరకే కాలక్షేపం చెయ్యవద్దు—ఎప్పుడు మందర్తికి వస్తావో నిచ్చితంగా చెప్పాలి సుమా!' అన్నది.

'వస్తాగా—వస్తే పోదా!' అన్నాడు.

'వస్తావు—కానీ, ఎప్పుడు, ఏమి అని వారి చెవిలో ఒక ముక్క వెయ్యాలిగా! ఇది ముహూర్తా లుండే ఋతువు—వారికి ఎదిగినపిల్ల బెంగవుండదా? త్వరగా లగ్నం చెయ్యాలని అదుర్దా వుండదంటావా?........' అన్నది.

'చూడత్తా! నేను తప్పక వస్తా నన్నాగా—' అని మంచి తియ్యని మాటలతో సమాధాన పరచాడు.

సుబ్బత్తకు ఇన్నాళ్లు వేచివుండి వాని మాటలు వింటే వేసరిక కల్గింది. ఇల్లువాకిలి చక్కదిద్దుకోడానికి ఎంతో బాధపడుతున్నాడే—ఇంట్లో దీపం వెలిగించే ఇల్లాలు, పిల్లలు వుండాలనే తెలివి కూడ అక్కర్లేదా?' అని కూడ ఆలోచించింది. అదే అనుకుంటూ తన వూరు వెళ్ళింది. అక్కడ విరామలేదు—ఇక్కడ ఆశలు లేవు.

తరువాత పున్నమ వచ్చింది. బాడవ నేల పగలంతా ఎండి మండి నిప్పులు చెరుగుతున్నది. ఆ మండు ఎండలకు బయళ్లన్నీ బీటలు వారినాయి. కొంత నారు పోసినవారు, పీటికిగాను నోరు తెరుచుకుని కూర్చున్నారు. రాముడు తన క్రొత్త చేలను, మళ్ళను తనిఖీ చేసి సముద్రతీరం వెళ్లాడు. వాని కండ్లకు ఆకాశం మేఘావృతంగానే కనబడింది. ఒక్కపెట్టున పగలే చీకటి కమ్ముకుంది. సుడిగాలి వీచింది. ఆ గాలిదెబ్బకు సముద్రతీరం పైకి రాకుండా మూరు గజాల ఎత్తుగా కెరటాలు లేచి తుంపురులు. తూర్పు సముద్రానికి ఎగనిపొయ్యాయేమో అనిపించింది. పిడుగులసందడి వినబడ్డ రాముడు ఆ వాన కొద్దుంటే తాటి చెట్లల్లోకి వురికినాడు. అక్కడి కొమ్మల అర్భాటం చూస్తే చెట్టే వూడి నెత్తిన పడే ప్రమాద మున్నట్లు తోచింది. అందుకే వాడు అప్పుడప్పుడు చెట్ల కొమ్మలను గమనించాడు.

వాన ఎంత వేగిరంగా వచ్చిందో అంత వేగిరంగా ఆగింది. అరగంట వర్షానికే సముద్రం పొంగినంత పని అయింది. ఎక్కడ చూచినా నీళ్లే. ఎదురుగా వుండే ఆ ఇసుక దిబ్బల మధ్య ఒక చెరువు నిండినట్లయింది. ఆ నీళ్లల్లో జేవురు రంగు ఆకాశం, తాటిచెట్ల పీడలు తలక్రిందుగా ప్రతిబింబించాయి. ఆ ప్రశాంతవాతావరణం నేలపై వుంటే కదలేమో తన ఆవేశానికి తానే పరిహాసం చేస్తున్నట్లు తగ్గిపోయింది. రాముడు ఆ ప్రకృతి దృశ్యాలలో ఒకవైపు శాంతి, మరొకవైపు రౌద్రం, వంతులుగా వుండడం—గమనించాడు. ఆ రాత్రి వా దెవ్వరితో మాట్లాడలేదు. నిద్ర నిండా ఆ కలలే: నీరు, నింగి, కదలిదృశ్యాలే. తనకు



రాత్రి వచ్చిన కలలను, వెనుకటిరోజు తాను చూచిన దృశ్యాన్ని ఒక కాగితంపై గీచాడు. పెద్ద దయ్యాల్లాంటి నాల్గు తాటిచెట్లు ఆకాశాన్ని చీల్చివేస్తున్నాయి. వాటి దిగువ ఆ నవ్వుతున్న మేఘాలను ప్రతిబింబించే నీటి సరస్సు పరచుకొని వున్నది. దానికి ఆనుకున్న సముద్రతీరం, మొదట్లో చాల రౌద్రావేశంతో తాండవమాడి తరువాత వెకిలిగా నవ్విన తరంగాలు, దానివెనుక ఆకాశంలో జేగురు రంగును తెచ్చే బంగారు సూర్యునిలీల. అన్నీ గీచాడు. తల్లి భోజనానికి లెమ్మని చెప్పేదాక వాడు కుంచెను దింపలేదు. నాగవేణి కూడ తన కుమారుని చేతివనితనాన్ని చూచి ముగ్ధురాలై వెనుక నిలిచి చూచింది.

అప్పుడు పని అయ్యాక లేచి 'అమ్మా! అయితే వంటయిందంటావా? ఎంతమ్మా టయిమ్?' అన్నాడు. సూర్యుడు అపరాహ్ణంలో వున్నాడు. కొడుకును స్నానంచేసి రమ్మని వడ్డెనకు సర్దింది. స్నానంచేసి వచ్చినవాడు ఎప్పుడు తిన్నాడో ఏమో! కలలోని భోజనం లాగే ముగించాడు. 'అమ్మా, ఇన్నాళ్ళకు ఆ తగినచిత్రం గీయగలిగానే — త్వరగా ఆమెకు పంపుతాను?' అని తన చిత్రాన్ని చూపాడు.

తరువాత నడుముకు ధోవతి బిగించాడు. షర్టు వేసుకొన్నాడు. 'అమ్మా, రెండు నాళ్ళు బయటవెళ్లి వస్తానే, ఇల్లు, తోట.......' అన్నాడు.

'మంచ త్తికే గదా!' అన్నది.

'రేపటినుండి కాదమ్మా! ఈవేళనుండే ఎండాకాలం సెలవు లిచ్చారు. వెళ్లి రమ్మంటావా? లేకుంటే వెనుకకు త్వరగా వచ్చేస్తాలే' అన్నాడు.

కుమారుని మంకుపట్టు ఆమెకు తెలియనిదికాదు. 'సరే అవశ్యం — అల్లాగే' అన్నది నాగవేణి.

రాముడు కోడి పడీముఖం పట్టాడు. అక్కడినుండి పడుమున్నూరు దారిపట్టాడు. వాడు సెలవులకు వచ్చాడని ఆ కరణంగారు చాల ఆప్యాయతతో సత్కరించారు.

'తాతయ్యా! ఈ సత్కారాలకు వాయిదా! నా వెంట బ్రహ్మావరం వస్తారా?' అని ప్రశ్నించాడు.

'ఏమిరో! మళ్లీ ఏమైనా అస్తులు కొంటున్నావా? రిజిస్ట్రేషనే కాబోలు!' అన్నారు.

'రండి—వెడుతూ మాట్లాడుకుందాము.' అని సమాధానం చెప్పాడు.

కరణంగారు తయారయ్యారు. ఇద్దరూ మాట్లాడుతూ చక్కగా ఆ నాగప్పయ్యగారింటికి వెళ్లారు. వాళ్ల ఇంట్లోకి ప్రవేశించే సమయాన వారి రెండవ కూతురు సరస్వతి ఇంటి ముంగిట్లో కసువు చిమ్ముతున్నది. వాళ్లను చూచి ఆ పని మానేసి ఎవరో వచ్చారని ఇంట్లో చెప్పింది. వాళ్ల వద్దకు వస్తే 'అప్ప! నాన్న! వున్నారా!' అని అడిగిన వారితో 'ఆ వసారాలో కూర్చున్నారేమో చూడండి!' అన్నది. ఇద్దరూ లోనికి వెళ్లారు. ఆ నాగప్పగారికి ఆ కరణంగారు చాలఏళ్లుగా మిత్రుడే! 'ఓహో! కరణంగారా!—తమ వూళ్ళో పనులుమానేసి మావద్దకు వస్తున్నారే! ఊరక రారు మహాత్ములు.........' అని ఎన్నో మాట్లాడారు. ఇద్దరూ హాస్యధోరణిలో మాట్లాడారు. రాముడు ప్రక్కనే వున్నాడు, వాణ్ని చూచి 'వారెవ్వరు? ఏదో పనిమీద వెడుతున్నట్లున్నారు? సరే దాహం పుచ్చుకుంటారా?' అని రాముని విషయం తెలియకుండా, తెలుసుకోకుండా ఆ నాగప్పగారు మాట్లాడేశారు.

ఆకరణంగారు వూరకే వదుల్తారా? హాస్యంగానే: 'నాగప్పయ్య! ఒక సంఖ్య చెప్పండి చూదాం!'

'ఐదు' అన్నారు నాగప్పయ్య.

'ఐదంటే కార్యసాధన—పనికి పంచపాండవులు—అన్నట్లు'

'ఏమండీ— పని అంటారు—ఐదుమంది అని ఏమేమో అంటున్నారు?'

'ఇంకేముంది? వరుడు, కన్నెను చూసేశాడు.'

'ఏమండీ? మీ తమాషాలు - వెటకారం?'

'నాగప్పయ్య! ఇతడు మా కోడిరామ బిత్తాళుల మనుమడు. ఒక వరుసకు నాకు కూడ మనుమడే లెండి!

'ఓహో! వారా? రండి కూర్చోండి.' అని త్వరగా చాప పరచారు.



'సరే, ఐతే, ఇక్కడే జమాబందీ జరుపుకుందామా? రామ! వీరు నా పురాతన మిత్రులు. మీ సుబ్బత్త చెప్పిన ఇంటివారు వీరే, పిల్లనేమో చూశావుగా! లగ్నం ఎప్పుడు —ఏమి సంగతి? అని మాత్రం నిశ్చయం చేసుకుంటే చాలదా?' అన్నారు.

నాగప్పయ్యగారికి ఆకాశమే వూడిపడ్డట్టయింది. ఇంట్లోకి వెళ్ళి ఆడవాళ్లకు అన్నీ చెప్పి వచ్చారు. వెంటనే వచ్చిన వారికి కాఫీ, అప్పడాలు, వడియాల సమారాధన జరిగింది. అతిథులు ఉపాహారం సేవించే సమయాన, నాగప్పయ్యగారేమో, 'కరణంగారూ! చూశారా! జాతకాలు మాత్రం బహు సొగసుగా కుదిరాయి. అన్నారు. తరువాత 'సరసోతి! కొంచెం కాఫీ పట్టుకొస్తావా?' అని కోరారు. పాపం ఆమె అలవాటు ప్రకారం నాన్న అడుగుతున్నాడులే అని తెచ్చి పెట్టింది. అప్పుడు మాత్రం కొత్తవేషం. జరీ పట్టుచీర సర్దుకుంటూ, జడను కూడ సరిచేసుకొని కాఫీ తెచ్చి పెట్టింది.

రాముడు నవ్వుతూ కరణంగారితో, 'అప్పుడు చూచిన డ్రెస్సు చాల బాగుండింది' అన్నాడు.

'అప్పు దంటే, ఎప్పు డటండీ!' అని చకితులై ప్రశ్నించారు నాగప్పయ్య.

'అదా! మేము వచ్చినప్పుడు, ఆ అమ్మాయి ఇంటిముంగిలి శుభ్రపరుస్తూ కూర్చున్నది. మన రాముడికి ఇల్లు, వాకిలి, సంసారం, వ్యవసాయం అంటే చాల వ్యామోహం లెండి!' అని కరణంగారు సమాధానం చెప్పారు.

ఆ దినం అంతా అక్కడే విడిది— సత్కారాలు జరిగాయి. లగ్నం కూడ ఇంచుమించు నిశ్చయమైనట్లే. 'బంగారం, శృంగారం' అంటే, రాముడు, 'అవన్నీ నాకు బొత్తిగా తెలియవు. అమ్మకూడ అడిగే మనిషి కాదు. లగ్నం ఒకనాడే క్లుప్తంగా, భారీగా కాకుండా చెయ్యాలని మాత్రం చెబుతుంది' అని అన్నాడు. ఆ రాత్రి ఏమేమో మాట్లాడి కాలక్షేపం చేశారు.

తెల్లవారి లేవగానే వచ్చినవారికి కాఫీ టిఫిన్ లేకుండా వూరకే పంపగలరా? అది ముగించాక కరణంగారు కూడ కోడిగ్రామానికి వెళ్ళారు, రాముడు సుబ్బత్తఇంటికి వెళ్లాడు.

వాడు వెళ్ళి 'అత్తగారూ! మా ఇంటి రాముడు అనే వానిని బ్రహ్మవరం శ్రీ శ్రీ శ్రీ నాగప్పయ్య గారి కూతురికే ఇచ్చి లగ్నం చేయాలని పెద్దలు నిశ్చయించారు—వచ్చే సోమ

వారం మీరు తలంబ్రాలు పోయించాలని, వెంటనే అప్పడాలు వడియాలు చెయ్యడానికి దయ చేయాలని వినంతి!' అని చెప్పాడు. హాస్యధోరణిలో.

'ఓరీ! దొంగ! నాకు చెప్పకుండానే బ్రహ్మోవరం ఎందుకురా వెళ్లావు? అన్నీ నువ్వే కుదుర్చుకున్నావులే!' అని ఆశ్చర్యపడింది.

ఆ సాయంకాలమే సుబ్బత్తను వెంటబెట్టుకొని వాడు కోడీ చేరాడు.

మరునాడే ముంగిలి పూడ్చేది, పందిరి లేపేది, ఇతర గడబిడలు సందడి సాగుతున్నది. రాముడు ఉల్లాసంగా హాయిగా చూస్తున్నాడు. వదుమున్నూరు శరణంగారే అన్నీ శ్రద్ధగా చేయిస్తున్నారు—'రామ! ఆ పిల్లపేరు పెద్దత్త పేరేరా!' అని అమ్మ అంటే రాముడు 'నాపేరు తాతపేరున్నట్లుగా!' అని నవ్వాడు.





# సాహిత్య అకాడెమి

## ప్రచురణలు

★

### నవలలు

**ఆరోగ్య నికేతనము (బెంగాలీ సాంఘిక నవల)** 12.00
తారాశంకర్ బెనర్జీ
అను: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

**గెంజి గాథ (జపాను నవల)** 5.00
మురసకి షికిబు
అను: నండూరి రామకృష్ణమాచార్య

**మా తాతయ్యకొక ఏనుగుండేది (మలయాళ సాంఘిక నవల)** 1.50
వి. యం. బషీర్
అను: చల్లా రాధాకృష్ణశర్మ

**మీరీ జాల (అస్సామీ నవల)** 2.50
రజనీకాంత్ బార్దొలాయ్
అను: భారతుల మార్కండేయశర్మ

**పార్థివ స్వప్నము (తమిళ చారిత్రక నవల)** 7.00
'కల్కి' రా. కృష్ణమూర్తి
అను: యన్. పి. వి. నరసింహాచార్య

**ఉమ్రావ్ జాన్ అదా (ఉర్దూ నవల)** 7.00
మీర్జా రుస్వా
అను: దాశరథి రంగాచార్య

క థా ని క లు

## 23 హిందీ కథలు

సంపాదకులు : జైనేంద్రకుమార్

అను : వేమూరి రాధాకృష్ణమూర్తి

## రవీంద్ర కథావళి (బెంగాలి)

అను : మద్దిపట్ల సూరి

## తమిళ కథామంజరి

సంపాదకులు : ఎ. సి. చెట్టియార్

అను : వాకాటి పాండురంగారావు

నా ట కా లు

## యాంటిగని (గ్రీకు నాటకం)

సోఫాక్లీజ్

అను : యం. ఆర్. అప్పారావు

## గలీలియో (జర్మన్ నాటకం)

బెర్టోల్డ్ బ్రెస్ట్

అను : వి. యన్. శర్మ

## రవీంద్రుని నాటికలు

1 వ సంపుటం : అను : బెజవాడ గోపాలరెడ్డి

అబ్బూరి రామకృష్ణరావు

2 వ సంపుటం : అను : అబ్బూరి రామకృష్ణరావు






సాహిత్య అకాదెమీ

న్యూ ఢిల్లీ, మద్రాసు, కలకత్తా, బొంబాయి

దక్షిణ ప్రాంతీయ కార్యాలయం :

21, హాడోస్ రోడ్. మద్రాసు-6.